

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమత్పరాశరభట్టార్యాయ నమః
శ్రీ మద్వరవరమునయే నమః

శ్రీ పరాశర భట్టర్ అనుగ్రహించిన
శ్రీరంగరాజస్తవము
వరివస్యా వ్యాఖ్యాన సహితము

## శ్రీపరాశర భట్టర్ తనియన్

**శ్లో ॥ శ్రీ పరాశరభట్టార్యః శ్రీరంగేశపురోహితః ।**
**శ్రీవత్సాంకసుతః శ్రీమాన్ శ్రేయసే మే ఽ స్తు భూయసే ॥**

**ప్ర. అ. –** శ్రీరంగేశపురోహితః = శ్రీరంగనాథునకు పౌరోహిత్య కైంకర్యమును చేయువారు, శ్రీవత్సాంకసుతః = కూరేశుల కుమారులును, శ్రీమాన్ = కైంకర్యలక్ష్మిని కలవారును ఆగు, శ్రీపరాశరభట్టార్యః = శ్రీసరాశరభట్టర్, మే = నా యొక్క, భూయసే = అధికమైన, శ్రేయసే = మంచి కొఱకు, అస్తు = అగుగాక! (నాకు మిగుల మంచిని కల్గింతురు గాక!)

**వరివస్య :–** శ్రీరంగరాజస్తవమను ఈ స్తోత్రరాజమును రచించిన శ్రీపరాశరభట్టరు స్తుతించు శ్లోకమిది. దీనిని, వారి శిష్యులలో ప్రముఖులగు **"నంజీయర్"** అను మహనీయులు రచించిరని శ్రీవైష్ణవసంప్రదాయమున చెప్పబడుచున్నది. ఇట్టి గ్రంథకర్తయొక్క ముక్తకరూప స్తుతిపద్యములకు సంప్రదాయమున **"తనియన్"** అని పేరు. అనగా, గ్రంథము కంటె వేరయినదని అర్థము.

త్రేతాయుగమున దశరథచక్రవర్తి పుత్రసంతానమును పొందగోరి పుత్రికామేష్టిని చేసెను. ఆ సమయమున అగ్నిపురుషుడు ఇచ్చిన పాయసాన్నమును భుజించిన దశరథ చక్రవర్తి భార్యలు కౌసల్య, సుమిత్ర, కైకేయి అను ముగ్గురును శ్రీరామ భరత లక్ష్మణ శత్రుఘ్నులను నల్గురు పుత్రులను పొందిరి. అట్లే, ఒకనాడు శ్రీరంగనాథుడు అనుగ్రహించిన పాయసమును భుజించిన కూరేశుల ధర్మపత్ని అణ్ణాళ్ ఇద్దరు పుత్రరత్నములను కనెను. వారేపరాశర భట్టర్, శ్రీవ్యాసభట్టర్ అను ఆచార్యులు.

ప్రస్తుత స్తుతికర్తకు "**పరాశరభట్టర్**" అను పేరు కల్గిన సందర్భ మిచట ప్రస్తుతింపదగినది. భట్టర్ తండ్రి అగు కూరేశులు ఆచార్య పరతంత్రులగుటచే తమకు కుమారులు జన్మించిన పిదపకూడ వారికి నామకరణము మొదలగు సంస్కారములను చేయుట తమ ఆచార్యుల బాధ్యతే – అని తలచి, ఊరకుండిరి. శ్రీరామానుజులు కూరేశులకు పుత్రులు జన్మించిన పదునొకండవ నాడు. తమ శిష్యులతో కలిసి, కూరేశుల ఇంటికి వచ్చి, తమ ప్రధాన శిష్యులగు "**ఎమ్బార్**" (గోవింద. భట్టర్– రామానుజులకు పినతల్లి కుమారులు) ను చూచి, కూరేశుల పుత్రులను తమ దగ్గరకు తీసికొని రమ్మని పలికిరి. గోవింద భట్టర్ అట్లే చేయగా, రామానుజులు కూరేశుల పుత్రులను ఇద్దఱను తను చేతులతో స్పృశించి, పంచాయుధాభరణమును అలంకరించి, నామకరణ సమయమున పరాశరమహర్షి అవతారము అగు పెద్ద కుమారునకు '**పరాశరభట్టర్**' అని, వ్యాసమహర్షి అవతారమగు రెండవ కుమారునకు "**వ్యాసభట్టర్**" అని ఆ ఇద్దరు పుత్రులకు నామకరణ మొనర్చెరి. ఈ విధముగా రామానుజులు, వేదాంతశాస్త్రమునకు మహోపకారమును చేసిన వ్యాసపరాశర మహర్షుల విషయమున కృతజ్ఞతను ప్రకటింపవలెననెడి తమ ఆచార్యులగు యామునుల కోరికను తీర్చినవారయ్యిరి. ఈ ఉదంతము సంప్రదాయ చరిత్ర గ్రంథములలో సుప్రసిద్ధము.

కూరేశుల పుత్రులలో పెద్దవారగు వీరు "**పెరియభట్టర్**" అను పేరుతో కూడ ప్రసిద్ధులు. "**భట్ట**" శబ్దము వేదశాస్త్రములను సంపూర్ణముగా అధికరించినవారిని, భగవానునకు స్తోత్రము చేయు కైంకర్యమును నిర్వహించువారిని తెలుపును. కావుననే దేవాలయములోని అర్చకులు భట్టశబ్దముతో పిలువబడుదురు. "**భట్టారక**" శబ్దమును ఇట్టిదే. "**భట్టారకో నృపే. దేవే తపోధనే**" అను మేదినీ నిఘంటువచనము "**భట్టారక**" శబ్దము తపోధనుని నిర్దేశించునని తెలుపుచున్నది. భగవానుని ఎల్లప్పుడు స్మరించుట, కైంకర్యమును నిర్వహించుట కంటె గొప్ప తపస్సు వేరొకటి లేదుకదా!

"**అతత్త్వేభ్యః ఆరాత్ దూరం యాతి బుద్ధిః యస్య సః ఆర్యః**", "**తత్త్వేభ్యః ఆరాత్ సమీపే యాతి బుద్ధిః యస్య సః ఆర్యః**" (తత్త్వముల సమీపమునకు వెళ్ళువాడు, తత్త్వము కానివాటికి దూరముగా వెళ్ళువాడు) అను ఈ రెండు వ్యుత్పత్తులవలన ఆర్యశబ్దము సంశయవిపర్యయాదిదోషరహితమైన జ్ఞానమును, నిర్దుష్టమైన ఆచరణమును కల్గినవారిని తెల్పును. భట్టరు అట్టి మహనీయులలో అగ్రగణ్యులు కదా!

పూవు పుట్టగానే పరిమళించునను సామెతకు ఈ ఆచార్యుల బాల్యము చక్కని ఉదాహరణము. బాల్యము నుండియు వీరు ప్రదర్శించు మేథాపాటవము కూరేశులకే కాక, ఇతరులకు పలువురకుకూడ ఆశ్చర్యమును కల్గించుచుండెను. తిరువాయ్ మొళిలోని "**శిఱు మామనిశర్**" (8-10-3) (చిన్నవారగు గొప్ప మనుష్యులు) అనుచోట ఈడు వ్యాఖ్యానమున ఉట్టంకింపబడిన సందర్భ మిందులకు ఒక ఉదాహరణము. అచటి వ్యాఖ్యాన పంక్తులివి-

"**శిఱుమై పెరుమై యాకిఱ విరుద్ధ ధర్మద్వయత్తుక్కు ఏకధర్మియిల్ సమావేశమ్ కూడిన పడి ఎజ్ఞనే? ఎన్ఱు భట్టర్ బాల్యత్తిలే కేట్క, నమ్మోడొక్క అన్నపానాదికలే ధారకమ్ ఎన్నలాయ్, భగవద్విషయత్తిల్ అవగాహమ్ పార్త్తాల్, నిత్యసూరికళోడు ఒప్పర్ కళ్ ఎన్నలాయిరుక్కిఱ ఆండాన్, అరుళాళప్పెరుమాళ్, గోవింద ప్పెరుమాళ్ ఇవర్ కళ్ కాణ్**

**శిఱుమామనిశరాకిఱార్ గళ్ – ఎన్ఱు పణిత్తాన్**". (చిన్నతనము, పెద్దతనము అనెడి రెండు విరుద్ధ ధర్మములకు ఒకే ధర్మి (వ్యక్తి) యందు కూడిక ఎట్లు పొసగును? అని భట్టరు తమ బాల్యమున కూరత్తాళ్వాన్ ను ప్రశ్నింపగా, "మనవలె అన్నపానములు ధారకములు అనునట్లు, భగవద్విషయమున వారి అనుభవమును చూడగా, వారు నిత్యసూరులతో సమానులు అనునట్లును ఉండు ముదలి యాణ్డాన్, అరుళాళప్పెరుమాళ్ ఎంబెరుమానార్, గోవింద ప్పెరుమాళ్ వంటివారు కదా "**శిఱుమామనిశర్**" అగుదురు" – అని పలికిరి).

ఇట్టి సందర్భములు ఈ ఆచార్యుల జీవితమున ఎన్నో కలవు. వీరి ఇట్టి ఉజ్జ్వల భవిష్యత్తును ఊహించియే భగవద్రామానుజులు వీరికి "**భట్టర్**" అను సార్థకమైన పేరును పెట్టిరని చెప్పనగును. ఇది రామానుజుల సత్యసంకల్పత్వమున కొక తార్కాణము.

ఒకనాడు, మధ్యాహ్నసమయమున రామానుజులు ఒక్కరే తిరువరఙ్గత్తముదనార్ అను తమ శిష్యుని ఇంటికి వచ్చిరి. అముదనార్, "ఈ సమయమున మీరిట్లు వేంచేయుటకు ఏమి కారణము?" అని రామానుజులను ప్రార్థించిరి. అప్పుడు రామానుజులు అముదనార్ నిర్వహించు శ్రీరంగనాథ పౌరోహిత్యమును (పురాణ ప్రవచనమును) తమకు దానమీయవలసినదిగా కోరిరి. అముదనార్ పరమ సంతోషముతో అట్లే చేసిరి. పిమ్మట రామానుజులు అముదనార్ వలన తాము పొందిన ఆ పౌరోహిత్య కైంకర్యమును కూరత్తాళ్వాన్ కు ఇచ్చి, దానిని నిర్వహింపవలసినదిగా వారిని నియమించిరి. అప్పటినుండి కూరేశుల కుటుంబసభ్యులే కైంకర్యమును పరంపరగా నిర్వహించుచు వచ్చుచున్నారు. కూరేశుల పుత్రులలో పెద్దవారు పరాశర భట్టర్ శ్రీరంగాలయ పౌరోహిత్యమును చేసినవారగుటచే వీరికి "**శ్రీరంగేశ పురోహితు**" లను పేరు కల్గినది. ఈ విధముగా ఈ బిరుదము కూడ వీరికి భగవద్రామానుజులవలననే లభించినది. (పౌరోహిత్యమనగా – తిరుమంజన కట్టియము, వేద విణ్ణప్పము మొదలగువానిని భగవానుని సమక్షములో విన్నవించుట.)

(శ్రీవత్సాంకసుతః) ఈ విశేషణము రెండు విధములుగా పరాశర భట్టర్ విషయమున తగియున్నది. భట్టర్ తండ్రి అగు కూరేశులకు శ్రీవత్సాంకులని పేరు. భట్టర్ కూరేశులను స్తోత్రము చేయుచు "**శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యః**" అని పల్కిరి కదా! కావున భట్టరును "**శ్రీవత్సాంకసుతః**" అనుట అర్థవంతము.

శ్రీవత్సాంకశబ్దము శ్రీరంగనాథుని బోధించుననియు చెప్పవచ్చును. శ్రీవత్సమను పుట్టుమచ్చను గుర్తుగా కల భగవానుడు శ్రీవత్సాంకుడు. అట్టి శ్రీరంగనాథుని ముద్దు బిడ్డయే పరాశర భట్టర్. ఈ విషయమును భట్టరు తామే శ్రీరంగ రాజస్తవమున "**శ్రీరంగరాజకమలాపదలాలితత్వమ్**" (17వ శ్లో॥) (శ్రీరంగనాథుని తామర పువ్వులవంటి పాదాలచేత లాలింపబడడం) అనుచు తెలిపిరి. కావుననే వీరికి "**శ్రీరంగనాథపుత్రులు**" అను పేరు కల్గినది. వీరి బాల్యమంతయు శ్రీరంగనాథుని ఆలయముననే గడచెనని, ఒకనాడు శ్రీరంగనాథునకు సమర్పించిన పాయసాన్నమును భట్టర్ తమ చేతులతో తాకగా, ఆ ప్రసాదము తనకెంతో రుచ్యమయ్యెనని శ్రీరంగనాథుడు అర్చకముఖముగా తెలిపెనని సంప్రదాయచరిత్ర గ్రంథములలో కలదు. "**తేనిట్ట తార్ నమ్బెరుమాళ్ కుమారర్. భట్టర్**" (తిరువరఙ్గ క్కలమ్బకమ్ – 4) (తేనెను స్రవించు పూలమాలికలను కలిగిన శ్రీరంగనాథుని కుమారులు భట్టర్) అని దివ్యకవి అగు పిళ్లైప్పెరుమాళ్ అయ్యంగార్ వీరినిగూర్చి పల్కుట గమనింపదగినది. కూరేశులు శ్రీవత్సముయొక్క అంశచే జన్మించినట్లు సంప్రదాయమున చెప్పబడుచున్నది. కావున "**శ్రీవత్సాంకసుతః**" అను విశేషణము వీరికి సార్థకము.

(శ్రీమాన్) అనగా – సంపద కలవారని భావము. ఇచట శ్రీశబ్దముచే తెలుపబడు సంపద లౌకికమైనది కాదు. శ్రీవైష్ణవ లక్షణ సంపదయే ఇచట శ్రీశబ్దముచే నిర్దేశింపబడినది. ఇట్లు శ్రీశబ్దము శ్రీవైష్ణవ లక్షణమును తెలుపు సందర్భములు అనేకములు కలవు.

రావణునిచే లంకనుండి బయటకు గెంటబడిన విభీషణుడు శ్రీరాముని వద్దకు శరణాగతి చేయ వచ్చినపుడు, లంకలో గల తన సంపదనంతటిని విడిచి వచ్చెను. అయినను అతనిని నిర్దేశించు వాల్మీకి భగవానుడు **"అంతరిక్షగతః శ్రీమాన్"** (రా. యు. 16-17) (ఆకాశములో నిలచిన, భగవద్భక్తి అనే సంపదను కలవాడు) అని పలికెను. అపుడు విభీషణుని వద్ద గల సంపద అనన్యభక్తియే. శ్రీరాముని శరణాగతి చేసి, ఉజ్జీవింపవలెనను నిశ్చయమే.

అట్లే, అరణ్య వాసమునకు వెడలు శ్రీరాముని వెంటగా బయలుదేరిన లక్ష్మణుడు సమస్త భోగములను విడచి, **"ఖనిత్రపిటకాధరః"** (రా. అయో. 31-25) (తవ్వుగోలను, పూల బుట్టను ధరించినవాడు) అనునట్లు శ్రీరామ సేవకు తగిన గడ్డపలుగును, బుట్టను ధరించి యుండెను. కావున లక్ష్మణునిగూర్చి వాల్మీకి మహర్షి **"లక్ష్మణో లక్ష్మిసంపన్నః"** (లక్ష్మణుడు భగవత్కైంకర్య లక్ష్మిని కలవాడు) అని నుడివిరి. ఇక్కడ, లక్ష్మణుడు లక్ష్మితో కూడినవాడనుటలో భావమేమనగా, సర్వదేశసర్వకాలసర్వావస్థలలోను భగవత్కైంకర్యమును చేయవలెనను అభినివేశమును కల్గినవాడనుటయే. అదియే శ్రీవైష్ణవ లక్ష్మి.

ఈ విధముగానే, మొసలిచే పట్టుబడి దుఃఖించు గజేంద్రుని వ్యాసమహర్షి **"స తు నాగవరః శ్రీమాన్"** (వి. ధ. 69-47) (భగవద్విషయములో భక్తి, కైంకర్యము అనే లక్ష్మిని కలిగిన గజేంద్రుడు) అని పల్కుటకూడ ఇట్టిదే. ఇచట గజేంద్రుడు సంపద కల్గినవాడనుటకు–

**"నాహం కళేబరస్యాస్య త్రాణార్థం మధుసూదన!,**
**కరస్థకమలాన్యేవ పాదయో రర్పితుం తవ"**

(మధుసూదనా! నేను నా శరీరాన్ని రక్షించుకోవడం కోసం నిన్ను ప్రార్థించడం లేదు. నా కరంలో ఉండే తామర పువ్వును నీకు సమర్పించాలనే కోరికతోనే నిన్ను ప్రార్థిస్తున్నాను) అనునట్లు, తన దేహరక్షణలోని అభినివేశమును కాక, కమలములతో భగవానుని పాదములను అలంకరింపవలెనని ఆశను కల్గియుండుట – అని అర్థము.

ఇట్టి శ్రీవైష్ణవ లక్షణ సంపదను శ్రీపరాశర భట్టర్ కల్గినవారగుటచే ఇచట **"శ్రీమాన్"** అనుపదముచే వారు నిర్దేశింపబడిరి. శ్రీవైష్ణవ సంప్రదాయమున వ్యక్తినామమునకు ముందు **"శ్రీమాన్"** అను ఉపపదము ఈ అర్థముననే చేర్చబడుచున్నది.

త్రిభువనవీరదేవరాయలను ప్రభువు భట్టర్ వైభవమును విని, తన ఆస్థానమునకు ఒక పర్యాయము వేంచేయవలసినదిగా వారిని ప్రార్థించెనట. అందులకు భట్టర్ ఎంత మాత్రము అంగీకరింపక, "భగవానుడు తన అభయహస్తమును ముడుచుకొన్నను సరే, నేను వేరొకని వాకిలివద్దకు. పోను" అని సమాధానము పలికిరట. భగవానునియందు అట్టి అచంచలమైన భక్తి విశ్వాసములను భట్టర్ కల్గియుండిరి. ప్రమాణములగు వేదములను, శాస్త్రములను, దివ్యప్రబంధములను, ప్రమేయముగు భగవానుని రక్షించు కైంకర్యమును జీవితాంతము నిర్వహించుటచే వీరికి **"శ్రీమాన్"** అను ఈ విశేషణము మిగుల అన్వర్థము.

ఇట్టి శ్రీపరాశరభట్టర్ నాకు గొప్ప మంచిని కల్గింతురుగాక! అని శ్లోకభావము.

ఇచట **"భూయసే శ్రేయసే"** అను గొప్ప శ్రేయస్సు ఏమనగా, భగవానునియందు, భాగవతులయందు అవిచాల్యమైన అధ్యవసాయమును, కైంకర్యాభినివేశమును కల్గి యుండుటయే. **"శ్రీమాన్"** అని కీర్తింపబడు భట్టరు ఇట్టి శ్రేయస్సును కల్గింపవలెనని ప్రార్థించుట, కల్గింతురని నమ్ముట మిక్కిలి తగినది కదా!



శ్రీమతే రామానుజాయ నమః

శ్రీ పరాశరభట్టర్ అనుగ్రహించిన

# శ్రీరంగరాజస్తవము – పూర్వశతకము
# (వరివస్యావ్యాఖ్యాన సహితము)

**శ్రీకూరేశుల తనియన్**

**1. శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే।**
**యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్ ॥**

**ప్ర. అ. –** యత్ – ఉక్తయః = ఏ కూరేశుల వచనములు, త్రయీ కంఠే = వేదమనెడి స్త్రీయొక్క కంఠమున, మంగళసూత్రతాం = మంగళ సూత్రమగుటను యాంతి = పొందుచున్నవో, అట్టి, శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యః = పూజ్యులైన శ్రీవత్సచిహ్నులకు, నమ ఉక్తిం = నమస్కార వచనమును, అధీమహే = పలుకుచున్నాము.

**వరివస్య :–** "**అజాయమానో బహుధా విజాయతే**" (నా. అను.) (కర్మమూలకముగా జన్మించనివాడు అయినప్పటికీ, భగవానుడు, కృపామూలకంగా అనేక విధాలుగా అవతరిస్తున్నాడు) అని వేదపురుషునిచే, "**పిఱప్పిల్ పల్ పిఱవి ప్పెరుమాన్**" (తి. వా. 2-9-5) (కర్మమూలకమైన జన్మను లేనివాడైనను, లోకోజ్జీవనార్థము పలు జన్మలను పొందు మహనీయుడు) అని ఆళ్వార్లచే ప్రస్తుతింపబడు భగవానుడగు శ్రియఃపతి భూమండలముపై త్రేతాయుగమున శ్రీరాముడుగా అవతరించెను. ఆ స్వామి శరణాగతి ధర్మమును–

**"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే,**
**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ"**

(రా. యు. 18-33)

(ఒక్కసారి నన్ను ప్రపత్తి చేసినవానికి, "నేను నీవాడను" అని యాచించినవానికి సమస్త ప్రాణులనుండి అభయాన్ని నేను కలిగిస్తాను, ఇది నా వ్రతం) అను మొదలగు వచనములతోనే కాక, సముద్రశరణాగతివంటి సందర్భములలో తన అనుష్ఠానముద్వారా లోకమునకు వివరించెను. ఆ శ్రీరామచంద్రుడు తన కులధనము, తాను నిత్యము ఆరాధించు ఆర్చామూర్తియును అగు శ్రీరంగనాథుని భక్తశిఖామణి అగు విభీషణునకు ఇచ్చెను. విభీషణుడు శ్రీరంగనాథుని లంకకు కొనిపోవునపుడు, ఆ మూర్తి మనోహరమైన కావేరీనదీ ద్వీపమున నివసింప మనసుపడి, అచటనే నిలచెను. ఆ క్షేత్రమే ఈనాటి శ్రీరంగమను దివ్యదేశము.

పరాశరభట్టరు అను అచార్యులు శ్రీరంగనాథుని రెండు శతకములతో స్తుతించుటద్వారా త్రయ్యంతార్థ ప్రతిపాదకమును, మంత్రరత్నమను పేరు వడసినదియు అగు ద్వయమంత్రములోని అర్థమును అనుసంధించిరి. మఱియు శ్రీరామానుజులవలన, కూరేశులవలన, గోవిందభట్టర్ వలన తామెరిగిన రహస్యములను, దివ్యప్రబంధరస్యార్థములను అందు ఎడనెడ పొందుపఱచిరి. ఈ స్తోత్రములో, భట్టర్ సత్సంప్రదాయమును అనుసరించుచు, మొదటగా గురుపరంపరావందనమును. ఈ శ్లోకముతో ప్రారంభించుచున్నారు.

పరాశరభట్టరు, భగవద్రామానుజుల అంతరంగ శిష్యులలో ప్రథములు, "**రామస్య దక్షిణో బాహుః**" (రా. ఆర. 34-13) (లక్ష్మణుడు శ్రీరామునకు కుడి భుజమువంటివాడు) అనునట్లు వారికి కుడి భుజమై నిలచినవారును, జ్ఞాన, భక్తి, వైరాగ్య సంపన్నులును అగు శ్రీవత్సాంకుల (కూరత్తాళ్వాన్) పుత్రరత్నము. వీరు శ్రీరామానుజుల దివ్యకటాక్షమునకు పాత్రమై, వారికి పిమ్మట శ్రీవైష్ణవసిద్ధాంతసంప్రదాయ ప్రచారభారమును అత్యంతసమర్థతతో నిర్వహించిరి.

**"వేదమ్ వల్లార్ కళై క్కొణ్డు విణ్ణోర్ పెరుమాన్ తిరుప్పాదమ్ పణిన్దు"** (తి. వా. 4-6-8) (వేదవిదులగు ఆచార్యులను పురస్కరించుకొని పరమపదనాథుని పాదములను ఆశ్రయించి) అని,

**"భగవద్వందనం స్వాద్యం గురువందనపూర్వకమ్,**
**క్షీరం శర్కరయా యుక్తం స్వదతే హి విశేషతః"**

(ఆచార్యనమస్కార పూర్వకమైన భగవద్వందనం, చక్కెరతో కలసిన పాలవలె, మిక్కిలిగా భోగ్యమై ఉంటుంది కదా) అను రీతిలో ఆచార్యముఖముగా భగవానుని ఆశ్రయించుట అనునది సత్సంప్రదాయాగతము. నిరపాయమైన విధానమును. ఆ పద్ధతిలో భట్టరు మొదటి అయిదు శ్లోకములలో ఆచార్యవందనమును చేయుచున్నారు. వానిలోనే కాక, ప్రబంధమునకే మొదటిది ఆగు ఈ శ్లోకమున కవి, తనకు జన్మచే తండ్రి, విద్యచే ఆచార్యులగు శ్రీవత్సాంకమిశ్రులకు నమస్కరించుచున్నారు.

భట్టరు సామాన్యశాస్త్రములనే కాక, తిరువాయ్ మొళివంటి దివ్యప్రబంధములలోని రహస్యార్థములనుకూడ తమ తండ్రిగారి సన్నిధిలో తెలిసికొనిరని వీరి చరిత్ర తెలుపుచున్నది. విష్ణుసహస్రనామ వ్యాఖ్యానమగు "**భగవద్గుణదర్పణము**" న ప్రారంభములో భట్టరు "**వందే గోవిందతాతౌ**" (గోవిందభట్టర్ ను, నా తండ్రి కూరేశులను నమస్కరింతును) అనుచు, స్వాచార్యులగు గోవిందభట్టరుకు (ఎమ్బార్), తమ తండ్రి శ్రీవత్సాంకులకు నమస్కరించిరి.

వేదకాంతకంఠమునకు తాళివంటి సూక్తులను అనుగ్రహించిన, పూజ్యులగు శ్రీవత్సాంకుల కెల్లప్పుడును నమస్కరింతుము – అని శ్లోకభావము.

లోకమున వనితకు మంగళసూత్రము లేని దశలు రెండు ఉండును. అందు, మొదటిది – ఆమె వివాహమునకు ముందు దశ. అనగా, కన్యకాదశ. రెండవది– ఆమె భర్త మరణించిన పిమ్మట ఆమెకు కల్గు వైధవ్యదశ. కన్యగానున్న స్త్రీకి వివాహమగువరకు పలువురు ఆమె తమ భార్య అయిన బాగుండునని

తలంతురు. గృహస్థులు, విరక్తులును ఆమెను చూచి, ఆమె ఇంకను ఎవరి సొత్తు కాలేదని భావింతురు. ఆమెకు వివాహమై, అమె మెడలో మంగళసూత్రమును దాల్చిన పిమ్మట, ఆ మంగళసూత్రమును చూచినవారు ఎవ్వరును ఆమె తన భార్యగా కావలెనని అనుకొనరు. లోకులును "ఈమె కొక భర్త కలడు. ఈమె అతని సొత్తు" అని ఆమె మెడలోని తాళిని చూచి గ్రహింతురు.

వైధవ్యమును పొందిన స్త్రీని చూచినవారు, "గతమున ఈమె కొక భర్త ఉండెను; విధివశమున ఈమె అతనిని కోల్పోయెను, ఇకపై ఈమెకు భర్త ఏర్పడు అవకాశము లేదు" అని తలంతురు. కావున, వనితకు మంగళమాత్రము లేని రెండు దశలలో, మొదటి దశయందు, పలువురు ఆమెకు భర్తగా కావలయునని భావించు అవకాశము, రెండవ దశలో, ఇకపై ఎవ్వరును ఆమెకు భర్తగా నుండుట సంభవింపదని భావించు అవకాశము ఏర్పడుచున్నవి. అట్లే, శ్రీవత్సాంకుల గ్రంథములు అవతరించుటకు ముందు వేదవాఙ్మయము తాళి లేని స్త్రీ కల్గి యుండు పై రెండు దశలను పొందినది. ఎట్లనగా—

వేదమున ప్రతిపాదించబడిన పరతత్త్వము బ్రహ్మ అని కొందరు, రుద్రుడని కొందరు, ఇంద్రుడని మరి కొందరు వాదించిరి. ఇది మొదటి దశ. నిరీశ్వరవాదులు అట్టి ప్రభువెవ్వడును లేడనిరి. ఇది రెండవ దశ. శ్రీవత్సాంకుల గ్రంథరచన జరిగిన పిమ్మట "వేదకాంతకు భర్తలు పలువురున్నారనుట, లేదా, భర్తయే లేడనుట – అను ఈ రెండు వాదములు ఏమాత్రము పొసగవు. ప్రభువను వాడొకడు కలడు. అతడు విష్ణువు. "**వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః**" (భ. గీ. 15-15) (వేదాలు అన్నిటిచేత తెలియబడేవాడను నేనే) అనునట్లు "**వేదప్రతిపాద్యుడతడే**" అను విషయము నిష్కర్షింపబడినది. ఇట్టి నిష్కర్ష "**ఆజ్ఞా తవాత్ర భవతీ విదితా త్రయీ సా**" (ఆ వేదం, నీ ఆజ్ఞారూపంగా ప్రసిద్ధమైనది) (వై. స్త, 11) మొదలగు శ్లోకములద్వారా కూరేశులచే చేయబడినది. కావున శ్రీవత్సాంకుల సూక్తులు వేదకాంత మెడలో తాళివంటివి.

ఇట్లు పల్కుటలో అంతరార్థమేమనగా – శ్రీవత్సాంకులు సకల దుర్మతములను నిరసించి, పరతత్త్వ నిర్ణయమును చేయగల్గిన వాక్పటిమను కలవారని. చోళరాజసభలో కూరేశులు విష్ణుపారమ్యమును నిరూపించుచు పల్కిన "ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మా నేశానః' (మహోపనిషత్, 1–1) (సృష్టికి ముందు నారాయణుడు ఒక్కడే ఉన్నాడు కదా! బ్రహ్మా కానీ, ఈశ్వరుడు కానీ లేడు), "**నారాయణ పరం బ్రహ్మ. తత్త్వం నారాయణ పరః**" (నారా. ఉ.) (నారాయణుడే పరబ్రహ్మ, నారాయణుడే పరతత్త్వం) వంటి సూక్తులు పురుషోత్తమునిచే పరిణీతమైన వేదకాంతమెడలో మంగళసూత్రములయ్యెనని చెప్పవచ్చును. లేదా, పూర్వము వివరించిన విధముగా, కూరేశుల ప్రబంధములే వేదకాంత కంఠమున మంగళసూత్రములయ్యెననియు చెప్పవచ్చును.

శ్రీశుద్ధసత్త్వం దొడ్డయాచార్యులవారిచే రచింపబడిన "**కూరేశ పంచాశత్**" స్తోత్రములోని మొదటి శ్లోకమున గల "**నిగమాంతాకల్ప**" అను విశేషణమును వివరించుచు, ఉ. వే. శ్రీమాన్ T. A. కృష్ణమాచార్యస్వామి "**నిగమాంతానామ్ ఆకల్పః ఆభరణం యేన సః**" అను బహువ్రీహిసమాసమువలన వేదకాంతకు అలంకారమును నిర్మించినవారను అర్థము వచ్చునని పల్కిరి. అనగా, వేదకాంత మెడలో ప్రధానమైన అలంకారమును నిర్మించినవారని దీని తాత్పర్యము, అట్టి అలంకారము పంచస్తవియే కదా!

శ్రీరామానుజుల ఆజ్ఞతో, శ్రీరంగేశపురోహితత్వమును శ్రీరంగామృతకవి (తిరువరఙ్గత్తముదనార్) వలన వీరు సంపాదించిన ఐతిహ్య మిచట స్మరణీయము. కావున, శ్రీరంగేశ పురోహితులగు కూరేశులు "**పంచస్తవి**" అను మంగళసూత్రమును నిర్మించి, ఇవ్వగా, సర్వేశ్వరుడు ఆ సూత్రమును వేదకాంతమెడలో అలంకరించి, ఆమె తన సొత్తు అని లోకమునకు చాటెను –అని భావము. అనగా, వేద ప్రతిపాద్యమైన పరతత్త్వము శ్రీమన్నారాయణుడే

అను విషయము కూరేశుల రచనలగు పంచస్తవి మొదలగువానివలన జగత్ప్రసిద్ధి పొందెనని తాత్పర్యము.

ఇట్టి వివరణము ప్రకృతమున కూడ అన్వయింపవచ్చును. లోకమున వివాహములలో పురోహితుడు మంగళసూత్రమును నిర్మించి ఇవ్వగా, వరుడు ఆ సూత్రమును వధువు మెడలో కట్టుట ప్రత్యక్షముగా అందరు చూచునదే కదా! అట్టి క్రమములో ఈ వివరణము చేయబడినది.

శ్రీవత్సచిహ్న శబ్దమునకు "**తిరుమఱు మార్బన్**" అనునది తమిళ పర్యాయపదము. మిశ్ర శబ్దము పూజ్యవాచకము. "**నమ ఉక్తిమ్**" అని అనుటచే వాచికమైన నమస్కారము మాత్రమే తెలుపబడుచున్నది. కాయికమైన, వాచికమైన నమస్కారము అను రెండిటిని చేయకున్నను, వాచిక నమస్కార మొక్కటియైనను చాలునను విశేషార్థము ఇచట స్ఫురించుచున్నది. "**త్రయీ**" అను స్త్రీ లింగశబ్ద స్వారస్యముచే వేదమునకు వనితాసామ్యము తోచుచున్నది. '**త్రయీకంఠే**' అనుటకు వేదాంతమను అర్థమునుకూడా చెప్పవచ్చును.

ఈ శ్లోకమున "**అధీమహి**" లను పాఠాంతరము కన్పడుచున్నను, "**అధీమహే**" అను పాఠమే సరి అయినది. వేదాంత దేశికులును రహస్యత్రయసార ప్రారంభమున "**గురుభ్య శ్చ తద్గురుభ్య శ్చ నమోవాక మధీమహే**" అని పల్కుటను గమనింపవచ్చును. నిత్యము "**అధి**" పూర్వకమైన '**ఇఙ్– అధ్యయనే**' ధాతువు యొక్క వర్తమానకాలిక రూపము "**అధీమహే**" అని అగును. "**నమో వాక మధీమహే**" అను వేరొక పాఠమును కొన్ని చోట్ల కన్పించుచున్నది.

ఈ గ్రంథప్రారంభమున శ్రీశబ్దనిర్దేశముచే మంగళముతో గ్రంథమును ప్రారంభించినట్లయినది. "**మంగళాదీని మంగళ మధ్యాని మంగళాంతాని చ శాస్త్రాణి ప్రథంతే**" (మంగళంతో ఆరంభమయేవి, మంగళాన్ని మధ్యన కలిగినవి, మంగళంతో పూర్తి అయవి అయిన శాస్త్రాలు ప్రశస్తిని పొందుతున్నాయి) అను మహాభాష్యసూక్తి ఇక్కడ స్మరింపదగినది. శ్రీశబ్దమును ప్రయోగించుట ద్వారా

ఇక్కడ శాబ్దికమైన మంగళము చేయబడినది. మరియు, సర్వశ్రేయోదాయకమైన గురువందనము చేయబడుటద్వారా ఆర్థికమైన మంగళముకూడ ఆచరింపబడినదని చెప్పనగును.

ఇపుడు, శ్రీఏ. వి. గోపాలాచార్యద్రావిడవ్యాఖ్యలోని రసఘనములగు విశేషములు కొన్ని ఈ క్రింద చూపబడుచున్నవి.

ఈ శ్లోకమున భట్టరు, కూరేశుల సూక్తులు చిరకాలము భర్తృవియోగమును పొందిన శ్రుతిదేవిని, ఆమె భర్త అగు భగవానునితో కలిపినవని వర్ణించుచున్నారు. "**నాథాశ్లేషసనాతన శ్రుతివధూవైధవ్యఖేదచ్ఛిదం, ప్రాచీనాం నయపద్ధతిం యతిపతిః ప్రాచీకశన్నైవ చేత్**" (2-45) (తన భర్త అయిన భగవంతునితో కలయిక లేనందువల్ల సనాతన అయిన శ్రుతి అనే వధువుకు వైధవ్యం కలిగింది. దానివల్ల ఆమె పడిన బాధను లేకుండా చేసే ప్రాచీనమైన న్యాయక్రమాన్ని భగవద్రామానుజులు ప్రకటించి ఉండకపోతే) అని సంకల్పసూర్యోదయమున, "**చిరంతనసరస్వతీచికురబంధసైరంధ్రికాః**" (36) (సనాతనమైన వాక్కు అనే వేదమనే కాంత శిరోజాలను ముడి వేసి, వాటి అలంకరణను చేసే సైరంధ్రులు) అని యతిరాజసప్తతిలోను దేశికులు పల్కిన విధముగా, భట్టరు తమ తండ్రియగు కూరేశుల సూక్తులనుగూర్చి పల్కుచున్నారు.

సకలలోకమంగళమునకు మూలమగు శ్రుతిదేవికి కూరేశుల సూక్తులు మంగళమును కల్గించుచున్నవి– అనునది ప్రస్తుతశ్లోక సారాంశము.

(శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యః) తమ జనకుల పరమశోభనములగు సూక్తులు అట్లుండనిండు. వారి నామమే లోకోత్తరమైన మంగళచిహ్నమును కల్గియున్నదనుటను "**శ్రీవత్సచిహ్న**" అను మంగళకరమైన నామముద్వారా కవి తెలుపుతున్నారు. శ్రీశబ్దము, శ్రీవత్సశబ్దమును మంగళకరములు, "**శ్రియఃపతిః**" (1-1) అను మాఘుడు, "**శ్రియః కురూణామ్**" (1-1) అని భారవియు తమ కావ్యారంభములను చేసిరి. "**శ్రీవత్సలక్ష్మం గళశోభి కౌస్తుభమ్**" (భాగ. 10-3-

9) (శ్రీవత్సమనే పుట్టుమచ్చను కలవాడు, కంఠంలో గొప్పగా ప్రకాశించే కౌస్తుభమణిని కలవాడు) అని అపుడే ఉద్భవించిన అద్భుతశిశువు (కృష్ణుని)యొక్క మంగళ చిహ్నములనుగూర్చి శ్రీశుకులు పలికిరి. "**శ్రీవత్సవక్షాః నిత్యశ్రీః**" (రా. యు. 114-15) (శ్రీవత్సమ్ అనే పుట్టుమచ్చను వక్షఃస్థలంలో కలవాడు లక్ష్మీదేవితో నిత్యసంబంధమును కలిగినవాడు) అని వాల్మీకిభగవానులును నుడివిరి. అనగా, భగవానుని వక్షము శ్రీవత్సాంకితమగుటచే లక్ష్మి ఆ వక్షమును ఎల్లప్పుడు వదలక యుండును – అని తెలియుచున్నది. చిహ్నశబ్దముచే పేరులో కూడ మంగళచిహ్నము కలదని తెలుపబడినది.

**"చిహ్నై రనిహ్నవపరై రపరై శ్చ కైశ్చిత్,**
**నిశ్చిన్వతే త్వయి విపశ్చిత ఈశితృత్వమ్"**

(స్పష్టంగా ప్రకాశించే మంగళచిహ్నాలతో, ఇంకా కొన్ని గుర్తులతో పండితులు నీలో ఈశ్వరత్వాన్ని నిశ్చయం చేసుకుంటున్నారు) (28) అని శ్రీవైకుంఠస్తవమున కూరేశులు పల్కినట్లు, కాదనుటకు వీలు కాని భగవచ్చిహ్నములను కల్గిన వేదప్రమాణములను ప్రదర్శించువారు కూరేశులు. మరియు, ఈ ఆచార్యులు శ్రీవత్సాంశమున జన్మించిరనియు సంప్రదాయములో చెప్పబడుచున్నది.

(నమ ఉక్తి మధీమహే) – కూరేశుల సూక్తులు గంభీరమధురములు వాని గొప్పతనము శ్లోకములో ఉత్తరార్ధమున తెలుపబడును. దివ్యములైన, ఆశ్చర్యకరములైన సూక్తులను పల్కు కూరేశులకు నమ ఉక్తి మాత్రమే తగిన ఉపహారము – అను భావమును ఉక్తిపదమును రెండు చోట్ల ప్రయోగించుటద్వారా కవి తెలియజేసిరి. "అధీమహే" అనునది వేదోచ్చారణనుగూర్చిన ప్రయోగము, ఈ ప్రయోగము గురూచ్చారణను అనుసరించి ఉచ్చరించుటను తెలుపును. ఈ విషయములు రెండును శ్లోకముయొక్క ఉత్తరార్ధమును వ్యాఖ్యానించునప్పుడు. సమర్థింపబడును.

(యదుక్తయః ––– సూత్రతామ్)– కూరేశులనుగూర్చి నమ ఉక్తిని పల్కుటతో వేదమును అధ్యయనము చేసినట్లు ఎట్లగును? అనినచో, ఇట్లు సమాధానమును చెప్పవచ్చును.

కూరేశులకు ముందు ఇతరులు చేయు తగని వాదములచే వేదకాంత తనకు ప్రభువగు భగవానునకు దూరము చేయబడినది. కూరేశుల సూక్తులచే ఆమె తిరిగి భగవానునితో కలుపబడినది. అనగా, " వేదప్రతిపాద్యుడగు పరబ్రహ్మ శ్రీరంగనాథుడే" – అని కూరేశులు తమ–సూక్తులతో నిరూపించిరని భావము. ఇట్లు చిరకాలము భర్తకు దూరమైన వేదకాంత పునస్సమాగమశుభవేళ, తనను ఇట్లు భగవానునితో కలిపిన బ్రాహ్మణోత్తములగు కూరేశులకు కృతజ్ఞతాపూర్వకముగా నమ ఉక్తిని పల్కెను. రుక్మిణీదేవి,

**"న పశ్యంతీ బ్రాహ్మణాయ ప్రియ మన్యన్ననామ సా"**

(శ్రీకృష్ణుని దగ్గరనుండి దూతగా వచ్చి, తనకు ప్రియాన్ని కలిగించిన బ్రాహ్మణునకు, వేరొక ఏ విధంగాను కృతజ్ఞతను తెలుపుకోవడానికి తెలియనిదై, రుక్మిణీదేవి ఆ బ్రాహ్మణునకు నమస్కరించింది) అని ఘటకునకు నమస్కరించెను కదా! అపౌరుషేయి, అశరీరిణి అగు వేదకాంత ఆ విధముగా నమస్కరింపలేదు. వాగ్రూపిణి అగు ఆమె వాక్సామర్థ్యమును కల్గినదగుటచే, తిరిగి మంగళసూత్రములను ధరించు వేళ ఘటకులగు కూరేశులకు నమ ఉక్తిని పల్కినది. వేదము ఏమని పల్కినను, అది అంతయు అధ్యేయమే. (కూరేశుల వంశమున జన్మించినవారు శ్రీరంగరాజ పురోహితులు, శ్రీరంగరాజ కల్యాణమునకు ఘటకులు), అట్టి పురోహితుల విషయమున వేదకాంత తన వివాహవేళ పల్కిన నమ ఉక్తి మిగిలిన అందరకు అధ్యేతవ్యము, త్రయి అను గురువుచే పలుకబడిన నమ ఉక్తిని కవి ఉచ్చరించుటచే ఇవ్వట గురూచ్చారణానుచ్చారణ రూపమైన **"అధీమహే"** అను క్రియాప్రయోగము స్వరసము. వేలాది తల్లిదండ్రుల కంటే వత్సలతరయు,

అజ్ఞానాంధకారనివర్తినియు అగు త్రయీమాతకు గురుత్వ మున్నదనుటలో సందేహమే లేదు కదా!

(త్రయీకంఠే) భగవానునకు, శ్రీభూనీళాదేవులు అను ముగ్గురు దేవేరులు కలరు. వేదమును త్రయి, త్రయీకంఠమే కదా (వేదాంతమే కదా) మన మెఱుగదగిన తత్త్వమును తెలుపును! కావున, దానియందు కవికి గొప్ప కృతజ్ఞత కలదు. వేదములు మూడైనను, అవి అన్నియు భగవానుని పరమగుటచే ఏకకంఠలు, కావున ఇక్కడ "**కంఠే**"అను ఏకవచనము సార్థకము. '**కంఠే**' అను ప్రయోగము జాత్యేకవచనముగా చెప్పినను చెప్పవచ్చును. కాని, ఆ అర్థమున పైన చూసిన స్వారస్యము భాసింపదు. కావున, ముందు చూసిన అర్థమే సరసము. లేక, మూడు వేదములను కలిపి ఒకే స్త్రీగా భావించినట్లును చెప్పవచ్చును. జ్ఞానమయి అగు త్రయికి, ప్రజ్ఞానఘనుడగు పరబ్రహ్మకును పరిణయము యుక్తమే కదా!

(యాంతి మంగళసూత్రతామ్)– శ్రీవత్సచిహ్నమిశ్రులు పురోహితులగుటచే, త్రయీకాంతను, భగవానుని కలుపువారు, త్రయీ–బ్రహ్మమిశ్రయితలు,. కావున మిశ్రులనదగినవారు. పురోహితవంశమువారికి సంబంధించినదంతయు మంగళసూత్రముగానే భాసించును కాబోలు! శ్రీరంగరాజపురోహితులకు జామాత శ్రీరంగనాథుడే. శ్రీవత్సచిహ్నుల ఉక్తులు సూత్రములుగా చెప్పబడినవి. కావున, వారు సూత్రకారులయ్యెది. బ్రహ్మసూత్ర మనునప్పుడు, బ్రహ్మశబ్దమును ఆవృత్తి చేసికొని, ఒక బ్రహ్మశబ్దమునకు వేదమని, వేరొక బ్రహ్మశబ్దమునకు భగవానుడని అర్థము చెప్ప వీలున్నది. అపుడు "శబ్దబ్రహ్మమగు వేదముయొక్క పరబ్రహ్మపరత్వమును నిర్ణయించు సూత్రములు బ్రహ్మసూత్రములు" అను అర్థము భాసించునని వేదాంతగ్రంథములలో తెలుపబడినది. త్రయీరూపమైన బ్రహ్మ పరబ్రహ్మతో మంగళసూత్రముతో కలుపబడుట ఇచటి స్వారస్యము. కూరేశుల సూక్తులును అట్టివే, కావున, అవి బ్రహ్మసూత్రములే.

కూరేశుల సూక్తులకు బ్రహ్మసూత్రత్వము ఉన్నను లేకున్నను, మంగళ సూత్రత్వము మాత్రము తప్పక కలదు. శ్రీశంకరులు బ్రహ్మసూత్రములను వేదాంతవాక్యకుసుమ గ్రథనార్థములు అనిరి. మహనీయమగు ఉపనిషద్దుగ్ధాబ్ధిసారసుధను పొందుటకు సాధనములు బ్రహ్మసూత్రములని దేశికులు వచించిరి. శబ్దబ్రహ్మయగు త్రయికి, పరబ్రహ్మతో వివాహమంగళము నిర్వర్తించుటకు ఆవశ్యకమైన మంగళతంతువులు కూరేశుల సూక్తులు – అని భట్టరు అభిప్రాయము కాబోలు. **"సూచనాత్ సూత్రమ్"** (సూచిస్తున్న కారణంచేత సూత్రము అనబడుతున్నది) అను యౌగికమైన వ్యుత్పత్తి సూత్రపదమునకు ఉన్నను, తంతువు అను రూఢ్యర్థమును గ్రహించుటలోనే ఇక్కడ ఎక్కువ స్వారస్యము కలదు.

నా తండ్రియు, ఘటకులును, పురోహితులును అగు కూరేశులు వారి సూక్తులు అను మంగళసూత్రములతో, అలౌకికమైన త్రయీ వధువును, జామాత అగు శ్రీరంగనాథుడు అను వరునితో కలిపిరి. అట్టి శ్రీరంగనాథుని నేను సేవింతును– – అను తాత్పర్యార్థమువలన ప్రస్తుతశ్లోకముకూడ శ్రీరంగనాథుని స్తుతిలో అంతర్భవించును.

ఇందు వృత్తము అనుష్టుప్.

## ఎంబార్ స్తుతి

**2. రామానుజపదచ్ఛాయా గోవిందాహ్వా ఽ నపాయినీ ।**
**తదాయత్తస్వరూపా సా జీయా న్మద్విశ్రమస్థలీ॥**

**ప్ర. అ. –** అనపాయినీ = ఎన్నడును విడువనిది (ఎల్లప్పుడును కూడి యుండునది), రామానుజ = భగవద్రామానుజులయొక్క పదచ్ఛాయా = పాదముల నీడయు, తత్ = ఆ పాదములకు, ఆయత్త స్వరూపా = అధీనమైన స్వరూపమును కల్గినదియు అగు, గోవింద ఆహ్వా = గోవింద భట్టర్ అను పేరును

కల్గిన, సా = ఆ, మత్ విశ్రమస్థలీ = (దాసుడవైన) నా విశ్రాంతి స్థానము, జీయాత్ = సర్వథా వర్ధిల్లును గాక!

**వరివస్య :–** తమకు పంచసంస్కారములను, మంత్రరత్నమును (ద్వయ మంత్రమును) ఉపదేశించిన గోవింద భట్టర్ (ఎమ్బార్) అను ఆచార్యవర్యులను ఈ శ్లోకమున కవి స్తుతించుచున్నారు.

పరాశర భట్టర్ అవతరించిన పదునొకండవనాడు శ్రీరామానుజులు తమ శిష్యులతో కలసి, శ్రీవత్సాంకుల ఇంటికి వచ్చిరి. తమ శిష్యులలో ముఖ్యులగు గోవింద భట్టర్ (ఎమ్బార్) ను పిలిచి, బిడ్డను తీసికొని రమ్మనిరి. గోవింద భట్టర్ బిడ్డను తీసికొని వచ్చుచు, బిడ్డకు దృష్టిదోషము తగులకుండునట్లు రక్షగా ద్వయమంత్రమును అనుసంధించుచు వచ్చిరి. రామానుజులు బిడ్డను కటాక్షించి, ఆ శిశువు యొక్క తేజోవిశేషమునకు ఆశ్చర్యపడుచు, "గోవింద భట్టారకా! ఈ బిడ్డ వద్ద ద్వయము పరిమళించుచున్నదే! కారణమేమి? మీరేమి చేసితిరి?" అని ప్రశ్నించిరి. గోవిందభట్టర్ "స్వామీ! శిశువును మీ దగ్గరకు తీసికొనివచ్చునపుడు నేను రక్షగా ద్వయమును అనుసంధించితిని" అని బదులు పల్కిరి. రామానుజులు మిక్కిలి సంతోషించి, "భట్టారకా! ఈ బిడ్డ శ్రేయస్సునకై ముందుగా కృషిచేసినవారు మీరే, కావున ఇతనికి మీరే ఆచార్యులు కాదగినవారు" అని నియమించిరి. ఈ వృత్తాంతము గురుపరంపరా ప్రభావమువంటి సంప్రదాయచరిత్ర గ్రంథములలోనే కాక, "**తిరువాశిరియమ్**" అను నమ్మాళ్వారుల దివ్యప్రబంధములోని 4వ పాశురమునకు పెరియ వాచ్చాన్ పిళ్లై రచించిన వ్యాఖ్యానములో కూడ కానవచ్చుచున్నది. మరియు, "**ఎణ్పెరుక్కన్నలత్తు ఒణ్ పొరుళ్ ఈఱిల, వణ్ పుకழ் నారణన్ తిణ్ కழల్ శేరే**" (సంఖ్యాతీతమైన, మితి లేని జ్ఞానాదిసమస్త గుణాలను కలిగిన గొప్పతత్వం అయిన జీవవర్గమును, అనంతకళ్యాణగుణాలను కలిగిన నారాయణుని ఆశ్రిత రక్షణలో దృఢమైన స్వభావాన్ని కలిగిన శ్రీచరణాలను అశ్రయించండి) అను తిరువాయ్ మొళి (1-2-10) పాశురమునకు కల ఈడు

వ్యాఖ్యానమునుబట్టియు, పరాశరభట్టరునకు పంచసంస్కారములను, ద్వయమంత్రమును ఉపదేశించినవారు గోవిందభట్టరే – అని తెలియుచున్నది. ఇట్లు తమ ఆచార్యులగు గోవింద భట్టర్ ను కవి ఈ శ్లోకమున స్తుతించుచున్నారు.

గోవిందభట్టర్ కు సంప్రదాయమున "**ఎమ్బార్**" అని పేరు. ఈ పేరు, "**ఎమ్బెరుమానార్**" అను పేరుకు వికృతి అని పెద్దలు అందురు. ఈ పేరు "**ఎమ్, పార్**" (నా స్థానం) అను రెండు పదముల కలయిక అగుటచే, వాని అర్థములను కవి చమత్కారముగా ఈ శ్లోకమున వివరించిరి. "**ఎమ్**" అనగా – నాయొక్క – అని, "**పార్**" అనగా – భూమి (స్థలము) అని అర్థములు, కనుక, "**ఎమ్బార్**" అనగా – "**మా చోటు, మేము విశ్రమించు స్థలము**" అను భావము వచ్చును. ఈ అర్థము శ్లోకములోని "**మద్విశ్రమస్థలీ**" అను సమస్తపదము ద్వారా తెలియజేయబడినది.

నీడ వ్యక్తిని ఎప్పటికిని విడచి ఉండదు. అట్లే, తమ ఆచార్యులైన రామానుజుల విషయమున ఉండు గోవిందభట్టర్ ను "**రామానుజపదచ్ఛాయా**" అని కవి నిర్దేశించిరి. నీడ శారీరకమైన తాపమునుమాత్రమే తీర్చును. "**ఎమ్బార్**" అను నీడ తాపత్రయమును పోగొట్టును– అను తాత్పర్యము. అట్టి ఆచార్యులు సర్వోత్కర్షతో వెలుగొందుదురు గాక! అనుచు తమ ఆచార్యులకు మంగళాశాసనమును ఇందు కవి చేయుచున్నారు. భగవద్భాగవతాచార్యులకు మంగళాశాసనమును చేయుట ప్రపన్నుని స్వరూపములోనికి చేరునను రహస్య మిచట పొందుపఱుపబడినది.

నమ్మాళ్వార్లు "**పెరియ తిరువన్దాది**" అను దివ్యప్రబంధమున "**శుழల్ కుడల్ తలైమీదెడుత్తు క్కొణ్డాడి, అన్ఱత్తడఙ్గడలై మేయార్ తమక్కు నిழలుమ్ అడితాఱు మానోమ్**" (31) (శ్రీకృష్ణావతారమున భాండములను తన తలపై నిడికొని, అవి గిరగిర తిరుగునట్లు నృత్యమును చేసిన భగవానుడు, ఆ శ్రమ తీరుటకై క్షీరాబ్ధిలో చేరి పవళించెను. ఆ స్వామికి పాదచ్ఛాయగాను,

పాదరేఖగాను అయితిమికదా!) అని భగవానుని విషయమున అనుసంధించిరి. ఈ భావనను భట్టరు తమకు ఆచార్యులగు గోవిందభట్టర్ విషయమున అనుసంధించుటయేకాక, ఆచరించి చూపిరికూడ. కావున, వీరికి "**రామానుజపదచ్ఛాయా**" అను నామము మిగుల సార్థకము; విలక్షణమయినదియు. ఈ సందర్భమున "**ఛాయా వా సత్త్వ మనుగచ్ఛేత్**" (పరమసంహిత) (చేతనుడు, నీడవలె భగవంతునకు శేషభూతుడై, అనుసరిస్తూ ఆ స్వామిసేవను చేసుకోవాలి) అను భగవచ్ఛాస్త్ర మూలసంహితావచనమును ఇక్కడ స్మరింపనగును. ఈ ప్రమాణములోని "**వా**" అను పదము ఇవార్థకము. ఈ ప్రమాణము సహజముగా భగవానునకు ముక్తుడు సర్వదా చేయు కాయికకైంకర్యమును తెలిపినను, ప్రకృతమున దానిని ఆచార్యసేవలో పర్యవసింపనగును.

నీడరూపము దాని కాధారమగు వస్తువును అనుసరించియే యుండును. ఆ వస్తువును ఎప్పటికిని విడచియుండదు. ఛాయ తన వద్దకు చేరినవారి తాపమును పోగొట్టును. ఈ ధర్మములు మూడును "**రామానుజపదచ్ఛాయ**" గా నిర్దేశింపబడిన గోవిందభట్టర్ లో కూడ గమనింపవచ్చును.

వీరు రామానుజులకు పినతల్లి కుమారులు. రామానుజుల పాదములను ఆశ్రయించి, స్వరూపసిద్ధిని పొందినవారు. ఎల్లప్పుడును వారి సేవలోనే కాలము గడుపుచు, వారిని అనుసరించెడివారు. తమను ఆశ్రయించిన పరాశర భట్టరు, వ్యాసభట్టరువంటి ఆచార్యులను ఉజ్జీవింపజేసినవారు.

వాధూల వీరరాఘవాచార్యస్వామివ్యాఖ్యలో "**మద్వ్యాశ్రమస్థలీ – ఎన్నదు ఎమ్బార్ ఎన్నదఱ్కు పర్యాయమాయ్, విశేష్యమాకవుమామ్, అన్నిక్కే ఇదు విశేషణమాయ్, రామానుజపదచ్ఛాయా – ఎన్నదు విశేష్యమాకవుమామ్**" ("**మద్వ్యాశ్రమస్థలీ**" – అనే ప్రయోగాన్ని "**ఎంబార్**" అనే తిరునామానికి పర్యాయమై, విశేషణంగా గ్రహించవచ్చు, లేక, దీనినే విశేషణంగా, "రామానుజ

పదచ్ఛాయా" – అనే ప్రయోగాన్ని విశేష్యంగాను గ్రహించవచ్చు) అని వివరింపబడినది.

ఈ శ్లోకమున గోవింద భట్టరు రామానుజపదచ్ఛాయగా రూపింపబడుటచే రూపకాలంకారము. ఛందస్సు అనుష్టుప్.

శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలోని విశేషములు కొన్ని ఇచట తెలుపబడుచున్నవి.

పూర్వశ్లోకమున వేదకాంత, పరబ్రహ్మల పరిణయము ప్రస్తుతమైనది. ఇందు స్వాచార్యులగు గోవిందభట్టరునకు యతిపతితో పరిణయము వర్ణింపబడుచున్నది. "**ఛాయేవానుగతా సదా**" (నీడవలె, సీతాదేవి ఎల్లప్పుడూరాముని అనుసరించింది) అనునట్లు, ఛాయగా నుండుట పత్నీత్వసూచకముకదా.

**"బాహుచ్ఛాయా మవష్టబ్ధో యస్య లోకో మహాత్మనః"**

(రా. సుం. 34-30)

(మహాత్ముడైన శ్రీరాముని గొప్ప బాహువుల నీడను ఆశ్రయించిన లోకం ఎటువంటి భయాన్ని పొందడం లేదు) అనుచు వాల్మీకి భగవానుని వీరబాహుచ్ఛాయా మాహాత్మ్యమును తెలుపగా, యతిపతిపదచ్ఛాయా మాహాత్మ్యమును భట్టర్ ఇందు తెలుపుచున్నారు. మొదటిది ప్రథమ పర్వానికి చెందినది కాగా, రెండవది చరమపర్వానికి చెందినది. అందువల్ల పాదచ్ఛాయా మాహాత్మ్యం తెలుపబడుతున్నది – అనే స్వారస్యాన్నికూడా ఇక్కడ చెప్పవచ్చు.

(రామానుజపదచ్ఛాయా) భగవద్రామానుజుల పాదసంబంధమువలన వారికి పిమ్మట జన్మించిన ఆచార్యులందరును గొప్పతనమును పొందిరి – అను సత్యమును ఈ విశేషణము తెలుపును. ఆత్మకు కల్గు తాపమును తీర్చుటలో సమర్థమగు అలౌకికమైన ఛాయ మిగుల ఆవశ్యకమగుటచే, తమ ఆచార్యులను రామానుజుల పాదచ్ఛాయగా కవి రూపించెను. ఈ రూపణమువలన గోవిందభట్టరుయొక్క రామానుజపాదాధఃస్థితి తెలుపబడినది.

ఆ ఆచార్యులు తమ సత్త రామానుజాధీనమని తలచిన మహనీయులు,

**"అవస్తు ప్రస్తావేష్వచరమ మభూద్వస్తు యదిదం,**
**స ఏవాహం సత్సు వ్యగణిషి యదీయై ర్వరగుణైః"**

(సత్తను లేని వాటిని లెక్కపెట్టినప్పుడు, మొట్టమొదటి స్థానంలో ఉండే నేను, భగవద్రామానుజులవారి నిరవధిక దయ మొదలైన గొప్ప గుణాల కారణంగా సత్పురుషులలో ఒకడనుగా లెక్కపెట్టబడ్డాను) అని గోవిందభట్టరే స్వయముగా పలికిరి.

(గోవిందాహ్వా) – లోకమున, నీడకు దానికాధారముగు వస్తువుకన్న వేరు పేరు ఉండదు. **"తరుచ్ఛాయా"** అని, **"ఛత్రచ్ఛాయా"** అని లోకమున వ్యవహరింపబడుటను గమనింపవచ్చును. కాని, ఇచటి ఛాయ సచేతనమగుటచే నామభేదమును కలిగియున్నది.

(అనపాయినీ) – భగవద్రామానుజులకు అచ్యుతపదవిశ్లేషము లేనట్లే, వీరికి రామానుజపదవిశ్లేషము లేదు. కావున, నాకు విశ్రమాపాయము లేదు – అని పలుకుతున్నారు.

(తదాయత్తస్వరూపా)– శాస్త్రములలో "జీవాత్మస్వరూపము భగవదాయత్తము" అని తెలుపబడగా, దానినికూడ కాదని, తమ స్వరూపము ఆచార్యాధీనమని ఎమ్బార్ తలచిరి. మధురకవులు చూపిన ఆచార్యనిష్ఠను తామాచరించి చూపిరి.

(జీయాత్)– గురువిషయమున శిష్యులు చేయు మంగళము ఇది. ఛాయకు ప్రకర్ష ఏమనగా – దట్టముగా నుండుట, చల్లగా నుండుట.

(మద్విశ్రమస్థలీ) నా ఆత్మకు కల్గిన తాపమును ఆచార్యపదచ్ఛాయలో తీర్చుకొందును. వాసుదేవతరుచ్ఛాయతో కూడ నాకిక పని లేదు. **"సా కిం న సేవ్యతే?"** (గారుడ, 222-21) (మిక్కిలి చల్లగాను, మిక్కిలి వేడిగాను ఉండనిది, నరకం అనే అగ్ని చల్లార్చేది అయిన వాసుదేవుడనే వృక్షంయొక్క నీడను మీరెందుకు సేవించలేదు?) అని వాసుదేవ తరుచ్ఛాయ విషయమున

అనుసంధించు సూక్తిని మేము రామానుజపదచ్ఛాయవిషయమున అనుసంధింతుము.

### భగవద్రామానుజ స్తుతి

**3. రామానుజముని ర్జీయాత్ యో హరే ర్భక్తియంత్రతః ।**
**కలికోలాహల క్రీడాముధా గ్రహ మపాహరత్ ॥**

**ప్ర. అ. –** యః = ఏ రామానుజులు, హరేః = విష్ణువుయొక్క, భక్తియంత్రతః = భక్తి అను యంత్రమువలన, కలికోలాహలక్రీడా = కలిపురుషుని కోలాహలము అనెడి, ముధాగ్రహం = మొండి పిశాచమును, అపాహరత్ = దూరముగా పారద్రోలిరో, అట్టి, రామానుజమునిః = భగవద్రామానుజమునులు, జీయాత్ = చిరకాలము వర్ధిల్లుదురు గాక!

**వరివస్య :–** పితృపాదులైన శ్రీవత్సాంకులను, ఆచార్యులగు గోవిందభట్టరును మొదటి రెండు శ్లోకములలో స్తుతించిన పిమ్మట, ఈ శ్లోకమున కవి, తమకు పరమాచార్యులును, జగదాచార్యులును అగు భగవద్రామానుజులకు మంగళాశాసనమును చేయుటద్వారా ప్రణమిల్లుచున్నారు.

సర్వేశ్వరుని నిర్హేతుక కటాక్షమువలన భ్రమ విప్రలంభాది దోషములు లేని జ్ఞానమును పొందిన ఆళ్వార్లు "**కలియుమ్ కెడుమ్, కండుకొణ్మిన్**" (తి. వా. 5-2-1) (కలియును నశించును, చూడుడు) అనుచు పరోక్షముగా తిరువాయ్ మొళి అను దివ్యప్రబంధమున రామానుజులను స్తుతించిరి. శ్రీరంగామృతకవి (తిరువరజ్గత్తముదనార్) "**ఇరామానుశ నూ*ఱ్ఱ*న్దాది**" అను ప్రబంధమున "**ఇరామానుశన్ మఱ్ఱై తేర్ న్దులకిల్ పురియుమ్ నన్ ఞానమ్ పారున్దాదవరై ప్పొరుజ్కలియే**" (87) (రామానుజులు, వేదములను పరిశీలించి, లోకమున అర్థమగునట్లు వానిని అనుగ్రహించిరి. ఆ జ్ఞానమును పొందనివారిని కలి ఆక్రమించును) అని, "**ఇరామానుశన్ ఇత్తలత్తుదిత్తు ఆనదు శెమ్మై యఱ**

**నెఱి, పాయ్ న్మ్మె యఱు శమయమ్ పోనదు పోన్ది, ఇఱన్దదు వెజ్కలి**" (49) (రామానుజులు ఈ లోకమున అవతరించిన పిదప, చక్కని ధర్మమార్గము మరల ఉద్ధరింపబడినది. వేదబాహ్యములైన మతములన్నియు నశించినవి. క్రూరుడైన కలియొక్క దోషము పోయినది.) అని పల్కుట గనునింప దగినది. రామానుజుల అవతార దినమును ప్రస్తుతించు నాళ్ పాట్టులో "**వెజ్గలి ఇజ్గిని వీఱు నమక్కిలై ఎన్ఱు మిక త్తళర్ నాళ్**" (ఈ భూమండలమున, "**మనకు ఇక శక్తి లేదు**"– అనుచు కలి మిక్కిలి తల్లడిల్లు దినము) అని నిత్యము ప్రపన్నులు అనుసంధించుదురు. కావున, రామానుజుల ప్రభావముచే కలిపురుషుని దోషము తొలగినదని ఏర్పడుచున్నది. ఈ విషయమే ప్రస్తుత శ్లోకములో ప్రధానాంశము.

శ్రీరామానుజులు హరిభక్తి అనెడి యంత్రముద్వారా కలిపురుషుని కోలాహలము అను వ్యర్థపిశాచమును బంధించి, పారద్రోలిరి. ఇట్లు భగవద్భక్తిని పెంపొందించి, సమస్త లోకమును ఉజ్జీవింపజేసిన జగదాచార్యులగు రామానుజులు చిరకాలము వర్ధిల్లుదురు గాక! – అని శ్లోకభావము.

ఇందు కలికోలాహలమును కట్టుబడని పిశాచముగా చెప్పినందులకు అనువుగా, హరిభక్తిని యంత్రముతో కవి పోల్చిరి. లోకమున దుష్టగ్రహములను, పిశాచములను పారద్రోలుటకు యంత్రములను ఉపయోగింతురు. అట్లే, రామానుజులు హరిభక్తి అను యంత్రమును ప్రయోగించి, కలికోలాహలమను పిశాచమును తరిమివేసిరి.

**"కలౌ కృతయుగం తస్య కలి స్తస్య కృతౌ యుగే ।**
**యస్య చేతసి గోవిందో యస్య చేతసి నాచ్యుతః"**

(వి. ధ. 109–57)

(ఎవని హృదయమున గోవిందుడుండునో, అతనికి కలియుగమును కృతయుగమగును. అట్లే, ఎవని హృదయమున అచ్యుతుడుండడో, అతనికి కృతయుగమును కలియుగమే అగును) అను ప్రసిద్ధ శ్లోకమిచ్చుట స్మరింపదగినది. కావున, భగవద్భక్తి యందలి వైముఖ్యమే కలికోలాహలము.

అదియే ఒక నిర్నిబంధన పిశాచము. "**యంత్రతః**" అనగా, "**యంత్రణాత్**"– యంత్రమువలన – అని అర్థము. "**యంత్రితః, యంత్రితాత్**" అను పాఠభేదములును కలవు.

"**భక్తియంత్రితాత్ హరేః**" అని అన్వయించినచో, అధికుని వశపఱచుకొని, క్షుద్రులను పారద్రోలునట్లే, భక్తితో వశపరచుకొనిన హరివలన కలికోలాహలమను మొండి గ్రహమును పోగొట్టినవారు శ్రీరామానుజులను అర్థము వచ్చును. ఈ అన్వయమున "**యంత్రితాత్**" అనునపుడు "**కర్మణి క్తః**" అని క్తప్రత్యయము వచ్చినదని చెప్పనగును. "**హరేః భక్తియంత్రితాత్**" అనునపుడు పంచమీవిభక్తిని ల్యబ్లోపే పంచమిగా గ్రహించినచో, "**హరిని భక్తియంత్రితుని చేసి**" అను భావము వచ్చును. "**హరతీతి హరిః**" అని హరిశబ్దవ్యుత్పత్తి కావున, హరి వలననే ముధాగ్రహమును హరించుట సాధ్యపడునను విశేషార్థ మిచట "**హరేః ముధాగ్రహ మపాహరత్**" అను యోజన ద్వారా ఏర్పడుచున్నది.

"**రామానుజముని**" అనునపుడు "**ముని**" అను పదముకూడ సాభిప్రాయముగా ప్రయోగింపబడినదని చెప్పవచ్చును. "**మననాత్ ముని రేవాసి**" (ఎల్లప్పుడూ మననం చేయడంవల్ల నీవు మునివి అయ్యావు) అను హరివంశ వచనానుసారము, ఎల్లప్పుడు భగవానుని ధ్యానము చేయువానికి '**ముని**' అని పేరు. శ్రీరామానుజులు భగవానుని స్వరూపగుణాదులను ఎల్లప్పుడు ధ్యానించువారగుటచే "**ముని**" అను పేరు వారికి సార్థకము. జీవులందరిని రక్షించు విషయమునుగూర్చి ఎల్లప్పుడు మననము చేయుచుండుటచేకూడ ముని అను పేరు రామానుజులకు కల్గెనని యు చెప్పవచ్చును.

(ఈ వివరణములలో, మొదటి వివరణము – "**యో నిత్యమ్**" అని ప్రారంభమవుతున్న భగవద్రామానుజుల స్తుతివిషయకమైన తనియన్ శ్లోకములోని "**అచ్యుత పదాంబుజ యుగ్మ రుక్మవ్యామోహతః**" అనే ప్రయోగం వారి భగవద్భక్తి విశేషాన్ని తెలుపుతుంది, కనుక, దానికి అనుగుణముగాను,

రెండవ వివరణం – ఆ శ్లోకంలోని "**దయైక సింధోః**" అనే ప్రయోగం వారి కరుణాగుణ వైభవాన్ని తెలియజేస్తున్నది కనుక, దానికి అనుగుణముగాను ఉండడం విశేషం.)

ఇట్టి వివరణములు రెండును శ్లోకగురుపరంపరలోని "**శ్రీమత్పరాంకుశమునిమ్**" అనుచోట పిళ్లైలోకమ్ జీయర్ వ్యాఖ్యానమున కలవు. ఈ రెండు విధములైన వివరణములు ఇచట వివక్షితములే.

"**ప్రీతిపూర్వ మనుధ్యానం భక్తి రిత్యభిధీయతే**" (ప్రీతిపూర్వకముగా చేయు నిరంతర ధ్యానమునకు భక్తి అను పేరు) అని చెప్పబడుచున్నందున, రామానుజులు భగవద్భక్తులలో అగ్రేసరులగుటవలన, వారు భక్తియంత్రమును ప్రయోగించి, కలికోలాహలనును మొండి గ్రహమును పారద్రోలుటలో ఆశ్చర్యము ఏమీ లేదు. మునిశబ్దము "**మన– జ్ఞానే**" అను ధాతువు నుండి పుట్టినదగుటచే, జ్ఞానశీలుడను అర్థము నిచ్చును. జ్ఞానము భక్తి రూపాపన్నమై యుండవలెనని రామానుజులు "**భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా**" (శ్రీభాష్య ప్రారంభము) (పరమాత్మ విషయములోని నా జ్ఞానము భక్తి రూపముగా కావాలి) అని ప్రార్థించిరి కదా! కావున, శ్రీరామానుజుల జ్ఞానము హరిభక్తిగా పరిణమించిన జ్ఞానము. ఈ విధముగాకూడ హరిభక్తి అనెడి యంత్రమును ప్రయోగించుటలో రామానుజులు సమర్థులని చెప్పనగును.

ఇందు అలంకారము రూపకము, ఛందస్సు అనుష్టుప్.

ఇక, శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలోని కొన్ని విశేషములు ఇచట ప్రస్తుతింపబడుచున్నవి.

ముందు శ్లోకమున ఛాయ నమస్కరింపబడినది. ఇందు ఆ ఛాయకు ఆధారమగు వస్తువు నమస్కరింపబడుచున్నది. ఉత్తర శతకమున అద్వైతవాదులను కవి కలిబ్రహ్మమీమాంసకులుగా పల్కిరి. వారి కోలాహలముచే భగవానుడు మాయావాదగ్రస్తుడయ్యెను. మనలను మాయ ఆవరించుటకు భగవానుని క్రీడయే కారణము – అని శాస్త్రము చెప్పుచున్నది. "**లోకవత్తు**

**లీలాకైవల్యమ్**" (2-1-33) (భగవంతుడు లోకాలను సృష్టించడం కేవలం లీలకోసమే) అని బ్రహ్మసూత్రకారులును పల్కిరి. "**మాయయా ఒ పహృతజ్ఞానాః**" (భ. గీ. 7-17) (మాయచేత అపహరింపబడిన జ్ఞానాన్ని కలవారు) అని, "**భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా**" (భ. గీ. 18-61) (భగవంతుడు తన మాయతో సమస్త ప్రాణులను, యంత్రంలో ఆరోపింపబడిన వస్తువులనువలె, సంసారంలో పరిభ్రమింప జేస్తున్నాడు) అని గీతాచార్యుడు స్వయముగా వచించెను. సత్యమిట్లుండగా, భగవానుడు మాయచే కప్పబడుచున్నాడని అద్వైతుల వాదము. కావున, వారి వాదమున భగవానుడు మాయాగ్రహయంత్రితుడు. మాయాగ్రహమే ముఖ్యగ్రహము. "**పరం బ్రహ్మైవాజ్ఞం భ్రమపరిగతమ్**" (పరబ్రహ్మయే అజ్ఞుడై, భ్రమను పొందుతున్నాడు) అని అద్వైతులనే చెప్పబడుచున్నదని భగవద్రామానుజులు వేదార్థసంగ్రహప్రారంభమున విచారించిరి. ఇట్లు మాయాయంత్ర యంత్రితుడగు హరిని భక్తియంత్రమున ఆరోపించి, రామానుజులు భగవానుని మాయాయంత్రమునుండి విముక్తుని చేసిరి.

పరబ్రహ్మ మాయాయంత్రయంత్రితుడై సంసారమున సంచరించు చున్నాడని అద్వైతుల భావన, కాని, భక్తియంత్రితుడగు భగవానుడు మాయాగ్రహమునుండి తనను, మనలనుకూడ విముక్తులను చేయుచున్నాడని మన భావన.

లేక, "**ముథాగ్రహ**" మనుటకు అద్వైతులు చేయు కోలాహలరూపమైన, వ్యర్థమైన ఆగ్రహము- మొండిపట్టుదల – అనియు అర్థము చెప్పవచ్చును. ఈ శ్లోకమున "ముని" శబ్దము సిద్ధుడను అర్థమును సూచించును. "**సిద్ధానాం కపిలో మునిః**" (భ. గీ. 10-26) (సిద్ధులలో నేను కపిలమునిని) అని గీతాచార్యుడు నుడివెను కదా!

(జీయాత్) శ్రీవైష్ణవసన్యాసులు "**జీయాత్, జీయాత్**" అనుచు సదా భగవన్మంగళాశాసనము చేయుటచే వారికి "**జీయర్**" అని పేరు వచ్చెను కాబోలు.

(హరేః) రామావతారమున హరికి రావణుడు సీతను ఎత్తుకుపోవుటచే కల్గిన విచారము అను గ్రహమును అప్పటి రామానుజులు (లక్ష్మణుడు) పోగొట్టిరి. ఈ రామానుజులు భగవానుని ముఖగ్రహమును (మాయను) పారద్రోలిరి.

(హరేః) "**మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే**" (భ. గీ. 7-14) (ఎవరు నన్ను శరణాగతి చేస్తున్నారో, వారే ఈ మాయను అతిక్రమించగలుగుతున్నారు) అనే విధంగా, భగవానుడు లోకములో అందరిని ఆవరించు మాయను పోగొట్టువాడు కాగా, ఆ భగవానుని మాయా గ్రహము రామానుజమునిచే దూరము చేయబడుచున్నది. హరి అందరకు ఆపదుద్ధారకుడు కాగా, ఆ హరిని ఆపదనుండి ఉద్ధరించువారు భగవద్రామానుజులు.

**"కుదృష్టికుహనాముఖే నిపతతః పరబ్రహ్మణః**
**కరగ్రహవిచక్షణో జయతి లక్ష్మణో ఽ యం మునిః"** (38)

(కుదృష్టులు అనే మోసం చేసేవారి వాదాలలో పడిపోయే పరబ్రహ్మను తాము చేసే యుక్తమైన వాదనలు అనే చేయూతను ఇచ్చి, ఆ భగవానుని రక్షించడంలో సమర్థులైనవారు శ్రీరామానుజులు) ఆను యతిరాజసప్తతిసూక్తి ఇచట అనుసంధేయము.

(భక్తియంత్రితాత్) సర్వరక్షకుడే మాయాయంత్రబద్ధుడైనచో, ఇక రక్షించువారెవ్వరు? అనినచో, భక్తియంత్రమునందు భగవానుని ఆరోపించి, ఆ స్వామిని మాయాగ్రహమునుండి విడిపింతుము. వశపరుచుకొందుము. భక్తిరజ్జువులతో బంధింతుము.

శ్లోకమున "**అపాహరత్**" అను క్రియాప్రయోగము "రామానుజులు హరియొక్క మాయబంధమును హరించువారు" అను అర్థమునకు అనుగుణము.

**భగవద్యామునుల ప్రార్థన**

**4. విధాయ వైదికం మార్గ మకౌతస్కుతకంటకమ్ ।**
**నేతారం భగద్భక్తే ర్యామునం మనవామహై ॥**

**ప్ర. అ. –** వైదికం = వేదమునకు సంబంధించిన, మార్గం = మార్గమును (దారిని), అకౌతస్కుతకంటకం = "ఇది ఎందువలన? ఇది ఎందువలన?" అని దుర్వాదములను చేయువారు అనెడి కంటకములను లేనిదిగా, విధాయ = చేసి, భగవత్ – భక్తి = భగవానుడైన హరియొక్క భక్తికి, నేతారం = నాయకులు (చిగురింప చేసినవారు) అగు, యామునం = యామునాచార్యులను, మనవామహై = ధ్యానింతుము.

**వరివస్య :–** శ్రీరామానుజులకు ఆచార్యులగు మహాపూర్ణులను (పెరియనమ్బి) మనస్సున ప్రణమిల్లిన భట్టరు, అనంతరము ఆ మహాపూర్ణులకు ఆచార్యులగు యామునులను ఈ శ్లోకముద్వారా స్తుతించుచున్నారు. రామానుజులకు యామునులతో సాక్షాత్ సంబంధము లేకున్నను, రామానుజులు తమను యామునుల ఏకలవ్యశిష్యులుగా భావించుచుండిరి – అనుట సుప్రసిద్ధము. స్తోత్రరత్నములో "**యత్పదాంభోరుహధ్యాన**" అని ప్రారంభమగు యామునుల స్తుతిపరమైన (భగవద్రామానుజులచే రచింపబడిన) శ్లోకమున '**ధ్యాన**' శబ్దమును వ్యాఖ్యానించుచు వేదాంతదేశికులను ఆచార్యులు "**యామునాచార్యస్య, ద్రోణస్య ఏకలవ్య ఇవాహ మిత్యభిప్రాయేణ ధ్యానశబ్దః**" ("ద్రోణునకు ఏకలవ్యునివలె, యమునాచార్యులకు నేను శిష్యుడను" – అనే అభిప్రాయంతో ధ్యానశబ్ద ప్రయోగం చేయబడినది) అని పల్కిరి. ఈ దృష్టిలో చూచినచో, రామానుజులకు, యామునులకు మధ్య మానసికమైన గురుశిష్యసంబంధము కలదని తెలియుచున్నది. కావున, రామానుజులను స్తుతించిన పిమ్మట కవి యామునాచార్యులను స్తుతించుచున్నారనియు చెప్పవచ్చును.

యామునులు అవతరించుటకు ముందు వైదికమార్గము మాయావాదులు, నిరీశ్వరవాదులు మొదలగు దుర్వాదులచే మిక్కిలి కలుషితమై, కంటకావృతమైనది. యామునాచార్యులు శ్రీవైష్ణవసిద్ధాంత ప్రతిపాదకములగు సిద్ధిత్రయము, ఆగమప్రామాణ్యము, స్తోత్రరత్నము, గీతార్థసంగ్రహము మొదలగు దివ్యగ్రంథములను రచించిన పిమ్మట, దుర్వాదములను చేయువారి వాదములు నశించెను. భగవద్భక్తి పెంపొందెను. వైదికమార్గములోని కంటకములు తొలగి, ఆ మార్గము సుగమమయ్యెను. అట్టి యామునులకు మేము నమస్కరింతుము. – అని శ్లోకభావము.

(కౌతస్కుత) అనగా, "**కుతః కుతః**" అని ప్రశ్నించువాడు. అనగా, "ఇది ఎందులకు? ఇది ఎందువలన?" అనుచు వేదమునుగూర్చి తగని ఆక్షేపములను సదా చేయువాడని భావము. అతడు వేదమార్గములో ముల్లువంటివాడు. పలువురు సంచరించు మార్గమున ముళ్లు వ్యాపించినచో, ఆ మార్గమున ఎవ్వరు సంచరింపలేరు. అట్లే, వైదిక మార్గమును ద్వేషించు నాస్తికవాదులు చేయు వాదముల వలన సాధుజనులకు క్షోభము కల్గెను. వైదిక మార్గానుసరణమున వారికి ఆటంకమేర్పడెను. ఈ దృష్టితో కవి నాస్తికవాదులను (కౌతస్కుతులను) ముళ్లుగా సల్కెను.

ఈ శ్లోకములోని సారాంశమేమనగా – వైదికమార్గమును నిష్కంటకము కావించి, భగవద్భక్తిని లోకమున ప్రచారమొనర్చిన మహనీయులగు యామునాచార్యులకు నమస్కరించుచున్నాను. వారిని నా భక్తియోగమునకు విషయముగా చేసికొనుచున్నాను – అని. భక్తిని జలప్రవాహముతో పోల్చుట కవిసమయము.

ఈ శ్లోకమున "**భగవద్భక్తేః నేతారమ్**" అనుటచే, భగీరథుడు మిగుల శ్రమించి ఆకాశగంగను భూమిపైకి తీసికొని వచ్చినట్లే, యామునులును వైదికమార్గమును నిష్కంటకము చేసి, భక్తిరసప్రవాహమును ఈ లోకమున

ప్రవహింపచేసిరి – అను భావము ప్రతీతమగుటచే, నేత్రుశబ్దమువలన యామునులకు భగీరథసామ్యము తోచుతున్నది.

వేదములలో ఆరణ్యకములు అను కొన్ని భాగములు కలవు. లోకమున ఆరణ్యకమార్గము కంటకావృతమైయుండును. అట్లే, వేదములలోని ఆరణ్యకములలో కూడ కంటకములు నిండియున్నవి. ఆ కంటకములేమన, – "**కుతః కుతః**" అని కారణమునుగూర్చి ప్రశ్నించు హేతువాదులే. వేదముకూడ వారి వాదములను "**కో అద్ధా వేద? క ఇహ ప్రవృత్తిః,? కుతః ఆజాతా? కుతః ఇయం విసృష్టిః?**" (ఎవడు ఈ సృష్టిని గూర్చి తెలుసుకుంటున్నాడు? ఎక్కడనుండి ఈ సృష్టి వచ్చింది?) అనుచు అనువదించినది. యామునులు తమ గ్రంథములలో "**కః శ్రీ శ్రియః?**" (లక్ష్మికి లక్ష్మి అయినవాడు ఎవడు?) (స్తో. ర. –12) అని, "**కస్యోదరే హరవిరించిముఖప్రపంచః**" (స్తో. ర. –14) (ఎవని ఉదరంలో బ్రహ్మ, రుద్రుడు మొదలైన ప్రపంచం అంతా నిలచి ఉన్నది?) అని కౌతస్కుతప్రశ్నలను చేయుటద్వారా వారికి సమాధానమొసగి, తృప్తిపరచిరి, వైదికమార్గమును నిష్కంటకము చేసిరి. ఈ భావము "**వైదికం మార్గమ్ అకౌతస్కుతకంటకమ్**" అనుటచే ఏర్పడుచున్నది. శ్లోకములోని నేత్రుశబ్దమునకు రక్షకుడను అర్థము గ్రహించినచో, ఆగమప్రామాణ్యమను గ్రంథముచే భక్తిసిద్ధాంతపూర్ణనుగు సాత్త్వతసంహితకు ప్రామాణ్యమును కల్గించి, భక్తిసిద్ధాంతమును యామునులు రక్షించిరని ధ్వనించును. "**మనవామహే**" అను పాఠాంతరముకూడ కలదు.

"**గుణానుభవత్తాలాదల్, తమక్కు ప్పిఱన్ద నానాభావత్తాలాదల్, స్వకీయరైయుమ్ కూట్టిక్కొణ్డాదల్ బహువచనమ్**" (తమకు కలిగిన అనుభవంవల్ల కానీ, తమకు ఏర్పడిన అనేక విధాలైన భావాలవల్ల కానీ, తనకు చెందినవారిని కలుపుకుని కానీ, కవి బహువచనాన్ని ప్రయోగించారు) అని "**మనవామహై**" అను బహువచనము వాధూల వీరరాఘవాచార్యస్వామివ్యాఖ్యలో వివరింపబడినది.

## శ్రీమన్నాథమునుల స్తుతి

**5. నౌమి నాథమునిం నామ జీమూతం భక్త్యవగ్రహే ।**
**వైరాగ్యభగవత్తత్త్వ జ్ఞానభక్త్యభివర్షుకమ్ ॥**

**ప్ర. అ. –** భక్తి– అవగ్రహే = భక్తి అనెడి తీర్థము దుర్లభమైన వానకు కఱవు ఏర్పడిన కాలమున, వైరాగ్య = లౌకిక విషయములందు ఆసక్తి లేకుండుట, భగవత్ తత్త్వజ్ఞాన = భగవానుని స్వరూప రూపగుణ విభూతుల జ్ఞానము, భక్తి = భగవద్భక్తి – అను వీనిని, అభివర్షుకం = అంతటను నిరంతరము వర్షించునట్టి, నాథమునిం నామ = నాథముని అని ప్రసిద్ధిచెందిన, జీమూతం = మేఘమును, నౌమి = నమస్కరించుచున్నాను.

**వరివస్య :–** యామునులకు ఆచార్యులగు శ్రీరామమిశ్రులను (మణక్కాల్ నమ్బి), వారి అచార్యులగు పుణ్డరీకాక్షులను (ఉయ్యక్కొణ్డార్) ను మనసున ప్రణమిల్లిన భట్టరు, ఈ శ్లోకమున తత్త్వవిదులలో అగ్రగణ్యులు, పూర్వాచార్యులలో ప్రథములు అగు నాథమునులను స్తుతించుచున్నారు.

"**నాథోపజ్ఞం ప్రవృత్తమ్**" (సం. సూర్యో, 2-48) (విశిష్టాద్వైతదర్శన సంప్రదాయం ఈలోకంలో నాథమునులనుండి ఆరంభమైనది) అని వేదాంతదేశికులు విశిష్టాద్వైతదర్శన ప్రవర్తకులైన ఆచార్యులలో నాథమునులు మొదటివారని స్తుతించిరికదా! నాథమునుల తండ్రి అగు ఈశ్వరభట్టారకులు తమ పుత్రునకు రంగనాథులను పేరు పెట్టిరి. రంగనాథులను పేరునకు సంగ్రహరూపమే నాథనామము. '**ముని**' అనునది గౌరవవాచకము. పేరును పూర్తిగా ఉచ్చరింపక, అందులో కొంత భాగము మాత్రమే ఉచ్చరించినను కార్యకరమగును – అను న్యాయమున, ఇచట రంగనాథ నామము సంగ్రహించి, నాథరూపమున స్మరింపబడినది. "**నాథ శ్చాసౌ ముని శ్చ**" అను కర్మధారయసమాసము చేసి, "ప్రపన్నకులమునకు నాథులును, భగవానుని ఎల్లప్పుడు మననము చేయువారును"– అను అర్థమును చెప్పవచ్చును. నాథనామము భక్తుల స్వాపేక్షితసిద్ధికొఱకు యాచనీయత్వమును,

స్వామిత్వమును బోధించును. **"స్వామిత్వం బ్రహ్మణి స్థితమ్"** (విష్ణుతత్త్వమ్) (సర్వస్వామి అయి ఉండే స్వభావం పరమాత్మలో స్థిరంగా ఉన్నది) ఇత్యాది ప్రమాణములవలన స్వాభావికమైన స్వామిత్వము భగవానునియందే అయినను, ఆ భగవానునకు అభిమతమగుటచే ఆచార్యశేషత్వమునకు దోషము లేదు. పాపకృతమైన అన్యశేషత్వమే విరుద్ధము. **"ఇద్దర్శనత్తుక్కు నాదనే ఎన్ఱు "మదుశూదనై యన్ఱి మఱ్ఱిలేన్"** **(తి. వా. 3-6-8) ఎన్ఱిరుక్కుమ్ మహాత్మక్కళాలే కొణ్డాడప్పడువారాయ్"** (ఈ దర్శనానికి నాథులు– అని "మధుసూదనుడు తప్ప వేరొకరిని శరణంగా కలిగినవాడను కాను" అనే నిశ్చయంతో ఉండే మహాత్ములచేత కీర్తింపబడేవారై) అని స్తోత్రరత్నము రెండవ శ్లోకములోని "నాథమునయే" అను పదమును వ్యాఖ్యానించుచు పెరియవాచ్చాన్ పిళ్లై పల్కుట ఇక్కడ గమనింపదగినది.

మునిశబ్దము ధ్యేయవస్తువును ఎల్లప్పుడు సాక్షాత్కరించుకొను స్థితిని కలవానిని తెలుపును. **"ఏదు శెయ్యిల్ మఱక్కేన్ మనమే?"** (పెరియ. తి. 9-33) (ఓ మనసా! ఏమి చేసిన భగవానుని నేను మఱతును?) అనునట్లు, భక్తిప్రేరితమైన, ప్రకృష్టమైన మననమును మునిశబ్దము తెలుపును.

నాథమునులు తను చరమదశలో ఒకనాడు విల్లంబులను ధరించిన ఇద్దరు పురుషులు, వారి వెంట ఒక స్త్రీ పోవుచున్నారని విని, వారు శ్రీరామలక్ష్మణులు, సీతాదేవియే – అని తలచి, వారికొఱకు వెదకుచు కానలేక, ఆ ఆర్తితోనే తమ జీవితమును చాలించిరను ఐతిహ్యము చరిత్రగ్రంథములలో ప్రసిద్ధము, నాథమునుల భగవద్ధ్యానము అంత గొప్పది.

ఆళ్వార్లకు పిమ్మట కొంత కాలమునకు ద్రావిడ వేదములు అదృశ్యరూపమును పొందినవి. తత్ఫలముగా లోకమున అజ్ఞానాంధకారము వ్యాపించెను. భగవానుని యథార్థమైన జ్ఞానము, భక్తి, వైరాగ్యము – అనునవి అంతటను కొఱవడెను. అట్టి క్లిష్టసమయమున శ్రీమన్నాథమునులు భూమిపై జన్మించి, నమ్మాళ్వార్లనుగూర్చి తపస్సును చేసి, వారి అనుగ్రహముతో

నాలాయిర దివ్యప్రబంధము అను మధుర భక్తి వాఙ్మయమును ఉపదేశముగా పొంది, దానిని లోకమున ప్రవర్తింపచేసిరి. మరల భగవత్తత్త్వజ్ఞానము, భక్తి, వైరాగ్యములను పుష్కలముగా వృద్ధి పఱచిరి. ఈ వృత్తాంతము సంప్రదాయచరిత్ర గ్రంథములందు సుప్రసిద్ధము. అంతేకాక, నాథమునులు న్యాయతత్త్వము మొదలైన సద్గ్రంథములను రచించిరని ప్రసిద్ధి. అట్లే, తమ సదుపదేశములతో కూడ లోకమున జ్ఞాన, భక్తి, వైరాగ్యములను అభివృద్ధి పఱచిరి.

ఇచట భగవద్భక్తిని తీర్థముతో పోల్చిన కవి, దానికి అనుగుణముగా ఆ భవద్భక్తిని నలు దెసల వర్షించిన నాథమునులను మేఘముతో పోల్చుట మిక్కిలి యుక్తమైనది. రమణీయమైనది. అట్టి నాథమునులను స్తుతించుచున్నాను – అని శ్లోకభావము.

"**అభివర్షుకమ్**" అనునపుడు "**అభి**" అను ఉపసర్గయొక్క బలముచే, నిరంతరము ధారారూపముగా జ్ఞానభక్తి వైరాగ్యములను వర్షించునది – అను అర్థము ద్యోతకమగును. జీమూత శబ్దమునకు "**జీవనం ముంచతి**" అను తాంత్రిక వ్యుత్పత్తి ఇక్కడ వివక్షితము. "**ణు – స్తుతౌ**" అను ధాతువుయొక్క లట్ రూపము "**నౌమి**" అని అగును. శ్రీరామానుజాచార్యవ్యాఖ్యలో "**వృష్టిరూపాయాః భగవద్భక్తేః అవగ్రహే ప్రతిబద్ధే సతి, వైరాగ్యం విషయవైతృష్ణ్యం, తత్త్వజ్ఞానం శ్రవణమననజన్యం సమ్యగ్ జ్ఞానం, వైరాగ్యం, భగవత్తత్త్వజ్ఞానం చేతి ద్వంద్వః, అనంతరం, తద్యుక్తా భక్తిరితి మధ్యమపదలోపిసమాసః, తస్య అభివర్షుకమ్**" (వృష్టిరూపమైన భగవద్భక్తి. అవరుద్ధమైనది కాగా, లౌకకవిషయాలలో ఆసక్తి లేకపోవడం అనే వైరాగ్యం, శ్రవణమనన జన్యమైన తత్వజ్ఞానం – అనే వీటితో కూడిన భగవద్భక్తిని వర్షించేవారు) అని వివరింపబడినది. కావున, నాథమునుల భక్తి వైరాగ్యతత్త్వజ్ఞానసహకృతమైనది. ఈ సందర్భమున –

"**నమో ఽ చింత్యాద్భుతా క్లిష్టజ్ఞానవైరాగ్యరాశయే,**

**నాథాయ మునయేఽ గాథ భగవద్భక్తిసింధవే"** (1)

(ఇటువంటివి – అని భావించటానికి సాధ్యం కానివి, ఆశ్చర్యకరమైనవి, సహజమైనవి అయిన జ్ఞానం, వైరాగ్యం అనే వీటికి రాశివంటివారు, అగాధమైన భగవద్భక్తి అనే జలానికి సముద్రంవంటివారు అయిన నాథమునులను నమస్కరిస్తున్నాను) అను స్తోత్రరత్నశ్లోకము, అచటి "**అత్ర ముముక్షూణాం చిత్తపరిష్కారభూతేషు గుణేషు ప్రాధాన్యతః త్రయ ఉపాత్తాః, తత్రాపి ప్రాధాన్యతమవ్యక్త్యై భక్తేః పృథగుక్తిః**" (ఇక్కడ, మోక్షాన్ని కోరేవారి చిత్తాన్ని సంస్కరించేవి అయిన ఆత్మగుణాలలో జ్ఞానం, భక్తి, వైరాగ్యం – అనేవి మూడు ప్రధానం కనుక, అవి ఇక్కడ ముఖ్యంగా చెప్పబడ్డాయి. ఈ మూడు గుణాలలో కూడా, భక్తి అనేది ఇంకా ప్రధానం కనుక, అది ప్రత్యేకంగా చెప్పబడింది) అను దేశికుల వ్యాఖ్యానసూక్తియు స్మరింపతగినవి.

ఆచార్యులను మేఘముతో పోల్చుట సత్సంప్రదాయసిద్ధము, ఈ సందర్భమున ఆచార్యహృదయము తృతీయప్రకరణములోని "**పూర్ణనాళ్ శీర్క్కడలై. కుణన్దికళ్ఞ్ కొణ్డల్ పోల్వారై మేఘమెన్నుమ్**" (155) (వర్షించడానికి తగిన కాలాలలో సముద్రంలో ప్రవేశించి, అందులో ఉండే నీటిని తాగి, –––– ఔదార్యమనే గుణంతో ప్రకాశించే మేఘంవంటివారైన ఆచార్యులను మేఘమని) అను సూత్రమిచట అనుసంధేయము. లోకోద్ధరణకొఱకు అంతటను సంచరించుట, అడుగకనే జీవనమును (నీటిని) వర్షించుట, అడిగిన దానికంటె అధికముగా ఇచ్చుట, హెచ్చుతగ్గులను (మిట్ట పల్లములను) లెక్క పెట్టుకుండుట, వర్షింపలేని సమయమున (సహాయపడలేనపుడు) వెల వెల పోవుట మొదలగు ధర్మములు మేఘమునకు, ఆచార్యులకును మధ్య సమానములు.

ఈ శ్లోకమున కూడ అలంకారము రూపకము. ఛందస్సు అనుష్టుప్.

మూడవ, నాల్గవ, అయిదవ శ్లోకములలో వరుసగా "భక్తియంత్రతః" అని, "**భగవద్భక్తే నేతారమ్**" అని, "**భక్త్యవగ్రహే జీమూతమ్**" అని భగవద్భక్తి

ప్రస్తుతింపబడుట గమనింప దగినది, వేదచోదితమై, ఆళ్వార్ల సాహిత్యముచే అభివృద్ధమైన భక్తిసంప్రదాయమును ప్రచారము చేయుటలో ఆచార్యులందరు చేసిన సేవ అమూల్యమైనది.

లోకమున నీటి కఱవును తీర్చి, ఉపయోగపడునది మేఘము. భగవద్భక్తిని లోకమున ప్రచారమొనర్చి, ఆ లోటును తీర్చిన నాథమునులను మేఘముతో కవి పోల్చుట సాభిప్రాయకము. లోకమున ఏర్పడిన భక్తికొఱతచే భగవానునకు ఆర్తి కల్గెను. భగవద్భక్తిని లోకమున నిరంతరముగా వర్షించి, ఆ తాపమును నాథమునులు తీర్చిరి. కావున, వారిని జీమూతముగా రూపించుట అనునది భక్తుల దృష్టిలోనే కాక భగవానుని దృష్టిలోకూడ అర్థవంతమే. రామానుజముని హరిని మాయాగ్రహమునుండి విముక్తుని చేయగా, నాథముని భక్త్యవగ్రహమువలన కల్గిన బాధనుండి భగవానుని కాపాడెను. బ్రహ్మసూత్రము తృతీయాధ్యాయములోని మొదటి పాదములో, రెండవ పాదములో కొంత భాగమున భగవదితరవిషయములలో చేతనునకు కలుగవలసిన వైరాగ్యముయొక్క ఆవశ్యకతను గూర్చి తెలుపబడినది. మిగిలిన రెండవ పాదమున భగవత్తత్త్వజ్ఞానము, మూడవ పాదమున భక్తిరూపవిద్యయు తెలుపబడినవి. కావున, కవి ఈ క్రమమును అనుసరించి "**వైరాగ్య——అభివర్షుకమ్**" అని పల్కిరని చెప్పవచ్చును – అను ఈ విశేషములు శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో తెలుపబడినవి.

## శ్రీశఠకోపముని స్తుతి

**6. ఋషిం జుషామహే కృష్ణతృష్ణాతత్త్వ మివోదితమ్ ।**
**సహస్రశాఖాం యో ఽ ద్రాక్షీ ద్ద్రావిడీం బ్రహ్మసంహితామ్ ॥**

**ప్ర. అ. –** యః = ఏ నమ్మాళ్వార్లు, సహస్రశాఖాం = వేయి శాఖలను కల్గిన, ద్రావిడీం = ద్రావిడభాషామయమైన, బ్రహ్మసంహితాం = ('తిరువాయ్ మొళి' అను) ఉపనిషత్తును, అద్రాక్షీత్ = దర్శించిరో, ఆ, ఉదితం = ఉదయించిన,

కృష్ణతృష్ణా తత్త్వం = కృష్ణుని యందు గల ప్రేమయొక్క రూపము, ఇవ = వలె ఉన్న, ఋషిం = నమ్మాళ్వార్లు అను మహర్షిని, జుషామహే = సేవించెదము.

**వరివస్య :–** ప్రపన్నజనకూటస్థులుగా స్తుతింపబడు నమ్మాళ్వార్లను భట్టర్ ఇందు స్తోత్రము చేయుచున్నారు. ఆళ్వార్లు అందరిలోను నమ్మాళ్వార్లు అంగి అని, మిగిలిన ఆళ్వార్లు అందరూ వారికి అంగభూతులు – అని శ్రీవైష్ణవసంప్రదాయము. కావున, నమ్మాళ్వార్లను స్తుతించినచో, మిగిలిన ఆళ్వార్లను అందరిని స్తుతించినట్లగును. మఱియు, **"వేదమ్ తమిழ் శెయ్ద మాఱన్"** (కణ్ణినుణ్ శిఱుత్తామ్బు తనియన్) (వేదాలను ద్రావిడ భాషలో అనువదించిన మాఱన్) అను ప్రశస్తిని పొందినవారు, నమ్మాళ్వార్లు. ఈ కారణము వలననే భట్టరు తాము రచించిన **"భూతం సరశ్చ"** అను గురుంపరాతనియను శ్లోకమున మొదట నమ్మాళ్వార్లను తప్ప, మిగిలిన ఆళ్వార్ల నామములను అనుసంధించి, పిమ్మట, చివరిగా **"శ్రీమత్పరాంకుశమునిమ్"** అని నమ్మాళ్వార్లను ప్రత్యేకముగా స్తుతించిరి. మఱియు, వారికి **"శ్రీమత్"** అను విశేషణమును చేర్చుట కూడ ఇచట గమనింపదగిన అంశము.

కృష్ణభక్తి తత్త్వమే మూర్తీభవించినట్లున్నవారును, భగవానుని విషయమున అవధి లేని భక్తిని కలవారును, **"ద్రవిడోపనిషత్"**అని పేరు పొందిన, సహస్రశాఖలను కల్గిన తిరువాయ్ మొళి అను దివ్యప్రబంధమును అనుగ్రహించినవారును అగు నమ్మాళ్వార్లు అను ఋషిని సేవింతును – అని శ్లోక భావము.

సంస్కృతవేదమున గల ఉపనిషత్తులలో అనేక శాఖలు కలవు. అట్లే, ద్రావిడ వేదమగు తిరువాయ్ మొళి ప్రబంధమునకూడ వేయి శాఖలు కలవు. ఈ విషయమును తెలుపగోరిన కవి **"సహస్రశాఖామ్"** అను విశేషణమును ప్రయోగించిరి. అనగా, తిరువాయ్ మొళిలోని ఒక్కొక్క పాశురము ఒక్కొక్క ఉపనిషత్ శాఖ – అని భావము. (సహస్రశబ్దము అనేకార్థకముకూడ.)

"**అద్రాక్షీత్**" అను క్రియాపదము భావస్ఫోరకము. భగవానుడు ఆ యా ఋషుల ద్వారా వేదశాఖలను లోకమున ప్రకాశింప జేసినట్లే, శఠకోపసూరి అనబడు నమ్మాళ్వారులద్వారా తిరువాయ్ మొళి అను తమిళవేదమును భగవానుడు లోకమున ప్రవర్తింప జేసెనని ఈ క్రియాప్రయోగము వలన వ్యక్తమగుచున్నది. అట్లే, తిరువాయ్ మొళికి గల వేదసామ్యమును తెలుపుటకై "**బ్రహ్మసంహితామ్**" అను పదము ప్రయోగింపబడినది. "**ద్రావిడీం బ్రహ్మసంహితామ్ అద్రాక్షీత్**" (ద్రావిడబ్రహ్మసంహితను) దర్శించెను) అని అనుటవలన, ద్రావిడవేదముయొక్క ప్రవాహనిత్యత్వము సూచింపబడినది. ఈ శ్లోకమును అనుసరించుచు వేదాంతదేశికులు పాదుకాసహస్రమున–

**"అమ్నాయానాం ప్రకృతి మపరాం సంహితామ్ దృష్టవంతమ్"** (4)

(తిరువాయ్ మొళి రూపంలోని, వేదంయొక్క వేరొక ప్రకృతిని దర్శించినవారు) అనుచు నమ్మాళ్వారుల ద్రావిడబ్రహ్మసంహితా సాక్షాత్కారమునుగూర్చి పల్కిరి.

ఋషి అనగా, అపూర్వార్థ దర్శనము చేయువాడని నిరుక్తము తెలుపుచున్నది. "**ఋషయః సత్యవచసః**" అని అమరకోశము. ఈ పదము "**ఋషీ – గతౌ**" అను ధాతువు నుండి పుట్టినది. గత్యర్థధాతువులన్నియు జ్ఞానార్థకములు కావున, సత్యమైన జ్ఞానమును దర్శించి, ఆ జ్ఞానమును లోకమునకు అందించువారు, ఋషులు – అని ఏర్పడుచున్నది. అట్టి ఋషులలో అగ్రేసరులు నమ్మాళ్వార్లు, ఎందులకనగా, వీరు భగవానుని నిర్హేతుకకృపవలన భగవత్తత్త్వమును పూర్ణముగా దర్శించినవారు. "**పొయ్యిల్ పాడల్ ఆయిరత్తుళ్**" (తి. వా. 4-3-11)(అసత్యం అనేది ఏమీ లేని వేయి పాశురాలలో) అని ఆళ్వార్లు స్వయముగా తమ సహస్రగీతిప్రబంధములో అసత్యమనేది ఏమీ లేదని పల్కిరికదా.

పూర్వశ్లోకమున నాథమునినిగూర్చి "**భక్త్యభివర్షుకం జీమూతమ్**"– భక్తిరసమును నిరంతరముగా వర్షించు మేఘమని వారిని పల్కిరి. అట్లు భక్తిని

వర్ణించుట అను కార్యమును భక్తిరసఘనములగు దివ్యప్రబంధములను వర్ణించుటద్వారా నిర్వహించిరి – అని ఇక్కడ భావము. దివ్యప్రబంధములను నాథముని యోగబలముచే నమ్మాళ్వార్లను సాక్షాత్కరింప జేసికొనుటద్వారా పొందిరి. నమ్మాళ్వార్లు వీనిని సాక్షాత్తు స్వయముగా దర్శించిరి. ఈ విశేషమును తెలుపుటకై కవి ఋషిశబ్దమును ప్రయోగించెను. ఋషులు సాక్షాత్ మంత్రద్రష్టలు కదా.

"**కృష్ణతృష్ణాతత్త్వమ్**" అనుటకు – రెండు విధములుగా అర్థమును చెప్పవచ్చును. లోకులను ఉద్ధరించుటలో సంపూర్ణముగా సఫలతను పొందలేని భగవానునియొక్క లోకరక్షణ తృష్ణయే నమ్మాళ్వారుల రూపమున అవతరించెనని చెప్పవచ్చును. లేక, కృష్ణుని విషయమున లోకములోని అందరియొక్క భక్తిరూపమైన తృష్ణ నమ్మాళ్వార్లుగా రూపొందెననియు చెప్పవచ్చును. ఈ రెండు వివరణములు "**కృష్ణస్య తృష్ణా, కృష్ణే యా తృష్ణా**" అను రెండు విగ్రహములవలన ఏర్పడుచున్నది. కలికాలవశముచే పరతత్త్వజ్ఞానము నెరుగని లోకులను రక్షింప నెంచిన సర్వేశ్వరుని కోరికయే నమ్మాళ్వార్లుగా అవతరించినదని మొదటి వివరణమునకు, సాక్షాద్భగవద్భక్తిస్వరూపమే నమ్మాళ్వార్లుగా రూపొందెనని రెండవ వివరణమునకు తాత్పర్యము. పూర్వము వ్యాసభగవానులు కలియుగప్రారంభమున పంచమ వేదమగు భారతసంహితను వేదార్థములను అందరును తెలిసికొనుటకై రచించెను.

**"స్త్రీశూద్రద్విజజంతూనాం త్రయీ న శ్రుతిగోచరా,**
**ఇతి భారతమాఖ్యాతం మునినా తు"**

(స్త్రీలకు, శూద్రులకు, జంతువులకు వేదాన్ని ఆధ్యయనం చేయడం సాధ్యము కాదు – అనే ఉద్దేశ్యముతో ఆ వేదసారాన్ని "**మహాభారతమ్**" అనే ఇతిహాసరూపముగా వ్యాసమహర్షి చేత రచింపబడింది) – అను ప్రమాణము ఈ విషయమును తెలుపుచున్నది. అట్లే, కలియుగాదిలో అవతరించిన నమ్మాళ్వార్లు జీవులనందరను ఉద్ధరింపనెంచి, ప్రపత్తిమార్గమును బోధించుచు,.

భగవానునియందు తమకు గల తృష్ణను తెలుపుచు, వేదార్థములను అందరకు అందించుచూ, పురాతనమగు వేదమును తిరువాయ్ మొళి రూపమున ప్రవర్తిల్లజేసెను – అని రామానుజాచార్యవ్యాఖ్యలో కలదు.

**"న జాతుః కామః కామానా ముపభోగేన శామ్యతి,**

**హవిషా కృష్ణవర్త్మేవ పునః భూయో ౭ భివర్ధతే"**

అగ్నిలో నేయి పోసినట్లయితే, ఆ అగ్ని చల్లారదు, సరిగదా, అది మరింత వృద్ధి చెంది, జ్వాలలు పైకి ఎగసి పడతాయి. ఆ విధంగానే, లోకమున విషయానుభవమువలన కోరికలు శమింపవు. మరింత వృద్ధిజెందును. ఆళ్వారుల భగవదనుభవముకూడ ఇట్టిదే. భగవానుని మానసానుభవమును పొందిన నమ్మాళ్వార్లు మరింత అనుబుభూషను పొందినవారై, పరితపించుట వారి ప్రబంధములలో సర్వత్ర కాననగును. కానీ, భేదమేమనగా, లౌకికతృష్ణ, అతత్త్వసంబంధిని; నమ్మాళ్వార్ల తృష్ణ తత్త్వసంబంధిని అగుట. వేదమంత్రములను దర్శించిన ఋషులు మంత్రప్రతిపాద్యదేవతలపట్ల నియతముగా అనురాగమును కల్గినవారు –అని చెప్ప వీలు లేదు. కాని, నమ్మాళ్వార్లు భగవదనురాగము మూర్తీభవించినవారు. మిగిలిన ఋషులందరు వేదసంహితలో ఏకదేశమును మాత్రమే దర్శించిరి. కాని, ఆళ్వార్లు సహస్రశాఖ అగు ద్రావిడసంహితను పూర్ణముగా దర్శించిరి. ఋషులు కర్మసంహితను దర్శింపగా, వీరు బ్రహ్మసంహితను దర్శించిరి. బ్రహ్మసంహిత అనునపుడు బ్రహ్మశబ్దమునకు భగవానుడు – అను అర్థము కాక, వేదము అను అర్థమును గ్రహింపవచ్చును. అప్పుడు ద్రావిడసంహితయొక్క వేదత్వము సిద్ధమగును – అను ఈ వివరణము శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో కలదు.

**"అద్రాక్షీత్ –ఎన్రైయాలుమ్, ఋషిమ్ – ఎన్రైయాలుమ్ తిరువాయ్ మొழிక్కు ప్రవాహతో నిత్యత్వమ్ సూచిప్పిక్కప్పట్టదు"** (**"అద్రాక్షీత్"** – దర్శించెను – అన్నందువల్ల, ఋషి అని అన్నందువల్ల, తిరువాయ్ మొழி ప్రబంధం ప్రవాహనిత్యత్వమును కలిగినది– అని సూచింపబడింది) అని

శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివారి వివరణము. "**జుషామహే**" అను క్రియారూపము "**జుషీ– ప్రీతిసేవనయోః**" అను తుదాదులలోని ఆత్మనేపది ధాతువునుండి పుట్టినది. ఆ ధాతువునకు గల – ప్రీతి, సేవించడం – అనే ఈ రెండర్థములును ఇచట వివక్షితములే. కావున, "**జుషామహే**" అనుటకు ప్రీతిపూర్వకముగా సేవింతుము – అని తాత్పర్యము.

ఇందులో అలంకారము – ఉత్ప్రేక్ష. అనుష్టుప్ ఛందస్సు

## శ్రీరంగనాయకి స్తుతి

**7. నమః శ్రీరంగనాయక్యై యద్భ్రూవిభ్రమభేదతః ।**
**ఈశేశితవ్యవైషమ్యనిమ్నోన్నత మిదం జగత్ ॥**

**ప్ర. అ. –** ఇదమ్ = ఈ, జగత్ = ప్రపంచము, యత్ = ఏ శ్రీరంగనాయకియొక్క, భ్రూ = కనుబొమల, విభ్రమ = విలాసములయొక్క, భేదతః = తారతమ్యముచే (మార్పుచే), ఈశ = పాలించువాడు, ఈశితవ్య = పాలింపబడవలసినవాడు – అను, వైషమ్య = వ్యత్యాసముచే, నిమ్న = పల్లముగా, ఉన్నతం = మిట్టగా అగుచున్నదో, అట్టి, శ్రీరంగనాయక్యై = శ్రీరంగనాయకికి, నమః = నమస్కారము (చేయుచున్నాను.)

**వరివస్య :–** నమ్మాళ్వారులను స్తుతించిన పిదప, గురుపరంపరా క్రమమునుబట్టి శ్రీరామమిశ్ర పుండరీకాక్ష విష్వక్సేనులను స్తుతింపవలసియున్నది. ఇచట ఆ స్తుతి లేకుండుటచే, దానిని కవి మానసికముగా నిర్వర్తించిరని చెప్పనగును. పిమ్మట, కవి శరణాగతుల కందరకు పురుషకారమును చేయు సకలజగన్మాత అగు శ్రీరంగనాయకిని ఈ శ్లోకమున నమస్కరించుచున్నారు. సేనాపతి వందనము 50 వ శ్లోకమున చేయబడుచున్నది.

పూర్వశ్లోకమున కృష్ణతృష్ణామయులగు ఆళ్వార్లు స్తుతింపబడిరి. ఇందు, అట్టి స్వభావమునే కలిగిన లక్ష్మీదేవి ప్రార్థింపబడుచున్నది. "**అకలకిల్లేన్**

**ఇఱైయుమ్ అగలేన్ఱు అలర్మేల్ మఙ్గై**" ("నిన్ను విడచిపెట్టి ఒక్క క్షణం కూడా ఉండలేను" అని అంటూ భగవంతుని వక్షస్సులో నిత్యవాసం చేస్తున్న పద్మావతీదేవి) (తి. వా. 6-10-10) కదా, శ్రీదేవి.

లోకమున కొందఱు సంపన్నులగుట, మరి కొందఱు దరిద్రులగుట – అనే తేడా కన్పించుచున్నది. అట్లే, కొందరు ప్రభువులై, మరి కొందఱు పాలింపబడువారై యుందురు. ఇట్లు లోకము నిమ్నోన్నతముగానున్నది. ఇట్లుండుటకు కారణమేమని ఆలోచింపగా, శ్రీరంగనాయకియొక్క భ్రూభంగమే ఇందులకు కారణము – అని తెలియుచున్నది. ఆమె అనుగ్రహమునకు పాత్రులైనవారు సంపన్నులై, అధికారులై యుండుట, ఆ కటాక్షమును పొందనివారు దరిద్రులై, పాలింపబడువారైయుండుట సంభవించుచున్నది. అట్టి శ్రీరంగనాయకికి నమస్కరించుచున్నాను – అని శ్లోకభావము.

పరాశరభట్టరు తాము రచించిన శ్రీగుణరత్నకోశమను లక్ష్మీస్తోత్రమున "**యద్భ్రూభంగాః ప్రమాణం స్థిరచరరచనాతారతమ్యే మురారేః**" (4) (మురారి అనబడే భగవానుడు చేసే చేతనాచేతనాల సృష్టిలోని తారతమ్యములో ఏ లక్ష్మీదేవియొక్క కనుబొమల కదలికలు ప్రమాణము అవుతున్నవో) అని పల్కుట ఇచట గమనింప దగినది. వీరి తండ్రిగారైన శ్రీవత్సాంకులును శ్రీస్తవమున "**యస్యా వీక్ష్య ముఖం తదింగితపరాధీనో విధత్తే ఽ. ఖిలమ్**" (1) (ఏ లక్ష్మీదేవియొక్క ముఖాన్ని చూచి, ఆమె మనసులోని అభిప్రాయాన్ని అనుసరిస్తూ, సమస్త లోకసృష్టిని భగవానుడు చేస్తున్నాడో) అని పల్కుటయు ఇచట స్మరణీయము.

ఈ సందర్భమున, లోకమున గల హెచ్చు తగ్గులకు శ్రీరంగనాయకి భ్రూభంగవ్యత్యాసమే కారణమనుట ఆమెయొక్క కృపావైషమ్యమును తెలుపుచున్నది. కాని, లక్ష్మీదేవి పూర్ణదయకు మారు పేరు కదా! ఇవి రెండును ఎట్లు పొసగును? అను శంక కలుగ వచ్చును. శ్రీరంగనాయకియొక్క భ్రూభంగినులలో అట్లు వ్యత్యాసమేర్పడుటకు ఆ యా ప్రాణులు చేయు కర్మల

హెచ్చుతగ్గులే హేతువులు కావున, పై శంకకు అవకాశము లేదు. పైన ఉట్టంకించిన శ్రీగుణరత్నకోశశ్లోకమును వ్యాఖ్యానించుచు, వాత్స్య శ్రీవీరరాఘవాచార్యులవారు వసురాశి అను తమ వ్యాఖ్యానమున ఇట్టి సమాధానమునే తెలిపిరి. అచటి పంక్తులిని **"శ్రీభూభంగతారతమ్యే తత్తత్ కర్మతారతమ్యం హేతు రితి, శ్రియో న వైషమ్యనైర్ఘృణ్యప్రసంగః"** (లక్ష్మీదేవి కనుబొమల కదలికలలో ఏర్పడే తేడాలకు కారణం– ఆ యా జీవులు చేసిన కర్మలలోని తారతమ్యమే కనుక, లక్ష్మీదేవి విషయంలో "ఆమె విషమస్వభావం కలిగినది అని, దయలేనిది" అనే దోషాలకు అవకాశం లేదు).

ఇచ్చట మరి ఒక శంక. శ్రీరంగనాయకి భ్రూభంగములలోని వ్యత్యాసమే సృష్టిలోని తారతమ్యమునకు హేతువైనచో, సర్వేశ్వరునకు నిరంకుశ స్వాతంత్ర్యము కలదనుట పొసగదు కదా! అను వేరొక ప్రశ్నయు ఇచట ఉదయింపవచ్చును. సర్వేశ్వరుడు లక్ష్మీదేని భ్రూవిలాసములనుబట్టి సృష్టిని చేయుననుట ఆమె విషయమున భగవానునకు గల ప్రేమాతిశయమును తెలుపునే కాని, భగవానుని పరాధీనతను తెలుపదని గ్రహింపనగును. ఈ సందర్భమున కవి ఇట్లు పల్కుటకు కారణము ఏమనగా, శ్రీరంగనాయకికి పురుషకారానుగుణమైన వాల్లభ్యము భగవానుని విషయమున కలదని తెలుపుట కొఱకే.

"**ఈశేశితవ్య**" మనుటకు మన ఆచార్యులు సరసమైన వేరొక అర్థమును దివ్యప్రబంధ వ్యాఖ్యానములలో తెలిపిరి. "**మైయ కణ్ణాళ్ మలర్మేల్ ఉఱై మార్బినన్**" (4–5–2) అను తిరువాయ్ మొళి సూక్తిని వ్యాఖ్యానించుచు, నమ్పిళ్లై, ఈడువ్యాఖ్యలో "**ఒరువన్ అழగియ మణవాళ ప్పెరుమాళా యిరుక్కిఱదుమ్, ఒరువన్ భిక్షుకనాయిరుక్కిఱదుమ్**" (ఒకడు అళగియ మణవాళ పెరుమాళ్ కావడం, ఇంకొకడు భిక్షుకుడుగా కావడం అనేది) అని, "**ఇవళ్ కటాక్షమిల్లామైయిలిటే. అల్లాతార్ విరూపాక్షరాకిఱదు**" (ఈమె కటాక్షం లేనందువల్లే కదా, మిగిలినవారు విరూపాక్షులు అవుతున్నారు) అని పల్కుట

స్మరింపనగును. లక్ష్మీదేవి కటాక్షము భగవానునిపై పూర్తిగా ప్రసరించుటచే, అతడు పుండరీకాక్షుడై, జగత్తునకంతటికి పాలకుడయ్యేను – అని భావము. కావుననే భగవానుని పరత్వచిహ్నములలో శ్రియఃపతిత్వమునకు మొదటి స్థానమీయబడినది. అందుచే, ఈ శ్లోకములోని '**ఈశ**' శబ్దముచే భగవానుడు నిర్దేశింపబడుచున్నాడని కూడ చెప్పనగును.

పెరియ తిరుమొళిలోని "**తిరువాౘ్ మార్బన్**" (7-6-7) అని మొదలగు పాశురమును వ్యాఖ్యానించుచు పెరియవాచ్చాన్ పిళ్లై "**స్వవ్యతిరిక్తరుడైయ వైశ్వర్యత్తుక్కు నిదానభూతైయాన పిరాట్టి**" (తనకంటే అన్యులైనవారి ఐశ్వర్యానికి కారణభూత అయిన లక్ష్మీదేవి) అని అనిరి. "**శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే**" (కారక, 3-3-11) (శ్రద్ధ అనే పేరుతో పిలువబడే లక్ష్మీదేవితో కల సంబంధం వల్ల దేవుడు దేవత్వాన్ని పొందుతున్నాడు) అని వేదముకూడ, శ్రద్ధారూపిణియైన లక్ష్మీదేవి వలన భగవానునకు దేవత్వసిద్ధి కల్గునని తెలిపెను కదా! భట్టరు శ్రీగుణరత్నకోశమున "**అపాంగా భూయాంసో యదుపరి పరం బ్రహ్మ తదభూత్**" (ఎవనిపై లక్ష్మీదేవి కటాక్షాలు పుష్కలముగా పడినవో, అతడు పరబ్రహ్మ అయినాడు) (30) అని పల్కిరి, కావున, ప్రస్తుతశ్లోకమున '**ఈశ**' శబ్దమునకు భగవానుడను. అర్థము చెప్పుటలో విప్రతిపత్తి ఏమీ లేదు.

"**తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా!**" (పెరి. తి. 7-7-1) (లక్ష్మీదేవికి కూడా లక్ష్మివంటివాడా!) అని తిరుమఙ్గైయాళ్వార్లు, "**కః శ్రీః శ్రియః**" (శ్రీదేవికికూడా లక్ష్మి అయినవాడు ఎవడు?) (12) అని యామునులు స్తోత్రరత్నమున, భగవానుడే లక్ష్మీదేవి సంపదకు మూలమని పల్కిరి కదా! మరి, లక్ష్మీసంబంధము వలన భగవంతునకు గొప్పతనము వచ్చునని చెప్పుట ఏమి? అని ప్రశ్నింపవచ్చును. లక్ష్మీదేవి భగవానుని ఐశ్వర్యమునకు మూలమని పల్కుట, ఆమె యొక్క మహిమను వర్ణించుటకొఱకే గాని, భగవానుని తక్కువ చేయుట కొఱకు కాదు. "**న హి నిందా న్యాయము**" చొప్పున ఇచట లక్ష్మీదేవియొక్క

మాహాత్మ్యమే వివక్షితము తప్ప, భగవానుని న్యూనతను చెప్పడంలో ఉద్దేశ్యము లేదు – అని గ్రహింపనగును.

శ్రీరంగరాజస్తవమున పలుచోట్ల భట్టరు శ్రీరంగనాథుని గొప్ప నటునిగ అభివర్ణించిరి. అందులకనుగుణముగా ఈ శ్లోకమున శ్రీరంగనాయకిని నటిగా అభివర్ణింపదలచి, "**యద్భ్రూవిభ్రమభేదతః**" అను ప్రయోగమును చేసిరని చెప్పనగును. ఆమె సమర్థురాలైన నటి అగుటచే భ్రూవిభ్రణనైపుణ్యమును కల్గినది. శ్రీరంగనాథుడుకూడ గొప్ప నటుడు. కావున, ఆమె భ్రూవిలాసములోని భేదమును గ్రహింప సమర్థుడు, లేక, "**ఇంగితజ్ఞా స్తు కోసలాః**" (కోసలదేశములో ఉండేవారు ఇతరుల మనసులలోని అభిప్రాయములను తెలుసుకొనగలిగినవారు) అను ప్రసిద్ధిచొప్పున, వీరిద్దరును కోసలదేశములో నున్నవారు కావున, శ్రీరంగనాయకియొక్క భ్రూవిభ్రమములలోని అంతర్యమును శ్రీరంగనాథుడు. గ్రహించెననియు చెప్పవచ్చును. లోకమున నాయకుని వ్యవహారములకు అన్నిటికి నాయిక భ్రూభంగములు ప్రమాణములనుట అనుభవసిద్ధమైన విషయము.

కొందఱి వాదము. ప్రకారము, ఈ ప్రపంచము భ్రమమూలము, కాని, మన సిద్ధాంతము ప్రకారము లక్ష్మీభ్రూవిభ్రమమూలము – అను రస్యమైన భావము ఇదట ధ్వనించుచున్నది.

"**ఈశేశితవ్య వైషమ్యనిమ్నోన్నత మిదం జగత్**" అనుటకు – "**ఈశ్వరో ఒ హమ్**" (భ. గీ. 16–14) (నేను ఈశ్వరుడను) అను దురభిమానము పతన హేతువు. కావున, నిమ్నత్వహేతువు, "నేను భగవానునిచే పాలింపబడవలసినవాడను" అను ఈశితవ్యభావము ఔన్నత్యహేతువు. ఇట్లు ఈశత్వము నిమ్నత్వమునకు, ఈశితవ్యము ఔన్నత్యమునకు కారణములు, కావున శ్లోకములో నిమ్నోన్నతపదములను యథాసంఖ్యముగా అన్వయింపవచ్చును – అను ఈ వివరణములు శ్రీ గోపాలాచార్యవ్యాఖ్యలో కలవు. 'ఈశేశితవ్యభేదేన' అను పాఠాంతరముకూడ కలదు.

**శ్రీరంగనాథుడొక చింతామణి**

**8. శ్రీస్తనాభరణం తేజః శ్రీరంగేశయ మాశ్రయే ।**
**చింతామణి మివోద్వాంత ముత్సంగే ౽ నంతభోగినః ॥**

**ప్ర. అ. –** శ్రీస్తన = శ్రీదేవిస్తనములకు, ఆభరణం = అలంకారమును, అనంతభోగినః = ఆదిశేషులయొక్క, ఉత్సంగే = ఒడిలో, ఉత్ వాంతం = వెడలగ్రక్కబడిన, చింతామణిమ్ ఇవ = చింతామణివలె నున్నవాడును, శ్రీరంగేశయం = శ్రీరంగమున పవళించినవాడును అగు, తేజః = పరంజ్యోతిని, ఆశ్రయే = ఆశ్రయింతును.

**వరివస్య :–** గురుపరంపరకు నాయకుడును, అందు చివరిగా అనుసంధింపబడువాడును అగు శ్రియఃపతిని కవి ఈ శ్లోకమున స్తోత్రము చేయుచు, ఆశ్రయించుచున్నారు. "**స చ ఆచార్యవంశో జ్ఞేయో భవత్యాచార్యాణామ్ అసా వసా విత్యాభగవత్తః**" (రహస్యామ్నాయః) ("వీరు, వీరు" అని భగవంతునివరకు ఉండే ఆచార్యపరంపర అంతా తెలియదగినది అవుతున్నది) అని కదా వేదము విధించినది.

భట్టరు ఈ స్తోత్రమును రచించుటలోని ముఖ్యోద్దేశ్యము ఏమనగా, ద్వయమంత్రముయొక్క అర్థమును వివరించుటయే. ఈ శ్లోకము ద్వయమంత్రములోని పూర్వఖండార్థమును సంగ్రహముగా ప్రతిపాదించు చున్నదనియు చెప్పవచ్చును. పూర్వశతకము ద్వయమంత్రములోని పూర్వఖండార్థమును ప్రతిపాదించుచున్నదను విషయము ఆ యా శ్లోకముల వ్యాఖ్యానమున వివరింపబడును, ఈ శతకమునకు కవి పూర్వశతకమని పేరు పెట్టుటలో ఉద్దేశ్యముకూడ అదియే. అట్లే, ఉత్తరశతకము ద్వయముయొక్క ఉత్తర ఖండములోని అర్థమును వివరించును.

మొదట తెలుపదలచిన విషయమును సంగ్రహముగా తెలిపి, పిమ్మట దానిని వివరించుట విజ్ఞులాచరించు ప్రక్రియ, కావున, భట్టరు ఆ క్రమములో ఇచట ద్వయమంత్రములోని పూర్వఖండముయొక్క అర్థమును సంగ్రహముగా

ప్రతిపాదించిరని చెప్పనగును. "**ఇష్టం హి విదుషాం లోకే సమాసవ్యాసధారణమ్**" (భార. ఆది. 1) (చెప్పదలచిన విషయాన్ని మొదట సంగ్రహంగా చెప్పి, తరువాత దానిని వివరించడం అనే క్రమం పండితులకు అభిమతమైనది కదా) అని కదా సూక్తి, తిరువాయ్ మొళి ప్రబంధంలోని ప్రమేయమును మొదటి పాశురము సంగ్రహముగా తెలియజేయుచున్నదని, మిగిలిన పాశురములన్నియు అ పాశురమునకు వ్యాఖ్యానప్రాయములని పూర్వాచార్యుల తలంపు, అట్లే, శ్రీవిష్ణుసహస్ర నామస్తోత్రములోని "**విశ్వమ్**" అను మొదటి నామముయొక్క వివరణమే మిగిలిన అన్ని నామములును – అని ప్రస్తుత గ్రంథకర్త అగు పరాశరభట్టరే "**భగవద్గుణ దర్పణం**" అనే పేరు కలిగిన తమ సహస్రనామస్తోత్ర వ్యాఖ్యానములో సెలవిచ్చిరి. కావున, చెప్పదలచిన విషయమును మొదట సంగ్రహముగా చెప్పి పిమ్మట విస్తరముగా చెప్పుట అనునది సత్సంప్రదాయమని ఏర్పడుచున్నది.

"**తేజసాం రాశి మూర్జితమ్**" (వి. పు, 1-9-67) (గొప్ప తేజస్సులయొక్క సమూహము) అని, "**తత్ శుభ్రం జ్యోతిషాం జ్యోతిః**" (ముణ్డక, 2-29) (తెల్లనిది అగు ఆ జ్యోతులకు జ్యోతి) అని, "**పరంజ్యోతి**" (గొప్ప జ్యోతి) అని వేదములు, ఇతిహాసములును, "**కుழுమిత్తేవర్ కుழாఙ్గళ్ కైతొழ చ్చోది వెళ్లత్తినుళ్ళే ఎழுవదోరురువు**" (తి. వా. 5-5-10) (నిత్యసూరుల సమూహములు గుంపులుగా చేరి, అంజలి చేయునట్లుగా, కాంతి ప్రవాహము నడుమ ఉజ్జ్వలమై వెలుగొందు అనిర్వచనీయమైన రూపము) అని, "**ఆది యమ్ శోది యురువు**" (తి. వా. 3-5-5) (జగత్ కారణ రూపమైన, అందమైన జ్యోతిఃస్వరూపము) అని ఆళ్వార్లు స్తుతించిన విధముగా, తేజఃపుంజమే రూపుదాల్చినట్లుండు సర్వేశ్వరుడు ఆదిశేషుల ఒడిలో ప్రకాశించుటను సేవింపగా, అతడు "ఆ ఆదిశేషుడు వెడల గ్రక్కిన చింతామణియా ఇది!" అనునట్లుండెను.

లోకములోని మణులు అలంకారములుగా ఉపయోగపడును. శ్రీరంగనాథుడను ఈ నీలమణి శ్రీదేవిస్తనములకు ఆభరణము. అట్టి శ్రీరంగనాథుని ఆశ్రయింతును – అని శ్లోకభావము.

ఆళ్వార్లు పలువురు భగవానుని మణిగా స్తుతించిరి, "**మణియై వానవర్ క్కణ్ణనై**" (తి. వా. 1-10-11) (మణివంటివానిని, నిత్యసూరులకు నిర్వాహకుని) అని నమ్మాళ్వార్లు, "**మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా!**" (తిరుప్పల్లాణ్డు-1) (చాణూరుడు, ముష్టికుడు అనే ఇద్దరు మల్లులను శాసించిన, బలమైన బాహువులను కలిగినవాడా! మణివంటివాడా) అని పెరియాళ్వార్లు, "**మాలే! మణివణ్ణా!**" (తిరుప్పావై-26) (భక్తుల విషయంలో వ్యామోహమే మూర్తీభవించినట్లు ఉండేవాడా! మణివర్ణుడా!) అని అణ్డాళ్ భగవానుని మణిగా పొగడిరి.

రత్నములలో మిక్కిలి శ్రేష్ఠమైన చింతామణి మనస్సున చింతించిన కోరికలను తీర్చుటలో శక్తి కల్గినది. కావుననే దానికట్టి పేరు కల్గినది. భగవానుడును "**సకలార్థప్రదో హరిః**" (అన్ని ప్రయోజనాలను ఇచ్చేవాడు హరి) అని ప్రసిద్ధుడు. అందువలన భగవానుడైన శ్రీరంగనాథుని భట్టరు ఇచట చింతామణిగా స్తుతించిరి.

"**శ్రీస్తనాభరణం తేజః**" అనునపుడు, "**శ్రీస్తనయోః ఆభరణమ్**" అను వివరణమే కాక, "**శ్రీస్తనౌ ఆభరణం యస్య తత్**" (శ్రీదేవి స్తనములు ఎవరికి ఆభరణమో, అతడు) అను వివరణమునుకూడ గ్రహింపవచ్చును. అపుడు, శ్రీస్తనములను ఆభరణములుగా కల్గిన తేజోరూపుడు, శ్రీరంగనాథుడు – అను భావము ఏర్పడును. భగవానుడు నిరతిశయభాస్వరుడు. స్వయంప్రకాశకుడు. అయినను, శ్రీసంబంధమువలన ఆ స్వామికి మరింత అధికమైన శోభ కల్గును. "**శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే**" (అంతకు ముందు ప్రకాశించని భగవానుడు లక్ష్మీసంబంధము వలన గొప్ప ప్రకాశమును పొందినవాడై పరతత్వం అవుతున్నాడు) అని వేదము, "**అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా**"

(రా. ఆర. 37–18) (ఆ సీతాదేవి ఎవరికి పత్నియో, ఆ శ్రీరాముని తేజస్సు ఇంతటిది అని లెక్క కట్టడానికి సాధ్యం కానిదికదా) అని వాల్మీకిభగవానులు పల్కిరికదా, "**తప్తకాంచనవర్ణాభా**"(లక్ష్మీదేవి పుటం పెట్టిన బంగారపు ఛాయవంటి ఛాయను కలిగినది), "**హిరణ్యవర్ణామ్**" (శ్రీసూక్తం) (బంగారపు రంగువంటి రంగును కలిగినది) అని బంగారురంగువంటి కమనీయవర్ణమును కల్గిన శ్రీస్తనములు భగవానుడను చింతామణికి ఆభరణమనుట "**రత్నం సమాగచ్ఛతు కాంచనేన**" (రఘువం. 5వ సర్గ) (రత్నం, బంగారంతో కలియుగాక) అని కాళిదాసు పల్కినట్లు, మణిబంగారముల కలయికవలె చాలా అందమైనది, పొగడదగినది – అని అనుటయే.

శ్రీరంగవిమానము ప్రణవాకారవిమానము. "**శ్రీరంగేశయమ్**" అని అనుటచే ప్రణవాంతఃస్థుడగు భగవానుడు స్మరింపబడెను. ఓంకారమున గల అకారముచే భగవానుడు, ఉకారముచే లక్ష్మీదేవి, నకారముచే జీవుడును నిర్దేశింపబడుచున్నారు. శ్రీరంగవిమానమున శ్రీవిశిష్టుడగు శ్రీరంగనాథుడు ఆదిశేషునిపై శయనించియున్నాడు. శ్రీరంగనాథుడు, లక్ష్మీదేవి, ఆదిశేషుడు – అను ఈ ముగ్గురును అకార, ఉకార, మకారములకు సంకేతములు. ప్రణవమున భగవానుని సర్వశేషిత్వము తెలుపబడినట్లే, శ్రీరంగవిమానమున శయనించియున్న శ్రీరంగనాథుని సర్వశేషిత్వము స్ఫుటముగా ప్రకాశించుచున్నది. కావున, శ్రీరంగవిమానము ప్రణవమనుట మిక్కిలి యుక్తము. "**శ్రీరంగేశయ**" మనుటచే జీవులందరు శ్రీరంగనాథుని ఆశ్రయింపగా, ఆ స్వామి శ్రీరంగమును ఆశ్రయించెను – అను చమత్కారము ఇచట ఏర్పడుచున్నది.

"**శ్రీరంగేశయ మాశ్రయే**" అనునపుడు, లోకమున నిద్రించుట అనాశ్రయణహేతువు. కాని, భగవానుని నిద్ర అట్టిది కాదు. "**ఉఱంగువాన్ పోల్ యోగు శెయ్ ద పెరుమాన్**" (నిద్రించువాని వలెకన్నులు మూసి కొని, జగద్రక్షణ చింతన రూపమైన యోగమును చేయువానిని) అనునట్లు, యోగనిద్ర కావున,

ఆశ్రయణోచితము – అను భావము స్ఫురించును. "**అనంతభోగినః**" అనుటచే, ఆదిశేషుడు తన ఒడిలో దివ్యదంపతులను కల్గియుండుటవలన అనంతమైన భోగమును కల్గియున్నాడను వ్యంగ్యము ప్రతీతమగునని శ్రీగోపాలాచార్య వ్యాఖ్యలో వివరింపబడినది.

ఈ శ్లోకమున, "**శ్రీస్తనాభరణం తేజః**" అని అనుట వలన శ్రీమత్పదార్థము, "**అనంతభోగినః ఉత్సంగే ఉద్వాంతం చింతామణిమ్**" అని అనుటవలన నారాయణపదార్థములైన స్వామిత్వము, భోగ్యత్వము, ఉపాయత్వము, ఉపేయత్వములును సూచింపబడినవి. అట్లే, "**శ్రీరంగేశయమ్**" అనుటచే వాత్సల్య, సౌశీల్య, సౌలభ్యాది ఆశ్రయణోచితగుణములు తెలుపబడినవి. "**ఆశ్రయే**" అను పదముచే ద్వయమంత్రం పూర్వవాక్యంలోని "**చరణౌ శరణమ్**" అను పదముల అర్థము, ఆక్షిప్తరూపమున, "**ప్రపద్యే**" అను పదముయొక్క అర్థము శాబ్దికముగాను చెప్పబడినది. ఇట్లు, ఈ శ్లోకమున ద్వయమంత్రములోని పూర్వార్ధముయొక్క భావము అనుసంధింపబడినదని చెప్పవచ్చును.

"**ఉద్వాంతమ్**" అనుటకు బదులు, "**ఉద్భ్రాంతమ్**" అను పాఠభేదము కనుపించుచున్నది. కాని, ఈ పాఠము పూర్వాచార్యులచే ఆదరింపబడలేదు. సరసమును కాదు. "**అమలనాదిపిరాన్**" అను దివ్యప్రబంధమున "**ఆలమామరత్తి నిలైమేల్**" (9) అను పాశురమున "**అరవినణైయాన్**" అనుచోట ఆఴ్రకియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ అనే ఆచార్యులు వ్యాఖ్యానించుచు, ఈ శ్లోకమును ప్రమాణముగా ఉట్టంకించిరి. అచటి పాఠము "**ఉద్వాంతమ్**" అనియే ఉన్నది. కావున "**ఉద్వాంతమ్**" అనునదియే ఆదరణీయమైన పాఠము – అని కాంచీ శ్రీ ప్ర, భ అణ్ణాస్వామి అభిప్రాయము.

వేదాంతదేశికులు "**భగవద్ధ్యానసోపానమ్**" అను స్తోత్రమున శ్రీరంగనాథుని "**చింతారత్నమ్**" (1) అనుచు స్తుతించుట ఇచట స్మరింపదగినది.

పరాశరభట్టరు ఇంతవరకు గురుపరంపరావందనమును చేసిరి. శ్రీవత్సాంకులతో ప్రారంభమైన గురుపరంపర సర్వేశ్వరునితో పూర్తి అయినది. భట్టరు అనుగ్రహించిన శ్లోకములలో 2, 7, 8, 50 సంఖ్య గల శ్లోకములు ఈనాటికిని గురుపరంపరావందనము చేయునప్పుడు ప్రపన్నులచే అనుసంధింపబడుట కవిపట్ల, వారు రచించిన శ్లోకముల పట్ల ప్రపన్నులకు గల ఆదరాతిశయమును తెలుపుచున్నది.

ద్వయమంత్రమును ఇతరులు జపహోమాదులకు వినియోగింతురు. కాని, మన పూర్వాచార్యులు మంత్రము యొక్క అర్థమును అనుసంధించి, తరువాతి తరమువారికి ఉపదేశించిరి. భట్టరు ఈ స్తోత్రమును అనుగ్రహించుటలోని పరమోద్దేశ్యమిదియే. ఈ సందర్భమున దేవరాజ గురువు అనే ఆచార్యులు అనుగ్రహించిన (శ్రీమణవాళ మహామునుల) **"పూర్వదినచర్యా"** అను స్తోత్రములోని–

**"మంత్రరత్నానుసంధాన సంతతస్ఫురితాధరమ్,**
**తదర్థతత్త్వనిధ్యానసన్నద్ధపులకోద్గమమ్"** (9)

(మంత్రరత్నం అనబడే ద్వయమంత్రాన్ని నిరంతరం అనుసంధించడంవల్ల కదలాడే అధరాన్ని కలిగినవారు, ఆ మంత్రరత్నంలో భాసించే అర్థంలోని తత్వాన్ని ఎల్లప్పుడూ మనసులో ధ్యానం చేస్తున్నందు వల్ల కలిగిన ఆనందం కారణంగా, శరీరంలో పులకలను కలిగినవారు అయిన వరవరమునులు) అను శ్లోకముయొక్క భావము స్మరింపదగినది.

## లక్ష్మీపదలాక్షైకలక్షణమే సర్వేశ్వరత్వచిహ్నము

**9. అస్తి వస్త్విదమిత్థంత్వప్రసంఖ్యానపరాఙ్ముఖమ్ ।**
**శ్రీమత్యాయతనే లక్ష్మీపదలాక్షైకలక్షణమ్ ॥**

**ప్ర. అ. –** ఇదమిత్థంత్వ ప్రసంఖ్యానపరాఙ్ముఖమ్ = ఇట్టి రూపమును కల్గినదని, ఇట్టి స్వభావముకల్గినదని తెలియుటకు వీలు కానిదియై, లక్ష్మీపద =

లక్ష్మీదేవియొక్క పాదములకు అలంకరింపబడిన, లాక్షా ఏకలక్షణమ్ = లత్తుకయే అద్వితీయమైన గుర్తుగా కల్గినదై యున్న, వస్తు = పరమాత్మ రూపమైన వస్తువు, శ్రీమతి = సంపదను నిండుగా కల్గిన, ఆయతనే = శ్రీరంగమున, అస్తి = ఉన్నది.

**వరివస్య :–** ఈ శ్లోకమునుండి మూడు శ్లోకములలో ద్వయమంత్రములోని పూర్వార్ధములో గల **"శ్రీమత్"** పదార్థము వివరింపబడుతున్నది. అందు, మొదటగా, ఈ శ్లోకమున, శ్రీమత్త్వము పరత్వచిహ్నమనుట తెలుపబడుచున్నది.

సర్వేశ్వరుని స్వరూప స్వభావములు ఇట్టివని తెలియుటకు సాధ్యము కానివి. అయినను, దివ్యదంపతుల విలాససమయములలో లక్ష్మీదేవి పాదములకు అలంకారమైన అత్తుకరసముయొక్క ముద్రలు భగవానుని శరీరముపై ముద్రింపబడును. అట్టి చిహ్నములే పరమాత్మను గుర్తించుటకు తగిన లక్షణములు. ఆ భగవానుడు అగు శ్రీరంగనాథుడు నిత్యము సంపదతో నిండియున్న శ్రీరంగమున నిత్యవాసము చేయుచున్నాడు – అని శ్లోకభావము.

ఈ శ్లోకమునుండి శ్రీరంగనాథుని స్తుతి ప్రారంభమగును. **"అస్తి"** అను పదముతో శ్లోకము ప్రారంమగుట స్తుతియొక్క మంగళప్రారంభమును సూచించును. **"అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా"** అని కాళిదాసు కుమారసంభవ కావ్యప్రారంభమును ఈ అస్తిపదప్రయోగముతో చేసెను. మఱియు, అకారము భగవద్వాచకము. కావున అకారముతో ఈ శ్లోకమును రచించుట మంగళకరమే అగును. **"అస్తి"** అను పదప్రయోగము **"ఆస్తీత్యేవోపలబ్ధవ్యః"** (భగవానుడు "ఉన్నాడు" తెలియదగినవాడు, అంటే, "ఎల్లప్పుడూ ఉన్నాడు" అని తెలియదగినవాడు) అను కఠవల్లీ సూక్తిని అనుసరించి చేయబడినదని చెప్పనగును. దీనినిబట్టి కఠవల్లి శ్రీరంగరాజవిషయకమనియు తెలియుచున్నది. మఱియు, కవి **"యద్విష్ణోః పద మతమః పరో రజో ఽ గ్ర్యమ్"** (తమోగుణమును లేనిది, రజోగుణమునకు దూరమైనది, గొప్పది అయిన ఏ విష్ణుపదం ముక్తులకు

మాత్రమే మిక్కిలి ప్రకాశించేదని విజ్ఞులు పలుకుతున్నారో) అని 26న శ్లోకమున పల్కుట దీనికి ఉపోద్బలకము. "**ఆస్తి**" అను పదప్రయోగమును చేయుటద్వారా కవి తన సత్తాలాభమును పొందెను – అని చెప్పవచ్చును. "**అస్తి బ్రహ్మేతి చేత్ వేద, సంత మేనం తతో విదుః**" (తై. ఉ.) (భగవత్తత్వం ఉన్నదని ఎవడు తెలుసుకుంటున్నాడో, అతనిని విజ్ఞులు సత్తను కలవానినిగా భావిస్తున్నారు) అని కదా శ్రుతి పలికింది. స్తుతికర్తకు సత్త సిద్ధింపనిదే స్తుతించుట సాధ్యము కాదు కదా.

ఈ శ్లోకమున, కవి, శ్రీరంగనాథుని '**వస్తు**' అను పదముతో నిర్దేశించుట ఒక విలక్షణమైన కవి సంప్రదాయము. ఇచట శ్రీరంగనాథుడను అర్థమిచ్చు విశేష్య పదమేమియు లేకున్నను, విశేషణపదముల బలముచే విశేష్యము ప్రతిపాదింపబడుట గమనింపదగినది. ఇటువంటి పదసన్నివేశమునే "**శ్రుతిమయమ్**" అని ఆరంభమగు గరుడస్తుతివిషయకమైన శ్లోకమునకూడా గమనించవచ్చును. శ్రీదేవి పాదములకు అలంకరింపబడిన లత్తుకరసము భగవానుని గుర్తించుటకు తగిన గుర్తు – అను భావమును ఈ కవియే తాము రచించిన శ్రీగుణరత్నకోశమను శ్రీరంగనాయకీస్తోత్రమున "**వేదాంతాః తత్త్వచింతాం. మురభిదురసి యత్పాదచిహ్నైః తరంతి**" (4) (వేదాంతాలు "**పరతత్వం ఏది?**" అనే పరామర్శను మురహరుడు అయిన భగవానుని వక్షస్సులో ఉండే లక్ష్మీదేవి పాదముద్రలను చూచి, "**ఇతడే పరతత్త్వ**" మని నిర్ణయం చేసుకొని ముగిస్తున్నాయో) అనుచు వ్యక్తపఱచిరి. ఇందువలన భగవానుని అసాధారణ లక్షణములలో ముఖ్యమైనదగు లక్ష్మీపతిత్వము ఇక్కడ చెప్పబడినది. ఈ లక్షణములోని ప్రాధాన్యమును గమనించియే మన పూర్వాచార్యులు అందరూ తమ గ్రంథముల ఆరంభములో భగవంతుని నిర్దేశించునప్పుడు, ఈ విశేషణమును ముందుగా ప్రయోగించుట కూడా ఇక్కడ స్మరించదగినది. ఈ శ్లోకమును. "**లక్ష్మీపదలాక్షైకలక్షణమ్, అత ఏవ ఇదమిత్థంత్వప్రసంఖ్యానపరాఙ్ముఖమ్**" అని అన్వయించుటద్వారా, పై అర్థము

స్పష్టపడుచున్నది. "**శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే**" (కారక, 3-3-11) (శ్రద్ధా అనే నామంతో పిలువబడే లక్ష్మీదేవితో కల సంబంధమువలన దేవుడు అయిన నారాయణుడు దేవత్వాన్ని పొందుతున్నాడు) అను వైదికవచనముయొక్క, "**అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా**" (రా. అర. 37-18) (ఆ జానకి, ఎవరికి పత్నియో, ఆ శ్రీరాముని తేజస్సు లెక్క కట్టడానికి సాధ్యం కానిది కదా) అను ఇతిహాసవచనముయొక్క భావమిచట, అనుసంధింపబడినదని చెప్పనగును.

"**శ్రీమత్యాయతనే ఆస్తే**" (శ్రీరంగ దివ్యాలయంలో ఉన్నాడు) అనుటచే – ఇతరులకు స్వయముగా తెలిసికొనుటకు సాధ్యము కాని మహిమను కల్గినవాడైనను, శ్రీరంగనాథుడు, తాను అందరికి అందుబాటులో నుండునట్లు శ్రీరంగమందిరమున నిత్యనివాసము చేయుచున్నాడు – అను భావము ఏర్పడి, దాని మూలముగా శ్రీరంగనాథుడు పరమకృపాళువు, పరమసులభుడు –అను విశేషము తెలియుచున్నది. కనుక, ద్వయమంత్ర పూర్వార్ధములోని "**శ్రీమత్**" పదముయొక్క అర్థము ఇచట "**లక్ష్మీప్రదలాకైకలక్షణమ్**" అనుట ద్వారా సూచింపబడినది – అనుట స్పష్టము.

"**తిరువిరుత్తమ్**" అను దివ్యప్రబంధములోని 34వ పాశురమున "**తన్ శీరడియాల్ ఉద్దైక్కిన్ఱ**" అను చోట నమిళ్ళై అనే పూర్వాచార్యులు వ్యాఖ్యానించుచు, "**ఇవళ్ కాల్పట్ట మణల్ పరతత్త్వమాకాదో!. అపాంగో భూయాంసః, లక్ష్మీపదలాక్షైకలక్షణమ్, జగజ్జన్మాదికళన్నుపోలే కాణుమ్ ఉపాస్యవస్తువుక్కు లక్షణమ్. అవళాలే ఇవనుక్కు ఉత్కర్ష మాకిల్, అన్యాయత్త మాకాదో? ఎన్నిల్, తన్నుడైయదాక వన్దదాకైయాలే అన్యాయత్త మాకాదు, పూ మణత్తాలే విలై పెత్తాలుమ్ అన్యాయత్త మాకాదిఱే. అవనుక్కు చ్చొల్లు ముత్కర్షమెల్లామ్ స్వతః వా ఇరుక్కుమ్, ఇవళుక్కు చ్చొల్లు ముత్కర్షమెల్లామ్ అవనుడైయ ప్రణయిత్వత్తాలే యిరుక్కుమ్**" (లక్ష్మీదేవి శ్రీచరణం సోకిన ఇసుకకూడ పరతత్త్వము కాదా! "**అపాంగో భూయాంసః**",

**"లక్ష్మీపదలాక్షైకలక్షణమ్"** అనే ప్రమాణాలు ఇక్కడ స్మరించదగినవి. జగజ్జన్మాదులు ఉపాస్య వస్తువునకు లక్షణములు కావు కాబోలు. లక్ష్మీసంబంధమే భగవంతునకు ఉత్కర్షను కలిగిస్తుంది కాబోలు. అయితే, ఆమె వలన భగవంతునకు ఉత్కర్షము కల్గుననిన, భగవంతుని గొప్పతనం అన్యాయత్తము కాదా! ఇతరుల వలన ఏర్పడినది కాదా? అనినచో, ఆమెకీ గొప్పతనము భగవానుని సంకల్పము వలన వచ్చినదగుటచే, భగవద్వైభవము అన్యాయత్తము కాబోదు. పరిమళమువలన పూవుకు వెల పెరిగినను, అ వెల అన్యాయత్తము కాదు కదా? కనుక, అతనికి చెప్పు ఉత్కర్షమంతయు స్వతఃసిద్ధమై యుండును. ఈమెకు చెప్పు ఉత్కర్ష మంతయు అతని ప్రణయిత్వకారణమై యుండును) అని వివరించుట ఈ సందర్భమున ఉట్టంకింపదగినది.

ఈ శ్లోకములోని **"అస్తి, వస్తు"**, అను పదములచే వైశేషికులు చేయు అసత్కార్యవాదము నిరాకరింపబడినట్లయిది. ఇంతకు ముందు ఏమియు లేకనే నూతనముగా కార్యము పుట్టునని వైశేషికుల సిద్ధాంతము. వేదాంతులు ఈ వాదమును అంగీకరింపరు. ఇంతకు ముందు ఉన్న వస్తువు వలననే కార్యము పుట్టునని వారందురు. దీనికే సత్కార్య వాదమని పేరు. ఈ విషయము పై రెండు పదములచే సూచింపబడినది. అట్లే, **"ఇదమిత్థంత్వ ప్రసంఖ్యానపరాఙ్ముఖమ్, లక్ష్మీపదలాకైకలక్షణమ్"** అనుటచే నిర్విశేషమైన సన్మాత్రమే బ్రహ్మము – అను అద్వైతులు చేయు వాదముకూడ ఇచట తిరస్కరింపబడినది. కావున, విశిష్టమైన సత్తే పరతత్త్వమను విశిష్టాద్వైతసిద్ధాంతమిచట సూచింపబడినదని చెప్పనగును.

లోకమున బాహ్యావస్తువుల ప్రతీతి **"ఇదమ్ ఇత్థమ్"** (ఇది, ఇట్టిది) అను విధముగానుండును. ప్రత్యగాత్మ అగు భగవానుని అట్లు తెలిసికొనుట సాధ్యము కాదు. **"ప్రతీపమ్ అంచతి ఇతి ప్రత్యక్"** (ఇంద్రియములకు, మనస్సునకు అందకుండ పోవునది, కనుక, ప్రత్యక్ అనబడుతున్నది) అను ప్రత్యక్ శబ్దవ్యుత్పత్తి ఈ విషయమును తెలుపుచున్నది. లోకములో

బాహ్యేంద్రియములకు కనిపించు వస్తువుల కంటే సర్వథా విలక్షణుడగుటచే భగవానుడు "**ఇట్టివాడు కాదు, ఇట్టివాడు కాదు**" అని పర్యుదాస ప్రక్రియలో మాత్రమే చెప్పసాధ్యమగును. ఈ భావము "**ఇదమిత్థంత్వ ప్రసంఖ్యానపరాఙ్ముఖమ్**" అనుటచే ఏర్పడుచున్నది. వేదములుకూడ "నేతి నేతి" (భగవానుడు ఇంత మాత్రమే కాదు, ఇంత మాత్రమే కాదు) అని పర్యుదాస ప్రక్రియలోకదా పల్కినవి. యోగశాస్త్ర ప్రసిద్ధమైన, ప్రసంఖ్యానము అను శబ్దమునకు యోగాభ్యాసజన్యజ్ఞానము – అని అర్థము. కావున, భగవత్స్వరూపము యోగులకు దుర్విజ్ఞేయము – అని భావము. ప్రత్యక్ పరాఙ్ముఖము అగుచున్నదనుటచే అర్థమున చమత్కారమైన విరోధము తోచుచున్నది. అంతరవస్తువగు పరబ్రహ్మ "**ఇదమ్ ఇత్థమ్**" అను బాహ్యప్రతీతికి దూరము – అనుటచే ఆ విరోధము తొలగుచున్నది. అందువలన ఇక్కడ విరోధాభాసాలంకారము ధ్వనించుచున్నది. ఆంతరచక్షువునకే పరబ్రహ్మ సాక్షాత్కరించును. బాహ్యచక్షువునకు అతడు పరాఙ్ముఖుడు, కావున ప్రత్యక్ అనునది "**తాదృక్తదీదృగిద మిత్యుపవర్ణయంత్యో వాచో యదీయవిభవస్య తిరస్క్రియాయై**" (43) ("భగవానుడు అటువంటివాడు, ఇటువంటివాడు" అని వర్ణించే వాక్కులకు భగవానుని వైభవం అందనిది) అని కూరేశులు వైకుంఠస్తవమున పల్కుట ఇచట స్మరణీయము.

ఓంకారము పరబ్రహ్మయొక్క ఆయతనముగా ఉపనిషత్ ప్రసిద్ధి కలదు. "**ఏతద్వై సత్యకామ! పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః తస్మా ద్విద్వాన్ ఏతేనైవాయతనే నైకతర మన్వేతి**" (5-2) (ఓ సత్యకామా! ప్రణవంచేత చెప్పబడే బ్రహ్మం పరమని, అపరం అని రెండు విధాలు. ఈ విధంగా తెలిసినవాడు ఈ ఓంకారం ద్వారా ఈ రెండు విధాలైన బ్రహ్మలలో ఒక దానిని పొందుతున్నాడు) అనే ప్రశ్నోపనిషత్ వాక్యము ఇందులకు ప్రమాణము. ప్రస్తుత శ్లోకములోని ఆయతనశబ్దము శ్రీరంగవిమానము ప్రణవాత్మకము అను విషయమును సూచించుచున్నది ఈ సందర్భమున "**శ్రీమత్యాయతనే విష్ణోః శ్యే**

**నరవరాత్మజః**" (రా. అయో. 6-4) (దశరథుని కుమారుడైన శ్రీరాముడు విష్ణువుయొక్క దివ్యాలయంలో శయనించాడు) అను శ్రీరామాయణశ్లోకము స్మరింపదగినది. అదృశ్యమును, దుర్దర్శమగు వస్తువు మాతృవాల్లభ్యముచేత దర్శింపసాధ్యమగును, పురుషసూక్తములోని "**హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ**" (పురుష శబ్దవాచ్యడవైన ఓ భగవన్! నీకు హ్రీః అనే పదం చేత చెప్పబడే భూదేవి, లక్ష్మీదేవి పత్నులు) అను శ్రుతిలో ఎవడు లక్ష్మీదేవికి వల్లభుడో, అతను పురుషసూక్తమున సర్వకారణము– అని వర్ణింపబడిన పరబ్రహ్మ, ఎవడు పురుషసూక్తమున సర్వకారణముగా ప్రసిద్ధుడో అతడు శ్రియఃపతి – అను లక్ష్మీపతిత్వ కారణత్వసామానాధికరణ్యముచే. లక్ష్మీపతిత్వము పరబ్రహ్మలక్షణమని తెలియుచున్నది. సుదర్శన పాంచజన్యములు శ్రీవైష్ణవలక్షణములు అయినట్లే లక్ష్మీదేవిపాదలాక్షాంకములుకూడా పరమాత్మలక్షణములు.

"**లాక్షా**" శబ్దము లత్తుకనే కాక, లక్కను కూడ తెలుపును. లోకమున ముద్రలను వేయువారు లక్కను ఉపయోగింతురు కదా. విష్ణుసహస్రనామములోని "**సర్వలక్షణలక్షణ్యః**" అను నామమును వ్యాఖ్యానించు భట్టరు "**సాక్షాత్ లక్ష్మీసతతాలింగనాదిసూచకైః సర్వైః లక్షణైః లక్షణే సాధురితి సర్వలక్షణలక్షణ్యః**" (సాక్షాత్తుగా లక్ష్మీదేవి ఎల్లప్పుడూ భగవానుని ఆలింగనం చేసుకుంటుంది – అనే విషయాన్ని సూచించే అన్ని లక్షణాలతో చక్కగా కూడినవాడు కనుక, పరత్వలక్షణాన్ని చక్కగా కలిగినవాడు, విష్ణువు సర్వలక్షణలక్షణ్యుడు) అని నుడువుట ఇచట స్మరణీయము. "**లక్ష్మీపదలాక్షైకలాంఛనమ్**" అను వేఱొక పాఠమును కలదు.

## శ్రీరంగనాథుడొక తుమ్మెద నా మనసులో విహరించాలి

**10. లక్ష్మీకల్పలతోత్తుంగస్తనస్తబకచంచలః ।**
**శ్రీరంగరాజభృంగో మే రమతాం మానసాంబుజే ॥**

**ప్ర. అ. –** లక్ష్మీ = లక్ష్మీదేవి అనెడి, కల్పలతా = కల్పలతయొక్క, ఉత్తుంగ = మిక్కిలి. ఉన్నతములయిన, స్తన = స్తనములనెడి, స్తబక = గుత్తుల యందు, చంచలః = మిక్కిలిగా చలించునట్టి, శ్రీరంగరాజ = రంగనాథుడను, భృంగః = తుమ్మెద, మే = నాయొక్క, మానసః = మనస్సు అనెడు, అంబుజే = పద్మమున, రమతాం = క్రీడించు గాక!

**వరివస్య :–** ఈ శ్లోకమున శ్రీరంగనాథుని తుమ్మెదగా, శ్రీదేవిని కల్పలతగా, ఆమె స్తనములను ఆ లత మొగ్గల గుత్తులుగా కవి రూపించుచున్నారు.

తుమ్మెద పూల గుత్తులయందు తిరుగాడును. అట్లే, శ్రీరంగనాథుడను తుమ్మెద శ్రీరంగనాయకి అను కల్పలతయొక్క స్తనములనబడు పూల గుత్తులలో తిరుగాడును. అట్టి శ్రీరంగరాజభృంగము నా మనస్సు అను పద్మమున స్థిరముగా నిలచి క్రీడించును గాక! – అని శ్లోకభావము.

గోదాదేవి తిరుప్పావై అను దివ్యప్రబంధమున 19వ పాశురములో **"నప్పిన్నై కొజ్గై మేల్ వైత్తుక్కిడన్ద మలర్ మార్బా!"** (లక్ష్మీదేవి స్తనములపైయున్న, వికసించిన వక్షఃస్థలమును కలవాడా!) అనుచు శ్రీకృష్ణభగవానుని సంబోధించెను. ఆ భావమును ఇచట కవి అనుసంధించిరవి చెప్పనగును. సాధారణముగా తుమ్మెద వికసించుటకు సిద్ధముగానున్న పూల మొగ్గలను చూచినపుడు, వాని చుట్టు తిరుగుచుండును. కాని, వికసించిన పూవులో స్థిరముగా నిలచి యుండును. అట్లే, శ్రీరంగనాథుడను తుమ్మెదకూడ వికసించిన తామరపూవువంటి నా మనస్సున నిలచి క్రీడించుగాక – అను హృద్యం అయిన తాత్పర్యము **"స్తనస్తబకచంచలః శ్రీరంగరాజభృంగో మే మానసాంబుజే రమతామ్"** అను పదాల అన్వయముతో ఏర్పడుచున్నది.

సంస్కృతమున స్తబకమను పదము వికసించుటకు ఉన్ముఖముగా నున్న మొగ్గను కూడా తెలుపును, **"స్యా దుత్సుక స్తు స్తబకః"** అని అమరకోశము. మరియు, మనస్సును (మహాత్ముల మనస్సులను) పద్మముతో పోల్చుట

కవిసమయము, "**స్తనస్తబక**" అను పదస్వారస్యముచే "**యువా ఽ కుమారః**" (ఋ. – అష్ట, 2–8–25) (సదా కౌమారదశను దాటినవాడు, యౌవనదశ ప్రారంభంలో సదా ఉండేవాడు, భగవానుడు) అని "**అరుమ్బినై యలరై**" (పెరి. తి. 7–10–1) (మొగ్గవంటివాడు, పువ్వువంటివాడు) అని చెప్పబడు భగవానుని నిత్యయౌవనప్రారంభదశావిశేషమునకు తగిన వయస్సు, అభిరూప్యము లక్ష్మీదేవికిని కలదను విశేషార్థ మిచట వ్యక్తమగుచున్నది. భగవానుడు ఎవరికైనను పొంద శక్యము కానివాడే అయినను, లక్ష్మీదేవి చేయు పురుషకార (సహాయ)మువలన మన మనస్సులలో నిత్యము నిలచియుండుగాక! అతడు మనలను అనుగ్రహించు గాక! – అను విశిష్టమైన భావము ఈ శ్లోకమున ఏర్పడుచున్నది.

ముందు శ్లోకములో "**శ్రీమత్యాయతనే ఆస్తే**"(శుభకరమైన దేవాలయంలో ఉన్నాడు) అని, ఇచట "**మే మానసే రమతామ్**" (నా మనస్సులో ఆనందించాలి) అని అనుటవలన, దివ్యదేశములలో భగవానుడు అర్చామూర్తిగా వేంచేసి యుండుటలోని ఆంతర్యము పరాశరభట్టర్ వంటి మహనీయుల మనస్సులలో స్థిరనివాస మేర్పరుచుకొని, ఆనందించుట కొఱకేనను విశేషార్థముకూడ ఈ సందర్భమున కల్గుతున్నది. ఆళ్వారులు, మన పూర్వాచార్యులు ఇట్టి అభిప్రాయమునే పలు చోట్ల వెలిబుచ్చిరి.

సుకుమార స్వభావమును, రూపమును కలిగిన స్త్రీలను, అటువంటి స్వభావమును రూపమును కల లతతో పోల్చుట కవి సంప్రదాయము. కావున, కవి ఇచట లక్ష్మీదేవిని కల్పలతతో పోల్చెను. ఈ కవియే "**శ్రీగుణరత్న కోశ**" మను తాము రచించిన వేరొక స్తోత్రమున "**లక్ష్మీకల్పవల్లీ**" (3) అనుచు లక్ష్మీదేవిని కల్పలతగా రూపించిరి.

కల్పమనగా సామర్థ్యము, పురుషకార సామర్థ్యమును కల లక్ష్మీదేవిని కవి కల్పలతతో పోల్చుట మిగుల సరసము, సార్థకమును. ఈ శ్లోకమున అలంకారము రూపకము. ఛందస్సు అనుష్టుప్.

ఆకర్షణీయమైన నీలవర్ణమును కల్గియుండుట, భృంగమునకు భగవానునకు మధ్య గల సామ్యములలో ఒకటి. తుమ్మెద వికసించిన పూలలోని మకరందమును గ్రోలి, అచటనే నిదురించును. అట్లే, సర్వేశ్వరుడును మహాత్ముల మనస్సులలో గల భక్తిచే ఆకర్షింపబడి, అచట స్థిరముగా నుండును. తుమ్మెదకు షట్పదమని పేరు కలదు. భగవానుని మహత్త్వమును ప్రతిపాదించు మంత్రములలో గొప్పది, మన పూర్వాచార్యులందరు ఆదరించినది అగు ద్వయమంత్రమున ఆఱు పదములున్నవి. కావుననే పరాశరభట్టరు అష్టశ్లోకిలో **"షట్పదో ఽ యమ్"** (5) అని పల్కిరి. శ్రీశంకరాచార్యులవారు రచించిన షట్పదీస్తోత్రము ద్వయార్థ ప్రతిపాదకమగుటయు ఇచట స్మరింపదగినది.

తుమ్మెద, ఎచటను స్థిరముగా నిలచి యుండక, ఎల్లప్పుడును అటు ఇటు సంచరించుటచే, దానికి చంచరీకమని పేరు కల్గినది. అట్లే, భగవానుడు. లక్ష్మీస్తనస్తబకచంచలుడు కదా! తుమ్మెదను ఆళ్వార్లు పలుచోట్ల ఆచార్యులకు సమానముగా వర్ణించిరి. భగవానుడు ఆచార్యపరంపరలో మొదటివాడు. **"లక్ష్మీనాథసమారంభామ్. వందే గురుపరంపరామ్"** అని ప్రతిదినము పెద్దలు అనుసంధించుకొందురు కదా! **"అలతి భూషయతి పద్మాదికమ్"** అను వ్యుత్పత్తిని బట్టి పద్మములు మొదలగు పూలకు తుమ్మెద అలంకారమగును. –తెలియచున్నది. కావున, తుమ్మెదకు **"అళి"** అని పేరు. భగవానుడు లక్ష్మీదేవికి అలంకారము, తుమ్మెద పూలలోని మకరందమును ఆస్వాదించును. అట్లే, భగవానుడును లక్ష్మీదేవి అను పూవును ఆస్వాదించును. **"పుష్పావలీవ రసికభ్రమరోపభుక్తా"** (రసికమైన తుమ్మెద చేత పూర్తిగా అనుభవింపబడిన పూల సమూహంవలె) (45) అని ఈ కవియే శ్రీగుణరత్నకోశమున లక్ష్మీదేవిని పుష్పావళిగా, శ్రీరంగనాథుని రసికభ్రమరముగా స్తుతించిరి. ఇట్లు పలు విధములలో తుమ్మెదకు, భగవానునకు సామ్యముండుటచే భట్టరు ఇచట శ్రీరంగనాథుని తుమ్మెదగా రూపణము చేసిరి.

ఇట్లు భట్టరు భగవానుని తుమ్మెదగా స్తుతించుట నమ్మాళ్వారులు తిరువాయ్– మొళిప్రబంధంలో "**తూవి యమ్ పుళ్లుడై దెయ్ వ వండు**" (9. 9–4) (అందమైన గరుత్మంతుని వాహనముగా కలిగిన దైవభ్రమరము) అని సర్వేశ్వరుని దైవభ్రమరముగా వర్ణించుటనుబట్టి – అని చెప్పనగును. "**శ్రీరంగరాజభృంగో మే మానసాంబుజే రమతామ్**" అనుటవలన చేతనలాభము, అందువలన కలుగు ఆనందము భగవానునిదే – అను తత్త్వవిశేషము స్ఫురించుచున్నది.

శ్రీరంగనాథభృంగము లక్ష్మీస్తనస్తబక చంచలుడగుట శ్రీగోపాలాచార్య వ్యాఖ్యానమున ఈ విధముగా అందముగా వివరింపబడినది.

తన వద్దకు వచ్చిన శ్రీరంగనాథుని, లక్ష్మీదేవి, తమ పుత్రుడగు పరాశరభట్టరు మానసాంబుజమున క్రీడించుటకై ప్రేరేపించును. "**స్త్రీప్రాయ మితరత్ సర్వమ్**" (భగవంతుని కంటే మిగిలిన జీవులు అందరూ స్త్రీలవంటివారే) అను క్రమమున భట్టరుకును స్త్రీత్వము ఉన్నను, లక్ష్మీదేవి వారి విషయమున, తన స్తనములయందు, బాహువులయందువలె అభిమానమును కల్గియున్నదగుటచే, ఆమె నాథుని అట్లు ప్రోత్సహించును. కావున శ్రీరంగనాథభృంగము చంచలము, లక్ష్మి చంచల. కావున, భర్తకూడ ఇట్లు చంచలుడగుట ఆమెకు ప్రియమే అగును కాబోలు!. "**చంచలాయాః శ్రియః భగవద్భృంగచాంచల్యే రసః స్యాత్ ఇతి చాంచల్యవర్తన మివ**" అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్యానసూక్తి. "**భ్రమర! కితవబంధో! మా స్పృశాంఘ్రిం సపత్న్యాః కుచవిలులితమాలా కుంకుమశ్మశ్రుభిః నః**" (మోసగాళ్లకు బంధువైన ఓ తుమ్మెదా! సపత్నుల స్తనాలలో చెదరిన మాలికల పుప్పొడి అంటుకున్న నీ మీసాలతో మా పాదాలను అంటకు) అనుచు భ్రమరగీతలలో గోపాలభృంగము వేరొక స్త్రీని రమించుటవలన కల్గిన అసూయచే గర్హింపబడినది. కాని, ఇచట శ్రీరంగరాజభృంగమును లక్ష్మీదేవియే స్త్రీప్రాయమగు కవియొక్క హృదయపుండరీక విహరణార్థము ప్రోత్సహించుట గోపాలభృంగమునకు కంటె శ్రీరంగనాథభృంగమునకు కల భాగ్యాధిక్యమును

తెలుపుచున్నది. "**శ్రీసహితః రంగరాజః శ్రీరంగరాజః**" అను వివరణమువలన లక్ష్మీస్తనస్తబకములలో కేవలము శ్రీరంగరాజభృంగము మాత్రము విహరింపగా, నా హృదయపుండరీకము దివ్యదంపతులు ఇద్దరును విహరించుట – అను అదృష్టమును పొందినది – అను వ్యంగ్యము భాసించుచున్నది.

## శ్రీరంగనాథుడు మనకు ఎల్లప్పుడూ మంచిని అనుగ్రహించాలి

**11. స్వస్తి శ్రీస్తనకస్తూరీమకరీముద్రితోరసః ।**
**శ్రీరంగరాజా చ్ఛరదశ్శత మాశాస్మహే తరామ్ ॥**

**ప్ర. అ. –** శ్రీ = లక్ష్మీదేవియొక్క, స్తన = వక్షోజములయందు, కస్తూరీ = కస్తూరిచే వ్రాయబడిన, మకరీ = మకరి (ఆడుచేప) ఆకారమున అలదబడి, పత్రరేఖచే అంకితమైన, ఉరసః = వక్షఃస్థలమును కలవాడగు, శ్రీరంగరాజాత్– = శ్రీరంగనాథుని వలన, స్వస్తి = శుభమును, శతం శరదః = నూరేండ్లు (చిరకాలము), ఆశాస్మహే తరామ్ = మిక్కిలి ఆశింతుము.

**వరివస్య :–** ద్వయమంత్రము పూర్వఖండములోని "**శ్రీమత్**" అనే మొదటి పదముయొక్క అర్థమును విశదీకరించు మూడు శ్లోకములలో ఇది చివరిది.

ఇంతకు ముందు శ్లోకములలో దివ్యదంపతులు వేరు వేరుగా స్తుతింపబడిరి. ఇందు కవి ఆ ఇద్దరివలన ఆశీస్సును అభిలషించుచున్నారు. పంగునిమాసమున ఉత్తరానక్షత్రమున శ్రీరంగనాయకీ శ్రీరంగనాథులు కలసియున్న సందర్భమున, భగవద్రామానుజులు గద్యత్రయమును విన్నపించుట, లక్ష్మణుడు "**సీతాసమక్షం కాకుత్స్థః**" (రా. అయో. 15–6) (సీతాదేవి సమక్షములో లక్ష్మణుడు శ్రీరాముని శరణాగతి చేశాడు) అని శ్రీరాముని సీతాసమక్షమున ప్రార్థించుటయు ఇచట స్మరణీయములు.

శ్రీరంగనాథుడు లక్ష్మీదేవిని ఆలింగనము చేసికొనునపుడు, ఆమె వక్షఃస్థలమున అలంకారార్థము ఆడుచేప ఆకారమున వ్రాయబడిన కస్తూరి, ఆ

స్వామి హృదయప్రదేశమున ముద్రింపబడును. ఆ ముద్రలు స్వామికొక అపురూపమైన శోభను చేకూర్చును. అట్టి శ్రీరంగనాథుని వలన మనకు చిరకాలము శుభము కల్గునుగాక! – అని శ్లోకభావము.

ఈ శ్లోకమున కూడ "**శ్రీస్తనకస్తూరీమకరీముద్రితోరసః శ్రీరంగరాజాత్ శరదశ్శతమ్ స్వస్తి ఆశాస్మహే తరామ్**" (లక్ష్మీదేవి స్తనములలో అలంకరింపబడిన కస్తూరి మయమైన ఆడు చేపల గుర్తులను కల వక్షస్సును కలవాడైన శ్రీరంగనాథునివల్ల ఎల్లప్పుడూ మనకు మంచి కలగాలి) అనుటద్వారా లక్ష్మీదేవియొక్క పురుషకార వైభవము ప్రకటింపబడుట విశేషము. 9, 10, 11వ శ్లోకములలో వరుసగా మూడుసార్లు "**శ్రీమత్**" పదార్థమైన లక్ష్మీదేవితో స్వామికి గల నిత్యయోగమును, తద్వారా ఆ దేవియొక్క పురుషకారస్వరూప వైభవమును ప్రకటించుట వాటి ప్రాధాన్యమును సూచించుచున్నది.

కర్మసంబంధము వలన ఏర్పడిన, అందువలన, హేయమైన ఈ సంసారములో నూఱు సంవత్సరములు జీవింపవలెనని ఆశించుట, దీర్ఘమైన ఆయుస్సు కావలెనని కోరుట ప్రపన్నులకు తగునా! అనినచో, – దివ్యదంపతుల కల్యాణగుణగణవైభవమును కీర్తించుటకై ఈ సంసారమైన చిరకాలము ఉండవలెనని ఆశపడుట, అందుకొరకు తగిన, దీర్ఘమైన ఆయుస్సును ప్రార్థించుట అనునవి ప్రపన్నస్వరూపమునకు తగినదవే అగును. స్వరూపమునుబట్టియే కదా, కర్మల, వస్తువుల ఉపాదేయత్వ అనుపాదేయత్వములు నిర్ణయింపబడును. దేశికులు పాదుకాసహస్రము చివర

**"భరతసమయసిద్ధాం పాదుకే! భావయన్ త్వాం**
**శత మిహ శరదా స్తే శ్రావయేయం సమృద్ధిమ్" (995)**

(ఓ శ్రీరంగనాథుని పాదుకా! భరతుని ప్రతిజ్ఞవల్ల సిద్ధించిన నిన్ను నూరు సంవత్సరాల కాలం ఇక్కడ ఈ సంసారంలో భావన చేస్తూ, నీకు మంగళాశాసనాన్ని చేస్తాము) అని పల్కుట గమనింపదగినది. దీర్ఘాయువును ఆశాసించు "**చంద్రమా స్తిరతి దీర్ఘ మాయుః**" అను శ్రుతివాక్యము చొప్పున,

నూఱు వర్షములు మంచిని ప్రార్థించు ఈ శ్లోకములోని రాజశబ్దము చంద్రుడను అర్థము చెప్పును, శ్లోకమున కవి ఆశాసించిన స్వస్తి – తనకొఱకు అని గాని, దివ్యదంపతులకొఱకు అని గాని చెప్పవచ్చును. మిథునక్షేమమే కదా తన క్షేమము, సంవత్సరమును శరచ్ఛబ్దముతో కవి నిర్దేశించుటలో సంవత్సరమంతయు శరదృతువు కావలెనని ఆశపడుటవలననో, ఏమో! శరదృతువు దంపతుల విహారమునకు అనుగుణము కదా! శరచ్చంద్రచంద్రిక అందులకు ప్రసిద్ధము. "**కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః**" (ఈశా. 2) (ఇక్కడే ఈ లోకంలో భగవత్కైంకర్యాలను చేస్తూ, నూరు సంవత్సరాల కాలం జీవించాలని కోరాలి) అనుచు వేదము విహితకర్మలను చక్కగా చేయువాడవై, నూఱు సంవత్సరముల పాటు ఇక్కడే జీవింతువు గాక! అని అనుమతిని ఇచ్చినది. ఆ నూఱు వర్షములు శ్రీరంగనాథుని స్తుతిరూపనుగు కైంకర్యముచే వ్యాప్తములు కావలెనను ఆశంస ఇక్కడ తరప్రత్యయముచే ద్యోతకమగుచున్నది. గత శ్లోకమున స్వామివక్షములోని పాదలాక్షాముద్రలు, ఈ శ్లోకమున కస్తూరీముద్రలు వర్ణింపబడినవి. ఇట్టి ముద్రలవలన దివ్యదంపతుల గాఢాలింగనము ఉపలక్షితమగును. శ్రీరంగనాయకి నాథుని ఇట్లు గాఢముగా కౌగలించుకొనుటకు– పూర్వశ్లోకమున తన మాట చొప్పున పుత్రసమానుడగు భట్టరుయొక్క మానసాంబుజమున స్వామి క్రీడించుటవలన కల్గిన ఆనందమే కారణము. ఈ సందర్భమున శ్రీరామాయణములోని –

**"తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహమ్,**
**బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే"**

(విరోధులైన రాక్షసులను సంహరించి, మహర్షులకు ఆనందాన్ని కలిగించిన, తన భర్త అయిన ఆ శ్రీరాముని చూసి, సీతాదేవి చాలా ఆనందించింది, అతనిని ఆలింగనం చేసుకున్నది) అనే శ్లోకము స్మరించదగినది.

శ్లోకములోని "**మకరీ**" శబ్దమునకు "**ఆడు సొఱచేప**" అని అర్థము. "**ఝషాణాం మకర శ్చాస్మి**" (భ. గీ. 10–31) (చేపలలో నేను సొఱచేపను) అను గీతాచార్యవచనములో మకర శబ్దమునకు "**సొఱచేప**" అని అర్థము కదా!

'**స్వస్తి**' అను పదమునకు – భగవానుని స్వరూపరూపగుణవిభూతుల అనుభవరూపమైన మంగళము – అని తాత్పర్యము "**శతం శరదః**" అనునపుడు "**కాలాధ్వనో రత్యంతసంయోగే ద్వితీయా**" (2–3–5) అను వ్యాకరణసూత్రమునుబట్టి ద్వితీయా విభక్తి వచ్చినది. కావున, "**పలు వర్షములు నిరంతరముగా**" అను అర్థము దీనివలన ఏర్పడుచున్నది. "**శతం శరదః**" అనునపుడు ఉన్న ద్వితీయను సప్తమీవిభక్తి అర్థమున గ్రహింపనగునని, కావున, "**శతే శరత్సు**" అని ఇచటి భావమని రామానుజాచార్యవ్యాఖ్యానమున కలదు. "**శరదశ్శతమ్**" అనుటయు "**జీవేమ శరదశ్శతం, నందామ శరదశ్శతమ్**" అను వైదికవచనానుసారమనియు భావింపనగును.

### పంచాయుధధారి అయిన శ్రీ రంగనాథుడు మనలను రక్షించాలి

12. పాతు ప్రణతరక్షాయాం విలంబ మసహన్నివ ।
సదా పంచాయుధీం బిభ్రత్ స నః శ్రీరంగనాయకః ॥

**ప్ర. అ. –** ప్రణత = తననే ప్రాప్యముగ, ప్రాపకముగ తలచి, ఆశ్రయించినవారియొక్క రక్షాయాం = రక్షణయందు, విలమ్బం = ఆలస్యమును, అసహన్ ఇవ = సహింపలేనివాని వలె, సదా = ఎల్లప్పుడు, పంచ–ఆయుధీం = అయిదు విధములైన ఆయుధములను, బిభ్రత్ = ధరించునట్టి, సః = ఆ, శ్రీరంగనాయకః = శ్రీరంగనాథుడు, నః = మనలను, పాతు = రక్షించుగాక!

**వరివస్య :–** భగవానుని స్తుతించు శ్లోకపంచకములో ఇది చివరి శ్లోకము. ఇందు, భగవానుని ప్రణత రక్షణలోని ఆదరాతిశయమును రమణీయమైన ఉత్ప్రేక్షతో భట్టరు వర్ణించుచున్నారు. పూర్వశ్లోకములలో భగవానుని పంచబాణవశత్వము "**శ్రీస్తనకస్తూరీ**" ఇత్యాదిగా వర్ణింపబడినది.

ఇందు పంచాయుధధారిత్వము వర్ణింపబడుచున్నది. "మీరిట్లు మంగళమును ప్రార్థించుచున్నారే! విరోధివర్గము మిక్కిలి ఘనముగా నుండగా, మంగళము ఎట్లు సిద్ధించును? విరోధినిరసనమైననే కదా, అది సాధ్యనుగును!" అని అనినచో, అందులకు సమాధానముగ కవి "స్వామి పంచాయుధములను ఎల్లప్పుడూ ప్రపన్నుల రక్షణకై ధరించియుండగ ఇక ఏమి కొఱత?" అను సరససమాధానమును ఇందు పల్కుచున్నారు – అని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివ్యాఖ్యలో ఈ శ్లోకమునకు అవతారిక తెలుపబడినది.

శ్రీరంగనాథుడు ఎల్లప్పుడు సుదర్శనము, పాంచజన్యము, కౌమోదకి, నందకము, శార్ఙ్గము – అను పంచాయుధములను ధరించుటలోని అంతర్యము ఏమనగా, భక్తుల రక్షణలో ఎట్టి ఆలస్యమును అతడు సహింపలేకుండుటయే. (అట్లు ధరింపకున్నచో ఆవశ్యకమైన సమయమున వానిని అతడు వెదకికొనవలసి వచ్చును కదా!) ఇట్లు పంచాయుధములను ఎల్లప్పుడు ధరించు శ్రీరంగనాథుడు. మనలను రక్షించుగాక! – అని శ్లోక భావము.

ఈ శ్లోకము "**పెరియ తిరువన్దాది**" అను దివ్యప్రబంధములోని "**ఎప్పోదుమ్ కైకழలా నేమియాన్ నమ్మేల్ విన్నై కడివాన్**" (8) (ఏ సమయంలోనూ వీడని చక్రాన్ని చేతిలో దాల్చు స్వామి మన దుఃఖములను పోగొట్టును) అని నమ్మాళ్వార్లు పలికిన పాశురముయొక్క భావమును అనుసరించి రచింపబడినది. పై ఆళ్వారుల పాశురమున చక్రము ఒక్కటే చెప్పబడినను, ఆ చక్రాయుధము ఆయుధములలో ప్రధానము కనుక, అది మిగిలిన ఆయుధములకును ఉపలక్షణమని చెప్పనగును. అందువల్లనే భట్టర్ ప్రస్తుత శ్లోకమున పంచాయుధిని ప్రస్తుతించిరి. భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగమున "**దివ్యానేకోద్యతాయుధమ్**" (భ. గీ. 11-10) (తన చేతులలో ప్రయోగానికి సిద్ధంగా ధరించిన, దివ్యములైన అనేక ఆయుధమును కలవాడు) అని యుండుటయు ఇచట స్మరింపదగినది.

**"అవ్యాహతాని కృష్ణస్య చక్రాదీన్యాయుధాని చ,**

**రక్షంతి సకలాపద్భ్యో యేన విష్ణు రుపాసితః"**

(ఎవడు విష్ణువును ఉపాసిస్తున్నాడో, అతనిని, అన్ని ఆపదలనుండి సుదర్శన చక్రం మొదలైన, మొక్కవోని వైభవాన్ని కలిగిన విష్ణువు ఆయుధాలు రక్షిస్తున్నాయి) అనునట్లు, భగవానుని భజించువారి ఆపదలను తొలగించుటలో భగవానుని దివ్యాయుధములు ఆయన కంటే ముందుండును. పాంచజన్యము కూడ,

**"స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్" (భగీ, 1–19)**

(ఆ పాంచజన్యధ్వని ధృతరాష్ట్ర పుత్రుల హృదయాలను బ్రద్దలు చేసినది) అనునట్లు, మిగిలిన నాల్గు ఆయుధములవలె శత్రువులను సంహరింప కల్గినదగుటచే, దానికి కూడ ఆయుధత్వసంకేతము కలదని తెలియనగును.

"**పాతు**" అను క్రియచే ఇష్టప్రాప్తి, అనిష్టనివృత్తి రూపమైన రక్షణ చెప్పబడుచున్నది. "**నః**" అను సర్వనామరూపమునకు సందర్భానుగుణముగా "శ్రీరంగనాథుని ఉపాయోపేయములుగా తలచు మనలను" అని అర్థము. "**శ్రీరంగనాయకః నః పాతు**" (శ్రీరంగనాథుడు మనలను రక్షించుగాక) అనుటచే లక్ష్మీదేవీ సహితుడైన నారాయణుడే రక్షకుడని ఏర్పడుచున్నది. "రక్షాయామ్" అనునపుడు సప్తమీవిభక్తిని నిమిత్తసప్తమీవిభక్తిగా గాని, విషయసప్తమీవిభక్తిగా గాని చెప్పవచ్చును.

10వ శ్లోకమున "**రమతాం మానసాంబుజే**" (మానసాంబుజమున ఆనందించు గాక) అనుట వలన, 8వ శ్లోకమున "**శ్రీరంగేశయ మాశ్రయే**" (శ్రీరంగనాథుని ఆశ్రయిస్తున్నాను) అనుటవలన, 9వ శ్లోకమున "**అస్తి వస్త్విదమిత్థంత్వ**" ("ఇది ఇటువంటి" అని చెప్పడానికి సాధ్యం కాని వస్తువు ఉన్నది) అనుటవలన, "**ఆశీః నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖమ్**" (కావ్యారంభమును ఆశీర్వాదముతో కానీ, నమస్కారముతో గాని, ఆ కావ్యములో ప్రతిపాదించు కథావస్తు నిర్దేశముతో కాని చేయాలి) అని చెప్పబడు శాస్త్రవిహితములగు మూడు విధములైన కావ్యాది మంగళములు వరుసగా

ఆచరింపబడినవి అని చెప్పనగును – అని గార్గ్య రామానుజాచార్యవ్యాఖ్యానమున సూచింపబడినది. తిరువాయ్ మొళి ప్రబంధములోని మొదటి పాశురములో గల **"అడి తొழுదెழு"** (భగవంతుని శ్రీపాదాన్ని నమస్కరించి, తరించు) అను సూక్తిలో "అడి" అనుటచే వస్తునిర్దేశము, **"తొழுదు"** అనుటచే నమస్కారము, **"ఎழு"** అని ఆశీస్సు తెలుపబడుటచే, అచట పై మూడు విధములైన మంగళములను సూచింపబడినవని ఆచార్యహృదయమున (212న సూ.) తెలుపబడినది. అట్లే, ఇచటకూడ, కవి మూడు విధములైన మంగళములను ఆచరించిరి.

తిరువాయ్ మొళిలో ఇట్లు ఈ మంగళత్రయము ఆచరింపబడుట కవి ప్రయత్నమువలన కాక, భగవదిచ్ఛచే జరిగినదని పై ఆచార్యహృదయ సూత్రవ్యాఖ్యానమున తెలుపబడినది. ఆ క్రమము ప్రకృతమునకూడ అన్వయించును.

మనము ఒక్క సారి చేసిన ప్రపత్తికారణముగా భగవానుడు పంచాయుధములను ఎల్లప్పుడు ధరించియున్నాడు. పంచాఙ్గయుక్తమగు ప్రపత్త్యుపాయమును అనుష్ఠించిన భక్తుల రక్షణకొఱకు పంచాయుధములను భగవానుడు ధరించియున్నాడు కాబోలు! భగవానుడు శ్రీరంగవిమానమను ఓంకారములో నున్నాడు. ఆ ఓంకారము తన ప్రకృతియగు అకారమున లీనమై యున్నది. అకారము **"అవ – రక్షణే"** అను ధాతువునుండి నిష్పన్నమైనది అగుటచే, **"భగవానుడు రక్షకుడు"** అను అర్థమును తెలుపును. కావున, **"శ్రీరంగనాయకః స నః పాతు"** (శ్రీరంగనాథుడు మనలను రక్షించుగాక) అనుచు కవి ఇచట ప్రార్థించుట మిక్కిలి తగినది.

ఈ శ్లోకము శ్రీరంగనాథుని ఉత్సవమూర్తికి సంబంధించినదని కొందటి వ్యాఖ్యాతల అభిప్రాయము. **"అతంత్రితేత్యాదిప్పడియే ఆశ్రితరక్షణత్వరైయిల్ ప్రసిద్ధరాన"** (అతంత్రిత చమూపతి – ఇత్యాది శ్లోకములో భట్టరు పలికినట్లుగా, ఆశ్రితులను రక్షించే కార్యంలో చాలా ప్రసిద్ధుడైన) అను భావము 'సః' అను

సర్వనామశబ్దమునకు వాధూల వీరరాఘవాచార్యస్వామివ్యాఖ్యలో చూపబడినది. దీనినిబట్టి గజేంద్రుని రక్షణకై స్వామి ఆయుధములను ధరింపకనే, తొందరలో వెడలవలసివచ్చుటచే, అట్టి స్థితి మరల తనకు కలుగరాదను భావముతో, అతడు పంచాయుధములను ఎల్లప్పుడు ధరించుచున్నాడా! ఏమి? – అను ధ్వని "**విలంబ మసహన్నివ**" (ఆలస్యమును సహించలేనట్లుగా) అనునపుడు కల్గుచున్నది.

"**అసహమాన**" అని శానచ్ ప్రత్యయాంతముగా ప్రయోగింపబడవలసి యుండగా, "**అసహన్**" అని శతృప్రత్యయాంతముగా ప్రయోగించుట ఎట్లు పొసగును? అనిన, "షహ– మర్షణే" అను ధాతువుపై ణిచ్ రానపుడు, "**సహతి**" అను పరస్మైపది రూపము సిద్ధించును. అపుడా రూపముయొక్క శతృప్రత్యయాంతము పుంలింగమున "**అసహన్**" అని అగును. అప్రక్రియ మణవాళ చ్ఛీయర్ అనుగ్రహించిన, తిరువాయ్ మొళి ప్రబంధసారమైన ద్రవిడోపనిషత్సంగతిలో గల "**మద్విప్రయోగ మసహన్**" (8-7) అను సూక్తిని, "**స ఏవాయం నాగః సహతి కలభేభ్యః పరిభవమ్**" అను మహాకవిప్రయోగమును ఇచట స్మరింపనగును.

## శ్రీరంగనాథుని స్తుతించుట అసాధ్యమైన పని

**13. అమతం మతం మత మథామతం స్తుతం.**
**పరినిందితం భవతి నిందితం స్తుతమ్ ॥**
**ఇతి రంగరాజ ముదజూఘుషత్ త్రయీ**
**స్తుమహే వయం కిమితి తన్న శక్నుమః ॥**

**ప్ర. అ. –** అమతం = పరబ్రహ్మము తెలియుటకు సాధ్యము కానిదని తెలిసినచో, మతం భవతి = అపుడు ఆ బ్రహ్మము తెలిసికొనబడినది అగును, అథ = మఱియు, మతం = పరబ్రహ్మము స్తుతింప సాధ్యమైనదని తలంపబడినచో, అమతం భవతి = (అపుడు) అది, తెలిసికొనబడనిదే అగును, స్తుతం = పరబ్రహ్మము స్తుతింపబడినది అయినచో, పరినిందితం భవతి = అపుడా

పరబ్రహ్మము నిందింపబడినదే అగును, నిందితం = పరబ్రహ్మము ఉన్నది ఉన్నట్లు స్తుతింప సాధ్యము కానిదని చెప్పబడిన, స్తుతం భవతి = అపుడది నిజముగా స్తుతింపబడినది అగును, ఇతి = అని, త్రయీ = వేదము, ఉదజూఘుషత్ = ఉద్ఘోషించెను, తత్ = కావున, తం = ఆ శ్రీరంగనాథుని, వయం = మనము, కిం ఇతి = ఏమని, స్తుమహే = స్తుతింతుము?, న శక్నుమః = స్తుతింపలేము.

**వరివస్య** :– ఇంతవరకు కవి 12 శ్లోకములలో గురుంపరావందనమును చేసిరి. లక్ష్మీదేవి, శ్రియఃపతియు ఆ గురుపరంలోనికి చేరినవారగుటచే, వారిని కూడ స్తుతించిరి, మూడు శ్లోకములలో ద్వయమంత్రపూర్వవాక్యములోని శ్రీమత్పదముయొక్క అర్థమును అనుసంధించిరి. తదుపరి, లక్ష్మీసహితుడైన ఆ భగవానుడే మనకు రక్షకుడనిరి.

అనంతరము, నారాయణ పదార్థమును వివరింపగోరిన భట్టరు, శ్రీరంగనాథుని స్తుతించుటలో తమ అయోగ్యతను, అశక్తిని ఈ శ్లోకమునుండి ఏడు శ్లోకములలో అద్భుతమైన రీతిలో అనుసంధించుచున్నారు.

స్తోత్రారంభమున కవులు తమ అశక్తిని, అయోగ్యతనుగూర్చి పలుకుట పరిపాటి. యామునుల చతుఃశ్లోకిలోని మొదటి రెండు శ్లోకములలో ఈ విషయమును గమనింపవచ్చును. ప్రస్తుతశ్లోకమున శ్రీరంగనాథుని స్తుతించుట ఎవరికైనను అసాధ్యమనుటను, తర్వాతి శ్లోకమున తమ స్తుత్యశక్తతను భట్టరు తెలియజేసిరి. **"తన్న శక్నుమః"** (ఆ పరబ్రహ్మ స్తుతిని చేయలేము) అనుటయే నిజమైన స్తుతి – అని ఈ శ్లోకములోని పిండితార్థము.

తాము చెప్పదలచిన భావమును శ్రుతుల అర్థముతో మేళవించి, అత్యంత సరసముగా చెప్పుట అనునది భట్టరుకు మాత్రమే సాధ్యమైన విషయము. దానికి ఈ శ్లోకము ఒక ఉదాహరణము.

"నేను శ్రీరంగనాథుని స్తుతింప ఎట్లు సాధ్యపడును? ఒకడు, ఇంకొకరిని స్తుతింపవలెనన్న, స్తుతింపబడేవాని స్వరూప స్వభావములను స్తుతిని చేసేవాడు

పూర్తిగా తెలిసికొనగల్గినవాడై యుండవలెనుకదా. భగవానుని స్వరూప స్వభావములను తెలియుట ఎవరికిని వీలు కాదని వేదమే పల్కుచున్నది.

**"యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః,**
**అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతామ్"** (కేన. –2)

(ఎవనికి భగవంతుని గూర్చి యథాతథంగా తెలియలేదో, అతనికి భగవంతుని తెలిసినట్లవుతున్నది. ఎవడు, తనకు భగవంతునిగూర్చి తెలియునని భావిస్తున్నాడో, అతనికి భగవంతునిగూర్చి తెలియలేదు. భగవంతునిగూర్చి ఇదమిత్థముగా తెలియలేము – అనువానికి భగవంతుని గూర్చి తెలిసినట్లే అవుతున్నది. భగవంతుని గూర్చి ఇదమిత్థముగా తెలియగలమనువానికి భగవంతునిగూర్చి తెలియనట్లే అవుతున్నది) అను శ్రుతివాక్యములు ఇందులకు ఉదాహరణములు. (ఈ వాక్యములలోని పదములను కవి యథాతథముగా ఇచటి శ్లోకమున ప్రయోగించుట గమనింపదగినది.)

"భగవానుని స్వరూప స్వభావములను ఇదమిత్థముగా తెలిసితినని ఎవడు తలచునో, అతడు యథార్థమును తెలియనివాడే అగును. ఎవడు, భగవానుని తెలియలేనని తలచునో, అతడు. నిజమును గుర్తించినవాడగును" అని పై వాక్యముల సారాంశము. కావున, ఎవరును భగవానుని యథార్థ తత్త్వమును యథాతథముగా తెలియలేరు. **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"** (తై. ఆ. –9) (ఏ భగవంతుని వైభవాన్ని తెలియలేక వేదవాక్కులు మనసుతో పాటు వెనుకకు తిరుగుతున్నాయో), **"యత్తదద్రేశ్య మగ్రాహ్యం నిష్కలం నిష్క్రియమ్"** (ముండక. 1-1-6) (బాహ్యచక్షువులకు గోచరం కానివాడు, కరచరణాదులకు అందనివాడు, బ్రాహ్మణ క్షత్రియాది వర్ణభేదములు లేనివాడు, ప్రాకృతక్రియలను లేనివాడు – భగవానుడు) అని మొదలగు వేదవాక్యములు ఈ సత్యమును బలపఱచుచున్నవి. "నేను శ్రీరంగనాథుని ఏమని స్తుతింతును? స్తుతింపలేను" అనుచు గ్రంథకర్త భగవానుని స్తోత్రము చేయుటలో తమ యోగ్యతారాహిత్యమును ప్రకటించిరి.

ప్రస్తుత శ్లోకమున "**స్తుతం పరినిందితం భవతి నిందితం స్తుతమ్**" అని కవి పల్కుటకేమి మూలము? అని గమనించినచో, "**యత్తదద్రేశ్య మగ్రాహ్యం నిష్కళం నిష్క్రియమ్**" (ముణ్డక 1-1-6) (ఏ పరబ్రహ్మం ప్రాకృత నేత్రాలకు కనిపించదో, కరచరణాదుచే గ్రహింపబడదో, బ్రాహ్మణాది విభాగములను లేనిదో, క్రియారహితమో, ప్రాకృతమైన కళ్ళు, చేతులు, కాళ్లు, చెవులు మొదలైనవానిని లేనిదో) అని మొదలైన వేదవాక్యములు ఇందులకు ప్రమాణములని చెప్పవచ్చును. లేదా, "**అమతం మతం, మతమ్ అమతమ్**" అనునది సంస్కృతవేదమును అనువదించి కవి చెప్పినట్లే, దీనిని ద్రావిడవేదమును ఆధారముగా గొని పల్కెనని చెప్పవచ్చును. మన పూర్వాచార్యుల స్తోత్రములు అన్నియు ఉభయ వేదాంతములలోని భావములను అంతర్భవించుకున్నవి కదా. నమ్మాళ్వార్లు "**పెరియ తిరువన్దాది**" అను ప్రబంధమున "**పుక***ழ்***వోమ్ ప***ழி***ప్పోమ్ పుక***ழோ***మ్ ప***ழி***యోమ్**" (2) (మేము నిన్ను స్తుతించినట్లయితే, నిందించినవారమే అవుతున్నాము, మేము నిన్ను నిందించినట్లయితే, స్తుతించినవారం అవుతున్నాము) అనిరి. అనగా, "**స్వామీ! మేము నిన్ను స్తుతించినచో నిందించినవారము, నిందించినచో స్తుతించినవారము అగుదుము**" – అని దీని భావము. ఈ ఆళ్వార్లే తిరువాయ్ మొళి అను వేరొక ప్రబంధమున 3వ శతక ప్రారంభమున

**"ఒట్టురెత్తు ఇవ్వులకున్నై ప్పుక***ழ்***వెల్లామ్ పెరుమ్బాలుమ్,**
**పట్టురైయాయ్ పుఱ్కెన్డే కాట్టుమాల్ పరంజోతీ!"** (3-1-2)

(ఓ పరంజ్యోతి స్వరూపా! ఈ లోకము నీకు ఉపమానముగా కొన్నిటిని చెప్పి, చేయు స్తుతి అంతయు ప్రాయికముగా దోషమై పర్యవసించును కదా!) అనుచు పై భావమునే తెలియజేసిరి. కావున కవి ఈ శ్లోకమున "పరినిందితమ్" ఇత్యాది వాక్యమును ద్రావిడవేదమును ఆధారముగా గొని పల్కెనని చెప్పనగును. ఈ విధముగా ప్రస్తుతశ్లోకమున ఉభయవేదాంతార్థము ఇమిడియున్నది. కావుననే, కవి "**ఇతి త్రయీ ఉదజూఘుషత్**" (అని వేదము ఘోషించినది) అని

పల్కుట సాభిప్రాయకమని భావింపవచ్చును. అందువల్ల, ఇచట "త్రయీ" శబ్దము సంస్కృత వేదాన్ని చెప్పినట్లే, ద్రావిడ వేదాన్ని కూడా చెబుతున్నది – అని భావించడంలో అందం ఉన్నది. మరియు, ఈ స్తోత్రములో 16వ శ్లోకమున "**స్వం సంస్కృతద్రావిడవేదసూక్తైః**" (సంస్కృత ద్రావిడవేద సూక్తాలతో ప్రకాశిస్తున్న తనను) అని కవి పల్కుటకూడ పై భావమును బలపఱచుచున్నది.

కవి "**వయమ్**" అనుచు తమను బహువచనమున నిర్దేశించుకొనుట ఒక విలక్షణమైన కవి సంప్రదాయము, లేక, గౌరవార్థమున ప్రయోగింపబడు '**వయ**' మను పదమును ఇచట వ్యతిరేక లక్షణద్వారా ప్రయోగించి, కవి తనకు స్తోత్రము చేయుటలో ఏ మాత్రము యోగ్యత లేదని చెప్పినట్లయినది–అని కూడా భావించవచ్చును.

"**ఇదం విష్ణు ద్విచక్రమే**" (వి. సూ.) (ఈ విశ్వాన్ని అంతటిని విష్ణువు విక్రమించాడు) అని, "**సహస్రశీర్షా పురుషః**"(పు. సూ.) (పురుషుడు వేయి శిరస్సులను కలవాడు) అని వేదము భగవానుని గొప్పగా స్తుతించినను, ఆ స్తుతి నిందగానే పర్యవసించుచున్నది. ఎందులకనగా, అట్టి వైదిక వాక్యములు సైతము భగవానుని యథార్థస్వరూపమును పూర్ణముగా ప్రతిపాదింపలేకున్నవికదా.

ఈ విధముగా వేదములే అసమర్థములైనపుడు, ఇక, మందప్రజ్ఞుడైనైన నావంటివారినిగూర్చి చెప్పవలసినదేమి? అను భావము కైముత్యన్యాయముచే ఇచట సిద్ధించుచున్నది.

శ్లోకములో "**స్తుతమ్**" అనుటకు "ఆశ్రిత సంరక్షకుడు; కృతజ్ఞుడు, సురపక్షపాతి – అను స్తోత్రము చేయుట" అని, "**నిందితం**" అనుటకు "కులహీనుడు, గోత్రహీనుడు, లోకవిలక్షణుడు అని నిందించుట" – అని భావము. సర్వజ్ఞుడు, సర్వరక్షకుడు, సర్వభూతసుహృత్ అగు భగవానుని అట్లు స్తోత్రమును చేయుట నిందగా, నిందించుట స్తోత్రముగా పర్యవసించునని తాత్పర్యము. "**కిమితి న శక్నుమః?**" అనునపుడు "**కిమ్, ఇతి**" అను అవ్యయములను "కిమర్థం" అను అర్థమున, "**కథం**" అను అర్థమున అన్వయింప

వీలగుటచే, "**ఎందులకు స్తోత్రము చేయలేము?**" అని, "చేయలేము" అని రెండు విధములైన భావములు స్ఫురించుచున్నవి. "**వయం స్తుమహే కిమితి న, శక్నుమః**" (మేము భగవంతుని ఏమని స్తుతిస్తాము? అని అనుకోనక్కరలేదు. మా శక్తి కొలది స్తుతిస్తాము) అని, "**వయం కిమితి స్తుమహే? (ఇతి) న శక్నుమః**" (మేము భగవంతుని ఏమని స్తుతించగలము? అందువల్ల, స్తుతించలేము) అను రెండన్వయములును ఇచట వివక్షితములే. వేదము భగవానుని స్తుతిని సామాన్యరూపముగా చేయుచున్నదే కాని, విశేషముగా చేయలేక పోవుచున్నది. అట్టి సామాన్యస్తుతిని చేయుటలో నాకును శక్తి కలదు. కావున, స్తోత్రమును రచించుటలో నాకును ఒక విధముగా అధికారము కలదను విశేషము ఇచట స్ఫురించుచున్నదని – శ్రీరామానుజాచార్యవ్యాఖ్యానమునను సూచింపబడినది. ఈ అన్వయమున "**న శక్నుమః?**" అనుచోట కాకుస్వరమువలన "భగవంతుని స్తోత్రం చేయడంలో శక్తి కలవారము కామా! అగుదుము కదా!" అను భావము ఏర్పడునని చెప్పవలసియున్నది. శ్లోకములోని "**అథ**" అను పదమునకు "**అంతయు**" అను అర్థమును గ్రహింపవచ్చునని శ్రీరామానుజాచార్యులవారి వ్యాఖ్యలో కలదు. "**మంగళానంతరారంభ ప్రశ్నకార్త్స్న్యేష్వథో అథ**" అను అమరకోశవచనమునుబట్టి, "**అథ**" అనుటకు "**పూర్ణముగా**" అను అర్థము ఉన్నట్లు తెలియుచున్నది కదా! ఈ పదమును కొందరు వ్యాఖ్యాతలు యద్యర్థకముగను వ్యాఖ్యానించిరి.

ఉక్తివైచిత్రిని కల్గిన ఈ శ్లోకము మంజుభాషిణీ వృత్తమున రచింపబడుట ఇచట గమనింపదగిన వేరొక అంశము.

**నాకు వేయి ముఖాలు ఉంటే, అప్పుడు "భగవంతుని స్తుతించలేను" అని చెప్పగలను –**

**14. యది మే సహస్రవదనాదివైభవం**
**నిజ మర్పయేత్ స కిల రంగచంద్రమాః**

**అథ శేషవత్ మమ చ తద్వదేవ వా**
**స్తుతిశక్త్యభావవిభవే ఽ పి భాగితా ॥**

**ప్ర. అ. –** సః = ఆ, రంగచంద్రమాః = శ్రీరంగనాథుడు అను చంద్రుడు, నిజం = తనదైన, సహస్రవదన– ఆది = వేయి ముఖములను కల్గియుండుట మొదలగు, వైభవం = (మహిమను) గొప్పదనములను, మే = నాకు, అర్పయేత్ యది = అనుగ్రహించినచో, అథ = అపుడు, శేషవత్ = ఆదిశేషునకు వలెనో, (లేక), తద్వత్ వా = ఆ భగవానునకు వలెనో, మమ చ – = నాకును, స్తుతి శక్తి అభావ = స్తుతించుటలో శక్తి లేకుండుట – అను, విభవే అపి = గొప్పతనమునందును, భాగితా (స్యాత్) = భాగస్వామ్యము ఉండును.

**వరివస్య :–** ముందు శ్లోకమున కవి "నేను భగవానుని స్తుతింపలేను" అనిరి. ఆ మాటను పల్కుటకుకూడ తనకు యోగ్యత లేదని ఈ శ్లోకమున చమత్కారముగా తెలుపుచున్నారు.

శ్రీరంగనాథుడు వేయి ముఖములను కల్గియుండుట మొదలగు తన గొప్పతనములను నాకును ప్రసాదించినచో, అపుడు ఆదిశేషునివలెనో, లేక, ఆ భగవానుని వలెనో, ఆ స్వామి మహిమను వర్ణింపలేకుండుట – అను వైభవమున నాకును భాగస్వామ్యము ఏర్పడు అవకాశము కలదు. కాని, అట్టి గొప్పతనము లేని నేను భగవానుని స్తుతింపలేననుట కూడ హాస్యాస్పదమేసుమా – అని శ్లోకభావము.

శాస్త్రములలో "**ప్రస్తక్తస్య హి ప్రతిషేధః**" (ప్రసక్తి ఉన్నదానినే కదా, ప్రతిషేధించడం జరుగుతుంది) అను న్యాయమొకటి కలదు. ఏ విషయమునైనను ప్రతిషేధింపవలెనన్న ముందు, అది ప్రసక్తమై యున్నపుడే, దానిని ప్రతిషేధించుట అనునది ఆవశ్యకమగును. ఒకడు "వేదమును అధ్యయనము చేయుటకు నాకు శక్తి లేదు" అని అనుటకు మొదటగా, వేదాధ్యయనమును చేయు యోగ్యత అతనికి ఉండి ఉండవలెను. వేదమును పఠించుటకు యోగ్యతను ఏమాత్రము లేనివాడు ఆ మాటను అనుట పొసగదు

కదా! అట్లే, ఇచట కవి "భగవానుని స్తుతించుటకు నాకు శక్తి లేదు" అనవలెనన్న, స్తుతించు యోగ్యతను ఏ కొద్దిగానైనను అతడు కల్గియుండవలెను. అపుడే అతడు అట్లు పలుకుటకు వీలుండును. "ఆదిశేషునివలెనో, లేక, భగవానునివలెనో వేయి ముఖములను కల్గియున్నచో, అపుడు భగవానుని స్తుతించుటకు నాకు ఏదో ఒకవిధమైన అధికారము ఉన్నదనవచ్చును. అట్లు వేయి ముఖములు లేని నేను "భగవానుని స్తుతింపలేను" అనుటకూడ హాస్యాస్పదమే అగును – అని ఇచట కవి వచనములలోని తాత్పర్యము. "భగవానుని స్తుతింపలేను" అని అనుటకూడ ఒక విధమైన వైభవమనుట కవివాక్ చమత్కృతికి ఉదాహరణము.

ఆదిశేషునకు సహస్రవదనములున్నట్లే, సర్వేశ్వరునకు వేయి ముఖములుండుట ప్రసిద్ధము. "**సహస్రశీర్షా పురుషః**" (పూ. సూ.) (పురుషుడు వేయి శిరస్సులను కలవాడు) అని సంస్కృతవేదము, "**ముడిగళ్ ఆయిరత్తాయ్!**" (తి. వా. 8-1-10) (వేయి శిరస్సులను కలవాడా!) అని ద్రావిడవేదము ఈ విషయమును ప్రస్తుతించినవి. కావున, "**నిజం సహస్రవదనాదివైభవమ్**" (వేయి నోళ్లను కలిగి ఉండే తనకు కల వైభవం) అని కవి అనుట అర్థవంతము. ఆదిశబ్దముచే ★ "**యః సర్వజ్ఞః సర్వవిత్**" (ముణ్డక, 1-1-10) (ఎవడు అన్నిటినీ అన్ని విధాలుగా తెలిసినవాడో, అన్నిటినీ పొందేవాడో) అను విధమున, అందరి స్వరూప స్వభావములను తెలియగల్గియుండుట మొదలగు పలు అసాధారణసామర్థ్యములు గ్రహింపబడును. "**తనక్కుమ్ తన్ తన్మై యఱివరియాన్**" (తి. వా. 8-4-6) భగవానుడు, తన గొప్పతనము తెలియ సాధ్యము కానివాడు) అని నమ్మాళ్వార్లు పల్కుటనుబట్టి కవి ఇచట "**తద్వదేవ స్తుతిశక్త్యభావవిభవే**" (ఆ భగవంతునివలెనే తన వైభవాన్ని స్తోత్రం చేసుకొవడానికి తగిన శక్తిని కలిగి ఉండకపోవడంలో) అని అనిరని తోచుచున్నది. వేదముకూడ "**సో అంగ వేద యది వా న వేద**" (ఆ భగవానుడు తన మహిమను తెలుసుకోగలుగుతున్నాడా? లేడా?) అనుచు పై విషయమును పల్కినది. ఈ

వేదవాక్యములోని పదములు తరువాతి శ్లోకములో ప్రయోగింపబడుటకూడ గమనింపవచ్చును.

"నిజం సహస్రవదనాదివైభవం శేషవత్ మే రంగచంద్రమాః అర్పయేత్ యది" – తనకు గల, వేయి ముఖాలను కలిగి ఉండడం మొదలైన వైభవాలను రంగనాథుడను నాకు, శేషునకువలె, అనుగ్రహించినట్లయితే) అని అన్వయించినచో, '**శేషవత్**' అనుటకు '**శేషస్యేవ**' అనగా, శేషునకువలె –అను అర్థము వచ్చును. అనగా, భగవానుడు ఆదిశేషునకు సహస్రవదనత్వము మొదలగు సామర్థ్యములను ప్రసాదించినట్లే, నాకును ప్రసాదించినచో – అని భావము. అపుడు "**తద్వదేవ**" అనుచోట తచ్ఛబ్దమునకు "**తయోః వత్ ఏవ**" అనగా, సర్వేశ్వరునకు, ఆదిశేషునకు వలె – అని అర్థమును చెప్పవచ్చును. "వా" అను అవ్యయమును "**భాగితా వా స్యాత్**" అని అన్వయించి చెప్పవచ్చును. ఈ అన్వయము తిరువాయ్ మొళి (1-5-2) పాశురములోని ఈడు వ్యాఖ్యానమునకు గల అరుంబదములో సూచింపబడినది. సంస్కృత వ్యాఖ్యానకర్తయు ఈ అన్వయమునే చూపెను,

**"దివి సూర్యసహస్రస్య భవేత్ యుగపదుత్థితా,**
**యది భాః సదృశీ సా స్యాత్ భాసః తస్య మహాత్మనః"**

(భ. గీ. -11-12)

(ఆకాశంలో ఒక్కసారిగా వెయ్యి మంది సూర్యులు ఉదయించినట్లయితే అప్పుడు అప్పుడు ఏర్పడే కాంతి ఎంత ఉంటుందో, అంతటి కాంతిని ఆ విశ్వరూపాన్ని కలిగిన భగవానుడు కలిగి ఉన్నాడు) అనుచు సంజయుడు భగవానుని కాంతిని వర్ణించుటకై సూర్యసహస్రకాంతిని కల్పించెను. వేదములును భగవానుని ఆనందగుణమును వర్ణింపగోరి, "**ప్రకల్ప్యతే యే శత మిత్యనుక్రమాత్**" ("**తే యే శతం, తే యే శతమ్**" – అని ముందు చెప్పిన ఆనందం కంటే 100 రెట్లు తరువాత చెప్పే ఆనందాన్ని కల్పించి పెంచి. కల్పనమును వేసెను. అట్లే, ఇచ్చట భట్టరును తమకు

సహస్రవదనత్వాదివైభవమును భగవానుడు అనుగ్రహించుట – అను కల్పనమును చేసిరి. శ్లోకపూర్వార్ధమున **"సహస్రవదనాదివైభవమ్"** అని ఉత్తరార్ధమున **"స్తుతిశక్త్యభావవిభవే"** అని కవి పల్కుటచే, ఈ శ్లోకము శబ్దైక్యము అను కావ్యగుణమును కల్గియున్నదని చెప్పనగును.

**"ఉదేతి సవితా తామ్రః తామ్ర ఏవా స్తమేతి చ" (కావ్యప్రకాశ)**

(సూర్యుడు ఎఱ్ఱనివాడై ఉదయిస్తున్నాడు, ఎఱ్ఱనివాడై అస్తమిస్తున్నాడు కూడా) అని కాక, **"రక్త ఏవాస్తమేతి చ"** అనుట శబ్దవైరూప్యదోషమని ఆలంకారికుల అభిప్రాయము కదా! **"సహస్రవదనాది, వైభవమ్"** అను పదములను వ్యస్తములుగా కూడ అన్వయింపవచ్చును. **"సహస్రవదవాది"** అనునపుడు "ఆది" శబ్దముచే వైనతేయ, విష్వక్సేనులను గ్రహింప వీలున్నందున, దానిని నివారించుటకై **"నిజ"** శబ్దము ప్రయోగింపబడినది.

కళలద్వారా నిజశరీరమును దానము చేయుటలో ప్రసిద్ధుడు, ఉదారుడును అగు చంద్రునియొక్క సామ్యముచే శ్రీరంగనాథునియొక్క కాంతత్వము, ఔదార్యమును సూచింపబడినవి. **"శేషవత్"** అనుటకు, "ఆదిశేషుడును భగవానుని అనుగ్రహమువలన సహస్రవదనత్వ సర్వజ్ఞత్వాది వైభవమును పొందెను. ఐనను, అతడును భగవద్గుణములను సాకల్యముగా స్తుతింపలేడు" – అని భావము.

**"శేషవత్ మమ చ, తద్వదేవ వా"** అనుటకు – "ఆదిశేషునివలెనే కాదు; శేషియగు భగవానుడును తన మహిమను తాను వర్ణింపలేకపోవుటచే, అతనివలెనే నేనును ఆ. స్వామిగుణకీర్తనమును పూర్తిగా చేయలేను" – అని భావము. **"మమ చ భాగితా"** అనుటచే **"మమైవాంశో జీవలోకే జీవభూతః"** (15-7) (ఈ లోకంలో ఉండే జీవుడు నా అంశభూతుడే) అను గీతావచనమును బట్టి, జీవుడు భగవదంశ భూతుడు – అని తెలియుచున్నది. కావున, భగవానుడు తన మహిమను తాను వర్ణింపలేకపోవునట్లే, అతని అంశ

అగు నేనును అట్టి అశక్తతను కల్గియుండుట తగినదే – అను స్వారస్యము ఇచట ధ్వనించుచున్నది.

భగవానుడు తనయొక్క సహస్రవదనత్వాదివైభవమును మనకు తన గుణములను వర్ణించుటకై అనుగ్రహించినను. ఆ భగవానుని గుణములను సాకల్యముగా వర్ణించుట మనకు సాధ్యము కాకుండుటచే, భగవానుడు ఒసగిన వైభవము నిష్ఫలమగుతున్నదే!. అట్లైన, భగవానుడు అనుగ్రహించిన వైభవమువలన సిద్ధించునది పరాభవమే కదా! –అని ప్రశ్నించినచో, అట్లు కాదు, ఇది భగవద్వైభవములోనికే పర్యవసించును –అని చెప్పనగును. అది ఏమనిన, – స్తుతిశక్త్యభావము ఒక విభవము. కావున, అది భగవానుని అనుగ్రహము వైభవమునే కల్గించినదని చెప్పవలెను. ఐశ్వరచిహ్నములగు లక్ష్మీపతిత్వము, జగత్కారణత్వము మొదలగు కొద్ది విషయములలో తప్ప, ముక్తులు పరమాత్మతో సామ్యమును పొందుదురు. కావున, భగవానునివలె ఆ స్వామిగుణములను స్తుతించుటలో అశక్తతయే వారికిని కలదు. ఇదియు ఒక విధమైన సామ్యమే.

అది సరే, స్తుతిశక్త్యభావము విభవము అనుట ఎట్లు? అనినచో, ఇది ఒక అభావవిభవముసుమా!– అని ఇచట కవిచమత్కారము, అభావమును భావాంతరముగా భావించు విశిష్టాద్వైతసిద్ధాంతమున ఇది సాధ్యమేకదా. స్తుతిశక్త్యభావము అభావముగ తోచినను, భావాంతరమే అగును. "**పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే**" (శ్వేత, 6–8) (ఈ భగవానుని శక్తి చాలా గొప్పది, అనేక విధములైనది – అని వేదములో అధ్యయనము చేయబడుచున్నది) అని కీర్తింపబడు భగవానునకును తన గుణములను కీర్తించు శక్తి లేదనుటవలన ఆ స్వామియొక్క అనంతగుణవైభవమే సిద్ధించును తప్ప, స్వామికి లోటు ఏ మాత్రము కలుగదు. కావున, భగవానుని స్వస్తుత్యశక్తి అనునది స్వవిభవానంతపర్యవసాయినియే. అగును.

భగవానుని స్తుతించుటలోని అశక్తి కవికి ఎట్లు వైభవము అగును? అను ప్రశ్నకు పూర్వశ్లోకముననే సమాధానము ఈయబడినది. మరియు, భగవానుని గుణములను కీర్తించుట అసాధ్యమని తెలియుట నిజమైన జ్ఞానమే అగును; కావున, స్తుత్యశక్తి విభవమే అగును. సహస్రవదనత్వమును కల్గియున్నను, భగవానుని స్తుతించుటలోని ఆశక్తిని కల్గియుండుటకూడ ఆ భగవానునకును, శేషునకును మాత్రమే కలదు. నేనును అట్టివాడనై, వారితో మూడవవాడనగుదును – అని ఇచటి చమత్కారభావము, భావవిభవములలో భాగమును కల్గియుండునట్లే, అభావవిభవమునకూడ నేను భాగమును కల్గియున్నాను – అను చమత్కారము **"అపి"** శబ్దముచే స్ఫురించుచున్నది. కావున, సహస్రవదనత్వాదివైభవదానము "నేను స్తుతింపలేను" అని చెప్పుటకు తగిన యోగ్యతను పొందుటకొఱకే – అని శ్లోకములోని సారమైన విషయము. ఇటువంటి వాక్చమత్కృతులను ప్రయోగించుట అనునది భట్టర్ కు మాత్రమే సాధ్యమైన పని.

13వ శ్లోకమున కవి సర్వేశ్వరుని స్తుతించుటకు తనకు శక్తి లేదనుట, పిమ్మట ఈ శ్లోకమున ఆ మాట అనుటకు కూడ తనకు యోగ్యత లేదనుట నమ్మాళ్వార్లు, తిరువాయ్ మొళి ప్రబంధములోని ప్రథమ శతకములో గల 5వ దశకములో మొదటి పాశురమున **"వానోర్ ఇఱైయై. ఇళ వేఱేழ்ుమ్ తழ్ువియ వెన్దా ఎన్బన్!"** (ప్రథమవయస్సులో నున్న, మిక్కిలి బలిష్ఠములైన ఏడు ఎద్దులను మర్దించిన నా స్వామీ! అని అందునే!) అని పల్కి, తరువాతి పాశురమున, **"ఇమైయోర్ పలరుమ్ మునివరుమ్ ––నినైన్దు నైన్దు. వణఙ్గినాల్, ఉన్ పెరుమై మాశూణాదో?"** (పలువురు నిత్యసూరులు, మునులు నిన్ను తమ మనస్సులో భావించి, భావించి, తమ మనస్సులో ఆర్తిని పొంది, నమస్కరిస్తే, అది నీ గొప్పతనానికి మచ్చే కదా అవుతుంది!) అని పల్కుటను తలపింపజేయుచున్నది.

పూర్వశ్లోకమువలె ఈ శ్లోకముకూడ మంజుభాషిణీ వృత్తమున రచింపబడినది. ఇందుచే కవియొక్క సమయోచిత ఛందఃప్రయోగకౌశలము స్ఫుటమగుచున్నది. "**సజసాస గౌ భవతి మంజుభాషిణీ**" అని దీని లక్షణము.

**తనను తాను స్తుతించుకోవడం భగవంతునకు కూడా సాధ్యం కాదు**

**15. సో అంగ వేద యది వా న కిలేతి వేదః**
**సందేగ్ధ్యనర్ఘవిద మాత్మని రంగనాథమ్ ।**
**స్థానే తదేష ఖలు దోషమలీమసాభిః**
**మద్వాగ్భి రైశ మతిశాయన మావృణోతి ॥**

**ప్ర. అ. –** వేదః = వేదము, సః అంగ న = అతడును (భగవానుడును తన గొప్పతనమును), వేద = తెలిసికొనెనా?, వా = లేక, యది న వేద = తెలియడా?, ఇతి = అని, అనర్ఘవిదం = = గొప్ప జ్ఞానమును కల్గిన, రంగనాథం = శ్రీరంగనాథుని గూర్చి, ఆత్మని = తనలో, సందేగ్ధి = సందేహించుచున్నది, తత్ = అది (అట్లు సందేహించుట), స్థానే ఖలు = యుక్తమే కదా!, ఏషః = ఇతడు (భగవానుడు), దోషమలీమసాభిః = భ్రమ విప్రలంభాది దోషములచే మలినములైన, మత్ = = నా యొక్క, వాగ్భిః = = మాటలచే, ఐశం = ఈశ్వరసంబంధమైన (తన సర్వేశ్వరత్వమునకు తగిన), అతిశాయనం = = గొప్పతనమును, అవృణోతి = మఱుగు పఱచుకొనుచున్నాడు.

**వరివస్య :–** "**తద్వదేవ స్తుతిశక్త్యభావవిభవే ఽ పి భాగితా**" (ఆదిశేషుకు, భగవానునకు వలె, నాకును, భగవంతుని స్తుతించలేకపోవడం – అనే వైభవంలో భాగస్వామ్యం ఉన్నది) అనుచు ముందు శ్లోకమున కవి భగవానుని గొప్పదనమును స్తుతించుట ఆ భగవానునకును సాధ్యము కాదని పల్కెను. తాను అట్లనుటకు తగిన ప్రమాణమును ఇందు కవి ఉట్టంకించుచున్నారు.

భగవానుడు తన గొప్పతనమును తాను కూడా తెలిసికొనగల్గెనో? లేదో? అనుచు వేదపురుషుడును సందేహపడుచున్నాడు. అట్లు సందేహపడుట యుక్తమే. ఇక, అజ్ఞుడనగు నేను సర్వజ్ఞునివలె స్తుతింప ప్రయత్నించుట తగినది కాదు. అయినను, ఈ స్తుతి నా ప్రయత్నమున జరిగినది కాదు. భగవానుడే అజ్ఞాన, విపరీతజ్ఞాన, అసాధుత్వ, అప్రయుక్తత్వ, అలంకారరాహిత్య, అశ్లీలత్వాది శబ్దార్థ దోషములచే జ్ఞాన, సంశయ, విపర్యయాది దోషములచే మలినములగు నా వాక్కులద్వారా తన గొప్పతనమును మఱగు పఱచుకొనగోరుచున్నాడు కాబోలు! నేనేమి చేయగలను? అప్రతిహతమైన భగవత్సంకల్పమునకు అడ్డు ఉన్నదా! — అని భావము.

తైత్తిరీయ బ్రాహ్మణములో రెండవ లష్టకము, ఎనిమిదవ ప్రశ్నలోని తొమ్మిదవ అనువాకమున గల—

**"యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్, సో అంగ వేద యది వా న వేద"**

(ఏ భగవానుడు జగత్తుకు అంతటికి అధ్యక్షుడై, పరమపదంలో ఉన్నాడో, అతడు తన వైభవాన్ని తాను తెలిసికొనగలుగుతున్నాడా? లేక, తెలుసుకొనలేకపోతున్నాడా?) అను వాక్యమును అనుసరించి భట్టరు పై శ్లోకమును రచించిరనుట స్పష్టము. మొదటి పాదములోని 'కిల' అను అవ్యయము పాదపూరకము.

సందేహము నిశ్చయాంతముగా కూడా ఉండవచ్చును. కావున, శ్లోకములోని "**కిల**" అను పదము "**న వేద కిల**" అను నిశ్చయమును తెలుపుననియు చెప్పవచ్చును. సంస్కృతవేదము మొదట సందేహించి, పిమ్మట నిశ్చయింపగా, ద్రావిడవేదము మొదటనే నిశ్చయించుట విశేషము. సర్వజ్ఞుడని పేరును పొందిన భగవానుని నిస్సంకోచమైన జ్ఞానమునకును అందనిది, ఆ స్వామివైభవము — అని అనుటవలన భగవానుని మహిమను పొగడినట్లే అగును. ఈ సందర్భమున—

**" దేవి! త్వన్మహిమావధిః న హరిణా నాపి త్వయా జ్ఞాయతే,**

**యద్యప్యేవ మథాపి నైవ యువయోః సర్వజ్ఞతా హీయతే" (8)**

(దేవీ! నీ గొప్పదనమును నీవు కాని, లేక, విష్ణువు కాని తెలిసికొనలేరు. అది అట్టిదైనను, మీ ఇద్దరి సర్వజ్ఞత్వమునకు లోటు లేదు) అని శ్రీస్తుతిలో శ్రీవత్సాంకులు పల్కుట ఇచట స్మరణీయము. "**అనర్ఘ్యవిద**" మని కొన్నిచోట్ల పాఠాంతరము కన్నడుచున్నను, అది సరి అయిన పాఠము కాదు. అర్ఘమనగా, విలువ. అనర్ఘమనగా, విలువ కట్టుటకు సాధ్యము కానిది – అని అర్థము. జ్ఞానమునకు అనర్ఘత ఏమనగా, సంశయవిపర్యయాదిదోషరాహిత్యము. "**ఆత్మని అనర్ఘవిదమ్**" అను అన్వయమువలన – తన గొప్పతనమునుగూర్చిన అనభిజ్ఞతను కల్గిన శ్రీరంగనాథుడు – అను అర్థము ఏర్పడును.

"స్తోత్రమును మీరు చేయుచు, భగవానుడే దోషభూయిష్ఠములగు నా వాక్కులతో తన గొప్పతనమును మలినముచేసికొనుచున్నాడు – అని మీరనుట అనుట ఎట్లు?" అనినచో, "**దైవం చైవాత్ర పంచమమ్**" (18- – 14) (ఈ విషయంలో దైవం ఐదవ కారణం) అను గీతావాక్యమునుబట్టి, భగవానుని సహకారము, అనుమతి లేనిదే ఏ కార్యము ఫలింపదు. కావున, కవి చేయు ప్రయత్నమున భగవానునకు అన్వయము తప్పక కలదు – అని ఇచట సమాధానము. శేషభూతుడగు జీవుని స్వరూపము పరమాత్మకు అతిశయమును కలుగజేయుటయే. కాని, తన వాక్కులు భగవానుని గొప్పదనమునకు తక్కువదనమును కల్గించుచున్నననుట కవి చమత్కారోక్తి.

"**అతిశాయనే తమభిష్ఠనౌ**" (5-3-55) అను పాణిని సూత్రమును బట్టి "**అతిశాయనమ్**" అని ఇచట ప్రయోగింపబడినది. అతిశాయనమనగా, అతిశయమని అర్థము. "**సో అంగ వేద**" అనునపుడు సంధ్యభావము శ్రుతివాక్యమును యథాతథముగా అనువదించుటచేనని తెలియనగును, "అతిశాయినమ్" అను పాఠాంతరమున్నను, అది అపపాఠమే అగును.

ఇందు వృత్తము వసంతతిలక, "**ఉక్తా వసంతతిలకా తభజా జగౌ గః**" అని దీని లక్షణము.

## శ్రీరంగనాథుడు తనను తానే మలినపరచుకొనుచున్నాడు

**16. స్వం సంస్కృత ద్రావిడవేదసూక్తైః**
**భాంతం మదుక్తైః మలినీకరోతి।**
**శ్రీరంగక్రమః కలభం క ఏవ**
**స్నాత్వాపి ధూళీరసికం నిషేద్ధా? ॥**

**ప్ర. అ. –** శ్రీరంగక్రమః = శ్రీరంగమునందు ఆసక్తి కల్గిన, (లేదా), శ్రీరంగమందు ఆకర్షణీయుడైన శ్రీరంగనాథుడు, సంస్కృత = సంస్కృత వేదముల, ద్రావిడవేద = ద్రావిడవేదముల, సూక్తైః = సూక్తములచే, భాంతం = ప్రకాశించునట్టి, స్వం = తనను, మత్ ఉక్తైః = నా మాటలచే, మలినీకరోతి = మలిన పఱచు కొనుచున్నాడు, స్నాత్వా అపి = స్నానము చేసిన పిమ్మట కూడ, ధూళీరసికం = బూడిదను (దుమ్మును) పూసికొనుటలో ఆసక్తిని కల, కలభం = గున్న ఏనుగును, కః ఏవ = ఎవడైనను, నిషేద్ధా = నివారింపగలడా? (నివారింపలేడు).

**వరివస్య :–** "భగవానుని స్తుతించుటకు వేదపురుషునికే సాధ్యపడనిచో, ఇక మీకు ఈ స్తుతి ప్రయత్నమేల?" అను ప్రశ్నకు కవి చమత్కారముగా ఈ శ్లోకమున సమాధానమిచ్చుచున్నారు. "**ఇవ్విడత్తిల్ "విదివాయ్ క్కిన్ఱు కాప్పారార్?" (తి. వా. 5–1–1) ఎన్ఱు అనుసంధేయమ్**" (ఈ సందర్భమున "భగవంతుని కృప ప్రసరిస్తున్నది, దానిని అడ్డుకొనగలవారు ఎవరున్నారు?" అనే ఆళ్వారుల సూక్తిని అనుసంధించుకోవాలి) అను వాధూల వీరరాఘవాచార్యస్వామి వ్యాఖ్యానసూక్తి ఉట్టంకింపదగినది. అందువలన, ప్రకృతసూక్తికి ఈ ఆళ్వారు సూక్తి మూలమని భావించవచ్చును.

సంస్కృతవేదమున, అంతకు మించి, ద్రావిడవేదమున, భగవానుని స్వరూప స్వభావాదులు వర్ణింపబడియున్నవి. అయినను, ఆ వేదములు రెండును భగవత్స్వరూపమును సంపూర్ణముగా వర్ణించుచున్నవని చెప్పజాలము. నేను వర్ణించినను అట్లే, అసంపూర్ణముగానే ఉండును. కావున, భగవానుని వేదములు స్తుతించుట, నేను స్తుతించుట– – అను ఈ రెండును ఒక విధముగా

సమానములే అగుచున్నవికదా. ఇందువలన, నేనీ ప్రయత్నమును చేయుటలో తప్పు లేదు. అంతేకాక, నేనిట్లు స్తుతించుట నా ప్రయత్నమువలన జరిగినది కాదు. సంస్కృత ద్రావిడవేదములలో ప్రకాశించుచున్న తన స్వరూప స్వభావాదులను భగవానుడు అగు శ్రీరంగనాథుడు నా మాటల ద్వారా మలినపఱచుకొన గోరుచున్నాడు. అనగా, దోషభూయిష్ఠములైన నా మాటలతో నేను స్తుతించునట్లు నన్నొనర్చుటద్వారా శ్రీరంగనాథుడు తన స్వరూపమును తానే మలినము చేసికొనగోరుచున్నాడు. ఇది ఎట్లున్నదనగా, ఒక ఏనుగు గున్న చక్కగా స్నానము చేసినను, పిమ్మట బూడిద మన్నులో పొర్లి, తన శరీరమును ధూళిధూసరితము చేసికొనుటకే ఇష్టపడినట్లుగా ఉన్నది. అట్లు ప్రయత్నించు ఏనుగును ఎవడును ఆపలేనట్లే, సర్వతంత్ర స్వతంత్రుడగు సర్వేశ్వరుని ప్రయత్నమును ఎవడు ఆపలేడు. అతడు నా ద్వారా తన ఈ అభీష్టమును నెరవేర్చుకొనుగాక! దానిని నివారింప ఎవరి తరమును కాదు – అని శ్లోకభావము.

ఇచట, కవి సర్వేశ్వరుని (శ్రీరంగనాథుని) గున్న ఏనుగుతో పోల్చెను. ఈ పోలికవలన – ఏనుగు ఎవరు చెప్పిన మాటను వినక, తన ఇష్టము వచ్చినట్లు ప్రవర్తించునట్లే, భగవానుడును నిరంకుశస్వతంత్రుడని తెలియుచున్నది. మఱియు, తాను చేయు స్తోత్రము భగవానుని కృషిఫలితమేనని, తన ప్రయత్నమువలన జరిగినది కాదని కవి పరోక్షముగా తెలిపినట్లయినది. నమ్మాళ్వార్లు తిరువాయ్ మొళిలో "**ఎన్నాల్ తన్నై ఇన్దమిழ் పాడియ ఈశవై**" (నా ద్వారా తనను తాను తాను తీయని ద్రావిడ వాక్కులతో కీర్తించుకున్న సర్వేశ్వరుడు) (తి. వా. 7-9-1) అని, "**తన్నై త్తాన్ పాడి**" (10-7-5) (తనను తాను కీర్తించుకొని) అనియు పల్కుట ఇట్టిదే. భాగవతమును రచించు. బమ్మెర పోతనామాత్యుడును "పలికించెడివాడు రామభద్రుండట" అని వచించెనుకదా!

ఆళ్వార్లు పలువురు భగవానుని గున్న ఏనుగుతో పోల్చిరి. "**వేழ్త్తిన్ కరుజ్కన్రుపోల్**" (1-7-9) (ఏనుగుకు పుట్టిన గున్న ఏనుగువలె) అని పెరియాళ్వార్లు, "**ఇళజ్కళిఱే**" (8-1-3) (లేత వయస్సులో ఉండే గజమా!)

అని నమ్మాళ్వార్లు పల్కుట ఇవట ఉదాహరింపదగినవి. నిరంకుశస్వాతంత్ర్యమును కల్గియుండుట, ఎల్లప్పుడు ఆశ్చర్యమును. గొల్పుట, గంభీరమైన గమనమును కల్గియుండుట, లక్ష్మీదేవితో నిత్యసంబంధమును కల్గియుండుట, నల్లని దేహమును కల్గియుండుట, తనను వశపరచుకొనుటకు తగిన సాధనమును తానే ఇచ్చుట, దీర్ఘమైన కరములను (తొండమును) కల్గియుండుట – ఇట్లు అనేకవిధములుగా భగవానునకు. ఏనుగుతో సామ్యము కలదు. ఈ కవియే ఈ స్తోత్రమున 80వ శ్లోకమున "**కుంజరం వాఽ. ద్రికుంజే**" (కొండపై పూపొదరిండ్లలో ఉండే ఏనుగువలె) అని శ్రీరంగనాథుని గజముతో పోల్చిరి. కలభశబ్దముచే భగవానుని యౌవన ప్రారంభదశ, నిరంకుశస్వాతంత్ర్యమును సూచింపబడినవి.

వేదమున ఒక్కొక్క విశేషార్థమును ప్రతిపాదించు ఘట్టవిశేషమునకు సూక్తమని పేరు.

భగవానుని స్తోత్రమును పూర్ణముగా చేయగల్గినవారెవ్వరును లేనప్పుడు, మలినములైన వాక్కులతోనైనను నేను స్తుతించు తగినదే. ఒకచో, సమీచీనమైన స్తుతి ఒకటి, రెండు ఉన్నను, నేను నా వాక్కులతో స్తుతించుట స్నానమును చేసిన ఏనుగుగున్న మరల ధూళీస్నానము చేయు చందమగును – అని ఈ శ్లోకములోని తాత్పర్యము.

భగవానుని భీష్ముడు స్తవప్రియుడని సహస్రనామస్తోత్రమున కీర్తించెను ఆ నామమును సఫలము చేసికొనుటకై నాచే స్వామి ఈ స్తోత్రమును రచింపజేసెను – అని చెప్ప వీలు లేదు. ఎందులకనగా, మహనీయులు రచించిన గొప్ప స్తోత్రములెన్నియో కలవు. కావున, "**స్వాతంత్ర్య మైశ్వర మపర్యనుయోజ్య మాహుః**" (వై. స్త. –55) (భగవంతుని స్వాతంత్రం అనేది, ఎవరు దానిని గూర్చి ప్రశ్నించడానికి సాధ్యం కానిది – అని పెద్దలు అంటారు) అనునట్లు, భగవానుని నిరంకుశస్వాతంత్ర్యమే. దీనికి కారణము – అని కవి చమత్కరించుట ఇచటి విశేషము.

**"సంస్కృత ద్రావిడవేదసూక్తైః స్నాత్వా భాంతం మదుక్తైః మలినీకరోతి"** – (సంస్కృత ద్రావిడ వేదసూక్తాలతో స్నానం చేసి, గొప్పగా ప్రకాశిస్తూ ఉండే శ్రీరంగనాథుడు తనను నా వాక్కులతో మలినం చేసుకుంటున్నాడు) స్తవరసికుడగు భగవానుడు అభిషేకసమయమున విచిత్రములగు వేదస్తవములతో స్తుతింపబడినవాడై, మిక్కిలి ప్రసన్నుడై శోభిల్లును. శ్రీరంగమున శ్రీరంగనాథుని అభిషేకసమయమున ఈ నాటికిని భట్టరువంశీయులు స్వామిస్తుతివిషయకములగు శ్లోకములను, చూర్ణికలను విజ్ఞాపించుటను గనునింపవచ్చును. ఈ విషయము పై అన్వయము వలన ధ్వనించుచున్నది. **"సంస్కృత – ద్రావిడ"** అను క్రమము భాషలయొక్క ప్రకృతి వికృతిరూపక్రమమునుబట్టి – అని చెప్పనగును – అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో వివరింపబడినది.

భగవానుని అభిషేక సమయమున వేదసూక్తులను అనుసంధించుట వైదిక సంప్రదాయము. సదాచార్యానుష్ఠానములోనున్న క్రమము. భక్తిసారమునీంద్రులే స్వయముగా తమ అందాదిప్రబంధములో "కుఱై కొండు నాన్మగన్" అనే పాశురములో –,త్రివిక్రమ స్వామిపై లోకములను తన శ్రీచరణముతో కొలిచినపుడు, ఆ శ్రీచరణమును బ్రహ్మదేవుడు అభిషేకించునప్పుడు, **"మఱై కొండ మందిరత్తాల్ వాழ்த్తి"** అనుచు వైదిక సూక్తులను అనుసంధించెను– అని తెలిపిరి కదా. ఇక్కడ **"మఱై కొండ మందిరత్తాల్"** (వేద సూక్తులను గ్రహించిన మంత్రముతో) అనసూక్తిని వివరించుచు శ్రీకృష్ణ సూరి పురుష సూక్తాదులు అని వివరించిరి. ఇక్కడ, ఆదిశబ్ద ప్రయోగం ద్వారా ఆళ్వారుల దివ్య సూక్తులు కూడాగ్రహించదగినవే. ఎందుకనగా, వేదార్థములను అంతర్భవించుకున్నవి కదా, దివ్య సూరుల సూక్తులు.

**"పంచవర్షగజో బాలః పోత స్తు దశవార్షికః,**
**విక్కో వింశతివర్ష స్తు కలభః త్రింశదబ్దకః"**

అను ప్రమాణమునుబట్టి, 30 సంవత్సరములను కల్గిన ఏనుగునకు కలభమని పేరు. త్రిదశులనగా దేవతలు. దేవాధిదేవుడగు శ్రీరంగనాథుని కలభముగా రూపించుట మిక్కిలి తగినది కదా. '**శ్రీరంగకమ్రః**' అనుటకు శ్రీరంగక్షేత్రమున నుండు అత్యంతమనోహరమైన రూపము కలవాడు – అని, శ్రీరంగమున నివసింపవలెనను కోరికను కలవాడని చెప్పవచ్చును. (మొదటి వివరణమువలన) అతిలోక సుందరుడనుటచే పరత్వము, శ్రీరంగనివాసరసికత్వముచే సౌలభ్యమును చెప్పబడుచున్నదని, కావున, "**శ్రీరంగకమ్రః**" అను పదము శ్రీరంగనాథుని పరత్వసౌలభ్య సూచకమని తెలియనగును.

ఇందు వృత్తము ఇంద్రవజ్ర, "**స్యా దింద్రవజ్రా యది తౌ జగౌ గః**" అని దీని లక్షణము.

## భట్టర్ ఈ స్తుతిని రచించుటకు గల కారణములు

**17. కిం తు ప్రపత్తిబలతారితవిష్ణుమాయా–**
**– మద్వంశ్యరాజకులదుర్లలితం కిలైవమ్ ।**
**శ్రీరంగరాజకమలాపదలాలితత్వం.**
**యద్వా ఽ పరాధ్యతి మము స్తుతిసాహసే ఽ స్మిన్ ॥**

**ప్ర. అ. –** కిం తు = కాని (అట్లయినను), ప్రపత్తిబల = ప్రపత్తియొక్క బలముచే, తారిత = దాటింపబడిన, విష్ణుమాయా = భగవానుని మాయను కల్గినవారగు, మత్ వంశ్య = నా వంశమునందలి పూర్వులయొక్క, రాజకుల = రాజకులమున జన్మించినందున కల్గిన, దుర్లలితం = గర్వము, ఏవం కిల = ఇట్టిది కదా! (ఇట్లు స్తుతించునట్లు నన్ను చేయునది కదా!), యద్వా = లేక, శ్రీరంగరాజ = శ్రీరంగనాథునియొక్క కమలా = శ్రీరంగనాయకియొక్క, పద = పాదములచే (పాదసన్నిధియందు). లాలితత్వం = లాలింపబడుట (యే), మమ =

నాయొక్క, అస్మిన్ = ఈ, స్తుతిసాహసే = స్తుతి అనెడి సాహసమునందు, అపరాధ్యతి = అపరాధమొనర్చుచున్నది.

**వరివస్య :–** నిరంకుశ స్వతంత్రుడైన శ్రీరంగనాథుడు తమను పురస్కరించుకొని ఈ స్తోత్రమును పల్కించుచున్నాడని ముందు శ్లోకమున పల్కిన భట్టరు, ఈ శ్లోకమున, తామట్లు స్తుతించుటకు మరి రెండు హేతువులను తెలియజేయుచున్నారు.

స్తోత్రమునకు నన్ను కారణముగ చేసి, నన్ను నేనే మలినపఱచుకొనుచున్నానని మీరు అనుచున్నారే! మీరు కర్త కారా? మీరు ఉదాహరించిన గీతాశ్లోకములోనే "**అధిష్ఠానం తథా కర్తా**" (భ. గీ. 18–14) (అధిష్ఠానం, ఆ విధంగానే కర్త) అని "**మీరును కర్త**" అని యున్నది కదా. మీ కర్తృత్వము మదాయత్తము అయినను, మొదటి మీ ప్రయత్నమే కదా కారణము. "**వైషమ్యనైర్ఘృణ్యే న, సాపేక్షత్వాత్**" (భగవానుడు విషమస్వభావాన్ని కలవాడు,దయలేనివాడు – అనే దోషములు అతని యందు లేవు, ఎందుకనగా, జీవులు పూర్వము చేసిన కర్మలను అనుసరించి వారికి ఫలములను ఇచ్చును కనుక) అని శాస్త్రము కూడా చెబుతున్నది కదా. మీ ప్రయత్నమును అనుమోదించుటయే నా పని. కావున మీరిట్లు స్తుతి అను సాహసమును ఎందులకు చేసితిరి? – అని భగవానుడు. ప్రశ్నించును – అని భావించిన కవి, ఇందు తమ సాహసమునకు రెండు హేతువులను తెలుపుచున్నారు. అందులో ఒకటి కులాచారము. రెండవది తల్లిదండ్రుల గారాబమును. "**కులధర్మా శ్చ శాశ్వతాః**" (భ. గీ. 1–43) (కులానికి సంబంధించిన ఆచారములు నిత్యమైనవి) అనునట్లు, కులాచారము ప్రబలము, ఈ శ్లోకమున "**యద్వా**" అను పక్షాంతరమును పల్కుటద్వారా కవియొక్క స్తుతిసాహసమునకు భగవానుడే కారణమనుట విశేషము.

"**వఞ్జ ముక్కుఱుమ్బామ్ కుఴియై క్కడక్కుమ్**" (ఇ రా. –7) (కూరేశులు, వంచించునట్టి అభిజన–విద్యా– విత్తములను మూడు విధములైన

లోతైన గుంటలను దాటినవారు) అని ప్రసిద్ధినొందిన శ్రీవత్సాంకుల కుమారులై జన్మించుట ఒక కారణము కాగా, సాక్షాత్తు శ్రీరంగనాథుడు, శ్రీరంగనాయకి గారాబముగా తమను పెంచి పెద్ద చేయుట వేరొక హేతువు. ఈ రెండును తామీ స్తుతిని చేయుట – అను సాహస ప్రవృత్తికి హేతువు లనుచున్నారు.

**"మమ మాయా దురత్యయా"** (భ. గీ. 7–14) (నా మాయ దాటరానిది) అని శ్రీకృష్ణభగవానుడు గీతలో పల్కినట్లు భగవన్మాయ ఎవరికైనను దాటరానిది. ఆ మాయను దాటుటకు ప్రపత్తి ఒక్కటే తగిన ఉపాయము. ఈ రహస్యమును భగవానుడే గీతలో **"మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే"** (భ. గీ. 7–14) (ఎవరు నన్ను ప్రపత్తి చేయుచున్నారో, వారే ఈ మాయను దాటగలుగుచున్నారు) అనుచు ప్రకటించెను. ఇట్టి అపూర్వమైన ఉపాయమగు భగవత్ప్రపత్తి ద్వారా సర్వేశ్వరుని మాయను జయించినవారు ఆళ్వార్లు, పూర్వాచార్యులును. వారి కోవలోనికి చెందినవారు శ్రీవత్సాంకులు. వారికి నేను పుత్రుడనన్న గర్వమే నన్నీ సాహసకార్యమును జేయ పురికొల్పినది. ప్రభువుల ఆదరణను పొందినవారు తమను రాజు దండించునను భయము లేనివారై, గర్వించి సాహసములను చేయునట్లే, ఆచార్య సార్వభౌములగు. శ్రీవత్సాంకుల కుమారుడనను అవలేపమే నన్నీ పనిని చేయించుచున్నదను రమ్యమైన భావము **"రాజకులదుర్లలితమ్"** అను పదముల స్వారస్యముచే ఏర్పడుచున్నది. ఇది శ్లోకపూర్వార్ధములోని విషయము.

**"రాజకుల దుర్లలితమ్"** అనునప్పుడు, రాజకుల శబ్దమునకు దివ్యసూరుల కులము– అను అర్థము కనుక,షదివ్య సూరుల వంశాచారము భగవంతుని స్తుతించుటయే కనుక, కులాచారము ప్రకారము నడుచుకొనుటలో ఏ దోషము లేదు కనుక, తాముఈ స్తుతిని రచించుటలో ఏ దోషము లేదు– అని కవి అనుకున్నారని కూడా చెప్పవచ్చును.

శ్లోకములోని ఉత్తరార్ధము రెండవ హేతువును వివరించుచున్నది. శ్రీరంగనాథుడు, శ్రీరంగనాయకియు పరాశరభట్టరును తమ పుత్రునిగా

అభిమానించి, లాలించిరని వారి చరిత్రను తెలుపు గ్రంథములను బట్టి తెలియుచున్నది. కవి ఆ ఐతిహ్యాము నిచట పరోక్షముగా **“శ్రీరంగరాజకమలాపదలాలితత్వమ్”** అనుట ద్వారా తెలియజేసిరని చెప్పనగును.

“దివ్యదంపతుల పాదసన్నిధిలో పెరిగి, వారి అభిమానమునకు పాత్రుడనైతిని, కావున వారు నన్ను దండింపరు – అను గర్వము నేనీస్తుతిని రచించుటలో వేరొక హేతువు” అని భావము. శ్రీవత్సాంకులు, గోవింద భట్టరు, ఎమ్బెరుమానార్లు (శ్రీరామానుజులు) మొదలగు ఆచార్యవర్యుల అభిమానమును పొందగల్గితిని, కావున, వారు నన్ను క్షమింతురను ధైర్యముచే, నన్ను పుత్రస్వీకారమొనర్చుకొని, లాలించి పెంచిన శ్రీరంగనాయకి, శ్రీరంగనాథులకు నా మాటలు సదోషములే అయినను, తల్లి తండ్రులకు బిడ్డ ముద్దు మాటలు వినసొంపుగా నుండునట్లు, ఆనందమును కల్గింపగలవను నిశ్చయముచే భగవానుని స్తుతించుట అనునది దుష్కరమైనను వెఱువక, నేను ఆ పనిని చేయనెంచితిని – – అనునది ఈ శ్లోకములోని సారాంశము.

మాయ అనగా, ప్రకృతి. మాయను దాటుట అనగా, ఆ ప్రకృతి సంబంధమునకు లోనుగాకుండుట.

స్తుతి సాహసమగునా? అనినచో, మలినములైన వాక్కులతో భగవానుని స్తుతించుట అపరాధమగును, కావున, అట్టి పని సాహసమే అగునని భావము. నన్ను పెద్దలు క్షమించుటకు మహాకులప్రసూతత్వము, దివ్యదంపతులు క్షమించుటకు శ్రీరంగరాజకమలాపదలాలిత్వము కారణమగును – అని కవి భావము, శాస్త్రప్రకారము ఈ స్తుతిసాహసములోని ప్రయత్నము నాదేనని అనవచ్చును. కాని, నేను కర్త కాను – అను భావము “**కిం తు**” అనుటద్వారా వ్యక్తమగుచున్నది. శ్రీరంగనాథుని స్తుతించుట మా వంశమున అనుగతముగా వచ్చుచున్న ఆచారమని తాత్పర్యము. “**ప్రపత్తిబలతారిత**” అనుటకు “ఆచార్యుల పురుషకారబలముచే దాటింపబడిన” – అని భావము. “**మమ మాయా**

**దురత్యయా**" (భ. గీ. 7-14) (నా మాయ దాటరానిది) అనునట్లు, విష్ణుమాయ దాటుటకు సాధ్యము కానిది. ఆ మాయను జయించుటకు గొప్ప బలము ఆవశ్యకము – అను విషయము ఇచట బలశబ్దముచే ద్యోతకమగుచున్నది. "**రాజకుల**" శబ్దము – రాజపుత్రాపరాధము క్షమార్హము అగునట్లే, నా సాహసమును క్షమార్హమే అను భావమును తెలుపును, రాజశబ్దముచే యతిరాజులు అని గాని, కూరేశులు అని గాని లేక, ఇద్దరు అని గాని, లేక,రాజశబ్దమును నాథశబ్దమునకు పర్యాయముగా, గ్రహించి, నాథమునులు అను అర్థమును కూడా గ్రహించవచ్చును. ఉభయ వేదాంత సంప్రదాయము నాథమునులతో ప్రారంభమైనదికద. లేక, ప్రపన్నకులపతిగా చెప్పబడు నమ్మాళ్వారులు అని కూడా చెప్పవచ్చు శ్రీరంగరాజపరిజనములో ఒకరగుటచే, తమను రాజకులములో చేరినవారిగా కవి పల్కిరనియు చెప్పనగును.

"**మద్వంశ్యరాజ**" అనునపుడు "**రాజ**" శబ్దము "రాజా ప్రకృతిరంజనాత్" (రఘు. 4-12) (ప్రజలను రంజింప చేయడంవల్ల రాజు అనబడుతున్నాడు) అను ప్రసిద్ధినిబట్టి, లోకమున కంతటికిని మోదమును కల్గించు జ్ఞానభక్తివైరాగ్యములను కల్గి, దివ్యప్రబంధములను, స్తోత్రములను అనుగ్రహించిన ఆళ్వార్లను, ఆచార్యులను సూచించును. ప్రకృతము ఉదాహరించిన రఘువంశశ్లోకములోని రాజశబ్దమును మల్లినాథసూరి వ్యాఖ్యానించుచు, "**యద్యపి రాజశబ్దో రాజతేః దీప్త్యర్థత్వాత్ కనిన్ ప్రత్యయాంతో, న తు రంజనే, తథాపి ధాతూనా మనేకార్థత్వాత్ రంజనాత్ రాజేత్యుక్తం కవినా**" (రాజపదం దీప్తి అనే అర్థాన్ని కలిగిన రాజధాతువునుండి పుట్టినదై, కనిన్ ప్రత్యయాన్ని కలిగినది అయినందువల్ల, రంజనమనే అర్థాన్ని చెప్పకపోయినప్పటికీ, ధాతువులకు అనేకార్థాలు ఉన్నందున, ఇక్కడ రాజశబ్దానికి రంజనం అనే అర్థం కవిచే చెప్పబడింది) అని పల్కెను. వాధూల వీరరాఘవాచార్యస్వామివారు "**భవభూతిభావతలస్పర్శ**" అను

ఉత్తరరామచరితవ్యాఖ్యలో "**రాజా ప్రజాపతిసమో జనకః పితా తే**" (1–9) (ప్రజాపతిసముడు రాజు అయిన జనకుడు నీ తండ్రి) అను చోట రాజశబ్దమును ఇట్లే వ్యాఖ్యానించిరి. కావున 'రాజ' అను ధాతువునకు రంజనార్థములోకూడ వృత్తిని చెప్పనగును. "**శ్రీరంగరాజకమలాపద**" అనునపుడు '**పద**' శబ్దము పూజావాచిగా కూడ అన్వయింపవచ్చును. "**ప్రపత్తిబలతారితవిష్ణుమాయా**" అనుచోట "ప్రపత్తి వైభవముచే దాటింపబడిన విష్ణుమాయను కలవారు" అని, "ప్రపత్తిని సాధనముగా గొని, విష్ణుమాయను దాటినవారని" అర్థమును రెండు విధములుగా చెప్పవచ్చును. కాని, మొదటి అర్థమే మిగుల సరసము.

ఇందు వృత్తము వసంతతిలక.

**భగవంతుని స్తుతించడం అనేది సాపేక్షం, అందువల్ల నేనుకూడా స్తుతించవచ్చు**

**18. నాథస్య చ స్వమహిమార్ణవపారదృశ్వ–**
**విజ్ఞానవాగ్విలసితం సహతే న వేదః ।**
**ఆపేక్షికం యది తదస్తి మమాపి, తేన**
**శ్రీరంగిణః స్తుతివిధా వహ మధ్యకార్షమ్ ॥**

**ప్ర. అ. –** వేదః చ = వేదముకూడ, నాథస్య = భగవానునియొక్క, స్వ మహిమ = తన మహిమ అనెడు, అర్ణవ = సముద్రముయొక్క, పారదృశ్వ = అంతమును చూచిన, విజ్ఞాన = గొప్ప జ్ఞానముయొక్క, వాక్– విలసితం = మాటల విలాసమును, న సహతే = సహించుట లేదు, (తత్) ఆపేక్షికం యది = (ఆ వాగ్విలాసము) స్తుతించుట సాపేక్షమైనదో, (స్తుతించుటలో " అతని కంటె ఇతడు సమర్థుడు " అను సాపేక్షత ఉన్నదనిన), మమ అపి = నాకుకూడ (ఆ సాపేక్షత), అస్తి = కలదు, తేన = ఆ కారణముచే, శ్రీరంగిణః = శ్రీరంగనాథునియొక్క, స్తుతివిధౌ = స్తోత్రము చేయుటలో, అహం = నేను, అధ్యకార్షమ్ = అధికారమును కల్గినవాడనైతిని.

**వరివస్య :-** తన మహిమను తెలియుటకు భగవానునకును సాధ్యమగునో? కాదో? అని వేదము సైతము సందేహించుచున్నదని కవి 15 వ శ్లోకమున పల్కెను. ఆ విషయమిచట స్మరింపదగినది. ముందు శ్లోకములలో భగవానుని మహిమను స్తుతించుటకు తనకు అధికారము లేదనిన కవి, ఇందు తమకు సాపేక్షమైన శక్తి కలదనుచున్నారు.

"స్తోత్రమును చేయువానికి ఉండదగిన విషయములు రెండు; ఒకటి – స్తుతించవలెను – అను అపేక్ష. రెండు – స్తుతించడానికి తగిన సామర్థ్యము. ఈ రెండిటిలో, స్తుతిని చేయవలెను అపేక్ష మీకు కలదనుటను పూర్వశ్లోకమున మీరే తెలియజేసిరి. ఇక, రెండవది అయిన సామర్థ్యము లేదని మీరే పల్కుచుంటిరి, మఱి, మీరు స్తుతింప ప్రయత్నించుట ఎట్లు తగును?" అని భగవానుడు. ప్రశ్నింపవచ్చునని తలచిన కవి, ఇందు ఆ ప్రశ్నలకు సమాధానమును మనోహరముగా, చమత్కారముగా తెలుపుచున్నారు.

అధికార –అనధికార విషయమున వేదమే కదా ప్రమాణము. "భగవానుని పూర్ణముగా స్తుతించుటలో ఎవరు అధికారి?" అని వేదమును ప్రశ్నించినచో, అనంతశక్తిమంతుడగు భగవానునకును ఆ శక్తి లేదని సమాధానము పల్కుచున్నది. కావున, భగవంతుని పూర్ణముగా స్తుతింపగల్గిన శక్తిని కల్గియుండుట –అనునది స్తోత్రాధికారివిశేషము – అనుట పొసగదు. ఇక, స్తోతశక్తి సాపేక్షము అయినా చాలునన్నచో, భగవానుని శక్తివలె నా శక్తియు సాపేక్షమే. కావున, భగవంతుని స్తుతించుటలో నాకు యోగ్యత ఉన్నది. – అని పల్కుటద్వారా కవి తగిన సమాధానమును ఒసగుట ఇచటి విశేషము.

వేదపురుషుడు "**సో అంగ వేద యది వా న వేద**" (ఆ భగవానుడు కూడా తన వైభవమును తెలిసికొనగలుగుతున్నాడా? లేదా?) అనుచు, సర్వేశ్వరుడును తన మహిమను తెలియునో? తెలియడో? అని సందేహించినను, తనకంటే తక్కువ శక్తిని కల్గినవారి కంటే తాను కొంతవరకు అధికముగా స్తుతింపగలదు. కావున, అది యథాశక్తి స్తుతించెను. కనుక, వేదము చేయు

భగవత్ స్తుతికూడ సాపేక్షమని ఏర్పడుచున్నది. అట్లే, నా శక్తి కంటె తక్కువ శక్తిని కల్గినవారు చేయు స్తుతి కంటె నేను ఎక్కువగా భగవానుని స్తుతింపగలను. ఈ లోకమున నా కంటె తక్కువ శక్తిని కలిగిన వ్యక్తి, ఎవడో ఒకడు, ఎక్కడో ఒకచోట ఉండకపోడు. అతని కంటె నేను బాగుగా స్తుతింపగలను. కావున, నా స్తుతికూడా సాపేక్షమే. అందుచే, వేదపురుషునివలె, నేనును నా శక్తికొలది భగవానుని స్తుతించుటలో తప్పు లేదుకదా – అని శ్లోకభావము.

యామునాచార్యులవారు స్తోత్రరత్నమున "**యద్వా, శ్రమావధి**" (9) అను శ్లోకమున "సర్వేశ్వరుని స్తుతించుటలో వేదములు, చతుర్ముఖుడు అసమర్థులైనట్లే, నేను కూడ అసమర్థుడనే. మహాసముద్రమున మునిగి పోవుటలో కులపర్వతమునకు, అణువునకును మధ్య భేదము కలదా?" అని పల్కిరి. భట్టరు ఈ శ్లోకములోని భావమును గ్రహించి ప్రస్తుతశ్లోకమును రచించినట్లు తోచును. ఇట్లు పూర్వాచార్యుల సూక్తులను అనుసరించి పలుకుతున్నను, వాటికి మరింత మెరుగులు దిద్దుట ఈ కవికే సాధ్యము.

స్వరూపముచే, గుణముచే, మహత్త్వము సముద్రమునకును కలదు. కావున, భగవానుని మహిమకు సముద్రము ఉదాహరణముగా ఇచట పేర్కొనబడినది.

"**ఆపేక్షికమ్**" అనుటకు అపేక్షవలన, అనగా, కోరికవలన పుట్టినదను అర్థము చెప్పవచ్చును. అపుడు, భగవానుని స్తుతించుట – అను అపేక్ష వేదమునకున్నట్లే, నాకును కలదను భావము వచ్చును. తన మహిమను పూర్తిగా తెలిసికొని, వర్ణింప కల్గిన శక్తి లేని భగవానునకును తన శక్తికి, కోరికకు తగినట్లు తన గొప్పతనమును వర్ణింపతగిన వాక్ శక్తి ఉన్నవో, అట్టి శక్తి నాకును కలదు– అను వివరణము సంస్కృతవ్యాఖ్యానమున, కొన్ని తెలుగువ్యాఖ్యానములలోను కన్పించుచున్నది.

వేదము భగవానుని పూర్ణముగా వర్ణించు శక్తి ఆ స్వామికి ఉన్నదనుట కూడ సహింపదు. స్వామియొక్క మహిమ అపారము అనుటలో వేదమునకు

అంతటి పక్షపాతము. వేదము అలౌకికవస్తువిషయకమైన యథార్థజ్ఞానమును కల్గించును కదా! నాథుని మహినును అనంతమనుట తత్త్వము. అది అలౌకికము. తత్త్వబోధకమగు వేదము "నాథునివలనకూడ తన్మహిమ పరిచ్ఛేదింప సాధ్యము కాదు" – అనెను, తన మహిమను పూర్ణముగా వర్ణించుటకు శక్తి లేని భగవానుని స్తుతిశీలతను వ్యాసభగవానుడు "**స్తోతా**" అనుటచే తెలియజేసిరి, "**యద్యదారతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః**" (లోకములో గొప్పవాడు ఏ ఏ కార్యాలను చేస్తాడో, వాటినే మిగిలినవారు కూడా ఆచరిస్తారు) (భ. గీ, 3-21) అనునట్లు భగవానుని అచరణ అందఱకును ఆదరణీయము. కావున, మనకు భగవానుని స్తుతించుటలో సంపూర్ణశక్తి లేకున్నను, స్తుతించుటకు అధికారము కలదని ఆ నామమువలననే మనకు తెలియుచున్నది – అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో వివరింపబడినది.

శ్లోకమున 'విధి' అను పదమును, "**లుజ్**" ఆకారములోని "**అధ్యకార్షమ్**" అను క్రియను ప్రయోగించుబద్వారా కవి స్తుతిచేయుటలో అధికారముయొక్క సిద్ధత్వమును సూచించిరి. "**విజ్ఞానవాగ్విలసితమ్**" అనునపుడు "**విజ్ఞానం చ వాగ్విలసితం చ**" అను విగ్రహమును చెప్పవచ్చునని శ్రీరామానుజాచార్య వ్యాఖ్యానమున కలదు. అపుడు, ద్వంద్వమునకు ఏకవద్భావము వచ్చినదని చెప్పవలెను.

ఇందు, వృత్తము పూర్వమువలెనే వసంతతిలక.

## శ్రీ రంగనాథుని స్తుతించడం వల్ల స్తోతకే లాభం

**19. అన్యత్రా ఽ తద్గుణోక్తి ర్భగవతి న తదుత్కర్షచౌర్యైః పరేషాం**
**స్తుత్యత్వాత్ యావదర్థాః ఫణితిరపి తథా తస్య నిస్సీమకత్వాత్ ।**
**అమ్నాయానా మసీమ్నా మపి హరివిభవే వర్షబిందో రివాబ్ధౌ**
**సంబంధాత్ స్వాత్మలాభో, న తు కబలనతః స్తోతు రేవం న కిం మే?**

**ప్ర. అ. –** అతద్గుణ –ఉక్తి = స్తుతింపదలచిన వ్యక్తి యందు లేని గుణములను ఆరోపించి చేయు స్తోత్రము అనునది, అన్యత్ర = సర్వేశ్వరుని విషయమున కాక వేరొకచోట (వ్యక్తి) యందే కలదు, భగవతి = భగవానునియందు, న = లేని గుణములను ఆరోపించి స్తుతించుట అనునది అసంభావితము, తత్ ఉత్కర్షచౌర్యైః = ఆ భగవానునియొక్క గొప్పతనమును దొంగిలించుట ద్వారా, పరేషాం = ఇతరులయొక్క, స్తుత్యత్వాత్ = స్తుతిని చేయవలసివచ్చుటవలన, యావత్అర్థాః = ఉన్న గొప్పతనము నంతటిని స్తుతించునట్టి, ఫణితిః = మాటల పద్ధతి, అపి = కూడ, తస్య = ఆ సర్వేశ్వరుని గొప్పతనముయొక్క, నిస్సీమకత్వాత్ = అవధిలేనితనముచే, తథా = అట్టిదే (భగవానుని విషయమున అసంభావితమే), అసీన్నాం = అవధి లేని, అమ్నాయానామ్ అపి = వేదములకు సైతము, వర్షబిందోః = వర్షపు చినుకునకు, అబ్ధౌ ఇవ = సముద్రమునందు సంబంధమును పొందుటచే వలె, హరివిభవే = సర్వేశ్వరుని గొప్పతనము నందు, సంబంధాత్ = సంబంధమును పొందుటవలన (సర్వేశ్వరుని వైభవమును స్తుతించుటలో అన్వయించుట వలన) మాత్రమే, స్వ ఆత్మలాభః = తన సత్తను పొందుటయే కానీ, న తు కబళనతః = భగవద్వైభవమును పూర్తిగా కబళించుట వలన (వర్ణించుటవలన) కాదు, స్తోతుః = సర్వేశ్వరుని స్తుతించు, మే = నాకు, ఏవం = ఇట్లు సంబంధమును కల్గియుందుట అనునది (సత్తా లాభమును పొందుట), న కిమ్ = లేదా ఏమి? (ఉన్నదని భానము).

**పరివస్య :–** నిరవధిక వైభవమును కల్గిన సర్వేశ్వరుని స్తుతించుట అనునది ఎట్టివారికైనను, ఏ విధముగానైనను సాధ్యము కానిదని ముందు శ్లోకములలో విస్తరముగా నిరూపించిన పిమ్మట, కవి, ప్రస్తుత శ్లోకమున "లోకమునందలి ఆ యా జనులు తమ శక్తి కొలది భగవద్వైభవమును పొగడుట తమ పలుకులకు విలువను కలిగించుకొనుటకే గాని, తాము ఆ వైభవమును పూర్ణముగా స్తుతింపగల్గుటచే కాదు; కావున, వారివలెనే, నేనును నా శక్తికొలది భగవానుని స్తుతించి సత్తా లాభమును పొందవచ్చును. కదా! అందుచే

నేనుచేయు ఈ స్తుతి పరిహాసాస్పదము కానేరదు" అని కవి పల్కుచున్నారు. కవి భగవానుని స్తోత్రము చేయుటవలన తమకు ఆత్మలాభము కలిగెనని అనుటను **"స్వాత్మలాభః"** అను ప్రయోగముచే సూచించిరి.

లోకమున స్తుతి రెండు విధములుగా నున్నది. ఒకనియందు లేని గుణములను అతనియందు ఆరోపించి చేయు స్తుతి ఒకటి. ఒకనియందు గల గుణములను ఉన్నవి ఉన్నట్లుగా వర్ణించుట వేరొక విధమైన స్తుతి. ఈ విధములైన స్తోత్రములు రెండును భగవానుని విషయమున సాధ్యపడునవి కావు. నిస్సమాభ్యధిక గుణశాలి అయిన భగవానునియందు వేరొక వ్యక్తిలో గల గుణములను ఆరోపించి, స్తుతించుట సాధ్యపడునది కాదు. శ్రీవత్సాంకులు శ్రీస్తవమున–

**"స్తోత్రం నామ కి మామనంతి కవయో యద్యన్యదీయాన్ గుణాన్**
**అన్యత్ర త్వసతో ఽ ధిరోప్య ఫణితిః సా తర్హి వంధ్యా త్వయి"** (3)

(స్తోత్రం అని దేనిని కవులు అంటున్నారు? ఒకరిలో ఉండే మంచి గుణాలను, ఆ గుణాలు లేని వేరొకనిలో ఆరోపించి చెప్పుట స్తుతి అని చెప్పబడుతున్నది) అని పల్కుట ఇచట స్మరింపదగినది. భగవద్గుణములను చౌర్యము చేసి, వేరొక వ్యక్తియందు వానిని ఆరోపించి పొగడుటయే సాధ్యము. అట్లే, భగవానుని గుణములను యథాతథముగా వర్ణించుటయు అసంభావితమే. భగవద్వైభవము మాటలకందునది కాదు కదా! వేదములును "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" (తై. ఆనం. 9) (భగవద్గుణవైభవమును వేదవాక్కులు కూడా స్తుతించలేక వెనుకకు మరలుచున్నవి) అనుచు భగవద్వైభవమును వర్ణింపలేక వెనుకకు మరలినవి కదా! నమ్మాళ్వారులు **"ఒట్టురైత్తు ఇవ్వులకున్నై ప్పుకழ்వెల్లామ్ పెరుమ్బాలుమ్ పట్టురైయాయ్ పుట్కొన్టే కాట్టుమాల్ పరంజోతీ!"** (తి. వా. 3-1-2) (ఓ పరంజ్యోతి స్వరూపా! ఈ లోకము నీకు ఉపమానముగా కొన్నిటిని చెప్పి చేయు స్తుతి అంతయు ప్రాయశః తమకు తోచినట్లు చెప్పునట్టిదై, దోషమునే చూపును) అని తిరువాయెమొళి

దివ్యప్రబంధమున పల్కిెది. ఇచట **“పట్టురైయాయ్”** అనుటకు ఈడు వ్యాఖ్యానమున **“పట్టతురైక్కె – –నెఞ్జిల్ పట్టత్తై చ్చొల్లుకై. విషయత్తై ప్పారాదే ప్రతిపన్నత్తై చ్చొల్లుకై”** (మనసులో తోచినదానిని చెప్పడం. వర్ణించే విషయంలో ఉండే వైభవాన్ని ఉన్నది ఉన్నట్లుగా చూడకుండా, తనకు తోచిన దానిని చెప్పడం) అని వివరింపబడుట గమనింపదగినది.

అట్లయిన వేదములు, లోకమున మహనీయులు, మహాకవులు చేయు భగవద్గుణస్తుతి ఎట్టిది? అనిన, – మేఘము వర్షించునపుడు భూమిపై వలెనే సముద్రమునందును వర్షబిందువులు పడును. ఆ బిందువులు పడుటవలన సముద్రపరిమాణమున ఇసుమంతయు ఆధిక్యము ఏర్పడదు. భూమిపై పడిన నీటిబిందువునకు నామరూపము లేమియు మిగులవు. సముద్రములో పడిన చినుకు తన ద్రవరూపమును పోగొట్టుకొనక, ఆ రూపముతోనే మిగులును. అట్లు నిలువగల్గుట ఆ చినుకునకే లాభము కాని, సముద్రమునకేమాత్రము లాభము కాదు. మరియు, ఆ బిందువు సముద్రమునందంతటా వ్యాపించ లేదు. ఆ విధముగానే, భగవద్వైభవమును స్తుతింప గల్గినపుడే ఏ మాటకైనను విలువ కల్గును. లేనిచో, అది విలువ లేనిదే అగును. భగవానుని స్తుతించువారికి సత్తా లాభమును కల్గును. అంతమాత్రమున వారు చేయు స్తుతివలన భగవానునకు అంతకు ముందు లేని ఒక గొప్పతనము సిద్ధించుననియో, లేక, వారు పూర్ణముగా భగవన్మహిమను స్తుతింపగల్గిరనియో చెప్ప సాధ్యము కాదు. అట్లు వర్ణించు శక్తి **“అనంతా వై వేదాః”** (వేదములు అనంతములుకదా) అని అనంతములుగా ప్రసిద్ధి చెందిన వేదములకే లేనపుడు, మిగిలినవారిని గూర్చి చెప్పవలసినది లేదు కదా! కావున, లోకమున వారు వారు తమ తమ వాక్కులకు సాఫల్యము కల్గుటకొఱకు మాత్రమే భగవంతుని స్తుతించుచున్నారనుట యుక్తము. ఆ విధముగానే, నేనును నా శక్తికొలది శ్రీరంగనాథుని స్తోత్రము చేసి, నా మాటకు విలువను సంపాదించుకొనుటలో తప్పులేదు కదా! – అని శ్లోకభావము.

భగవద్వైభవమును పూర్ణముగా స్తుతింపలేకున్నను, నేను నా స్వరూపసత్తను పొందుటకు ఏకదేశస్తుతిని అయినను నేనెరిగిన మాటలతో స్తుతించెదనని ఈ శ్లోకములోని సారాంశము. "**దేహసంపత్తిః ఈశ్వరాయ నివేదితుమ్**" (విష్ణుతత్త్వే) (దేహమను సంపద భగవంతునకు నివేదించుట కొరకు ఉన్నది) అని కదా సూక్తి.

★"**తదుత్కర్షచౌర్యైః పరేషాం స్తుత్యత్వాత్**" అనుటకు శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో ఇట్లు వివరణము చూపబడినది. స్తుతి అనగా, గుణవిషయకమైన ఉత్కర్షవచనమే కదా! భగవానునియందే స్వతఃసిద్ధమైన ఉత్కర్ష కలదు. మిగిలినవారిలో గల ఉత్కర్ష స్వతఃసిద్ధమైనది కాదు. అది, భగవదనుగ్రహమువలన కల్గినది,. మఱియు, అంశమాత్రమైనది. కావున, లోకమున ఒక వ్యక్తిని స్తుతించునపుడు భగవానునిలో గల ఉత్కర్షను గైకొని, దానిని స్తుతింపదలచిన వ్యక్తియందు ఆరోపింపవలసియున్నది. లేని గుణమును వర్ణించుట వ్యక్తిస్వభావవర్ణనము కాదు, కావున, వితథవర్ణనమే అగును. అంతేకాక, భగవదనుగ్రహమువలన ఒక వ్యక్తికి కల్గిన ఉత్కర్ష స్వాభావికము కాదు. భగవదధీనమగుటచే అది సోపాధికము. కావున దానిని స్వాభావికముగా వర్ణించుట వితథవర్ణనమే అగును, అట్లుకాక, తాను పొగడదలచిన వ్యక్తిలోని గుణము భగవదంశసంభవమని వర్ణింతును – అనిన, అట్లు పల్కుట భగవానుని స్తుతించినట్లే అగును, కాని, ఆ వ్యక్తిని స్తుతించునట్లు కాదు. భగవానుని కంటే వేరొక వ్యక్తియందు కన్పించు ఉత్కర్షను ఒకడు స్తుతించినచో, ఆ ఉత్కర్ష అంతయు భగవదనుగ్రహఫలమే. కావున అస్వాభావికము, భగవదధీనమగు ఉత్కర్షను స్వాభావికమనుట అతాత్త్వికముకూడ. ఉన్నదానిని అపలపించుట అను చౌర్యమే అగును.

"**అసీమ్నా మామ్నాయానా మపి నిస్సీమకత్వాత్**" అను అన్వయమువలన, "వేదములు అనేకములైనను, భగవానుని మహిమను అవి

యథాతథముగా వర్ణింపలేవు" అను స్వారస్యమును ధ్వనించును. హరివిభవసంబంధము లేని వేదములకు వేదత్వసిద్ధిలేదు – అను భావప్రతీతియు ఈ శ్లోకమున కల్గుచున్నది. **"అస్తి బ్రహ్మేతి చేద్వేద, సంత మేనం తతో విదుః, అసన్నేవ స భవతి అసత్ బ్రహ్మేతి వేద చేత్"** (తై. ఉ.) ("భగవానుడు ఉన్నాడు, అతనికి స్వరూపరూప గుణవిభూత్యాదులు అన్నియు ఉన్నవి" అని భావించువాడు ఎవడో, అతనిని సత్పురుషులు సత్తను కలవానినిగా భావిస్తున్నారు. ఆ విధంగా కాకుండా, పరమాత్మ లేడు – అని ఎవడు తెలిసికుంటున్నాడో, అతడు సత్త లేనివాడే అవుతున్నాడు) అనుచు వేదమే ఈ విషయమును తెలిసినది కదా!

**"వర్షబిందో రివాబ్ధౌ"** (సముద్రములో వర్షబిందువునకు వలె) అను ఉపమానము ఇచట మిక్కిలి విశిష్టమైనది. వర్షబిందువు సముద్రమున కాక నేలమీద పడినచో, దాని స్వరూపము ఏమీ మిగలదు, పూర్తిగా నశించిపోవును. సముద్రములో పడిన నీటి బిందువు తన ఆకారములో కన్పింపకున్నను, జలరూపనుగు సముద్రమున కలియుటవలన స్వరూపనాశమును పొందదు. అనగా, బిందువునకు సముద్రముతో పృథక్ స్థితి స్వరూపనాశకరము, అపృథక్ స్థితి స్వరూపప్రతిపాదకము. జీవాత్మ, పరమాత్మల సంబంధముకూడా ఇట్టిదే, అది విడదీయడానికి సాధ్యము కాని సంబంధము, అపృథక్ సిద్ధసంబంధము. ఈ విషయమ్ **"తత్త్వమసి"** అని మొదలైన వేదాంతవాక్యాలవల్ల సిద్ధము. ఈ విషయము **"అవస్థితే రితి కాశకృత్స్నః"** (1-4-22) (పరమాత్మ జీవునిలో ఉండడం వల్ల, జీవుని నిర్దేశించే శబ్దాలచేత భగవంతుడు కూడా సూచింపబడుతున్నాడు – అని కాశకృత్స్నులు అనే ఆచార్యులు భావిస్తున్నారు) **"అవిభాగేన దృష్టత్వాత్"** (4-4-4) (ముక్తుడు, తన ఆత్మను పరమాత్మతో వేరు చేయకుండానే అనుభవిస్తున్నాడు, ఎందుకంటే, ముక్తునిచేత తన ఆత్మ యథార్థంగా ఉన్నది ఉన్నట్లు దర్శింపబడడంవల్ల) అను బ్రహ్మసూత్రములలో సూచింపబడినది. మఱియు, ఈ ఉపమానము **"యథా నద్యః స్యందమానాః**

**సముద్రే**" (ముణ్డక, 3-2-8) (ప్రవహించే నదులు ఏ విధంగా సముద్రంలోకి చేరి కలుస్తున్నాయో) అని మొదలైన శ్రుతివాక్యములను స్మరింపజేయును. హరవిభవసాగరమున పడిన కవుల వాగ్వర్షము స్వాత్మలాభమును పొందును. లేనిచో, అది నశించును. శుష్కమును, నీరసమును – అగును – అని ఈ ఉపమానములోని తాత్పర్యము. "**న తు కబళనతః**" అనుటకు, బిందువు సముద్రమును కబళీకరింపలేదు – అని అర్థము. సముద్రమును కుంభసంభవుడగు అగస్త్యుడు ఆచమించినను, అనంతములైన వేదములు సహితము హరిగుణసాగరముతో పోల్చిన బిందుమాత్రములగుటచే కబళీకరింపలేవని తాత్పర్యము. ఈ సందర్భమున "**సాముద్రో హి తరంగః క్వచన సముద్రో హి న తారంగః**" (3) (తరంగము సముద్రములో అంతర్భవించును తప్ప, ఎక్కడా కూడా సముద్రం తరంగంలో అంతర్భవించదు కదా) అను శ్రీశంకరుల షట్పదీస్తోత్రశ్లోకరత్నము స్మరణీయము.

"**సంబంధాత్ స్వాత్మలాభః**" (భగవత్ సంబంధంవల్ల ఆత్మకే లాభం) అనుటకు తిరువాయ్ మొళి ప్రబంధంలోని "**ఓదువార్ ఓత్తెల్లామ్ ఎవ్వులకత్తు ఎవ్వెవైయుమ్ శాదువాయ్, నిన్ పుకఴ్గిన్ తకైయల్లాల్ పిరిదిల్లై –– –ఎన్ శొల్లి యాన్ వాఴ్త్తువనే!**" (లోకంలో వేదాధ్యయనం చేసేవారు అనుసంధించే వేదం అంతా కూడా, ఏ లోకంలో అయినా, ఎటువంటిది అయినా, అది తగినదై, నీ కీర్తిని తప్ప వేరు దేనిని చెప్పదు. ––అందువల్ల ఏమని చెప్పి నిన్ను నేను మంగళాశాసనం చేయను?) (తి. వా. 3-6-5) అను సూక్తిని, ఈ పాశురములోని "**శాదువాయ్**", అను పదమును వివరించుచు అరుమ్బదకారులు "**శాదువాయ్ ఎన్నదుక్కు– శాతువాకైక్కాక, – స్వసత్తాలాభార్థమాక – ఎన్ను అర్థాంతరమ్**" ("**శాదువాయ్**" అనుటకు సాధువగుటకు, స్వసత్తాలాభరూపమైన ప్రయోజనము కొఱకు – అని అర్థాంతము) అని వివరించుట ఇచట ఉట్టంకింపదగినవి.

**"సంబంధాత్"** (సంబంధంవల్ల అనుటకు, వేదపక్షమున – వాచ్యవాచకరూపసంబంధము, బిందువు పక్షమున – స్పర్శరూపసంబంధము గ్రహింపనగును. **"తస్య నిస్సీమకత్వాత్"** (ఆ భగవంతుని వైభవం అంతు లేనిది అయినందున) అనునపుడు తచ్ఛబ్దము భగవానుని చెప్పుచున్నదనియు చెప్పవచ్చును. అపుడు, **"నిస్సీమకత్వాత్"** అనగా – నిరవధిక గుణగణములను కలవాడగుటచే –అని భావము. భగవానుని నిస్సీమకత్వము స్వరూపతః, స్వభావతః ప్రసిద్ధమే కదా!

రెండవ పాదమున **"ఫణితి రవితథా"** అను పాఠాంతరము కలదు. ఈ పాఠమునననుసరించి భగవంతుని గుణములు అంతు లేనివగుటచే, ఆ భగవానునిలో గుణములను వేరొక వ్యక్తియందు ఆరోపించి చేయు స్తుతి విధానము ఎప్పుడును వ్యర్థము కాదు – అను భావము వచ్చును. అప్పుడు, **"తదుత్కర్షచౌర్యైః"** ఇత్యాది వాక్యము **"అన్యత్రాతద్గుణోక్తిః"** అను మొదటి వాక్యమునకు వివరణమగును. ఈ అన్వయము ప్రకారము అతద్గుణోక్తి రూపమైన స్తోత్రమే ఇచట ప్రస్తుతమని, సాకల్యగుణస్తవము ప్రస్తుతము కాలేదని చెప్పనగును. కాని, శ్లోకము చివర **"న తు కబళనతః స్తోతుః"** అనుటచే కవి సమస్తగుణస్తవమును ప్రస్తుతించెనని స్పష్టపడుచున్నది. కావున, ప్రతిపదార్థమున చూపిన పాఠము; అన్వయములే స్వరసములు. ప్రస్తుతపాతము శ్రీ ప్ర. భ అణ్ణంగరాచార్యస్వామివారి వ్యాఖ్యానమునుండి గ్రహింపబడినది. **"తదుత్కర్షచౌర్యాత్"** అను పాఠాంతరము మొదటి పాదాంతమున కొన్నిచోట్ల కన్పించుచున్నది.

ఇందు వృత్తము స్రగ్ధర.

## కావేరి నదిలో స్నానం చేద్దాం, రండి

**20. కావేరీ మవగాహిషీయ భగవద్భోగాంతరాయీభవత్–**
**– కర్మ క్లేశఫలాశయ ప్రశమనోద్వేలామల స్రోతసమ్ ।**

**జంతోః సంసరతో ఽ ర్చిరాదిసరణివ్యాసంగభంగాయ యా**
**లోకే ఽ స్మిన్ విరజేవ వేల్లితజలా శ్రీరంగ మాలింగతి ॥**

**ప్ర. అ. –** యా = ఏ కావేరీనది, సంసర్గతః = సంసారి అయిన, జంతోః = ప్రాణికి, అర్చిరాది సరణి = అర్చిరాది మార్గమున కల్గు, వ్యాసంగ = అలసటను (ఆటంకములను), భంగాయ = పోగొట్టుటకు, అస్మిన్ = ఈ, లోకే = లోకమున, వేల్లితజలా = (మిక్కిలి వేగముగా సుడులు తిరుగుతూ ప్రవహించు) గొప్ప నీటిని కల్గిన, విరజా = విరజానది, ఇవ = వలె, శ్రీరంగం = శ్రీరంగక్షేత్రమును, ఆలింగతి = చుట్టుకొని యున్నదో, (తాం) = (అట్టి), భగవద్భోగ = భగవానుని అనుభవమునకు, అంతరాయీభవత్ = ఆటంకములై యున్న, కర్మ = పుణ్యపాప రూప కర్మలు, క్లేశ = అవిద్య మొదలగు కష్టములు, ఫల = కర్మఫలములు, ఆశయ = వాసన – అను వీనిని, ప్రశమన = పోగొట్టునది, ఉత్ వేల = గట్టును తాకుచు ప్రవహించు (అధికమైన) అమల = నిర్మలమైన, స్రోతసం = ప్రవాహమును కల్గినది అగు, కావేరీం = కావేరీనదిని (లో), అవగాహిషీయ = ప్రవేశింతును. (స్నానమాడెదను).

**వరివస్య :–** మొదటి శ్లోకమునుండి 19వ శ్లోకము వరకు గల భాగము ఈ స్తోత్రమునకు ఉపోద్ఘాతమువంటిది. ఇపుడు శ్రీరంగక్షేత్రవర్ణన ఈ శ్లోకమునుండి ప్రారంభమవుతున్నది.

కవి అగు భట్టరు తిరుక్కోట్టియూర్ (శ్రీగోష్ఠిపురము) నుండి శ్రీరంగమునకు వేంచేయుచు, ఈ స్తోత్రమును అనుగ్రహించిరను ఐతిహ్య మొకటి కలదు. శ్రీరంగమునకు తాము వచ్చునపుడు దారిలో సేవించినవానిని కవి క్రమముగా ఈ స్తోత్రమున నిబంధించిరి. ఈ శ్లోకమునుండి కవి అయిదు శ్లోకములలో కావేరీవర్ణనను చేయుచున్నారు. ఇందు కవి, కావేరీనదిలో తాము స్నానమాడవలెనను తమ కోరికను ప్రకటించిరి. శ్రీవైష్ణవు లెక్కడ. స్నానము చేసినను, ఆ సమయమున ఈ శ్లోకమును అనుసంధించుకొనుట సంప్రదాయము.

పూర్వశ్లోకమున హరిగుణసాగరము ప్రస్తుతము. ఆ సాగరమున మజ్జనమాడుటకు ముందు స్నానమాడి పరిశుద్ధుడగుట అపేక్షితము. కావున, ప్రస్తుతము కావేరీస్నానమునుగూర్చి తెలుపబడుచున్నది. కావేరీనది విరజానదియే. ముక్తాత్మ పరమపదనాథుని చేరుటకు ముందు విరజానదిలో స్నానమాడునట్లే, శ్రీరంగనాథుని సేవించుటకు ముందు కావేరీనదిలో స్నానమాడుట ఇచట తెలుపబడుచున్నది.

శ్రీవైకుంఠమునకు పోవు దారిలో ప్రవహించు విరజానది, ప్రాణులు అర్చిరాది మార్గమున పోవునపుడు వారు పొందిన అలసటను పోగొట్టునట. ఆ విరజయే భూలోకవైకుంఠముగా ప్రసిద్ధి చెందిన శ్రీరంగమును చుట్టుకొనియున్న కావేరీనదిగా రూపొందినదట. అట్లు విరజానది శ్రీవైకుంఠమునుండి శ్రీరంగమునకు ఎందులకు అవతరించెను? అనిన, ప్రాణులు అర్చిరాదిమార్గమున శ్రమపడి పయనించిన పిమ్మటనే విరజానదిలో స్నానము చేయ సాధ్యమగును. అట్టి శ్రమను అనభవింపవలసిన ఆవశ్యకత లేకనే సులభముగా సంసారులందరును తనలో స్నానము చేయవలెనను ఉదారమైన భావములో ఆ విరజానది కావేరీనదిగా భూమిలో అవతరించినదట. ఈ నదిలో స్నానమును చేసినవారి కర్మలు, అవిద్య మొదలగు క్లేశములు, కర్మ ఫలములు, పూర్వజన్మ వాసనలన్నియు తొలగిపోవును. అందువలన, వారి భగవదనుభవమునకు ఎట్టి ఆటంకములును ఉండవు. ఇంతటి గొప్ప వైభవమును కల్గిన కావేరీనదిలో అవగాహింతును – అని శ్లోకభావము.

ఈ శ్లోకమున, భట్టరు, శ్రీరంగమునకు పోవు మార్గము అర్చిరాదిమార్గమేనని,

శ్రీరంగము సాక్షాత్తు వైకుంఠమేనని, శ్రీరంగనాథుడు పరమపదనాథుడేనని సూచించిరి.

**“కావేరీ విరజా సేయం శ్రీరంగం రంగమందిరమ్,**
**స వాసుదేవో రంగేశః ప్రత్యక్షం పరమం పదమ్”**

(శ్రీరంగస్థలపురాణము)

(ఈ కావేరి నది వైకుంఠంలో ఉండే విరజానదియే. శ్రీరంగంలో ఉండే శ్రీరంగనాథుని దివ్యాలయం వైకుంఠనగరమే. శ్రీరంగనాథుడు ఆ పరవాసుదేవుడే. అందువల్ల పరమపదం మన కంటిముందు ప్రత్యక్షంగా శ్రీరంగం రూపంలో సాక్షాత్కరిస్తున్నది) అను ప్రసిద్ధశ్లోకార్థ మిచట పొందుపరుపబడినది.

కర్మలు పుణ్యములని, పాపములని రెండు విధములు. ఈ రెండును భగవదనుభవమునకు ప్రతిబంధకములే. అవి పూర్తిగా తీరన గాని, భగవదనుభవము సిద్ధింపదు. ఉపనిషత్తు "తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్య ముపైతి" (ముణ్డక. 3-1-3) (ఆ విధంగా పరమాత్మకు సంబంధించిన జ్ఞానాన్ని కలిగినవాడు, తన పుణ్య పాపాలను రెండిటిని లేకుండా చేసుకుని, కర్మ సంబంధం తీరినవాడై, పరమాత్మతో గొప్ప సామ్యాన్ని పొందుతున్నాడు) అని పల్కినది.

అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశములు క్లేశములనబడును. వానిలో, అవిద్య అనగా – అనిత్యమును నిత్యమైనదిగా అనుకొనుట, శుచి కానిదానిని శుచిగా అనుకొనుట, దుఃఖమును సుఖమనుకొనుట, ఆత్మ కానిదానిని ఆత్మగా భావించుట, అస్మిత అనగా – దేహాత్మ భ్రాంతితో, "నేనెప్పటికి ఇట్లే ఉండవలెన" ని తలచుట, తాను అనుభవించు సుఖములందు అభిలాష, రాగము అనబడును. అట్లే, తాను అనుభవించు దుఃఖసజాతీయములలో వైముఖ్యము ద్వేషము. నివారింప సాధ్యము కాని రాగద్వేషముల పర్యవసాన విశేషము అభినివేశము. కర్మఫలములుగా సిద్ధించు జాతి, ఆయుస్సు, భోగములు ఫలములనబడును. పుణ్యపాపరూపములైన కర్మలయొక్క ప్రభావముచే ఆ యా కర్మలయందు కల్గిన ప్రవృత్తియే వాసన, ఈ వాసన ఈ జన్మలో గాని, ముందు జన్మలలో గాని చేసిన కర్మల ఫలముగా కలుగవచ్చును. దీనికే ఆశయమని పేరు. ఇవి అన్నియు భగదనుభవ ప్రతిబంధకములు. వీనిని తొలగించు శక్తి కావేరీనదికి కలదు.

కావున, అట్టి కావేరీనదీజలములలో అవగాహించి, ఆటంకములన్నిటిని పోగొట్టుకొందును – అని కవి తన ఆశయమును ఇందు తెలియజేసిరి.

**"కావేరీ"** అను నామము ఆ నదికి కల **"కావేరీ చ మహాభాగా"** (భాగ, 11-5-39) అను ప్రసిద్ధిని, **'వైదేహీ'** అనునట్లు (విదేహరాజు కుమార్తె) పితృసంబంధప్రయుక్తమైన పవిత్రతను తెలుపును. వ్యాసంగశబ్దమునకు చింతనము అను అర్థము శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో చూపబడినది. ఆ వ్యాఖ్యానానుసారము **"అర్చిరాదిసరణివ్యాసంగభంగాయ"** – అనగా, అర్చిరాదిగతిని గూర్చిన చింతనావశ్యకతను లేకుండ చేయుటకు – అని తాత్పర్యము.

లోకములోని నదులు రజో భూయిష్ఠములుగా నుండును. కాని, కావేరి విరజ – అను చమత్కారము **"విరజా ఇవ"** అను సూక్తిచే ధ్వనించుచున్నది. **"తెణ్ణీర్ పొన్ని"** (పెరుమాళ్. తి. 1-1) తేటగా ఉండే నీటిని కలిగిన, పొన్ని అని పిలువబడే కావేరినది) అని దివ్యప్రబంధమున కావేరీనది వర్ణింపబడినది కదా.

**"వేల్లితజలా"** అనుటచే కావేరీనదికి కల్గిన కంపము తెలుపబడినది. దివ్యనగరమగు శ్రీరంగముతో కల్గిన సంబంధముచే ఆమెకు ఆనందాతిశయము కల్గినది. అందువలన ఆమెకు కంపము అను సాత్త్వికభావము ఉదయించినది – అని దీని తాత్పర్యము.

"కావేరీ నదిలో స్నానము చేయవలెను" అను సిద్ధవిషయమున **"అవగాహిషీయ"** అని ప్రార్థించుట ఎందువల్ల? అంటే, కావేరి నదిస్నానంలో ఉండే నిత్యాపూర్వతవలన – అని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామి వివరణము. ఎల్లప్పుడూ భగవంతునితో సంబంధాన్ని కలిగినది అయినప్పటికీ, భగవత్సంబంధం అనే సిద్ధవిషయంలో లక్ష్మీదేవి, **"అకలకిల్లేన్ అకలకిల్లేన్"**– నేను నిన్ను క్షణం కూడా విడువలేను, విడువలేను– అనే భావిస్తూ ప్రార్థించడం ఎందుకంటే, ఆ భగవంతుని నిత్యాపూర్వతవలనే కదా. అటువంటి భావాన్నే ఇక్కడ కవి సూచించారు – అని చెప్పవచ్చు. ఆళ్వారులు భగవంతుని

విషయంలో అనుసంధించిన భావాన్నే, ఇక్కడ కావేరీ నది విషయంగా భట్టరు అనుసంధించడం విశేషం. ఈ కావేరీ నది సాక్షాత్తు విరజానదియే కదా. కావేరి నదిలో స్నానం చేయడం విరజానది స్నానంతో సమమనే అర్థం ఇక్కడ అందంగా ధ్వనిస్తున్నది. ఇటువంటి పరమరమణీయాలైన ధ్వన్యర్థాలు ఈ స్తుతిలో ప్రతిపదంలోనూ భాసిస్తాయి అన్నిటిని వివరించడం మన బుద్ధికి, వాక్కుకు కూడా దూరమైనదే. ఏవో కొన్ని అక్కడక్కడ యథామతి, యథాశక్తి తెలుపబడుతున్నవి, అంతే.

9, 10, 11వ శ్లోకములలో మంత్ర రత్నములోని పూర్వార్ధ ప్రారంభమున గల శ్రీమత్పదముయొక్క అర్థము ప్రతిపాదింపబడినది. ఈ శ్లోకమునుండి తరువాతి పదమైన నారాయణపదములో మొదట గల నారపదము వివరింపబడుచున్నది.

నారమనగా నిత్యవస్తుసమూహము, నిత్యవిభూతి, లీలావిభూతులలోని సమస్తవస్తుసముదాయము, భగవానుని స్వరూపరూపములు నారపదవాచ్యములు, ఈ నారపదవివరణము ఈ స్తుతిలో 62వ శ్లోకమువరకు కొనసాగును. శ్లోకములోని "**ఇవ**" శబ్దము ఉత్ప్రేక్షాసూచకము.

పూర్వమువలెనే ఇందు వృత్తము శార్దూలము.

**తన అల్లుడైన శ్రీరంగనాథునకు కావేరి కానుకలను సమర్పిస్తున్నది**

**21. దుగ్ధాబ్ధి ర్జనకో జనన్యహ మియం శ్రీ రేవ పుత్రీ వరః**
**శ్రీరంగేశ్వర ఏతదర్హ మిహ కిం కుర్యా మితీవాకులా ।**
**చంచచ్చామరచంద్రచందనమహామాణిక్యముక్తోత్కరాన్**
**కావేరీ లహరీకరై ర్విదధతీ పర్యేతి, సా సేవ్యతామ్ ॥**

**ప్ర. అ. –** దుగ్ధ అబ్ధిః = పాలసముద్రము, జనకః = తండ్రి, అహం = నేను, జననీ = తల్లిని, ఇయం = ఈ, శ్రీ – ఏవ = లక్ష్మీ దేవియే (శ్రీరంగనాయకియే), పుత్రీ = (వధువు) కుమార్తె, శ్రీరంగ + ఈశ్వరః = శ్రీరంగనాథుడు, వరః = వరుడు,

ఇహా = ఇచట (ఇట్లుండగా), ఏతత్ – అర్హం = ,, ఈ కుమార్తెకు, వరునకు తగినట్లు, కిం = ఏమి, కుర్యాం = చేయుదును, ఇతి = అని, కావేరీ = కావేరీనది, ఆకులా ఇవ = కలత చెందినదివలె, చంచత్ = ప్రకాశించు, చామర = చామరముల, చంద్ర = పచ్చకర్పూరము, చందన = చందనఖండముల, మహామాణిక్య = గొప్ప రత్నముల, ముక్త = ముత్యముల, ఉత్కరాన్ = సమూహములను, లహరీకరైః = తన కెరటములను చేతులతో, విదధతీ (సతీ) = సమర్పించుచున్నదై, పర్యేతి = శ్రీరంగ నగరము చుట్టును ప్రవహించుచున్నది, సా = అటువంటి, ఆ కావేరీ, సేవ్యతామ్ = (జనులచే) సేవింపబడుగాక!

**వరివస్య :– "తెళివిలా క్కలజ్గల్ నీర్ శూழ் తిరువరజ్గమ్"** (తిరుమాలై, 37) (తేటపడని, కలగిన నీటిని కల కావేరీనదిచేత చుట్టబడిన శ్రీరంగము) అని తొణ్డరడిప్పొడి యాళ్వార్లు (విప్రనారాయణులు) తిరుమాలై దివ్యప్రబంధమున కావేరిని కీర్తించిరి. కావేరీనదిలో నీరు అట్లు కలిగియుండుటకు ఈ శ్లోకమున ఒక హేతువును భట్టరు చమత్కారపూర్వకముగా ఉత్ప్రేక్షించుచున్నారు.

దుగ్ధాబ్ధి– కల్పవృక్షము, కామధేనువు మొదలగు అనర్ఘములైన వస్తువులకు పుట్టినిల్లైన కావేరీనది "హేమాపగా" అను పేరును కల్గినది. ఆ నదీతీరమున కేదారములు, భూస్వాములు ధాన్యాదిసమృద్ధిని కల్గినవారు. కావున, ఆ నది ఆఢ్యతమ. లక్ష్మీదేవి సాక్షాత్తు సంపదయొక్క స్వరూపము. శ్రీరంగనాథుడు జగదీశ్వరుడు, సర్వశ్రేష్ఠుడు. కావున, వీరందఱి వైభవమునకు తగిన విధముగా నా అల్లుడగు శ్రీరంగనాథునకు తగిన కానుకలు నేను ఏమి ఇవ్వవలెను? – అని కావేరీనది తన మనస్సున కలత చెందినది, అందువలన ఆ నదిలో ఉండే నీరు కలిగి ఉన్నది –అని ఒక హేతువును కవి పల్కుట ఇచటి విశేషము.

లోకమున వియ్యంకులు సామాన్య స్థితిలో ఉన్నవారైనచో, గృహస్థులు ఇచ్చు కట్నకానుకలు సామాన్యముగా ఉన్నను, ఎట్టి లోపము ఉండదు. కాని, వారు గొప్ప వారైనచో, వారి స్థితికి తగినట్లు వరునకు ఇచ్చు కట్న కానుకలు,

లాంఛనములు అన్నియు ఘనముగా ఉండవలెను కదా! అట్లే, శ్రీరంగనాయకి పాలసముద్రుని కుమార్తె, సముద్రుడు నదులకు భర్త అగుటచే కావేరి నదియు అతని భార్యయే. కావున, కావేరినది లక్ష్మీదేవికి మాత. కనుక, ఆమెకు, తాను అల్లునకిచ్చు కట్నకానుకలనుగూర్చిన ఆలోచన కల్గుట సహజము. శ్రీరంగనాయకిని వివాహమాడిన వరుడు **"పొఙ్గోదమ్ శూழ్న్ద పువనియుమ్ విణ్ణులకుమ్ అఙ్గాదుమ్ శోరామే ఆళ్ కిన్ఱ ఎమ్బెరుమాన్"** (నాయ్ చ్చి, తి. 11-3) (సముద్రముచే పరివేష్ఠితమైన భూమి, వైకుంఠము –అను ఈ రెండింటియందు దేనికి లోపము కలుగకుండునట్లు పరిపాలించు స్వామి, శ్రీరంగనాథుడు), **"శెఙ్గోలుడైయ తిరువరఙ్గ చ్చెల్వనార్"** (నాయ్. తి. 11-3) (అందమైన రాజదండమును కల్గిన శ్రీరంగనాథుడు) అని పేరు పొందిన శ్రీరంగనాథుడు, కావున, "నా కుమార్తెకు పుట్టినిల్లు, మెట్టినిల్లు రెండును గొప్పవే. ఈ గొప్పదనమునకు తగినట్లు నేను వరునకు ఏ లాంఛనములను ఇవ్వగలను?" అని కావేరి తన మనస్సులో కలత చెందుటచే, ఆ నదిలో నీరు తేటగా లేక కలగియున్నది.

అట్లు కలత చెందిన కావేరీనది **"ఆళరియాల్ అలైప్పుణ్డ యానై మరుప్పు మకిలుమ్, అణి ముత్తుమ్, వెణ్ శామరై యోడు పొన్ని మలై ప్పుణ్డ మణ్డత్తిరై యున్దు"** (పరాక్రమాన్ని కలిగిన సింహంచేత వధింపబడిన ఏనుగు దంతాలను, ఆగిసె చెట్లను, అందమైన ముత్యాలను, తెల్లని చామరాలను తన కెరటాలతో కొట్టుకొని తీసుకొని వచ్చే కావేరీనది) **"మణియుమ్ కొழుక్కుమ్ పునల్ కావిరి"** (పెరి. తి. 5-4-1) (చందన కాష్ఠములను, మణులను గైకొని ప్రవహించు నీటిని కల్గిన కావేరీనది), **"వేయిన్ ముత్తుమ్ మణియుమ్ కొణర్ న్దు ఆర్ పునల్ కావిరి"** (పెరి. తి. 5-4-9) (వెదుళ్లనుండి పండిన ముత్యములను, మణులను గైకొని, నిండుగా ప్రవహించు నీటిని కల్గిన కావేరి) అని తిరుమంగై యాళ్వార్లు, **"తழுప్పరియ శన్దనఙ్గళ్ తడవరైవా యీర్త్తుక్కొణ్డు తెழிప్పుడైయ కావిరి వన్దేటి తొழுదుమ్ శీరరఙ్గమే"** (పెరియా. తి. 4-8-7)

(సహ్యాపర్వతంలోని, దృఢంగా ఉండే చందన వృక్షాలను పెకలించుకుని వచ్చే ఎత్తయిన తరంగాలతో గొప్పగా ఘోషను చేస్తూ ప్రవహించే కావేరినది నమస్కరించే వైభవాన్ని కలిగిన శ్రీరంగం) అని పెరియాళ్వార్లు పల్కినట్లు, కావేరీనది చామరములను, పచ్చ కర్పూరములను, చందనఖండములను, గొప్ప గొప్ప రత్నములను, ముత్యములను తన కెరటములు అను చేతులతో కొనివచ్చి, శ్రీరంగనాథుని పాదసన్నిధిలో సమర్పించి, తృప్తిపడుచున్నది. ఇట్లు భగవత్సేవలో నిమగ్నురాలైన మహనీయురాలగు కావేరీనదిలో భక్తితో స్నానము చేయుడు – అనుచు కవి జనుల కుద్బోధను చేయుచున్నారు.

కావేరీనది సహ్యాపర్వతమున పుట్టునది. సహ్యాపర్వతము చమరీమృగములకు, కర్పూరకాండములకు, చందనవృక్షములకు, రత్నముల గనులకు, సింహములచే వధింపబడిన ఏనుగుల కుంభస్థలములనుండి, వెదుళ్లనుండి రాలి పడు ముత్యములకు ప్రసిద్ధి పొందినది. కావున, కవి పైనిధముగా వర్ణించుట ఉచితము. మాణిక్యశబ్దము ముత్యమును కూడ నిర్దేశించుచున్నను, ఇక్కడ వివక్షావిశేషమునుబట్టి కవి ఇచట ముక్తశబ్దమునుకూడ ప్రయోగించెనని చెప్పనగును.

తిరువాయ్ మొళిలోని "**కురు మామణి యున్దు పునర్ పొన్ని త్తెన్బాల్**" (10–8–1) (గొప్పవైన మణులను తీసుకొని వస్తూ ప్రవహించే జలాలను కలిగిన కావేరీనదికి దక్షిణ వైపున) అను చోట వ్యాఖ్యానించుచు నమ్బిళ్లై అను ఆచార్యవర్యులు ఈడు వ్యాఖ్యానమున "**పెరువిలైయనాయ్, దర్శనీయమాన రత్నఙ్గళై క్కొణ్డువన్దు, తళ్ళానిన్నుళ్ళ పునలై యుడైయ పొన్ని త్తెన్ కరైయిలే. శ్లాఘ్యమాన దేశమెన్నపడి. దుగ్ధాబ్ధి ర్జనకః– ఇత్యాదివత్**" (గొప్ప విలువ కలిగినదవై, అందమైన రత్నాలను తీసుకొని వచ్చి ప్రవహిస్తూ ఉండే జలప్రవాహాన్ని కలిగిన కావేరీనది దక్షిణ తీరంలో – అని అర్థం, అంటే, గొప్పదైన దేశం – అని తాత్పర్యం. ఇక్కడ "**దుగ్ధాబ్ధిః జనకః**" అని మొదలైన సూక్తులను స్మరించాలి) అని పలికిన వాక్యవిశేషములను ఇచట స్మరింపదగును,

"**ఘనసారః చంద్రసంజ్ఞః**" అను నిఘంటువునుబట్టి చంద్రశబ్దమునకు కర్పూరమని అర్థము. కావేరీతీరమున గల అంగళ్లలో అంతట వర్తకులు చామరములను, చందనపు కొయ్యలను, కర్పూరములను, మాణిక్యములను, ముత్యములను నిండుగా విస్తరించియుండుటనుబట్టి కవి "**చంచచ్చామర**" ఇత్యాదిగా ఉత్ప్రేక్షించిరనియు చెప్పవచ్చును. నదిలోని కెరటములు చామరములుగా ఉత్ప్రేక్షింపబడినవి. కావేరీతీరమున చందనవృక్షములు, కర్పూరకణములు విరిచిగా ఉండును. కావున, ఈ శ్లోకమున వర్ణింపబడిన సామగ్రి అంతయు కావేరీనదీతీరమున కలదు – అని శ్రీరామానుజాచార్యవ్యాఖ్యలో కన్పట్టుచున్నది.

ఈ శ్లోకమున "**ఏతదర్హమ్**" అనుటకు "శ్రీరంగనాథునకు తగిన" –అనియే కాక, "వీరందఱకును తగిన" – అనియు అర్థమును చెప్పవచ్చును. శ్రీరంగనాథుడు కావేరీనదికి జామాత కావున< చామరములను సమర్పించుట తగినది. శ్రీరంగనాథుడు చంద్రుడువంటివాడు. కావున చంద్రోపహారము న్యాయమైనది. "**కర్పూరః చంద్రసంజ్ఞః**" అని నిఘంటువు. హరికి హరిచందనోపహారము ఉచితము. మణివర్ణుడగు శ్రీరంగనాథునకు మాణిక్యముల కానుక తగినది. ఇట్లు ఈ శ్లోకమున కవి పల్కిన కానుకలన్నియు శ్రీరంగనాథునకు తగియుండుట విశేషము. "**విదధతీ**" అను ప్రయోగమువలన "ఏకో బహూనాం యో విదధాతి కామాన్" (శ్వేత. 6–13) (పరమాత్మ ఒక్కడే పలువురి మనోరథాలను సఫలం చేస్తున్నాడు) అనునట్లు పలు విధములైన కోరికలను అనుగ్రహించుచున్నాడని చెప్పబడు భగవానునకు కావేరీనది పలు విధములైన ఉపహారములను సమర్పించుచున్నది – అని ధ్వనించుచున్నది. "**విశేషేణ వివిధాన్ ఉపహారాన్ దధతీ ఇతి విదధతీ**" (విశేషంగా అనేక విధాలైన కానుకలను సమర్పిస్తున్నదై) అను వ్యుత్పత్తి ఇచట వివక్షితము. ఇందు వృత్తము శార్దూలము.

**కావేరినది గంగనే పరిహసిస్తున్నది**

**22. తీర్థం శుంధతి పాతి నందనతరూన్ రథ్యాంగణా న్యుక్షతి**
**స్నానీయార్హణ పానవారి వహతి స్నాతః పునీతే జనాన్ ।**
**శ్యామం వేదరహో వ్యక్తి పులినే ఫేనైః హసంతీవ తత్**
**గంగాం విష్ణుపదీత్వ మాత్రముఖరాం హేమాపగా హంత్వఘమ్॥**

**ప్ర. అ. –** హేమ – ఆపగా = "పొన్ని" అను పేరును కల్గిన కావేరీనది, తీర్థం = తీర్థమని పేరు పడిన పుణ్యజలములను, శుంధతి = పరిశుద్ధము చేయుచున్నది, నందనతరూన్ = ఉద్యానవనమునందలి వృక్షములను, పాతి = రక్షించుచున్నది, రథ్యా అంగణాని = వీథులను, నాల్గు వీథుల కూడళ్ళను (ముంగిళ్లను), ఉక్షతి = తడపుచున్నది, స్నానీయ = స్నానమునకు తగిన, అర్హణ = దేవతారాధనకు తగిన, పాన = త్రాగుటకు తగిన, వారి = నీటిని, వహతి = కల్గియున్నది, స్నాతః = స్నానము చేయు, జనాన్ = జనులను, పునీతే = పావనము చేయుచున్నది. శ్యామం = నల్లని వర్ణము కల్గిన, వేదరహః = వేదరహస్యమును (శ్రీరంగనాథుని), పుళినే = తీరప్రాంతమున ఇసుకతిన్నెయందు, వ్యనక్తి = అందఱకు కనబడునట్లు వ్యక్తము చేయుచున్నది. తత్ = ఆ కారణముచే, విష్ణుపదీత్వమాత్రముఖరాం = విష్ణువు పాదమునుండి పుట్టుట అను ఒక్క కారణము చేతనే మిక్కిలి ఘోషపెట్టు (గర్వించు), గంగాం = గంగానదిని, ఫేనైః = నుఱుగులతో, హసంతీ – ఇవ = పరిహాసము చేయుచున్నదివలె నున్నదై, అఘం (స్థితా) = (మన)పాపమును, హంతు = పోగొట్టునుగాక!

**వరివస్య :–** తొణ్డరడిప్పొడియాళ్వార్లు తిరుమాలై దివ్యప్రబంధమున కావేరీనదిని "**గంగైయిల్ పునిద మాయ కావిరి**" (23) (గంగకన్న పూతమగు కావేరి) అనుచు ప్రస్తుతించిరి. అట్లు పల్కుటకు భట్టరు ఒక చక్కని హేతువును ఈ శ్లోకమున ఉత్ప్రేక్షించుచున్నారు.

కావేరీనది సమస్తతీర్థములను పావనము చేయుచున్నది. "**ఆరామమ్ శూழ்న్ద అరఙ్గమ్**" (తోటలు చుట్టియున్న శ్రీరంగము) అని పొగడబడు

శ్రీరంగమునకు చుట్టును గల ఉద్యాన వనములను ఆ నది పెంచుచున్నది. శ్రీరంగక్షేత్రమున గల తిరువీథులను, ముంగిళ్లను, నాల్గు వీథుల కూడలులను, తడపి పరిశుద్ధము చేయుచున్నది. శ్రీరంగనాథుని ఆరాధనకు, అభిషేకమునకు తగిన జలములను అందిచ్చుచున్నది, జనులకు స్నానము చేయుటకు (త్రాగుటకు) అవసరమైన నీటిని కల్గియున్నది. తనలో స్నానము చేయువారిని, పవిత్రులను చేయుచున్నది. వేదరహస్యమగు భగవానుని తన తీరమున సాక్షాత్కరింప జేయుచున్నది. ఇట్లు కావేరీనది పలు విధములైన అతిశయములను కల్గియుండుటతో పాటు, గొప్ప పవిత్రమైన నదిగా పేరు పొందిన గంగానదికంటే కూడ ఆధిక్యమును కల్గియున్నది. అది ఎట్లనగా – గంగానదికి విష్ణుపాదముతో సంబంధము తివిక్రమావతారసమయముననే కల్గెను. అనగా, ఆ సంబంధము తాత్కాలికమైనది. "తెణ్ణీర్ పొన్ని తిరైక్కైయాల్ అడి వరుడ" (పెరుమాళ్. తి. 1-1) (తేట పడిన నీటిని కల్గిన కావేరీనది కెరటములు అనబడు తన చేతులతో శ్రీరంగనాథుని పాదములను మెల్లిగా సంవాహనం చేయుచుండగా) అని కులశేఖరాళ్వార్లు పల్కిన విధముగా, కావేరీనది భగవానుని పాదములతో నిత్యసంబంధమును కల్గి, ఆ స్వామికి నిత్యకైంకర్యమును చేయుచున్నది. ఇట్టి అదృష్టము గంగానదికి లేదు. "నేనే అందరికంటే గొప్ప" అని కెరటముల ధ్వనితో గర్జించు గంగానదిని చూచి, కావేరి "ఓ గంగా! నా ముందు నీవు నోరు తెరవ గలవా?" అని నురుగు రూపమున పరిహసించుచున్నట్లున్నది. ఇట్లు గంగానది కంటెను అతిశయితమైన పావనత్వమును కల్గిన, "**పొన్ని**" అను పేరును కల్గిన కావేరీనది మా పాపములనన్నిటిని పోగొట్టుగాక! – అని శ్లోకభావము.

ఈ శ్లోకమున కావేరీనది తనకు జామాత అగు శ్రీరంగనాథుని గృహమున నిత్యము సకలవిధపరిచారములను పరిచారికవలె చేయుట చమత్కారముగా వర్ణింపబడినది. సమస్తపుణ్య తీర్థములు పాపులు తమలో స్నానము చేయుటవలన తమకు ఏర్పడిన దోషమును పోగొట్టుకొనుటకై

తులామాసమున కావేరీనదిలోనికి ప్రవేశించునని పురాణప్రసిద్ధి కలదు. అందుచే కవి ఇచట "**తీర్థం శుంధతి**" అని పల్కెను. "**తీర్థమ్**" అను ఏకవచనమును జాత్యేకవచనముగా గ్రహింపనగును. ఇందుచే సకలపుణ్యతీర్థములకు కావేరి పావనత్వమును కల్గించుచున్నదను భావము ఏర్పడును. లేదా, తీర్థశబ్దమునకు శ్రీరంగనాథుని అవబృథోత్సవము జరుగు రేవు – అను అర్థమును చెప్పవచ్చును. (తీర్థశబ్దము రేవు అను అర్థమును చెప్పుటచే) అపుడు, అవబృథోత్సవము జరుగు స్థలమును కావేరీనది పరిశుద్ధము చేయుచున్నదనియు చెప్పవచ్చును. శ్రీరంగనగరములోని కూపములు, తటాకములు మొదలగువానిలోని తీర్థములన్నియు కావేరీనదీ జలసంబంధమును కల్గినవి అగుటచే, అవి అన్నియు ఆ నదిచే పవిత్రము చేయబడినవనియు చెప్పవచ్చును. నందనవనములోని వృక్షములను గంగానది సంరక్షించునట్లుగా, కావేరీనది శ్రీరంగములోని ఉద్యానవన వృక్షములను రక్షించుచున్నది. అవి అన్నియు అల్లుని తోటలోని వృక్షములు కదా. "వహతి' అనుటడే కావేరీనదియొక్క కింకరభావము ఇక్కడ ద్యోతకనుగుచున్నది, "**శ్యామం వేదరహః**" అనునపుడు "**శ్యామ**" మను విశేషణముచే వేదరహస్యమగు ప్రపత్త్యుపాయమునుండి శ్రీరంగనాథుడు వ్యావర్తింపబడుచున్నాడు. "**సర్వగుహ్యతమమ్**" (భ. గీ. 18-64) (అన్ని రహస్యాలలో గొప్ప రహస్యము) అనుటచే రహస్యమని, "**ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే**" (శ్వేత. 6-18) (మోక్షాన్ని పొందాలనే కోరికను కలవాడనై పరమాత్మను నేను శరణు పొందుతున్నాను) అను మొదలగు శ్రుతివాక్యములవలన వేదప్రతిపాద్యత్వమును ప్రపత్త్యుపాయమునకు కలదని తెలియుచున్నది కదా. సాగరతీరమున శ్యామసుందరుడగు శ్రీరామునిచే వ్యంజితమైన రహస్యము అగు ప్రపత్తి ఉపాయము; కావేరీతీరమున వ్యక్తమైన రహస్యము (శ్రీరంగనాథుడు) ఉపేయము – అనునది ఇచటి స్వారస్యము. గంగానది. విష్ణుపాదమునుండి పుట్టినంత మాత్రముననే ముఖర కాగా,

కావేరీనది భగవానుని ప్రకాశింపజేయుచున్నను నవ్వునట్లున్నది – అనుటదే కావేరీనదియొక్క గుణాధిక్యము పరోక్షముగా తెలుపబడినది.

కావేరీనదిలో గల ఇసుకనుండి బంగారము తీయబడునను ప్రసిద్ధి కలదు. ఆ కారణముచే ఆ నదికి "**హేమాపగా**" అను పేరు కల్గినదని పెద్దలందురు. "కనకా" అను పేరును కల్గిన ఉపనది ఇందు కలియుటను బట్టి కావేరీనదికి "**హేమాపగా**"అను పేరు కల్గెనని శ్రీరామానుజాచార్యవ్యాఖ్యానమున కలదు. "**రహః**" అను శబ్దము రహస్యార్థమునకూడ ప్రసిద్ధము.

ఇందు వృత్తము శార్దూలము.

**కావేరీ నది భగవంతుని దయయే, దాదియే**

**23. అగణితగుణావద్యం సర్వం స్థిరత్రసమప్రతి–**
**క్రియమపి పయఃపూరై రాప్యాయయం త్యనుజాగ్రతీ ।**
**ప్రవహతి జగద్ధాత్రీ భూత్వేవ రంగపతే ర్దయా**
**శిశిరమధురా ౽ గాధా సా నః పునాతు మరుద్వృథా ॥**

**ప్ర. అ. –** యా = ఏ కావేరీనది, అప్రతిక్రియమ్ అపి = ఏ ప్రాయశ్చిత్తము కూడ లేని, స్థిరత్రసం = స్థావరజంగమములను, సర్వం = అన్నిటిని, అగణితగుణ అవద్యం = గుణదోషములను పరామర్శించి చూడకుండునట్లు, పయఃపూరైః = జలప్రవాహములతో, ఆప్యాయయంతీ (సతీ) = తృప్తిపరచుచున్నదై (పూరించుచున్నదై), అనుజాగ్రతీ = తోడుగా మేల్కొని యున్నదై, రంగపతేః = శ్రీరంగనాథునియొక్క, దయా = దయ, ఇవ = వలె, జగత్ ధాత్రీ భూత్వా = లోకమున కంతటికి పెంపుడు తల్లియై, ప్రవహతి ప్రవహించుచున్నది, సా = అట్టి, శిశిరమధురా = చల్లనిది, తీయనిది, అగాధా లోతైనది అగు, మరుద్వృథా = కావేరీనది, నః = మనలను, పునాతు = పవిత్రము చేయుగాక!

**వరివస్య :–** శ్రీరంగనాథుని కరుణయే కావేరీనదిగా రూపొందినదనుచు, కవి ఈ శ్లోకమున తన కవితాచాతుర్యమును

ప్రకటించుచున్నారు. పూర్వశ్లోకమున గంగానది విష్ణుపాదమునుండి పుట్టినట్లు చెప్పబడినది. దయ హృదయమునుండి పుట్టును, కావేరీనదిని భగవానుని దయతో రూపించుటవలన, ఆ నది భగవానుని హృదయమునుండి పుట్టినదని ఏర్పడుచున్నది. ఈ విధముగాకూడ గంగానది కన్న కావేరీనదియొక్క ఆధిక్యము ఇక్కడ సూచింపబడినదని చెప్పనగును.

భగవత్కృప ప్రసరింపదొడగిన, ఇతడు గుణవంతుడు, ఇతడు గుణహీనుడను ఏ భేదము లేక, అందరిపైన ప్రసరించును. వేదాంత దేశికులు రచించిన దయాశతకములోని "**నిషాదానాం నేతా కపికులపతిః. –––అమీషాం నిమ్నత్వం. ప్రభూతైః స్రోతోభిః ప్రసభ మనుకంపే! సమయసి**" (65) (నిషాదుల నాయకుడు అయిన గుహుడు, వానరుల నాయకుడు అయిన సుగ్రీవుడు అను మొదలైన వీరి తక్కువదనం, శ్రీవేంకటేశ్వరుని గొప్పదనం అనే ఈ రెండిటిని ––– గొప్పదైన నీ ప్రవాహాలతో వేగంగా, ఓదయాదేవీ! సమం చేస్తున్నావు) అను శ్లోకరత్న మిచట అనుసంధేయము. భగవత్కృపవలనే కావేరీనదియు స్థావరజంగమములైన ప్రాణులన్నిటియందు ఏ విధమైన గుణదోషవిచారమును చేయకనే, వారిపై ప్రవహించి, వారిని పునీతులను చేయుచున్నది. దాది (పెంపుడు తల్లి) తన పాలతో బిడ్డను పెంచి, అహోరాత్రములు కాపాడునట్లే, కావేరీనదియు పాలవంటి తీయనైన జలప్రవాహములతో అందరి ఆకలిని తీర్చి, ఉపశమనమును కల్గించి, రక్షించుచున్నది. గుణదోషములను చూడకుండుట, తాపమును తీర్చుట, ఎల్లప్పుడు రక్షించుట, స్వాదుగుణమును కల్గియుండుట, అగాధమైన స్వభావమును కల్గియుండుట – అను – ఇవి అన్నియు కావేరీనదికి, భగవత్కృపకు, ధాత్రికిని సమానములు. ఇట్లు అర్థమిచ్చు విశేషణములను ప్రయోగించిన ఈ కవియొక్క వాక్సామర్థ్యము అనితరసాధారణము.

ఇట్లు భగవత్కృపవలె నున్నది, జగత్తునకు అంతటికి దాదివంటిది అగు కావేరీనది మనలను పవిత్రులను చేయుగాక! – అని శ్లోకభావము.

ఈ శ్లోకమున కవి "**అప్రతిక్రియ మపి ఆప్యాయయంతీ**" అను ప్రయోగముచే భగవత్కృప నిర్హేతుకమని సూచించెను. అప్రతిక్రియ మనగా, ప్రతీకారదము లేనిది, అనగా, చేసిన దోషములకు పరిహారము లేనిదనియు భావము. "**శరీరజైః కర్మదోషైః యాతి స్థావరతాం నరః**" (శరీరమువలన కలుగు కర్మదోషముల వలన మానవుడు స్థావర రూపమును పొందును) అని శాస్త్రములలో చెప్పబడియున్నది. కాయికపాపఫలితముగా రాయిగా, చెట్టుగా మారిన ప్రాణులకు వేరొక పరిహారము లేదు. అట్టి స్థావరములను కూడ కావేరీనది కృపతో తరించునట్లు చేయుచున్నది. దాది ఎల్లప్పుడు మేల్కొని, బిడ్డను కంటికి రెప్పవలె కాపాడును. భగవత్కృప ఎల్లప్పుడు మేల్కొనియున్నదై, "**ఆర్తేషు ఆశు ఫలా**" (న్యాసతిలకే. – 10) (ప్రపత్తి ఆర్తప్రపన్నులకు వెంటనే ఫలాన్ని కలిగిస్తుంది) అన్నట్లు సద్యః ఫలము నిచ్చును. కావేరీనది ఎల్లప్పుడు. ప్రవాహముతో నిండి యుండును. కావున, అన్నిటికి సమముగా "**అనుజాగ్రతీ**" అను విశేషణము ప్రయోగింపబడినది. కావేరీనదిలోని నీరు గాలికి వృద్ధి అగును కావున, ఆ నదికి "**మరుద్వృథా**" అను పేరు కల్గినది. ఇది ఈ నదికి వైదికమైన పేరు. "**అసిక్నియా మరుద్వృథే**" అని వైదికసూక్తి. "ధేట్– పానే" అను ధాతువునుండి, "**డు – ధాఞ్ ధారణపోషణయోః**" అను ధాతువునుండి పుట్టిన ధాత్రీశబ్దము పాలనిచ్చి పెంచునది, ధరించి రక్షించునది – అను అర్థముల నిచ్చును. ఈ అర్థము అన్నియు దాదియందు అన్వయించును. అట్లే, ధరించి రక్షించుగుణము కావేరీనదికి, భగవానుని దయకును సమానము. కావేరీనది పాలవంటి నీటితో జనులను తృప్తిపఱచుచున్నది. ఇట్లు, "**ధాత్రీ**" పదము కావేరీ నది, దాది, భగవంతుని దయ – అను ఈ మూడింటియందు అర్థవంతము, "**ప్రవహతి**" అను క్రియాప్రయోగము మిగుల సరసము. కావేరీపక్షమున ప్రవహించుచున్నదని, రక్షించుచున్నదని, ధాత్రీపక్షమున గొప్పగా రక్షించుచున్నదని, దయాపక్షమున పరమపదమును పొందించుచున్నదని ("**వహ – ప్రాపణే**") అర్థములు. శిశిరత్వము, మాధుర్యము, ఆగాధత – అనునవి

కావేరీనదికి సహజగుణములు. ధాత్రీదయల పక్షమున అనిష్టనివర్తకత్వము, ఇష్టప్రాపకత్వము, స్థిరత్వమును అర్థములు, "**అప్యాయయంతీ**" అనుటకు కావేరీనదిపక్షమున – తీయని జలములచే తృప్తిపఱచి, పెంచుచున్నదని, ధాత్రీపక్షమున– తీయని పాలతో తృప్తిపఱచి, వృద్ధి చేయుచున్నదని, కృపపక్షమున – పురుషకారముద్వారా చేతనుని భగవానునిపట్ల ఉన్ముఖునిగ చేయుచున్నదనియు తాత్పర్యములు.

సంస్కృతవ్యాఖ్యానమున "**అప్రతిక్రియమ్**" అనుటకు – ఎట్టి ప్రత్యుపకారము చేయలేని – అను అర్థము చూపబడినది. అనగా, చేసిన ఉపకారమునకు ఏ విధమైన ప్రత్యుపకారమును చేయలేని స్థావర జంగమములను – అని భావము, అవి, తమ మనస్సులో గల కృతజ్ఞతాభావమును కూడ బయటకు తెలుపలేవు కదా! కావుననే, ఈ పదము భగవత్కృప నిర్హేతుకమని సూచించుచున్నది. "**అగణితగుణావద్యమ్**" అను పదము క్రియావిశేషణము, "**అప్రతిక్రియమ్ అపి ఆప్యాయయన్తీ**" అనుటను క్రియావిశేషణముగా కూడ అన్వయింపవచ్చును. అప్పుడు, అపేక్షించినను లేకున్నను తనకు తానే బలాత్కారముగా స్థావరజంగములను కావేరీనది అనుగ్రహించుచున్నది – అను భావము ఏర్పడును. కావేరీ "**జగద్ధాత్రి**" అగుట కేదారపోషణముద్వారా.

ప్రస్తుతశ్లోకము భవభూతి ఉత్తరరామచరితములోని "**అగణితతనూపాతమ్**" (1-23) అను గంగానదీ స్తుతివిషయకమగు శ్లోకమును గుర్తుకుతెచ్చుమన్నది. పవిత్రీకరణప్రార్థనాసందర్భమున వేదప్రసిద్ధముగు "**మరుద్వృథా**" (ఋ. వే. 3-13-6) అను నామము ప్రయోగించుట గమనింపదగినది.

ఇందు అలంకారము ఉపమ, హరిణీ వృత్తము. "**రసయుగహయైః న్సౌ మ్రౌ స్లౌ గో యదా హరిణీ తదా**" అని దీని లక్షణము, తాపహరిణి అగు కావేరీనది హరిణీ వృత్తమున వర్ణింపబడుట ఇచటి ఛందోవిశేషము.

**కావేరి నది నా పాపాలను పోగొట్టాలి**

**24. తరళతనుతరంగైః మంద మాందోళ్యమాన–**
**స్వతటవిటపిరాజీ మంజరీసుప్తభృంగా ।**
**క్షిపతు కనకనామ్నీ నిమ్నగా నాళికేర–**
**క్రముకజమకరందైః మాంసలాపా మదంహః ॥**

**ప్ర. అ. –** తరళ = మిక్కిలి చలించునవి, తను = చిన్నని అగు, తరంగైః = కెరటములచే, మందం = మెల్లగా, ఆందోళ్యమాన = ఊయల ఊపబడుచున్న, స్వ = తనయొక్క తట = తీరములోని, విటప = వృక్షములయొక్క, రాజీ = సమూహములయొక్క, మంజరీ = పూల గుత్తులలో, సుప్త = నిదురించిన, భృంగా = తుమ్మెదలను కల్గినది, నాళికేర = కొబ్బరిచెట్లనుండి, క్రముకజ = పోకచెట్లనుండి పుట్టిన, మకరందైః = తేనెలతో, మాంసలాపా = అభివృద్ధి చెందిన నీటిని కల్గిన, కనకనామ్నీ = "పొన్ని" అను పేరును కల్గిన, నిమ్నగా = (కావేరీ) నది, మత్ అంహః = నా పాపమును, క్షిపతు = పోగొట్టుగాక!

**వరివస్య :–** ముందు శ్లోకమున "**శిశిరమధురా ఽ గాధా**" అనుచు కవి కావేరీనదిని స్తుతించిరి కదా! కావేరీనదీజలములు సహజముగా అత్యంతమధురములు, దానితో పాటు, ఆ జలముల మాధుర్యము ద్విగుణీకృతమగుటకు కవి ఇందు ఒక హేతువును. ఉత్ప్రేక్షించుచున్నారు. ఈ శ్లోకమున కావేరీనది, తన జామాతక్షేత్రములోని భృంగములకు తూగుటూయలను ఊపుటను కవి వర్ణించుచున్నారనియు చెప్పవచ్చును.

కావేరీనదీ తీరమున పెరిగిన చెట్లను ఆ నదిలోని చిన్న చిన్న కెరటములు మెల్లగా తాకగా, అపుడు ఆ చెట్లలోని పూల గుత్తులు మెల్లగా అటు ఇటు కదలెను. ఆ పూల గుత్తులలోని మకరందమును ఆస్వాదించు తుమ్మెదలు పూల గుత్తులు ఊయల ఊగునట్లుగా కదలాడుటచే, అందు సుఖముగా నిద్రించినవి, మరియు, నదీతీరమున గల నారికేళ, క్రముక (పోక) వృక్షములనుండి స్రవించిన

తేనెలవలన నదిలోని నీరు మిక్కిలి అభివృద్ధి చెందెను. ఇట్టి ప్రశస్తమైన కావేరీనది నా పాపమును పోగొట్టునుగాక! – అని శ్లోకభావము.

"**తరంగైః మంద మాందోళ్యమాన**" అని పలుకుటవలన చెట్లలోని పూల గుత్తులను తాకునంత ఎత్తువరకు నదిలోని నీటి ప్రవాహము కలదని ధ్వనించును. ఈ అంశమును తరువాతి శ్లోకములోని పూర్వార్ధమునకూడ "**కంఠద్వయసససరసనీరాం సహ్యకన్యామ్**" అనుటచే కవి స్పష్టపఱచెను. మఱియు, ప్రస్తుత శ్లోకములోని "**తరంగైః. మంజరీసుప్తభృంగా**" అను ప్రయోగమునకు, తిరుప్పావైలోని "**పూఙ్గవళప్పోదిల్ పొఱివణ్డు కణ్ పడుప్ప**" (అందమైన కలువ పూలలో నల్లని రేఖలను కలిగిన తుమ్మెదలు సుఖముగా నిద్రించగా) (3) అను సూక్తికిని మధ్య కల అర్థసామ్యము గమనింపదగినది. "**కనకనామ్నీ (అపి) నిమ్నగా**" అనుటచే, కనకము నిమ్నగము కాదు. అనగా, దరిద్రులకు. అందనిది. కాని, కావేరీనది "**హేమాపగ**" అను పేరు కల్గినదైనను, నిమ్నజనసులభ, నిమ్నకేదారసులభ – అను అర్థస్వారస్యము స్ఫురించుచున్నది. కావేరీతీరమున నారికేళవృక్షముల ప్రాచుర్యము బిల్హణుని కర్ణసుందరీ నాటకమున వర్ణింపబడినది. "**నిమ్నగా మదంహః క్షిపతు**" అనుటచే, నిమ్నగ అగు కావేరీనది నిమ్నగుడనగు (అన్ని విధాల తక్కువవాడనగు) నా పాపమును హరించును గాక! అను భావము ధ్వనించును. అట్లే, కావేరీనది నిమ్నగ అయినను, ఉన్నతములగు నారికేళ క్రముకవృక్షములతో, మకరందనిష్యందములతో ఆరాధింపబడుచున్నది– అను భావము వ్యంగ్యరూపమున భాసించుచున్నది.

ఇందు వృత్తము మాలిని.

కావేరీనదిని స్తుతించు ఈ శ్లోకములు పెరియ తిరుమొళి ప్రబంధములోని 5వ శతకము, 4వ దశకములోని పాశురములకు చక్కని సంవాదములని చెప్పనగును.

**శ్రీరంగద్వీపమును నమస్కరించండి**

25. **కదళవకుళజంబూ పూగమాకందకంఠ–**
**ద్వయససరసనీరా మంతరా సహ్యకన్యామ్ ।**
**ప్రబలజలపిపాసా లంబమానాంబుథౌఘ–**
**భ్రమకరతరుబృందం వంద్యతా మంతరీపమ్ ॥**

**ప్ర. అ. –** కదళ = అరటిచెట్లయొక్క, వకుళ = పొగడచెట్ల యొక్క, జంబూ = నేరేడు చెట్లయొక్క, పూగ = పోకచెట్లయొక్క, మాకంద = తీయ మామిడిచెట్లయొక్క కంఠద్వయస = కంఠమువరకు గల, సరస = మధురమైన, నీరాం = నీటిని కల్గినదగు, సహ్యకన్యామ్ అంతరా = కావేరీనది మధ్యలో, ప్రబల = గొప్పదైన, జలపిపాసా = నీటిని త్రాగవలెనను కోరికచే, లంబమాన = క్రిందకు వ్రేలాడు, అంబుద = మేఘముల (యొక్క), ఓఘ = సమూహముయొక్క, భ్రమకర = భ్రమను కల్గించు, తరుబృందం = వృక్ష సమూహమును కల, అంతరీపం = దీవి, వంద్యతామ్ = నమస్కరింపబడుగాక!

**వరివస్య :–** భట్టరు ఈ శ్లోకమున, తరువాతి శ్లోకమున ఆరామపరివేష్ఠితమైన శ్రీరంగక్షేత్ర ద్వీపములోని భోగ్యతను కీర్తించుచున్నారు. కులశేఖరులును తమ ప్రబంధమున "**తిడర్ విళఙ్గు కరై పొన్ని నడువుపాట్టు**" (11) (ప్రకాశించు ఎత్తైన తీరప్రదేశమునుకల్గిన కావేరీనదిమధ్య ప్రదేశమున) అనుచు శ్రీరంగద్వీపమును వర్ణించిరి. గతశ్లోకమున కావేరినదిలో అవగాహించుట తెలుపబడినది. ఇందు కావేరీనది నిమ్నగ అయినను ప్రవాహకాలమున తీరవృక్షములను మధురములగు జలములతో ఆ కంఠము పూరించుచున్నది – అని తెలుపబడుచున్నది. మేఘవర్ణుడగు శ్రీరంగనాథుడు అధిష్ఠించిన శ్రీరంగమున వృక్షసమూహముకూడ మేఘమువలె తోచుట ఇచటి విశేషము. "**యథా రాజా తథా ప్రజాః**" (రాజు ఏ విధంగా ఉంటాడో, అతని రాజ్యంలోని ప్రజలు కూడా ఆ విధంగానే ఉంటాడు) కదా!

కావేరీనదీతీరమున గల అరటిచెట్లు, పొగడచెట్లు, నేరేడుచెట్లు, పోకచెట్లు, తీయమామిడిచెట్లు కంఠమువరకు నీటిలో మునిగియుండుటచే వానిపై భాగము మాత్రము బయటకు కన్పించు చున్నది. ఆ భాగములో చెట్ల ఆకులు, కొమ్మలు, రెమ్మలు మాత్రమే ఉండుటచే, ఆ భాగము మొత్తము దట్టమైన ఆకుపచ్చని రంగును కల్గియున్నది. నీటిపైన కనుపించు ఆ చెట్ల పై భాగములు చూచువారికి "దాహమును తీర్చుకొనుటకై కావేరీనదికి వచ్చి, క్రిందకు దిగి దాహమును తీర్చుకొని, కదలలేక వ్రేలాడుచున్న మేఘముల గుంపులవలె" తోచుచున్నని. ఇట్టి మనోహరమైన సన్నివేశమును కల్గిన శ్రీరంగద్వీపము నమస్కరింపబడుగాక! – అని శ్లోకభావము.

జలపిపాసను కల్గిన మేఘములు తెల్లగా ఉండును. కావున, అవి పచ్చని రంగును కల్గిన చెట్లు పైభాగములతో ఇచలు పోల్చబడుట ఎట్లు యుక్తము? అను శంక ఇక్కడ కలుగవచ్చును. ఇచట "**లంబమానాంబుభౌఘ**" అను ప్రయోగముచే నీటి రంగును కల్గినవి, నీటి బరువుచే కదలలేక అచటనే వ్రేలాడునవి అగు మేఘములే వివక్షితములు. "పిపాపాలంబమాన" అనునది మేఘములు కావేరినదివద్దకు వచ్చుటకు గల కారణమును తెలియజేయుచున్నది – అని చెప్పనగును –అని శ్రీప్రభ. అణ్ణాస్వామి వివరించిరి. స్త్రీ లింగమున ప్రయోగింపబడు "**కదలీ**" శబ్దమును ఇచట కవి '**కదళి**' అని ప్రయోగించుట వృక్షమను భావనతోనని చెప్పనగును. ఇచట మేఘబృందసామ్యముచే శ్రీరంగద్వీపముయొక్క భోగ్యత సూచింపబడినది. "తరుబృందం వంద్యతామ్" అనుటచే వృక్షబృందమునకు, సూరిబృందసామ్యము ధ్వనించుచున్నది. "**అంతరీపం వంద్యతామ్**" అనుటచే కావేరీనదీద్వీపముయొక్క భోగ్యత సూచింపబడినది. సముద్రాంతరీపవాసియగు విభీషణుడు శ్రీరంగనాథుని నివాసమగు కావేరీద్వీపమును భోగ్యముగా తలచెను కదా!

ఇందు వృత్తము మాలిని, అలంకారము భ్రాంతిమదలంకారము.

**కావేరీనది సైకతస్థలిని (ద్వీపమును) దర్శించండి**

**26. యద్విష్ణోః పద మపరం పరో రజోఽగ్ర్యం**
**ముక్తానా మనువిరజం విదీప్ర మాహుః।**
**తత్పుణ్యం పులిన మిదంతయా ఽ ద్య మధ్యే--**
**కావేరి స్ఫురతి తదీక్షిషీయ నిత్యమ్ ॥**

**ప్ర. అ. –** అనువిరజం = విరజానదీసమీపమున, అతమః = తమోగుణమును లేనిది, పరో రజః = రజోగుణమునకు దూరమైనది, అగ్ర్యం = గొప్పది అగు, యత్ = ఏ, విష్ణోః పదం = పరమ పదమును, ముక్తానాం = ముక్తులకు (మాత్రమే), విదీప్రం = మిక్కిలి ప్రకాశించునదిగా, ఆహుః = పల్కుదురో, తత్ ఆ (పరమపదము), పుణ్యం = పవిత్రమైన, పులినం = విరజానదీసైకతము, అద్య = ఈ సంసారదశలో కూడ, ఇదంతయా = " ఇది "అని కన్నులతో దర్శింప సాధ్యమగునట్లు, మధ్యేకావేరి = కావేరీనది మధ్యలో, స్ఫురతి = ప్రకాశించుచున్నది, తత్ = ఆ సైకతమును, నిత్యం = ఎల్లప్పుడును, ఈక్షిషీయ = దర్శింతును.

**వరివస్య :–** విరజానదీతీరమున గల పరమపదమును దర్శించుట ముక్తులకు మాత్రమే సాధ్యమగును. కాని, ఈ శ్రీరంగద్వీపము సంసారులకు సైతము అందుబాటులో ఉన్నది – అనుచు కవి ఈ శ్లోకమున పరమపదమున కంటే శ్రీరంగక్షేత్రద్వీపమునకు కల సౌలభ్యాతిశయమును కీర్తించుచున్నారు. "**తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయ**" (ఋ. వే. 1-22-20) (ఆ విష్ణుయొక్క ఉన్నతమైన పదమును ఎల్లప్పుడూ నిత్యసూరులు దర్శిస్తున్నారు) "**సోఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్**" (ఆ ముక్తుడు విష్ణువుయొక్క గొప్ప స్థానమైన పరమపదాన్ని పొందుతున్నాడు) (కఠ. 3-9) అని మొదలైన శ్రుతివాక్యములలోని పదములను ఈ శ్లోకము కల్గి యుండుట గమనింపదగినది.

విరజానదీతీరమున గల ఏ పరమపదమును రజోగుణమునకు, తమోగుణమునకు దూరమైనదిగా, మిక్కిలి గొప్పదిగా, నిత్యులకు, ముక్తులకు మిక్కిలి ప్రకాశించునదిగా వైదికులు వర్ణింతురో, ఆ పరమపదమే ఇప్పుడు ఈ లోకమున కావేరీనదీ తీరమునందలి. ద్వీపముగా అందరి కట్టెదుట సాక్షాత్కరించుచున్నది. అట్టి కావేరీనదీద్వీపమును ఎల్లప్పుడు దర్శింతును గాక! అని శ్లోకభావము.

పరమపదమును నిత్యులు, ముక్తులు ఎల్లప్పుడును దర్శింతురు. "**సదా పశ్యంతి సూరయః**" (పరమపదమును ఎల్లప్పుడూ నిత్యసూరులు దర్శిస్తున్నారు) అనుచు వేదము పల్కినది. వారు "**సదా పశ్యంతి**" అయినట్లే, నేను కూడ ఆ పరమపదమునకు ప్రతిరూపమగు కావేరీనదీసైకతస్థలిని నిత్యము దర్శింతును, ఆ విధముగా నేను "**సదా పశ్యంతిని**" అగుదును. – అను భావము "**నిత్యమ్ ఈక్షిషీయ**" అనుట వలన స్ఫురించుచున్నది. ఇందుచే ఈ శ్లోకమున శ్రీరంగద్వీపముయొక్క నిత్యప్రాప్యత్వము చెప్పబడినది. "**పరోరజః**", అను రూపము నిపాతము. "**ఇదంతయా స్ఫురతి**" అనుటచే పరమపదమునకు కంటే శ్రీరంగమునకు కల వైశిష్ట్యము తెలుపబడినది. "**పిశితదృశా మపి పురః చకాస్తి**" (మాంస చక్షువులను కలవారికి కూడా ప్రకాశిస్తున్నది) అని 29వ శ్లోకమునకూడ ఈ విషయము తెలుపబడినది.

ఇందు అలంకారము ఉదాత్తము, వృత్తము ప్రహర్షిణి, సంసారులకు సైతము ముక్తానందమును కల్గించు శ్రీరంగద్వీపమును కవి ప్రహర్షిణీ వృత్తమున వర్ణించుట, సాభిప్రాయకమని తోచును. "**మ్నౌ జ్రౌ గః త్రిదశయతిః ప్రహర్షిణీయమ్**" అని దీని లక్షణము.

## శ్రీరంగంలోని ఆరామాలలో నిత్య నివాసం చేయాలి

**27. త్రయ్యంతప్రహతిమతీషు వైష్ణవానాం**
**ప్రాప్యాసు ప్రచురభవశ్రమాపహాసు ।**

**కావేరీపరిచరితాసు పావనీషు**
**శ్రీరంగోపవనతటీషు వర్తిషీయ ॥**

**ప్ర. అ. –** త్రయ్యంత = ఉభయవేదాంతములయొక్క, ప్రహతిమతీషు = నిరంతరాభ్యాసఘోషను కల్గినవియు, ప్రచుర = ప్రబలమైన, భవ సంసారమునందలి శ్రమ = తాపమును, అపహాసు = పోగొట్టునవియును, పావనీషు = పవిత్రములైనవియును, వైష్ణవానాం = శ్రీవైష్ణవులకు, ప్రాప్యాసు = పొందదగినవియును, కావేరీ = కావేరీనదిచే, పరిచరితాసు = చల్లని గాలులద్వారా సేవింపబడినవియును అగు (చుట్టబడియున్నవి అగు), శ్రీరంగ = శ్రీరంగక్షేత్రమునందలి, ఉపవనతటీషు = ఆరామస్థలములయందు, వర్తిషీయ = నివసింతును.

**వరివస్య :– "ఆరామమ్ శూழ்న్ద అరఙ్గ నగరమ్"** (ఉద్యానవనములను చుట్టూ కలిగిన శ్రీరంగ నగరము) అను ప్రశస్తిని కల్గిన శ్రీరంగక్షేత్రము చుట్టును విస్తరించిన ఆరామముల నిత్యప్రాప్యత్వమును కవి ఇందు ప్రస్తుతించుచున్నారు. ముందు శ్లోకమున శ్రీరంగక్షేత్రమును సాక్షాత్తు పరమపదమని వర్ణించిన కవి, ఈ శ్లోకమున పరమపదములోవలెనే ఇచట కూడ **"ఏతత్ సామ గాయ న్నాస్తే"** (పరమపదంలో ముక్తులు సామగానాన్ని చేస్తున్నారు) (తై. ఉ.) అనునట్లు సామగానము వినిపించును – అనుచున్నారు.

సంస్కృత ద్రావిడవేదగానమును నిత్యము కల్గినవి, మిక్కిలి తీవ్రమైన సంసారతాపమును పోగొట్టునవి, పరమపావనములైనవి, కావేరీనదీజలములపై నుండి వీచు చల్లని గాలులతో నిండినవగు శ్రీరంగక్షేత్రము చుట్టును గల ఆరామములయందు నిత్యవాసము చేయుదును – అని శ్లోకభావము.

ఆళ్వార్లు, ఆచార్యులు అందరు శ్రీరంగక్షేత్రమున నిత్యవాసము చేయవలెనని అభిలాషపడిరి. శ్రీరంగనాథుడు **"అత్రైవ శ్రీరంగే సుఖమాస్వ"** (ఇక్కడే శ్రీరంగ నగరములోని సుఖంగా నివసించండి) అని భగవద్రామానుజులకు చెప్పిన సూక్తి అందరకు అన్వయిస్తుంది. కావున,

వైష్ణవులకందరకు ఈ క్షేత్రము పరమప్రాప్యము. నదిలో స్నానమును చేసినచో దేహతాపము మాత్రము తీరును. ఇచట నివసించినచో, అధిభౌతిక – అధిదైవిక – ఆధ్యాత్మికములనబడు తాపత్రయమును తీరును. కావేరీనది స్వయముగా చల్లని గాలులతో ఈ ఆరామములకు సపర్య చేయును. ఇట్టి విశిష్టతను కల్గినవి, ఈ శ్రీరంగారామములు.

"**ప్రాప్యాసు త్రయ్యంత ప్రహతిమతీషు శ్రీరంగోపవనతటీషు వర్తిషీయ**" అనుటద్వారా కవి శరణాగతిగద్యలోని "**ద్వయ మర్థానుసంధానేన సహ సదైవం వక్తా యావచ్ఛరీరపాతం అత్రైవ శ్రీరంగే సుఖ మాస్వ**" (ద్వయమంత్రాన్ని అర్థానుసంధానంతో పాటుగా, ఇక్కడనే అనుసంధానం చేసుకుంటూ, శరీర పతనంవరకు ఇక్కడే శ్రీరంగంలో సుఖంగా ఉండండి) అను శ్రీరామానుజసూక్తియొక్క అర్థమును అనుసంధించిరని చెప్పనగును. భట్టరు శ్రీరంగనాథస్తోత్రమున "**కదా ఽ హం కావేరీవిమలసలిలే వీతకలుషో, భవేయం తత్తీరే శ్రమముషి వసేయం ఘనవనే**" (కావేరీనదిలోని పవిత్రములైన జలాలలో స్నానం చేసి, దానితో నా దోషాలను పోగొట్టుకున్నవాడనై, ఆ నదీతీరంలో శ్రమను పోగొట్టే గొప్పదైన ఉద్యానవనంలో నేను ఎప్పుడు నివసించగలనో కదా!) (3) అనుచు పల్కుటను గమనింపనగును. "**ప్రహతివతీషు**" అను పాఠాంతరమును కలదు. అపుడు, శ్లోకములో "**ప్రహతి**" శబ్దమునకు ప్రసిద్ధి అనియు అర్థమును చెప్పవచ్చును. అపుడు, "**త్రయ్యంతప్రహతివతీషు**" అనుటకు వేదాంతప్రసిద్ధములు – అను అర్థము ఏర్పడును.

శ్రీరంగమునందలి తోటలలో తుమ్మెదలు ఝుంకారధ్వనులు చేయుననుటను తొణ్డరడిప్పొడి యాళ్వార్లు "**వణ్డినమ్ మురలుమ్ శోలై**" (14) (తుమ్మెదల గుంపు మధురంగా ధ్వనించే తోట) అను పాశురమున పలికిరి. శ్రీరంగక్షేత్రమున నివసించు పశుపక్ష్యాదులు సైతము దివ్యసూరుల రూపములేనని భట్టరు "**అహ్రుతసహజదాస్యాః**" అను (33వ) శ్లోకమున తెలియజేసిరి. కావున పై పాశురములోని తుమ్మెదలు కేవలము తుమ్మెదలు

కావని, దివ్యసూరులేనని ఏర్పడినది. కావున, వారు చేయు నాదములు వేదనాదములనుటలో ఏ సందేహము లేదుకదా! భట్టరు రచించిన శ్రీరంగనాథ స్తోత్రములోని "**ఆవిర్మోదస్తిమిత శకునానూదితబ్రహ్మఘోషామ్**" (ఆనందంతో స్థిమితంగా ఉండే పక్షులు చేసే ధ్వనుల ద్వారా అనువదింపబడిన వేదనాదాలను కలిగినది) (5) అను శ్లోకము, పెరియాళ్వార్ తిరుమొళిలోని "**పూమరుని ప్పుళ్ళినజ్గళ్ పుళ్ళరైయిన్ పుకఴ్ పాడుమ్ పునలరజ్గమే**" (పూలలో నిత్యవాసం చేసే తుమ్మెదలు గరుత్మంతుని కీర్తిని పాడుతూ ఉండే కావేరీనదీ తీరంలోని శ్రీరంగనగరం), (4-9-5) "**ఎల్లియమ్బోదు ఇరుజ్జిఱై వణ్డు ఎమ్బెరుమాన్ గుణమ్బాడి**"(బ్రాహ్మముహూర్తంలో అందమైన రెక్కలను కలిగిన తుమ్మెదలు భగవంతుని గుణ కీర్తనాన్ని చేసి) (4-8-8), "**అరుమా మఱై యన్దణర్ శిన్దై పుక శెవ్వాయ్ క్కిళి నాన్ మఱై పాడు తిల్లైతిరుచ్చిత్తరకూడమ్**" (అరుదయిన వేదాలను అధ్యయనం చేసే విప్రుల మనసులలో ప్రవేశించేటట్లుగా ఎర్రని నోటిని కలిగిన చిలుకలు నాలుగు వేదాలను పాడే తిల్లై తిరుచిత్తిర కూడమ్ అనే దివ్యక్షేత్రంలో) (పెరి. తి. 3-2-6) అను మొదలగు ప్రమాణము లీవిషయమును బలపరచుచున్నవి.

"**వైష్ణవానాం ప్రాప్యాసు**" అనుటచే వైకుంఠము కన్న శ్రీరంగద్వీపము ప్రాప్యమను అర్థము ధ్వనించును. పరమపదమున ముక్తులకు "**శతం మాలాహస్తాః**" (కౌషీ, 1-34) (పరమపదంలో ముక్తునకు వేయిమంది దివ్యకాంతలు మాలలను అలంకరించి, అతనికి సేవ చేస్తారు) అని చెప్పబడిన విధముగా, దివ్య స్త్రీలచే పరిచర్య వేయబడునట్లే, ఇచట కానేరీనది భక్తులకు పరిచర్య చేయుచున్నదనుట "**కావేరీపరిచరితాసు**" అనుటచే ధ్వనించుచున్నది.

కావేరీనది చేయు పరిచర్య పూర్వశ్లోకములలో తెలుపబడినది కదా! దండకారణ్యమున రామచంద్రుని "**వీచీవాతైః శీకరక్షోదశీతైః**" (నీటి తుంపురులతో చల్లనివి అయిన కెరటాల గాలులతో) (ఉ. రా. 3-2) అని పుణ్యనదులు పరిచర్యను చేసినవి. శ్రీకృష్ణుని యమునానది "**యమునా చ**

**విచిత్రం పరిచచార యామునమ్**" (యమునానది విలక్షణమైన రీతిలో శ్రీకృష్ణునకు పరిచర్యను చేసినది) అనునట్లు సేవించినది. కాని, ఈ కావేరీనది శ్రీరంగనాథునే కాక, భాగవతులనుకూడ సేవించుట విశేషము.

శ్రీరంగమున ఉపవనములకు పావనత్వము శ్రీరంగసమీపవర్తిత్వముచే కల్గినది. శ్రీరంగవిమానమనగా ప్రణవము. ప్రణవమునకు దగ్గరగా నుండుటచే పావవత్వమును కల్గినదనియు చెప్పవచ్చును.

ఈ శ్లోకము త్రయ్యంతపదముతో ప్రారంభమై శ్రీరంగకీర్తనముతో ముగియుచున్నది. వేదమునకు ముందు, తరువాత కూడ ఓంకారమును ఉచ్చరింపవలెను. కావున, త్రయ్యంతశబ్దముచే '**త్రయ్యాః అంతః**", "**త్రయీ అంతే యస్య సః**" అను వివరణములనుబట్టి ఓంకారము సూచింపబడుచున్నది.

ఈ శ్లోకము ప్రారంభములో గల. త్రయ్యంతశబ్దము, చివర గల శ్రీరంగశబ్దముకూడ ఓంకారసూచకములు. ఈ విధముగా ఈ రెండిటి మధ్య శ్రీరంగనగరమున ఉపవనతట ప్రదేశములు వ్యాప్తములగుటచే అవి పావనములు.

వేదాధ్యయనమును చేయువారు అధ్యయన ప్రారంభమున, చివర ఓంకారమును గట్టిగా ఉచ్చరింతురు. ఆ శబ్దముచే ఉపవనతటములకు పావనత్వము కల్గినది– అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో వివరింపబడినది. "**వర్తిషీయ**" అనునపుడు, ఆవర్తననిరోధియగు వర్తనశబ్దముచే కవియొక్క శ్రీరంగనిత్యనివాసమునందలి అభిలాష ధ్వనించుచున్నది.

ఈ శ్లోకమునకూడ ప్రహర్షిణీవృత్తమే. ఈ వృత్తమునుకూడ కవి ఇచట సాభిప్రాయకముగానే వాడినట్లు తోచును.

## శ్రీరంగ క్షేత్రంలోని ఉద్యానవనాలు మనకు ఆనందాన్ని కలిగించాలి

**28. స్ఫురితశఫరదీర్ఘ్యన్నాలి కేరీగుళుచ్ఛ–**
**ప్రస్పమరమధుకుల్యావర్థితానోకహాని ।**

**రతి మవిరతి రంగారామరమ్యస్థలాని**
**క్రముకపనసమోచామేచకాని క్రియాసుః ॥**

**ప్ర. అ. –** స్ఫురిత = త్రుళ్ళిపడు, శఫర = బేడిప చేపలచే, దీర్యత్ = భేదింపబడు, నాలికేరీగుళుచ్ఛ = నారికేళముల గుత్తులనుండి, ప్రస్పమర = మిక్కిలి స్రవించు, మధు = తేనెయొక్క, కుల్యా = కాలువలచే (ప్రవాహములచే) వర్ధిత పెంపొందింపబడిన, అనోకహాని = వృక్షములను కల్గినవి, క్రముక = పోకచెట్లు, పనస = పనసచెట్లు, మోచా = అరటిచెట్లు – అను వీనితో, మేచకాని = దట్టమైన శ్యామలవర్ణమును కల్గినవగు, రంగ ఆరామ = శ్రీరంగక్షేత్రములోని తోటలలోని, రమ్య = మనోహరములైన, స్థలాని = ప్రదేశములు, రతిం = (మనకు) ఆనందమును, అవిరతి = ఎడతెగక, క్రియాసుః = కలుగజేయునుగాక!

**వరివస్య :–** శ్రీరంగక్షేత్రము చుట్టును గల దివ్యారామముల భోగ్యత్వము, వాని ప్రాప్యతకు తగినదను విశేషమును కవి ఇందు వర్ణించుచున్నారు. "**రతిం గతో హరిః తస్మాత్ రంగ మిత్యభిధీయతే**" – (భగవానునకు గొప్ప ఆసక్తిని కల్గించునది, కావున రంగమని పేరు),. "**రజ్యంతే. ఽ స్మిన్ సర్వే సామాజికా ఇతి రంగమ్**" – (సామాజికులందరు ఎంతో ఆసక్తిని పొందుచున్నారు. కావున రంగము అని పేరు)– అను ఈ రెండు వ్యుత్పత్తులను రంగశబ్దమునకు, చెప్పవచ్చును. ఇదట ఈ వ్యుత్పత్తులను అనుసరించి ప్రస్తుతశ్లోకము రచింపబడినట్లు తోచును.

శ్రీరంగనిత్యనివాసముచే పరమానందమును పొందిన వృక్షములు చూచినవారికి సంతోషమును కల్గించును గాక – అనునది ఈ శ్లోకములోని సారాంశము.

కావేరీనదిలోని పెద్ద పెద్ద చేపలు త్రుళ్లి నారికేళముల గుత్తులపై పడగా, ఆ అదరునకు గుత్తులలోని కొబ్బరికాయలు క్రిందపడి పగిలి, వాటిలోని నీరు కాలువలుగా ప్రవహించును. ఆ నీటివలన చుట్టుప్రక్కల గల వృక్షములు మరింత పెంపొందును. మరియు, పోకచెట్లు పనసచెట్లు, అరటిచెట్లు, దట్టముగా

పెరుగుటచే, ఆ ప్రాంతమంతయు పచ్చని వర్ణముతో కళకళలాడును. ఈ విధమైన రమణీయ పరిసరములను కల్గిన శ్రీరంగదివ్యారామములు మనకు ఆనందమును కలుగజేయుగాక! – అని శ్లోకభావము.

కవి, నదిలోని చేపలు త్రుళ్లుటచే కొబ్బరిచెట్లపై గల గుత్తులలోని కాయలు క్రిందపడుచున్నవనుటచే, ఆ నదిలోని ప్రవాహము ఆ గుత్తుల ఎత్తువరకు వృద్ధి చెందినదని తెలియుచున్నది. లేదా, "**నాళికేరీ**" అనుచు లతగా నిర్దేశించుటచే మూలమున చేపలు త్రుళ్లిపడుటచే, ఆ అదరునకు గుత్తులలోని కాయలు క్రిందపడినవనియు చెప్పవచ్చును. ఈ శ్లోకమున శ్రీరంగక్షేత్రములోని ఆరామములు సంసారతాపమును సైతము పోగొట్టి, సుఖమును కలుగచేయగల్గినవనుట తాత్పర్యము.

శఫరములు కనకవర్ణములు. అవి కనకనది అగు కావేరీలో ఎక్కువగానుండును. ఆనందముతో అవి త్రుళ్లిపడునపుడు బంగారము మెఱసినట్లుండును. భగవానుడు. మరకతమణిసదృశుడు అగుటచే మేచకవర్ణుడు. అట్లే, ఉపవనవృక్షములును; "**యథా రాజా తథా ప్రజాః**" వలె, శ్రీరంగోపవన ప్రదేశములకు రమ్యత మేచకవర్ణవృక్షములచే మాత్రమే కాదు. శ్రీరంగనాథుడు తన ఆరామములలో ఉత్సవమూర్తి రూపమున విహరించును. కావున వానికి రమ్యత సిద్ధించినది.

ఆరామశబ్దమునకు విహారము అని, సంతోషము అని అర్థములు కలవు. కావున, "**రంగస్య శ్రీరంగనాథస్య ఆరామేణ సంతోషేణ రమ్యాణి స్థలాని**" అను వివరణము ఇచట వివక్షితము. శ్రీరంగనగరోపవనములు నిత్యము శ్రీరంగనాథునకు ప్రీతిని కల్గించినట్లే, నాకును సంతోషమును కల్గించును గాక! అనునది ఈ శ్లోక సారాంశము – అను ఈ వివరణము శ్రీగోపాలాచార్యవ్యాఖ్యానమున కన్పించుచున్నది. అలంకారము ఉదాత్తము. (ఆరామముల సంపద వర్ణింబడుటచే).,వృత్తము మాలిని.

**వైకుంఠములోని అయోధ్యా నగరమే శ్రీరంగ నగరము**

**29. అధిపరమపదం పురీ మయోధ్యా-**
**మమృతవృతా మపరాజితా ముశంతి ।**
**పులిన ముపరి రంగరాజధానీ**
**పిశితదృశా మపి సా పుర శ్చకాస్తి॥**

**ప్ర. అ. –** అధిపరమపదం = పరమపదమునందు, అమృతవృతాం = అమృతమయములైన జలములను కల్గిన విరజానదిచే చుట్టబడినది (లేదా) నిత్యులచే, ముక్తులచే చుట్టబడినది (నిండినది). అయోధ్యాం = అయోధ్య అను పేరును కల్గినది, అపరాజితాం = అపరాజిత అను పేరును కల్గినది, (యాం) పురీం = (ఏ) నగరమును (ఉన్నదిగా), ఉశంతి = (వైదికులు) పేర్కొనుచున్నారో, సా = – ఆ దివ్యనగరము, రంగరాజధానీ = శ్రీరంగనాథుని రాజధానిగా, పుళినం ఉపరి = (కావేరీనదీ) సైకతముపై, పిశితదృశామ్ అపి = మాంసచక్షువులను కల్గినవారికికూడ, పురః = కట్టెదుట, చకాస్తి = ప్రకాశించుచున్నది.

**వరివస్య :–** ఈ శ్లోకమునుండి వరుసగా మూడు శ్లోకములలో భట్టరు శ్రీరంగనగరమును స్తుతించుచున్నారు. పూర్వశ్లోకమున వర్ణింపబడిన రతి పరమపదవాసమువలన కలుగదగిన పరమాత్మరతి, అనగా, బ్రహ్మానందము. అట్టి బ్రహ్మానందమును కల్గిన శ్రీరంగనగరము ఇందు స్తుతింపబడుచున్నది.

శ్రీరామచంద్రుడు నివసించు నగరము అయోధ్య అయినట్లే, శ్రీరామచంద్రుని దైవమగు శ్రీరంగనాథుడు నివసించు నగరమును అయోధ్యయే. **"యో వై తాం బ్రహ్మణో వేద అమృతేనావృతాం పురీమ్"** (విరజానదిచే చుట్టబడి ఉండే, పరమాత్మయొక్క ఆ నగరాన్ని ఎవడు తెలుసుకుంటున్నాడో) అని, **"దేవానాం పూ రయోధ్యా"** (తై. ఆర. 1-27) (నిత్యసూరుల నగరం అయోధ్య) అని, **"పురం హిరణ్మయం బ్రహ్మ వివేశాపరాజితా"** (బంగారు మయమైన, అపరాజిత అనే పేరు కలిగిన నగరాన్ని ప్రవేశించాడు) అని వేదమున

స్తుతింపబడినట్లుగా, "**అయోధ్య, అపరాజిత**" అను పేర్లను కల్గినది, అమృతమయములగు విరజానదీజలములచే చుట్టబడియున్నది, నిత్యుల ముక్తుల నివాసమైయున్నది అగు ఏ దివ్యనగరము ఒకటి కలదని వైదికులు పలుకుచున్నారో, ఆ నగరమిపుడు ఇచట కావేరీనదీసైకతమున (ఇసుక తిన్నెపై) భౌతికదృష్టికికూడ కనపడునట్లు శ్రీరంగనగరరూపమున ప్రకాశించుచున్నది– అని శ్లోకభావము.

"**అమృతవృతామ్**" అనునపుడు, అమృతశబ్దమునకు విరజానదీజలములని, నిత్యులు, ముక్తులు–అని, పరబ్రహ్మ –అని మూడర్థములును చెప్పవచ్చును. కావున, పరమపదమున గల నగరము విరజానదీజలములచే చుట్టబడియున్నదని, నిత్యులతో, ముక్తులతో నిండియున్నదని, పరబ్రహ్మచే అవృతమైనదని మూడర్థములును ఈ శ్లోకమున చెప్పుటకు వీలున్నది. "**యో వై తాం బ్రహ్మణో వేద అమృతేనా. వృతాం పురీమ్**" అను శ్రుతిలో "**అమృత**" శబ్దమును అట్లే ఆచార్యులు వ్యాఖ్యానించిరి. "**య ఆత్మని తిష్ఠన్ అంతర్యామ్యమృతః**" అను అంతర్యామి బ్రాహ్మణ వాక్యమున అమృత శబ్దము పరబ్రహ్మవిషయమున ప్రయోగింపబడినది. ముక్తుల విషయమున అమృతశబ్దము. జాత్యేకవచనముగ గ్రహింపనగును. "**పిశితదృశామపి**" అనునపుడు "**అస్తి**" శబ్దముచే – పరమపదము నిత్యులకు, ముక్తులకు మాత్రమే అనుభవయోగ్యమని, శ్రీరంగక్షేత్రము సంసారులకు కూడ అనుభవింప వీలయినదను విశేషార్థము ఇచట స్ఫురించుచున్నది. ఈ అర్థమువలన శ్రీరంగ క్షేత్రముయొక్క సౌలభ్యాతిశయము వ్యక్తమగుచున్నది. మరియు, శ్రీరామునిగా భగవానుడు అవతరించినప్పుడు, పరమపదములోని అపరాజితానగరము భూలోకమున అయోధ్యానగరముగా మారినట్లే, పరమపదనాథుడు శ్రీరంగనాథుడు కాగా, అపరాజిత శ్రీరంగక్షేత్రమై వెలసెననియు ఏర్పడుచున్నది. "**కావేరీ విరజా సేయం వైకుంఠం రంగమందిరమ్**" (శ్రీరంగస్థలపురాణము)

(కావేరీ నది ఆ విరజానదియే, రంగమందిరం వైకుంఠమే) అను ప్రసిద్ధ ప్రమాణ శ్లోకమిచట స్మరణీయము.

పరమపదములోని భగవానుని "**న మాంసచక్షుభి రభివీక్షతే తమ్**" (భౌతిక నేత్రాలతో ఆ పరమాత్మను దర్శించడం లేదు) అనునట్లు, సంసారిజనులు దర్శింపలేరు. ఆ భగవానునివలెనే పరమపదముకూడ సామాన్యుల దృష్టికి గోచరింపదు. కాని, శ్రీరంగనాథుడు అందరికి సులభుడు. అట్లే, ఆ స్వామి నివసించు. శ్రీరంగనగరము మాంసచక్షువులను కల్గినవారికిని దర్శనమిచ్చును – అను విశేషము "**పిశితదృశా మపి పురః చకాస్తి**" అనుటచే ధ్వనించుచున్నది. "**అపి**" శబ్దముచే పరమపదవాసులకును శ్రీరంగనగరము భోగ్యమని తెలియుచున్నది. "**చకాస్తే**" అను ఆత్మనేపదిప్రయోగముకూడ కొన్ని కోశములలో కన్పించుచున్నది.

ఇందు వృత్తము పుష్పితాగ్ర. "**అయుజి నయుగ రేఫతో యకారో, యుజి చ నజౌ జరగా శ్చ పుష్పితాగ్రా**" అని దీని లక్షణము. ఇందు బేసి పాదములలో న, న, ర, య అను గణములు, సమపాదములలో న, జ, జ, ర, గ అను గణములుండును. ఈ వృత్తమును ఔపచ్ఛందసికమను మాత్రాఛందోభేదముగా కూడ కొందరు పరిగణించిరి.

"**వాన్ తికఴ్రుమ్ శోలై మదిళ్ అరంగమ్**" (ఆకాశాన్ని అంటే ఎత్తులో ఉండే ఉద్యానవనాలను ప్రాకారాలను కలిగిన శ్రీరంగం) అని పూలతో నిండిన అందమైన ఉద్యానవనాలతో రమణీయమైన శ్రీరంగనగరాన్ని పుష్మితాగ్ర అనే పేరును కలిగిన వృత్తములో వర్ణించుట ఈ శ్లోకంలోని మరి ఒక విశేషము.

## వైకుంఠ లోకములోని అయోధ్యా నగరము కంటే శ్రీరంగ నగరము గొప్పది

**30. భవపద మపి దివ్యధామ కర్తుం**
**తదుభయతంత్రితహర్మ్యమాలికేవ ।**

**భవనమణితలై ర్విజృంభమాణా**

**జయతి తరా మిహ రంగరాజధానీ ॥**

**ప్ర. అ. –** భవపదమ్ – అపి = సంసారమును కూడ, దివ్యధామ = నిత్యవిభూతిగా, కర్తుం = చేయుటకు, ఇవ = వలె, తత్ ఉభయ = ఆ నిత్యవిభూతి, లీలావిభూతుల మధ్య, తంత్రిత = సంఘటితమైన, హర్మ్యమాలికా = మేడలు, మిద్దెల వరుసలను కల్గినదై, భవన = గృహములయందు, మణితలైః = మణులు పొదగబడిన వేదికలచే ఉపరిభాగములచే, విజృంభమాణా = వృద్ధి చెందుచున్నది అగు, రంగరాజధానీ = శ్రీరంగనాథుని రాజధాని (శ్రీరంగము), ఇహ = ఈ లోకమున, జయతి తరాం = మిక్కిలి ఉత్కర్షతో ప్రకాశించుచున్నది.

**వరివస్య :–** ఇందు శ్రీరంగనగరములోని దివ్యభవనములను కవి వర్ణించుచున్నారు. శ్రీరంగక్షేత్రమునకు పరమపదత్వమును, అంతకంటే విశేషమును ఉపపాదించుట ఈ శ్లోకములోని విశేషము.

శ్రీరంగనగరమునందలి గొప్ప గొప్ప భవనములు నిత్యవిభూతి వరకు వ్యాపించియున్నవై, మణులు పొదగబడిన (వేదికలచే) తలములచే కూడినవగుటచే, అవి భూలోకమును పరమపదమువలె భాసించునట్లు చేయుచున్నవి. శ్రీరంగములోని భవనములు మూలభాగమున లీలావిభూతితో, పై భాగమున నిత్యవిభూతితో సంబంధమును కల్గియుండుటచే, ఉభయవిభూతుల మధ్య సంఘటితమై సర్వోత్కర్షతో మిక్కిలి. వెలుగొందుచున్నవి – అని శ్లోకభావము.

"**జయతి తరామ్**" అను క్రియాపదముచే నమస్కారము ఆక్షిప్తమగుచున్నది. కావ్యప్రకాశలోని "**నియతికృతనియమరహితామ్**" అను మొదటి శ్లోకమును వ్యాఖ్యానించుచు. గ్రంథకర్త అగు మమ్మటుడు "**జయత్యర్థేన చ నమస్కార ఆక్షిప్యతే ఇతి తాం ప్రత్యస్మి ప్రణత ఇతి లభ్యతే**" ("**జయతి**" అనే పదప్రయోగంచేత ఇక్కడ నమస్కారం సూచింపబడుతున్నది కనుక, "**సరస్వతీదేవిని ఉద్దేశించి నేను నమస్కరించినవాడనయ్యాను**" అనే అర్థం

దీనివల్ల ఏర్పడుతున్నది) అని పల్కుటను గమనింపవచ్చును. సర్వోత్కృష్టమైనదేకదా నమస్కారార్హమగును.

"**భవపద మపి దివ్యధామ కర్తుమ్**" అనుటవలన శ్రీరంగమునందలి భవనముల దివ్యత్వము సూచింపబడినది. "**జయతి తరామ్**" అనుటచే పరమపదము కన్న శ్రీరంగనగరము గొప్పగా శోభించుచున్నదని ధ్వనించుచున్నది.

ఇక్కడ అలంకారము ఉత్ప్రేక్ష. పుష్పములను నిండుగా కలిగిన, జఉద్యానవనములచే ఆవృతమైన శ్రీరంగ నగర వర్ణనలో పూర్వమువలె పుష్పితాగ్రావృత్త ప్రయోగము అత్యంతము సముచితము.

## శ్రీరంగపురి ఒక అందమైన స్త్రీ

**31. మణిమకరరుచీః వితత్య పాశాన్**
**విసృమరకేతుకరైః మృగం హిమాంశోః ।**
**శ్రియ ఇవ నవకేళయే జిఘృక్షుః**
**సుఖయతి రంగపురీ చకాసతీ నః ॥**

**ప్ర. అ. –** మణి = రత్నములచే చేయబడిన, మకర = తోరణముల యొక్క, రుచీః = కాంతులను, పాశాన్ = పాశములుగా (త్రాళ్లుగా, వలలుగా), వితత్య = విస్తరించి, విసృమర = పైపైకి ప్రసరించు, కేతు = ధ్వజములనెడి, కరైః = చేతులతో, హిమ అంశోః = చంద్రుని యొక్క (లో గల), మృగం = జింకను, శ్రియః = లక్ష్మీదేవియొక్క, నవ = (క్రొత్త) అపూర్వమైన, కేళయే = లీల కొఱకు, జిఘృక్షుః = పట్టుకొనగోరునదియై, ఇవ = వలె, చకాసతీ = ప్రకాశించునట్టి, రంగపురీ = శ్రీరంగము, నః = మనలను, సుఖయతి = సంతోషింపజేయుచున్నది.

**వరివస్య :–** శ్రీరంగనగరము శ్రీరంగనాథుని రాజధాని అనుటకు తగినట్లు మకరాలంకృతమైన ధ్వజస్తంభములను కవి ఇందు వర్ణించుచున్నారు.

శ్రీరంగములోని వీథులలో గల తోరణములు రత్నమయములగుటచే వాని కాంతులు పైపైకి ప్రసరించుచున్నవి. అచటి భవనములపై ధ్వజములు ఎగురుచున్నవి. ఆ దృశ్యమును చూడగా శ్రీరంగపురి అనెడి స్త్రీ, పైన ఎగురునట్టి ధ్వజములనెడి చేతులతో మణితోరణముల కాంతులను వలలను విసరి చంద్రునిలో గల జింకను శ్రీరంగనాయకి విలాసముకొఱకు పట్టుకొనదలచినట్లున్నది. – అని భావము.

చంద్రునిలో గల మచ్చను కవులు పలు విధములుగా ఉత్ప్రేక్షించిరి. "**సారంగం కతిచిచ్చ సంజగదిరే**" (కువలయానందము) (జింక అని కొందరు చెప్పారు) అనునట్లు, ఆ మచ్చను కొందరు జింకగా అభ్యూహించిరి, కవి అట్టి భావమును గ్రహించి, ఈ శ్లోకమును రచించెను. శ్రీరంగనగరము తన భోగ్యతాతిశయముచే ప్రపన్నులమగు మనలను మిక్కిలి రంజింపచేయుచున్నది – అని సారాంశము. "**శ్రియ ఇవ సుఖయతి రంగపురీ నః**" అని అనుటచే శేషదంపతులకు ప్రీతిని కల్గించుటచే రంగపురి మనకును సంతోషమును కల్గించుచున్నదని భావము. శేషిప్రీతి శేషభూతునకును ప్రీతియే కదా! "**సుఖయతు**" అను పాఠాంతరము కన్పించుచున్నది. అదియును మిక్కిలి పొసగును.

అలంకారము ఉత్ప్రేక్ష, వృత్తము పుష్పితాగ్ర. పూలను పూచిన వృక్షాలతో నిండిన ఉద్యానవనాలను చుట్టూ కల శ్రీరంగనగర వర్ణనలో ఈ పుష్పితాగ్ర అనే వృత్త ప్రయోగము సహృదయ హృదయావర్జకము.

## కుముదాది గణనాయకులను నమస్కరిస్తున్నాను

**32. జనపదసరిదంతరీపపుష్యత్–**
**పురపరిపాలననిత్యజాగరూకాన్ ।**
**ప్రహరణపరివారవాహనాఢ్యాన్**
**కుముదముఖాన్ గణనాయకాన్ నమామి ॥**

**ప్ర. అ. –** జనపద = జనులకు నివాసస్థానమై, సరిత్ = కావేరీనదిమధ్య గల, అంతరీప = ద్వీపమున, పుష్యత్ = వర్ధిల్లుచున్న, పుర = శ్రీరంగనగరముయొక్క, పరిపాలన = రక్షణయందు, నిత్యజాగరూకాన్ = ఎల్లప్పుడు మెలకువగానుండువారు, ప్రహరణ = ఆయుధములతో, పరివార = పరిజనములతో, వాహన = వాహనములతో, ఆఢ్యాన్ = కూడినవారును అగు, కుముదముఖాన్ = కుముదుడు మొదలగు, గణనాయకాన్ = గణనాథులను, నమామి = నమస్కరించెదను.

**వరివస్య :–** శ్రీరామానుజులు నిత్యగ్రంథమున పరమపదమున గల దివ్యనగరములో ఎనిమిది దిక్కులలోను రక్షణ కైంకర్యమును నిర్వహించు కుముదాదులను ప్రస్తుతించిరి. తూర్పున కుముదుడు, ఆగ్నేయమున కుముదాక్షుడు, దక్షిణమున పుండరీకుడు, నైఋతియందు వామనుడు, పశ్చిమమున శంఖకర్ణుడు, వాయవ్యమున సర్పనేత్రుడు, ఉత్తర దిశలో సుముఖుడు, ఈశాన్యమున సుప్రతిష్ఠితుడను నిత్యసూరులు దివ్యనగరమును రక్షింతురని అచట పేర్కొనబడినది. శ్రీరంగనగరము "**అపరాజిత**" అనబడు వైకుంఠపురికి ప్రతిరూపము. కావున, శ్రీరంగములో గల నగరపరిపాలకులకును అవియే పేర్లు. భట్టరు ఈ శ్లోకమున ఈ ఎనిమిదిమంది నగరరక్షకులను నమస్కరించుటద్వారా వారి అనుజ్ఞను ప్రార్థించి, పొందగోరుతున్నారు. నిత్యగ్రంథములో ప్రతినామము పిమ్మట గల "గణాధిపతయే సవాహనపరివారప్రహరణాయ నమః" అను పదములను భట్టరు ఈ శ్లోకమున నిబంధించుటను గమనింపవచ్చును.

**"కోసలో నామ ముదితః స్ఫీతో జనపదో మహాన్,**
**నివిష్టః సరయూతీరే ధనధాన్యసమృద్ధిమాన్" (రా. బాల. 5–4)**

(సరయూనదీ తీరంలోనున్నది, ధనంలో, ధాన్యంలో సమృద్ధిని కలిగినది అయిన కోసలమనే పేరు కలిగిన విశాలమైన గొప్ప నగరం ఉన్నది).

అని వాల్మీకిభగవానులు కోసలనగరమునుగూర్చి పల్కినట్లే, భట్టరు శ్రీరంగనగరమును సారవంతమైన జనపదములతో కూడినదని వర్ణించుచున్నారు. **“కనకసరిత్”** అగు కావేరీనదియొక్క తీరమున గల శ్రీరంగనగరము గొప్ప ధనధాన్యసంపదలతో నిండియున్నది. అట్టి నగరమును రక్షించు బాధ్యతను గణనాయకులు నిర్వహించుచున్నారు.

జనులు నివసించుటకు తగిన చోటును, కావేరీనదీద్వీపమున ప్రకాశించునదియు అగు శ్రీరంగనగరమును రక్షించులటలో ఎల్లప్పుడు మెలకువతో నుండువారు, ఆయుధములను, పరిజనములను, వాహనములను కల్గినవారగు కుముదుడు మొదలగు గణనాయకులకు నేను నమస్కరింతును – అని శ్లోకభావము.

శ్రీరంగనగరమును రక్షించుటద్వారా అదటి భక్తజనులకు అందుకు. ఇష్టప్రాప్తి, అనిష్టనివృత్తిరూపమైన రక్షణను కల్గించువారగుటచే కుముదాదిగణనాయకులు అందుకు మిక్కిలి ఉపాసింపదగినవారు. శ్రీరంగమున నివసించు భక్తులు నిత్యము చేయు భగవత్కైంకర్యమునకు కల్గు అంతరాయములను నివారించు గణనాయకులు వారికి రక్షణను చేయువారగుదురుకదా! వారిని ఆఢ్యులనుట భగవత్కైంకర్యమను సంపదను నిండుగా కలవారనుటయే. **“ఆఢ్యో ధనీ”** అని అమరము.

గోదాదేవి తిరుప్పావై దివ్యప్రబంధములో 16న పాశురమున (**“నాయకనాయ్ నిన్ఱ కోయిల్ కాప్పానే!”** (కోవెలను రక్షించేవాడా!) **“తోరణ వాశల్ కాప్పానే”** (తోరణద్వారాన్ని రక్షించేవాడా!) అను రెండు సంబోధనలు కలవు. వీనిలో మొదటిది నగరరక్షకుని, రెండవది ద్వారపాలకుని తెలియజేయునని పూర్వాచార్యులు వ్యాఖ్యానించుట– పైన ఉదహరించిన నిత్యగ్రంథములోని ప్రమాణము, ప్రస్తుత శ్లోకమును అనుసరించియేనని చెప్పనగును.

భట్టరు ఈ శ్లోకమున నగరపాలకులను, **"స్మేరాననానాక్షి"** అను 37వ శ్లోకమున ద్వారపాలకులను స్తుతించిరి. భగవదారాధన భగవానునితో ప్రారంభమగును, కావున, నిత్యగ్రంథమున ద్వారపాలకుల పిమ్మట నగరపాలకులు ప్రస్తుతింపబడిరి. కాని, దేవాలయమును ప్రవేశించుటకు ముందు నగరపాలకులను నమస్కరించుట క్రమము. కావున, ఆ క్రమమును ఈ శ్లోకమున కవి అనుసరించిరి.

గణనాయకులను కవి ఆఢ్యులనిరి. అఢ్యులనగా ధనవంతులని అర్థము. అట్లైన, వారికి భూరివేతనము ఇవ్వబడుచున్నదా? అనినచో, ఈ గణనాథులు ఏ వేతనమును ఆశించి వచ్చినవారు కారు. వీరు చేయు దాస్యము సహజమైనది, స్వరూపసిద్ధమైనది – అను భావము **'సహజ'** శబ్దముచే స్ఫురించుచున్నది. లోకమున దాస్యము చేయువారు పామరులై యుందురు. వారి దాస్యము ఆరోపితమై, భయమువలననో, లోభమువలననో చేయునదియై యుండును. కాని, శ్రీరంగనాథునకు దాస్యమును చేయువారు పండితులు. వారి దాస్యము స్వరూపకృత మగుటదే సహజమైనది, నిత్యమైనదియు. పరముఖోల్లాసార్థము చేయునదియును. వారు అస్వతంత్రులు కారు. **"స స్వరాట్ భవతి"** (ఛాందో. 7-25-2) అనునట్లు అనన్యాధిపతులు. ఈ భావము శ్లోకములోని పూర్వార్థమున ధ్వనించుచున్నది – అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో వివరింపబడినది.

★ **"జనపదసరిదంతరీపపుష్యత్ పురపరిపాలన"** అనునపుడు, జనపదములనగా, శ్రీరంగసమీపమున గల జనప్రదేశములు, సరిదంతరీపము అనగా, కావేరీనదీమధ్యద్వీపము, పురమనగా, శ్రీరంగనగరము– అని, **"పుష్యత్"** అను విశేషణమును పురములకు చేర్చి, **"వృద్ధిని పొందు నగరములు"**,– అని అర్థము చెప్పిన, అట్టి జనపదములను, శ్రీరంగద్వీపమును, వృద్ధిపొందు శ్రీరంగనగరమును, చుట్టుపక్కల నగరములను కాపాడుటలో – అను భావము కల్గును, లేక, ఇచట పదమనుటకు **"పద్యతే ఇతి పదమ్"** అను వ్యుత్పత్తిచే

ప్రాప్యమను అర్థమును చెప్పవచ్చును –– అని శ్రీరామానుజాచార్యులవ్యాఖ్యలో కలదు.

రామభద్రునకు సేనాపతి కుముదుడు. అట్లే, శ్రీరంగనాథుని గణనాయకుడును కుముదుడే అగుట విశేషము.

**"పుష్యత్"** శబ్దఘటితమైన ఇందును వృత్తము పుష్పితాగ్రయే.

## శ్రీరంగ నగరములోని చేతనా చేతనములు అన్నీ నిత్య ముక్త ముముక్షురూపాలే

**33. అహృతసహజదాస్యాః సూరయః ప్రస్తబంధాః**
**విమలచరమదేహా ఇత్యమీ రంగధామ ।**
**మహితమనుజతిర్యక్ స్థావరత్వాః శ్రయంతే**
**సునియతమితి హ(యే)స్మ ప్రాహు రేభ్యో నమః స్తాత్॥**

**ప్ర. అ. –** అహృత = ఏ నాడూ హరింపబడని (అప్రతిహతమైన), సహజ = సహజమైన, దాస్యాః = దాస్యమును (శేవృత్తిని) కలవారు అగు, సూరయః = నిత్యసూరులు, ప్రస్తబంధాః = సంసారబంధమును వీడిన ముక్తులును, విమల = (సమస్త పాపములు తీరుటచే) పవిత్రమైన, చరమ = చివరిదైన, దేహాః = దేహములను కల్గినవారగు ముముక్షువులును, ఇతి = అను, అమీః = నీరు, మహిత = గొప్పవైన, మనుజ = మానవులయొక్క, తిర్యక్ = పక్షులయొక్క, స్థావరత్వాః (సంతః) = స్థావరముల యొక్క స్థితిని కోరువారై, రంగధామ = శ్రీరంగమును, సునియతం = = ఎల్లప్పుడును, శ్రయంతే = ఆశ్రయించుచున్నారు, ఇతి హ = అని కదా, ప్రాహుః స్మ = పౌరాణికులు పల్కిరి, ఏభ్యః = వీరికి (ఇట్లు మానవ తిర్యక్ స్థావరజన్మలను పొందిన నిత్య, ముక్త–, ముముువులకు), నమః = నమస్కారము, స్తాత్ = అగుగాక!

**వరివస్య :–** శ్రీరంగమున మానవులుగా, తిర్యక్కులుగా, స్థావరములుగానైనా కావలయునని నిత్యసూరులు, ముక్తులు, ముముక్షువులు

అభిలషించి, ఆ రూపములను పొందుదురు. కావున, అచటి వారిని సామాన్యులని తలపక, వారికి భక్తితో నమస్కరింపదగునను సాంప్రదాయికమైన విశేషమును కవి ఈ శ్లోకమున తెలియజేయుచున్నారు.

సంసారబంధము అనునది ఏ నాడును లేని నిత్యులకు భగవత్కైంకర్య మొనర్చుటలో ఎట్టి అంతరాయము ఉండదు. మఱియు, భగవత్సేవ వారికి సహజసిద్ధము. అందుచే కవి వారిని "**అహృతసహజదాస్యాః**" అనిరి. కొంతకాలము సంసారబంధమును కల్గియున్నను, పిమ్మట ఆ బంధమునుండి విడివడినవారు ముక్తులు. కావున వారు "**స్రస్తబంధాః**" అనబడిరి.

**"జన్మాంతరసహస్రేషు తపోధ్యానసమాధిభిః,**
**నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే"**
**(ఇతిహాస. సము, 2-32)**

(వేలకొలది జన్మలలో తాము చేసిన తపస్సు, ధ్యానము, యోగము మొదలగువానివలన పాపములను పోగొట్టుకున్నవారికి భగవానుని యందు భక్తి జనించును) అనునట్లు, ముందు జన్మలలోని సుకృతవశముచే పాపము పోవుటచే భగవద్భక్తిని పొందిన ముముకువులకు ఆ జన్మయే వారికి చివరిది అగును. అట్టి స్థితిలోని వారి దేహము పరమపవిత్రమైనది. కావున వారు "**విమలచరమదేహాః**" అనబడిరి. ఇట్టి నిత్యులు, ముక్తులు, ముముక్షువులు మిక్కిలి ఆశతో శ్రీరంగమునకు వచ్చి, అచట స్వామి సేవకై మానవులుగా, పక్షులుగా, స్థావరములుగా సదా నిలచియుందురు. కావున, పెద్దలు వారిని మహనీయులని భావింతురు. వారికి నమస్కారము – అని శ్లోకభావము.

నాల్గవ పాదమున "**ఇతి యే స్మ ప్రాహుః**" అను వేరొక పాఠాంతరము కలదు. ఆ పాఠమును అనుసరించి "నిత్యముక్తముముక్షువులే శ్రీరంగమున మానవులుగా, తిర్యక్కులుగా, స్థావరముగా నిలచియున్నారు. ఇది నిశ్చయము – అని ఎవరు చెప్పుదురో, వారికి నమస్కరింతును" అను భావము ఏర్పడును. ఇందు కవికి కల భాగవతశేషత్వ పారతంత్ర్యపరాకాష్ఠ వ్యక్తము అవుతున్నది.

సంస్కృతవ్యాఖ్యానమున ఈ పాఠమే చూపబడినది. ప్రతిపదార్థమున చూపబడిన పాఠము మహావిద్వాన్ శ్రీ. ప్ర. భ. అణ్ణస్వామివారు ఆదరించిన పాఠము, పెక్కునమంది ఈ పాఠమునే ఆదరించిరి. కావున, అదియే ఇచట గ్రహింపబడినది.

"**ఇతిహ**" అనునది ఒకే పదము, అవ్యయము. దీని నుండియే "**ఐతిహ్యము**" అను రూపము పుట్టినది.

పరమపదనాథుడు శ్రీరంగనాథుడు కాగా, పరమపదములోని నిత్యులు, ముక్తులు తమ స్వరూపమగు శేషవృత్తిని విడువనివారై, శ్రీరంగమున తిర్యక్, స్థావర రూపములను సైతము పొంది, భగవానుని నిత్యము దర్శించుచు, సేవించుచున్నారు. "**సదా పశ్యంతి సూరయః**" (సుబాల, 8) (నిత్య సూరులు ఎల్లప్పుడూ భగవానుని దర్శిస్తున్నారు) అను వేదవాక్యము ఇచటను అర్థవంతమేనని భావము. ఇందువలన శ్రీరంగ నగరమునకు వైకుంఠనగరముతో సామ్యము సిద్ధము. దీనినిబట్టి నిత్య, ముక్త, ముముక్షువులు కానివారికి శ్రీరంగమున స్థానము పొందుట, కనీసము తిర్యక్, స్థావరరూపములనైనను పొందుట దుర్లభమని ఏర్పడుచున్నది. "**శరీరజైః కర్మదోషైః యాతి స్థావరతాం నరః**"– (ప్రాకృత శరీరంతో చేసిన పాపాల కారణంగా మానవుడు చెట్లు, చేమలుగా పుడుతున్నాడు) అనునట్లు శరీరముతో చేసిన దుష్కర్మల ఫలముగా మానవుడు స్థావరజన్మను పొందును – అని శాస్త్రములలో చెప్పబడుచున్నను, నిత్యసూరులు కూడ అట్టి స్థావర రూపమును అయినను పొంది, శ్రీరంగనివాసమును చేయవలెనని అభిలషింతురు – అనుటచే ఆ క్షేత్రమహిమ ఎంతటిదో తెలుపబడినది. "**కురుకాయ్ పిఱప్పేనే, మీనాయ్ పిఱప్పేనే, తమ్బకమాయ్ నిఱ్కుమ్, పడియాయ్ కిడన్దు**" (పెరుమాళ్. తి. 4) (తిరుమలలో పిచ్చుకగా జన్మిస్తానా! చేపగా జన్మిస్తానా! స్తంభంగా ఉంటానా? స్వామి గర్భాలయంలో గడపగా పడి ఉంటానా?) అను మొదలగు కులశేఖరసూక్తులను ఇచట స్మరింపనగును. ఈ కవియే శ్రీరంగనాథస్తోత్రమున

**"రంగేశ్వర! త్వత్పద మాశ్రితానాం రథ్యాశునా మన్యతమో భవేయమ్"** (6) (శ్రీరంగనాథా! నీ పాదాలను ఆశ్రయించినవారు నడయాడే మార్గాలలో సంచరించే శునకాలలో ఒక శునకంగా అయినా నేను కావాలిసుమా!) అనుచు కనీసము శ్రీరంగనగరవీథులలో సంచరించు శునకములలో తాము ఒక శునకముగా కావలయునని పల్కుట ఇచట ఉట్టంకింపతగినది.

తిరువాయ్ మొళి ప్రబంధంలోని **"మానేయ్ నోక్కు"** (5-9-1) అను పాశురములోని **"తేనార్ శోలైకళ్ శూ*ழ்*"** (మకరందం సమృద్ధిగా స్రవించే తోటలను చుట్టూ కలిగిన) అనుచోట ఈడువ్యాఖ్యానంలో నంబిళ్ళై చేసిన అద్భుతమైన వివరణ ఈ శ్లోకాన్ని అనుసరిస్తూ, అనువదిస్తూ చేసినదని అక్కడి వ్యాఖ్యాన పంక్తులు స్పష్టం చేస్తాయి. ఆ సూక్తులను దర్శించడానికి ముందుగా, ఆళ్వారులు పలికిన సందర్భానికి, భట్టర్ పలికిన సందర్భానికి మధ్య ఉండే సామ్యం కూడా ఇక్కడ గమనించదగినది. ముందుగా, ఆళ్వారులు పలికిన సన్నివేశాన్ని గమనిద్దాం.

ఇంతకు ముందు దశకంలో ఆళ్వార్లు తిరుక్కుడందై (కుంభకోణం) అనే దివ్యక్షేత్రానికి మానసికంగా వెళ్లి, అక్కడ భగవంతుని శరణాగతి చేసినప్పటికీ, వారు కోరిన విధంగా ప్రాప్య సిద్ధిని పొందలేకపోయారు. అందువల్ల వారి మనసులోని ఆర్తి మరింత హెచ్చినది. అపుడు వేరొక దివ్యదేశం అయిన తిరువల్లవా*ழ்* కు పోయి, అక్కడ అయినా తాము కోరిన ప్రయోజనాన్ని పొందాలని ప్రయత్నం చేశారు. కానీ, ఆ విధంగా చేయడానికి కూడా వీలు కాని విధంగా తమ శరీరంలో ఆశక్తి ఏర్పడినందున, ఇంకా క్లేశాన్ని పొందినవారై, తమ క్లేశాన్ని, ఒక నాయకి తాను కోరిన నాయకుని పొందలేనప్పుడు ఆర్తితో పలికే రీతిలో, అన్యాపదేశ ప్రక్రియలో ఈ దశకంలో ఉండే పాశురాలతో తెలుపుతున్నారు. ఇంతటి ఆర్తితో ఉండే దశలో కూడా ఆళ్వారులు ఆ దివ్యదేశంలో ఉండే తోటలలోని భోగ్యతను **"తేనార్ శోలైగళ్"** (మకరందం సమృద్ధిగా స్రవించే పూలతోటలు) అనే ప్రయోగంతో వర్ణిస్తున్నారు.

అంతు లేని ఆర్తి నిండిన ఈ దశలో కూడా, నాయకీ భావాన్ని పొందిన దశలో కూడా, ఆళ్వారులు దివ్యదేశంలోని తోటల భోగ్యతను దర్శించడంలో, దానిని వర్ణించడంలో ఉద్దేశ్యం ఏమి? కారణమేమి? ఇది ఏ విధంగా పొసగుతుంది? అనే ప్రశ్న ఇక్కడ కలుగుతుంది. కనుక, దానికి సమాధానంగా వ్యాఖ్యాత నంబిళ్ళై ఈ విధంగా పలుకుతున్నారు.

**"ఇవర్ ఇవ్వాఱ్ఱామైయోడే ఇరుందు శోలైయై క్కవిపాడుకిఱదు – ఉళ్ళు నిఱ్కిఱవనోడు ఒక్క ఇవైయుమ్ భోగ్యమా యిరుక్కయిఱే. ఉపాస్య వస్తు, మనస్సై ప్రత్యగ్విషయమాక్కి అనుభవిక్కమాట్టాదార్ క్కు క్కణ్ణుక్కు ఇలక్కాక్కిక్కొండు నిఱ్కిఱాప్పోలే కాణుమ్, ఇవైయుమ్. ప్రాప్యనానవనుడైయ ఉపాయభావత్తిల్ నిలైపోలే నిత్య ప్రాప్యనాయ్ క్కొండు ఇంగే ఇరుక్కిఱవన్, ఆశ్రితర్ ఉకందదు ఒరు ద్రవ్యత్తై తిరుమేనియాక క్కొండు, ముకమ్ కొడుత్తుక్కొండు నిఱ్కిఱాప్పోలే, అంగుళ్ళారుమ్ ఇంగే పోందు, స్థావరంగళాయుమ్, జంగమంగళాయుమ్, తిర్యక్కుకళాయుమ్ ఇవనై విడమాట్టాదే నిఱ్కిఱపడి. నిత్యరుమ్, ముక్తరుమ్, బద్ధరిల్ రుచియుడైయారుమ్ ఉగందరుళిన నిలంగళై ప్పఱ్ఱియిఱే కిడప్పదు అహ్రుతసహజదాస్యాః – ఇత్యాది. రామావతారత్తిలుమ్ ఒరు లక్ష్మణాదికళ్, వానరత్వజ్గళై యడైన్దార్ కళ్, విభీషణాదికళ్ 'పఱ్ఱికిడన్దార్ కళ్., అదుపోలే, అదిలుమ్, నడయాడిత్తిరువార్ క్కు పోక్కైక్కుమ్ యోగ్యత్తై యుణ్డిఱే. అదువు మిల్లైయిఱే స్థావరజ్గళుక్కు"** (ఈ విధంగా ఈ ఆళ్వారులు ఇంతటి ఆర్తితో ఉన్నప్పటికీ, దివ్యదేశంలో ఉండే తోటలను వర్ణించడంలో అభిప్రాయం ఏమి? అని అంటే, ఈ దివ్యదేశంలో నిత్యవాసం చేసే భగవంతునితో పాటుగా, ఈ దివ్యదేశంలో ఉండే ఈ తోటలు కూడా భోగ్యంగా వీరికి ఉంటాయి కదా. ఉపాసించదగిన వస్తువు అయిన భగవంతుని, మనసును అంతర్ముఖం చేసి, ధ్యానించి, అనుభవించలేనివారికి వారి బాహ్యనేత్రాలకు తన అర్చారూపాన్ని లక్ష్యంగా చేసుకొనేటట్లుగా దివ్యదేశాలలో భగవానుడు నెలకొని ఉండేటట్లుగానే, పరమపదంలో ఉండే

నిత్యులు, ముక్తులు కూడా భగవంతుడు నెలకొని ఉండే దివ్య దేశాలలో మానవ తిర్యక్ స్థావరాది రూపాలను ధరించి, తమ దర్శనాన్ని అనుగ్రహిస్తున్నారు. ప్రాప్యుడైన భగవంతుని ఉపాయభావంలో తగిన దశ అర్చారూపమే కదా. ప్రపత్తిని అర్చారూపంలోకదా చేయాలి. నిత్యప్రాప్యుడై పరమపదంలో ఉండే భగవానుడు, భక్తులు ఆదరించిన ఒక ద్రవ్యాన్ని తనకు తిరుమేనిగా గ్రహించి, దర్శనాన్ని ఇస్తూ అర్చారూపంగా దివ్యదేశాలలో నెలకొని ఉండేటట్లుగానే, ఆ పరమపదంలో ఉండే నిత్యులు, ముక్తులు కూడా ఈ లోకానికి వచ్చి, స్థావరాలుగానూ, జంగమాలుగాను, తిర్యక్కులుగాను రూపాలను పొందినవారై, భగవంతుని విడువకుండా అతని వెంటనే ఉన్నారు. ఇట్లు నిత్యులు, ముక్తులు, బద్ధులలో కైంకర్యరుచిని కలవారు కదా, భగవానుడు అభిమానించి వేంచేసి ఉండే దివ్యక్షేత్రాలను ఆశ్రయించి ఉంటారు. "**అహృతసహజదాస్యాః**" – అనే శ్లోకార్థమును ఇక్కడ స్మరించాలి. రామావతారంలో కూడా లక్ష్మణుడు మొదలైనవారు, వానరరూపాలను పొందినవారు, విభీషణాదులు వీరి రూపంలో నిత్యులు, ముక్తులు, బద్ధులలో దాస్యరుచిని కలవారు భగవంతుని విభవ రూపమైన శ్రీరాముని ఆశ్రయించి ఉన్నారు. ఆ విధంగానే ఇక్కడ కూడా దివ్యదేశంలో నిత్యులు, ముక్తులు మొదలైనవారు స్థావర రూపాలలో భగవంతుని వెంటనే ఉన్నారు. వారిలోనూ, జంగమరూపాలకు ధరించినవారికి ఒకచోటనుండి ఇంకొక చోటుకు పోవడానికి యోగ్యత ఉన్నది కదా. స్థావరాలకు ఆ యోగ్యత కూడా లేదు కదా) అని వ్యాఖ్యానింపబడుట ఇచట ఉట్టంకింపదగినది.

ఇచట లక్ష్మణాదులు నిత్యసూరులని, వానరరూపమును పొందిన దేవతలు ముక్తులని, విభీషణుడు మొదలగువారు ముముక్షువులని నిర్దేశించుచున్నారని అచటి అరుంబదములోని వివరణము. మఱియు, ఈ సందర్భముననే ఈడులో ఒక ఐతిహ్యమును తెలుపు ఈ పంక్తులుకూడా గమనింపదగినవి.

**"జననాథ బ్రహ్మరాయర్ తిరుముడిక్కుట్టైయిలే ఒరు మరమ్ వెట్టప్పుక, అత్తై ఎమ్బార్ కేట్టు, "అల్లాళప్పెరుమాళే! ఈశ్వరవిభూతియై యఴిక్కప్పార్త్తాయో?" ఎన్న, ఇవర్ శొల్లుమ్ వార్ త్తై కేట్కైక్కాక" ఈశ్వరవిభూతి యల్లాత విడముణ్డో? ఎన్న, "ఆవైపోలన్నుకాణ్ ఇవై, సార్వభౌమనాన రాజావుమ్, మహిషియుమాక, ముఱ్ఱుగట్టక క్కుడనీర్ వార్ త్తు ఆక్కుమ్ శోలైపోలే, పెరుమాళుమ్, పిరాట్టియారుమ్ కూడ క్కైత్తొట్టాక్కుమవై కాణ్!" ఎన్ను అరుళిచ్చెయ్ దార్. ఉగందరుళిన నిలంగళిలే మెయ్యే ప్రతిపత్తి విళైన్దార్ క్కు అంగుళ్ళవై ఎల్లామ్ ఉద్దేశ్యమాయ్ తోఱ్ఱుమిఱే"**.

(జననాథబ్రహ్మరాయుడు అనే ప్రభువు "**తిరుముడి క్కుట్టై**" (శ్రీ రంగనాథుని శిరఃప్రదేశం వైపు ఉండే ఉభయ కావేరీ మధ్య దేశం) లో ఉండే ఒక వృక్షాన్ని నరికి వేయాలని ప్రయత్నం చేయగా, ఆ విషయాన్ని ఎంబార్ అనే ఆచార్యులు విని, "**అల్లాళ ప్పెరుమాళ్! భగవంతుని సంపదను లేకుండా చేయాలని చూస్తున్నావా?**" అని అన్నారు. ఆ ప్రభువు అప్పుడు వారు చెప్పే సమాధానం ఏమై ఉంటుందో తెలిసికోవాలనే ఆసక్తితో, "భగవంతుని విభూతి అనేది లేని చోటు ఒకటి ఉన్నదా ఏమి?" అని అడిగాడు. అప్పుడు ఎంబార్ "మిగిలిన విభూతివంటిదికాదు సుమా, ఇది. సార్వభౌముడైన ప్రభువు, అతని పట్టమహిషి, ఇద్దరూ కలసి కుండల నిండుగా నీటిని తెచ్చి, పెంచిన ఉద్యానవనంవంటిది ఇది. శ్రీ రంగనాథుడు, శ్రీరంగనాయకి కలసి, తమ చేతులతో తాకి పెంచబడిన తోటలు, ఇవి" అని బదులు చెప్పారు. భగవానుడు అభిమానించి వెలసి ఉండే దివ్యక్షేత్రాల విషయంలో యథార్థమైన ప్రతిపత్తిని కలిగినవారికి ఆ దివ్యదేశాలలో ఉన్నవి అన్నీ, భగవంతుని వలెనే, ఉద్దేశ్యమై ప్రకాశిస్తాయి కదా).

ఇక్కడ, నమ్పిళ్ళై భట్టర్ అనుగ్రహించిన ప్రస్తుతశ్లోకాన్ని ప్రమాణంగా గ్రహించడంలో ఉండే వేరొక ఔచిత్యాన్నికూడా ప్రస్తుతంలో అనుసంధించవలసి ఉన్నది. ఆళ్వారులవలెనే, భట్టర్ కూడా, శ్రీరంగరజస్తవాన్ని అనుగ్రహించిన

సమయంలో శ్రీరంగనాథుని విరహం వల్ల చాలా క్లేశాన్ని పొందిన దశలో ఉన్నారు. వారి కాలంలో ఆ ప్రాంతాన్ని పరిపాలించిన ప్రభువు తమ మాటను కాదని, భాగవతాపచారాన్ని చేయడానికి ప్రయత్నించినందువల్ల, భట్టర్ మనసులో చాలా బాధపడి, ఇక శ్రీరంగంలోనే ఉండి, ఆ అకృత్యాన్ని చూడడం కంటే, శ్రీరంగాన్ని వదిలి, వేరొక చోటికి వెళ్లిపోవడం యుక్తం – అని తలచి, కొంతకాలం పాటు తిరుక్కోట్టియూర్ అనే దివ్యక్షేత్రంలో వాసం చేశారు. తరువాత కొంతకాలానికి ఆ ప్రభువు మరణించినట్లు తెలుసుకొని, మళ్లీ శ్రీరంగానికి వచ్చి, శ్రీరంగనాథుని సేవించాలనే అంతు లేని ఆర్తితో శ్రీరంగానికి తిరిగి వస్తూ, అప్పుడు తమకు కలిగిన అనుభవానికి పరీవాహరూపంగా ఈ శ్రీరంగరాజస్తవాన్ని ఆశువుగా అనుగ్రహించారు – అని సంప్రదాయకథనం. ఇంతటి ఆర్తితో ఉండే సమయంలో కూడా భట్టర్ కు పరమపదతుల్యమైన శ్రీరంగ దివ్యక్షేత్రంలో ఉండే చేతనాచేతనాలు అన్ని వైకుంఠంలో ఉండే నిత్యముక్తులుగా భాసించడంలో ఆశ్చర్యం ఏమున్నది? భట్టర్ అనుభవం ఆళ్వారుల అనుభవంవంటిదే కనుక, ఈ సామ్యాన్ని దృష్టిలో పెట్టుకుని నంబిళ్ళై ఈ శ్లోకాన్ని ఆళ్వారు సూక్తిని వివరించేటప్పుడు అర్థసంవాదంగా ఉదాహరించారు –అని గమనించవలసి ఉన్నది. ఇది అంతా భట్టర్ అనుభవం, ఆళ్వారు అనుభవంవలె, అతిగాఢమైనది అని తెలుపడంతోపాటు, ఈ ఇద్దరి అనుభవాలలోని సామ్యాన్ని నిశితంగా పరిశీలించి, దానికి తగినట్లుగా, ఆళ్వారుల సూక్తిని వివరించేటప్పుడు, భట్టర్ శ్లోకాన్ని ప్రమాణంగా ఉదాహరించే నంబిళ్ళైకు కల మేధాపాటవాన్ని, సమన్వయసామర్థ్యాన్ని కూడా స్పష్టం చేస్తుంది.

ఆళ్వారుల అనుభవం ఎంత గంభీరమైనదో, పూర్వాచార్యుల అనుభవం కూడా అంత గంభీరమైనదే అని, ఈ అనుభవాల సామ్యాన్ని గుర్తించగలిగినవారు కూడా మన పూర్వాచార్యులే అని, కేవలం దిఙ్మాత్రంగా నిరూపించడంకోసమే ఇంతటి వివరణ ఇక్కడ చేయబడింది. భట్టర్ సూక్తులకు సంబంధించిన

ఇటువంటి ఉదాహరణలు దివ్యప్రబంధవ్యాఖ్యానాలలో చాలా సందర్భాలలో గోచరిస్తాయి.

**"ఇతి హ స్మ ప్రాహుః, (తత్) సునియతమ్"** (నిత్యులు, ముక్తులు, ముముక్షువులు శ్రీరంగమున తిర్యక్, స్థావర రూపములను అయినను పొందగోరుదురు –అని పౌరాణికులు పల్కునది నిజము) అనియు అన్వయింపవచ్చును.

**"ఇతి యే స్మ ప్రాహుః, తేభ్యో నమః స్తాత్"** అను అన్వయమున విశిష్టమైన అర్థమొకటి స్ఫురించును. "శ్రీరంగమున గల మానవ, తిర్యక్, స్థావరములను సామాన్యములని తలపక, వారిని నిత్య, ముక్త, ముముక్షువుల రూపములుగా తలచువారు మహాత్ములు. అట్టి భావన కల్గుట మిక్కిలి కష్టము, ఆ భావనను కల మహనీయులకు నమస్కారము" అను ఈ తాత్పర్యార్థముచే భాగవత ప్రావణ్యము కల్గుట మిక్కిలి దుష్కరమని ఏర్పడుచున్నది. భగవత్ప్రావణ్యమునకు చరమకాష్ఠ భాగవతప్రావణ్యమను విశిష్టమైన రహస్యము శ్రీవచనభూషణము మొదలగు రహస్యగ్రంథములలో విస్తరముగా నిరూపింపబడినది.

**"దాసభూతాః స్వత స్సర్వే హ్యాత్మానః పరమాత్మనః,**
**నాన్యథా లక్షణం తేషాం బంధే మోక్షే తథైవ చ" (అహి, సం. 12)**

(జీవులు అందరూ సహజంగానే పరమాత్మకు దాసభూతులు కదా. వారికి వేరొక విధమైన నిరూపకలక్షణం లేదు. ఈ లోకంలో కానీ, మోక్షంలో కానీ వారి స్వరూపం అటువంటిదే) అను ప్రమాణమునుబట్టి, భగవద్దాస్యము ఆత్మలన్నిటికి సహజమైన లక్షణము. నిత్యసూరులకు ఆ దాస్యము నిత్యమై అప్రతిహతముగా నుండును. (వారికి సంసార సంబంధము ఉండదు కావున) ముక్తులు, ముముక్షువులు కొంత కాలము సంసారమున బంధింపబడినవారగుటచే వారి దాస్యము అప్రతిహతము (ఎడతెగనిది) అని చెప్ప వీలులేదు. కావున, నిత్యసూరులకు మాత్రమే **"అహృతసహజదాస్యాః"** అను

విశేషణము వర్తించును. మిగిలినవారు సహజదాస్యమును కలవారైనను, వారి దాస్యము సంసారమువలన ప్రతిహత మగును. ఈ విశేషము ఇక్కడ గుర్తించదగినది.

**"సునియత మితి యే స్మ"** అని పాఠాంతరము గోపాలాచార్యవ్యాఖ్యలో కలదు. వృత్తము మాలిని

## గరుత్మంతుడే శ్రీరంగ దివ్య భవనంగా రూపొందాడు

**34. శ్రీరంగదివ్యభవనం భువి గోపురాణాం**
**ప్రాకారితేన నికరేణ గరుత్మతేవ ।**
**పార్శ్వప్రసారితపతత్రిపుటేన భక్త్యా**
**నానాతనూభి రుపగూఢ ముపఘ్నయామః ॥**

**ప్ర. అ. –** ప్రాకారితేన = రెండు వైపుల ప్రాకారములను కల్గిన, గోపురాణాం = గోపురములయొక్క, నికరేణ = సమూహముచే (చుట్టబడి యుండుటను చూడగా), పార్శ్వ = రెండు ప్రక్కల, ప్రసారిత = విస్తరింపబడిన, పతత్రపుటేన = పుటాకారములోనున్న రెక్కలను కల్గిన, గరుత్మతా = గరుత్మంతునిచే, భక్త్యా = భక్తితో, భువి = భూలోకమున, నానాతనూభిః = బహువిధములైన రూపములతో, ఉపగూఢమ్ ఇవ = కప్పి కాపాడబడుచున్నదివలె నున్న, శ్రీరంగదివ్యభవనం = శ్రీరంగదివ్యమందిరమును, ఉపఘ్నయామః = ఆశ్రయముగా పొందెదము.

**వరివస్య :-** ఉన్నతములైన గోపురములతో విరాజిల్లు శ్రీరంగమందిరమును ఈ శ్లోకమున భట్టరు ఇందు అద్భుతమైన ఉత్ప్రేక్షతో స్తుతించుచున్నారు.

శ్రీరంగమందిరములోని ఉన్నతములైన గోపురములను, వాని చుట్టును గల ప్రాకారములను దర్శింపగా, గరుత్మంతుడే పలు విధములైన రూపములను ధరించి, శ్రీరంగమున గోపురములుగా, ప్రాకారములుగా మారి, మందిరమును

కాపాడుచున్నట్లున్నది. "**స ఏకధా భవతి ద్విధా భవతి త్రిధా భవతి**" (ఛాందోగ్య 7-26-2) (ఆ ముక్తుడు ఒక రూపాన్ని, రెండు రూపాలను, మూడు రూపాలను, అనేక రూపాలను ధరించి, భగవానులకు సేవను చేస్తాడు) అని ఉపనిషత్తులలో చెప్పబడినట్లు, నిత్యసూరులు భగవత్కైంకర్యమును పలు విధములుగా పలు రూపములను ధరించి చేయగల్గిన శక్తిని కలవారగుటచే, ఇచట కవి "**నానాతనూభిః**" అనుట అర్థవంతము. శ్రీరంగమున పలు గోపురములు ఉండుటచే గరుత్మంతుడు. గోపురరూపములను ధరించినట్లుగా ఈ విశేషణమువలన వ్యక్తమగుచున్నది. ప్రతి గోపురమునకు ఇరు వైపుల ప్రాకారములు విస్తరించి యుండుటచే, అవి పుటాకారములో గల గరుత్మంతుని రెక్కలవలె ఉన్నవి. కావున, ప్రస్తుత శ్లోకములోని ఉత్ప్రేక్షలో గోపురములు గరుత్మంతునిగా, ప్రాకారములు అతని రెక్కలుగా వర్ణింపబడినవని తెలియనగును.

"**పతత్రపుటేన**" అనుటవలన రెక్కలకు గల ప్రాకారసాదృశ్యము వ్యక్తమగుచున్నది. "**ఉపఘ్నోం ఽ తికాశ్రయే**" అను అమరకోశవచనమునుబట్టి, ఇచట "**ఉపఘ్నయామః**" అనుటకు "ఆశ్రయముగా పొందెదము" అని భావము.

"**అహ్నాతసహజదాస్యాః**" అని ముందు శ్లోకములో సామాన్యముగా చెప్పిన అర్థమును, భట్టరు, ఈ శ్లోకమున గరుత్మంతుని ఉదాహరణముగా గొని, సమర్థించిరని చెప్పనగును, అనగా, నిత్యసూరిప్రముఖుడగు గరుత్మంతుడు శ్రీరంగనాథునిగా అవతరించిన పరమపదనాథుని సేవించుటకై స్వయముగా భూలోకమునకు వచ్చి, శ్రీరంగమున గోపుర, ప్రాకారరూపములను ధరించెనని తాత్పర్యము.

"**పార్శ్వప్రసారితపతత్రపుటేన**" అనుటచే గరుత్మంతుడు శ్రీరంగనగరమును ఆలింగనము చేసికొనుచున్నాడని ధ్వనించును. వేదాత్మకుడగు గరుత్మంతుడు ప్రణవస్వరూపమగు శ్రీరంగవిమానమును సేవించుట న్యాయము కదా. గరుడుడు నిత్యసూరులలో ఒకడు అగుటచే అనేక

శరీరముల పరిగ్రహణమును చేసి, శ్రీరంగనగరముగా మారి, స్వామిని సేవించుచున్నాడు. ఇట్లు పలు రూపములను పొంది గరుడుడు. శ్రీరంగవిమానమును ఆలింగనము చేసికొనుట, **"గాత్రైః శోకాభికర్శితైః సంస్పృశేయం సకామాహమ్"** (రా. సుందర 40-3) సీతాదేవివిశ్లేషంతో ఆర్తిని పొందిన నా పలు అంగాలతో మనోరథపూర్వకంగా నేను ఆమెను ఎప్పుడు నేను ఆలింగనం చేసుకోగలను?) అని శ్రీరాముడు పలికినట్లుగా, తనకు, అభిమతమైన వస్తువును ఆలింగనము చేసికొన ఆశపడినట్లున్నది. గరుత్మంతునిచే ఉపగూఢమైన శ్రీరంగనగరమును ఆశ్రయముగా పొందుట వేదోపగూఢమైన ప్రణవమును ఉపాసించుటయే కదా! – అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలోని వివరణము. ఈ వ్యాఖ్యలో 'భక్త్యా' అను పదము కనుపించుటలేదు.

**"దాసః సఖా"** ఇత్యాదిగా గరుడుడు భగవానునకు అనేక రూపాలను ధరించి సేవ చేస్తాడనే శ్రీయాముల స్తోత్రరత్నసూక్తికి ఈ శ్లోకం ఒక విధముగా సంవాదము – అని చెప్పవచ్చును. ఇందు వృత్తము వసంతతిలక.

## శ్రీరంగ నగరము మూర్తీభవించిన భూదేవి

**35. ప్రాకారమధ్యాజిరమండపోక్త్యా**
**సద్వీపరత్నాకరరత్నశైలా ।**
**సర్వంసహా రంగవిమానసేవాం**
**ప్రాప్తేవ తన్మందిర మావిరస్తి ॥**

**ప్ర. అ. –** (యత్ర = ఏ శ్రీరంగమందిరమున), ప్రాకార = ప్రాకారములు, మధ్య అజిర = ఆ ప్రాకారముల మధ్య గల ముంగిళ్లు, మండప - ఉక్త్యా = మండపములు – అను వీని నెపముతో, సద్వీప = సప్తద్వీపములతో కూడిన, రత్న ఆకర = సప్తసముద్రములతో కూడిన, రత్నశైలా = మేరుపర్వతముతో కూడిన, సర్వంసహా = భూదేవి, రంగవిమానసేవాం = శ్రీరంగవిమానసేవను, ప్రాప్తా ఇవ

= పొందినది వలె, తత్ = ఆ, మందిరం = శ్రీరంగమందిరము, ఆవిరస్తి = మన కట్టెదుట సాక్షాత్కరించుచున్నది.

**వరివస్య :–** ముందు శ్లోకమున వర్ణించిన విషయమునే కవి మరల వేరొక దృష్టాంతముతో ఇందు వర్ణించుచున్నారు. శ్రీరంగమందిరము మూర్తీభవించిన భూదేవి వలె ఉన్నదనుట ఈ శ్లోకములోని సారాంశము.

శ్రీరంగవిమానమును సేవింపదలచిన భూదేవి సపరివారముగా ఇచటికి వచ్చినది. ఎట్లనగా– సప్తసముద్రములు, సప్తద్వీపములు, కులపర్వతములు– అన్నియు భూదేవికి పరివారములు. అవి, శ్రీరంగమున ప్రాకారములుగా, ఆ ప్రాకారముల మధ్య గల ముంగిళ్ళుగా, మండపములుగా మారినవి. శ్రీరంగమందిరమునకు చుట్టును గల సప్తప్రాకారములు సప్తసాగరములవలె, ఆ ప్రాకారములలో గల ముంగిళ్ళు (మధ్య ప్రదేశములు) సప్తద్వీపములవలె, అట్లే, ఒక్కొక్క మండపము ఒక్కొక్క రత్నపర్వతమువలె ఉన్నవి. అందువలన భూదేవి సపరివారముగా శ్రీరంగమునకు వచ్చి, అచట కైంకర్యమును చేయుచున్నట్లు తోచుచున్నది – అని శ్లోకభావము.

సప్తప్రాకారములను సప్తసముద్రములతో పోల్చుటకు హేతువు ఏమనగా, అని నలు ప్రక్కల చుట్టి వ్యాపించియుండుటచే.

ఇక్కడ, దృష్టాంత – దార్ష్టాంతికములలో ఉండే పదాలను అన్వయించడంలో క్రమము తప్పినదే! అను శంక ఇక్కడ కలుగ వచ్చును. కాని, అర్థమును అనుసరించి, క్రమమును మార్చుకొనుటను అనేక సందర్భములలో గమనింపవచ్చును. ఉదాహరణకు – "**ఏకానేకస్వరూపాయ స్థూలసూక్ష్మాత్మనే నమః**" అను శ్రీవిష్ణుపురాణ వచనములోను, "**త్యాజ్యోపాదేయజ్గళ్ సుఖదుఃఖజ్గళ్**" (3) అను ఆచార్యహృదయసూక్తిలోను ఈ విషయము స్పష్టము – అని శ్రీ. ప్ర. భ. అణ్ణాస్వామివారు వివరించిరి.

ఇక్కడ ఉదాహరించిన శ్రీవిష్ణుపురాణ సూక్తిలోని క్రమాన్నిబట్టి చూస్తే, పదాల క్రమాన్ని బట్టి ఏకశబ్దాన్ని స్థూలశబ్దంతోను, సూక్ష్మశబ్దాన్ని

అనేకశబ్దంతోను అన్వయించవలసి ఉన్నది. కాని, ఆ విధంగా అన్వయిస్తే అర్థం పొసగదు. భగవానుడు సూక్ష్మరూపంలో ఉండేటప్పుడు సచ్ఛబ్దవాచ్యుడుగా, ఏకరూపాన్ని కలిగి ఉంటాడు. స్థూలరూపంలో ఉండేటప్పుడు, చేతనాచేతనాల రూపంలో, పలు రూపాలను కలిగి ఉంటాడు ఉంటాడు. అందువల్ల, అర్థాన్ని అనుసరించి, ఏకశబ్దాన్ని సూక్ష్మశబ్దంతోను, అనేకశబ్దాన్ని స్థూలశబ్దంతోను అన్వయించి, అర్థాన్ని చెప్పవలసి ఉన్నది. ఆ విధంగా అన్వయించి అర్థాన్ని చెప్పేటప్పుడు, క్రమం మారుతున్నది కదా. ఈ విధంగా క్రమాన్ని మార్చుకోవడానికి కారణం అర్థం పొసగడం కోసమే. ఈ రీతిలో, ఉదాహృతమైన ఆచార్య హృదయ సూక్తిలో కూడా, త్యాజ్యశబ్దాన్ని దుఃఖమనే శబ్దంతోను, ఉపాదేయ శబ్దాన్ని సుఖమనే శబ్దంతోను క్రమం మార్చి అన్వయించుకోవాలి.

★ "**ఆవిరస్తి**" అనుటచే, గరుత్మంతుడు, భూదేవివంటి నిత్యసూరులచే పలు విధములుగా సేవింపబడు నిత్యవిభూతిలో గల దివ్యనగరము మాంసచక్షువులను కల్గిన సంసారులకు సైతము కన్పడునట్లు శ్రీరంగనగరముగా మారినదను విశేషము వ్యక్తమగుచున్నది.

రజస్తమస్సుల సంబంధమును సహించుట, పాపిష్ఠజనులను భరించుట, పరమపదానుభవమున తనకు ప్రాప్తి ఉన్నను ఆ విశ్లేషమును సహించుట మొదలగు విశేషములు '**సర్వంసహా**' శబ్దముచే ద్యోతకమగుచున్నవి. పరమపదము శ్రీరంగనగరముగా భూలోకమున అవతరించుటచే ఆ నగరమును సేవింపగోరిన భూదేవి వానినన్నింటిని సహించుచున్నదని తాత్పర్యము.

ఇందు అలంకారము ఉత్ప్రేక్ష, వృత్తము ఇంద్రవజ్ర.

## శ్రీరంగ నగరములోని మణిమండపప్రాకారములను నమస్కరిద్దాం

**36. జితబాహ్యజినాదిమణి ప్రతిమా**
**అపి వైదికయన్నివ రంగపురే।**

**మణిమండపవప్రగణాన్ విధధే**
**పరకాలకవిః ప్రణమేమ హి తాన్ ॥**

**ప్ర. అ. –** పరకాలకవిః = తిరుమఙ్గై యాళ్వార్లు, జిత = తమచే జయింపబడిన, బాహ్య = వేదబాహ్యులైన, జిన ఆది = జైనులు మొదలగువారియొక్క, మణిప్రతిమాః = రత్నప్రతిమలను, అపి = కూడ, వైదికయన్ ఇవ = వైదికముగా చేయువారువలె (వానిని ఉపయోగపరచి), రంగపుర = – శ్రీరంగమున, మణి మండప = మణులతో కూడిన మండపముల, వప్ర = ప్రాకారముల, గణాన్ = సమూహములను, విదధే = నిర్మించెను, తాన్ = ఆ మణిమండపములను, ప్రాకారములను, ప్రణమేమ హి = నమస్కరింతుము కదా.

**వరివస్య :–** ఆళ్వార్ల అవతారప్రయోజనములు అనేకములు. వానిలో ముఖ్యమైన ప్రయోజనము – అవైదికులను వైదికులుగా మార్చుట. ఆ మార్పు చేతనములలోనే కాక అచేతనములలో సైతము సంభవించెనని భట్టరు ఈ శ్లోకమున తెలియజేయుచున్నారు.

పరకాలకవి తమ పాండిత్య ప్రతిభతో నాస్తికవాదులగు జైనులను, బౌద్ధులను జయించి, వారిని వైదికులుగా మార్చిరి. అట్లే, జైనుల, బౌద్ధుల ఆలయములలోని విగ్రహములను ఉపయోగించి (కరగించి), వానివలన వచ్చిన ద్రవ్యముతో శ్రీరంగమున చిరస్థాయిగా నుండునట్టి మణిమండపములను, ప్రాకారములను నిర్మించిరి. ఆ మండప ప్రాకారములను నమస్కరింతుము గాక! – అని శ్లోకభావము.

పరకాలకవి దివ్యదేశయాత్రలు చేయుచు, క్రమముగా శ్రీరంగమును చేరి, అచటి స్వామిపట్ల ప్రేమాతిశయమును కల్గినవారై, పలు దశకములలో స్వామిని కీర్తించిరి. శ్రీరంగనాథుడు ఆ పాశురములను విని, మిక్కిలి సంతుష్టుడై, ఆళ్వార్లతో అర్చకముఖమున ఇట్లు పల్కెను "ఆళ్వారులూ! మీరొనర్చిన వాచిక కైంకర్యము నాకు మిగుల ప్రీతిని కల్గించినది. అట్లే, నాకు విమానమండపప్రాకారములను కూడ నిర్మించి, సంతోష పెట్టుడు".

శ్రీరంగనాథుని ఆ నియమనమును శిరసావహించిన పరకాలకవి, శ్రీరంగనగరమున విమాననమండపాదులను నిర్మింపదలచెను. తన మంత్రులను పిలచి, విమానమండపాదులను నిర్మించుటకు ఆవశ్యకమయిన ధనమును సంపాదించుటకు తగిన ఉపాయమును తెలుపుడని పల్కెను. మంత్రులును, అపుడు నాగపట్టణమున బంగారుతో చేయబడిన, మణులతో పొదగబడిన జైనవిగ్రహ మొకటి జైనదేవాలయమున కలదని, దాని సహాయముతో కావలసిన ద్రవ్యమును సంపాదింపవచ్చునని పల్కిరి. పరకాలకవియు, ఆ విధముగానే ఆచటి జైనవిగ్రహమును సంపాదించి, దానిని కరగించి, అమ్మి, తద్వారా వచ్చిన సొమ్ముతో శ్రీరంగమున మండపాది. నిర్మాణకైంకర్యములను నిర్వహించెను. భట్టరు ఈ చారిత్రక ఉదంతమును ప్రస్తుత శ్లోకమున పరోక్షముగా ప్రస్తావించిరి.

"**మణిప్రతిమాః**" అను బహువచన ప్రయోగముచే నాగపట్టణములోని జైనవిగ్రహమునే కాక, ఇంకను అట్టి విగ్రహములను పెక్కింటిని సంపాదించి, వానితో భగవత్కైంకర్యములను నిర్వహించి, వానికి వైదికత్వసిద్ధిని కల్గించిరని ఏర్పడుచున్నది. "**వైదికయన్ ఇవ**" అనుటకు మండపాదినిర్మాణములను చేసిరనియే కాక, భగవద్భాగవతారాధనకు కూడ ఆ ద్రవ్యమును ఉపయోగించిరని అర్థము చెప్పనగును. మండప ప్రాకారాదులను నిర్మించి, వానిపై చక్రము, శంఖము, తిరునామమువంటి వైదికచిహ్నములను చెక్కించి, వానిని వైదికములుగా మార్చిరి. ఇట్లు శ్రీరంగములోని మణిమండపాదులకు పరకాలకవితో కల్గిన సంబంధమువలన వానికి గొప్ప విశిష్టత, గౌరవము కల్గెనని పరోక్షముగా సూచింపబడినది. పరకాలకవికి కల అట్టి వైశిష్ట్యము, గౌరవములే కవి చేయు నమస్కారములకు ప్రధానకారణములు.

పెరియతిరుమొళి ప్రబంధములోని "**మాడమాళికై శూழ் తిరుమజ్గై మన్నన్ నొన్నలర్ తజ్గలై వెల్లుమ్**" (5-8-10) అను సందర్భమున పరమకారుణికులు, నాలాయిర దివ్యప్రబంధ వ్యాఖ్యాతలు, పెరియవాచ్చాన్ పిళ్లై

అను పూర్వాచార్యులు "**ఒన్నలరిత్యాది – ఎతిరికళ్, తిరుమజ్గై యా౞్వార్ అౡకు శెణ్డేఱ పుఱప్పట్టవాఱే ము౧ౡక్కాయాక తన్నిలే అవియుమత్తనై, ఇవఱ్కు శత్రుక్కళాకిఱార్ ప్రమాణదూషకరాన బాహ్యరుమ్, ప్రమేయదూషకరాన కుదృష్టికళుమిఱే, ఇవర్ కళై వెల్లుకైయావదు – "జితబాహ్య" ఇత్యాదిప్పడియే బాహ్యరుడైయ ప్రతిమైయై యిట్టు తిరుమదిళ్ ఉళ్ళిట్టవై శెయ్ దుమ్, ఆగమికర్ పరదేవతైయాక చ్చొల్లుకిఱ రుద్రనుడైయ పరత్వత్తై యఱుత్తు, అదుతన్నైయుమ్ ఎడుత్తుప్పోకట్టారిఱే**" (ఒన్లలర్– ఇత్యాది. తిరుమంగై ఆళ్వారులు తమ శోభ అంతా ప్రకాశించేటట్లుగా బయలుదేరగానే, పూర్తిగా నశించిపోతారు, అంతే. వీరికి శత్రువులు ఎవరు అంటే? ప్రమాణమైన వేదాన్ని దూషించే బాహ్యమతాలవారు, ప్రమేయమైన భగవంతుని దూషించే కుదృష్టిమతాలవారు కదా. వీరిని జయించడం అంటే, "**జితబాహ్య**" అనే శ్లోకములో భట్టర్ చెప్పినట్లు, బాహ్యుల విగ్రహాలను ఉపయోగించి, ప్రాకారాలు మొదలైనవానిని మించడం, పాశుపతాగమాన్ని ప్రమాణంగా గ్రహించే పాశుపతమతవాదులు మొదలైనవారు పరదేవతగా చెప్పే రుద్రుని పరత్వాన్ని ఖండించి, దానిని నిర్మూలించడం చేశారు కదా) అని వ్యాఖ్యానించుట ఇచట ప్రస్తుతింప దగినది. కావున, ఈ శ్లోకమున ప్రమాణప్రమేయదూషకులను ఇద్దఱను వైదికులుగా మార్చుట వర్ణింపబడినది. ఇచట, ప్రమాణదూషకుల వైదికత్వసిద్ధి వాచ్యము, ప్రమేయదూషకుల వైదికత్వసిద్ధి వ్యంగ్యము. శ్రీరంగనాథుని కైంకర్యవిరోధులగు పరులకు కాలునివంటివారగుటచే తిరుమజ్గై యాళ్వార్లకు పరకాలుడను పేరు కల్గెను. చతుర్విధకవితాపారీణులు కావున, కవి యను ప్రసిద్ధి కల్గెను.

"**ణు – – స్తుతౌ**" అను ధాతువునకు ఆత్మనేపది ప్రయోగము కనబడుటలేదు. కావున, "**ప్రణమేమహి**" అను ఆత్మనేపదిప్రయోగము పొసగదు. ప్రాయశః "ప్రణమేమ" అని పరస్మైపదిరూపముగా గొని, "**హి**"అను పదమును ప్రసిద్ధార్థమును తెలియజేయు అవ్యయముగా చెప్పనగును – అని శ్రీరామానుజాచార్యవ్యాఖ్యానమున కలదు. ఇదియే యుక్తమని తోచును.

జయశీలుడగు జినుడును పరకాలులచే జయింపబడెను – అను స్వారస్యము **“జిత, జిన”** శబ్దములచే ధ్వనించుచున్నది. **“తాన్”** – పరకాలకవివర్యులను అనియు అర్థము చెప్పవచ్చును – అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో చెప్పబడినది.

వృత్తము తోటకము. **“తుట – కలహకర్మణి”** అను ధాతువునుండి తోటకమను శబ్దము పుట్టినది. పరకాలకవి నాస్తికవాదులను జయించు సందర్భమును తోటకవృత్తమున కవి వర్ణించుట మిక్కిలి యుక్తము కదా!

## శ్రీరంగ నగర ద్వారపాలకులకు నమస్కరిద్దాం

**37. స్మేరాననాక్షికమలైః నమతః పునానాన్**
**దంష్ట్రాగదాభ్రుకుటిభిః ద్విషతో ధునానాన్!**
**చండ ప్రచండముఖతః ప్రణమామి రంగ–**
**ద్వారావలీషు చతసృష్వధికారభాజః ॥**

**ప్ర. అ. –** స్మేర = వికసించిన, ఆనన = ముఖములతో, అక్షి = కన్నులు అనెడి, కమలై = కమలములతో (కమలములవంటి కన్నులతో), నమతః = నమస్కరించువారిని, పునానాన్ = పవిత్రులనుగా చేయువారు, దంష్ట్రా = కోఱలతో, గదా = గదలతో, భ్రుకుటిభిః = కనుబొమల (కదలికలతో) కుటిలగతులతో, ద్విషతః = శత్రువులను (భగవద్భాగవతవిరోధులను), ధునానాన్ = భయపెట్టువారును, చతసృషు = నాలుగు, ద్వార ఆవలీషు = ద్వారముల వరుసలయందు, అధికారభాజః = రక్షణాధికారమును కల్గినవారును అగు, చండ ప్రచండముఖతః = చండుడు, ప్రచండుడు మొదలగువారిని, ప్రణమామి = నమస్కరింతును.

**వరివస్య :–**

**“చండప్రచండౌ ప్రాగ్ద్వారే యామ్యే భద్రసుభద్రకౌ,**

**పశ్చిమే జయవిజయౌ వుదగ్ధాతృవిధాతృకౌ"**

అను ప్రమాణమునుబట్టి, భగవదాలయమునకు పూర్వద్వారమున –చండ – ప్రచండులు, దక్షిణమున – భద్ర– సుభద్రులు, పశ్చిమమున –జయ విజయులు, ఉత్తరమున– దాత – విధాతలు రక్షణభారమును నిర్వహింతురు. కవి వారిని ఈ శ్లోకమున ప్రణమిల్లుచున్నారు.

చండ ప్రచండాదిద్వారపాలకులు భాగవతులకు చిఱునవ్వుతో కూడిన ముఖకమలములతో, వికసించిన కమలములవంటి కన్నులతో కన్పించుచు, వారిని తమ పావనదృష్టితో పవిత్రులను చేయుదురు. వారికి అనుకూలురై కన్పింతురు. భగవద్భాగవత విరోధులను తమ కోఱలతో, చేతులలోని గదలతో, కుటిలములగు కనుబొమల కదలికలతో మిక్కిలి బెదరించుచు, ప్రతికూలురై యుందురు. శ్రీరంగమున ద్వారరక్షణభారమును వహించు ఇట్టి ద్వారపాలకులను నమస్కరింతును – అని శ్లోకభావము.

భట్టరు ఈ శ్లోకమున చండ ప్రచండుల పేర్లను ఉట్టంకించిరి. కావున, తూర్పుద్వారముద్వారా ఆలయమును ప్రవేశించిరని ఊహింపవచ్చును. మఱియు, తరువాతి శ్లోకమున వేయి కాళ్ల మంటపమును వర్ణించుటకూడ ఈ భావమును బలపరచుచున్నది. భగవదాలయమును ద్వారపాలకుల అనుమతిని పొందిన పిమ్మటనే ప్రవేశింపవలెనను శాస్త్రార్థ మిందు తెలుపబడినది. తిరుప్పావైప్రబంధములోని 16వ పాశురమున గోదాదేవి ద్వారపాలకులను ప్రార్థించి, పిమ్మట 17వ పాశురమున శ్రీకృష్ణభగవానుడు మందిరమును ప్రవేశించినట్లు పల్కుటను ఇచట స్మరింపదగినది. శ్రీవైకుంఠగద్యలో భగవద్రామానుజులు **"భగవత్పారిషద్గణనాయకైః ద్వారపాలైః కృపయా స్నేహగర్భయా దృశా ఽ వలోకితః, సమ్యక్ అభివన్దితైః తై స్తై రేవానుమతో భూత్వా, భగవంత ముపేత్య"**(భగవంతుని పరిషత్తుకు నాయకులైన ద్వారపాలకులచేత కరుణతో, ప్రీతితో కూడిన చూపులతో చూడబడినవాడై, వారికి నమస్కరించి, వారి అనుమతిని చక్కగా పొందినవాడై భగవంతుని

సమీపించి) అనుచు భగవత్పారిషదులైన గణనాయకులను, ద్వారపాలకులను నమస్కరించి, వారి అనుమతితో పరమపదనాథుని చేరినట్లు పలికిన విషయ మిచట గుర్తింపదగినది.

## వేయి కాళ్ల మండపాన్ని సేవిద్దాం

**38. సర్వాత్మసాధారణనాథగోష్ఠి–**
**పూరేఽపి దుష్పూరమహావకాశమ్!**
**అస్థాన మానందమయం సహస్ర –**
**–స్థూణాదినామ్నాత మవాప్నవాని ॥**

**ప్ర. అ. –** సర్వ – ఆత్మ = ఆత్మలన్నిటికి, సాధారణ = సమానుడైన, నాథ = ప్రభువగు శ్రీరంగనాథుని, గోష్ఠిపూరే అపి = గోష్ఠి ప్రవాహముగా నున్నను, దుష్పూర = నిండించుటకు సాధ్యము కాని, మహా అవకాశమ్ = గొప్ప ప్రదేశమును కల్గిన, సహస్రస్థూణాదివా = "సహస్రస్థూణా" అను పదమును మొదట కల్గిన ఉపనిషద్వాక్యముచే, అమ్నాతం = నిర్దేశింపబడినది, ఆనందమయం = ఆనందమే మూర్తీభవించినట్లున్నది అగు, (తం = ఆ), ఆస్థానం = మండపమును, అవాప్నవాని = సేవింతును (పొందెదను).

**వరివస్య :–** తూర్పుద్వారముద్వారా శ్రీరంగమందిరమును ప్రవేశించిన భట్టరు మొదటగా వేయికాళ్ల మండపమును ఈ శ్లోకమున కీర్తించుచున్నారు. ఈ శ్లోకమునకు ముందు కవి పలు శ్లోకములలో వైకుంఠదివ్యనగరము శ్రీరంగముగా, విరజానది కావేరీనదిగా, అచటి నిత్యులు, ముక్తులు శ్రీరంగమున జంగమస్థావరములుగా అవతరించిరని తెలిపిరి. ఆ క్రమములోనే వైకుంఠనగరమున గల దివ్యమణిమంటపము శ్రీరంగమున వేయి కాళ్ల మండపముగా మారినదని ఈ శ్లోకమున తెలుపుచున్నారు.

**"దేవానాం దానవానాం చ సామాన్య మధిదైవతమ్" (జితంతే– 2)**

(దేవతలకు, దానవులకును భగవానుడు సాధారణుడైన దైవము) అని కీర్తింపబడు శ్రీరంగనాథుడు సమస్తజీవాత్మలకు ప్రభువు. ఆ స్వామిగోష్ఠి నిత్యము ప్రవాహమువలె వచ్చి చేరుచున్నను, వేయికాళ్ల మంటపము ఎన్నటికిని నిండదు. ఆ మంటపముయొక్క వైశాల్యము అంత గొప్పది. వైకుంఠనగరములోని దివ్యమణిమంటపమునకు ప్రతిరూపమగు ఈ మంటపమును వేదములు కూడ **"సహస్రస్థూణే"** అను పదముతో మొదలగు సూక్తముద్వారా స్తుతించెను. ఆనందమే మూర్తీభవించినట్లున్న ఈ మంటపమును నేను చేరెదను – అని శ్లోకభావము.

ఈ శ్లోకమున, నాల్గవ పాదములో **"సహస్రస్థూణాదినామ్నా తదవాప్నవాని"** అను ప్రామాదికమైన పాఠము కన్పించుచున్నది. సంస్కృతవ్యాఖ్యానమున కూడ ఈ పాఠమే గ్రహింపబడినది. వేదాంతదేశికులు ఆనుగ్రహించిన రహస్యత్రయసారములో ఉపోద్ఘాతాధికారమున గల **"కలజ్గా ప్పెరునకరిలే సహస్రస్థూణాది వాక్యజ్గళాలే ఓదప్పడుకిఱ తిరుమామణి మణ్డపత్తిలే"** (కాలకృత పరిణామం లేని వైకుంఠ మహానగరంలో, **"సహస్రస్థూణే"** అని మొదలగు వాక్యాలతో వేదంలో కీర్తింపబడి తిరుమామణి మండపంలో) అను వాక్యమునుబట్టి **"స్థూణాదినామ్నాత మవాప్నవాని"** అను పాఠమే సరి అయినదని తోచుచున్నది.

**"సహస్రస్థూణే వితతే దృఢ ఉగ్రే యత్ర. దేవానామ్ అధిదేవ ఆస్తే"**

(వేయి స్తంభములను కల్గినది, అతివిస్తృతమైనది, మిక్కిలి దృఢమైనది, కన్నులతో చూడ సాధ్యము కానిది అగు మణిమండపమున దేవాధిదేవుడు అధివసించియున్నాడు) అను తలవకార ఉపనిషద్వాక్యమున ఈ ముండపవర్ణన కలదు. ఈ విషయమే ప్రస్తుతశ్లోకమున **"సహస్రస్థూణాదినామ్నాతమ్"** అని చెప్పబడినదని. గ్రహింపనగును. ఈ అర్థమే భట్టరుకు అభిలషితమనియు తోచును. లోకమున ఈ మంటపము వేయి కాళ్లమండపముగా ప్రసిద్ధిచెందుటచే, ఆ విషయమును సూచించు విధముగా **"సహస్రస్థూణాదినా"**

("**సహస్రస్థూణా**" అను పదముతో మొదట) "**ఆమ్నాతమ్**" (వ్యవహరింపబడునది) అని శ్లోకమున కవి ప్రయోగించుట కనియొక్క రచనాచాతురిని వ్యక్తము చేయుచున్నది.

స్తోత్రరత్నములో "**తయా సహాసీనమ్**" (39) అను శ్లోకమును వ్యాఖ్యానించు వేదాంతదేశికులు పైన పేర్కొనిన తలవకారోపనిషద్వాక్యమును ఉట్టంకించుచు, ప్రస్తుతశ్లోకమును ఉదాహరించిరి. అచటి పంక్తులివి.

**"ఆసీన మిత్యనేన– సహస్రస్థూణే వినిర్మితే దృఢ ఉగ్రే యత్ర దేవానామ్ అధిదేవ ఆస్తే ఇతి తవల్కార శ్రుతిః స్మార్యతే, ఉపాత్తా చేయ మభియుక్తైః సర్వాత్మసాధారణ .... సహస్రస్థూణాదినామ్నాత మవాప్నవాని ఇతి."**

ఇట్టి వ్యాఖ్యానము "**ఆమ్నాత**" మను పదముండిననే సాధ్యపడును. కావున ఆమ్నాతపదఘటితమైన పాఠమే ఇచట స్వీకరింపబడినది. శ్రీ ప్ర. భ. అణ్ణంగరాచార్యస్వామివారి వ్యాఖ్యానమునను ఈ పాఠమే ఆదరింపబడినది.

"**వితతే ధృఢ ఉగ్ర**" అను తలవకార శ్రుతిలోని విశేషణములు వైకుంఠములోని దివ్యమంటపమునకు చెందినవి అయినను, వానిని సాక్షాత్తు వైకుంఠం అయిన శ్రీరంగములోని వేయికాళ్ల మండపమునకు కూడ అన్వయింపనగును. అధ్యయనోత్సవసమయములలో దేశములోని సుదూరప్రాంతములనుండి భగవత్సేవకై వచ్చు భక్తజనసందోహ మెంత పెద్దది అయినను, ఆ సందోహము వేయి కాళ్ల మండపమును నిండింపలేదు. ఇంకను ఎంతమంది వచ్చినను వారికి అవకాశ మీయగల్గినట్టి వైశాల్యమును ఆ మంటపము కల్గి యున్నది.

శ్రీరామానుజుల శ్రీవైకుంఠగద్యలోని "**దివ్యపురుషైః మహాత్మభి రాపూరితే, తేషా మపి ఇయత్పరిమాణ మీయదైశ్వర్య మీదృశస్వభావ మితి పరిచ్ఛేత్తు మయోగ్యే అతిప్రమాణే. దివ్యాస్థానమంటపే**" (మహాత్ములైన దివ్యపురుషుతో నిండుగా ఉన్నది, వారికి కూడా "ఇంతటి పరిమాణాన్ని కలిగినది, ఇంతటి గొప్పతనాన్ని కలిగినది, ఇటువంటి స్వభావం కలిగినది" అని పరిచ్ఛేదించి

చెప్పడానికి సాధ్యం కానిది, గొప్ప ప్రమాణాన్ని కలిగినది అయిన –– దివ్యాస్థానమండపంలో) అను సూక్తియు ఇచెట స్మరింప దగినది.

సంస్కృత వ్యాఖ్యానమున చూపబడిన పాఠము **"సహస్రస్థూణాదినామ్నా తదవాప్నవాని"** అని ఉండుటచే, ఈ పాఠమున యచ్ఛబ్దమును అధ్యాహారము చేసికొనవలెను. **"సహస్రస్థూణా"** అని మొదలగు పేరుతో వ్యవహరింపబడు దివ్యమంటపమేది కలదో, ఆ ప్రసిద్ధమైన మంటపమును భజింతును" అని ఈ పాఠమునకు భావము. ఇచటి 'ఆది' శబ్దముచే మండపరత్నము, మహామణిమండపమువంటి నామములును చెప్పబడునని సంస్కృత వ్యాఖ్యానకర్త సూచించిరి.

**"ఆనందమయమ్"** అనుటకు, ఆనందస్వరూపమునిగాని, ఆనంద ప్రచురమని అర్థము చెప్పవచ్చును. **"ఆనందమయో ఽ భ్యాసాత్"** (1–1–13) అను బ్రహ్మసూత్రమును వ్యాఖ్యానించుచు శ్రీరామానుజులు అచటి మయట్ ప్రత్యయము ప్రాచుర్యార్థమును చెప్పునని వివరించుట ఇచట స్మరింపదగినది. నిత్యగ్రంథమున శ్రీరామానుజులు వైకుంఠనగర దివ్యమంటపమును **"ఆనందమయాయ దివ్యమంటపాయ నమః"** అని స్తుతించిరి.

**"సర్వాత్మ"** అనుటకు ఈ లోకములోని ఆత్మలన్నియు – అను అర్థమునే కాక, నిత్య, ముక్త, ముముక్షువులను అర్థమును కూడ గ్రహింపవచ్చును. **"అహ్రుతసహజదాస్యాః"** అను శ్లోకమున కవి శ్రీరంగమున నిత్యులు, ముక్తులు, ముముక్షువులు నివసింతురని పల్కిరి కదా! **"సర్వాత్మే"** త్యాది విశేషణమువలన శ్రీరంగమందిరములోని సహస్రస్థూణా మండపము పరమపదములోని మండపము కన్న గొప్పదని, శ్రీరంగములోని గోష్ఠి పరమపదములోని గోష్ఠికన్న గొప్పదనియు ధ్వనించుచున్నది. పరమపదములోని గోష్ఠి సర్వాత్మసాధారణగోష్ఠి కాదుకదా! అందు భగవంతుని సేవించువారు నిత్యులు, ముక్తులు అను అధికృతాధికారులు కదా.

**"గోష్ఠి"** అనునపుడు,

**"మచ్చిత్తా మద్గతప్రాణాః బోధయంతః పరస్పరమ్"** (భ. గీ. 10-9)

(నాలోనే మనస్సు నిలుపుకున్నవారై, నాలోనే ప్రాణాలను నిలుపుకున్నవారై, ఒకరికొకరు నన్నుగూర్చి తెలుపుకునేవారై ఉండేవారు),

**"సతతం కీర్తయంతో మాం యతంత శ్చ దృఢవ్రతాః.**

**నిత్యయుక్తా ఉపాసతే"** (భగీ. 9-14)

(ఎల్లప్పుడూ నన్ను కీర్తిస్తున్నవారై, నా అనుభవం కోసం ఎల్లప్పుడూ ప్రయత్నం చేసివారై, దృఢమైన వ్రతాన్నికలిగినవారై ––– ఎల్లప్పుడూ మనస్సులో నాతో సంబంధాన్ని కలిగినవారై ఉండేవారు) అను గీతాశ్లోకముల అర్థమును స్మరింపనగును.

ఇక్కడ, "**సర్వాత్మనాం సాధారణో వాథః, తస్య గోష్ఠీ**" అను అన్వయమే కాక, "**సర్వాత్మనాం యా సాధారణీ నాథగోష్ఠీ**" అను అన్వయమునుకూడ చెప్పవచ్చును. మొదటి అన్వయములోని సాధారణత్వము నాథునియందు, రెండవ అర్థములో గోష్ఠియందు అన్వయించును.
ఇందు వృత్తము ఇంద్రవజ్ర.

## చంద్రపుష్కరిణి దరికి చేరదాం

**39. విహరతి హరౌ లక్ష్మ్యా లీలాతపత్రపరిష్క్రియా-**
**వినిమయవిధా సూనాసూని క్రియాసఫలోత్పలామ్ ।**
**అథ మునిమనఃపద్మేష్వ బ్జాసహాయవిహారజ-**
**శ్రమహరతటీం యామ స్తా మైందవీ మరవిందినీమ్ ॥**

**ప్ర. అ.** – హరౌ = శ్రీరంగనాథుడు, లక్ష్మ్యా సహ = శ్రీరంగనాయకితోపాటు, విహరతి (సతి) = విహారమును సల్పువాడగుచుండగా, లీలా ఆతపత్ర కేళీవిలాసార్థమైన గొడుగుగుగా అగుటచే, పరిష్క్రియా = కర్ణభూషణము మొదలగు అలంకారములుగా అగుటచే, వినిమయవిధా = ఒకరి కొకరు మాలెలను మార్చుకొనుటకు తగినట్లు ఉపయోగపడుటచే, సూనాసూనిక్రియా

= వారు లీలావిలాసముగా పుష్పయుద్ధమును చేయుటకు సాధనములుగా అగుటచే, సఫల = జన్మసాఫల్యమును పొందిన, ఉత్పలామ్ = పద్మములను కల్గినది. అథ = మరియు, ముని = మహర్షులయొక్క, మనఃపద్మేషు = హృదయపుండరీకములలో, అబ్జసహాయవిహారజ = సలక్ష్మీకుడైన భగవానునకు విహరించుటవలన కల్గిన, శ్రమ = అలసటను, హర = తీర్చు, తటీ = తీరమును కల్గినది అగు, తాం = ఆ ప్రసిద్ధమైన, ఐందవీమ్ అరవిందినీమ్ = చంద్రపుష్కరిణిని, యామః = పొందెదము (చేరెదము).

**వరివస్య :–** ఈ శ్లోకమున, తదుపరి శ్లోకమున కవి చంద్రపుష్కరిణిని స్తుతించుచున్నారు. ఈ పుష్కరిణి శ్రీరంగాలయమున ఉత్తర దిక్కున కలదు.

చంద్రపుష్కరిణిలో పలు తామర పూవులు కలవు. అవి శ్రీరంగనాథునకు, శ్రీరంగనాయకికి అనేక రీతులలో కైంకర్యమొనర్చుచు, జన్మ సాఫల్యమును పొందుచున్నవి. కొన్ని తామరలు దివ్య దంపతులు జలక్రీడ సల్పునపుడు లీలాఛత్రములుగా ఉపయోగపడును. మరికొన్ని, వారు పరస్పరము పూమాలెలను మార్చుకొను క్రీడకు ఉపయోగపడును, వారు ప్రణయరోషముతో చేయు కలహమున ఒకరినొకరు కొట్టుకొనుటకై మరి కొన్ని ఉపయోగపడును. ఇట్లు అనేక విధములుగా చంద్రపుష్కరిణిలోని తామరపూలు దివ్యదంపతులకు ఉపయోగపడుచున్నవి. ఇట్టి పూలతో చంద్రపుష్కరిణి నిండియున్నది. **"పోదిఱ్కమల వన్నెఞ్జమ్"** (పెరియా. తి. 5-2-8) (జ్ఞాననిలయమై, అంతర్యామి అగు భగవానునకును తెలియరాని బలిమిని కలిగినదైయున్న యోగుల హృదయకమలము) అనునట్లు భక్తుల హృదయపుండరీకములలో భగవానుడు సలక్ష్మీకుడై అధివసించి యుందును. సంకుచితమైన ఆ ప్రదేశములో నిలచియున్న స్వామికి శ్రమ కల్గుట. సహజము. ఆ శ్రమను చంద్రపుష్కరిణి తీరము తీర్చును, ఆహ్లాదపఱచును. ఇట్టి మహనీయమైన పుష్కరిణిని చేరెదము – అని శ్లోకభావము.

**శ్రీరామాయణమున వాల్మీకిభగవానులు–**

**"అకర్దమ మిదం తీర్థం భరద్వాజ! నిశామయ,**
**రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా" (రా. బా. 2)**

(ఓ భరద్వాజా! బురద లేనిది, అందమైనది, తేటపడిన నీటిని కలిగినది అగుటచే సత్పురుషుని మనస్సు వలె ఉండే ఈ తీర్థమును గమనించుము) అనుచు బురద లేని, నిర్మలమైన, ఆహ్లాదకరమైన నీటిని కల్గిన తీర్థమును సత్పురుషుల మనస్సులతో పోల్చెను. ఇట్టి సత్పురుషుల మనస్సులలో భగవానుడు సంతోషముగా నిలచి యుండునని పురాణేతిహాసములు తెలుపుచున్నవి. "**జంగమశ్రీవిమానాని హృదయాణి మనీషిణామ్**" (మహాత్ముల హృదయాలు కదలాడే భగవానుని విమానాలు) అను ప్రమాణశ్లోకము, "**వెళ్లత్తరవిల్ తుయిలమర్ న్ద విత్తినై ఉళ్ళత్తుక్కొణ్డు మునివర్ కళుమ్ యోగికళుమ్**" (పాలసముద్రంలో ఆదిశేషునిపై యోగనిద్రలో ఉండే జగత్కారణభూతుడైన స్వామిని మనస్సులో నిలుపుకొని, మునులు, యోగులు కూడా) (6) అను తిరుప్పావై దివ్య ప్రబంధ సూక్తియు ఇచట స్మరింపదగినవి. మునుల, యోగుల హృదయ పుండరీకములలో భగవానుడు ఎంత సంతోషముగానున్నను, అతిసూక్ష్మమైన ఆ హృదయగహ్వరమున ఉండుటచే స్వామికి ఎంతో కొంత శ్రమ కల్గు అవకాశము కలదు. ఇట్టి శ్రమను సైతము చంద్రపుష్కరిణి తీర్చి, స్వామికి ఆహ్లాదమును కల్గించుననుటచే చంద్రపుష్కరిణియొక్క భోగ్యతాతిశయము చెప్పబడినది. మరియు, భగవానుని తాపమును పోగొట్టగల్గిన పుష్కరిణి సంసారుల తాపమును పోగొట్టుటలో ఆశ్చర్యము లేదను భావము కూడ ఇచట కైముతికన్యాయముద్వారా వ్యక్తమగుచున్నది. ఇట్టి పుష్కరిణిని చేరి, అందు అవగాహించి, సంసారతాపమును పోగొట్టుకొందుము – అని తాత్పర్యము.

సహస్రపత్రములుగా చెప్పబడు తామరపూవులు గొడుగు ఆకారమును కల్గియుండుటచే కవి వానిని లీలాతపత్రములని వర్ణించెను. కాళిదాసాది

మహాకవులును పద్మములను లీలాఛత్రములుగా అభివర్ణించిరి. కుమారసంభవ కావ్యములోని పంచమసర్గలో పార్వతితపస్సును వర్ణించు కాళిదాసు "యదర్థ మంభోజ మివోష్ణవారణం కృతం తపఃసాధన మేతయా వపుః" (ఈమె, తన సుకుమారమైన శరీరాన్ని తపస్సుకు సాధనంగా చేసుకోవడం – ఎండను అడ్డుకోవడానికి తామరపువ్వును గొడుగుగా పట్టినట్టు ఉన్నది) అనుచు పద్మమునకు, గొడుగునకు గల సామ్యమును సూచించెను.

**"సూనై శ్చ సూనై శ్చ ప్రహృత్య ఇదం యుద్ధం ప్రవృత్తం సూనాసూని"** అను విగ్రహమును కల్గిన **"సూనాసూని"** అను సమాసప్రయోగము మిక్కిలి విశిష్టమైనది, రమణీయమైనది, భట్టర్ వ్యాకరణశాస్త్ర పాండిత్యమును సూచించునదియు.

**"ఇజ్గు యుద్ధ మిల్లావిట్టాలుమ్ క్రియామాత్రేయం సాధుః"** ఎన్గిఱ శాబ్దిక ప్రక్రియైయాలుమ్, **'కర్ణాకర్ణి ప్రథితమయశోబంధువర్గై రభాణి'** ఇత్యాది ప్రయోగత్తాలుమ్ క్రియామాత్రత్తిల్ సూనాసూనిశబ్దమ్ సాధువాక క్కడవదు" అని ఈ ప్రయోగం వాధూలా వీరరాఘవాచార్య స్వామివారి వ్యాఖ్యానంలో సమర్థింపబడినది.

ఈ పుష్కరిణి సంసారుల తాపమునేకాక, దివ్యదంపతుల శ్రమనుకూడ తీర్చుట విశేషము. అందఱి తాపమును తీర్చు హరితాపమునే ఈ పుష్కరిణి తీర్చునట. **'అరవిందినీ'** అనుటచే ఈ పుష్కరిణిలో పద్మముల సద్భావము సూచితము. 'ఉత్పల' శబ్దముచే కలువల సద్భావమును సూచింపబడినది.

ఈ శ్లోకమున హరిశబ్దము సాభిప్రాయకము. **"ఉపసర్గార్థము ధాతువులో లీనమైయుండును"** అను సంస్కృత వ్యాకరణ శాస్త్ర సంప్రదాయమును అనుసరించి, **'హరి'** అనుటకు **"హరతి– విహరతి ఇతి హరిః"** అను వ్యుత్పత్తి ఇక్కడ చెప్పనగును. పద్మములను కల్గిన చంద్రపుష్కరిణిలో పద్మాదేవితో కలసి విహరించుటచే, యోగుల

హృదయపద్మములయందు విహరించుటచే స్వామికి హరి యను పేరు కల్గినదను స్వారస్యము ఇచట స్ఫురించుచున్నది. ఈ సందర్భమున **"త్వత్సంప్రీత్యై విహరతి హరౌ"** (9) అను శ్రీస్తుతిలోని దేశికుల సూక్తి స్మరణీయము.

**"లీలాతపత్రపరిష్క్రియా"** అను విశేషణము శ్రీగోపాలాచార్య వ్యాఖ్యానమున ఇట్లు వివరింపబడినది. "దివ్యదంపతులు లీలాతపత్రమును నిర్మించుకొని, దానిని తాము అలంకరించుకొందురు. ఇందుల కొఱకు వారు చంద్రపుష్కరిణిలోని పద్మములను, కలువలను పర్యాయముగా ఉపయోగింతురు. లక్ష్మీదేవి పద్మములను, భగవానుడు నీలవర్ణుడగుటచే నీలోత్పలములను ఆతపత్రమునకు అలంకరింతురు. ఈ సమయమున వారు ఒకరితో ఒకరు లీలగా స్పర్థింతురు. ఇట్లు చంద్రపుష్కరిణిలోని పద్మములును, కలువలునుకూడ తమజన్మసాఫల్యమును పొందెను".

జీవుల సంసారతాపమును, భగవానుని శ్రమను హరించు చంద్రపుష్కరిణిని కవి హరిణీవృత్తమున ఇచట స్తుతించుట ఉచితమేకాక, సాభిప్రాయకమును అగును.

## చంద్రపుష్కరిణిలో స్నానమును చేసి తాపత్రయమును పోగొట్టుకొనెదను

**40. తాపత్రయీ మైందవపుష్కరిణ్యాం**
**నిమజ్య నిర్వాపయితా ఽ స్మి యస్యాః ।**
**అభ్యాసతో ఽ పా మఘమర్షణీనాం**
**చంద్రః సుధాదీధితితా మవాప ॥**

**ప్ర. అ. –** చంద్రః = చంద్రుడు, యస్యాః = ఏ చంద్రపుష్కరిణియొక్క, అఘమర్షణీనాం = పాపమును పోగొట్టు, అపాం = నీటియొక్క, అభ్యాసతః = పరిచయముచే (మాటి మాటికి స్నానము చేయుటచే), సుధాదీధితితాం =

అమృతకిరణములను కల్గియుండుటను, అవాప = పొందెనో, అట్టి, ఐన్దవపుష్కరిణ్యాం = చంద్రపుష్కరిణిలో, నిమజ్య = స్నానమొనర్చి, తాపత్రయీం = మూడు విధములైన తాపములను, నిర్వాపయితా – అస్మి = పొగొట్టుకొనువాడనై ఉన్నాను.

**వరివస్య :–** ముందు శ్లోకమున "**చంద్రపుష్కరిణిని సమీపింతుము**" అని పల్కిన కవి, ఇందు తాము ఆ పుష్కరిణిలో స్నానమొనర్చి, పాపములను పోగొట్టుకొందుమను విషయమును తెలుపుచున్నారు.

అధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికములను మూడు విధములైన తాపములను ఈ చంద్రపుష్కరిణియందు స్నానముచేయుటవలన తీర్చుకొందును. ఈ పుష్కరిణిలో చిరకాలము స్నానముచేయుట ద్వారా చంద్రుడు తనకేర్పడిన క్షయరోగమును పోగొట్టుకొని, అమృతకిరణుడయ్యెను. అనగా, అతనికి రోగము తీరుటయే కాక, అతని కాంతి కూడ అమృతముతో కూడినదయ్యెను – అని శ్లోకభావము.

సంసారసముద్రమున మునుగుటవలన కల్గిన తాపత్రయములను చల్లని, స్వచ్ఛమైన, పవిత్రమైన జలమును కల్గిన చంద్రపుష్కరిణిలో స్నానమొనర్చి, తీర్చుకొందును – అని తాత్పర్యము.

చంద్రుడు తనకు కల్గిన క్షయరోగమును చంద్రపుష్కరిణిలో పలుమార్లు స్నానమాడుటద్వారా పొగొట్టుకొనెనను పౌరాణికకథ సుప్రసిద్ధము, "**అభ్యాశతః**" అను పాఠాంతరము మూడవ పాదమున కన్పించుచున్నది. అనగా, సమీపమాత్రముచేతనే – అని అర్థము. "**సమీపేఽ భ్యాశసవిధ**" అని అమరకోశములో ఈ పదము సమీపార్థకముగా చెప్పబడింది. చంద్రపుష్కరిణిలో స్నానము చేయకపోయినను, దాని తీరమున ఉన్నంతమాత్రముచే చంద్రుడు సుధామయుడయ్యెను. ఇక, స్నానముచేసినచో చెప్పవలసినదేమి? అను తాత్పర్యము కైముతికన్యాయ సిద్ధము.

పాంచరాత్రాగమమునకు చెందిన పారమేశ్వరసంహితలో చంద్రపుష్కరిణియందు. చంద్రుడు తపస్సు చేసిన వృత్తాంతము–

**"దక్షాధ్వరే చ రుద్రేణ పరిభూతో నిశాకరః,**

**మూర్ధ్ని తస్య కృతావాసో యత్ర తప్త్వా మహత్తపః"** (10-277-78)

(దక్షయజ్ఞంలో రుద్రునిచేత పరాభవాన్ని పొందినవాడు, ఆ శివుని శిరస్సుపై నివసించినవాడు అయిన చంద్రుడు, ఈ చంద పుష్కరిణీతీర సమీపమున తపస్సు చేసి, తన దోషాన్ని పోగొట్టుకున్నాడు) అనుచు ప్రస్తుతింపబడినది. భట్టరు ఈ వృత్తాంతమును ఇచట ప్రస్తావించిరి. శ్రీరంగములోని ఆరాధన పారమేశ్వరసంహితానుసారము చేయబడుటయు ఇచట స్మరింపదగినది. ఆ సంహితలో శ్రీరంగవిమానముయొక్క ఆవిర్భావము, దాని మహిమయు, ఆ విమానము శ్రీరంగమును చేరిన విధము వర్ణింపబడినది.

ఇందు వృత్తము "**వాణీ**" అను ఉపజాతి విశేషము. ఇందు 1వ, 3వ, 4వ పాదములు ఇంద్రవజ్ర లక్షణమును, 2వ పాదము ఉపేంద్రవజ్ర లక్షణమును కల్గియుండును.

## చంద్ర పుష్కరిణ తూర్పు తీరములోని ఆళ్వారులను సేవించెదను

**41. పూర్వేణ తాం తద్వదుదారనిమ్న–**
**ప్రసన్నశీతాశయమగ్ననాథాః!**
**పరాంకుశాద్యాః ప్రథమే పుమాంసో**
**నిషేదివాంసో దశ మాం దయేరన్ ॥**

**ప్ర. అ. –** తాం పూర్వేణ = ఆ చంద్రపుష్కరిణికి తూర్పున, నిషేదివాంసః = ప్రతిమల రూపమున అధివసించి యున్నవారు, తద్వత్ = ఆ పుష్కరిణివలెనే, ఉదార = గొప్పదైన, నిమ్న = గంభీరమైన, ప్రసన్న = స్వచ్ఛమైన (తేటగానున్న), శీత = చల్లనైన, ఆశయ = హృదయమునందు (తీర్థమునందు), మగ్న =

మునిగిన (నిలచిన), నాథాః = భగవానుని కల్గినవారు అగు, పరాంకుశ ఆద్యాః = నమ్మాళ్వార్లు మొదలగు, దశ = పదిమంది, ప్రథమే పుమాంసః = ఆళ్వార్లు, మాం = నన్ను, దయేరన్ = దయజూపుదురు గాక!

**వరివస్య :–** చంద్రపుష్కరిణికి తూర్పుదిశలో ప్రతిష్ఠింపబడిన పదిమంది ఆళ్వార్లను కవి ఈ శ్లోకమున స్తుతించుచు, వారి అనుగ్రహమును ప్రార్థించుచున్నారు. చంద్రపుష్కరిణికి, ఆళ్వారులకు గల సామ్యమును శ్లిష్టవిశేషణములతో కవి తెలిపిన విధము మిగుల రమణీయమైనది. పూర్వశ్లోకములలో చంద్రపుష్కరిణిలో శ్రీరంగనాథదివ్యదంపతుల విహారమునుగూర్చి, తాపత్రయముచే ఆర్తులగు సంసారుల మజ్జనమునుగూర్చి తెలుపబడినది. ఇందు, పరాంకుశపరకాలాది సూరివర్యుల హృదయములలో భగవానుడు అవగాహించునని తెలుపబడుచున్నది. "**యతీంద్రసమకాల మేవ అస్య స్తోత్రస్య ప్రవృత్తేః తదనుక్తిః**" అనుచు ఈ స్తోత్రమును కవి భగవద్రామానుజులు జీవించియుండగానే రచించినట్లు, కావుననే మధురకవులను, యతీంద్రులను విడచి, మిగిలిన పదిమంది ఆళ్వార్ల అర్చావిగ్రహములను ఇచట '**దశ**' అను పదముతో కవి నిర్దేశించిరని శ్రీరామానుజాచార్యవ్యాఖ్యానమున కలదు. కాని, శ్రీమాన్ ప్ర భ. అణ్ణాస్వామివ్యాఖ్యలో భట్టరు తిరుక్కోట్టియూర్ నుండి తిరిగి వచ్చునపుడు ఈ స్తుతిని రచించిరని తెలుపబడినది. అంతియేకాక, రామానుజులు అవతార సమాప్తి కాలమునకు భట్టర్ వయస్సు చాలా చిన్నదై ఉండవచ్చునని పలువురు పండితుల, సాహిత్య చారిత్రక విమర్శకుల అభిప్రాయము కూడా. అయితే, ఆళ్వారులు పదిమంది అని, 12 మంది అని రెండు విధములైన అభిప్రాయములు ఉన్నవి కదా. ఈ దృష్టిలో కూడా ఈ శ్లోకమును అర్థము చేసుకొనే వీలున్నది.

ఆళ్వార్ల హృదయములు చాల గొప్పని. లోతైన భావములను కల్గినవి, స్వచ్ఛమైనవి, సంసార తాపమును పోగొట్టగల్గిన చల్లదనమును కల్గినవి. అట్లే, చంద్రపుష్కరిణి మహనీయమైనది, చాల లోతును కల్గినది, తేటగా, చల్లగా

నుండు నీటిని కల్గినది చంద్రపుష్కరిణిలో స్వామి విహరించి, తన శ్రమను తీర్చుకొనునట్లే, ఆళ్వారుల హృదయమునందును స్వామి విహరించును, లీలారసమును అనుభవించును. ఇటువంటి ఈ సామ్యములు చంద్ర పుష్కరిణికి, ఆళ్వానుల హృదయములకు మధ్య, "**తద్వదుదారనిమ్న ప్రసన్న శీతాశయమగ్ననాథాః**" అను శ్లిష్ట విశేషణము ద్వారా వ్యక్తమగుచున్నవి.

ఆళ్వారుల హృదయములు ఉదారములనగా, జ్ఞాతవ్యార్థముల నన్నిటిని ప్రసాదింపగల్గి యుండుట. ప్రసన్నములనగా, లోతైన భావములను కల్గియున్నను, ఆ భావములను స్పష్టముగా తెలియజేయుట, లేక, సంసారులవలె విషయవాసనలచే మలినములు కాకుండుట. నిమ్నములనగా, ఇతరులకు ఊహింప సాధ్యము కాని భావములను కల్గియుండుట. శీతలములనగా, సంసారతాపమును పోగొట్టు స్వభావమును కల్గియుండుట – అని భావము. ఇక, ఈ విశేషణములు అన్నియు చంద్ర పుష్కరిణి విషయమున సుప్రసిద్ధార్థకములు. శ్రీరంగనాథుని బ్రహ్మోత్సవములలో చివరి దినమున జరుగు అవభృథోత్సవము చంద్రపుష్కరిణియందే జరుగును, కావున, చంద్రపుష్కరిణికి ఆశయమగ్ననాథత్వము సిద్ధించినది, ఆళ్వార్ల హృదయమున భగవానుడు స్థావర ప్రతిష్ఠగా నుండునను విషయమును వారే కంఠోక్తిగా పల్కిరి, "**పనిక్కడలిల్ పళ్ళికోళై పழక విట్టు ఓడి వన్దు ఎన్ మనక్కడలిల్ వాழవల్ల మాయమణాళనమ్బీ!**" (పెరియా. తి. 5-4-9) (చల్లని పాల సముద్రంలో ఉండే పడుకను వదలి, పెట్టి వేగంగా వచ్చి, నా మనసు అనే సముద్రంలో సుఖంగా నివసించే ఆశ్చర్యభూతుడవైన శ్రీరంగనాథా!) అని పెరియాళ్వార్లు, "**ఎన్నెఞ్జకమ్ కోయిల్ కొణ్డ పేరరుళాళన్**" (నా మనసును నివాసంగా గ్రహించిన దయానిధి) అని తిరుమంగై ఆళ్వార్లు, "**ఉళ్ పుకున్దు నీఙ్గాన్ అడియేనదు ఉళ్ళత్తకమ్**" (పెరి. తిరువందాది-68) (నా మనస్సు లోపల ప్రవేశించి, అక్కడనుండి వెళ్లకుండా ఉన్నాడు) అని నమ్మాళ్వార్లును పలుకుట ఇచట స్మరింపనగును. ఇట్లు చంద్రపుష్కరిణితో పలు సామ్యములను కల్గిన ఆళ్వార్లు ఆ పుష్కరిణికి తూర్పు

దిశలో వేంచేసియున్నారు. సామ్య స్వభావములను కలిగినవారు ఒక చోట చేరుట లోకమున సహజమే కదా.

వారిని కవి "**ప్రథమే పుమాంసః**" అనుట (ప్రథమ పురుషులు) "**యత్రర్షయః ప్రథమజా యే పురాణాః**" (తై. సం. 4-7-13) (ఎక్కడ ప్రాచీనులైన నిత్యసూరులు ఉన్నారో) అను వైదికవచనములను జ్ఞప్తికి తెచ్చుచున్నది. ఇట్టి ఆళ్వార్లు నాపై దయచూపి, నన్ను అనుగ్రహింతురు గాక! అని భావము.

సర్వరక్షకుడు, నిర్హేతుకమైన, నిరవధికమైన దయను కల భగవానుడు ఆళ్వార్ల మనసులలో అధివసించియున్నాడు. కావున, వారి దయయే ఏ దిక్కు లేని మనకు పెద్ద దిక్కు – అని తాత్పర్యము. "**పాంతి, అథవా, పునంతి ఇతి పుమాంసః**" అను వ్యుత్పత్తినిబట్టి "**పావనము చేయువారు, రక్షించువారు**" అను అర్థమునిచ్చు "**పుమాంసః**" అను పదప్రయోగము ఆళ్వార్ల విషయమున ఇచట సాభిప్రాయకము అని తోచును. "**పాతి, పునాతి ఇతి పుమాన్**" రక్షించుచున్నాడు, పవిత్రము చేయుచున్నాడు కనుక, పుమాన్) అను వ్యుత్పత్తిని కలిగిన ఈ శబ్దము ఆల్వారుల విషయమున సార్ధకము. తమ శీతలకటాక్షములతో మనలను పవిత్రము చేయువారు, భగవంతుని అనుగ్రహమును మనము పొందునట్లు చేసి రక్షించువారును కదా వీరు.

ఈ అర్థములు, మన విషయములో వలె, భగవంతుని విషయములో కూడా సార్ధకములే. చంద్రపుష్కరిణిలో అవగాహించుటచే సంసారుల తాపము తీరునట్లే, సూరివరుల హృదయములలో అవగాహించుటచే భగవానుని ఆర్తి తీరును. తమ అనుభవసాగరమున స్వామిని మునుగునట్లు చేయువారగుటచేకూడ శఠకోపాదులకు మజ్జకసంస్థ (ఆళ్వార్లు) అను పేరు కల్గినది. ఈ భావము శ్లోకములోని "**మగ్ననాథాః**" అను ప్రయోగముచే సూచింపబడినది. "**మగ్నః నాథః యేషు (యేషాం హృదయేషు) తే మగ్ననాథాః**" అని ఇచట విగ్రహము.

**"ఆశయ"** శబ్దమునకు **"ఆశేతే అత్ర భగవాన్ ఇతి ఆశయః"** అను వివరణము దివ్యసూరిపక్షమున వివక్షితము. పెరియాళ్వార్లు, నమాళ్వార్లు, తిరుమంగై ఆళ్వారులు మొదలైనవారు భగవంతుని తిరుమంజన సన్నివేశాన్ని తమ దివ్యప్రబంధములలో అనుభవించినవారు, అద్భుతముగా వర్ణించినవారు కనుక కూడా, వీరికి ఆళ్వారులు అనే సంజ్ఞ సార్థకము.
శ్రీరామాయణములోని

**"అకర్దమ మిదం తీర్థం –– రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా" (రా. బా. 2-5)** (బురద లేనిది, తేటపడిన నీటిని కలిగినదైన ఈ జలాశయము – ఏ విధమైన దోషం లేనిది, ప్రసన్నమైనది అయిన సత్పురుషుని మనసు వలె అందంగా ఉన్నది) అను సూక్తి యోగిజనుల మనుస్సులకు, స్వచ్ఛజలమును కల జలాశయమునకు మధ్య గల సామ్యమును తెలుపుచున్నది. ఆ సూక్తి ఇచట స్మరింపదగినది. ఇచట ఉదాహరింపబడిన శ్రీరామాయణసూక్తిలో **"అకర్దమమ్"** అనే పదం ద్వారా దోషరాహిత్యం, **"ప్రసన్నాంబు"** అనే పదం ద్వారా కళ్యాణ గుణశాలిత్వం చెప్పబడినందున, హేయప్రతిభటత్వం, భగవద్భక్త్యాది సకల కళ్యాణగుణ పూర్ణత్వం – అనే రెండు సూచింపబడ్డాయి. ఇటువంటి స్వభావాన్నే ఆళ్వారులల హృదయాలు కలిగి ఉండడం వల్ల, అవి భగవంతునకు నిత్యనివాసాలయ్యాయి.

ఇందు వృత్తము 'బాలా' అను ఉపజాతి విశేషము.

**శ్రీరంగ విమానమును స్తుతించ గోరెదను**

**42. ఆధారశక్తి ముపరి ప్రకృతిం పరేణ**
**తాం కూర్మ మత్ర ఫణినం పృథివీం ఫణాసు ।**
**పృథ్వ్యాం పయోధి మధితన్నళినం విధాయ**
**శ్రీరంగధామ సునివిష్ట మభిష్టవాని ॥**

**ప్ర. అ. –** ఆధారశక్తి ఉపరి = ఆధారశక్తికి పైన (భగవచ్ఛక్తికి పైన), కూర్మం = ఆదికూర్మమును, అత్ర = ఆ కూర్మముపై, ఫణినం = ఆదిశేషుని, ఫణాసు = ఆదిశేషుని పడగలపై, పృథివీం = భూమిని, పృథ్వ్యాం = భూమిపై, పయోధిం = సముద్రమును, అధితత్ = ఆ సముద్రముపై, నళినం = అష్టదళ పద్మమును, నిధాయ = నిలిపి, అధితత్ = దానిపై, సునివిష్టం = సుప్రతిష్ఠితముగా నుండు, శ్రీరంగధామ = శ్రీరంగవిమానమును, అభిష్టవాని = స్తుతింప గోరెదను.

**వరివస్య :–** ఈ శ్లోకమునుండి నాలుగు శ్లోకములలో శ్రీరంగవిమానమును కవి స్తుతించుచున్నారు.

భగవద్రామానుజులు నిత్యగ్రంథమున పీఠార్చననుగూర్చి తెలుపుచు. "**ఓమ్ ఆధారశక్త్యై నమః, ఓమమ ప్రకృత్యై నమః**" అని ప్రారంభించి తెలిపిన క్రమమును అనుసరించి ప్రస్తుతశ్లోకము రచింపబడినది.

మొదట అన్నిటికిని ఆధారమగు భగవచ్ఛక్తి, దానిపై ప్రకృతిమండలము, దానిపై ఆదికూర్మము, ఆ కూర్మముపై ఆదిశేషుడు, ఆదిశేషుని పడగలపై భూమి, భూమిపై సముద్రము, సముద్రముపై అష్టదళపద్మము, ఆ పద్మముపై సుస్థిరముగానున్న శ్రీరంగవిమానమును నేను స్తుతింతును – అని శ్లోకభానము.

ఈ శ్లోకమున ఆధారశక్తిష మొదలు శ్రీరంగవిమానమువరకు తెలుపబడిన క్రమముయొక్క ఆంతర్యమేమనగా, భక్తులు తమ హృదయమున ఆ విధముగా ధ్యానింప వలెననుటయే. ఇది అంతయు పాంచరాత్ర ప్రక్రియను అనుసరించి చెప్పబడినది

అన్నిటిని భరింపగల్గిన శక్తికి ఆధారశక్తి అని పేరు. అది భగవచ్ఛక్తియే. "**అధితత్**" అనునది సప్తమీవిభక్త్యర్థము నిచ్చు అవ్యయము. ఒకే పదము, "దానియందు" అని దీని అర్థము. "**అధి**" అను అవ్యయము "**అధి స్వామ్యాధిక్యనిందా. భిచారే స్మృతిపాఠయోః, పాకారంభే ప్రహసనే ప్రేరణోపరిభావయోః, స్వీకారే వినియోగే చ లాభే సంధానసమ్ముఖే, ––జ్ఞానప్రస్తావయోః**" అని పలు అర్థములలో ప్రయోగింపబడుచున్నది. ఇచట

ఉపరిభావమున ప్రయోగింపబడినది. ఈ ఉపరిభావము అనునది– ఉచ్చనీచభావము అని, ఊర్ధ్వదేశ భావము అని రెండు విధములు. "**అధితత్**" అను ప్రస్తుతప్రయోగము ఊర్ధ్వదేశభావమును సూచించును. ఉచ్చనీచభావమునకు "**అధికారః**" అనునది ఉదాహరణము.

ఈ శ్లోకము వసంతతిలకవృత్తమున రచింపబడినది.

## వైకుంఠములోని అపరాజితయే శ్రీరంగ విమానము

**43. పరేణ నాకం పురి హేమమయ్యాం**
**యో బ్రహ్మకోశోఽ స్త్యపరాజితాఖ్యః ।**
**శ్రీరంగనామ్నా తమపౌరుషేయం**
**విమానరాజం భువి భావయాని ॥**

**ప్ర. అ –** నాకం పరేణ = స్వర్గలోకమునకు పైన (ప్రకృతి మండలమునకు ఆవల), హేమమయ్యాం = హిరణ్మయమైన, పుర = నగరమున, అపరాజితా ఆఖ్యః = అపరాజిత అను పేరును కల్గిన, యః = ఏ, బ్రహ్మకోశః = పరబ్రహ్మస్థానము, అస్తి = కలదో, అపౌరుషేయం = మానవులచే నిర్మింపబడనిది అగు (పురుష ప్రయత్నమునకు గోచరము కాని), తం = ఆ విమానరాజం = గొప్ప విమానమును, భువి = భూలోకమున, శ్రీరంగనామ్నా = శ్రీరంగవిమానమను పేరుతో (అవతరించినదిగా), భావయాని = భావింతును.

**వరివస్య :–** పరమపదములోని '**అపరాజిత**' అను పరబ్రహ్మస్థానమే భూలోకమున శ్రీరంగవిమానముగా అవతరించినది– అని కవి ఈ శ్లోకమున తెలుపుచున్నారు.

ప్రకృతిమండలమునకు ఆవలి వైపున "**పొన్నులకు**" (బంగారు లోకం) అని కీర్తింపబడు హిరణ్మయమైన నగరమున '**అపరాజిత**' అను పేరును కల్గిన పరబ్రహ్మ స్థానమేది కలదో, అదియే ఇపుడు శ్రీరంగమున అపౌరుషేయమైన విమానమై అవతరించినది. ఆ విమానమును ధ్యానింతును – అని శ్లోకభావము.

ఈ శ్లోకములోని పూర్వార్థము ఉపనిషద్వాక్య ఘటితమైయుండుట స్పష్టము. తైత్తిరీయోపనిషత్తులోని "**పరేణ నాకం నిహితం గుహాయామ్**" (తై. నారా.) అను వాక్యమునుండి, తైత్తిరీయారణ్యకము ప్రథమప్రశ్నలోని "**పురం హిరణ్మయీం బ్రహ్మ. వివేశా ఽ పరాజితా**" అను వాక్యమునుండి, "**బ్రహ్మణః కోశో ఽ సి మేధయా పిహితః**" (తై. ఉ.) అను వాక్యమునుండి గ్రహింపబడిన పదములు ప్రస్తుతశ్లోకపూర్వార్థమున కవిచే ప్రయోగింపబడినవి.

ప్రణవమను పేరు కల్గిన ఓంకారము బ్రహ్మకోశ మనబడును. శ్రీరంగవిమానము ప్రణవాకారమున నుండును. అందుకే ఆ విమానమునకు ప్రణవాకారవిమానమని పేరు కల్గినది. "**శ్రీరంగనామ్నా**" అనుటచే పరమపదములోని '**అపరాజిత**' అను బ్రహ్మకోశమునకు, శ్రీరంగములోని ప్రణవాకార విమానమునకు మధ్య పేరులోనే తప్ప, వస్తుతః భేదమేమియు లేదని స్పష్టమగుచున్నది. కావున, శ్రీరంగ విమానము అపౌరుషేయమని ఏర్పడినది.

ఇట్టి అపౌరుషేయ భావనతోనే గత శ్లోకములో "**ఆధారశక్తి ముపరి ప్రకృతిమ్**" అను క్రమమును కవి పల్కిరని భావింపనగును, సంస్కృతవ్యాఖ్యాతయు "**శ్రీరంగవిమానాఖ్యయా లీలావిభూత్యామ్ అవతీర్ణం తర్కయానీత్యర్థః, అన్యథా చేత్ ప్రాగుక్తాధారశక్త్యాధారకత్వం న సంభవేత్ ఇతి భావః**" (బ్రహ్మకోశమే శ్రీరంగ విమానం అనే పేరుతో ఈ లీలావిభూతిలో అవతరించింది అని భావిస్తున్నాను –అని అర్థం. లేకపోతే, ఇంతకు ముందు శ్లోకంలో చెప్పిన ఆధారశక్త్యాధారకత్వం సంభవించదు – అని భావం) అని పై భావమునే తెలిపిరి.

కావున, గత శ్లోకమున, ఈ శ్లోకమున శ్రీరంగవిమానముయొక్క దివ్యత్వము సూచింపబడినది. "**అపరాజిత**" అనగా–, భూతములచే తిరస్కరింపబడనిది – అని అర్థము. లేక, కాలాదులచే తిరస్కరింపబడనిది – అని కూడ అర్థము. "**న కాలః తత్ర వై ప్రభుః**" అని పరమపదము కాలకృత పరిణామమును లేనిదిగా చెప్పబడుచున్నది కదా!

**"విశేషేణ మాతి నివసతి అత్ర, విశిష్టం మానయంతి అనేన, విగతం మాన ముపమానమ్ అస్య, వినా పక్షిణా, మానమ్ ఉపమానమ్ అస్య"** అను విమానశబ్ద వివరణములన్నియు శ్రీరంగవిమానమునకు సార్థకములే, విమానమున భగవానుడు మిక్కిలి ఆదరముతో నివసించుట, శ్రీరంగవిమానమున నివసించుటవలన భగవానునకు విశిష్టత ప్రాప్తించుట, దానికి సాటి లేకుండుట, వేదాత్మకుడు, పక్షిరూపుడు అగు గరుత్మంతునితో సామ్యమును కల్గియుండుట – అను విశేషార్థములు పై వ్యుత్పత్తులవలన వ్యక్తమగుచున్నవి. **"అపౌరుషేయమ్"** అనుటకు, శ్రీవైకుంఠవిమాన పక్షమున – మానవప్రయత్నముచే పొంద సాధ్యము కానదని భావము. శ్రీరంగవిమానపక్షమున – మానవనిర్మితము కాదని భావము, శ్రీరంగవిమానముతోబాటు శ్రీరంగనాథుడు ఆ క్షేత్రమున వెలసెననుట పురాణప్రసిద్ధము.

**"బ్రహ్మకోశ"**, శబ్దము పరమపదములోని దివ్యనగరమునే కాక, ఓంకారమును, శ్రీరంగనగరమును సూచించును. **"యద్వేదాథౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః"** అని వేదమునకు పూర్వము, పిమ్మట ఓంకారము ఉచ్చరింపబడుటచే, అది వేదమునకు కోశమువంటిది. బ్రహ్మశబ్దము పరబ్రహ్మను, వేదమును తెలుపును. ఓంకారము భగవానునకు ఆయతనము. శ్రీరంగవిమానము శ్రీరంగనాథునకు ఆయతనము, కావున, శ్రీరంగవిమానము ప్రణవాత్మకముగా చెప్పబడినది. **"భావయామి"** అను పాఠాంతరము శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివ్యాఖ్యలో కలదు.

ఆర్ద్ర అను ఉపజాతివృత్తమున ప్రస్తుతశ్లోకము రచింపబడినది.

## శ్రీరంగ విమానము సాక్షాత్తు వేదమే

**44. అనాద్యామ్నాతత్వాత్ పురుషరచనాదోషరహితమ్**
**జనే తాంస్తాన్ కామాన్ విదధపి సాయుజ్యహృదయమ్ ।**

**అసందేహాధ్యాసం భగవదుపలంభస్థల మమీ**
**ప్రతీమః శ్రీరంగం శ్రుతిశతసమానర్ధిశరణమ్ ॥**

**ప్ర. అ. –** అనాది = అనాది అని (స్వయంవ్యక్తము అని), ఆమ్నాతత్వాత్ = వ్యవహరింపబడుటచే, పురుష = మానవులయొక్క, రచనా = నిర్మాణములో సంభవించు, దోష = దోషములచే, రహితం = శూన్యమైనది, జనే = జనమునకు, తాన్+ తాన్ = ఆ యా (వారు కోరిన), కామాన్ = కోరికలను (పురుషార్థములను), విదధత్ = ఇచ్చునది, అపి = అయినను, సాయుజ్య = మోక్షము నిచ్చుటయందే, హృదయం = (అభిప్రాయమును) మనస్సును కల్గినది, అసందేహ అధ్యాసం = సందేహము, విపర్యయము లేనిది, భగవత్ ఉపలంభ స్థలం = భగవానుడు ప్రకాశించు చోటు (కావుననే), శ్రుతిశత = అనేకవేదములతో, సమాన+ ఋద్ధి = సమానమైన అతిశయమును కల్గినది అగు, శ్రీరంగం = శ్రీరంగవిమానమును, అమీ = ఈ మేము, శరణం = శరణముగా, ప్రతీమః = విశ్వసింతుము.

**వరివస్య :–** ముందు శ్లోకమున "**అపరాజిత**" అనబడు బ్రహ్మనివాస స్థానమే శ్రీరంగవిమానముగా అవతరించెనని పల్కిన కవి, ఇందు ఆ విమానముయొక్క ఆశ్రయణీయతను, తరువాతి శ్లోకమున భోగ్యతను (ఉపాయత్వ ఉపేయత్వాలను) స్తుతించుచున్నారు. ఇందు, భట్టరు వేదమునకు, శ్రీరంగవిమానమునకు గల సామ్యమును శ్లిష్టవిశేషణములద్వారా నిర్వహించిన తీరు అత్యంతరమణీయము. వారి కవితాప్రతిభకు ఇది నిలువుటద్దమువంటిది. పూర్వశ్లోకమున శ్రీరంగవిమానము అపౌరుషేయమని వర్ణింపబడుట ఇందు సమర్థింపబడుచున్నది. ఇందు శ్రీరంగమునకు, ఓంకారమునకును సామ్యము వర్ణింపబడినదనియు కొందఱ్ వ్యాఖ్యాతల అభిప్రాయము.

వేదము అనాది, నిత్యానుపూర్వి, కావున, అపౌరుషేయముగా ప్రసిద్ధి చెందినది. వేదము మానవనిర్మితము కాదు, కావున, అందు భ్రమ, విప్రలంభాది దోషములుండు అవకాశము లేదు. "**ప్రజయా పశుభిః అన్నాద్యేన సుమేధయా**"

(సంతతితో, పశుసంపదతో, అన్నాదులతో, చక్కని ప్రజ్ఞతో) అనునట్లు లోకములోని ఆ యా జనులు తమ తమ అభిరుచులకు తగినట్లుగా వారు ఫలములను పొందుటకు వారు నిర్వర్తించవలసిన కర్మలను, యజ్ఞయాగాదులను వేదము **"వాయవ్యం శ్వేత మాలభేత భూతికామః"** (సంపదను పొందగోరేవాడు వాయుదేవతకు తెల్లని పశువులను యాగంలో సమర్పించాలి) (యజు. వే.), **"జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత"** (యజు. వే. 2-5-5) (స్వర్గప్రాప్తిని కోరేవాడు జ్యోతిష్టోమ యాగాన్ని చేయాలి) అను రీతిలో తెలిపినది. కాని, వేదమిట్టి కర్మకాండలను విధించుటలో గల పరమార్థము ఏమనగా– జనులచే ఈ వైదిక కర్మలను చేయించుటద్వారా వారిలో వైదికశ్రద్ధను పెంపొందించి, దానివలన క్రమముగా భగవానునియందు భక్తిని కల్గించుట, తత్ఫలముగా వారు భగవత్సాయుజ్యమును పొందునట్లు చేయుటయే. అందుచే, వేదవిహితకర్మల ఆశయము ఏమంటే, భగవత్సాయుజ్యరూప మోక్షప్రాపణమే. వేదమును **"సో ఽ శ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా"** (తై. ఆనం. 1-2). (ఆ ముక్తపురుషుడు సర్వజ్ఞుడైన పరమాత్మతో పాటుగా అతని కల్యాణగుణాలను అన్నిటినీ అనుభవిస్తున్నాడు) అని, బ్రహ్మసూత్రములలో **"భోగమాత్ర సామ్యలింగాచ్చ"** (4-4-21) (మోక్షానుభవంలో మాత్రమే జీవునకు భగవంతునితో సామ్యం ఉన్నదనే లక్షణం చెప్పబడడంచేత) అనుచు సాయుజ్యరూపమోక్షమును ప్రస్తావించినవి కదా! ఈ సందర్భమున **"వత్సలైయాన మాతా పిళ్ళై పేకణియామల్ మణి తిన్నవిట్టు ప్రత్యౌషధ మిడుమాపోలే, ఎవ్వియర్ క్కుమ్ తాయిరుక్కుమ్ వణ్ణమాన ఇవన్ రుచిక్కేడాన పన్దముమ్, పన్దమ్ అఱుప్పదోర్ మరున్దుమ్ కాట్టుమిటే, అదుతానుమ్ ఆస్తిక్యవివేకాన్యశేషత్వ స్వస్వాతంత్ర్యనివృత్తిపారతంత్ర్యజ్ఞళై ఉణ్డాక్కినాన్"** (బిడ్డ పట్ల వాత్సల్యాన్ని కలిగిన తల్లి, తన బిడ్డ దుఃఖించకుండా, అతడు కోరినట్లుగా, అతడు మన్ను తినేటట్లుగా విడచిపెట్టి, దానికి తగిన నివారణగా ఔషధాన్ని ఇచ్చేటట్లుగానే, జీవులందరికీ తల్లి వంటివాడైన

భగవంతుడు ఈ జీవుని రుచికి తగిన బంధాన్ని, ఆ బంధాన్ని లేకుండా చేసే ఔషధాన్ని చూపిస్తాడు కదా? అదికూడా, ఆస్తిక్యం, వివేక అన్యశేషత్వ స్వస్వాతంత్ర్య నివృత్తి, పారతంత్ర్యం) అను ఆచార్యహృదయసూక్తి (14. సూ) ఇచట స్మరింపదగినది. కావున, వేదము ఇట్లు ఐహికపారలౌకిక భోగసాధనములగు కర్మలను విధించుట మాతృవద్వాత్సలుడగు, భగవానుని కార్యమే అగును. "**ఉళన్ మికు శురుదియుళ్**" (తి. వా. 1-1) (గొప్పగా ప్రకాశించే వేదాలలో ఉన్నాడు) అని నమ్మాళ్వార్లు పలికిన విధముగా, భగవానుని స్వరూపస్వభావములు వేదమున గల "**సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ**" (తై. ఆనం. 1-2) (పరమాత్మ సత్యస్వరూపుడు, జ్ఞానస్వరూపుడు, మూడు విధాలయిన పరిచ్ఛేదాలను లేనివాడు), "**యః సర్వజ్ఞః సర్వవిత్**" (ముణ్డక, 1-1-10) (ఎవడు అన్నిటిని అన్ని విధాలుగాను తెలిసినవాడో) అని మొదలైన వాక్యములవలన స్పష్టముగా ప్రకాశించుచున్నని, కావున వేదము భగవంతుని దర్శింప చేయుచున్నది. భగవంతుడిచట కలడా? లేడా? అను సందేహము కాని, అచట లేని భగవంతుడు ఇచట ఉన్నాడను విపర్యయము కానీ ఏ మాత్రము కలుగకుండ, భగవానుని తెలియుటకు తగిన సాధనము వేదము.

ఇట్టి వేదముతో శ్రీరంగ విమానమునకు బహుధా సామ్యము కలదు. శ్రీరంగ విమానము వేదములవలె స్వయంవ్యక్తము. కావున, మానవ నిర్మితములగు కట్టడములలో కన్పడు దోషములు ఏమియు అందు లేవు. పూర్వశ్లోకమున "**అపౌరుషేయమ్**" అని శ్రీరంగవిమానమునుగూర్చి కవి పల్కెను కదా అట్లే, శ్రీరంగవిమానమునకు నమస్కరించుచు ధ్యానించువారికి, వారు కోరిన అభీష్టములను నెరవేర్చును. అంతేకాక, వారికి మోక్షపురుషార్థమును లభింపచేయుటలోనే ఈ విమానము పూర్తి దృష్టిని కల్గినది. శ్రీరంగవిమానమును మాంసచక్షువులను కల్గిన సంసారులు సైతము భగవానుని స్పష్టముగా దర్శింపగల్గుటచే, భగవానుని విషయమున గల సందేహ విపర్యాసములను ఈ విమానము తీర్చుచున్నది. ఈ విధముగా శ్రీరంగవిమానము వేదముతో

సామ్యమును కల్గియున్నది. అంతేకాక, శతాధికములైన వేదముల గొప్పతనమంతయు కలిసినగాని శ్రీరంగ విమానముయొక్క మహిమతో తులతూగదు. అనగా, వేదవాఙ్మయమునంతటిని తెలిసినగాని స్పష్టముగా భగవానుని స్వరూపజ్ఞానమును పొందలేము. అట్టి జ్ఞానము శ్రీరంగవిమానమున శ్రీరంగనాథుని దర్శించుటచే కలుగుచున్నది. ఇట్లు వేదముల కంటెను అధికమగు శ్రీరంగవిమానమును మోక్షసాధనముగా తలచి, శరణు జొచ్చెదము – అని శ్లోకభావము.

అధ్యాసమనగా ఆరోపము, విపర్యయమని అర్థము, నిజమునకు వేదమున సర్వేశ్వరుని దర్శింప సాధ్యము కాకున్నచో, అందు ఆ సర్వేశ్వరుడు ఉన్నట్లు భావించుట అధ్యాసమగును. వాస్తవమట్టిది కాదు. కావున వేదమున అధ్యాసమున కవకాశము లేదు. శ్రుతిశతమనగా – శ్రుతులలోని వాక్యశతములని, **"అనంతా వై వేదాః"** అనునట్లు అనేక వేదములను అర్థమును చెప్పవచ్చును. సాయుజ్యమనగా, భగవానునితో సమానమైన (శ్రియఃపతిత్వాదులు తప్ప) భోగమును పొందుట.

ఈ శ్లోకములోని విశేషణములన్నియు "శ్రీరంగవిమానము అందరికిని ఆశ్రయింపతగినది" అను విషయమును నిరూపించునవి అగుటచే, ఇందు ఆ విమానముయొక్క సర్వసమాశ్రయణీయత చెప్పబడినది. సాయుజ్యమనగా, పరస్పరభేదమున్నను పరస్పరము సామ్యమును కల్గియుండుట. ఇచటి సమానయోగము భగవత్ప్రాప్తి.

**"జనే తాం స్తాన్ కామాన్ విదధత్"** (జనులకు వారు కోరిన ఆ యా కోరికలను సిద్ధింప చేస్తున్నదై) అనుటకు శ్రీరంగవిమానపక్షమున – గోపాలాచార్య వ్యాఖ్యలో – ఇట్లు వివరింపబడినది. శ్రీరంగమును నాట్యరంగముగా, శ్రీరంగనాథుని సమర్థుడైన నటునిగా భట్టరు ఈ స్తోత్రమున సూచించిరనుట ఇంతకు ముందే ప్రస్తుతము. నాట్యము **"నాట్యం భిన్నరుచేః జనస్య బహుధాప్యేకం సమారాధనమ్"** (మాళవిక. 1-4) (నాట్యమనునది

అనేక విధములైనది అయినప్పటికీ, పలు విధాలైన అభిరుచులను కలిగిన జనులకు ఒకే విధమైన సమారాధనము, అంటే, ఒకే విధమైన ఆనందమును కలిగించేది) అనునట్లు పలువురి అభిరుచులకు తగినట్లు పలు విధములుగ తృప్తిని కల్గించునని చెప్పబడినది. కావున, ఈ అర్థము శ్రీరంగమునకును అన్వయించును. అట్లే, నాట్యమున పలు విధములైన రసములు పోషింపబడినను, ఆ రసముల కన్నిటికిని ప్రకృతి అగు శాంతముననే దానికి పర్యవసానము, శాంతము మోక్షపురుషార్థసాధకము. అట్లే, శ్రీరంగవిమానముకూడ పలు ఫలములను ఇచ్చునదే అయినను, సాయుజ్యరూపమోక్షమును ఇచ్చుటలోనే తన దృష్టిని కల్గినది – అను భావము **"సాయుజ్యహృదయమ్"** అనుటచే ధ్వనించుచున్నది. త్రివర్గములు మోక్షముకన్న వేరని తలచిన, వానిని కోరుట సంభవమగును. అట్లుగాక, మోక్షమునకు అంగములుగా తలచినచో, మోక్షమే ప్రార్థింపబడును. చతుర్విధపురుషార్థముల ఇట్టి అపృథక్స్వరూపసాయుజ్యము ప్రణవముచే బోధింపబడుచున్నది. అట్లే, శ్రీరంగవిమానముచే కూడ తెలుపబడుచున్నది – అను విశేషముకూడ ఇచట ధ్వనించుచున్నది.

**"అసందేహోధ్యాసమ్"** అనునపుడు, ఓంకారమున భగవానుడు స్పష్టముగా దర్శింపబడుచున్నాడు. ప్రణవాత్మకమగు శ్రీరంగవిమానమునకూడ శ్రీరంగనాథుడు అందరికిని ప్రత్యక్షమైయున్నాడు. ప్రణవము శ్రుతిశతసమానర్థి. ఉపనిషత్తులు భగవానుని మనకు అత్యంత సన్నిహితముగా సాక్షాత్కరింపజేయును. ప్రణవపక్షమున, శ్రీరంగవిమానపక్షమున **'ఋద్ధి'** అనగా – భగవానుని అత్యంత సమీపమున దర్శింపచేయునట్టి మహిమ – అని ధ్వనించుచున్నది.

ఇందు వృత్తము శిఖరిణి, శ్లేషాలంకారము. అందమైన శిఖరములను కల్గిన శ్రీరంగవిమానమును శిఖరిణీవృత్తమున కవి వర్ణించుట మిక్కిలి ఉచితము కదా!

**నల్లని మేఘమును జయించు శ్రీరంగవిమానము మన కన్నులకు పులకలను కలిగిస్తున్నది**

**45. అపి ఫణిపతిభావాత్ శుభ్రమంత శ్శయాళోః**
**మరకతసుకుమారైః రంగభర్తు ర్మయూఖైః ।**
**సకలజలధిపాన శ్యామజీమూతజైత్రం**
**పులకయతి విమానం పావనం లోచనే నః ॥**

**ప్ర. అ. –** ఫణిపతిభావాత్ = (శ్రీరంగవిమానముయొక్క రూపము) ఆదిశేషుడై యుండుటచే, శుభ్రమ్ అపి = ఆ విమానము తెల్లనిదైనను, అంతః = తన లోపల, శయాళోః = పరుండియున్న, రంగభర్తుః = శ్రీరంగనాథునియొక్క, మరకతసుకుమారైః = మరకతమణియొక్క కాంతివలె అందమైన, మయూఖైః = కాంతులచే, సకల = సమస్తమైన, జలధి = సముద్రమును, పాన = త్రాగుటచే, శ్యామ = నల్లని, జీమూత = మేఘమును, జైత్రం = జయించునట్టి, పావనం = పవిత్రమైన, విమానం = శ్రీరంగవిమానము, నః = (మా) మనయొక్క, లోచనే = రెండు కన్నులకు, పులకయతి = గగుర్పాటును పొందించుచున్నది.

**వరివస్య :–** పూర్వశ్లోకమున శ్రీరంగవిమానము భగవానుని స్ఫుటముగా అభివ్యక్తము చేయుచున్నదని చెప్పబడినది. "**తత్ర సత్వం నిర్మలత్వాత్ ప్రకాశకమ్**" (భ. గీ. 14-6) (సత్వాదిమూడు గుణాలలో, సత్వగుణం నిర్మలమైనది అయినందువల్ల తత్త్వాలను, అవి ఉన్నవి ఉన్నట్లుగా ప్రకాశింపజేస్తుంది) అనునట్లు, సత్వమయమైనదే అట్టి ప్రకాశకత్వమును కల్గియుండును. ఈ సత్త్వము భాస్వరతను, తెల్లని వర్ణమును కల్గియుండును. కావున, శ్రీరంగవిమానము తెల్లగా యుండియుండవలెనుకదా! కాని, అది నల్లని వర్ణములో కన్పడుచున్నదే? అనినచో, అందులకు కవి సమాధానమును ఇందు చమత్కారముగా తెలుపుచున్నారు.

**"శెన్ఱాల్ కుడైయామ్, ఇరున్దాల్ శిఙ్గాసనమామ్" (ముదల్. తి. –53)** (భగవంతుడు, ప్రయాణానికి సిద్ధమైతే గొడుగుగా, కూర్చున్నప్పుడు

సింహాసనంగా మారి ఆదిశేషుడు భగవంతునకు సదా సేవ చేస్తాడు) అని ఆళ్వార్లు, **"నివాసశయ్యాసనపాదుకాంశుక"** (స్తో. ర. 40) (నివాసంగా, పడుకగా, ఆసనంగా, పాదుకలుగా, పీతాంబరముగా మారి, ఆదిశేషుడు భగవంతునకు నిత్యం అన్ని విధాల కైంకర్యాన్ని చేస్తాడు) అని యామునులు పల్కిన విధముగా, భగవానునకు సకలవిధ కైంకర్యములను చేయు ఆదిశేషుడు శ్రీరంగవిమానముగా అవతరించెను. కావున, ఆ విమానము సహజముగా తెల్లనిది అయినను, దాని అంతర్భాగమున మరకతమణివలె నీలవర్ణమును కల్గిన శ్రీరంగనాథుడు శయనించి యుండుటచే, ఆ స్వామి దివ్యదేహపు కాంతులు పైకి ప్రసరించుచున్నవి. కనుక, ఆ కాంతులతో కూడిన విమానము నీలవర్ణమును కల్గినదై యున్నది. అందుచే, శ్రీరంగవిమానము సముద్రములోని నీటిని అంతటిని త్రాగి, నల్లనిదైన కాలమేఘమునుకూడ తన కాంతితో జయించుచున్నది. ఇట్టి పరమ భోగ్యమైన విమానము మన కన్నులకు పులకాంకురములను కలిగించుచున్నది – అని శ్లోకములోని భావము

నేత్రములకు పులకలు కల్గుటకు ఆ నేత్రములకు కలిగిన ఆనందమే కారణము. ఆ ఆనందమునకు విమానముయొక్క శైత్యము, సౌకుమార్యము. నైల్యమును కారణములు. **"పావనమ్"** అనుట వలన విమానముయొక్క పాపహరత్వము, **"పులకయతి"** అనుటవలన భోగ్యత్వము చెప్పబడినవి. అనగా, ఈ రెండిటివలన అనిష్టనివర్తకత్వము, ఇష్టప్రాపకత్వము సూచింపబడినవి. కావున, విమానముయొక్క శరణ్యత్వపూర్తి తెలుపబడినది.

ఈ సందర్భమున ప్రస్తుతశ్లోక భావమునకు, చంపూ రామాయణములోని బాలకాండలో గల–

**"క్షీరాంభోధేః జఠర మభితో దేహభాసాం ప్రరోహైః**
**కాలోన్మీలత్కు వలయదళాద్వైత మాపాదయంతమ్, ఆతన్వానం భుజగశయనే"**

(పాలసముద్రం లోపల తన దివ్యదేహకాంతుల ప్రసరణలతో తన కాలానికి తగినట్లు వికసించిన నల్ల కలువల రేకులతో సామ్యాన్ని కలిగి

ఉండేవాడు, ఆదిశేషునిపై శయనించి ఉండేవాడు) (23) అను శ్లోక భావమునకు గల సామ్యము స్మరింపదగినది.

కన్నులకు విమానము పులకలు కల్గించుచున్నది– అని అనుట ఒక సరసమైన ఉక్తి. దీనిచే రెప్పవేయక చూచుట, ఆనందపారవశ్యముచే అశ్రువులు నిండుటవంటి కన్నులలో కల్గు మార్పులు మొదలైనవి సూచింప బడినది

ఆళ్వార్లు పలువురు భగవానుని మరకతమణితో పోల్చిరి. **"మేని మరకతమే కాట్టమ్"** (మూన్ఱామ్, తి. 87) (భగవంతుని తిరుమేని మరకతమణిని స్మరింపజేస్తుంది), అని పేయాళ్వార్లు, **"మైమ్మాన మరతకత్తై"** (పెరి. తి. 5-6-1) అని తిరుమజ్గై ఆళ్వార్లు **"మరకత వణ్ణన్"** అని (5-1-10) (మరకతమణివర్ణుడు) అని పెరియాళ్వార్లు భగవానుని స్తుతించుట మొదలైన దివ్యసూరుల సూక్తులు ఇచట స్మర్తవ్యములు. **"ఫణిపతిభోగాత్"** అను పాఠాంతరము మొదటి పాదమున కన్పించుచున్నది. భోగమనగా, పాముశరీరము. ఇందు అలంకారము ఉత్ప్రేక్ష, వృత్తము మాలిని.

## నృసింహస్వామిని (మేట్టழకియ శింగర్) సేవిస్తాను

**46. వ్యాపి రూప మపి గోష్పదయిత్వా**
**భక్తవత్సలతయోజ్ఝితవేలమ్ ।**
**తద్ద్విషంతపనృకేసరిరూపం**
**గోపురోపరి విజృంభిత మీడే ।**

**ప్ర. అ. –** వ్యాపి = వ్యాపించియుండు (గొప్పదైన), రూపమ్+అపి = శరీరమును కూడ, గోష్పదయిత్వా = (ఆవుపాదమంత చిన్నదిగా) సంకోచింపచేసి, గోపుర+ఉపరి = గోపురముపై, విజృంభితం = ప్రకాశించునది, భక్తవత్సలతయా = భక్తుడైన ప్రహ్లాదునిపై గల ప్రేమచే, ఉజ్ఝితవేలమ్ = అవధిని దాటి అవతరించినది, తత్ = ఆ (విలక్షణమైన), ద్విషంతప = భాగవత శత్రువగు

హిరణ్యకశిపునకు తాపమును కలుగచేయు, నృకేసరిరూపం = నరసింహరూపమును, ఈడే = స్తుతింతును.

**వరివస్య :–** శ్రీరంగవిమానమునకు ఉత్తరభాగమున గల గోపురశిఖరముపై విరాజిల్లు నృసింహమూర్తిని రెండు శ్లోకములలో భట్టరు స్తుతించుచున్నారు. ఈ మూర్తికి సంప్రదాయమున "**మేట్టఴకియశిఙ్గర్**" అని పేరు. "**మేడు**" అనగా మిట్ట, ఎత్తైన ప్రదేశమని అర్థము. "**ఉద్బాహుసుందరుడ**" ను పేరు ఈ స్వామికి ఉన్నట్లు శ్రీరామానుజాచార్యవ్యాఖ్యలో కలదు. అవతారసమయమున ఆకాశమంత ఎత్తుకు విస్తరించిన దివ్యమంగళ రూపమును గోష్పదమంత చిన్నదిగా చేసికొని, గోపురముపై ప్రకాశించువాడును, గర్భవాసము చేసి పుట్టుట, శరీరాంగములన్ని ఏకజాతీయములై యుండుటవంటి నియమములను పరమభక్తుడైన ప్రహ్లాదునిపై గల వాత్సల్యాతిశయము వలన అతిక్రమించి, విలక్షణమైన (నృసింహ) రూపమును దాల్చినవాడును, (భాగవత) విరోధి అగు హిరణ్యకశిపుని వధించినవాడగు నృసింహస్వామిని స్తుతింతును – అని శ్లోకభావము.

నృసింహానుష్టుభ్ మంత్రములో "**ఉగ్రం వీరం మహావిష్ణుమ్**" అని ఉండుటచే, ఆ అవతారమును వర్ణించు ఈ సందర్భమున పురాణములో "**దివి స్పృశంతమ్**" అని వర్ణింపబడుటచే, భట్టరు "**వ్యాపి రూపమ్**" అని ఇక్కడ స్తుతించిరి. మాఘుడును నృసింహావతారాన్ని ఎత్తిన భగవానుని "**నృసింహ సైంహీ మతనుం తనుమ్**" (1–47) (చాలా గొప్ప రూపాన్ని కలిగినవాడు) అని స్తుతించెనుకడా! గోష్పదమనగా, గోవు పాదము. అది పవిత్రమైనదై, మిక్కిలి చిన్నదిగా ఉండును. కావున, స్వామి రూపమున కిది ఇచట ఉదాహరణముగా చెప్పబడినది. రామకృష్ణాద్యవతారములలో భగవానుడు గర్భవాసమొనర్చి అవతరించుట, ఏకజాతీయమైన అవయవ సంస్థానమును కల్గియుండుటవంటి కొన్ని మర్యాదలను పాటించెను. కాని, నృసింహావతారమున ఆ మర్యాదలను అన్నిటిని అతిక్రమించి, కంఠమువరకు మానవరూపమును, శిరస్సున

సింహరూపమును ధరించెను. ఇట్లు అతిక్రమించుటకు భగవంతునకు కల భక్తవాత్సల్యమే కారణము. "**భక్తవత్సలతయా వ్యాపి రూప మపి గోష్పదయిత్వా**" (భక్తుడైన ప్రహ్లాదుని పై ఉండే వాత్సల్యం కారణంగా చాలా పెద్దదైన తన రూపాన్ని సైతం ఆవు పాదం అంత చిన్నదిగా చేసుకొని) అనునపుడు "**భక్తవత్సలతయా**" అను పదమును వెనుకకుకూడ అన్వయించుటవలన, భగవానుడు రూపమును సంకోచింప చేసికొనుటకు భక్తవాత్సల్యమే కారణమను విశేషము వ్యక్తమగును.

"**ఉజ్ఝితవేలమ్**" అను విశేషణమువలన నృసింహస్వామికి సముద్ర సామ్యముతో పాటు ఆధిక్యమును స్ఫురించుచున్నవి. సముద్రము తన చెలియలి కట్టను దాటి రాదు కదా. భగవానుని అవతారములకన్నిటికిని వాత్సల్యమే కారణమైన అసుర అర్భకుడగు, ప్రహ్లాదుని కాచుటకై అవతరించిన నృసింహావతారమునకు భక్తవాత్సల్యము కారణమగుట మిక్కిలి సమంజసము కదా! అర్భకవిషయమైన కృపయే కదా వాత్సల్యము. "***శీఱ్ఱత్తోడు అరుళ్ పెఱ్ఱ***" (హిరణ్యకశిపునిపై కోపంతో పాటు, తన భక్తుడైన ప్రహ్లాదునిపై కృపను కలిగినవాడై) అనుచు నమ్మాళ్వార్లు నృసింహావతారమును స్తుతించిరి. స్వామి కోపమునకు హిరణ్యుడు విషయము కాగా, కరుణకు భక్తుడగు ప్రహ్లాదుడు విషయమయ్యెను.

కవి ప్రస్తుతశ్లోకమున "**భక్తవత్సలతయా ఉజ్ఝితవేలమ్**" (భక్తుని పై ఉండే వాత్సల్యంవల్ల తన అవధిని అతిక్రమించి) అనుటచే భక్తవాత్సల్యమును, "**తద్విషంతప నృకేసరిరూపమ్**" అనుటచే, కోపమును వర్ణించుట పై పాశురమును అనువదించుటయే – అని చెప్పనగును. మఱియు, పై విశేషణములు వరుసగా

"**పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతామ్**" (భ. గీ. 4–8).

(మంచివారికి పరిపూర్ణమైన రక్షణ కలిగించడంకోసం, చెడ్డవారిని సమూలంగా లేకుండా చేయడం కోసం) అను అవతారరహస్యమును సూచించుచున్నవనియు చెప్పవచ్చును.

వేంకటాచార్యవ్యాఖ్యానము **"తద్విషంతప"** అను పదమును సమస్తపదముగా గొని, తచ్ఛబ్దమునకు ప్రహ్లాదుడను అర్థమును చూపెను. కాని, శ్రీ. ప్ర భ. అణ్ణంగరాచార్యస్వామి వ్యాఖ్యానమున **'తత్'** అను శబ్దము నృసింహరూపమును పరామర్శించునట్లుగా చూపబడినది. ఆ అన్వయమే సరసము, ఆళ్వారుల అనుభవమునకు అనుగుణము అగుటచే, ప్రస్తుత వ్యాఖ్యానమున అదే గైకొనబడినది. ఈ అన్వయమున **"తత్, ద్విషంతప"** అను పదములు రెండును వ్యస్తములు, "నారసింహవపుః, శ్రీమాన్" అను విష్ణుసహస్రనామసూక్తినిబట్టి, **"అழకియాన్ తానే అరియురువన్ తానే"** (నాన్ముగన్. తి. 22.) (అందమైనవాడు అతడే, నృసింహ రూపాన్ని ధరించినవాడు అతడే) అను తిరుమழிశై ప్పిరాన్ సూక్తినిబట్టి అణ్ణంగరాచార్యస్వామివారి యోజన సరసము, అనగా, నృసింహస్వామిరూపము పరమవిలక్షణమైనదని దీని తాత్పర్యము. శ్లోకములో ఈ అర్థము **"తత్"** అనే సర్వనామపదము వల్ల ఏర్పడును. సర్వనామ శబ్దములకు ఆ యా సందర్భములలో వక్తకు కల వివక్షనుబట్టి విశేషమైన అర్థమును స్మరింపజేయు శక్తి కలదు కదా. వేంకటాచార్యవ్యాఖ్యలోని యోజన **"తేన త్వం వికృతి మర్భకనిర్భజనాదగాః"** (వరద స్తవ 68.) (కుర్రవాడైన ప్రహ్లాదుని హిరణ్యకశిపుడు బాధించిన కారణంచేత, నీవు దానిని సహించలేక, అతనిని శిక్షించడంకోసం నృసింహరూపంలో అవతరించావు) అను కూరేశుల సూక్తికి, "వరత్తాల్ —— ఓరరియాయ్ నీ యిడన్ద తూణ్" (90) (చీల్చదగినవాడైన శత్రువై, నీకు ఎదురు నిలిచి, యుద్ధాన్ని చేయదగిన బలాన్ని కలిగినవాడై ఉండే హిరణ్యకశిపుని శరీరాన్ని సాటి లేని నరసింహరూపివై, నీ బలంతో నీవు చీల్చినది ఎందుకంటే, బ్రహ్మ మొదలైన దేవతలు అతనికి ఇచ్చిన వరాలవల్ల కలిగిన అతడు

తన బలాన్ని గొప్పగా భావించి, అహంకరించి, తన తలతో నీ పాదాలకు నమస్కరించలేదు – అనే కారణం చేతనా? కాదు, కాదు) అను పొయ్ కై ఆళ్వారుల సూక్తికి అనుగుణము. "**ద్విషన్తప**" అను ప్రయోగము తర్వాతి శ్లోకములోని జ్యోతిరూపరూపణమునకు అనుగుణముకూడ. తపింపజేసే గుణం జ్యోతిస్సుకు కలదు కదా.

ఇందు వృత్తము స్వాగత, "**స్వాగతేతి రసభాత్ గురుయుగ్మమ్**" అని దీని లక్షణము.

## గోపుర పై భాగములోని నృసింహస్వామి కట్టెదుట సాక్షాత్కరిస్తున్నాడు

**47. అహ మల మవలంబః సీదతా మిత్యజస్రం**
**నివసదుపరిభాగే గోపురం రంగధామ్నః ।**
**క్వచన నృపరిపాటీ వాసితం క్వాపి సింహ–**
**క్రమసురభిత మేకం జ్యోతి రగ్రే చకాస్తి ॥**

**ప్ర. అ. –** సీదతాం = (సంసారమున) బాధపడువారికి, అహం = నేను, అలం = తగిన, అవలంబః = ఆధారమును (చేతి కర్రను), ఇతి = అని తెలుపునట్లు, రంగధామ్నః = శ్రీరంగమందిరముయొక్క, గోపురమ్ ఉపరిభాగే = గోపురమునకు పై భాగమున, అజస్రం = ఎల్లప్పుడు, నివసత్ = నివసించునట్టిది, క్వచన = (కంఠమున క్రిందదగు) ఒక భాగమున, నృపరిపాటీ = మానవశరీరక్రమముతో, వాసితం = సువాసితము, క్వ+ అపి = మఱియు వేరొక భాగమున, సింహ = సింహముయొక్క, క్రమసురభితం = శరీరక్రమముతో పరిమిళితము లగు, ఏకం = అద్వితీయమైన, జ్యోతిః = జ్యోతి, అగ్రే = మన కట్టెదుట, చకాస్తి = ప్రకాశించుచున్నది.

**వరివస్య :–** మిగిలిన భగవన్మూర్తులవలె భూమిపై అధివసింపక, ఎల్లప్పుడును కొండలు, గుట్టలు మొదలైన ఉన్నతమైన స్థలములలో నివసించు

నృసింహమూర్తిని దర్శించినపుడు కల్గిన భావమును కవి ఇందు అందమైన ఉత్ప్రేక్షతో వ్యక్తము చేయుచున్నారు.

**"ఆవారార్ తుణై యెన్ఱు అలైనీర్ కడలుళ్ అழுన్దుమ్ నావాయ్ పోల్ పిఱవిక్కడలుళ్ అన్ఱు నాన్ తుళఙ్గ"** (తి. వా. 5-1-9) (నాకు ఎవరు శరణం అవుతారు? – అని, కెరటాలు ఎగసి పడి లేచే సముద్రంలో మునిగిపోయే నావవలె, సంసార సముద్రంలో ఆనాడు నేను క్లేశపడుతూ ఉండగా) అని నమ్మాళ్వార్లు తిరువాయ్ మొళి దివ్యప్రబంధమున పల్కిన రీతిలో, సంసార సముద్రమున మునిగియుండు జీవుడు తనను రక్షింపగలవాడెవ్వడో తెలియక, దుఃఖించుచుండును. అట్టి సంసారులకందరకు నేను తగిన ఆలంబనమై యున్నాను – అని అందరకు తెలియజెప్పువానివలె, శ్రీరంగ మందిరమున గోపురపైభాగమున అధివసించియున్నవాడును, కంఠమునకు క్రింద మానవరూపముతో, పైన సింహరూపముతో **"నరఙ్కలన్ద శిఙ్గమాయ్"** (ఇరణ్డామ్. తి. -84) (మానవరూపం కలసిన సింహమై) అనునట్లు నృసింహవేషమును దాల్చినవాడగు పరంజ్యోతిస్స్వరూపము కట్టెదుట విరాజిల్లుచున్నది– అని భావము.

ఇతరులను ఉద్ధరింపగోరువాడు తాను ఉన్నతస్థానమున నుండిననే ఆ పనిని చేయుట అతనికి సాధ్యమగును. నరసింహస్వామి ఆలయములన్నియు కొండ, గుట్టవంటి ఉన్నత ప్రదేశములలో నుండుటచే, మిగిలిన మూర్తుల కన్న నరసింహమూర్తికి భక్తులనుద్ధరించుటలో గల శక్తి విశేషము స్పష్టము. కావున **"అహ మలం అవలంబః"** (నేను పర్యాప్తమైన అవలంబాన్ని) అను మాట నృసింహస్వామి విషయమున మిగుల అర్థవంతము. **"వాసితం, సురభితమ్"** అను పదములు **"యః సర్వగంధః"** (ఛాందో. 3-14-2) (అన్ని సుగంధాలను కలిగినవాడు ఎవడో) అను ఉపనిషద్వాక్యమును జ్ఞప్తికి తెచ్చును. భగవానుని దివ్యమంగళ విగ్రహము పరిమళప్రచురమై యుండును కదా! సింహము జూలు ప్రత్యేకమైన సువాసనను కల్గియుండుననియు చెప్పబడుచున్నది. **"వేరిమయిర్**

**పొఙ్గ**" (23) (సువాసనను వెదజల్లే సటలు ఉప్పొంగగా) అని గోదాదేవి ఈ విషయమును తిరుప్పావైలో ప్రస్తావించిరి కదా! కావున, అట్టి పరిమళభరితములైన సటలతో సురభితమైన దివ్యదేహమును కలవాడనియు చెప్పనగును.

ఉత్తరాశతకములో భగవదవతారములను స్తుతించు సందర్భమున, నృసింహావతారమున స్తుతించుచు, "**సితాక్షీరన్యాయేన సంగమితాంగకమ్**" (పాలు కలకండ కలసినప్పుడు మధురంగా ఉండే రీతిలో మానవ సింహారూపాలు మధురంగా కలసిన అంగములను కలిగిన రూపం) అని అంటూ రసవత్పదార్థముల కలయికతో పోల్చారు. ఇక్కడ రెండు సువాసనల కలయికతో ఉత్ప్రేక్షించారు

"**జ్యోతిః**" అను పదము నృసింహమూలమంత్రములోని "**జ్వలంతం సర్వతోముఖమ్**" అను విశేషణముయొక్క భావమును సూచించుచున్నది. నృసింహమూర్తినిగూర్చి "**అవలంబః**" అను శబ్దప్రయోగము "**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్**" (లక్ష్మీనరసింహస్వామీ! నాకు నీ చేయూతను ఇవ్వాలి) అను శంకరుల సూక్తిని స్మరింపజేయుచున్నది. పూర్వశ్లోకములోని "**గోపురోపరి విజృంభితమ్**" అను విశేషణము, ఇచట "**అజస్రమ్**", "**గోపురమ్ ఉపరిభాగే**" అను ప్రయోగములను నృసింహావతారసందర్భములోని రూపము కంటె గోపురశిఖరము పైనున్న, అర్చామూర్తి అయిన నృసింహమూర్తికి గల వైశిష్ట్యమును తెలుపుతున్నవి. "**నృపరిపాటీవాసితమ్**" అనునపుడు 'వాసిత' శబ్దమునకు హృదయమున వాసనారూప సంస్కారమును కలుగజేసినది – అనియు అర్థము చెప్పవచ్చును. "**నృహరిపరిపాట్యా వాసితమ్**" అను పాఠాంతరము వాధూల వీరరాఘవాచార్యస్వామివ్యాఖ్యలో కలదు. "**గోపురోపరి**" అనునపుడు షష్ఠీసమాససాధుత్వము "**తదుపరీతి మహాభాష్యనిర్దేశాత్ సాధు**" అని ఆ వ్యాఖ్యలోనే వివరింపబడినది. ఇందును వృత్తము మాలినియే.

**గురుపరంపరను సేవిస్తాను**

**48. సంశోధ్య పావనమనోహరదృష్టిపాతైః
దేవాయ మామపి నివేదయతాం గురూణామ్ ।
సవ్యోత్తరే భగవతో ఽ స్య కటాక్షవీక్షా––
పంక్తిం ప్రపద్య పరితః పరితో భవేయమ్ ॥**

**ప్ర. అ. –** మామ్ అపి = నన్ను కూడ, పావన = పవిత్రములైన, మనోహర = అందమైన, దృష్టిపాతైః = కటాక్షములతో, సంశోధ్య = పరిశుద్ధుని చేసి, దేవాయ = భగవానునకు, నివేదయతాం = సమర్పించువారు, అస్య = ఈ, భగవతః = భగవానునకు (శ్రీరంగనాథునకు), సవ్య+ఉత్తరే = ఎడమవైపు ఉత్తర దిక్కున (వేంచేసియున్న), గురూణాం = ఆచార్యులయొక్క, కటాక్షవీక్షా = కంటి చూపులయొక్క, పంక్తిం = వరుసను, ప్రపద్య = శరణముగా చేసికొని, పరితః పరితః భవేయమ్ = (ఆ ఆచార్యులకు) మాటి మాటికి ప్రదక్షిణము చేయుదును.

**వరివస్య :–** ఈ శ్లోకమున ప్రస్తుతింపబడు గురుపరంపర భట్టరుకాలము నాటికి శ్రీరంగదేవాలయమున ప్రతిష్ఠింపబడలేదు. కానీ, శ్రీరామానుజులు నిత్యగ్రంథమున పీఠార్చనావిధానము పిదప "**యోగపీఠస్య పశ్చిమోత్తరదిగ్భాగే – 'ఓమ్ అస్మద్గురుభ్యో నమః' – ఇతి గురూన్ గంధపుష్పధూపదీపై రభ్యర్చ్య, ప్రణమ్య, అనుజ్ఞాప్య, భగవద్యాగ మారభేత**" (యోగపీఠానికి వాయవ్య దిశలో "**ఓం అస్మద్గురుభ్యోనమః**" అని అంటూ ఆచార్యులను గంధపుష్ప ధూప దీపాలతో అర్చించి, నమస్కరించి, వారి అనుజ్ఞను తీసుకొని, భగవంతుని ఆరాధనను ఆరంభించాలి) అనుచు గురుపరంపరాసమారాధనమును తెలుపుటనుబట్టి, ఆ క్రమములోనే భట్టరు ఈ శ్లోకమున గురుపరంపరావందనమును చేయుచున్నారు – అని చెప్పనగును.

దీనివలన ఈ స్తుతిలో భగవదర్చనావిధానము కూడా అంతర్గతంగా తెలుపబడినదని ఏర్పడుతున్నది. ఈ విషయము ఇంకను రాబోయే కొన్ని

శ్లోకాలను గమనించిన తెలియును కూడా. భగవంతుని ఆరాధన క్రమములో ఆచార్యుల స్థానము ఎక్కడ ఉండాలో, ఆ విషయాన్ని కూడా ఈ శ్లోకమ్ మనకు తెలియజేస్తున్నది.

భగవత్కృపకు లక్ష్యమగుటకు ఏ మాత్రము యోగ్యత లేని, నీచుడైన నన్ను కూడ తమ పరమపావనములైన, మనోహరములైన కటాక్షములకు పాత్రంగా చేసి, పరిశుద్ధుని గావించి, భగవానునకు నివేదించువారు, ఆ స్వామికి ఎడమ ప్రక్కన ఉత్తర దిశలో వేంచేసియుండువారగు ఆచార్యులకు పలుమార్లు ప్రదక్షిణము చేసి, వారి దయనే ఆలంబనముగా గొని, ఉజ్జీవింతును – అని శ్లోకభావము.

ఈ శ్లోకమున "**వేదమ్ వల్లార్గళై క్కొణ్డు విణ్ణోర్ పెరుమాన్ తిరుప్పాదమ్ పణిన్దు**" (0. 3. 4–6–8) (వేదార్థనిర్ణయసమర్థులైన ఆచార్యులను పురస్కరించుకొని, పరమపదనాథుని శ్రీచరణాలను ఆశ్రయించి) అను నమాళ్వార్ల శ్రీసూక్తియొక్క అర్థము అనుసంధింపబడినది. మరియు, గురుపరంపరానుసంధానము, వారి ఆజ్ఞాపూర్వకముగా భగవదారాధనము చేయుట కర్తవ్యము – అను అంశముకూడ తెలుపబడినది. భగవానునకు నివేదించు వస్తువును బాగుగా శోధించి, నివేదించుట యుక్తము. అపుడే భగవానునకు నివేదనార్హములగును. అట్లే, ఆచార్యులు తాము నివేదించు ఆత్మహవిస్సునుకూడ తమ పావనములైన చూపులతో శోధించి, భగవన్నివేదనమును చేయుదురు – అను భావము మొదటి రెండు పాదములలో ధ్వనించుచున్నది. భగవానుడను జ్యోతియందు ఆత్మహవిస్సును ఆచార్యులు అను హోతలు సమర్పించుచున్నారు – అనుటచే ఇచట యజ్ఞసామ్యము ధ్వనించుచున్నది. ఆత్మ అను హవిస్సును భగవంతునకు సమర్పించు ప్రపత్తిని ఉపనిషత్తు కూడా గొప్ప యజ్ఞముగా "**తస్యైవం విదుషః**" అనే సూక్తిలో రూపిస్తూ పలికినది. "**నివేదయతామ్**" అను ప్రయోగము. "**నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్**" (రా. యు. 17–15) (శ్రీరాముని శరణాగతి

చేయాలని వచ్చిన నన్నుగూర్చి మీరు త్వరగా ఆ శ్రీరామునకు నివేదించండి) అను శ్రీరామాయణములోని విభీషణోక్తిని తలపింపజేయుచున్నది. అట్లే, "**దేవాయ**" అనుట "**తం దేవ మాత్మబుద్ధిప్రకాశమ్**" (శ్వేత, 6–18) (ఆత్మజ్ఞానాన్ని ప్రకాశింప చేసే ఆ దేవుని) అను ప్రపత్తిపరమైన శ్రుతివాక్యమును గుర్తుకు తెచ్చుచున్నది. "**గురుపంక్తిం ప్రపద్య**" అనుటకు బదులు "**కటాక్షవీక్షాపంక్తిం ప్రపద్య**" అనుట కవియొక్క ఉక్తిచమత్కారము, "**పరితః పరితః ప్రపద్య భవేయమ్**" అనునపుడు గల ల్యబంతమువలన గురుప్రపత్తిని చేసిన పిమ్మటనే ఆత్మవస్తువు సత్తను పొందును – అను భావము ధ్వనించుచున్నది.

"**అస్య జ్యోతిషః– జ్యోతిషి ప్రత్యగ్రూపహవిషు ఋత్విగ్భిః హోమః ఉచితః. ఏతదుచ్యతే 'దేవాయ' ఇతి. సవ్యోత్తరే – బ్రహ్మా దక్షిణతో బ్రహ్మోత్తరతః– ఇతివత్**" అను భావాంతరము గోపాలాచార్య వ్యాఖ్యలో చూపబడినది. అనగా, నృసింహమూర్తి అను జ్యోతిస్సుయందు ఆత్మ అను హవిస్సును హోమమును చేయు ఋత్విజులు గురువులు. (ఆళ్వార్లు). వారు భగవానునకు ఉత్తర దక్షిణ దిశలలో అధివసించియుందురు – అని భావము. ఈ అన్వయమున సవ్యశబ్దమునకు దక్షిణము – అనియు అర్థము. సవ్యశబ్దమునకు "ఎడమప్రక్క" అని అనుటతో పాటు, కుడిప్రక్క – అను అర్థమును కలదు కదా! "**పరితః ప్రపదనస్య పరితో భవనం ఫలం. న భవనమాత్రమ్, తం సర్వగం సర్వతః ప్రాప్య ధీరాః కృతాత్మానః సర్వ మేవా విశంతి, ఇత్యాదికం భావ్యమ్**" అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్య, "**పరితః ప్రపద్య**" అనునపుడు "**పరిప్రశ్నేన**", "**పరిపప్రచ్ఛ**" (రా. బా. 1–1) అనునట్లు గురువిషయమున పరితః ప్రపదనము సూచింపబడినది. ఇందు వృత్తము వసంతతిలక.

## చంద్రపుష్కరిణీతీరములోని పున్నాగ తల్లజాన్ని స్తుతిస్తాను

**49. శ్రీరంగరాజకరనమ్రితశాఖికాభ్యో**
**లక్ష్మ్యా స్వహస్తకలితశ్రవణావతంసమ్ ।**

**పున్నాగతల్లజ మజస్రసహస్రగీతి–**
**సేకోత్థదివ్యనిజసౌరభ మామనామః ॥**

**ప్ర. అ. –** శ్రీరంగరాజ = శ్రీరంగనాథునియొక్క, కర = చేతులతో, నమిత = క్రిందకు వంచబడిన, శాఖికాభ్యః = శాఖలనుండి, లక్ష్మ్యా = శ్రీరంగనాయకిచే, స్వ = తనయొక్క, హస్త = చేతులతో, కలిత = త్రుంచబడిన, శ్రవణ+ అవతంసం = కర్ణభూషణముగా గల (చేసికొనబడిన) పుష్పము కల్గినది, అజస్ర = ఎల్లప్పుడు ఉండు, సహస్రగీతి = వేయి పాశురములను కల్గిన తిరువాయ్ మొళి దివ్యప్రబంధరసముయొక్క, సేక = సేచనముచే (తడపుటచే), ఉత్థ – = పుట్టిన, దివ్య = అప్రాకృతమైన, నిజ = తనయొక్క, సౌరభం = సువాసనను కల్గినది అగు, పున్నాగతల్లజం = గొప్ప పొన్నచెట్టును, ఆమనామః = స్తుతింతుము.

**వరివస్య :–** చంద్రపుష్కరిణీ తీరమున గల పొన్నచెట్టును భట్టరు ఈ శ్లోకమున స్తుతించుచున్నారు. వైష్ణవాచార్యులందరు (భట్టరు తరువాతి కాలమువారు కూడ) ఈ పొన్నచెట్టు క్రింద సమావేశమై, ఉభయవేదాంతరస్య రహస్యార్థములను అనుభవించుచు, చర్చించుకొనుచుండిరని, తిరువాయ్ మొళి దివ్యప్రబంధముయొక్క అధ్యాపనము, అందలి స్వారస్య విశేషముల అనుసంధానములను ఇచటనే చేయుచుండిరని ప్రసిద్ధి కలదు. వేదాంతదేశికులు యతిరాజసప్తతిలో "**యస్య సారస్వతం స్రోతః వకుళామోదవాసితమ్**" (ఏ నమ్మాళ్వారుల సాహిత్యము వకుళ పూల సువాసనతో పరిమళించినదో) అని ఈ విషయమును తెలియజేసిరి. అట్టి మహనీయమైన పొన్నచెట్టును కవి ఈ శ్లోకమున కీర్తించుచున్నారు.

శ్రీరంగనాథుడు, శ్రీరంగనాయకి లీలావిహారములను చేయుచు, చంద్రపుష్కరిణి వద్దకు వచ్చినపుడు, శ్రీరంగనాయకి అచటి పొన్నచెట్టు పూలను కర్ణాభరణములుగా చేసికొనగోరును. అపుడు శ్రీరంగనాథుడు తన చేతులతో పొన్నచెట్టు కొమ్మలను క్రిందకు వంచగా, దేవి ఆ చెట్టు పూలను త్రుంచుకొని, తన కోరికను తీర్చుకొనును, ఇట్లు ఆ పొన్నచెట్టు దివ్యదంపతుల లీలారసమునకు

ఉపయోగపడునట్టి గొప్ప భాగ్యమును పొందినది. భట్టరు, వారికి ముందు గల ఆచార్యులు అందరు, ఆ పొన్నచెట్టు నీడలోనే వేదవేదాంతార్థములను, తిరువాయ్ మొళి రహస్యార్థములను సంభాషించుకొనుచుండిరి. కావున, వారి ప్రవచనముల సారముచే ఆ పొన్నచెట్టు పూలకు అలౌకికమైన సౌరభము ప్రాప్తించెను. ఇట్లు దివ్యదంపతులతో, దివ్యసూరులతో, పూర్వాచార్యులతో గాఢమైన సంబంధమును కల్గిన పొన్నచెట్టును భక్తితో స్తుతింతును – అని శ్లోకభావము.

మొదటి పాదములోని "**శాఖికాభ్యః**" అను రూపమును "**క్రియార్థోపపదస్య**" (2-3-14) అను సూత్రముప్రకారము, చతుర్థీవిభక్త్యంతముగా గ్రహించి, "శాఖలను కృతార్థములను చేయుటకొరకు" అను అర్థమును చెప్పవచ్చును. "**స్వహస్తకలితశ్రవణావతంసమ్**" అనునపుడు స్వశబ్దమునకు లక్ష్మి అను అర్థమును కాక, భగవానుడు – అను అర్థమును గ్రహించినచో, శ్రీరంగనాథుడే స్వయముగా పూలను కోసి, శ్రీరంగనాయకి కర్ణములకు అలంకరించెనను భావము ఏర్పడును. అపుడు "**లక్ష్మ్యా**" అను షష్ఠ్యంతరూపముగా గ్రహింపవలెను. అట్లయినను, శ్రవణశబ్దము సాపేక్షమగుటచే సమాసఘటితమగుట ఎట్లు తగును? అనినచో, "**నిత్యసాపేక్షం సమస్యతే**" అను వచనమువలన సమాసఘటితమైనను దోషము లేదు – అను ఈ వివరణమంతయు శ్రీరామానుజాచార్యవ్యాఖ్యలో కలదు. కానీ, దీనికంటే మొదటి అన్వయమే సరసము. ఈ విషయము తరువాత సమర్థింపబడును.

"**అశ్వత్థః సోమసవనః**" అని స్తుతింపబడు పరమపదమున గల అశ్వత్థవృక్షము వేదమున వర్ణింపబడినది. ఇచట పున్నాగవృక్షము వర్ణింపబడుచున్నది. పరమపదములోని అశ్వత్థము పూలు పూయదు. కాని, శ్రీరంగదివ్యాలయములోని పున్నాగము లక్ష్మీదేవికి కర్ణాభరణములుగ ఉపయోగింపదగిన పూలను పూచును. ఇది ఇచట విశేషము. ఈ పున్నాగ వృక్షమునకు గల అనితర సాధారణమైన భాగ్యము. పరమపదమున

అశ్వత్థవృక్షసమీపమున సామవేదగానము చేయబడునట్లే, పున్నాగవృక్షము చెంత సామవేదప్రతిరూపముగ చెప్పబడు సహస్రగీతి దివ్యప్రబంధము గానము చేయబడును.

పరత్వప్రధానుడైన వైకుంఠములోని భగవానుడు తన పరత్వమును ప్రధానముగా కీర్తించు వేదముల అనుసంధానమును, అందులోను, వేదాలలో "**వేదానాం సామవేదో ఽ స్మి**" అని భగవంతుని ప్రతిరూపంగా కీర్తింపబడే సామవేదాన్ని మరింత ఆసక్తితో వింటాడు. వేదం కూడా, "**ఏతత్ సామ గాయన్ ఆస్తే**" అని ముక్తపురుషుని సామవేద గానాన్నే ప్రస్తుతించింది. ఆ సామవేదగానంతో అక్కడ ఉండే అశ్వత్థ వృక్షం సంస్కృతమైనది. పరమపదంలో ఉండే భగవానుడే సౌలభ్యగుణ ప్రధానుడై, శ్రీరంగనాథుని రూపంలో శ్రీ. రంగంలో వెలిశాడు. వేదం కూడా ఆ స్వామికి అనుగుణంగానే అనుసరిస్తూ, భూమిలో తన సౌలభ్య గుణాన్ని ప్రదర్శిస్తూ, భగవానుని సౌలభ్య గుణాన్ని వర్ణిస్తూ, ద్రావిడ వేదంగా అవతరించింది. అందువల్ల సౌలభ్య గుణపూర్ణుడైన అర్చామూర్తి రూపంలో ఉండే పరమపదనాథుడైన శ్రీరంగనాథుడు తన సౌలభ్యగుణాన్ని ప్రధానంగా కీర్తించే ద్రావిడవేదాన్ని వినడంలో, అందులోనూ, సామవేద సమానమైన సహస్రగీతిని వినడంలో ఎక్కువ ఉత్సుకతను చూపిస్తాడు. శ్రీరంగ దివ్యాలయంలో ఉండే పున్నాగ వృక్షం ఆ ద్రావిడ వేదంలో ప్రధానమైన, సహస్రగీతి గానరసంతో సంస్కృతం కావడం యుక్తం కదా. అంతే కాకుండా, "**వేదానాం సామవేదోస్మి**" అని స్వయముగా భగవానుడు తాను సామవేద స్వరూపుడని అనడం ద్వారా, వేదాలన్నిటిలో తనకు సామవేదం మిక్కిలి అభిమతమైనదని తెలియజేశాడు అటువంటి సామవేదమును శ్రవణము చేయడములో భగవంతునకు అధికమైన ఆసక్తి ఉందును కదా. అందువలన ఆ సామవేద ప్రతిరూపమైన తిరువాయ్ మొళి దివ్య ప్రబంధములోని అర్థములను ప్రచురముగా పూర్వాచార్యులు శ్రీరంగనాథుని సన్నిధిలో అనుసంధించుకొనుచుండిరి.

లక్ష్మీదేవి తుంగస్తనభారనత, కనుక, భగవానుని కంటే సహజముగ తక్కువ ఔన్నత్యమును కల్గియుండును. ఆమె కరస్పర్శచే వృక్షమునకు గొప్ప దోహదము కలుగును. శ్రీరంగనాథుడు స్వయముగా ఆ చెట్టుపూలను కోసినచో, ఆమె కరస్పర్శ వృక్షమునకు కలుగదు. కావున, శ్రీరంగనాథుడు కొమ్మను వంచగా, లక్ష్మి స్వయముగా పూలను కోసి, అలంకరించుకొనును. అపుడు వారిద్దరి కరస్పర్శ పున్నాగవృక్షమునకు కలుగును. ఇట్లు ఆ దివ్యదంపతుల ఉభయుల కరస్పర్శచే పున్నాగకు కల్గిన ప్రీతి ద్విగుణీకృతమగును. "**గంధద్వార**" అగు లక్ష్మీదేవియొక్క కరస్పర్శవలన పూలకు దివ్యపరిమళము కలుగును. "**స్వహస్తకలిత**" అనునపుడు "**స్వహస్త**" అను విశేషణమువలన లక్ష్మి తన చేతులతో పూలను కోసి, అలంకరించుకొనును –అను భావము వ్యక్తమగుటచే, ఆ పూల పట్ల లక్ష్మికి కల ఆదరము ఎంత గొప్పదో వ్యక్తమగుచున్నది. ఆ పూలు భగవానుని చేతితో వంచబడిన కొమ్మలనుండి కోయబడినవి. గాథాశ్రవణభాగ్యమును కల్గినవగుటచే, అట్టి ఆదరమును ఆ పూవుపట్ల లక్ష్మి కల్గియుండుట న్యాయమే.

వకుళాభరణులని కీర్తింపబడు నమ్మాళ్వార్లు రచించిన తిరువాయ్ మొళి దివ్యప్రబంధముయొక్క సౌరభము అనితరసాధారణము. "**యస్య సారస్వతం స్రోతః వకుళామోదవాసితమ్**" (ఏ నమ్మాళ్వారుల సారస్వతము వకుళ పూల సుగంధముతో పరిమళితమై ఉన్నదో) అని దేశికులు యతిరాజసప్తతిలో కీర్తించిరి కదా! పొన్నచెట్టు పూలకు వకుళ పుష్పసుగంధము అబ్బుట అసాధారణము. "**విచిత్ర మిదం పున్నాగవృక్షో వకుళసౌరభవిశిష్ట ఇతి**" అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్య. "**పున్నాగతల్లజ మామనామః**" అని అనుటచే, అధ్యాపకులు సహస్రగీతిని స్తుతింపగా, మనము పున్నాగతల్లజమును కీర్తింతుము. భగవత్కీర్తనము కన్న భాగవతకీర్తనము మిక్కిలి రస్యము కదా! – అని ఇచట ఒక రస్యమైన భావము ధ్వనించును.

తల్లజమను పదము శ్రేష్ఠవాచకము. "**ఆనమామః**" అను పాఠాంతరము కలదు. "**నమస్కరింతును**" అని ఆ పాఠముయొక్క భావము.

ఇందు వృత్తము పూర్వమువలెనే వసంతతిలక. వసంత ఋతువులో ఉదయించిన నమ్మళ్వారుల దివ్యప్రబంధముతో సంబంధము కలిగిన పున్నాగ వృక్షమును వసంత తిలక వృత్తంలో కవి స్తుతించుట విశేషము.

## విష్వక్సేనులను ఆశ్రయిస్తాము

**50. శ్రీరంగచంద్రమస మిందిరయా విహర్తుం**
**విన్యస్య విశ్వచిదచిన్నయనాధికారమ్ ।**
**యో నిర్వహత్య నిశ మంగుళిముద్రయైవ**
**సేనాన్య మన్యవిముఖాః త మశిశ్రియామ ॥**

**ప్ర. అ. –** యః = ఏ విష్వక్సేనులు, శ్రీరంగచంద్రమసం = (చంద్రునివంటి) శ్రీరంగనాథుని, ఇందిరయా = లక్ష్మీదేవితో, విహర్తుం = విహరించుటకు, విన్యస్య = (శేషశయనమున, లేదా, సింహాసనమున) నిలిపి, విశ్వ = సమస్తమైన, చిత్ అచిత్ = చేతనాచేతనములను, నయన = నడపుట అను, అధికారం = అధికారమును, అనిశం = ఎల్లప్పుడు, అంగుళిముద్రయా ఏవ = తన వేలిముద్రతోనే, నిర్వహతి = నిర్వహించుచున్నాడో, తం = ఆ, సేనాన్యం = విష్వక్సేనులను, అన్యవిముఖాః = వేరు శరణమునుగూర్చి విముఖులమై, ఆశిశ్రియామ = ఆశ్రయింతుముగాక.

**వరివస్య :–** ఇందు సేనాధిపతి అగు విష్వక్సేనులు స్తుతింపబడుచున్నారు. గత శ్లోకమున గాథాసహస్రస్మరణముచే శఠకోపసూరియు స్మరింపబడెను. పిమ్మట, గురుపరంపరలో విష్వక్సేనులు స్తుతింపబడుటచే, ఈ శ్లోకమున విష్వక్సేనస్తుతి చేయబడుచున్నది. "**సేనాపతేః పథి చ కారిగృహేఽ వతీర్ణమ్**", "**శఠారిం సైన్యపం భజే**" అని నమ్మాళ్వార్లు విష్వక్సేనుల అంశవలన జన్మించిరని సంప్రదాయప్రసిద్ధికదా.

సకలప్రపంచమును నిర్వహించు అధికారము శ్రీరంగనాథునిదే. కాని, ఆ బాధ్యతను విష్వక్సేనులు తన భుజస్కంధములపై నుంచుకొని, సర్వేశ్వరుడు లక్ష్మీదేవితో కలిసి యథేచ్ఛగా లీలారస మనుభవింప వీలు కల్పించును. బ్రహ్మాండములోని సమస్త చరాచరజీవుల నిర్వహణను విష్వక్సేనులు అవలీలగా తన వేలిముద్రలతోనే నిర్వహింపగల సమర్థులు. అట్టి విష్వక్సేనులు మాకు శరణము – అని శ్లోకభావము.

భగవానుడు జగద్రక్షణభారమును విష్వక్సేనులకు అప్పగించుననుటను **"త్వయా నిసృష్టాత్మభరేణ"** (42) (నీ చేతనే సమస్త జీవుల నిర్వహణభారము అప్పగింపబడినవాడు) అని స్తోత్రరత్నమున యామునులు, **"శ్రీమతి విష్వక్సేనే న్యస్తసమస్తవైభవమ్"** (గొప్ప భగవత్కైంకర్యలక్ష్మిని కల విష్వక్సేనులపై సమస్తవైభవాన్ని పెట్టినవానిని) అని శ్రీవైకుంఠగద్యమున భగవద్రామానుజులును సూచించిరి.

సుదర్శన శతకములో **"యస్మిన్ విన్యస్య భారం విజయిని జగతాం జంగమస్థావరాణామ్"** (100) అని జగన్నిర్వహణభారమును భగవానుడు సుదర్శనమున కిచ్చినట్లున్నదే? అని ఇక్కడ శంకింప పని లేదు. రెండును సాధ్యమే. సర్వేశ్వరునకు అంతరంగ కైంకర్యమును చేయు దాసులు పలువురు ఉన్నప్పుడు, ఆ కైంకర్యములో వారు వారు యథాశక్తి అన్వయించుటలో విప్రతిపత్తి లేదు కదా! మరియు, భగవద్విభూతియొక్క విస్తృతి కూడ నిరవధికము. కావున అట్లు సంభవమే యగును.

ఈ సందర్భములో తిరువాయ్ మొళి ప్రబంధములోని (10–6–1) **"అరుళ్ పెరువార్"** అనేదశకంలోని 1వ పాశురంలో **"అదు నమదు విదివకైయే"** అనే ప్రయోగాన్ని వ్యాఖ్యానించే నంబిళ్ళై

(నమదు విదివకైయే) (తథానుజానంత ముదార వీక్షణైః) – భగవానుడు భక్తవిధేయుడుగా ఉంటాడు– అనే విషయాన్ని భట్టర్ స్వయంగా చెప్పగా విన్నాను – అని అనుగ్రహించారు. విష్వక్సేనుడు కంచుకాన్ని ధరించి,

శిఖను ముడి వేసికొని, చేతిలో రాజదండాన్ని ధరించి, సభలో ప్రవేశించగానే, అంతవరకు సభలో లక్ష్మీదేవితో పాటు స్వైరంగా సంచరించే స్థితిని మానివేసి, భగవానుడు, లక్ష్మీదేవితోకూడా సింహాసనంలో ఒక మూల ఒదిగి ఉండగా, అప్పుడు విష్వక్సేనుడు "నేను, దివ్యదంపతుల ఆనందానికి పానకంలో పుడకలా తాను కాకూడదు" అనే భావంతో జగత్తును నిర్వహించడానికి ఆవశ్యకమైన విషయాలను వేగంగా, సంగ్రహంగా భగవానునకు విన్నపిస్తాడు. అప్పుడు ఆ విష్వక్సేనుడు చేసే ఆ విన్నపాన్ని వినడం భగవంతునకు, లక్ష్మీదేవితో ఆనందించడం కంటే, మిక్కిలి ఆనందకరంగా ఉంటుంది కదా. ఎందుకంటే, సేనాధిపతిని చూడడం భగవంతునికి చాలా ఇష్టం కదా. "ఇతనిని బ్రహ్మగా చేయాలి, ఇతనిని బ్రహ్మ పదవి నుండి మార్చాలి" అని అంటూ ఆవశ్యకమైన విషయాలను విష్వక్సేనులు అప్పుడు విజ్ఞాపన చేస్తాడు. తనకు పితృస్థానీయులని భగవానుడు భావించే విష్వక్సేనులు ఏమేమి చెబుతాడో, వాటిని అన్నిటిని "సరే! ఆ విధంగానే!" అని అంటూ, తన నేత్రాలతోనే భగవానుడు తన అనుమతిని ఇస్తాడు) అని విష్వక్సేనులు చేసే జగన్నిర్వాహక్రమాన్ని తెలిపిన క్రమం ఇక్కడ అనుసంధేయం.

**"చంద్రమ్ ఆహ్లాదం మిమీతే, నిర్మిమీతే ఇతి చంద్రమాః"** అను వ్యుత్పత్తివలన '**చంద్రమాః**' అను శబ్దము "ఆనందదాయకుడు" అను అర్థము నిచ్చును. కావున, "**శ్రీరంగచంద్రమస**" మనుటకు, "శ్రీరంగములోని భక్తులకు ఆనందము కల్గించువాడ" ని తాత్పర్యము. ఇనశబ్దము "**ఇన స్సూర్యే నృపే పత్యౌ**" అను నిఘంటువచనమునుబట్టి, పతి అను అర్థమునిచ్చును. 'పతిం విశ్వస్య' (తై. నా. 6-16) అనునట్లు సమస్తప్రపంచమునకు ప్రభువు భగవానుడగు శ్రీరంగనాథుడు, భగవానునితో గల శరీరిశరీరభావ సంబంధమువలన సమస్తజీవులు ఎల్లప్పుడును ఆయనతోడనే ఉందురు. కావున, "**ఇనేన సహ వర్తంతే ఇతి సేనా**" అను వ్యుత్పత్తివలన, సమస్త జీవులు సేనాశబ్దముడే చెప్పబడుచున్నారు. అట్టి జీవులనందరును నియమించువాడు కావున, "**సేనాం**

**నయతి ఇతి సేనానీ**" అను వ్యుత్పత్తిచే, సేనానీశబ్దమునకు విష్వక్సేనుడను అర్థము వచ్చును. ఇచట అంగుళిముద్ర అనగా, తర్జనము. చూపుడు వేలుతో బెదరించుట – అని అర్థము. నోట మాటకూడ పలుకవలసిన పనిలేదని తాత్పర్యము. కావుననే సంస్కృతవ్యాఖ్యాత **"ఏవకారేణ రాజనీత్యుక్త వ్యాపారాంతరం నివర్త్యతే"** (ఇచటి ఏవకారంద్వారా రాజనీతిద్వారా చెప్పబడిన వేరొక వ్యాపారం ఏమీ అక్కర లేదని నివర్తింపబడుతున్నది) అని వ్యాఖ్యానించిరి. అంటే, "రాజనీతిలో చెప్పబడిన ఏ విధమైన ప్రయత్నం చేయవలసిన అక్కర లేకుండానే, కేవలం తన వేలిముద్రతోనే సమస్త జగత్తుల నిర్వహణను సేనాధిపతి నిర్వహిస్తున్నారు" అని తాత్పర్యం. "**విన్యస్య**" అనగా, "**అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపత శ్చ తే**" (రా. అయో. 31-27) (నీవు నిద్రించేటప్పుడు, మేల్కొని ఉండేటప్పుడు, నీకు అన్ని విధాలైన సేవలను నేను చేస్తాను) అనునట్లు, సర్వవిధ కైంకర్యములను చేయు విష్వక్సేనులపై నిలిపి – అని భావము. "**అంగుళిముద్రయైవ**" అనునపుడు, గురువు తన అంగుళి ముద్రలద్వారా శిష్యులకు బోధించునట్లే, విష్వక్సేనులుకూడ సమస్తజగత్తును తన అంగుళిముద్రతో తన అనుచరులకు కర్తవ్యములను బోధించుచూ, జగత్తును నడపుచున్నారు – అని భావము. "**అధిశ్రయామః**" అను పాఠాంతరము వాధూల వీరరాఘవాచార్యస్వామివ్యాఖ్యలో కనబడుచున్నది. ఇందు వృత్తము వసంతతిలక

## విష్వక్సేన పత్ని సూత్రవతిని ఆశ్రయిస్తాము

**51. సైన్యధురీణ ప్రాణసహాయాం**
**సూత్రవతీ మాశిశ్రియమంబామ్ ।**
**శ్రీపదలాక్షా లాంఛితసేవా–**
**ప్రోతలసద్దోర్వల్లి విలాసామ్ ॥**

**ప్ర. అ. –** శ్రీ = లక్ష్మీదేవియొక్క, పద = పాదములకు పూయబడిన, లాక్షా = లత్తుకచే, లాంఛిత = ముద్రితమై, సేవా = కైంకర్యము కొఱకై, ప్రోత =

నేయబడిన వస్త్రముచే, లసత్ = ప్రకాశించు, దోః వల్లి = తీగవంటి బాహువులయొక్క విలాసాం = సౌందర్యమును కల్గినది, సైన్యధురీణ = విష్వక్సేనులయొక్క, ప్రాణసహాయాం = ప్రియపత్ని అగు, సూత్రవతీం = సూత్రవతి అను, అంబాం = తల్లిని, ఆశిశ్రియమ్ = ఆశ్రయించితిని.

**వరివస్య :–** విష్వక్సేనుల ప్రియపత్ని సూత్రవతి ఇందు కీర్తింపబడుచున్నది. గురువువలె గురుపత్నియు గౌరవనీయురాలు. వీరు ఇరువురు జ్ఞానజన్మను ఇచ్చిన తల్లితండ్రులు. "**శరీర మేవ మాతాపితరౌ జనయతః**" (భౌతికమైన శరీరాన్ని మాత్రమే తల్లిదండ్రులు మనకు కలిగిస్తారు) కదా!

విష్వక్సేనులు భగవానునకు నిత్యకైంకర్యము చేయునట్లే, వారి మహిషి అగు సూత్రవతికూడా లక్ష్మీదేవికి సేవను చేయును. ఆమె లక్ష్మీదేవికి పాదసంవాహనము చేయునపుడు. లక్ష్మీదేవి పాదములకు అలంకారముగా పూయబడిన లత్తుకరసము ముద్రలు సూత్రవతి ధరించిన ఉత్తరీయముపై పడును, ఈమె విష్వక్సేనులకు ప్రాణసమాన, భగవత్కైంకర్యమున సర్వవిధముల అతనికి చేదోడు వాదోడుగా నుండును. అట్టి సూత్రవతి మాతను ఆశ్రయించితిని – అని శ్లోకభావము.

"**సైన్యధురీణ ప్రాణసహాయామ్**" అనునప్పుడు సహాయశబ్దమును నిత్యపులింగముగా స్వీకరించినచో, "**సైన్యధురీణు ప్రాణవత్ సహాయః యస్యాః సా**" అను విగ్రహముద్వారా విష్వక్సేనులను ప్రాణమువలె సర్వదా అనుసరించునది – అను అర్థము. వచ్చును. విశేష్యనిఘ్నమని భావించినచో, "**సైన్యధురీణస్య ప్రాణవత్ సహాయా**" అను విగ్రహముద్వారా, విష్వక్సేనులకు ప్రాణమువలె తోడుగా నుండునది – అను అర్థము వచ్చును. ఈ రెండర్థములును సరసములే. వేదాంతగ్రంథములలో ప్రాణము సూత్రముగా వ్యవహరింపబడుట ఇచట గమనింపదగును. ఇచట ప్రోత మనగా పాదములను ఒత్తుటకు ఉపయోగించు వస్త్రము. ఇక్కడ '**ప్లోత**' మను పాఠాంతరముకూడ

కలదు. "**తిరుప్పళ్ళి ఎ(ళ్ళు)చ్చి**" అను ప్రబంధమున తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు "**తొడై యొత్త తుళవముమ్ కూడైయుమ్ పొలిన్దు తోన్జియ తోళ్ తొణ్డరడిప్పొడి**" (10) (భగవానుని కైంకర్యమునకై మాలతో కూడిన తులసిని, బుట్టను కలిగి ప్రకాశించు భుజములను కల్గిన తొణ్డరడిప్పొడి ఆళ్వారులు) అనుచు భగవంతుని కైంకర్యానికి ఉపయోగపడే తులసిని బుట్టను ధరించడం తమకు నిరూపకలక్షణంగా పల్కినట్లే, ఇచట భట్టరు సూత్రవతీదేవికి శ్రీదేవికైంకర్యమునకు ఉపయోగించు వస్త్రమును సూత్రవతీ దేవికి నిరూపకలక్షణముగా తెలుపుచున్నారు. "**ప్రోతలసత్ దోర్వల్లివిలాసామ్**" అనుటచే లతాలంబితమైన వల్కలమువలె సూత్రవతి భుజములపై గల చేనేతవస్త్రము భాసించుమన్నది – అను అర్థము ఏర్పడుచున్నది. ఇందుచే సూత్రవతియొక్క లతాసామ్యము ధ్వనించుచున్నది. సుకుమారమైన రూపాన్ని స్వభావాన్ని కలిగిన స్త్రీలను, అటువంటి రూపాన్ని స్వభావాన్ని కలిగిన లతతో పోల్చడం కవి సమయం, దివ్య ప్రబంధసూక్తిసిద్ధం. "**కొమ్బనార్ క్కెల్లామ్**" అని గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో అనుగ్రహించిన సూక్తి ఇక్కడ స్మరణీయము.

"**ఆశ్రియమ్**" అను భూతకాలికనిర్దేశము విలక్షణమైనది. "**పుకున్దేనే** (తి. వా. 6–10–10) **ఎన్నుమాప్పోలే ఆశ్రయణత్తుక్కు సకృత్త్వసూచనార్థమాక భూతనిర్దేశమ్**" ("**పుకుందేనే**" అనే ఆళ్వారుల ప్రయోగంలోవలె, ఆశ్రయించడం అనేదానిని ఒక్కసారి చేయాలి– అని సూచించడంకోసంగా భూతకాలిక నిర్దేశం చేయబడింది" అని శ్రీవాధూల వీరరాఘవాచార్య స్వామివ్యాఖ్య. ఇచట ఉదాహరింపబడిన దివ్యప్రబంధసూక్తిని వ్యాఖ్యానించుచు నమ్బిళ్లై ఈడువ్యాఖ్యలో "**(పుకున్దేనే) 'ప్రపద్యే' –ఎన్గిఱ వర్తమానమ్ గౌణమ్, 'అడైన్దేన్' ఎన్గిఱాప్పోలే. 'పుకున్దేన్' ఎన్గిఱ ఇదువే ముఖ్యమ్**" (ఇక్కడ "**ప్రపద్యే**" అనే వర్తమానకాలిక ప్రయోగం గౌణం, అంటే, అప్రధానం. "పుకుందేన్" – ఆశ్రయించాను – అనే ఈ ప్రయోగమే ముఖ్యం) అని పల్కుట, దానిని వివరించు అరుమ్బదములో "**(పుకున్దేన్) ఎన్డు భూతమాక చ్చొల్లువానెన్? ఎన్న, 'ప్రపద్య' ఇత్యాది –**

**గౌణమెన్డదు కార్యార్థమాక కిడక్కిఱదు ఎన్డపడి. 'సకృదేవ హి శాస్త్రార్థః కృతో ఽ యం తారయేన్నరమ్' ఇత్యాదియిలే ఇదుక్కు నోక్కు"** (పుకుందేన్– ఆశ్రయించాను – అని భూతకాలంలో ఎందుకు చెబుతున్నారు? అని అంటే, దానికి వివరణంగా "**ప్రపద్యే**" ఇత్యాది వాక్యం అనుగ్రహింపబడింది. గౌణం అంటే, కార్యంకోసం ఉపయోగింపబడింది – అని అర్థం. "ఒక్కసారి చేసిన ప్రపత్తి అనే ఈ శాస్త్రార్థమే చాలు, మానవుని తరింపచేస్తుంది" – అని మొదలైన సూక్తులలో దీనికి దృష్టి) అను వివరణమును ఇచట గమనింపదగినవి.

ఇందు రుక్మవతీవృత్తము. "**భ్మౌ సగయుక్తౌ రుక్మవతీయమ్**" అనేది దీని లక్షణము. దీనికే చంపకమాలా అని కూడ కొందరి మతమున పేరు. అపుడు "**చంపకమాలా చేత్ భమసాత్ గః**" అని లక్షణము.

## విష్వక్సేన భటులు మనకు సుఖమును కలుగజేయాలి

**52. విదధతు సుఖం విష్వక్సేనస్య తే ప్రథమే భటాః**
**కరిముఖజయత్సేనౌ కాలాహ్వాసింహముఖౌ చ నః ।**
**జగతి భజతాం తత్తత్ప్రత్యూహతూలదవానలా**
**దిశదిశి దివారాత్రం శ్రీరంగపాలనకర్మఠాః ॥**

**ప్ర. అ. –** జగతి = ఈ లోకమున, భజతాం = తమను ఆశ్రయించువారియొక్క, తత్ + తత్ = ఆ యా, ప్రత్యూహ = ఆటంకములు అను, తూల = దూదిపింజలకు, దవ+అనలాః = దావాగ్నివంటివారు, దివారాత్రం = పగలు, రాత్రి, దిశ దిశి = ప్రతి దిక్కులోను, శ్రీరంగపాలన = శ్రీరంగమును పాలించుటను, కర్మఠాః = నిత్యకర్మగా కల్గినవారు, విష్వక్సేనస్య– = విష్వక్సేనులయొక్క, తే = ఆ (ప్రసిద్ధులైన), ప్రథమే భటాః = ముఖ్యులైన సేవకులగు, కరిముఖజయత్సేనౌ = కరిముఖుడు, జయత్సేనుడు, కాల + ఆహ్వా = కాలుడను పేరు కలవాడు, సింహముఖ = హరివక్త్రుడను పేరును కలవాడును

అగు నలుగురు, నః = మాకు, సుఖం = సుఖమును, విదధతు = కలుగజేయుదురు గాక!

**వరివస్య :–** భగవద్రామానుజులు నిత్యగ్రంథమున విష్వక్సేనులకు ప్రణమిల్లిన పిదప, విష్వక్సేనుల పరిజనమగు గజానన, జయత్సేన, హరివక్త్ర, కాలప్రకృతులను నల్గురకు నమస్కరింపవలెనని పల్కిరి. భట్టరు ఆ క్రమమునుబట్టి ఇందు ఆ నల్గురను భట్టర్ ప్రార్థించుచున్నారు.

తమను భజించువారు తలపెట్టిన కార్యముల ఆటంకములను దూదిని, దావాగ్నివలె నిశ్శేషముగా నాశనము చేయువారు, శ్రీరంగమందిరమును ఎల్లప్పుడు రక్షించుటయే. తమ నిత్యకర్తవ్యముగా కలవారు అగు గజాననుడు, జయత్సేనుడు, హరివక్త్రుడు, కాలప్రకృతి అను పేర్లను కల్గిన విష్వక్సేనుని భటులు మాకు సుఖమును కలుగజేయుదురు గాక! – అని శ్లోకభావము.

కర్మఠుడనగా, పనిని చేయుటలో సమర్థుడు. "**కర్మశూర స్తు కర్మఠః**" అని అమరము. బ్రాహ్మణులకు సంధ్యావందనాదికర్మలవలె, విష్వక్సేనభటులకు శ్రీరంగపాలనము నిత్యనియతకర్తవ్యమని భావము. విఘ్నములను విష్వక్సేనభటులు దూదినివలె దహింతురనుట, యు – "**తీయినిల్ తూశాకుమ్**" (5) (అగ్నిలో పడిన దూదివలె దగ్ధము అగును) అను తిరుప్పావైసూక్తిని గుర్తుకు తెచ్చుచున్నది. ఆటంకములు. పాపఫలములే కదా. అకర్మవశ్యులైన విష్వక్సేనభటులు కర్మఠులగుట ఏమి? అనినచో, వారు చేయు కర్మలన్నియు భగవత్కైంకర్యరూపములగుటచే ఇచట ఏ విధమైన విప్రతిపత్తియు లేదు.

లోకములోని కర్మఠుల వైదికకర్మలన్నియు అగ్నిసాధ్యములగునట్లే, వీరు భక్తుల పాపములను దహించుట – అను వీరి నిత్యకర్మలును అగ్నిసాధ్యములు – అను చమత్కారభావము "**తత్తత్ ప్రత్యూహదవానలాః**" అను విశేషణముచే స్ఫురించును. '**దవానల**' శబ్దమునకు బహువ్రీహిసమాసమును ఆశ్రయించినచో, "**తద్వత్త్వమ్**" అనగా, "**దవానలవత్త్వమ్**" స్ఫురించుటచే ఇట్టి భావము ఏర్పడును.

అందుచే విష్వక్సేన భటుల కర్మత్వము నిరూపితము – అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్య.

**"అహ స్సర్వైకదేశసంఖ్యాతపుణ్యాచ్చ రాత్రేః (5-4-87) ఇతి సూత్రే దాత్ సంఖ్యావ్యయాదే రపి అచ్ ప్రత్యయో భవతీత్యుక్తమ్. అతః దివారాత్ర మితి సిద్ధమ్"** అని శిష్టప్రయోగసంగ్రహమున దివారాత్రశబ్దసాధుత్వము చూపబడినది. ఇట్టి వివరణమే శ్రీరామానుజాచార్యవ్యాఖ్యలో కూడ కలదు.

భక్తుల కైంకర్యవిఘ్నములను హరించు విష్వక్సేనభటులను, కవి, "హరించునది" అను అర్థమునిచ్చు, హరిణీ అని పేరు కలిగిన వృత్తమున వర్ణించుట మిగుల ఉచితము.

ఈ సందర్భమున **"యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః- విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే"** (ఏ విష్వక్సేనుని పరిషత్తుకు చెందిన గజాననుడు మొదలైనవారు వందలాది విఘ్నములనుకూడ ఎల్లప్పుడు లేకుండా చేస్తున్నారో, అటువంటి విష్వక్సేనుని నేను ఎల్లప్పుడూ ఆశ్రయిస్తున్నాను) అను సంప్రదాయసిద్ధమైన విష్వక్సేన స్తుతిశ్లోకము అనుసంధింప దగినది.

లోకంలో ప్రసిద్ధంగా పూజింపబడే గణపతి అనే దైవం ఇక్కడ స్తుతింపబడిన గజానునుని కంటే భిన్నుడని గుర్తించవలసి ఉన్నది. లోకంలో వినాయక చతుర్థినాడు పూజింపబడే గణపతి బద్ధజీవులలో ఒకడు కాగా, ఈ శ్లోకమున స్తుతింపబడిన గజాననుడు నిత్యసూరులలో ఒకడు, భగవంతుని కైంకర్యమును చేసుకొన గలిగిన భాగ్యశాలి.

## గరుడుని శరణు పొందుతున్నాము

**53. శ్రుతిమయ మతిహర్షప్రశ్రయస్మేరవక్త్రం**
**మణిముకుర మివాగ్రే మంగళం రంగధామ్నః ।**
**శరణ మభిగతా స్స్మో యత్ర రూపస్వరూప–**
**స్వగుణమహిమదర్శీ మోదతే రంగశాయీ ॥**

**ప్ర. అ. –** యత్ర = ఏ గరుత్మంతుని యందు, రంగశాయీ = శ్రీరంగనాథుడు, రూప = తన దివ్యమంగళరూపము, స్వరూప = దివ్యాత్మస్వరూపము, స్వ = తనయొక్క, గుణ = కల్యాణ గుణములు – అను వీనియొక్క, మహిమ = గొప్పదనమును, దర్శీ = చూచువాడై (దర్శించడమే అలవాటుగా కలిగినవాడై), మోదతే = సంతోషించుచున్నాడో, అట్టి, రంగధామ్నః = శ్రీరంగనాథుని, అగ్రే = ముందు, మంగళం = శుభకరమై, మణిముకురం = రత్నపుటద్దము, ఇవ = వలె ఉన్నవాడు, అతిహర్ష = గొప్ప సంతోషముచే, ప్రశ్రయ = వినయముచే, స్మేర = వికసించిన, వక్త్రం = ముఖమండలమును కలవాడు, శ్రుతిమయం = వేదస్వరూపుడగు గరుత్మంతుని, శరణం = శరణముగా, అభిగతాః స్మ = పొందినవారమై యున్నాము.

**వరివస్య :–** భట్టరు ఈ శ్లోకమున "**పెరియ తిరువడి**" అని సంప్రదాయమున వ్యవహరింపబడు గరుత్మంతుని శరణు వేడుచున్నారు. శ్రీరంగాలయమున శ్రీరంగనాథుని కెదురుగా అంజలి ముద్రతో వేంచేసి యుండు గరుత్మంతుడు ఈ శ్లోకమున స్తుతింపబడుతున్నారు. ఈ గరుత్మంతుడు నిలచియున్న మండపమునకు గరుడమండపమని పేరు. ఈ శ్లోకమున గరుత్మంతుని కవి మణిదర్పణముతో ఉపమించుట విశేషము.

లోకమున ధనవంతులు, ప్రభువులు తమ శయనమందిరములలో మంగళకరములగు నిలువుటద్దములను ఏర్పరచుకొని, నిద్ర లేవగానే అందు తమ రూప విలాసములను చూచుకొని, మురియుదురు. శ్రీరంగనాథుని ఎదుట వేంచేసి యున్న గరుత్మంతుడు ఆ స్వామి మందిరమున గల మణిదర్పణమువంటివాడు. ఎట్లనగా, గరుత్మంతుడు వేదస్వరూపి, శ్రీయామునులు చతుఃశ్లోకిలో "**వేదాత్మా విహగేశ్వరః**" (1) అని స్తుతించిరి, యజుర్వేదమును "**సుపర్ణో ఽ సి గరుత్మాన్**" (యజు. 4-1-42) అని ప్రారంభించి, గరుత్మంతుని వేదస్వరూపిగా స్తుతించినది. వేదము భగవానుని స్వరూప రూప గుణప్రతిపాదకము. శ్రీరంగనాథుడు వేదమయుడగు

గరుత్మంతునిలో ప్రతిఫలించు తన రూపమును, స్వరూపమును, గుణములను సదా దర్శించుచు, మిక్కిలి సంతోషించుచున్నాడు. కావున, గరుత్మంతుడు మణిముకురముతో పోలినవాడు. భగవానుడు తన రూప లావణ్యాదులను గరుత్మంతునిలో చూచి, మురియుచుండగా, గరుత్మంతుడు ఆ భగవానుని దివ్యమంగళ విగ్రహమును నిత్యము, నిరంతరము దర్శించుచు, మహదానందమును పొందుచున్నాడు. ఈ ఆనందమువలన, భగవానుని పట్ల అతనికి గల వినయమువలన గరుత్మంతుని ముఖమున చిఱునవ్వు తొణికిసలాడుచున్నది. ఇట్టి గరుత్మంతుని శరణు వేడుచున్నాము – అని శ్లోకభావము.

**"మూర్తం బ్రహ్మ తతో ఽ పి తత్ప్రియతరం రూపం యదత్యద్భుతమ్"** (చతుఃశ్లోకి, 4) (అద్భుతమైన భగవంతుని ఏ దివ్యమంగళ విగ్రహము ఉన్నదో, అది, ఆ భగవానునకు తన దివ్యాత్మస్వరూపము కంటే మిక్కిలి ప్రియమైనది) అనునట్లు, తన స్వరూపము కంటే భగవానునకు, శుభాశ్రయమని కీర్తింపబడే తన దివ్యమంగళవిగ్రహము ప్రియతరమగుటచే, ముందుగా నిర్దేశించబడినది.

**"నీవారస్వరూపాపేక్షయా విగ్రహస్య బింబితత్వం సులభమ్"** (**"నీవారశూకవత్"** అని చెప్పబడిన భగవంతుని స్వరూపం కంటే, ఆ స్వామి దివ్యమంగళవిగ్రహం మనసులో ప్రతిబింబించడం సులభం) అని గోపాలాచార్యవ్యాఖ్యలోని వివరణము. భగవంతుని అనుభవము ఎల్లప్పుడూ సగుణమే అయినను, గుణములు అద్రవ్యములగుటచే స్వరూపమునకు పిమ్మట ఇక్కడ నిర్దేశము చేయబడినవి. సర్వేశ్వరుని స్వరూపరూపగుణములు గరుత్మంతునియందు ప్రతిఫలించుననుటకు అర్థమే మనగా – **"తమ్మైయే నాళుమ్ వణజ్గి త్తొ ழுవార్ క్కు తమ్మైయేయొక్క అరుళ్ శెయ్ వర్"** (పెరి. తి. 11-3-5) (తనను ఎల్లప్పుడు నమస్కరించి, కైంకర్యము చేయువారికి భగవానుడు తనతో పరమసామ్యమును కల్గించి, అనుగ్రహించును) అనునట్లు, భగవానుడు, తనకు నిత్యకైంకర్యాన్ని చేసే గరుత్మంతుని తనతో సమానముగా,

స్వరూప రూపగుణశాలి అగునట్లు అనుగ్రహించెనను విషయమును సూచించుటయే. ఈ శ్లోకమున '**రంగశాయీ**' అను పదము భావస్ఫోరకము. లోకమున జనులు నిద్రించునపుడు, తాము నిద్ర లేచిన పిమ్మట, కళ్ళు తెరచి చూచునపుడు తమకు ఎదురుగా తమ రూపము కన్నులకు కనపడునట్లు మంగళకరమైన అద్దమును నిలుపుకొను విషయమునీ పదము పరోక్షముగా సూచించుచున్నది.

**గరుత్మంతుని వేదాత్మకత్వమును యజుర్వేదము–**

"**సుపర్ణో ఽ సి గరుత్మాన్ త్రివృత్తే శిరో, గాయత్రం చక్షుః, స్తోమ ఆత్మా, సామ తే తనూః, వామదేవ్యం బృహద్రథంతరే పక్షౌ, యజ్ఞాయజ్ఞీయం పుచ్ఛం, ఛందాంస్యంగాని, ధిష్ణియాః శఫా, యజూంషి సామ**" (యజు. వే. 4-1-42)

(గరుత్మంతుడా! నీవు సుపర్ణుడవు, నీ శిరస్సు త్రివృత్, నీ కన్నులు గాయత్రము, నీ ఆత్మ స్తోమ, నీ తనువు సామ, నీ రెక్కలు వామదేవ్యము, బృహద్రథంతరములు, నీ పుచ్ఛము యజ్ఞము యజ్ఞీయమును, నీ అంగములు ఛందస్సులు) అని స్తుతించెను. స్తోత్రరత్నములో "**దాసః సఖా**" (41) అను శ్లోకములోని "**త్రయీమయః**" అను పదమును వేదాంత దేశికులు వ్యాఖ్యానించుచు, "**తస్య గాయత్రీ జగతీ చ పక్షా వభూతామ్, ఉష్ణిక్ చ త్రిష్టుభ్ చ పృష్ఠౌ, అనుష్టుభ్ చ పంక్తిశ్చ ధుర్యౌ, బృహత్యేవోక్తి రభవత్, స ఏవం ఛందోరథ మాస్థాయ ఏత మధ్వాన మను సమచరత్**" అను ప్రమాణమును ఉట్టంకించిరి. వేదము భగవానుని రూపమును భక్తుల కనుల ముందు ప్రత్యక్షము కావించునట్లే, వేదాత్మకుడగు గరుడుడుకూడ భగవానునకు వాహనమై, ఆ స్వామిని భక్తుల వద్దకు కొనివచ్చును. వేదస్వరూపి అగు గరుత్మంతుని మణిముకురముతో పోల్చుటచే వేదమును మణిదర్పణమువంటిదని సూచించినట్లయినది.

ప్రస్తుతశ్లోకమున గరుత్మంతుడను అర్థమునిచ్చు పదమేమియు లేదు, "**శ్రుతిమయ**" మను పదమీ అర్థమును బోధించుచున్నది. ఇట్లు విశేషములవలన

విశేష్యము బోధింపబడుటకు '**సుధర్మిత**' అను అర్థగుణము అగును – అని "**యత్ర విశేషణద్వారా విశేష్యలాభః సా సుధర్మితా**" (8వ మరీచి) అనుచు అలంకార శేఖరకారుడు. నిర్వచించుట ఇచట స్మరింపదగినది. ఈ సందర్భమున కూరేశుల రచనగా చెప్పబడు యమకరత్నాకరములోని

**"ఆశయిష్ట వటస్య హి యో సౌ పర్ణే యేన వా శయానేన,**
**శ్రీరంగే క్రియతే తాదృక్ సౌపర్ణేయే నవాశయేనేన"**

అను శ్లోకము, వేదాంతదేశికులు రచించిన గరుడపంచాశత్ స్తోత్రములోని "**అగ్రే తిష్ఠన్నుదగ్రో మణిముకుర ఇవానన్యదృష్టిః మురారేః**" (8) (అనన్యమైన దృష్టిని కలిగినవాడై,భగవంతునకు అభిముఖంగా తెలిసిన ఉండేవాడు) అను శ్లోకము అనుసంధేయములు.

**"శ్రుతిమయమ్"** ఇత్యాది పదప్రయోగముచే, భగవానుడు వేదమునందు తన మహిమను దర్శించుచున్నాడని ఏర్పడుచున్నది. మొదటి పాదమున "**స్మేరనేత్ర**" మను పాఠాంతరము కలదు. నేత్రములు చిఱునవ్వు నవ్వుట అనగా, సంతోషముతో వికసించుటయే. **"అతిహర్షప్రశ్రయస్మేరవక్త్రమ్"** అనుటకు, గొప్ప సంతోషమునకు ఆశ్రయమగుటచే చిఱునవ్వు కల ముఖమును కల్గియున్నవాడను అర్థమును చెప్పవచ్చునని సంస్కృతవ్యాఖ్యాత సూచించిరి. శ్లోకము చివర **"శేషశాయీ"** అను పాఠాంతరము వీరరాఘవాచార్యస్వామివ్యాఖ్యలో కనిపించుచున్నది.

**"అభిగతాః స్మః"** అనునప్పుడు **"శ్రుతిమయం శరణమ్ అభిగతాః, అత ఏవ స్మః"** అని అన్వయించినచో, పరమభాగవతుడైన గరుత్మంతుని ఆశ్రయించినవారయ్యాము, కనుకనే, సత్తను పొందినవారయ్యాము –అనే సరసమైన భావంకూడా భాసిస్తుంది. ఇందువల్ల "**అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతో విదుః**" (భగవంతుడు ఉన్నాడని ఎవడు తెలుసుకుంటున్నాడో, అతనిని, సత్పురుషులు సత్తను కలవాడని భావిస్తున్నారు) అనే శ్రుత్యర్థం

భాగవతపరంగా అనుసంధించినట్లయినది. ఇందు అలంకారము ఉపమ, మాలినీవృత్తము.

## గరుడ పత్నులు రుద్రాసుకీర్తులను అర్చిస్తాను

**54. తార్క్ష్యపక్షతివదస్య వల్లభాం**
**రుద్రయా సహ సుకీర్తి మర్చయే।**
**హర్షబాష్ప మపి కీర్తి మర్థినాం**
**యన్ముఖేన కమలా కటాక్షయేత్ ॥**

**ప్ర. అ. –** కమలా = లక్ష్మీదేవి, అర్థినాం = (తనను) ప్రార్థించువారికి, హర్షబాష్పం = ఆనందాశ్రువులను, కీర్తిమ్ అపి = కీర్తినికూడ, యత్ ముఖాత్ = ఏ గరుడపత్నులద్వారా, కటాక్షయేత్ = అనుగ్రహించునో అట్టి, తార్క్ష్యపక్షతివత్ = గరుత్మంతుని రెక్కల మూలమువలె, అస్య = ఇతనికి (గరుడునకు), వల్లభాం = ప్రియురాలైన, సుకీర్తిం = సుకీర్తిని, రుద్రయా సహ = రుద్రతోపాటు, ఆశ్రయే = ఆశ్రయింతును.

**వరివస్య :–** గరుత్మంతునకు సుకీర్తి, రుద్ర – అను ఇద్దరు భార్యలు కలరని భగవచ్ఛాస్త్రమున చెప్పబడినది. భట్టరు ఆ క్రమమును అనుసరించి, ఈ శ్లోకమున వారిద్దరిని శరణు వేడుచున్నారు.

తనను ప్రార్థించువారికి లక్ష్మీదేవి ఆనందాశ్రువులను, గొప్ప కీర్తిని ఎవరిద్వారా అనుగ్రహించునో, గరుత్మంతునకు తన రెక్కలవలె మిక్కిలి ప్రియమైన వారెవ్వరో, అట్టి సుకీర్తిని రుద్రతో పాటుగా ఆశ్రయింతును – అని శ్లోకభావము.

వేదాంతదేశికులు గరుడదండకమున, **"రుద్రాసుకీర్తిస్తనాభోగ గాఢోపగూఢమ్"** అనుచు ఈ గరుడపత్నులను ఇద్దరిని ప్రస్తుతించిరి.

**"శ్లిష్యద్రుద్రాసు కీర్తిస్తనతటఘుసృణాలేప సంక్రాంతసార"** (43) ఇత్యాది గరుడపంచాశత్ శ్లోక మిచట అనుసంధేయము.

గరుడపత్నుల పేర్లను చమత్కారముగా నిర్వచించి, ప్రకృతార్థమున అన్వయించుట ఈ శ్లోకములోని విశేషము. **"రోదయతి – హర్షబాష్పం జనయతి ఇతి రుద్రా"**, **"శోభనా కీర్తిః యస్యాః నిమిత్తభూతాయాః అథవా, యయా సా సుకీర్తిః"** అను వ్యుత్పత్తులనుబట్టి ఏర్పడిన అర్థములు ఈ శ్లోకమున అనుసంధింపబడుచున్నవి. **"రుద్రా"** అను పదమునకు "కన్నీటిని కలుగజేయునది" అని, **"సుకీర్తి"** అను పదమునకు "గొప్ప కీర్తిని కల్గించునది" అని ప్రస్తుతతాత్పర్యము, భట్టరు సహస్రనామభాష్యమున **"రుద్ర"** నామమును వ్యాఖ్యానించుచు. **"ఏవంవిధరూప వివిధచేష్టితహృతహృదయాన్ సానందబాష్పాన్ కుర్వన్ రోదయతీతి రుద్రః"** (ఈ విధంగా ఉండే తన దివ్యరూపాలు, అనేక విధాలయిన లీలలు – అను వీటితో ఆకర్షింపబడిన భక్తుల హృదయాలను ఆనందబాష్పాలతో కూడినవానినిగా చేస్తూ, వారిని రోదింపజేస్తాడు కనుక, భగవానుడు రుద్రనామాన్ని కలవాడు), అని పల్కుట ఇచట స్మరింపదగినది. గరుత్మంతుడు భగవానునకు విధేయుడై యుండునట్లే, గరుడపత్నులుకూడ లక్ష్మీదేవికి విధేయురాండ్రై యుందురు. లేక, భగవానునకు లక్ష్మి భక్తుల విషయమున పురుషకారముచేయునట్లే, లక్ష్మికి రుద్రాసుకీర్తులు పురుషకారమును చేయుచున్నారు – అని భావము. కావున ఇచట భట్టరు **"యన్ముఖేన కమలా కటాక్షయేత్"** (ఎవరిద్వారా లక్ష్మీదేవి దయ చూపుతుందో) అనుట అర్థవంతము, భక్తులు కోరిన కోరికలను లక్ష్మీదేవి సఫలము చేయునపుడు, గొప్ప సంపదను రుద్రద్వారా అనుగ్రహించును. సంపదను పొందిన భక్తులు మిక్కిలి ఆనందించుటచే వారికి హర్షబాష్పములు కలుగును. ఇట్లు ఆనందాశ్రువులను కల్గించుటుచే **"రోదయతీతి రుద్రా"** అను వ్యుత్పత్తి ఇచట సార్థకము. అట్లే, లక్ష్మీదేవి గొప్ప కీర్తిని సుకీర్తిద్వారా భక్తులకు అనుగ్రహించును. కావున పైన పేర్కొనిన ఇంకొక వ్యుత్పత్తియు అర్థవంతము.

ఆనందబాష్పములను కల్గించు రుద్ర, గొప్ప కీర్తిని కలుగచేయు సుకీర్తి లక్ష్మీదేవికి నేత్రసమానలు. కావున, ఇట్టి కన్నులద్వారా భక్తులను లక్ష్మి కటాక్షించునపుడు, ఆ భక్తులకు ఆనందాశ్రువులు, గొప్ప కీర్తి కల్గుట సంభవమేకదా! ఈ రుద్ర, సుకీర్తు లిరువురును గరుత్మంతునకు అతని రెక్కల మూలమువలె మిక్కిలి ప్రియురాండ్రు, అతనిని ఎల్లప్పుడు వెన్నంటి యుందురు. రుద్ర, సుకీర్తు లిరువురు నేత్రస్థానీయలనగా, అంతరంగ కైంకర్యమును చేయువారని భావము. "**తార్క్ష్యపక్షతివత్**" అను దృష్టాంతముచే వారిరువురును, గరుత్మంతుని పక్షమూలమువలె, నిరంతరము అతని అలింగనము పొందుట కర్హతను కలవారను భావముకూడ ఏర్పడుచున్నది.

ఈ శ్లోకమున మొదటి పాదమున గల "**అస్య**" అను పదమునకు "**గరుడునియొక్క**" అను అర్థము చెప్పినచో, "**తార్క్ష్యపక్షతివత్**" అనుట ఎట్లు పొసగును? అను సందేహము కల్గును. ఈ శంకకు పలువురు పలు విధములుగా సమాధాన మిచ్చిరి. కొందరు "**స్వాత్మపక్షతివత్**" అని పాఠమును మార్చిరి. మరి కొందరు "**తార్ క్ష్య!**" అను పదమును సంబోధనాంతముగా గ్రహించి, "**అస్య (తవ) పక్షతివత్ వల్లభామ్**" అను క్లిష్టాన్వయమును చూపిరి, ఇంకను కొందరు, "**అస్య**" అను పదము ముందు శ్లోకములోని "**రంగశాయీ**" అను పదమును పరామర్శించును, కావున, "**వల్లభామ్**" అను పదమునకు భార్య అను అర్థమును కాక, "**అమాత్యో రాజవల్లభః**" అను సందర్భములలోవలె, "**విధేయురాండ్రు**" అను అర్థము కావున, సర్వేశ్వరునకు విధేయురాండ్రు – అని అర్థము – అను అర్థమును చెప్పిరి.

కాని, శ్రీ. ప్ర. భ, అణ్ణంగరాచార్యస్వామి తమ వ్యాఖ్యానమున – "**అస్య**" అను పదము ఈ శ్లోకములో గల తార్క్ష్య పదమును పరామర్శించును, కావున, పై శంకకు అవకాశమే లేదనిరి. వారి అభిప్రాయములో, ముందు శ్లోకములో గరుడుని నిర్దేశించు పదమేమియు లేదు కావున, ఆ శ్లోకముతో ఈ శ్లోకమునకు ఏ సంబంధము లేదు. "**సైన్యధురీణప్రాణసహాయామ్**" అను ముందు (51)

శ్లోకములో సూత్రవతి, విష్వక్సేనులకు ప్రాణసమాన అగునట్లే, ఇచటను రుద్ర, సుకీర్తులు గరుడునకు ప్రాణ సమానలు – అను అర్థములోనే భట్టరు వల్లభా శబ్దమును ప్రయోగించిరనుట యుక్తము. అందుచే, వారు చూపిన అన్వయము మిగుల అర్థవంతము, సరసమును, కావున, అదియే ఇచట గ్రహింపబడినది. వేంకటాచార్యకృతసంస్కృతవ్యాఖ్యానముకూడ ఈ అన్వయమునే చూపెను.

ఇందు అలంకారము ఉపమ. వృత్తము రథోద్ధత. **"రోనరా విహ రథోద్ధతా లగౌ"** అని దీని లక్షణము. విష్ణురథ శబ్దముచే చెప్పబడు గరుత్మంతుని పత్నుల స్తుతి రథోద్ధత అను వృత్తమున చేయబడుట సరసము.

పక్షమూలమును చెప్పు **"పక్షతి"** శబ్ద మిచట రెక్కలను నిర్దేశించును.

## పంచాయుధములను స్తుతిస్తాము

**55. స్వాస్త్ర రూపస్ఫురన్మౌళి మాశబ్ద ఇ–**
**త్యుద్ధునానాన్ సురాన్ తర్జనీముద్రయా ।**
**నాథనిద్రోచితోన్నిద్రతామ్రేక్షణాం**
**సంచరంతీం స్తుమ స్తాం చ పంచాయుధీమ్ ॥**

**ప్ర. అ. –** స్వ = తమయొక్క, అస్త్రరూప = అస్త్రస్వరూపములతో, స్ఫురత్ మౌళి ప్రకాశించు శిరస్సులను కలిగినవి అగునట్లుగా, సురాన్ = దేవతలను, మా శబ్ద ఇతి = సద్దును చేయకుడని, తర్జనీముద్రయా = చూపుడు వేలును ఎత్తిచూపు ముద్రతో, ఉద్ధునానాన్ = బెదరినవారినిగా చేయునది, నాథ = శ్రీరంగనాథునియొక్క, నిద్రా = నిద్రకు, ఉచిత = తగినట్లు (రక్షణ చేయుచు), ఉత్– నిద్ర = (నిత్యకైంకర్యవశమున తనకు) నిద్ర లేకుండుటచే, తామ్ర = ఎఱ్ఱనైన, ఈక్షణామ్ = కన్నులను కల్గినది, సంచరంతీం = ఎల్లప్పుడు తిరుగాడునది అగు, తాం = ఆ, పంచ ఆయుధీం చ = పంచాయుధ సమూహమునుకూడ, స్తుమః = స్తుతించెదము.

**వరివస్య :–** ఈ శ్లోకమున, భగవానునకు అంతరంగ కైంకర్యమును చేయు పంచాయుధములను కవి స్తుతించుచున్నారు. ముందు శ్లోకమున భక్తులకు ఆనందబాష్పములను కలుగచేయు రుద్రాదేవిని స్తుతించిన కవి, ఈ శ్లోకమున విరోధులకు శోకబాష్పములను కల్గించు పంచాయుధములను స్తుతించుట సంగతమే కదా!

పాంచజన్యమను శంఖము, సుదర్శనమను చక్రము, నందకమను ఖడ్గము, శార్ ఙ్గమను ధనుస్సు, కౌమోదకి అను గద – ఈ అయిదు పంచాయుధములు అనబడుచున్నవి. ఇవి ఎల్లప్పుడును భగవానునకు అంతరంగ కైంకర్యమును చేయును. అస్త్రరూపములగు ఈ పంచాయుధములు నిత్యసూరులగుటచే పురుషరూపమున సంచరించుచు, భగవానుని కైంకర్యమును నిర్వహించును. అట్టి స్థితిలోకూడ వారి శిరస్సులలో ఆ యా అస్త్రరూపములు వ్యక్తమగు చుండును. ఎల్లప్పుడును అటు ఇటు సంచరించుచు భగవత్కైంకర్యమును చేయు ఈ పంచాయుధములకు భగవంతుని పట్ల ఉండే ప్రేమాతిశయము వల్ల అస్థానే భయశంక కల్గును. అట్టి సందర్భమొకటి ఈ శ్లోకమున కవిచే ప్రస్తుతింపబడుచున్నది.

శ్రీరంగనాథుడు యోగనిద్రలోనున్నప్పుడు బ్రహ్మ, ఇంద్రుడు మొదలగు దేవతలు వచ్చి, స్వామిని స్తుతింతురు. వారి స్తుతివలన ఏర్పడిన కలకలము స్వామి నిద్రకు భంగమును కల్గించునేమో? అను శంక పంచాయుధములకు కల్గును. అపుడు పురుషరూపములోనున్న ఆ ఆయుధములు వారిని వారించుటకు ప్రయత్నింతురు. వారు దేవతలను “శబ్దము చేయకుడు” అనుచు నివారింపవచ్చును. కాని, తామట్లు చేసినచో, తమ మాటల వల్ల అచటి శబ్దము మరింత అధికమై, స్వామి నిద్రకు మరింత ఆటంకము కల్గునని తలచిన ఆ పంచాయుధములు మౌనముగా తమ చూపుడు వేలుతో దేవతలను “సద్దు చేయకుడని” సైగచేయుచు, బెదరింతురు. ఇట్లు వారు స్వామిని ఎల్లప్పుడు

రక్షించుచు జాగరూకులై, నిద్ర లేకుండ ఉండుటచే, వారి కన్నులు ఎఱ్ఱగా మారి యుండును. ఇట్టి పంచాయుధములను స్తుతింతుము – అని శ్లోకభావము.

పంచాయుధములు నిత్యసూరులు. "**సదా పశ్యంతి సూరయః**" (ఋ. అష్ట, 1-2-7) (నిత్యసూరులు ఎల్లప్పుడూ భగవానుని దర్శింతురు) అనునట్లు, ఎన్నడును నిద్రింపనివారుగా వారు కీర్తింపబడుచున్నారు. నిత్యసూరులు, "**జాగృవాంసః**" అని, "**సదా పశ్యంతి**" అని కీర్తింపబడువారైన పంచాయుధములకు నిద్ర లేకుండుటచే వారి కన్నులు ఎఱ్ఱ బడినవని ఇచట కవి పల్కుట ఎట్లు పొసగును? అనినచో, భగవానునిపై పంచాయుధములకు కల ప్రేమాతిశయమును తెలియజేయుటకొఱకే కవి ఇట్లు పల్కెనని చెప్పనగును.

ఇట్లు పల్కుట ఆళ్వారులవంటి అభియుక్తులకు పరిపాటియే. పెరియాళ్వార్లు తమ ప్రబంధమున

**"ఉఱకల్ ఉఱకల్ ఉఱకల్ ఒణ్ శుడరాழியే! శజ్గే!**
**అఱవెఱి నాన్దక వాళే! అழకియ శార్ఙ్గమే! తణ్డే!.**
**పళ్ళియఱై కుఱిక్కొణ్ మిన్" (పెరియా. తి. 5-2-9)**

(మిక్కిలి ప్రకాశించు, అందమైన సుదర్శన చక్రరాజమా! శంఖమా! పదునైన నందక ఖడ్గమా! అందమైన శార్ ఙ్గమా! గదా! మీరు మేల్కొనుడు! మేల్కొనుడు. భగవానుని శయ్యాగృహమును రక్షింపుడు) అని ప్రార్థించుట ఇచట స్మరణీయము. "**నాథనుక్కు నిద్దిరై ఉణ్మైయాకిల్, ఇవై యెల్లామ్ ఉణ్ మైయాకుమ్**" (భగవానునకు నిదుర నిజమైనచో, ఇది అంతయు నిజమగును) అను ఆచార్యహృదయ శ్రీసూక్తియు ఇచట స్మరింపనగును. సహజముగానే పంచాయుధముల కన్నులు ఎఱ్ఱనివి – అని కొందరు వ్యాఖ్యానింపగా, మరి కొందరు, దేవతలపై గల కోపముచే వారి కన్నులు ఎఱ్ఱబడినవని వివరించిరి.

పంచాయుధముల మంగళ శాసనతత్పరత వల్ల కూడా వాటికి నిద్ర లేకుండా ఉండును కదా.

**"స్వాస్త్రరూపస్ఫురన్మౌలి"** అను పదము క్రియావిశేషణము. **"స్వాస్త్ర రూపస్ఫురన్మౌలిమ్ ఆః శబ్ద ఇతి"** అను అన్వయాంతరమును కలదు. ఈ అన్వయమున, **"స్వాస్త్రేత్యా"** ది సమస్తపదము పంచాయుధీవిశేషణము. **"ఆః"** అనునది **"ఆ స్తు స్యాత్ కోపపీడయోః"** అను అమరకోశవచనమునుబట్టి, పీడార్థకము, "మీ మాటలు స్వామి నిద్రకు అంతరాయమును కల్గించు చున్నవే!" అని భావము. ఈ అన్వయము విరళముగా కన్పించుచున్నదని వేంకటాచార్యకృతసంస్కృతవ్యాఖ్యానము తెలిపినది. ఈ శ్లోకములోని చకారమును ఉక్తసముచ్చాయకముగా గాని, లేక, ప్రాధాన్యసూచకముగా గాని అన్వయింపవచ్చును. **"స్వతః ప్రసాదోన్ముఖరాన ఆళ్వార్ కళుక్కు స్తుతి అధికై ఎన్ను మర్థత్తై క్కాట్టుకిఱదు"** (సహజముగానే భక్తులను సదా అనుగ్రహించడానికి ఎల్లప్పుడు సిద్ధముగా ఉండేవారైన పంచాయుధాళ్వారులకు ఈ స్తుతి అధికం – అనే అర్థాన్ని చకారం తెలుపుతున్నది) అని వాధూల వీరరాఘవాచార్యస్వామివ్యాఖ్యలో వివరింపబడినది.

ఇందు వృత్తము స్రగ్విణి, **"రై శ్చతుర్భి ర్యుతా స్రగ్విణీ సంమతా"** అని దీని లక్షణము.

## సుదర్శన చక్రరాజమును శరణు పొందుతున్నాను

**56. అస్త్రగ్రామాగ్రేసరం నాథవీక్షా–**
**సీధుక్షీబోద్వేలనృత్తాభిరామమ్ ।**
**చక్రం దైత్యచ్ఛేదకల్మాషితాంగమ్**
**భ్రామ్యజ్జ్వాలామాలభారి ప్రపద్యే ॥**

**ప్ర. అ. –** నాథ = శ్రీరంగనాథునియొక్క, వీక్షా = కటాక్షమనెడి, సీధు = మధుపానమువలన, క్షీబ = మదించుటచే చేయు, ఉత్ + వేల = అలవి కాని, నృత్త = నర్తనముచే, అభిరామం = అందమైనది, దైత్య = అసురులయొక్క చ్ఛేద = సంహారముచే, కల్మాషిత = కలుషితమైన, అంగం = శరీరమును కల్గినది,

భ్రామ్యత్ = సుడులు తిరుగు, జ్వాలా = జ్వాలలయొక్క, మాల = సమూహములను, భారి = భరించునది (కల్గినది), అస్త్ర = భగవానుని దివ్యాయుధముల, గ్రామ = సమూహములో, అగ్రేసరం = ప్రధానమైనదియు అగు, చక్రం = సుదర్శనచక్రమును, ప్రపద్యే = శరణు జొచ్చెదను.

**వరివస్య** :– శ్రీరంగనాథుని పంచాయుధములలో ప్రధానమగు సుదర్శనచక్రరాజము ఇందు స్తుతింపబడుచున్నది. శ్రీరంగమున శ్రీసుదర్శనమునకు ప్రత్యేకముగా ఆలయముండుట కూడ ఇచట స్మరింపదగినది.

శత్రువులను సంహరింపుమను సందేశమును తెలియజేయు శ్రీరంగనాథుని చూపులచే మిక్కిలి ఆనందమును పొందిన సుదర్శనము మధుపానముచే మత్తెక్కినట్లు తల ఏదియో, కాలు ఏదియో తెలియనట్లు నాట్యము చేయును. అట్లు గిరగిరా తిరుగునపుడు, సుదర్శనచక్రముయొక్క జ్వాలలు దాని చుట్టును పరిభ్రమించుచుండును. రాక్షసులను సంహరించునప్పుడు వారి రక్తము అంటుకొనుటచే చక్రరాజమునకు శరీరమున మరకలు ఏర్పడును. (ఆ మరకలు సుదర్శనచక్రముయొక్క కైంకర్యనిరతిని, శత్రునిరసన దీక్షను తెలియజేయును) ఇట్టి సుదర్శనచక్రమును శరణు జొచ్చెదను – అని శ్లోకభావము.

చక్రమునకు పరిభ్రమణము అనేది సహజ స్వభావము అయినప్పటికీ, సుదర్శన చక్రము ఎల్లప్పుడూ పరిభ్రమించుటకు ఒక అందమైన హేతువును కవి ఈ శ్లోకములో ఉద్భావించుచున్నారు.

ఎల్లప్పుడును రాక్షససంహారములో, భగవత్కైంకర్యములో నిమగ్నమై యుండు సుదర్శనమునకు తన శరీరమున అంటుకొనిన రక్తపు మరకలను తుడుచుకొనుటకుకూడ అవకాశమే ఉండదు – అను విశిష్టమైన వ్యంగ్యము ఇచట అనురణన ధ్వనివలన ఏర్పడుచున్నది. **“మాలా”** శబ్దము సంస్కృతమున ఆకారాంతమైనను, **“ఇష్టకేషీకామాలానాంచితతూలభారిషు”** (6–3–65) అను

వ్యాకరణసూత్రముచొప్పున సమాసాంతమున హ్రస్వమై, "**మాల**" గా మారును. "**భ్రామ్యత్**" అనునది చక్రమునకు వ్యస్తవిశేషణమనియు చెప్పవచ్చును.

"**చిత్రం కిమ్మీరకల్మాషశబల**" అను అమరకోశవచనమును బట్టి, కల్మాష శబ్దము ఇచట చిత్రవర్ణమును చెప్పును. కావున, "**కల్మాషితాంగమ్**" అనుటకు చిత్రవర్ణమును కల్గిన శరీరమును కల్గినదను అర్థము వచ్చును. ఇందువలన, చక్రరాజము శరీరమున ఏర్పడిన మరకలు ఆ చక్రము శోభకు లోపమును కలుగజేయక, మరింత శోభను చేకూర్చుచున్నవను భావము ఏర్పడుచున్నది.

ఈ విధముగా శోభను చేకూర్చుట అనునది రెండు విధములుగా అని చెప్పవచ్చును. సుదర్శనము ఎర్రని కాంతిని కలిగినది కనుక ఈ రెండు వర్ణముల కలయిక వలన ఏర్పడిన పరభాగశోభ కారణముగా చక్ర రాజము మరింత ప్రకాశించుచున్నది. ఆ విధముగానే, చక్ర రాజము శరీరములో గోచరించు రక్తపు చిహ్నములు అతడు చేసిన శత్రు సంహారమునకు, స్వామి భక్తికి, భాగవత సేవకు గుర్తులు కనుక, అవి అతని స్వరూపమునకు అంతు లేని ప్రకాశమును కలిగించుచున్నవి.

"**జ్వాలామాలహారి**" అను పాఠాంతరమున్నను, అది అర్థవంతముకూడ కాదు. కావున, ఉపేక్షింపదగినది. "**నాథవీక్షసింధుక్షీబోద్వేల**" అను ఇంకొక పాఠమును శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో కన్నడుచున్నది. భగవానుని కన్నులు అను సముద్రములో భక్తులను చూచిన ఆనందాతిశయముచే ఉద్వేలముగా ఎగసిపడు కెరటముల కలయికవలన ఆవర్తము ఏర్పడును. ఆ ఆవర్తమువలె సుదర్శనము మనోహరము – అని అచట వివరింపబడినది.

ఇందు "**నాథవీక్షాసీధు**" అనుచు భగవత్కటాక్షమును మధువుగా రూపించుటచే రూపకాలంకారము, వృత్తము శాలిని. "**భ్రామ్యజ్జ్వాలామాలభారి**"

యగు సుదర్శనమును "కీర్తింపబడుచున్నది" అను అర్థము నిచ్చు "**శాలినీ**" అను పేరును కల్గిన వృత్తములో కవి వర్ణించుట మిక్కిలి తగినది కదా!

"**శాలిన్యుక్తా మ్తౌ తగౌ గో ౽ బ్ధిలోకైః**" అనునది ఈ వృత్తలక్షణము. 4–7 అక్షరములకు యతి. "**వీక్షాసింధు**" అను పాఠాంతరము శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో కలదు.

## హనుమద్విభీషణులకు నేను శేషభూతుడను

**57. హనుభూషవిభీషణయోః స్యాం**
**యతమా విహ మోక్ష ముపేక్ష్య।**
**రఘునాయకనిష్క్రయభూతం**
**భువి రంగధనం రమయేతే ।**

**ప్ర. అ. –** యతమౌ = ఏ హనుమంతుడు, విభీషణుడు, మోక్షం = మోక్షపురుషార్థమునుకూడ, ఉపేక్ష్య = కాదని, ఇహ భువి = ఈ భూలోకమున, రఘునాయక = శ్రీరామునియొక్క, నిష్క్రయభూతం = మూలధనముగా నున్న, రంగధనం = శ్రీరంగనాథుని, రమయేతే = (కైంకర్యము ద్వారా) సంతోష పెట్టుచున్నారో, అట్టి, హనుభూష = హనుమంతుని, విభీషణయోః = విభీషణుని (సంబంధమును), స్యామ్ = కల్గినవాడనగుదును.

**వరివస్య :–** భట్టరు ఈ శ్లోకమున హనుమద్విభీషణుల రామభక్తిని కొనియాడుచు, "వారితో సంబంధమును కలిగియుండవలెను, వారికి సేవచేయవలెను" అను తమ అపేక్షను తెలియజేయుచున్నారు.

హనుమంతుడు, విభీషణుడును శ్రీరామచంద్రుని భక్తులలో అగ్రేసరులు. వీరు మోక్ష పురుషార్థమును సైతము కాదని, శ్రీరామునకు మూలధనమును, ఆ శ్రీరాముని ప్రతినిధియగు శ్రీరంగనాథుని సేవించుచు, చిరంజీవులై, ఈ లోకముననే కాలమును ఇప్పటికీ గడపుతున్నారు, లీలావిభూతిలో కూడ నిత్యవిభూతియందువలె భగవత్కైంకర్యముతో కాలమును

గడపు వీరు, **"విణ్ణుళారిలుమ్ శీరియరే"** (తిరువి. 79) (ఈ లీలావిభూతిలో ఎల్లప్పుడూ భగవంతుని అనుభవమును పొందువారు నిత్యసూరుల కంటెను గొప్పవారు కదా!) అనునట్లు, నిత్యసూరుల కంటెను అధికులు. అట్టి మహనీయులకు శేషభూతుడనై, కైంకర్యమును చేసెదను – అని శ్లోక భావము.

**"స్నేహో మే పరమో రాజన్! త్వయి నిత్యం ప్రతిష్ఠితః,**
**భక్తిశ్చ నియతా వీర! భావో నాన్యత్ర గచ్ఛతి"(రా. ఉత్తర. 40–16)**

(ఓ రాజా! నాకు నీ విషయంలో స్నేహం చాలా గొప్పదై, నిలకడగా ఉన్నది. వీరా! భక్తి కూడా నియతమై ఉన్నది. నా భావం నీ రూపంలో తప్ప, వేరొక విషయంలో పోవడం లేదు) అను శ్రీరామాయణశ్లోకమున హనుమంతుని రామభక్తివైశిష్ట్యము తెలియుచున్నది. **"భావో నాన్యత్ర గచ్ఛతి"** అనునపుడు **"అన్యత్ర"** అనుటకు వేరొక వ్యక్తియందు– అని మాత్రమే కాక, వేరొక లోకము అగు పరమపదమునందు కూడ – అను అర్థమును చెప్ప వీలగును. కావున, హనుమంతుడు మోక్షము కన్న, రామభక్తినే మిన్నగా తలచెనని ఏర్పడుచున్నది.

అభియుక్తులైన శ్రీవత్సాంకులు అతిమానుషస్తవమున –

**"సో ఽ త్రైవ హంత! హనుమాన్ పరమాం విముక్తిం**
**బుద్ధ్యా విధూయ చరితం తవ సేవతే"** (32)

(ఆహా! ఆశ్చర్యం! హనుమంతుడు గొప్పదైన మోక్షాన్నికూడా మనసులో కాదనుకొని, నీ చరిత్రను ఇక్కడే ఉంటూ అనుభవిస్తున్నాడు) అను శ్లోకముద్వారా పై భావమును రమణీయమైన రీతిలో పల్కిరి. హనుమంతునకు ఉత్కటమైన రామభక్తి ఉన్నట్లే, ఆ రామచంద్రునకు ప్రతినిధి అగు శ్రీరంగనాథుని విషయమున అతివేలమైన భక్తి ఉండుట సహజమే కదా!

శ్రీరామాయణము యుద్ధకాండములోని 131వ సర్గలో,

**"లబ్ధ్వా కులధనం రాజా లంకాం ప్రాయాద్విభీషణః"**

(సూర్యవంశానికి కులధనం అయిన శ్రీరంగనాథుని పొంది, రాక్షసప్రభువు అయిన విభీషణుడు లంకకు బయలుదేరాడు) అను శ్లోకము ఒకటి కలదు. ఇచట "**కులధన**" మనుటకు ఇక్ష్వాకుకులధనమగు శ్రీరంగనాథుడను అర్థమును సంప్రదాయాభిజ్ఞులు వచింతురు. ఈ విషయమున కొందరకు అభిప్రాయభేదమున్నను, ఇట్లు చెప్పుటయే యుక్తమని తోచును. ఎందులకనగా,

**"కిం చాన్యద్వక్తు మిచ్ఛామి రాక్షసేంద్ర! మహాబల!**
**ఆరాధయ జగన్నాథ మిక్ష్వాకుకులదైవతమ్"**

(ఓ రాక్షస రాజా! గొప్ప బలాన్ని కల విభీషణా! నీకు ఇంకొక విషయాన్ని కూడా చెప్పాలని అనుకుంటున్నాను. జగన్నాథుడు ఇక్ష్వాకులదైవతం అయిన శ్రీరంగనాథుని నీవు ఆరాధించు) అని ఉత్తరరామాయణమున,

**"యావత్ చంద్ర శ్చ సూర్య శ్చ యావత్ స్థాస్యతి మేదినీ,**
**తావత్ రమస్వ రాజ్యస్థః కాలే మమ పదం వ్రజ,**
**ఇత్యుక్త్వా ప్రదదౌ తస్మై స్వవిశ్లేషాసహిష్ణవే,**
**శ్రీరంగశాయినం స్వార్చ్య మిక్ష్వాకుకులదైవతమ్,**
**రంగం విమాన మాదాయ లంకాం ప్రాయాద్విభీషణః"**

("సూర్యుడు, చంద్రుడు ఉన్నంతకాలం ఈ భూమి ఉన్నంత కాలం, నీవు నీ లంకానగరంలో ఉన్నవాడవై, రాజ్యాన్ని పరిపాలించు. తరువాత, తగిన కాలంలో నా స్థానాన్ని పొందు" అని అంటూ తన విశ్లేషాన్ని సహించలేని విభీషణునకు తాను ఆరాధించే అర్చామూర్తి, ఇక్ష్వాకు కులదైవతం అయిన శ్రీరంగనాథుని శ్రీరాముడు విభీషణునకు ఇచ్చాడు. ఆ రంగవిమానాన్ని తీసుకొని విభీషణుడు లంకకు బయలుదేరాడు) అని పాద్మపురాణమున పై విషయము స్పష్టముగా తెలుపబడియున్నది. అంతేకాక, ఈ ప్రమాణశ్లోకములను మహేశ్వరతీర్థులను సుప్రసిద్ధశ్రీరామాయణ వ్యాఖ్యాతయు పేర్కొనెను.

భగవన్నిర్హేతుక కృపవలన సమస్తవిద్యలను నేర్చిన భట్టనాథులును (పెరియాళ్వార్లు) తమ ప్రబంధమున,

**"మన్నుడైయ విబీడణఱ్కాయ్ మదిళిలజ్గై విశై నోక్కి, మలర్కణ్ వైత్త ఎన్నుడైయ తిరువరజ్గఱ్కు"**(పెరియా. తి. 4-9-2)

(గొప్ప వైభవమును కల్గిన విభీషణుని కొఱకై కోటలను కల్గిన లంక గల దక్షిణదిశను కటాక్షించుచు, వికసించు పూవువంటి తన నేత్రములను పఱపిన నా శ్రీరంగనాథునకు) అని పల్కుట ఇచట స్మరింపతగినది – అని శ్రీ ప్రభ. అణ్ణాస్వామి వివరించిరి.

**"హనుభూషవిభూషణయోః"** అనునపుడు షష్ఠీవిభక్త్యంతముగా చెప్పినచో, "హనుమంతునకు, విభీషణునకు శేషమైయుందును" – అను అర్థము వచ్చును. సప్తమీవిభక్త్యంతముగా చెప్పినచో, "వారిద్దరిలో ఒకడనై నేనగుదును" అను విశిష్టమైన అర్థము వచ్చును.

**"దుర్లభో మానుషో దేహ – ఇతి దుర్లభే లబ్ధే, మానుషే దేహే నాదరః. మాస్తు మానుష్యం, వానరో వా భూయాసం, రాక్షసో వా భూయాసమ్."** ("మానవజన్మ చాలా దుర్లభం" – అని చెప్పబడే ఆ మానవ జన్మలో నాకు ఆదరం లేదు. మానవజన్మ నాకు వద్దు. నేను శ్రీరాముని అనుభవానికి తగినట్టుగా వానరుడైనా కావాలి, రాక్షసుడనైనా కావాలి" అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలోని వివరణము. మఱియు, **"యథా అసంఖ్యేషు భగవద్భక్తేషు ఇమౌ యతమౌ ఇతి నిర్దిశ్యేతే, తథా అహ మనయోః అన్యతరః స్యామ్"** (లెక్కలేనంతమంది భగవద్భక్తులలో "వీరిద్దరూ" అని ప్రత్యేకంగా ఎవరు నిర్దేశింపబడతారో, వారిద్దరిలో నేను ఒకడను కావాలి" అనియు ఆ వ్యాఖ్యలో వివరింపబడుట విశేషము. **"ఎమ్బెరుమాన్ పొన్మలైమేల్ ఏదేను మావేనే"** (భగవంతుని కొండపై ఆ స్వామి నిత్య కైంకరియమునకు ఉపయోగపడు విధముగా నేను ఏమైనా కావలెను) అని కులశేఖరులు కూడా ఆశపడ్డారు కదా

హనుమద్విభీషణులు తమకు శ్రీరాముని పట్ల గల భక్తివైశిష్ట్యముచే మోక్షమును సైతము వలదని, ఆ రాముని ప్రతినిధి అగు శ్రీరంగనాథునకు సపర్య చేయుటయే తమ జీవనాధారముగా అనుకొనునట్లే, నేను కూడ శ్రీరంగనాథుని కైంకర్యము కన్న, పరమ భాగవతులగు వారిరువురి పరిచర్యను మిన్నగా తలచి, చేయుదును – అను ఇచటి తాత్పర్యమువలన, భగవత్సేవ కంటే భాగవతసేవ గొప్పదను విశేషార్థము పొందుపరుపబడినదని తెలియుచున్నది. మనము మోక్షమును కోరి, శ్రీరంగవాసమును చేయగా, వీరిరువురును మోక్షమును కాదని శ్రీరంగవాసమును కోరుట విశేషము.

శ్రీరంగనాథుని ధనముగా రూపించుట భోగ్యతను చెప్పుటకొరకు. ఆళ్వార్లును "**పవళత్తూణై**" (తిరుక్కు౹ఱు. -1) (పగడపు స్తంభం), "**వైత్త మానిది**" (తి. వా. 6-7-1) (పేర్చి పెట్టుకున్న గొప్ప నిధి) అనుచు పలుచోట్ల భగవానుని గొప్ప నిధిగా స్తుతించిరి. భాగ్యశాలురకు మాత్రమే ధనము లభించునట్లు, పుణ్యపురుషులకు మాత్రమే భగవానుడను ధనము లభించును. సిద్ధాంజనముద్వారా ధనము ఎచట ఉన్నదో తెలిసికొనవచ్చును. అట్లే, భక్తిసిద్ధాంజనముద్వారా భగవానుని దర్శింపవచ్చును. నిధి లభించినవారు ఎవరిని లెక్కచేయరు. భగవానుడను నిధిని పొందినవారు "**తృణీకృతవిరించాది**"అనునట్లుందురు. ఇట్లు అనేక విధముల భగవానునకు నిధికిని సామ్యము ఉండుటచే భట్టరు ఇచట స్వామిని "**రంగధన**" అని పలికిరి.

"**రంగధన**" అనుటకు – శ్రీరంగమున గల ధనమువలె, భోగ్యుడైన శ్రీరంగనాథుడని, శ్రీరంగమును ధనముగా కలవాడని –రెండు విధములుగా అర్థమును చెప్పవచ్చును. మొదటి వివరణమువలన, స్వామిలోని భోగ్యతాతిశయము, రెండవ వివరణమువలన, భగవానునకు గల దివ్యదేశనివాసప్రావణ్యము చెప్పబడుచున్నవి. "**మోక్ష ముపేక్ష్య రంగధనం రమయేతే**" (మోక్షాన్ని కాదని శ్రీరంగనాథుడు అనే ధనాన్ని అనుభవిస్తున్నారు) అనుటచే, అర్చావతార ప్రాశస్త్యము పరోక్షముగా కొనియాడబడినది. మరియు,

**"రమయేతే"** అను ప్రయోగము **"ప్రహర్షయిష్యామి సనాథజీవితః"** (స్తో. ర. 46) (సఫలం చేసుకున్న జీవితాన్ని కలవాడనై, నిన్ను నేను ఆనందింపజేస్తాను) అను యామునార్యసూక్తిని జ్ఞప్తికి తెచ్చును. తమ కైంకర్యములతో వారిరువురును శ్రీరంగనాథుని రంజింపచేయుచున్నారని – భావము. శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో **"రఘునాయకనిష్క్రయభూతమ్"** అనుటకు **"యద్యపి రఘునాయకో ఽనయోః నాయకః, ఏతద్భక్తిక్రీతః సః అనయోః విక్రయార్హో భవతి – ఇతి వ్యజ్యతే నాయకశబ్దేన, క్రయశబ్దోపాదేన చ"** (వీరిద్దరికి రామచంద్రుడు నాయకుడు అయినప్పటికీ, వీరి భక్తికి అమ్ముడు పోయిన అతడు వీరిద్దరికీ విక్రయార్హుడు అవుతున్నాడు – అని నాయక శబ్ద ప్రయోగం వల్ల, క్రీత శబ్దప్రయోగం వల్ల ఇక్కడ ధ్వనిస్తున్నది) అని, **"రామరత్నం విక్రీయతే, రంగధనం, రంగరత్నం క్రీయతే రామారాధ్యం, రామకులధనం, రంగధనం రామాదపి అధికార్ఘమ్"** (రామరత్నం అమ్మబడుతున్నది, రంగధనం, రంగరత్నం కొనబడుతున్నది. రామకులధనం అయిన రంగధనం రాముని కంటే ఎక్కువ విలువను కలిగినది) అనియు **"రంగధనం"** అనుటకు అచట వివరింపబడినది. **"రంగధనం రమయేతే"** అనునపుడు, **"ధనం రమేరన్ జనాన్; ధనం రమయేతే ఇమౌ. 'ఏష హ్యేవానందయాతి' (తై. ఉ.)ఇతి ప్రసిద్ధం సర్వానందహేతుభూతం ఆనందయతః"** (రంగధనాన్ని జనులు ఆనందిస్తారుగాక, వీరిద్దరు. ఆ ధనాన్ని ఆనందింపజేస్తున్నారు. "ఈ పరమాత్మే అందరినీ ఆనందింప జేస్తున్నాడు" అని వేదంలో ప్రసిద్ధమైన, అందరికీ ఆనందానికి కారణభూతమైన రంగధనాన్ని వీరిద్దరూ ఆనందింపచేస్తున్నారు) అనియు ఆ వ్యాఖ్యలోనే రస్యముగా వ్యాఖ్యానింపబడినది.

**"రంగధన"** అనునపుడు వేదాంతదేశికుల వైరాగ్యపంచకం అనే స్తోత్రములోని **"ధనంజయవివర్ధనం ధన ముదూఢగోవర్ధనమ్"** (ధనంజయునిచేత వృద్ధి పొందింపబడినది, గోవర్ధనాన్ని ధరించినది అయిన శ్రీకృష్ణుడు అనే ధనాన్ని) ఇత్యాది వైరాగ్యపంచకశ్లోకముకూడ స్మరణీయము.

ఇందు అలంకారము రూపకము, వృత్తము మేఘవితానము. "**త్రిసగా అపి మేఘవితానమ్**" అని దీని లక్షణము.

## శ్రీరంగ వేత్రవరమును శరణ పొందుతున్నాను

**58. ఇతో బహిః పంచ పరాంచి ఖాని**
**ప్రత్యంచితాని స్యు రితోఽంఽత రిత్థమ్ ।**
**ఔపాధికేభ్యో నిరుపాధిభోగ్యే**
**ప్రత్యాహర ద్వేత్రవరం వ్రజామి ॥**

**ప్ర. అ. –** పంచ = అయిదు, ఖాని = ఇంద్రియములు, ఇతః బహి = ఈ ప్రదేశమునకు బయట, పరాంచి = బాహ్య విషయములందు అగ్నమైనవై, స్యుః = ఆగు గాక, తాని = ఆ ఇంద్రియములు, ఇతః అంతః = ఈ ప్రదేశమునకు లోపల, ప్రత్యంచి "ప్రత్యక్' అగు శ్రీరంగనాథునియందు లగ్నమైనవై, స్యుః = అగుగాక (అని), ఇత్థం ఇట్లు, ఔపాధికేభ్యః. సోపాధికములైన లౌకిక విషయములనుండి, నిరుపాధిభోగ్యః = స్వయం భోగ్యతను కల్గిన శ్రీరంగనాథునియందు, ప్రత్యాహరత్ = (ఇంద్రియములను) మరల్చునట్టి, వేత్రవరం = శ్రేష్ఠమైన బెత్తమును, వ్రజామి = పొందెదను (శరణు వేడెదను).

**వరివస్య :–** శ్రీరంగనాథుని ఆలయమున గర్భగృహములోని బాహ్యద్వారప్రదేశమున దారికి అడ్డముగా నిలుపబడినది, దేవాలయ పాలనకైంకర్యమును నిర్వహించునది అగు వేత్రవరమును (బెత్తమును) భట్టరు ఈ శ్లోకమున ప్రస్తుతించుచున్నారు. బెత్తము శిక్షించుటకు ఉపయోగపడు సాధనము, దేవాలయమువద్దకు వచ్చిన వారందరు గభాలున లోనికి యధేష్టముగా ప్రవేశింపకుండ ద్వారరక్షణను చేయుటకై ప్రతిష్ఠింపబడిన ఈ వేత్రముయొక్క భంగిమను చమత్కారముగా కవి ఉత్ప్రేక్షించుట ఇందలి విశేషము.

ఆలయమును సమీపించిన వారిలో యోగ్యత కల్గినవారిని లోనికి ప్రవేశింప అనుమతించుట, లేనివారిని లోనికి రాకుండ అడ్డుకొనుటయే కదా దండముయొక్క ప్రయోజనము. పంచేంద్రియములకు రెండు విధములైన ప్రవృత్తులు కలవు. బాహ్యావిషయములందు ఆసక్తములగుట, ప్రత్యగాత్మ అట, గు భగవానుని యందు లగ్నమగుట – అనునవి ఆ రెండు ప్రవృత్తులు. శ్రీరంగనాథుని సేవింపవచ్చినవారు తమ పంచేంద్రియముల బాహ్యావృత్తిని బయటనే నిలిపి, ఆంతరవృత్తిని కల్గినవారై లోనికి ప్రవేశించునట్లు ఈ బెత్తము చేయును. భట్టరు ఇంతకు ముందు శ్లోకములలో కావేరీనది, చంద్రపుష్కరిణి, గోపురప్రాకారములు, మండపములు, పొన్నచెట్టు మొదలగు బాహ్యావిషయములను అనుభవించుటలో అసక్తులై యుండిరి. ఇక పై ఆలయములో గల శ్రీరంగనాథుని, అనగా, ప్రత్యగాత్మను తమ ధ్యానమునకు విషయముగా గొని, స్తుతింపబోవుచున్నారు. ఈ రీతిలోనే భక్తులందరును గర్భాలయమునకు బయట గల గోపురప్రాకారములు మొదలగు బాహ్యావిషయములను అనుభవించుటకు పంచేంద్రియములను ఉపయోగింపవలెనని, గర్భగృహమున ప్రవేశించిన పిదప ఆ పంచేంద్రియముల ద్వారా భగవానునే ధ్యానించి, అనుభవింపవలెనను గొప్ప సందేశమును భట్టరు ఈ శ్లోకమున వెలిబుచ్చిరి.

"బాహ్యావిషయములను అనుభవించు ఇంద్రియములు ఈ గర్భగృహమునకు బయటనే ఉండవలెను. అంతరవిషయమగు భగవానుని సేవింపగోరు ఇంద్రియములు మాత్రము గర్భాలయమున ప్రవేశింపవలెను" అను ఒక నియమమును ఏర్పరచుటద్వారా ఔపాధికములైన బాహ్యా విషయములనుండి ఇంద్రియములను మరల్చి, నిరుపాధిక భోగ్యుడగు శ్రీరంగనాథునియందు లగ్నములగునట్లు చేయు వేత్రవరమును శరణు వేడెదను – అని శ్లోకభావము.

లోకములోని ప్రాకృతములైన బెత్తములు రాహుల్తా వస్తువుల అనుభవము విషయమున నియమించుచుండగా, శ్రీరంగములోని నేత్ర వరము ప్రాకృత– అప్రాకృత విషయముల అనుభవములో కట్టడి చేయుచున్నది.

పంచేంద్రియములకు అనుభవించుటకు తగిన విషయములు బాహ్యప్రపంచమున ఉన్నట్లే, వానికి తగిన విషయములు పరమాత్మలో ఉన్నవా? అని ప్రశ్నించినచో, "**యః సర్వగంధః సర్వరసః**" (ఛాందో. 3–4–2) పరమాత్మ అన్ని సుగంధములను కలవాడు, అన్ని రసములను కలవాడు) అని మొదలైన వేదవాక్యము లిందులకు సమాధానము. అనగా పంచేంద్రియములకు అనుభావ్యములైన విషయములు పరమాత్మలోను కలవు – అని భావము. తేడా ఏమనగా, లౌకికవిషయము లందలి భోగ్యత సోపాధికము కాగా, పరమాత్మయందుగల భోగ్యత స్వతఃసిద్ధమైనది. కావున నిరుపాధికమైనది అగుట విశేషము, "**సర్వగంధః, సర్వరసః**" అనునది మిగిలినవానికి ఉపలక్షణమని తెలియనగును. ఇందువల్లనే లోకములోని సామాన్యదండములు ఈ విషయమున నియమించలేవు, అసాధారణమైన శ్రీరంగాలయములోని దండమే ఆ పని చేయగలిగిన శక్తిని కలిగినది.

మండపగోపురాదులకు ఔపాధికభోగ్యత్వమును చెప్పుటలో అర్థమేమనగా, వానికి శ్రీరంగనాథుని సంబంధము వలన భోగ్యత కల్గినదని పల్కుటయే. భగవత్సంబంధమునుబట్టి కదా, ఈ లీలా విభూతి భక్తులకు ఉపాదేయ మగుచున్నది స్వామిభోగ్యత అట్టిది కాదు. స్వతస్సిద్ధమైనది. "**పరాంచి ఖాని**" అనునపుడు "**పరాంచి ఖాని వ్యతృణత్ స్వయంభూః, తస్మాత్ పరాఙ్ పశ్యతి నాన్తరాత్మన్**"(పరమాత్మ ఇంద్రియాలను సృష్టి చేశాడు. వాటికి బాహ్యంగానే ప్రవర్తించే లక్షణాన్ని కలిగించాడు. అందువల్ల మానవుడు ఎల్లప్పుడూ తన చుట్టూ ఉండే ప్రపంచాన్ని చూడడానికి ప్రయత్నిస్తాడు, కానీ, తనలో ఉండే అంతరాత్మను దర్శించడానికి ప్రయత్నం చేయడు) అను కఠశ్రుతి స్మరణమునకు వచ్చును. శ్రుతిలోని "**ఖమ్**" శబ్దము జ్ఞానేంద్రియవాచకముకాగా,

శ్లోకములోని "**ఖమ్**" అను శబ్దము కర్మేంద్రియవాచకము – అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో కలదు.

అలంకారము ఉత్ప్రేక్ష, వృత్తము కీర్తి అను ఉపజాతి విశేషము, "**ఇంద్రియేఽపి ఖమ్**" అను అమరకోశవచనమును బట్టి "**ఖమ్**" అను పదము ఇంద్రియ వాచకము.

## శ్రీరంగగర్భాలయములోని ఆమోదస్తంభములను రెండిటిని శరణు పొందుతున్నాము

**59. శేషశయలోచనామృతనదీరయాకులితలోలమానానామ్ ।**
**ఆలంబమివామోదస్తంభద్వయ మంతరంగ మభియామః ॥**

**ప్ర. అ. –** శేషశయ = ఆదిశేషునిపై పవళించు శ్రీరంగనాథునియొక్క, లోచన = కటాక్షములను, అమృత = అమృతముయొక్క, నదీ = నదియొక్క, రయ = ప్రవాహవేగముచే, ఆకులిత = మిక్కిలి కదల్చబడినవారై, లోలమానానామ్ = తడబడువారికి (భక్తులకు), ఆలంబం = ఆధారము (బాసట), ఇవ = వలె ఉన్న, అంతరంగం = శ్రీరంగవిమానములోపల గల, ఆమోదస్తంభద్వయం = ఆమోదస్తంభములు రెండిటిని, అభియామః = సమీపింతుము.

**వరివస్య :–** వేత్రవరమును దాటి లోనికిపోగానే సాక్షాత్కరించునవి, శ్రీరంగ విమానమునకు ఆధారములై యున్నవి అగు స్తంభములను రెండిటిని భట్టరు ఈ శ్లోకమున స్తుతించుచున్నారు. ఆ పేరును భట్టరు ఆమోదస్తంభమనుచు సంస్కృతీకరించిరని. భావింపనగును. శ్రీరంగనాథుని దివ్యదేహపరిమళమే రెండు స్తంభములుగా రూపొందినవట. కావున వానికాపేరు కల్గినదని పెద్దలు చెప్పుదురు.

ఈ స్తంభములను కులశేఖరాళ్వార్లు తమ దివ్యప్రబంధములోని ప్రథమ దశకములో "**కడియరంగత్తరవణైయిల్ పళ్లికొళ్లుమ్ మాయోనై మణత్తూణే *పత్రి*** **నిన్ఱు**" (పెరుమాళ్. తి. 1–2) (పరిమళ ప్రచురమైన శ్రీరంగమున

ఆదిశేషునిపై పరుండియుండు ఆశ్చర్యచేష్టితుడగు శ్రీరంగనాథుని ఆమోదస్తంభములను అలంబనముగా గొని నిలచి) అనుచు ప్రస్తావించి, వాటిని తాము ఆశ్రయింతుమనిరి.. ఆ పాశురార్థమునే భట్టరు ఈ శ్లోకమున రమణీయముగ అనువదించిరి.

"శ్రీరంగనాథుని కరుణాకటాక్షములు అను అమృతనదీప్రవాహమున మునిగికొట్టుమిట్టాడు భక్తులు తట్టుకొని స్థిరముగా నిలచి, భగవదనుభవమును పొందుటకు అనువైన ఆలంబనములుగా ప్రతిష్ఠింపబడినవా ఈ స్తంభములు!" అనునట్లున్న శ్రీరంగమందిరములోని ఆమోదస్తంభములను రెండిటిని ఆలంబనముగా చేసికొందును. – అని శ్లోకభావము.

శ్రీరంగవిమానమునకు ఆధారములైన స్తంభములను భక్తుల మనస్సులకును ఆలంబనములుగా కవి పల్కుటకు, ముందు ఉదాహరింపబడిన కులశేఖరసూక్తియే కారణము. "**జంగమశ్రీవిమానాని హృదయాణి మనీషిణామ్**" (మహాత్ముల హృదయములు కదిలే స్వభావాన్ని కలిగిన, పరమాత్మ అధివసించి ఉండే విమానములు) అని మహనీయుల హృదయములు జంగమ విమానములుగా చెప్పబడినవి. అట్టి జంగమవిమానములకును ఆమోద స్తంభములు ఆలంబనములనుటచే ఆ స్తంభముల గొప్పతనము తెలుపబడినది.

అంతరంగమను విశేషణమును ఆలంబనమునకు అన్వయించిన ఈ విశేషార్థము స్ఫురించును. ఆమోదస్తంభద్వయమునకు అన్వయించిన విమానాంతర్భాగమున. గల స్తంభములను అర్థము. వచ్చున. ముందు శ్లోకమున చెప్పబడిన బాహ్య – అంతరవిషయవిభాగమునుబట్టి వేత్రమునకు లోపలి భాగమున ఉన్నవి అన్నియు బాహ్యేతరములు, కావున, ఆమోదస్తంభములును అంతరంగ విషయములేనను అర్థము అంతరంగమను పదముచే చెప్పబడినదని చెప్పవచ్చును. స్వామి దివ్యదేహపరిమళముయొక్క రూపమే ఆమోదస్తంభములు.

ఈ ఆమోదస్తంభములకు సికతాస్తంభములు అను పేరు ఉన్నట్లు శ్రీరామానుజాచార్యవ్యాఖ్యలో కలదు. ఆచార్యసూక్తిముక్తావళి అను ఆంధ్రగురుపరంపరా కావ్యములో కూడ "గర్భాలయమున రంగేశు సన్నిధి రమ్యమాణిక్యనద్ధసువర్ణ సైకతస్తంభయుగము" అని కలదు. తమిళభాషలో ఈ స్తంభములు '**మణత్తూణ్**' అని పిలువబడుచున్నవి. ఈ పదమును '**మణల్+ తూణ్**' అని విడదీసి చెప్పవీలున్నదని తలిచిన, తమిళమున '**మణల్**' అను పదమునకు ఇసుక అను అర్థము ఉన్నందున, '**తూణ్**' అను పదమునకు స్తంభము అను అర్థము ఉన్నందున, ఇట్టి వివరణమును వ్యాఖ్యాత ఇచ్చినట్లు తోచును. శ్రీవాధూల వీరరాఘవాచార్యవాఖ్యలోకూడ ఇట్టి వివరణమే కలదు. కాని, ఈ స్తంభములకు సికతాస్తంభములు అను పేరుతో ప్రసిద్ధి ఉన్నట్లు తెలియదు.. అంతియేకాక, నాలాయిరదివ్యప్రబంధ అకారాదిలో "**ఇదు చన్దనమరత్తాలాకి మణమ్ వీశువదాల్ అప్పెయర్ పెఱ్ఱదు**" (ఈ స్తంభములు చందనవృక్షములతో చేయబడినవై, సుగంధమును వెదజల్లుటచే, వీనికాపేరు కల్గినది.) అని వివరింపబడుటచే, ముందు చూపిన ఆమోదస్తంభములను వివరణమే తగినది.

ఈ శ్లోకమున లోచనశబ్దమునకు కటాక్షముకూడ వివక్షితము. శ్రీరంగనాథుని పూర్ణానుగ్రహమును పొందిన భక్తులు తమకు కల్గిన ఆనందాతిశయముచే పిమ్మట చేయవలసిన సేవ ఏదియో తెలియక తడబడుదురు. అప్పుడు వారికి ఆమోదస్తంభములు అలంబనములు అగును – అని రామానుజాచార్యవాఖ్యలో వివరింపబడినది. అతివేగముగా భగవానుని లోచనామృతప్రవాహము ప్రవహించుటచే ఆలంబనముగా గొనిన ఒక స్తంభమునుండి దూరమైనను వేరొక స్తంభము కలదనుటను ద్వయశబ్దము సూచించును.

శ్రీరంగనాథుని నేత్రములను అమృతనదులుగా, కటాక్షములను అందలి కెరటములుగా ఈ శ్లోకమున ఉపమింపబడుటకు దేవరాజాష్టకములోని

**"త్వదీక్షణసుధాసింధువీచి"** (8) వంటి పూర్వాచార్యసూక్తులు నిదానములని చెప్పవచ్చును. స్తంభములకు ఆమోదము చందనాదిలేపనమువలన కల్గెనని చెప్పవచ్చును. లేక, ఆ స్తంభములు అప్రాకృతములు, కావున, అట్టి సౌరభము వానికి కల్గెననియు చెప్పవచ్చును.

**"లోలశబ్దాత్ ఆచారక్విబంతాత్ తాచ్ఛీల్యార్థౌ చానశ్ ప్రత్యయే లోలమానారూపసిద్ధి రితి బోధ్యమ్"** అని శిష్టప్రయోగసంగ్రహమున లోలమానాశబ్దసాధుత్వము సాధింపబడినవి.

ఇందు అలంకారము ఉత్ప్రేక్ష, వృత్తము ఆర్య.

## శ్రీరంగాంతర్మందిరమును సేవిస్తాము

**60. శ్రీరంగాంతర్మందిరం దీప్రశేషం**
**శ్రీ భూమీతద్రమ్యజామాతృగర్భమ్ ।**
**పశ్యేమ శ్రీదివ్యమాణిక్యభూషా-**
**మంజూషాయా స్తుల్య మున్మీలితాయాః ॥**

**ప్ర. అ. –** దీప్రశేషం = తలలపై గల మణులచే ప్రకాశించు ఆదిశేషుని కల్గినది, శ్రీభూమిః = శ్రీదేవి, భూదేవి, తత్ = ఆ రమ్యజామాతృ = శ్రీరంగనాథుడు అను వీరిని, గర్భం = లోపలి భాగమున కల్గినది, ఉన్మీలితాయాః = తెరువబడిన, శ్రీ = లక్ష్మీదేవియొక్క, దివ్య = గొప్పదైన, మాణిక్యభూషా = మణులతోచేయబడిన ఆభరణములయొక్క, మంజూషాయాః = పేటికకు, తుల్యం = సమానము అగు, శ్రీరంగ = శ్రీరంగ విమానముయొక్క, అంతర్మందిరం = గర్భ గృహమును, పశ్యేమ = కన్నులార సేవింతుము.

**వరివస్య :–** శ్రీరంగవిమానములోని గర్భాలయ మిందు ప్రస్తుతింపబడుచున్నది. ఈ స్తోత్రమున ఎనిమిదవ శ్లోకమున **"శ్రీస్తనాభరణం తేజః"** అనుచు భట్టరు లక్ష్మీదేవి స్తనములకు ఆభరణముగా శ్రీరంగనాథుని స్తుతించుట ఇచట స్మరింపతగినది. శ్రీరంగవిమానగర్భగృహమున ఆదిశేషులు

ప్రకాశించుచున్నారు. ఆదిశేషుల. ఒడిలో పవళించియున్న శ్రీరంగనాథుడు, ఆ స్వామిసమీపమున శ్రీదేవి, భూదేవియు కలరు. శ్రీరంగనాథునితో కూడియున్న విమానమును దర్శింపగా మూత తెరువబడిన, శ్రీదేవియొక్క రత్నాభరణ పేటికవలె తోచుచున్నది. ఇట్టి భోగ్యమైన శ్రీరంగవిమానమును కన్నులారా సేవింతుము అని శ్లోకభావము.

"**తద్రమ్యజామాతృగర్భమ్**" అనునపుడు "**తత్**" అను శబ్దము శ్రీదేవి, భూదేవులను పరామర్శించునదిగా అన్వయింపవచ్చును. అపుడు ఆ శ్రీదేవి భూదేవులకు భోగ్యుడైన జామాతను గర్భప్రదేశమున కల్గినది – అను అర్థము వచ్చును. ఈ అన్వయమును వేంకటాచార్యులు అను సంస్కృతవ్యాఖ్యాత చూపిరి. ఈ శ్లోకమున "**దివ్యమాణిక్యభూషా**" అను పదముచే పూర్వము వర్ణింపబడిన (8వ శ్లో.) శ్రీస్తనాభరణమను అర్థము సూచింపబడినది.

తిరువాయ్ మొళిలోని '**కణ్గళ్ శివన్దు**' అను (8–8–1) పాశురమునకు ఈడు వ్యాఖ్యానమున గల "**వయిరప్పేழ త్తిఅన్దాప్పోలే అవయవశోభైయుమ్, ఆయుధశోభైయుమ్, ఆభరణ శోభైయుమాయ్ మిళిరానిన్ఱ దాయ్ త్తు**" (వజ్రపు బరిణె తెరిచినట్లుగా దివ్యావయవాల శోభ, దివ్యాయుధాల శోభ, దివ్యాభరణాల శోభ కలిసి ప్రకాశిస్తున్నవి) అను వాక్య మిచట స్మరణీయము, "**తద్రమ్యజామాతృ**" అనునపుడు '**తత్**' శబ్దమును ప్రసిద్ధార్థకముగా గైకొనిన, శ్రీరంగమున రమ్యజామాతృ నామముతో ప్రసిద్ధుడైన – అను అర్థము ఏర్పడును. శ్రీరంగనాథుడు "**అழకియ మణవాళన్**" అను పేరుతో ప్రసిద్ధుడుకదా. ఆ పేరునకు సంస్కృతీకరణమే రమ్యజామాతృనామము.

"**తద్రమ్యజామాతృ**" అనునపుడు పరోక్షవస్తువును నిర్దేశించు "**తత్**" శబ్దమునకు ప్రత్యక్షముగా కనపడు శ్రీరంగనాథుడను అర్థము చెప్పుట ఎట్లు పొసగును? అని ప్రశ్నించినచో, – శ్రీరంగనాథుని దివ్యశోభకు దృష్టిదోషము కలుగరాదని తలచి, తమ తలను ప్రక్కకు తిప్పి, "**తద్రమ్యజామాతృ**" అనుచు కవి పరోక్ష నిర్దేశమును చేసిరని చెప్పనగును. పెరియాళ్వార్లను

**"అప్పాఇచ్చశన్నియముమ్ పల్లాణ్డే"** (తిరుపల్లాణ్డు-1) (ఆ పాంచజన్యానికి మంగళం) అనుచు ప్రత్యక్షముగా కన్పడు భగవానుని పాంచజన్యమును అస్థానే భయశంక కారణముగా, పరోక్షముగా నిర్దేశించిరి కదా! ఇచట రత్నాభరణ పేటికాసామ్యముచే విమానముయొక్క భోగ్యత సూచింపబడినది.

శ్రీదేవి నారీరత్నము. భూదేవి రత్నగర్భ, శ్రీరంగనాథుడు అపూర్వమైన చింతామణి. ఇట్లు శ్రీరంగములోని ఆలయములోని గర్భగృహము మణిమయము. శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో "**దివ్యమాణిక్యేతి మకారార్థభూత జ్ఞానమయస్వయంప్రకాశ జీవరత్నగ్రహణమ్. మకారార్థసన్నికర్షాయ మకారాదిమాణిక్యనామగ్రహణమితి విభావ్యమ్. మకారార్థజీవ సముదాయద్యోతనాయ తద్రత్నమంజూషాసాదృశ్యవర్ణనమ్.**" (దివ్యమాణిక్య - అనే ప్రయోగంలో మకారంచేత చెప్పబడే జ్ఞానమయుడైన, స్వయంప్రకాశ స్వరూపుడైన జీవుడనే రత్నాన్ని అర్థంగా గ్రహించాలి. మకారార్థ సన్నికర్ష భాసించడంకోసం మకారాన్ని ఆరంభంలో కలిగిన మాణిక్యం అనే ప్రయోగం చేయబడిందని భావించాలి. అంటే, రత్నాన్ని చెప్పే పదాలు ఎన్నో ఉన్నప్పటికీ, మకరంతో ఆరంభం అవుతున్న మాణిక్య శబ్దాన్ని ప్రయోగించడం జరిగింది అని భావించాలి. మకారంచేత చెప్పబడే జీవుల సముదాయం ఆభాసించడంకోసం ఆ రత్నాలతో ఆభరణాలు పెట్టబడిన పేటికతో పోలిక వర్ణింపబడిందని తెలియాలి) అని వివరింపబడినది. అట్లే, శ్రీరంగనిమానము ప్రణవాత్మకము కావున ప్రణవములో అకారముచే భగవానుడు, ఉకారముచే లక్ష్మీదేవి, మకారముచే జీవుడు సూచింపబడినట్లే, శ్రీరంగనిమానమున భగవానుడగు శ్రీరంగనాథుడు, లక్ష్మీదేవి, జీవసంఘాతాత్మకమగు కౌస్తుభరత్నము ఉండుటచే, అకార, ఉకార, మకారాత్మకమై, ప్రణవాకారమై శ్రీరంగవిమానము ఉన్నదని ఆ వ్యాఖ్యలో వివరింపబడినది. '**ఉన్మీలిత**' శబ్దము స్ఫుటముగా ముగ్గురునూ ప్రకాశించుటను తెలుపును.

అలంకారము ఉత్ప్రేక్ష, వృత్తము శాలిని. "**శాద్యతే శ్లాఘ్యతే ఇతి శాలినీ**" (డలయో రైక్యమ్) అను వ్యుత్పత్తిని బట్టి "శాలినీ" అనగా, శ్లాఘింపబడునది అని అర్థము, "**దీప్రశేషం, మాణిక్యభూషామంజూషాయా స్తుల్యమ్**" అను విశిష్టమైన ప్రకాశమును కల్గిన శ్రీరంగదేవాలయాంతర్మందిరమును శాలినీ వృత్తముతో వర్ణించుట సందర్భానుగుణముగా ఛందస్సును ఉపయోగించుటలో కవికి కల చాతుర్యమును తెలుపుచున్నది.

## శ్రీరంగనాథుని పాద పరిచారికలను స్తుతిస్తాము

**61. లీలాలతాకృపాణీభృంగారపత ద్గ్రహార్పితకరాగ్రాః ।**
**ప్రోతావతంసితకుచాః పదాబ్జసంవాహినీ ర్వయం స్తుమహే ॥**

**ప్ర. అ. –** లీలా = విలాసార్థము, లతా = తీగ (వంటి), కృపాణీ = కత్తి, భృంగార = బంగారు గిన్నె, పతద్గ్రహ = తమ్మపడిగము – అను వీనియందు అర్పిత = ఉంచిన, కర +ఆగ్రాః = చేతుల చివరి భాగములను కలవారు, ప్రోత = ఒత్తుటకొఱకు అగు చేనేతవస్త్రముచే, అవతంసిత = అలంకరింపబడిన, కుచాః = స్తనములను కలవారు అగు, పద అబ్జసంవాహినీః = శ్రీరంగనాథుని పాదారవిందములను సంవాహనముచేయు పరిచారికలను, వయం = మనము, స్తుమహే = స్తుతింతుము.

**వరివస్య :–** శ్రీరంగనాథుని పాదసంవాహనముచేయు పరిచారికలను ఇందు కవి స్తుతించుచున్నారు. ఈ శ్లోకమున చెప్పబడిన కైంకర్యవిశేషములన్నియు భగవచ్ఛాస్త్రానుసారమని తెలియనగును. ఈ స్తోత్రములో భగవదారాధన విధి అంతర్గతముగా సూచింపబడుతున్నదని ఇంతకు ముందే చెప్పబడినది. దానికి ఈ శ్లోకము ఇంకొక ఉదాహరణము. అంతేకాక ఈ స్తోత్రము పాంచరాత్ర క్రమమును అనుసరించి, ఆ శాస్త్రమును అనుసరించి భగవద్రామానుజులు అనుగ్రహించిన, భగవదారాధనా విధిని తెలియజేయు నిత్యగ్రంథమును అనుసరించి రచింపబడినది అనుటకును

ఇటువంటి శ్లోకములు చక్కని ఉదాహరణములు. ఇన్ని విధములుగా సాంప్రదాయిక –శాస్త్ర – ఉభయవేదాంత తత్త్వములు మేళవింపబడిన స్తోత్రము వేరొకటి మన సంప్రదాయస్తోత్ర సాహిత్యములు కనిపించదు అనుట సత్యదూరము కాదు.

శ్రీరంగనాథుని పాదములను ఒత్తుటకు అనువుగా చేనేతవస్త్రములను తమ గుండెల పైన ధరించినవారు స్వామికి లీలోపకరణములగు లత, కత్తి, బంగారు గిన్నె, పడిగము, మొదలగువానియందు ఉంచిన చేతులను కలవారు అగు పాదసంవాహనపరిచారికలను, అంతఃపురపరిచారికలను స్తుతింతును– అని శ్లోకభావము.

ఈ శ్లోకమున రెండు విధములైన అన్వయములు కలవు. "**లీలా లతా. కరాగ్రాః**" అను సమాసమును "**ప్రోతావతంసితకుచాః**" అను సమాసమును, రెండిటిని పాదాబ్జసంవాహినులకు విశేషములుగా అన్వయించుట ఒక యోజన. ఈ అన్వయమున పాదాబ్జసంవాహినులకు చెప్పబడిన రెండు విధములైన కైంకర్యములు సమయభేదముచే సాధ్యపడునని భావము. అనగా, కొన్ని సమయములలో లీలాసామగ్రిని ధరించి, కైంకర్యము చేయుట, మరికొన్ని సమయములలో పాదసంవాహనము చేయుట సాధ్యమేనని భావము.

అట్లుకాక, మొదటి సమాసమును ప్రత్యేకముగా లీలాసామగ్రిని ధరించు అంతఃపురపరిచారికలకు అన్వయించి, "**ప్రోతావతంసిత**" అను సమాసమును మాత్రమే పాదసంవాహినులకు విశేషణముగా అన్వయించుట రెండవ యోజన. ఈ యోజనలో, లీలోపకరణములను ధరించు పరిచారికలు వేరు, పాదసంవాహినులు వేరు. ఈ రెండు విధములైన యోజనలను శ్రీ ప్ర. భ. అణ్ణాస్వామి, సంస్కృతవ్యాఖ్యాతయు చూపిరి.

"**లీలాలతాకృపాణీ**" అనునపుడు లతవంటి కృపాణ మనియు చెప్పవచ్చును. నాల్గవ పాదమున "**పాదాబ్జ**" అను పాఠము సరి ఐనది కాదు. ఆర్యాఛందోలక్షణానుసారము "**పదాబ్జ**" అనియే ఉండవలెను.

**"పుంస్యుత్తంసావతంసాథౌ కర్ణపూరేఽపి శేఖరే"** అను నిఘంటువచనప్రకారము, అవతంసపదము కర్ణాభరణముని, శిరస్సునకు ఆభరణమని అర్థమిచ్చునదైనను, **"తామరసావతంసాః జలసంనివేశాః"** (చటకశతకే, 2-3) వంటి ప్రయోగములవలన అలంకారపర్యాయముగా ఇచట ప్రయోగింపబడినది. ఈశబ్దము **"తసి-- అలంకృతౌ'** అను ధాతువునుండి పుట్టినది.

భగవదారాధనలో చేనేత వస్త్రములు ఉపయోగించుట యుక్తమను శాస్త్ర విషయం ఇందు సూచింపబడునది.

**చామరగ్రాహిణులను ఆశ్రయిస్తున్నాను**

**62. ముకుళితనళినాః సకౌముదీకాః**
**ఇవ సునిశావిమలాదికా నవాపి ।**
**శిరసి కృతనమస్యదేకహస్తాః**
**ఇతరకరోచ్చలచామరా శ్ర్యయేయమ్ ॥**

**ప్ర. అ. –** శిరసికృత = తలపై పెట్టుకొనిన, నమస్యత్ = నమస్కరించుచున్న, ఏకహస్తాః = ఒక చేతిని కల్గినవారు, ఇతర = వేరొక, కర = చేతితో, ఉత్ చల = పైకి కదలుచున్న. చామరాః = చామరములను కల్గినవారు, కావుననే, ముకుళిత = ముడుచుకొనిన, నళినాః = తామరపూలను కల్గినవి, సకౌముదీకాః = వెన్నెలతో కూడినవి అగు, సునిశా ఇవ అందమైన రాత్రుల వలె ఉన్నవి అగు, విమలా+ ఆదికాః = విమల మొదలగు, నవ అపి = తొమ్మిదిమంది చామరగ్రాహిణిలను కూడ, శ్రయేయమ్ = ఆశ్రయింతును.

**వరివస్య :–** భగవద్రామానుజులు నిత్యగ్రంథమున **"విమలాయై చామరహస్తాయై నమః, ఉత్కర్షిణ్యై చామరహస్తాయై నమః"** అనుచు తొమ్మిదిమంది చామర గ్రాహిణులను పేర్కొనిరి. ఆగమములలో కూడ,

**"విమలోత్కర్షణీ జ్ఞానాక్రియా యోగా తథైవ చ,**

**విభ్వీ సత్యా తథేశానా శక్తయోఽ ష్ట దళేషు చ, అనుగ్రహా కర్ణికాయామ్"**

అని తొమ్మిదిమంది చామరగ్రాహిణులు పేర్కొనబడిరి. భట్టరు ఆ క్రమమును అనుసరించి ఈ శ్లోకమున చామరకైంకర్యమునుచేయు పరిచారికలను స్తుతించుచున్నారు.

"**మత్తకత్తిడై కైకళైక్కూప్పి!**" (పెరియా. 4-5-2) (తలపై చేతులను ముడిచి) అనునట్లు, తమ తలపై ఒకషచేతిని ముడుచుకొని ప్రణామార్థము దాల్చుచు, వేరొక చేతితో చామరమును బట్టి వీచువారు, కావుననే, ముకుళించిన తామరపూలను, ప్రకాశించు వెన్నెలను కల్గిన అందమైన రాత్రులవలె నున్నవారగు తొమ్మిదిమంది చామర గ్రాహిణులను ఆశ్రయింతును – అని శ్లోకభావము.

ఇందు ముడుచుకొని తలపై దాల్చిన చేతులు ముకుళించిన తామరపూవుతో, చామరమును వీచు చేతులు వెన్నెలతో, విమలాదిచామరగ్రాహిణులు నిశలతో ఉత్ప్రేక్షింపబడినవి. ఒకచేతితో నమస్కరించుట అనునది.

**"ఏకహస్తప్రణామశ్చ ఏకం వాపి ప్రదక్షిణమ్,**
**అకాలే దర్శనం చైవ హంతి పుణ్యం పురాతనమ్"**

(ఒకే చేతితో నమస్కారమును చేయుట, ఒకే ప్రదక్షణమును చేయుట, అకాలములో దర్శించుట – అనే ఇవి ఇంతకు ముందు చేసిన పుణ్యమును కూడా పోగొడుతాయి) అను మొదలగు ప్రమాణములను బట్టి, నిషిద్ధము అయినను వేరొక చేతితో కైంకర్యము చేయువారిపట్ల ఈ నిషేధము వర్తింపదు, కావున దోషము కాదని భావము. మఱియు, నిత్యుల, ముక్తుల ప్రవృత్తులన్నియు భగవత్సంకల్పాధీనములు. కావున తప్పు లేదు.

**"న హి శ్రుత్యాదినియతా వృత్తి రేవ స్వయం ఫలమ్,**
**పరత్ర తు పరేశస్య కామాదేవ ప్రవర్తతే"**

అని పాంచరాత్రాగమమున చెప్పబడుట గమనింపదగినదని శ్రీరామానుజాచార్యవ్యాఖ్యలో కలదు. ఆ వ్యాఖ్యలోనే "**ముకుళితనయనాః**"అను

పాఠాంతరము కన్పించుచున్నది. భగవానుని సేవించుటవలన కల్గిన ఆనందాతిశయముచే కనులను మూసికొనినవారని అచట వివరింపబడినది. ఈ పాఠము అర్థవంతమే అయినను, ఉత్తరార్థములో గల "**శిరసి కృతమస్యదేకహస్తాః**" అను విశేషణమునకు ఈ పాఠము కంటే స్వీకృతపాఠమే అనుగుణము అయినది. ముడుచుకొనిన చేతికిని, ముడుచుకొనిన తామరపూవునకును కల ఆకారసామ్యము సుస్పష్టము. అట్లే, ఉచ్చలచామరత్వ, సకౌముదీకత్వములకును సామ్యము కలదు. ఈ సామ్యములు బింబప్రతిబింబ భావముచే స్ఫురించుటచే ఇచట దృష్టాంతము కలదనియు చెప్పవచ్చును. "**ముకుళితనళిన**" అను విశేషణమున నళిన శబ్దముచే నయనము లక్షితమగునని చెప్పినచో, భగవత్పరిచర్యవలన కలిగిన ఆనందముచే అర్ధనిమీలితములైన నేత్రములను కలవారను అర్థము వచ్చును. "**సకౌముదీకా**" అనునపుడు కౌముదీశబ్దమునకు "**కుముదానా మియమ్**" అను వ్యుత్పత్తినిబట్టి వికసించిన కుముదములను కలిగినదను అర్థమును చెప్పవచ్చును. వికసించిన కలువపూవునకును, వేరొక చేతితో పైకెత్తబడి, విసరబడుచున్న చామరమునకును ఆకారసామ్యముండుటచే ఇట్లు చెప్పుటకూడా పొసగునుకదా. శ్రీగోపాలాచార్యవ్యాఖ్యానమున "**సునిశావిమలాదికా**" అను ఏకసమాసముగా చూపబడినది. మఱియు, "**సునిశానామ్నః అన్వర్థోపపాదనం సకౌముదీకత్వవర్ణనేన**" అనుచు వివరింపబడినది. కాని, ఈ వివరణము పొసగదు. ఎందులకనగా, భగవానుని చామరగ్రాహిణులలో "**సునిశా**" అను పేరును గల వారెవ్వరును లేరు. కావున "**సునిశా**" అనుపదమును వ్యస్తముగా అన్వయించుటయే తగును.

ఇందు అలంకారము ఉత్ప్రేక్ష, వృత్తము పుష్పితాగ్ర.

## శ్రీరంగనాథుడు (నంబెరుమాళ్) ఒక పద్మసరస్సు

**63. ఉత్ఫుల్లపంకజతటాక మివోపయాని**
**శ్రీరంగరాజ మిహ దక్షిణసవ్యసీమ్నోః ।**
**లక్ష్మీం విహారరసికా మివ రాజహంసీం**
**ఛాయా మివా భ్యుదయినీ మవనీం చ తస్యాః ॥**

**ప్ర. అ. –** ఇహ = ఈ శ్రీరంగనమందిర గర్భగృహమున, ఉత్ఫుల్ల = బాగుగా వికసించిన, పంకజ = తామరపూలను కల్గిన, తటాకం = సరస్సును, ఇవ = వలె, శ్రీరంగరాజం = శ్రీరంగనాథుని, ఉపయాని = ఆశ్రయింతును, దక్షిణ = కుడివైపు, సవ్యసీమ్నో = ఎడమవైపు చివరలలో, విహార = విహరించుటలో, రసికాం = ఆసక్తిని కల, రాజహంసీం = రాజహంసిని (ఆడురాజహంసను), ఇవ = వలె, లక్ష్మీం = లక్ష్మి దేవిని, తస్యాః = ఆ లక్ష్మీదేవియొక్క, అభి+ఉదయం = ఉత్తరోత్తరాభివృద్ధిని కల్గిన, ఛాయాం = నీడ, ఇవ = వలె ఉన్నదగు, అవనీం = భూదేవిని, చ = కూడ, ఉపయాని = ఆశ్రయింతును.

**వరివస్య :–** శ్రీరంగరాజస్తవమున 1వ శ్లోకము నుండి 62వ శ్లోకము వరకు గల భాగము అవతారికవంటిది. శ్రీరంగనాథుని స్తవము ఈ శ్లోకమునుండి ప్రారంభమగుతున్నది. ఈ స్తుతి పూర్వశతకము చివరివరకు కొనసాగును. 63వ శ్లోకము నుండి 76వ శ్లోకము వరకు **"నమ్బెరుమాళ్"** అను పేరుతో ప్రసిద్ధులగు ఉత్సవమూర్తి, 77వ శ్లోకము నుండి చివరి వరకు **"పెరియ పెరుమాళ్"** అని పిలువబడు మూలమూర్తియు స్తుతింపబడుచున్నారు.

శ్రీరంగములోని ఆలయములో ఆరాధన అంతయు పాంచరాత్రాగమము ప్రకారము చేయబడుచున్నది. ఈ ఆగమముప్రకారము ఉత్సవబేరము, అర్చనా బేరము, స్నపనబేరము, భోగబేరము, బలిబేరమను అయిదు విధములైన బేరములకు (ఉత్సవ విగ్రముహములకు) ఆయా ఆరాధనలు చేయబడును. వానిలో ప్రస్తుతము ఉత్సవబేరము

స్తుతింపబడుచున్నది. శ్రీరంగనాథుని ఉత్సవవిగ్రహము మన దేశములోని అత్యంత ప్రాచీనమైన లోహవిగ్రహములలో ఒకటి.

శ్రీరంగరాజస్తవమున పూర్వశతకము ద్వయమంత్రములోని పూర్వఖండార్థమును వివరించునని పెద్దల అభిప్రాయము. "**శ్రీస్తనాభరణం తేజః**" అను శ్లోకము మొదలు నాల్గు శ్లోకములలో శ్రీమత్పదార్థము అనుసంధింపబడినది. పిమ్మట, "**కావేరీ మవగాహిషీయ**" అను శ్లోకము నుండి 62వ శ్లోకము వరకు నారపదార్థమును వివరించిన భట్టరు ఈ శ్లోకము నుండి "అయన" పదార్థమును అనుసంధించుచున్నారు. ఈ శతకము. చివర "**చరణౌ శరణం ప్రపద్యే**" అను మిగిలిన మూడు పదముల అర. థమును అనుసంధించుటతో (శతకమును) పరిసమాప్తిని చేయుచున్నారు.

బాగుగా వికసించిన తామరపూలతో నిండిన సరస్సువలె తాపహారి అగు శ్రీరంగనాథుని సమీపింతును, (శరణు జొచ్చెదను), ఆ స్వామికి కుడి ఎడమలలో లక్ష్మీదేవి, భూదేవి అమరియున్నారు. లక్ష్మీదేవి శ్రీరంగనాథుడను పద్మసరోవరమున విహరించు రాజహంసివలె, భూదేవి ఆ హంసి నీడవలె ప్రకాశించుచున్నారు. వారిరువురను కూడ ఆశ్రయింతును – అని శ్లోకభావము.

ఈ శ్లోకమున భట్టరు శ్రీరంగనాథుని పద్మసరస్సుతో రమ్యమైన రీతిలో ఉపమించిరి, పంచమవేదము భగవానుని "**ఏష బ్రహ్మ ప్రవిష్టోఽ స్మి గ్రీష్మే శీత మివ హ్రదమ్**" (భార. – మోక్ష, 450) (గ్రీష్మకాలమున చల్లని చెఱువునందు వలె ఈ పరబ్రహ్మను అవగాహింతును) అనుచు గొప్ప చల్లని మడుగుగా కీర్తించెను. "**వేద మనైత్తుక్కుమ్ విత్తాకుమ్ కోదైతమిழ் మత్తై**" వేదం అంతటికి బీజప్రాయమైనది, గోదాదేవి అనుగ్రహించిన, ద్రావిడ వేద రూపమైన తిరుప్పావై దివ్య ప్రబంధము (తిరుప్పావై తనియన్) అని ప్రసిద్ధి చెందిన తిరుప్పావై దివ్యప్రబంధములో గోదాదేవి భగవదనుభవమును నీరాట్టముగా సూచించెను.

నమ్మాళ్వార్లు "**తయరదన్ పెఱ్ఱ మరతకమణిత్తడమ్**", (తి. వా. – 10-1-8) (దశరథుడు, పొందిన మరకతమణి సరస్సు) అనుచు భగవానుని

మణితటాకముగా అనుభవించిరి. తిరుమంగై ఆళ్వారులు కూడా తిరు నెడుమ్ దాండకమ్ ప్రబంధంలో భగవదనుభవమును "**పొఱ్ఱామరైక్కయుమ్ నీరాడ ప్పోనాళ్**" (బంగారు తామర పూలను కలిగిన సరస్సులో అవగాహించడం కోసం వెళ్ళినది) బంగారు తామర పువ్వుల సరస్సులో అవగాహనంవంటిది – అని అన్నారు. ఈ క్రమములో భక్తర్ సూక్తి ఇందులో సాగుతున్నది. ఉభయవేదాంత సమన్వయరూపమైనది, దివ్యప్రబంధాల సారమైనది కదా, ఈ స్తుతి ప్రబంధము.

"**తామరై వాయ్ కమలమ్ పోలుమ్ కణ్ణిణైయుమ్ అరవిన్దమ్ అడియు మవదే**" (తిరునెడు. -21) (భగవానుని హస్తములు తామరల వంటివి, ముఖము కమలమును పోలినది, నేత్రద్వయము కూడ అరవిందమే, పాదములును అట్టివే) అను తిరుమంగై ఆళ్వార్ల శ్రీసూక్తి చొప్పున సర్వేశ్వరుని చేతులు, పాదములు, ముఖము, నేత్రములు అన్నియు పద్మములవంటివి. కావున, వీనిని కల్గిన భగవానుడు పద్మసరస్సుగా భాసించుట యుక్తమే కదా! ఈ క్రమమును అనుసరించుచు భట్టరు ఇచట శ్రీరంగనాథుని పద్మసరస్సుగా ఉపమించిరని తెలియనగును.

భగవానుని రూపములు పర వ్యూహ వి, భవ అంతర్యామి అర్చామూర్తుల రూపమున అయిదు విధములని శాస్త్రములు తెలియ జేయుచున్నవి. వీనిలో–

పరరూపము శ్రీవైకుంఠమున నుండును. ఈ రూపమును సేవించి, అనుభవించుట నిత్యులకు, ముక్తులకు తప్ప వేరెవ్వరికిని సాధ్యపడదు. కావున ఇది దేశ విప్రకృష్టము.

ఇక, వ్యూహముక్షీరసాగరమున ఆదిశేషునిపై శయనించి, యోగనిద్రలో నుండు స్థితి. ఈ రూపమునసేవించుట కూడ సామాన్యులకు సాధ్యపడదు. కావున ఇదియును దేశవిప్రకృష్టమే.

ఆయాయుగములలో ధర్మసంస్థాపనార్థమై భగవానుడు ఎత్తిన అవతారములు విభవములనబడును. ఆ రూపములను సేవించి, తరించు

భాగ్యము అప్పటి కాలములో జీవించినవారికే వీలగును. అంతకు ముందుకాని, తరువాత కానీ జన్మించి, జీవించిన వారికి వీలుకాదు. కావున, విభవము కాలవిప్రకృష్టము.

ప్రతిజీవుని హృదయకోశమున నిలచియుండు రూపము అంతర్యామి. ఈ రూపమును సాక్షాత్కరింప చేసికొని, అనుభవింపగల్గిన శక్తి యోగులకే కలదు. కావున ఇది అధికారి విప్రకృష్టము.

ఇట్లు మొదటి నాలుగు కొద్ది మందికి తప్ప, మిగిలినవారికి అనుభవింప వీలు కానివి. కాని, అర్చామూర్తి అట్టిది కాదు. సర్వదేశ, సర్వకాల, సర్వాధికారులకు సేవింప దీనిని సాధ్యము, దీనిని అభియుక్తులగు పూర్వాచార్యులు సోదాహరణముగా ఇట్లు వివరించిరి.

పరమపదములో, క్షీరాబ్ధిలోనుండు భగవానుని రూపములు క్షీరసాగరమువంటివి. అనగా, సుదూరప్రాంతమున ఉండుటచే అనుభవింప వీలు కానివి, అవతారములు వర్షకాలమున మాత్రము నిండుగా ప్రవహించి, తరువాత ఎండిపోవు నదులవంటివి, అంతర్యామిరూపము భూమిలో అంతర్గతముగా ప్రవహించు జలము వంటిది, కావున, మిక్కిలి శ్రమపడిన కాని సులువుగా పొంద సాధ్యము కానిది, అర్చామూర్తి సర్వదా తీయని నీటితో నిండియుండు సరస్సువంటిది. కావున, దేశకాల అధికారివిప్రకృష్టత లేనిది. ఇట్టి అర్చామూర్తు లన్నిటికిని మూలకందము, ఈ విషయము **"భూగతజలంపోలే అంతర్యామిత్వమ్. అదిలే తేంగిన మడుక్కళ్ పోలే అర్చావతారమ్"** (39) (భూమిలో అంతర్గతంగా ఉన్న జలంవంటిది భగవంతుని అంతర్యామి రూపం. అందులో, తేటపడిన నీటిని కలిగిన సరస్సులవంటిది అర్చారూపం) అను శ్రీవచనభూషణసూక్తివలన స్పష్టమగుచున్నది. ఇందుచేత అత్యంత ప్రాచీనమైనదగు శ్రీరంగనాథుని అర్చామూర్తిని భట్టరు పద్మసరస్సుతో పోల్చుట మిక్కిలి సమంజసము కదా!

తిరువాయ్ మొళి దివ్యప్రబంధమున "**మాయక్కూత్తా**" అను దశకమున మొదటి పాశురములో నమ్మాళ్వార్లు భగవానుని "**కణ్ కాల్ తూయ శెయ్య మలర్ కళా శోదిచ్చెవ్వాయ్ ముకిழ் తా, శాయల్ శామత్తిరుమేని తణ్ పాశడైయా తామరైనీర్ వాశత్తడమ్ పోల్ వరువానే**" (8-5-1) (నేత్రములు, హస్తములు, పాదములు, పవిత్రములైన, సుందరములైన (తామర) పూలుగా శోభిల్లగా, కాంతివంతమైన ఎఱ్ఱని అధరము ఎఱ్ఱని మొగ్గలుగా, కాంతిని గల శ్యామలదివ్యమంగళ విగ్రహము చల్లని, పచ్చని రంగులను కల ఆకులుగా, తామరపూలతో నిండిన విశాలమైన, పరిమళమును కల్గిన తటాకము వలె వచ్చు స్వామీ!) అనుచు సావయవరూపకముతో భగవానునికు పద్మసరోవర సామ్యమును పల్కుట ఇచట ఉట్టంకింపదగినది.

"పద్మసరోవరమున రాజహంసలు క్రీడించును. అట్లు ఈ సరస్సులో విహరించు హంసలున్ననా?" అనినచో, అందులకు సమాధానముగా లక్ష్మీదేవి అను హంసి క్రీడించుచున్నదనుచున్నారు, కవి. భూదేవి శరీరవర్ణము నలుపు. కావున ఆమెను లక్ష్మీదేవి అనెడి రాజహంసియొక్క ఛాయగా కవి ఉపమించుట మిక్కిలి యుక్తము. ఈ ఉపమానమువలన లోకములో ఇద్దరు సవతులనుధ్య కనుపించు వైరుధ్యము వీరద్దరి మధ్య లేదను విశేషము స్ఫురించుచున్నది. వీరు అనుభవించు అనుభవము అల్పమైనది, లౌకికమైనది కాదు కదా. అందువలన వీరిద్దరి మధ్య వైరుధ్యము ఉండు అవకాశమే లేదు. భూదేవి లక్ష్మీదేవికి ప్రతిబంబమనుటచే వారి పరస్పరసాదృశ్యము వ్యక్తమగుచున్నది. "**అభ్యుదయనీం ఛాయామ్**" (అభ్యుదయాన్ని పొందడం స్వభావంగా కలిగిన నీడ) అనుటచే, లౌకికఛాయ కంటే ఈ ఛాయ విశిష్టమైనదని ఏర్పడుచున్నది. లోకములోని నీడకు పెరుగుట, తరుగుట ఉండునుకదా. ఇది కేవలము అభ్యుదయినీ మాత్రమే "**అవ-- రక్షణే**" అను ధాతువునుండి పుట్టిన అవనీశబ్దమును యోగరూఢముగా అన్వయించిన, భూదేవి లక్ష్మిదేవి స్వరూపమును రక్షించును – అను స్వారస్యమును ధ్వనించును. మరియు, ఒకే శ్లోకమున శ్రీరంగనాథుని,

శ్రీదేవిభూదేవులను ఆశ్రయించినట్లు పల్కుటచే, కవి మహిషీద్వయ పురస్సరముగా భగవానుని ఆశ్రయింపవలెనను శాస్త్రార్థమును సూచించిరి. ద్వయమంత్రములోని పూర్వార్థములో మొదట గల 'శ్రీః' అను పదముచే లక్ష్మీదేవిమాత్రమే చెప్పబడుచున్నను. పురుషకారముయొక్క పుష్కలత కొఱకై శ్రీదేవితో పాటు, భూదేవినికూడ ముందుంచుకొని భగవదాశ్రయణమొనర్చుట తగినదని తెలుపుటకై భట్టరు ఈ శ్లోకమున భూదేవి సమాశ్రయణమును కూడ ప్రస్తావించిరని చెప్పనగును. భగవద్రామానుజులు తాము శ్రీరంగనాధుని పాద సన్నిధిలో శరణాగతిని చేయు క్రమమును తెలుపు శరణాగతి గద్యలో భూదేవిని నిలదీవి కూడా ప్రస్తావించినందున, ఈ శ్లోకములోని చకారమును అనుక్త సముచ్చాయకముగా గ్రహించినప్పుడు, దానిద్వారా, నీలాదేవికూడా సూచింపబడినదని భావించుటలో ఏ లోటు లేదు.

మూలమూర్తి కంటే ఉత్సవమూర్తిని ముందుగా స్తుతించుటకు కారణమేమనగా, తనను సేవింపవచ్చు భక్తుల సంరక్షణకై శేషశయనమునుండి లేచి వచ్చి, నిలబడియుండు ఉత్సవమూర్తి ముందుగా స్తుతింపబడెను. అంతేకాక, క్రమమునకూడా ముందు ఉత్సవమూర్తి, పిమ్మట మూలమూర్తి వేంచేసియుందురు కదా! సేవాక్రమములో కూడా, ముందు ఉత్సవమూర్తిని, తరువాత మూలమూర్తిని సేవించుట జరుగును. ఇందు వృత్తము వసంతతిలక.

## శ్రీరంగనాథుడు వికసించిన తామర పువ్వుల తటాకము

**64. పిబ నయన పురస్తే రంగధుర్యాభిధానం**
**స్థిత మిహ పరిఫుల్లత్పుండరీకం తటాకమ్ ।**
**శ్రియ మపి విహరంతీం రాజహంసీ మివాస్మిన్**
**ప్రతిఫలన మివాస్యాః పశ్య విశ్వంభరాం చ॥**

**ప్ర. అ. –** నయన = ఓ నేత్రమా! = ఇహ ఈ గర్భగృహమందు, తే = నీ, పురః = ఎదుట, స్థితం = ఉన్నది, పరిఫుల్లత్ = బాగుగా వికసించిన, పుండరీకం =

తామరపూలను కల్గిన, రంగధుర్య = శ్రీరంగనాథుడను, అభిధానం = పేరు కల్గినది అగు, తటాకం = సరస్సును, పిబ = త్రాగుము, అస్మిన్ = ఈ సరస్సులో, విహరంతీం = విహరించుచున్న, రాజహంసీం = అడుహంస, ఇవ = వలె ఉన్న, శ్రియం లక్ష్మీదేవిని, అపి = కూడ, అస్యాః = ఈ లక్ష్మీదేవియొక్క, ప్రతిఫలనం = ప్రతిరూపము, ఇవ = వలె ఉన్న, విశ్వంభరాం = భూదేవిని, చ = కూడ, పశ్య = సేవింపుము.

**వరివస్య :-** ముందు శ్లోకమున శ్రీరంగనాథుని కవి పద్మసరస్సుగా అభివర్ణించిరి. ఆ రూపణములోని భోగ్యతాతిశయమువలన వివశులైన భట్టరు మరల, ఆ భావమునే భిన్న పదములతో అనుసంధించుచున్నారు.

ఇట్లు ఒకే భావమును మరల మరల పలుకుట పునరుక్తి అను అర్థదోషమగును కదా! అను సందేహము ఇచట కలుగవచ్చును. కాని, అట్టి దోషమునకు ప్రసక్తియే లేదు. ఒకే భావమును భిన్న భిన్న రీతులలో చెప్పుటను సంవాదమను పేర ఆలంకారికులును ఆమోదించిరి. మఱియు, ఒకే జాతికి చెందిన ముత్యములతో కూర్చబడివైనను కళాకారుని సామర్థ్యముచే వేర్వేరు రూపములను పొందిన నగలు చూపరుల దృష్టిని ఆకర్షించునట్లే, ఒకే విధమైన భావమును కల్గిన శ్లోకములును కవియొక్క ప్రతిభచే ఒక్కొక్కటి ఒక్కొక్క రీతిలో భాసించి, చదువరుల దృష్టిని ఆకర్షించును. ఈ ప్రక్రియ ఆలంకారికులకు సమ్మతము కూడా.

**"ఉక్తపూర్వా అపి హ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్ ।**
**సర్వే నవా ఇవా భాన్తి మధుమాస ఇవ ద్రుమాః" ॥ (4– ఉద్యోతే)**

కావ్యములో ఇంతకు ముందు చెప్పబడిన అర్థములే అయినప్పటికీ అవి అన్నీ, రసపరిగ్రహణముచేత, పూర్వం ఉన్న వృక్షములే వసంత కాలమున నూతనముగా ప్రకాశించునట్లు, కొత్త కొత్తగా భాసించును) అని ధ్వన్యాలోకకారుడు ఈ విషయమును గూర్చి సిద్ధాంతీకరించెను కదా!

అంతేకాక, ప్రస్తుత శ్లోకమున ముందు శ్లోకమున కంటే భావమున కొద్దిపాటి భేదమును కలదు. అది ఎట్లన, ముందు శ్లోకమున "**ఉపయాని**" అనుటచే భగవంతుడను పద్మసరస్సును సమీపించుట – అను అర్థము మాత్రమే అనుసంధింపబడినది. ప్రకృత శ్లోకమున "**పిబ**" అను క్రియాపదముచే ఆ సరస్సులో అవగాహించుట, నీటిని, పానముచేయుట మొదలగునవి సూచింపబడినవి. మఱియు, అందుచే నీ లోకమున కవి అనుభవము మరింతగా భగవంతుని సామీప్యమును పొందినదని చెప్పవచ్చును. తటాకమును దర్శించుట అనునది దూరము నుండి సంభవించవచ్చును. కాని, అందు నీతి తాగవలెనన్న సమీపమునకు రావలెను కదా.

వేరొక అంశము ఏమనగా, ఈ శ్లోకమున ఆత్మోపదేశము చేయబడినది. అది ఇంతకు ముందు శ్లోకమున లేదు. కావున, పునరుక్తిశంకకు అవకాశము లేదు. ఇట్టి సంవాదములకే తుల్యదేహిసంవాదములని పేరు. ఇవి ఉత్తమవర్గమునకు చెందినవి.

ఓ నేత్రమా! నీ ఎదుటగానున్న శ్రీరంగనాథుని వికసించిన తామరపూలతో నిండియున్న తటాకమునువలె పానము చేయుము. అట్లే, ఆ తటాకమున విహరించు రాజహంసివలెనున్న లక్ష్మీదేవిని, ఆమె ప్రతిబింబమువలె నున్న భూదేవిని సేవింపుము – అని భావము.

కన్నులతో పానము చేయుట అనగా, దర్శించి ఆనందించుటయే కదా! ఇచట "**పిబ**" అను క్రియ తటాకరూపణమునకు అనుగుణముగా ప్రయోగింపబడినది. ఈ సందర్భమున "**త్వక్ చ దృక్ చ నిపిపాసతి**" (వరస్త, 24) (నా త్వగింద్రియము, నేత్రేంద్రియమును నిన్ను పానము చేయవలెనని కోరుచున్నది) అను కూరేశుల శ్లోకము, "**లోచనాభ్యాం పిబన్నివ**" రెండు నేత్రములతో ప్రాణము చేయువానివలె) -19-6) అను శ్రీరామాయణ శ్లోకమును ఇచట అనుసంధేయములు. మఱియు, తిరువాయ్ మొళిలోని "**ముడియానే**" అను దశకమున నమ్మాళ్వార్ల అనుభవముకూడ ఇచట

స్మరణీయము. ఇటువంటి అనుభవములు కరణసంకోచములు లేని నిత్యులకు ముక్తులకు మాత్రమే సాధ్యము. అటువంటి అనుభవమును కవి శీరంగనాధుని విషయములో పొంద వలయునని ఆశపడుతున్నారు. అంతియేకాక, **"అణియరంగన్ ఎన్నముదివై క్కణ్ణ కణ్ గళ్"** (అమల, -10) (అందమైన శ్రీరంగంలోని శ్రీరంగనాథుడను నా అమృతమును సేవించిన కన్నులు) అను ఆళ్వార్ల సూక్తిని ఈ శ్లోకము జ్ఞప్తికి తెచ్చుచున్నది – అని శ్రీ ప్ర. భ. అణ్ణాస్వామిసూక్తి. అమృతమును సేవించుట అనగా, ప్రానము చేయుటయే కదా. సేవించుట అను క్రియ పానము చేయుట అణు అర్థములో కూడా లోకమున వ్యవహారములో ఉన్నదే – అనుట సర్వానుభవ సిద్ధము. **"రంగధుర్యాభిధానం తటాకమ్"** (శ్రీ రంగనాథుడు అనే పేరును కలిగిన సరస్సు) అనుటచే లోకములోని తటాకముల కంటే ఈ తటాకము విశిష్టమైనదను అర్థము ఏర్పడుతున్నది. లోకములోని తటాకములు ఒక వ్యక్తిరూపమున కానరావు, కాని, ఈ తటాకము శ్రీరంగనాథుని రూపమున కనుపించుచున్నది. అంతియే కాక, రంగధుర్యుడనుట కేవలము నామమాత్రమే. స్వామి నిజమైన రూపము తటాకమే అనియు స్ఫురించుచున్నది. ఇందులకు ఉపోద్బలకముగ తరువాతి శ్లోకములోని **"శ్రీరంగరాజమిషపద్మసరః"** (శ్రీ రంగనాథుడు అనే నెపమును కలిగిన సరస్సు) అను సూక్తిని స్మరింపనగును. మరియు, మిగిలిన తటాకములలోని తామరపూలు రాత్రిశసమయమున ముడుచుకొనును, పగలు వికసించును. కాని, ఈ తటాకమున అట్లు కాక, ఎల్లప్పుడును ఒకే విధముగా వికసించి యుండునను భావము **"పరిఫుల్లత్పుండరీకకమ్"** అను వర్తమానకాలికవిశేషణముచే ఏర్పడుచున్నది

అరణ్యమున సంచరించి, అలసినవారికి తమ శ్రమను, దాహమును పోగొట్టుకొనుటకు తటాకము ఉపయోగపడునట్లే, శ్రీరంగనాథుడను తటాకము **"సంసారమరుకాంతారే. అజస్రం జాతతృష్ణార్త మవసన్నాంగ మక్షమమ్"** (సంసారమను ఎడారి ప్రాంతంలో అరణ్యప్రాంతములో సదా

సంచరించుటవలన కలిగిన దాహము వల్ల ఆర్తిని పొందినవాడను, బలము అంతా నశించిన అంగములను కలవాడను, ఇక బాధను సహించలేనివాడను) అనునట్లు సంసారమను కారడవిలో తిరిగి అలసిన సంసారుల శ్రమను, ఆర్తిని తీర్చును, లోకమున తటాకము ఉపాయము, ఉపేయము అగునట్లే శ్రీరంగనాథుడును ఆశ్రితులకు ఉపాయము, ఉపేయమును అగుచున్నాడు అను విశేషము తటాకసామ్యముచే ఏర్పడుచున్నది. ఇచట శ్రీరంగనాథుని సౌందర్యము పానీయముతో పోల్చబడినది. మరియు, "**పరిఫుల్లత్ పుండరీకమ్**" అను విశేషణము స్వామియొక్క భోగ్యతను స్పష్టపఱచుచున్నది. ముందు శ్లోకములోవలె ఇచటను శ్రీదేవి, భూదేవులను వర్ణించుటద్వారా, కవి పురుషకార పూర్వకముగా భగవత్సమాశ్రయణమును చేయవలెనను రహస్యమును సూచించిరి. ఆ విధముగానే ఈ శ్లోకములోని చకారమును, పూర్వము వలె, అనుక్త సముచ్చాయకముగా భావించి, నీలాదేవి కూడా సూచింపబడినదని చెప్పవచ్చును.

విష్ణుసహస్రనామములోని "**మహాహ్రదః**" అను నామమును భట్టరు వ్యాఖ్యానించుచు, "**యత్ర చ పుణ్యకృతో గాహం గాహం తృప్యంతి సః మహాహ్రదః. హ్రద – అవ్యక్తే శబ్దే**" (ఏ భగవంతుని యందు పుణ్యాత్ములు పమాటిమాటికి అవగాహించి, అనగా, అనుభవించి ఆనందిస్తున్నారో, ఆ భగవానుడు "**మహాహ్రదః**" అని చెప్పబడుతున్నాడు) అని పల్కుట ఇచట ఉట్టంకింపదగినది.

"**స్థితమివ**" అను పాఠాంతరమును కలదు. "**స్థితం తటాకమ్**" అనుటకు స్థావరతటాకము, అనగా, హెచ్చుతగ్గులు లేక, సదైక రూపమైన తటాకము – అను అర్థమును చెప్పవచ్చునని కొందరు సూచించిరి. దీనివలన లోకములోని తటాకముల కంటె శ్రీరంగనాథుడను తటాకమునకు కల వైశిష్ట్యము వ్యక్తము. "**విశ్వంభరా, అస్యాః ప్రతిఫలనమ్**" (భూదేవి ఈ లక్ష్మీదేవికి

ప్రతిబింబము) అనుటచే, శ్రీదేవి భూదేవికి ఛాయారూపమని పలికినను, "**విశ్వంభరా**" అను పదముచే భూదేవియొక్క గొప్పతనము వ్యక్తమగుచున్నది.

"**కుழలో్కవలర్ మడప్పావైయుమ్ మణ్ మగళుమ్ తిరువుమ్ నిழల్ పోల్వనర్**" (2) అను తిరువిరుత్తప్రబంధములో నమ్మాళ్వార్లు భూనీళాదేవులను లక్ష్మీదేవికి ఛాయలుగా పలుకుట ఈచట స్మరింపనగును.

వృత్తము మాలిని, అలంకారము ఉపమ.

"**ఉత్ఫుల్లసంఫుల్లయోరుపసంఖ్యానమ్**" (1-2-22) అను వార్తికముచే ఉత్ఫుల్లశబ్దమునకు సాధుత్వము సాధింపబడినది. తామరలను ఎల్లప్పుడు కల్గినది- అని, ఒడ్డును ఒరుసుకొని ప్రవహించు నీటిని కల్గినదని అర్థమిచ్చు తటాకశబ్దమును నిత్యము లక్ష్మీసంశ్లేషమును కలవాడును, అవధి లేని కృపను కలవాడును ఆగు శ్రీరంగనాథుని పరముగ ప్రయోగించుట సాభిప్రాయకము అనవచ్చును.

**శ్రీరంగనాథుడు వాస్తవమునకు సరస్సే.**

**65. సౌశీల్యశీతల మవేలకృపాతరంగ-**
**సంప్లావితాఖిల మకృత్రిమభూమనిమ్నమ్ ।**
**లక్ష్మ్యా చ వాసిత మభూమ విగాహమానాః**
**శ్రీరంగరాజమిషపద్మసరః ప్రసన్నమ్ ॥**

**ప్ర. అ. –** సౌశీల్య = సౌశీల్యగుణముచే, శీతలం చల్లనిది అవేల = అవధి లేని, కృపా = కరుణ అనెడు, తరంగ = కెరటములచే, సంప్లావిత = పూర్తిగా తడుపబడిన (సంతోషింపచేయబడిన), అఖిలం = సమస్తజనమును కల్గినది, అకృత్రిమ = సహజమైన, భూమ = గొప్పతనమును కల్గినది (విస్తృతమైనది), నిమ్నం = లోతైనదై (తెలుసుకొనుటకు సాధ్యము కాని స్వరూపరూప గుణవిభూతులను కల్గినది) అయినను, లక్ష్మ్యా = లక్ష్మీదేవిచే, వాసితం చ = పరిమళింపజేయబడినది (నివసింపబడినది), ప్రసన్నం = తేటనైనది అగు,

శ్రీరంగరాజమిషః = శ్రీరంగనాథుడను, పద్మసరః = పద్మసరస్సున, విగాహమానాః = అవగాహనమును చేయువారమై (నీరాడువారమై), అభూమ = అయితిమి.

**వరివస్య :–** ఈ శ్లోకమున కూడ శ్రీరంగనాథుడు పద్మసరస్సుగా రూపింపబడుచున్నాడు. ఇంతకు ముందు శ్లోకములలో చెప్పని కొన్ని విశేషములను నిరూపించుచు కవి, ఆ తటాకమున తాము అవగాహించుటను ఇందు పల్కుచున్నారు. దివ్యసూరులు కూడా దివ్యప్రబంధములలో పలు సందర్భములలో భగవంతుని అందమైన తటాకముగా భావించి, అనుభవించిరి కదా. ఆ క్రమములో కవి ఈ స్తుతిలో పలుమార్లు భగవంతుని తటాకముగా భావించి వర్ణించుచు ఆనందించుచున్నారు. ఎన్నిసార్లు భావించి, వర్ణించినను తీరని వైభవమును కలిగిన వాడు కదా, భగవానుడు.

సౌశీల్యగుణముచే చల్లనిది, అంతు లేని కృప అను కెరటములచే అందరిని ముంచెత్తునది, లోతైనది, లక్ష్మీదేవిచే సువాసితమైనది, తేటనైనది అగు శ్రీరంగనాథుడను. సరస్సులో స్నానము చేసినవారమైతిమి – అని శ్లోకభావము.

సరస్సులోని నీటికి చల్లదనము సహజగుణము. అందు స్నానమాడినవారి శరీరము చల్లబడును. అట్లే, సౌశీల్యమను గుణముచే శ్రీరంగనాథుడును ఆశ్రితుల మనస్సును చల్లబఱచును. "**సుతప్త మపి పానీయం పున ర్గచ్ఛతి శీతతామ్**" (నీరు బాగా వేడి చేయబడినది అయినప్పటికీ, కొంతసేపటికి అది మళ్ళీ చల్లబడును) అను సూక్తి చొప్పున, వేడి చేయబడిన నీరును మరల కొంతసేపటికి చల్లబడును. అట్లే పరత్వము. అతిశయించుటచే కాని, జీవులుచేయు పాపము వలన కాని, స్వామి మనస్సున నిగ్రహము కల్గినను, ఆ స్థితి తాత్కాలికమే తప్ప, ఎక్కువ కాలము నిలువదు. తక్కువస్థితిలోనున్నవారితో మనస్సున ఎట్టి సంకోచము లేక కలియుట ("**మహతః మందైః సహ నీరంధ్రేణ సంశ్లేషః సౌశీల్యమ్**") అను సౌశీల్యగుణముచే స్వామి అను తటాకము తాపమును పొందినవారికి, తటాకములోని చల్లని నీరు

స్నానమాడుటకు తగినదై యున్నట్లే, తాపత్రయముచే బాధింపబడు చేతనులు సంకోచింపక ఆశ్రయించుటకు తగినవాడై యుండును. మరియు, అర్చామూర్తిరూపములోనున్న శ్రీరంగనాథుడు సామాన్య సంసారులకును ఆశ్రయింపతగినవాడై యుండుటచే, ఆ స్వామియందు సౌశీల్యగుణము అతిశయించియుండుట స్పష్టము. నిత్యసూరులు మాత్రమే అనుభవింపసాధ్యమగు తన స్వరూపరూపగుణాదులను సామాన్యులకును అనుగ్రహించుట ఇచటి సౌశీల్యములోని విశేషము. ఇటువంటి సౌశీల్య మనుగుణమును వ్యక్తము చేయుట కొరకే అర్చారూపమును భగవానుడు పరిగ్రహించును.

సరస్సు కెరటములద్వారా తనలో స్నానమాడువారి నందరిని తడపును. అట్లే, సర్వేశ్వరుడను తటాకమును, తన నిర్హేతుకమైన కృపతో అందరిని కటాక్షించి, రక్షించును.

"**బహోః భావః భూమా**" అనగా, గొప్పతనము. ఇక్కడ, తటాక పక్షమున విస్తారమైనదని అర్థము. శ్రీరంగనాథుని పక్షమున, సౌశీల్యాది గుణములచే గొప్పవాడని అర్థము. తటాకము లోతు తెలియనట్లే, సర్వేశ్వరుని స్వరూపరూప గుణవిభూతులుకూడ అపరిచ్ఛేద్యములై యుండును. చెఱువులోని నీరు తామరపూలచే సువాసితమై, ఉజ్జ్వలమునై యుండును. అట్లే, శ్రీరంగనాథుడను తటాకము లక్ష్మిచే పరిమళితమై యున్నది. "**వాసితమ్**" అను రూపము '**వస**' ధాతువు నుండియు నిష్పన్నమగుటకు అవకాశము కలదు. అపుడు '**వాసితమ్**' అనగా, నివసింపబడినదను అర్థమును చెప్పవచ్చును. సరస్సున పద్మములుండును. లక్ష్మి పద్మాలయ, కావున, తటాకము లక్ష్మీదేవిచే వాసితము, అట్లే, సర్వేశ్వరుని వక్షఃస్థలమున లక్ష్మీదేవి "**అకలకిల్లేన్ ఇఱైయు మెన్ఱు అలమేల్ మంగై యుఱై మార్బా!**" (తి. -6-10-10) ("ఒక క్షణము కూడా నిన్ను వదిలి నేను ఉండలేను" అని పల్కు లక్ష్మీదేవి నిత్యనివాసము చేయు వక్షస్సును కలిగినవాడా!) అని నమ్మాళ్వార్లు పలికిన విధముగా, నిత్యము

నివసించును, కావున, శ్రీరంగనాథ తటాకముకూడ లక్ష్మీవాసితమే అగును. పద్మములున్న సరస్సులోని నీరు తేటగా ఉండును. అట్లే, పురుషకారభూత అగు లక్ష్మీదేవి నిత్యనివాసము చేయుటచే శ్రీరంగనాథుడును ప్రసన్నమైన మనస్సును కల్గినవాడై యుండును. ఈ భావము "**ప్రసన్నమ్**" అను విశేషణము వలన వ్యక్తమగు చున్నది. ఇట్లు స్వామికి, పద్మసరస్సునకు మధ్య గల సామ్యము అతిరమణీయమైనది. అది ఈ శ్లోకమున శ్లిష్ట విశేషణములతో ప్రతిపాదింపబడినది.

"**అవేలకృపోత్తరంగ**" అను పాఠాంతరము శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో కన్పించుచున్నది. అనగా, అవధి లేని కృపయొక్క ఎగసిపడు కెరటములచే – అని భావము. ఈ జగత్తు ఈశావాసితము. ఆ ఈశ్వరుడు లక్ష్మీచే వాసితుడు – అను చమత్కారము "**లక్ష్మ్యా వాసితమ్**" అనుటవలన ఏర్పడుచున్నది. ఇచట "**వాసితమ్**" అనుటకు "**పరిమళితము**" అను అర్థమును గ్రహింపనగును. లక్ష్మి "**గంధద్వార**" (శ్రీ. సూ.)గా ప్రస్తుతింపబడుచున్నది కదా. ఆమె సుగంధము "**సర్వగంధః**" (ఛాందో. 3-14-2) అని పొగడబడు భగవానునకే పరిమళమును కల్గించును. "**వాసితమ్**" అనునపుడు, భగవానుడు లక్ష్మీధార్యుడు – అను వేరొక భావమును ధ్వనించుటచే, అందుల కనుగుణముగా "**న జీవేయం క్షణ మపి వినా తా మసితేక్షణామ్**" (రా. సుం. 6-11) (నల్లని నేత్రములను కలిగిన ఆ సీతాదేవిని విడచి నేను ఒక్క క్షణము కూడా జీవించలేను) అని మొదలైన ప్రమాణములు స్మరింపదగినవి. "**లక్ష్మ్యా వాసితమ్**" అనుట, సరస్సుపక్షమున లక్ష్మీదేవి పద్మనివాసిని అగుటచే, సరస్సున పద్మములుండుటచే అర్థవంతము. '**శ్రీరంగరాజమిషపద్మసరమ్**" అనుటచే, శ్రీరంగరాజనామము వాస్తవము కాదు. పద్మసరోవరమే భగవానునకు నిజమైనరూపము – అను చమత్కారము '**మిష**' శబ్దమునలన ధ్వనించును. "**నమ్బెరుమాళ్ ఎన్ను వ్యాజమాత్రమాన పద్మసరస్సై**" (నంబెరుమాళ్ అను నెపమును కలిగిన పద్మ సరస్సు)అని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివ్యాఖ్య.

**"అకృత్రిమభూమనిమ్నమ్"** అను సూక్తిలోని చమత్కారము అనితరసాధారణము. గొప్పవాడైనచో, నిమ్నుడు కాజాలడు, నిమ్నుడు మహిమను కల్గినవాడు కాజాలడు. స్వామి అకృత్రిమమైన గొప్పతనమును కల్గినవాడైనను, సర్వసులభుడు– అని ఇట్లు ఈ విశేషణము శ్రీరంగనాథుని పరత్వసౌలభ్యములను తెలియజేయుచున్నది. ఈ వైశిష్ట్యము పరిపూర్ణముగానున్నది అర్చావతారములో మాత్రమే. కావున, ప్రస్తుతవిశేషణము భగవానుని అర్చారూపములకు అన్నిటికీ మూలకందమైన శ్రీరంగనాథునియందు సర్వథా అర్థవంతము.

**"అభూమ"** అను భూతకాలికనిర్దేశము **"ప్రాప్తవిషయావగాహనమెన్ను తోత్తుకైక్కాక భూతనిర్దేశమ్"** అని శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామివ్యాఖ్యలో సమర్థింపబడినది.

**"అకృత్రిమభూమి నిమ్నమ్"** అను వేరొక పాఠమును కలదు. "**తటాక శ్చేత్ కృత్రిమనిమ్నభూమౌ స్యాత్, కృత్రిమం ఖాతనిమ్నప్రదేశే స్యాత్, స్వయంవ్యక్తమిదం సరః**" (లోకములో సరస్సు అనునది కృత్రిమముగా పల్లముగా చేయబడిన భూమిలో నుండును. లకములో సరస్సు తవ్వబడిన, పల్లముగానుండు ప్రదేశములో ఉండవచ్చును. కానీ, ఈ రంగనాథుడను సరస్సు సహజంగా పల్లముగానుండు శ్రీరంగద్వీపములో, సౌలభ్యమను గుణమును కలిగినది) అను రమ్యమైన వివరణము శ్రీగోపాలాచార్యవ్యాఖ్యానములో చూపబడినది. **"పిబ, పశ్య"** అనుటద్వారా రసనేంద్రియ, చక్షురింద్రియ అనుభవము పూర్వశ్లోకములో తెలుపబడగా, ఇందు **"విగాహమానాః"** అనుటచే త్వగింద్రియతృప్తి తెలుపబడినది.

శ్రీరంగనాథుడను పద్మసరస్సున అవగాహించుట అనగా, ఆ స్వామియొక్క స్వరూపరూపగుణవిభూతులను దర్శించి, అనుభవించుటయేకదా. ఇట్టి అనుభవమును పొందుటచేతనే ఆళ్వార్లకు (మునుగువారు) ఆ పేరు కల్గినది. భగవదనుభవము తటాకస్నానముతో

తుల్యమను అర్థమును గోదాదేవి తిరుప్పావై దివ్యప్రబంధమున వ్యంగ్యార్థరూపమున తెలియజేసిరని ఆచార్యులందఱి అభిప్రాయము.
మొదటి పాదమున "**అపారకృపాతరంగ**" అను పాఠభేదము కలదు.
ఇందు వృత్తము వసంతతిలక, అలంకారము రూపకము.

## శ్రీరంగనాథుని అనుభవమును రసనేంద్రియము ద్వారా పొందగో రెదను

**66. సింహాసనే కమలయా క్షమయా చ విశ్వ–**
**మేకాతపత్రయితు మస్మదసూ న్నిషణ్ణమ్ ।**
**లక్ష్మీస్వయంవరసనాథితయౌవనశ్రీ–**
**సౌందర్యసంపదవలిప్త మివాలిహీయ॥**

**ప్ర. అ. –** విశ్వం = సమస్త చరాచర ప్రపంచమును, ఏక ఆతపత్రయితుం = ఒకే గొడుగును కల్గినదిగా చేయుటకు, కమలయా = లక్ష్మీదేవితో, క్షమయా = భూదేవితోను, సింహాసనే = సింహాసనమున, నిషణ్ణం = వేంచేసియున్నవాడు, అస్మదసూన్ = మాకు ప్రాణమైనవాడు, లక్ష్మీ = లక్ష్మీదేవియొక్క, స్వయంవర = స్వయంవరముచే, సనాథిత = కృతార్థముచేయబడిన, యౌవనశ్రీ = యౌవనశోభచే, సౌందర్య = సుభగతయొక్క, సంపత్ = సిరిచే, అవలిప్తమ్ ఇవ = గర్వించినవానివలె ఉన్నవాడగు, శ్రీరంగనాథుని, ఆలిహీయ = అస్వాదింతును.

**వరివస్య :–** శ్రీదేవి, భూదేవులతో కలసి సింహాసనమున వేంచేసి యుండు శ్రీరంగనాథుని ఉత్సవమూర్తిసన్నివేశమును కవి ఈ శ్లోకమున అందముగా అనుభవించుచున్నారు.

లోకముల నన్నిటిని ఉజ్జీవింపచేయుటకై శ్రీదేవి, భూదేవు లిరువైపుల భాసింపగా, అందమైన సింహాసనమున వేంచేసియుండువాడును, మనకు ప్రాణసమానుడు, లక్ష్మీదేవిని స్వయంవరమున పొందుటచే సార్థకములైన యౌవనమును, సౌందర్యమును కలవాడును, అందువలన, అద్వితీయమైన

అతిశయమును పొందినవానివలె ఉన్నవాడును అగు శ్రీరంగనాథుని ఆస్వాదింతును (సేవించి, ఆనందమును పొందెదను) అని శ్లోకభావము.

**"ఇరున్దాల్ శింగాసనమామ్"** (ముదల్. 53) (భగవానులు ఆసీనుడైనప్పుడు ఆదిశేషుడు సింహాసనముగా మారును) అని ఆళ్వార్లు పలికినట్లు, భగవంతుని సింహాసనము ఆదిశేషుడే. ఈ విషయమును **"నివాసశయ్యాసన"** (స్తో. ర. 40) అని యామునులును పల్కిరికదా, రామావతారమున ఏకపత్నీవ్రతుడగుటచే భగవానుడు **"రామం రత్నమయే పీఠే సహసీతం న్యవేశయన్"** (రా. యు. 131-60) (రత్నమయమైన సింహాసనములో సీతాదేవితో పాటుగా శ్రీరాముని మునులు కూర్చుండబెట్టారు) అనునట్లు, సీతాదేవితో మాత్రమే కూర్చుండబెట్టబడెను. కాని, **"రాజానో బహువల్లభాః"** (రాజులు ఎక్కువమంది భార్యలు కలిగినవారు) అనునట్లు, శ్రీరంగనాథుడు దేవేరులగు లక్ష్మీదేవి, భూదేవులతో సింహాసనమున తానే కూర్చుండెను. సాక్షాత్తు భూదేవియే ఆ స్వామికి పత్నియైనపుడు భూమండలము ఒకే గొడుగుక్రిందకు వచ్చుటలో ఆశ్చర్యము లేదు.

ఛత్రము రాజచిహ్నము, లోకమునంతటిని పరిపాలించు చక్రవర్తి మాత్రమే ఆధిరాజ్యసూచకమైన ఏకచ్ఛత్రమును కల్గియుండును. శ్రీహర్షకవి నలుని చక్రవర్తిత్వమును నైషధకావ్యమున వర్ణించుచు **"సువర్ణదండైకసితాతపత్రిత జ్వలత్ప్రతాపావలి కీర్తిమండలః"** (బంగారు దండాన్ని కలిగిన, అద్వితీయమైన తెల్లని గొడుగు కింద ప్రకాశిస్తున్న, పలు విధాలైన ప్రతాపాలచేత ఏర్పడిన కీర్తిమండలాన్ని కలిగినవాడు) 1-1) అని పల్కెను. ప్రభువులు అనేకులు ఉన్నచో అనేక ఛత్రములుండును. అందరిని నియమింప గల్గు సార్వభౌముడు భగవానుడు ఒక్కడే. కావున, ఒకే ఛత్రముండును. లోకమంతయు ఆ ఛత్రము నీడలో ఒదిగియుండును. ఇందుచే సర్వేశ్వరునకు అందరును అధీనులని స్పష్టపడుచున్నది. **"లక్ష్మీస్వయంవర"** అను విశేషణము

క్షీరాబ్ధిమథనసమయమున లక్ష్మీదేవి భగవానుని వరించు సందర్భమును గుర్తుకు తెచ్చుచున్నది. భగవానుడు లక్ష్మీదేవిని కోరి ప్రార్థింపగా, ఆమె భగవానుని వరింపలేదు. తనకు తానే భగనానుని దివ్యయౌవనశోభకు వశయై స్వయముగా భగవానుని వరించెను. ఈ సందర్భమున "పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలం హరేః" (దేవతలందరూ చూచుచుండగానే లక్ష్మీదేవి హరివక్షస్సును చేరినది) అను విష్ణుపురాణశ్లోకములోని హరిశబ్దప్రయోగస్వారస్యమును స్మరింపనగును. ఇచట హరిశబ్దమునకు లక్ష్మీదేవి మనస్సును హరించినవాడని భావము. యౌవనశ్రీ శబ్దప్రయోగానుగుణముగా సనాథిత శబ్దప్రయోగము చేయబడినదని చెప్పనగును. "**పశ్యతాం సర్వదేవానామ్**" అను షష్ఠీ విభక్తి ప్రయోగమువలన సకల దేవతల అవరత్వము సూచింపబడినదని శ్రీవిష్ణుచత్తీయ వ్యాఖ్యానము లక్ష్మీదేవి తనకు తానుగా వచ్చి వరించుటచే శ్రీరంగనాథుని యౌవనశోభ, సౌందర్యలక్ష్మి సార్థకమైనవి, అందువలన ఆ స్వామిలో అనిర్వచనీయమైన ఠీవి గోచరించుచున్నది– అని కవి పల్కుట శ్రీరంగనాథుని ఉత్సవవిగ్రహముయొక్క సన్నివేశవిశేషమును అనుసరించియే యగును.

నమ్మాళ్వార్లు భగవానుని "**ఎన్నుడై యావియే**" (నా ప్రాణమా!) (తి. వా. –7–2–9) అని, "**ఎనదుయిరే**" (10–7–8) పల్కుటచే భట్టరును ఇందు "**అస్మదసూన్**" అని పల్కిరి. "**మచ్చిత్తాః మద్గతప్రాణాః**" (భ. గీ. –10–9) (నాలోనే మనస్సును నిలుపుకున్నవారు, నాలోనే ప్రాణాలను నిలుపుకున్నవారు) అను గీతాచార్యవచనమును, "**భక్తజనైకజీవితమ్**" (45) (భక్తులకు సాటి లేని జీవితం) అను యామునుల స్తోత్రరత్నసూక్తిని ఇచట స్మరింపతగును. "**మమ ప్రాణాః హి పాండవాః**" (పాండవులు నాకు ప్రాణాలు కదా!) (భార.) అని శ్రీకృష్ణభగవానుడు భక్తులగు పాండవులను తన ప్రాణములుగా భావించెను, "కృతే చ ప్రతికర్తవ్యమ్" (చేసిన ఉపకారానికి ప్రత్యుపకారాన్ని చేయాలి) అను రీతిలో ఇచట భట్టరు భగవానుని తమ ప్రాణములుగా పల్కిరి.

**"మిగ్రుమియ వమరర్ మునివర్ విగ్రుజ్ఞుమ్ కన్నల్ కని"** (తి. వా. -3-6-7) (జ్ఞానములో ఏ లోపము లేని, పరిపూర్ణమైన జ్ఞానమును కలిగినవారు, అనుభవనిష్ఠులు, కైంకర్యనిష్ఠులు అయిన నిత్యసూరులు భక్తులును ఆస్వాదించు శర్కరాఫలము) అను ఆళ్వార్ల సూక్తిని అనుసరించి కవి **"అలిహీయ"** అను క్రియను ప్రయోగించెను. ఇంతకు ముందు శ్లోకములలో, కవి త్వగింద్రియ చక్షురింద్రియానుభవములను ఆశపడగా, దీనిలో రసనేంద్రియానుభవమును ఆశపడుతున్నారు. **"సౌందర్యసంపదవలిప్తమ్"** అనుటకు సౌందర్యసంపద అను లేపనముచే, అనగా, మైపూతచే పూయబడినవాడని చెప్ప వీలున్నది. ఈ అర్థమునకనుగుణముగా **"ఆలిహీయ"** అను క్రియ ప్రయోగింపబడినదని భావింపనగును. అనగా, ఆస్వాదింతును – అని భావము. ఈ క్రియవలన కవి తమ అనుభవ వైవిధ్యములను అనుసంధించిరని చెప్పనగును. **"నాయేన్ వన్దడైన్దేన్"** శునకము వలె అతి నీచుడను అయిన నేను నీ దరికి చేరాను) అను మొదలగు ఆళ్వార్ల సూక్తులు. **"శునా లీఢాఽపిభాగీరథీ"** (గంగానది కుక్కచే నాకబడినది అయినప్పటికీ) (శ్రీస్తు. 5) అను మొదలగు కూరేశుల సూక్తులు, **"రథ్యాశునా మన్యతమో భవేయమ్"** (రం. స్తో. 5) (శ్రీరంగ దివ్యనగర వీథులలో సంచరించు ఒక శునకముగా నేను కావలెను) అను భట్టరుసూక్తియు ఇచట చేయబడిన **"ఆలిహీయ"** అను ప్రయోగానికి అగుణముగా స్మరింపదగినవి.

**"లక్ష్మీస్వయంవర"** అను తృతీయపాదములోని సమాసమునకు– లక్ష్మీదేనిని స్వయముగా వరించుటచే సార్థకమైన యౌవన, సౌందర్య శోభలను కల్గిన వాడనియు చెప్పవచ్చును. కాని, పైన చూసిన అన్వయమే సరసము.

**"ఆలిహాని"** అను వేరు పాఠమును కలదు. ఈ శ్లోకమున శ్రీరంగనాథుని పరత్వము ప్రధానముగా వర్ణింపబడినది

ఇందు వృత్తము వసంతతిలక.

**శ్రీరంగనాథుని పరత్వసౌలభ్యములను అనుభవించెదము**

**67. ఆపాదమూలమణిమౌళి సముల్లసంత్యా**
**స్వాతంత్ర్యసౌహృదతరంగితయా ఽంగభంగ్యా ।**
**సఖ్యం సమస్తజనచేతసి సందధానం**
**శ్రీరంగరాజ మనిమేష మనుస్రియాస్మ ॥**

**ప్ర. అ. –** ఆపాదమూలమణిమౌళి = పాదములు మొదలు శిరస్సువరకు, సముల్లసంత్యా = ప్రకాశించు, స్వాతంత్ర్యం – స్వాతంత్ర్యముచే (పరత్వముచే), సౌహృద = సౌహృదగుణముచే (సౌలభ్యగుణముచే), తరంగితయా = తరంగితమైన (అలలతో కూడుకొనియున్న), అంగభంగ్యా = అవయవముల సన్నివేశముచే, సమస్తజన = జనులందరియొక్క, చేతసి = మనస్సున, సఖ్యం = స్నేహమును (అనురాగమును, విశ్వాసమును), సందధానం = కలిగించువాడు అగు, శ్రీరంగరాజం = శ్రీరంగనాథుని, అనిమేషం = కనురెప్పపాటు లేకుండునట్లు, అనుస్రియాస్మ = అనుసరింతుము.

**వరివస్య :–** క్రిందటి శ్లోకమున శ్రీరంగనాథుని పరత్వమును అనుభవించిన భట్టరు, పరత్వ సౌలభ్యములు రెండును ఆశ్రయణమునకు ఆవశ్యకములగుటచే, ఆ రెంటిని కలిపి ఈ శ్లోకమున అనుభవించుచున్నారు. ఆశ్రయణమునకు సౌలభ్యగుణము, తదనంతరము రక్షించుటకు నిరంకుశ స్వాతంత్ర్యమును ఆవశ్యకములు కదా! "మణియై వానవర్ క్కణ్ణనై" (నీలమణిని నిత్యసూరులకు నిర్వాహకుని) (తి. వా. -1-10-11) అనుచు ఇట్లు పలు సందర్భములలో ఆళ్వార్లు పరత్వసౌలభ్యములను రెండిటిని ఒకే చోట అనుభవించుట గమనింపదగును. (ఈ ప్రమాణములో– మణిసామ్యము వలన సౌలభ్యము, నిత్యసూరులకు నిర్వాహకుడు అని అనుటవలన పరత్వము చెప్పబడినవి) ఆ మహనీయుల మార్గమును అనుసరించుచు భగవద్రామానుజులు శరణాగతిగద్యలో శ్రీరంగనాథుని పరత్వలక్షణములగు జ్ఞానాదిగుణషట్కములనుపేర్కొని, పిమ్మట "సౌశీల్యవాత్సల్య

మార్దవార్జవసౌహార్ద——, అనుచు సౌలభ్యప్రతిపాదక గుణములను అనుసంధించిరి. ఆళ్వార్ల, పూర్వాచార్యుల ఈ మార్గమును అనుసరించుచు భట్టరు ఈ శ్లోకమున శ్రీరంగనాథుని పరత్వసౌలభ్యములను కీర్తించుచున్నారు.

పూర్వశ్లోకమున "**అవలిప్తమ్**" అని పల్కుటచే గర్వించినవానివద్దకు పోవుట ఎట్లు? అను సందేహము కలుగును, అందులకు సమాధానమును భగవానుడు "సర్వభూతసుహృత్" అనుచు ఈ శ్లోకమున తెలుపుచున్నారని చెప్పవచ్చును.

శ్రీపాదములనుండి శిరస్సువరకు గల శ్రీరంగనాథుని దివ్యరూపములోని అవయవములలో అన్నిట స్వాతంత్ర్యమువలెనే సర్వభూతసౌహృదమును తరంగితమై ప్రకాశించుచున్నది. అందువలన స్వామిని సేవించిన సమస్తజనుల హృదయములలో అనురాగము కలుగుచున్నది. ఇట్టి శ్రీరంగనాథుని కనురెప్ప వేయకుండ అనుసరింతును— అని శ్లోకభావము.

భగవానుని నిరంకుశస్వాతంత్ర్యమును చూచి కొందరు సమ్మోహితులై ఆశ్రయింతురు, మరి కొందరు స్వామి సౌహార్దమునకు ఆకర్షితులై సమాశ్రయింతురు. "**లోకో భిన్నరుచిః**" గదా. వారి వారి భావనలకు, రుచులకు తగినట్లుగా, స్వామియొక్క స్వాతంత్ర్య, సౌలభ్య గుణములు రెండును దివ్యరూపము నందంతట వ్యాపించి, ప్రకాశించుచున్నని. స్వాతంత్ర్యమును చూచి వెనుకంజ వేయువారిని సౌహృదము, సౌహార్దమొక్కటే రక్షించుటకు చాలదని తలచువారిని స్వాతంత్ర్యమును ఆకట్టుకొనుచున్నవి.

"**సుహృదః భావః సౌహృదమ్**"— స్నేహితుని స్వభావమునకు సౌహృదమని పేరు. "**శోభనశంసీ సుహృత్**" అనగా, మంచిని కోరువాడు సుహృత్. భగవానుడు సర్వభూతసుహృత్. "**సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి**" (భ. గీ. –5–29) (నన్ను సమస్త ప్రాణులకు సుహృత్తుగా తెలుసుకొని, శాంతిని పొందుతున్నాడు) అనుచు గీతాచార్యుడు తన సౌహృదగుణమునుగూర్చి గీతలో నుడివెను కదా! "**సఖ్యం సమస్తజనచేతసి**"

అనుచు కవి ఇచట ఈ గీతాశ్లోకభావమును అనుసంధించెను. సర్వశబ్దమునకు బదులు సమస్తపదము, భూతశబ్దమునకు బదులు జనశబ్దమును వాడుట మాత్రమే ఇచట భేదము.

సఖ్యమేర్పడినచో ఆత్మనివేదనము సులభమగును "**సఖ్యమాత్మనివేదనమ్**" అని కదా భక్తి క్రమము. "**సఖ్యం సందధానమ్**" అనుటచే ఈ సఖ్యమునుకూడ భగవానుడే మొదటగా చేయునని తెలియుచున్నది.

సౌహృదమువలన సఖ్యము కల్గిన కలుగవచ్చును, కాని, స్వాతంత్ర్యగుణము సఖ్యమునకు ఎట్లు కారణమగును? అనినచో, భగవానుడు సర్వస్వతంత్రుడు, కావుననే మన దోషములను గణింపడు. ప్రభుసంమితమగు వేదనియమమును సైతము కాదని, చెడ్డమార్గమున సంచరించు అయోగ్యులమగు మనలను నిర్హేతుకముగా కరుణించును – అనువిశ్వాసము ఏర్పడును – అని చెప్పవచ్చును. విష్ణుసహస్రనామములోని "**సుహృత్**" అను నామమునకు పిమ్మట "**మనోహరః**" అను నామముండుటలో గల స్వారస్యమును భగవద్గుణదర్పణమున వివరించు భట్టరు, సర్వభూతసౌహృదము చేతనులందరి మనస్సులను ఆకర్షించుటచే "**మనోహరః**" అను నామము భగవానున కేర్పడెనని వ్యాఖ్యానించిరి.

"**అనిమేష మనుస్రియాస్మ**" అనుటచే భట్టరు "**జాగృవాంసః సదా పశ్యంతి**" (ఋ. వే. 1–22–20)(నిత్యసూరులు రెప్పపాటును లేనివారై, భగవంతుని ఎల్లప్పుడూ దర్శింతురు) అను రీతిలో నిత్యసూరులవలె కావలెనని ఆశపడినట్లు ఏర్పడుచున్నది. "**అనిమేష, మనుస్రియాస్మ**" అనుసూక్తి "**ఛాయా వా సత్త్వ మనుగచ్ఛేత్**" (నీడవలె భగవానుని జీవుడు అనుసరించవలెను) అను ప్రమాణమును తలపింపజేయుచున్నది.

ఈ శ్లోకమున మౌళిశబ్దముచే శిరస్సు ఉపలక్షింపబడినది. "**సుష్ఠు హృదయం యస్య సః సుహృదయః, అస్య భావార్థే అణి, 'హృదయస్య హృల్లేఖయదణ్ లాసేషు' (6–3–50) ఇతి సూత్రేణ హృదాదేశే, ఆదేశస్య**

**బహిరంగతయా అసిద్ధత్వాత్, 'హృద్భగసింధ్వంతే పూర్వపదస్య' (7-3-19) ఇతి ఉభయపదవృద్ధ్యభావాత్ సౌహృదం ఇతి రూపం భవతి"** అని సౌహృదమనుశబ్దముయొక్క నిష్పత్తి శిష్టప్రయోగసందర్భమున చూపబడినది.

"**అనుశ్రియాస్మ, ఆనుశ్రయాస్మ**" అను రెండు పాఠాంతరములు అసాధువులే. "శ్రీఙ్" అను ధాతువునుండి అట్టి రూపము లేర్పడుటకు అవకాశము లేదు – అని శ్రీ ప్ర. భ. అణ్ణాస్వామి తమ వ్యాఖ్యానమున అభిప్రాయపడుచు, "**అనుస్రియాస్మ**" అనునది సాధురూపమని నిర్ణయించిరి. ప్రకృతమున ఆ రూపమే గ్రహింపబడినది.

ఇందు వృత్తము వసంతతిలక.

**శ్రీరంగనాథుడొక అలౌకిక పారిజాతము**

**68. క్షితికమలనివాసాకల్పవల్లీసలీలో–**
**– ల్లుఠనదశదిశోద్యద్యౌవనారంభజృంభః ।**
**శ్రమ మపహరతాం మే రంగధామేతి త్తతత్–**
**వరమయఫలనమ్రః పత్రలః పారిజాతః ॥**

**ప్ర. అ. –** క్షితి = భూదేవి, కమలనివాసా = లక్ష్మీదేవి అను, కల్పవల్లీ = కల్పలతలయొక్క, సలీల = విలాసముతో కూడిన, ఉత్ + లుఠన = ఆలింగనములచే (పరివేష్టనములచే), దశదిశ = పది దిక్కులలోను, ఉద్యత్ = ప్రకాశించు, యౌవన = యౌవనముయొక్క, ఆరంభః = ఆరంభముయొక్క, జృంభః = (వైలక్షణ్యమును కల్గినది) అతిశయమును కల్గినది, పత్రలః = ఆకులతో నిండినది, తత్ తత్ = ఆ యా వరమయ = వరములనెడు, ఫల = ఫలములచే, నమ్రః = (కొంచెము) వంగినది అగు, రంగధామా–ఇతి = శ్రీరంగనాథుడను, పారిజాతః = పారిజాతవృక్షము, మే = నాయొక్క, శ్రమం = శ్రమను, అపహరతాం = పోగొట్టునుగాక!

**వరివస్య :–** ఈ శ్లోకమున కవి శ్రీరంగనాథుని కల్పవృక్షముతో పోల్చుటద్వారా వర్ణించుచున్నారు. వేదము "**బ్రహ్మ వనం బ్రహ్మ స వృక్ష ఆసీత్**" (పరమాత్మ వనము, పరమాత్మ వృక్షము) అని భగవంతుని వనముగా వృక్షముగా తెలిపినది. వృక్ష శబ్దమునకు – వరింపబడువాడని, వరించువాడని అర్థములు.. ఈ రెండును శ్రీరంగనాథుని విషయములో సార్థకములు.

"**నివాసవృక్షః సాధూనామ్**" (రా. కి. –17–19) (సత్పురుషులకు నివాసవృక్షము) అని శ్రీరామాయణమున వాల్మీకి భగవానులు, "**వాసుదేవతరుచ్ఛాయా**" (వాసుదేవుడు అను వృక్షముయొక్క నీడ) (222–25) అని గారుడమున వ్యాసభగవానులు సర్వేశ్వరుని చల్లని నీడనిచ్చు వృక్షముగా స్తుతించిరి. ఆళ్వార్లు "**ఎనక్కే తన్నై త్తన్ద కల్పకమ్**" (తి. వా. –2–7–10) అనుచు (తనను నాకు అధీనము చేసుకొన్న కల్పవృక్షము) అని భగవానుని అద్వితీయమైన కల్పవృక్షముగా రూపించి, వ్యాసవాల్మీకుల సూక్తికి మరింత శోభను చేకూర్చిరి. ఎందులకనగా, కల్పవృక్షము అన్నిటిని ఇచ్చును. కానీ, తాను ప్రార్థించువారికి తనను స్వాధీనము చేసుకొనదు కదా. ఆచార్యశ్రేష్ఠులగు యామునులు, భగవద్రామానుజులును, స్తోత్రరత్నమున, గద్యత్రయమున భగవానుని "**అర్థికల్పక**" (45) మని స్తుతించిరి. భట్టరు ఈ పద్ధతిని అనుసరించుచు ఇందు శ్రీరంగనాథుని కల్పవృక్షముగా ఉపమించిరి.

ఈ సందర్భమున "**ఫల మత ఉపపత్తేః**" (జీవునకు ఇహలోక పరలోక ఫలములు ఈ భగవానుని వల్లనే కలుగును, ఎందులకనగా, ఆ విధముగా చెప్పినప్పుడే కుదురును కనుక) అను బ్రహ్మసూత్రము స్మరింపదగినది. వృక్షమే కదా ఫలముల నొసగును. ఫలములను ఇచ్చు వృక్షమును కర్మఫలములను ఈ భగవంతునకు ఉదాహరణముగా చెప్పుట మిగుల యుక్తము. అయినచో, ఇచట విశేషము ఏమనగా, లోకములో ఫలములను ఇచ్చు వృక్షము కాని, స్వర్గములోని కల్పవృక్షము కాని, అల్పజ్ఞానమును కలిగినది, అల్పశక్తిని కలిగినది, అల్పఫలములను ఇచ్చునది కాగా, భగవానుడను కల్పవృక్షము సర్వజ్ఞమై,

సర్వశక్తియై, సకల ఫలములను ఇచ్చున్నదియై, వేరు ఏ వృక్షము ఇవ్వ లేని మోక్షఫలమును కూడా ఇచ్చునదియై ఉన్నది. అంతే కాకుండా, ఆశ్రయించినవారికి తనను కూడా స్వాధీనము చేసుకొను స్వభావమును కలిగినది. ఇంత మాత్రమే కాదు, అర్థులను కల్పించు, అనగా, సృష్టించు శక్తి కూడా ఈ కల్పవృక్షమునకు ఉన్నది. ఈ శక్తి మిగిలిన ఏ కల్పవృక్షములకు లేదు.

శ్రీదేవి, భూదేవి – అను రెండు కల్పలతలు విలాసముగా చుట్టుకొని యుండుటచే అన్ని దిక్కులలోను తొణికిసలాడుచున్న నవయౌవనశోభను కల్గినది, (ఆశ్రితుల) ఆ యా కోరికలు అను ఫలములను దాల్చియుండుటచే కొద్దిగా వంగి యున్నది, (ఎటువంటి తక్కువవారు అయినా, అందుకొనుటకు వీలుగా ఉండునట్లుగా తక్కువ ఎత్తులో వంగియున్నది) పచ్చని ఆకులతో నిండినది అగు శ్రీరంగనాథుడను పారిజాత కల్పవృక్షము నా శ్రమలను (ఆధిభౌతిక, ఆధ్యాత్మిక, ఆధిదైవికరూప శ్రమలను) తీర్చుగాక! అని శ్లోకభావము.

కల్పవృక్షమును చుట్టుకొనియుండు లతలకు కల్పలతలని పేరు. స్వామిని "**అకలకిల్లేన్**" (తి. వా. -6-10-10) (వదలియుండ జాలను) అను స్వభావమును కల్గిన లక్ష్మీదేవి, అట్టి ప్రకృతినే కల్గిన, ఆమె ప్రతిరూపమైన భూదేవి– ఈ ఇద్దరును నిత్యము సంశ్లేషించి యుండుటచే, వారిని భట్టరు కల్పలతలతో పోల్చిరి. వేదాంతదేశికులు "**కలశజలధికన్యావల్లరీ కల్పశాఖీ**" (వర. పం. -1) పాలసముద్రమునుండి పుట్టిన లక్ష్మీదేవి అనే కల్పలత ఆశ్రయించిన కల్పవృక్షము) అని ఈ అర్థమును అనుసంధించిరి. ఈ లతల సంబంధమే శ్రీరంగనాథుడను కల్పవృక్షమునకు దోహదము. అందుచే ఆ కల్పవృక్షము నందంతట నిత్యయౌవన ప్రారంభము యొక్క అతిశయము ప్రస్ఫుటమగుచున్నది. లోకమున "**చూతేన సంగతవతీ నవమాలికేయమ్**" (తీయ మామిడి చెట్టుతో సంబంధమును కలిగిన, నూతనముగా పుట్టిన ఈ తీగ) అనునట్లు వృక్షమును ఆశ్రయించుటచే లతలకు అపూర్వశోభ కల్గును. ఇచట

శ్రీదేవి, భూదేవులనెడి కల్పలతల పరిరంభణముచే భగవానుడను పారిజాతమునకు శోభ కల్గుట విశేషము. భగవానుని యౌవనము దశదిశలలో వ్యాపించెననుటలో అర్థమేమనగా, పరబ్రహ్మ ప్రతిరూపమగు శ్రీరంగనాథుని స్వరూపము అంతటా వ్యాపించియుండుటచే, ఆ స్వామియౌవనమును ఎల్లెడల వ్యాపించి యుండుటయే. మఱియు, పరమరసికుడగు స్వామి తన దేవేరులతో లీలారసమును అనుభవించునపుడు. తన సాధారణరూపము చాలక పోవుటచే **"తోళ్ కళ్ ఆయిరత్తాయ్.... తాళ్ గళ్ ఆయిరత్తాయ్"** (తి. వా-8-1-11) (వేయి బాహువులను కలిగినవాడు, వేయి పాదములను కలవాడు) అనునట్లు విశ్వరూపమును గొని అనుభవింప నెంచును. ఆ విధముగాకూడా స్వామియౌవనము దశదిశలలోను విజృంభితమని చెప్పనగును. భట్టరు శ్రీగుణరత్నకోశమున **"అనుకలతను కాండాలింగనారంభ శుంభత్ ప్రతిదిశభుజశాఖ శ్రీసఖానోకహర్ధిః"** (శ్రీ. గు. - 3) (ప్రతిక్షణం పట్టుకొమ్మ వలె ఉండే తన తనువులో ఏర్పడిన భగవానుని ఆనందముల ఆరంభములతోనే గొప్పగా ప్రకాశించే అన్ని దిక్కులలోని కొమ్మలవంటి భుజాలను కలిగిన కల్పవృక్షంవంటి భగవంతుని వృద్ధిని కలిగినది) అని, **"భోగోపోద్ఘాతకేళీచులకిత భగవద్వైశ్వరూప్యానుభావా"** (శ్రీ. గు. -4) (అనుభవప్రారంభకేళిలోనే పుడిసిట పట్టిన భగవంతుని విశ్వరూపంలోని వైభవాన్ని కలిగినది) అని, **"దశశతపాణిపాదవదనాక్షిముఖైః. వినిమజ్జతి తే"** (శ్రీ. గు. -55) (వేల సంఖ్యలోని చేతులు, పాదములు, ముఖములు, నేత్రములు – అను వీనిని కలిగిన విశ్వరూపంతో నిన్ను అనుభవించినప్పటికీ, నీ విలాసాలు అనే సుడిగుండంలో భగవానుడు మునిగి పోతున్నాడు) అని పల్కుట పై భావమును బలపఱచుటయేగాక, హృదయంగమము చేయుచున్నది.

భగవానుని యౌవనప్రారంభము విజృంభితము కాగా, తత్సామ్యమును పొందుటకు యోగ్యులును, పొందగోరువారును అగు అందరును యువకులగుదురు. **"చైత్రః శ్రీమాన్ అయం మాసః పుణ్యః పుష్పితకాననః"** (రా.

అయో. 3-4) (రాముని అవతార సమయమైన ఈ చైత్రమాసము సంపదతో నిండినది, పవిత్రమైనది, అంతటా పుష్పించిన వనములను కలిగినది) "**భవామి పునర్యువేవ**" (రా. అయో. 12-106) అను శ్రీరామాయణసూక్తులను స్మరింపనగును. ఈ విధముగాకూడ భగవానుని యౌవనము విశ్వవ్యాప్తము – అని శ్రీ గోపాలాచార్యవ్యాఖ్యానమున వివరింపబడినది.

లోకమున చేతనులకు యౌవనశోభ కొంతకాలము మాత్రమే నిలచియుండును. పిమ్మట ఆ శోభ క్రమముగా తరిగిపోవును, శ్రీరంగనాథుని విషయమున యౌవనము అట్లుకాక, నిత్యనూతనమై అలరారును. ఎప్పుడు చూచినను అపూర్వముగానే కన్పించును. ప్రారంభ దశలోనే ఉండును. అందులకు కారణము దేవేరుల సంబంధమే. తిరుమழிశై ప్పిరాన్ నాన్ముకన్ తిరువన్దాదిలో "**పొన్ పావై కేళ్వా! కిళరొళి ఎన్ కేశవనే!**" (59) (బంగారు వర్ణమును కలిగిన లక్ష్మీదేవితో క్రీడించువాడా! ఆ కారణము వలన ఎల్లప్పుడూ వృద్ధి పొందు ప్రకాశమును కలిగిన ఓ నా కేశవస్వామీ!) అనుచు దేవేరిసంబంధమువలన సర్వేశ్వరుని శోభ నిత్యము వృద్ధిచెందుచున్నదనిరి కదా! (ఈ అర్థము ఈ దివ్యసూరి ప్రమాణములో "**కిళర్**" వర్తమాన కాలిక ప్రయోగం వలన ఏర్పడుతున్నది.) శ్రీరామాయణములో కూడా ఈ అర్థమును వాల్మీకి మహర్షి "**అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా**" (ఈ సీతాదేవి ఎవరికి పత్నియో, ఆ శ్రీరాముని తేజస్సు లెక్క కట్టడానికి సాధ్యం కానిది) అని అంటూ తెలియజేశాడు. ఇక్కడ "**అప్రమేయమ్**" అను ప్రయోగముచేత ఈ అర్థము స్ఫురింపజేయబడినది. కూరేశుల వరదరాజస్తవమున "**రంభాస్తంభాః**" (56) అను శ్లోకముయొక్క అర్థ మిచట స్మరింపదగినది.

వృక్షములు "**భవంతి నమ్రాః తరవః ఫలోద్గమైః**" (వృక్షములు ఫలముల ఆవిర్భావము వలన వంగి ఉండును) (భర్తృహరినీతిశతకము) అనునట్లు, పండ్ల బరువుచే కొంచెము వంగియుండును, స్వామియు "**సకలఫలప్రదో హి విష్ణుః**" (విష్ణువు అన్ని విధములైన ఫలములను ఇచ్చువాడు కదా!) (వి. ధ. -43-47)

అని, "**చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవః చతుర్భుజః**" (చంద్రాలోకము) (నాలుగు విధాలయిన పురుషార్థములను ఇచ్చువాడు నాలుగు భుజాలను కలిగిన దేవుడైన నారాయణుడు) అని పేరు వడసినవాడు అగుటచే, ఫలపౌష్కల్యమును కల్గినవాడు. కావున, "ఫలనమ్రః" అను విశేషణము ఇచట మిగుల సార్థకము, నమ్రత్వ మిచట ఫలపౌష్కల్యమునే కాక, తనను ఆశ్రయించువారెట్టి వారైనను తాము కోరిన ఫలములను పొందుట కనువుగా నుండుటను, అనగా, అసాధారణ సౌలభ్యమును కలిగియుండుటను కూడ తెలియజేయుచున్నది.

వృక్షములు యౌవనదశలో నున్నపుడు పచ్చని ఆకులతో కళకళలాడుచుండును. అందుకే ఈ పారిజాతవృక్షము పత్రలమైనది. మఱియు, ఈ విశేషణము ఆశ్రితుల తాపమును తీర్చు దట్టమైన నీడను కల్గియుండుటను ఈ విశేషణము తెలుపును. పచ్చని, దట్టమైన ఆకులను కలిగిన చెట్టు నీడ చల్లగా ఉండును కదా. తనను దరికి చేరినవారి తాపమును తీర్చును కదా. అట్లే, "**దశదిశోద్యద్. జృంభః**" అను విశేషణప్రయోగమువలన భగవానుడను పారిజాతవృక్షముయొక్క యౌవనారంభము అను పరిమళము దశదిశలలో వ్యాపించెనని ధ్వనించుచున్నది. "**పత్రలః**" అని కవి శ్రీరంగనాథుని వర్ణించుట వలన, ఆ స్వామి దివ్యావయవములన్నియు యౌవనారంభ శోభకు తగినట్లున్నవని వ్యక్తనుగుచున్నది. ఇది వేదములో చెప్పబడిన "**యువాఽ కుమారః**" (యౌవనదశ ప్రారంభములోనున్నవాడు, కౌమార దశ చివరిలో ఉన్నవాడు) అను సూక్తిని, "**అరుమ్బినై అలరై**" (మొగ్గవంటివాడు పువ్వువంటివాడు) దివ్యసూరిసూక్తిని వివరించుచున్నది.

"**పత్రం వాహనపక్షయోః**" అను నిఘంటువచనమునుబట్టి, గరుత్మంతుడను వాహనముచే శోభిల్లువాడనియు పత్రలశబ్దమున కర్థము చెప్పవచ్చును.

**"పంచైతే దేవతరవో మందారః పారిజాతకః,**
**సంతానః కల్పవృక్షశ్చ పుంసి వా హరిచందనమ్"**

అను అమర నిఘంటువచనమును బట్టి, పారిజాతవృక్షము స్వర్గములోనుండు అయిదు వృక్షములలో ఒకటి. కల్పకపారిజాతములు వేర్వేరని ప్రస్తుతము ఉట్టంకింపబడిన అమరకోశవచనము తెలుపుచున్నది. కావున, కవి ఇచట కల్పమును లతగా, పారిజాతమును తరువుగా రూపించిరి.

భట్టరు రచించినట్లు చెప్పబడు ముక్తకశ్లోకములలోని ఈ క్రిందిశ్లోకమున శ్రీరంగనాథుడు కల్పవృక్షముగా అభివర్ణింపబడుటను గమనింపవచ్చును.

**"అనేకశాఖాశ్రిత మాశ్రితేభ్యో**
**దత్తాభికాంక్ష్యం త్రిదశైకభోగ్యమ్ ।**
**సుపర్ణరమ్యం సుమనస్సమేతం**
**సురద్రుమం త్వాం సుధియో వదంతి ॥**

(ఓ శ్రీ రంగనాథా! కల్పవృక్షము అనేక శాఖలను కలిగి ఉండును. వేదములోని పలు శాఖలతో సంబంధమును కలిగి ఉన్నావు. కల్పవృక్షము తనను ఆశ్రయించినవారికి వారు కోరిన ఫలములను ఇచ్చి, వారి కోరికను తీర్చును. నీవు కూడా నిన్ను ఆశ్రయించినవారు కోరిన ఫలములను అనుగ్రహించి వారి కోరికలను తీర్చుదువు. కల్పవృక్షము దేవతలకు మాత్రమే అనుభవించుటకు వీలైనది. నీవు కూడా నిత్యసూరులకు మాత్రమే భోగ్యుడవై ఉన్నావు. కల్పవృక్షము చక్కని ఆకులతో అందముగా ఉండును. నీవు కూడా సుపర్ణుడు అనబడే గరుడునిపై అధిరోహించుట వలన మనోహరముగా ఉంటావు. కల్పవృక్షము దేవతలతో కూడి ఉంటుంది. నీవు కూడా మంచి మనసును కలిగినవారితో కూడి ఉంటావు. అందువలన నిన్ను కల్పవృక్షమని బుద్ధిమంతులు చెబుతున్నారు.)

ప్రస్తుత శ్లోకములో "**శ్రమ మపహరతామ్**" అనునప్పుడు, భక్తుల శ్రమను తొలగించుటవలన కలుగు లాభము భగవానునిదే, అనగా,

చేతనలాభము ఈశ్వరునిదే – అను విశేషము ఆత్మనేపదక్రియాప్రయోగముచే ధ్వనించుచున్నది.

ఇందుశ అలంకారము రూపకము, వృత్తము మాలిని.

## శ్రీరంగనాథుడు మాటలాడు వృక్షము

**69. సంభాషమాణ మివ సర్వవశంవదేన**
**మందస్మితేన మధురేణ చ వీక్షణేన ।**
**దివ్యాస్త్ర పుష్పితచతుర్భుజ మత్యుదారం**
**రంగాస్పదం మమ శుభాశ్రయ మాశ్రయాణి ॥**

**ప్ర. అ. –** సర్వవశంవదేన = అందరిని వశము చేసికొనగలిగిన, మధురేణ = తీయనైన, మందస్మితేన = చిఱునవ్వుతో, వీక్షణేన చ = చూపుతోను, సంభాషమాణమ్ ఇవ (స్థితం) = మాటలాడునట్లున్నవాడును, దివ్య = గొప్పవైన (అప్రాకృతములైన), ఆయుధ = ఆయుధములచే, పుష్పితం – పుష్పించునట్లు చేయబడిన, చతుః+ భుజం = నాల్గు భుజములను కలవాడును, అతి ఉదారం = మిక్కిలి ఉదారుడు, మమ = నాకు, శుభ + ఆశ్రయం = మంగళకరమైన ఆశ్రయమైనవాడు, రంగ ఆస్పదం = శ్రీరంగమును నిలయముగా కలవాడు అగు శ్రీరంగనాథుని, ఆశ్రయాణి = ఆశ్రయింతును,

**వరివస్య :–** అభిమతభక్తజనులను చూచుటచే కల్గిన ఆనందాతిశయముచే శ్రీరంగనాథుడు అర్చావతారసమాధిని దాటి, తనలో పొంగిపొరలుచున్న సంతోషమును తెలుపు అవ్యక్తమధుర మందహాసముతోను, కరుణ నిండిన చల్లని చూపుతోను దర్శనమిచ్చుట చూడగా, స్వామి భక్తులతో **"శోదివాయ్ తిఱన్దు"** (తి. వా. -9-2-1) (ప్రకాశించు నీ అధరమును తెరచి ఒక సూక్తిని పలుకుము) అని ఆళ్వార్లు ఆశపడిన విధముగా, తన నోటిని తెరచి మాటలాడుచున్నాడా! అనునట్లుండును. ఇట్టి శ్రీరంగనాథుని ఉత్సవమూర్తి సన్నివేశమును ఇందు భట్టరు స్తుతించుచున్నారు. పూర్వశ్లోకమున

మాటలాడనేరని కల్పవృక్షముతో రంగనాథుని పోల్చిన కవి, ఇందు ఆ కొరత తీరునట్లుగా మాటలాడు వృక్షముగా వర్ణించుచున్నారు.

సమస్తభక్తవర్గమును ఆకట్టుకొను అవ్యక్తమందహాసముతో, కరుణనిండిన చూపుతో శ్రీరంగనాథ స్వామి భక్తులతో మాటలాడుచున్నాడా? అనునట్లుండును. ఆయన నాల్గు చేతులతో దివ్యాయుధములను దాల్చుటను చూడగా, ఒక కల్పవృక్షము పుష్పించిన విధముగా నుండును. స్వామి వర్ధిల్లు అర్థిజనులు అడిగినదాని కంటే ఎక్కువ ప్రసాదించు గొప్ప మనస్సును కలవాడు. నావంటి ఆర్తులకు మంగళకరమగు గొప్ప ఆశ్రయము, శ్రీరంగనవిమానమును తన ఆశ్రయముగా చేసికొన్నవాడు. అట్టి శ్రీరంగనాథుని నేను ఆశ్రయింతును– అని శ్లోకభావము.

"**సర్వవశంవదేన**" అను సమాసమును తత్పురుషసమాసముగా అన్వయించినచో, (అనగా, "**సర్వేషాం వశంవదేన**" అనుచు అర్థము చెప్పినచో) అందరికిని సులభమైన మందహాసమని, బహువ్రీహిసమాసముగా అన్వయించిన, (అనగా "**సర్వే వశంవదాః యేన తేన**" అని అర్థము చెప్పిన) అందరిని ఆకట్టుకొను మందహాసమని అర్థము వచ్చును. "**మందస్మితేన సంభాషమాణమ్**" అని అన్వయించిన, "**స్మితపూర్వభాషీ చ. పూర్వభాషీచ రాఘవః**" (శ్రీరాముడు చిఱునవ్వుతో కూడినవాడై, తానే ముందుగా సంభాషించును) అను ప్రమాణవచనము గుర్తుకు వచ్చును. "దివ్యాస్త్ర పుష్పితమ్" అనుచు అస్త్రములను పుష్పములుగా రూపించుటద్వారా కవి వాని ఆభరణత్వమును ప్రస్తుతించెను.

"**భగవత్సారూప్యభాగ్భిః భక్తైః శాఖాభ్యో యథేష్ట మపచయ్య స్వైరపి పుష్పవత్ ధారయితుం యోగ్యాని ఇమాని అస్త్రాణి – ఇత్యపి వ్యజ్యతే. ఏవ మేవ అత్యుదారత్వం నిరూహ్యేత**" (భగవంతునితో సారూప్యమును పొందినవారైన భక్తులు తాము ఆశపడిన రీతిలో కోసుకొని, తాము కూడా పూలను దాల్చినట్లుగా ధరించడానికి తగినవి, ఈ దివ్యాస్త్రములు– అను అర్థము వాటిని

పూలుగా రూపించుటవలన వ్యక్తమవుతున్నది. ఈ విధముగానే, భగవంతుని ఔదార్యమును కూడా నిర్వహించవచ్చును) అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో వివరింపబడినది.

దివ్యాయుధములచే పుష్పించిన చతుర్భుజములను కలవాడనుటచే పూర్వశ్లోకమున కవి వర్ణించిన కల్పవృక్షసమాధి ఈ శ్లోకమునందును అనువర్తించెనని ఏర్పడుచున్నది. ముందు శ్లోకమున శ్రీరంగనాథుడను పారిజాతవృక్షముయొక్క ఆకుల, ఫలముల సమృద్ధి వర్ణింపబడగా, ఇందు పుష్పసమృద్ధి వర్ణింపబడినది.

తిరువాయ్ మొళి వ్యాఖ్యానమగు ఈడు ముప్పత్తాఱాయిరప్పడిలో "**శన్మమ్ పలపల శెయ్ దు**" (3–10–1) అను పాశురములోని "**ఒళ్ వాళ్ తణ్డు కొణ్డు**" అనుచోట వ్యాఖ్యానమున గల "**ఒరు కల్పకత్తరు పణైత్తు, కణు త్తోఱుమ్ అఱుమ్బినాప్పోలేయా య్ త్తు – వడివుమ్, దివ్యాయుధఙ్గళుమ్ ఇరుప్పదు**" ఒక కల్పవృక్షము పలు శాఖలుగా వృద్ధి చెంది, ప్రతి కణుపులోనూ మొగ్గ తొడిగినట్లుగా ఉన్నది – భగవంతుని దివ్య మంగళ విగ్రహము, ఆ విగ్రహములోని దివ్యాయుధములు ఉండు రీతియు)అను వాక్యమును, "**కణ్ గళ్ శివన్దు**" (తి. వా. 8–9–1) అను పాశురములో "**నాన్గు తోళన్ కుని శార్ ఙ్గన్**" అను పదముయొక్క వ్యాఖ్యానమున పన్నీరాయిరప్పడిలో "**దివ్యాస్త్రపుష్పిత చతుర్భుజమ్– ఎన్గిఱపడియే, అన్దభుజకల్పకమ్ పూత్తాప్పోలే యిరుక్కిఱ వళైన్ద శ్రీశార్ ఙ్గమ్ ఆకియ దివ్యాయుధత్తై యుడైయనాయ్**" దివ్యాస్త్రపుష్పితచతుర్భుజమ్ – అని పలికినట్లుగా, ఆ మజా కల్పకము పుష్పించినట్లుగా ప్రకాశిస్తున్న, కొంచెము వంగిన శార్ ఙ్గమ్ అనే దివ్యాయుధాన్ని కలిగినవాడై) అను వాక్యమును ఇచట స్మరింపనగును.

రంగనాథస్వామి చతుర్భుజుడైనను, మూడు చేతులతో శంఖము, చక్రము, గద – అను మూడు ఆయుధములను, నాల్గవ వచేతితో అభయముద్రను ధరించువాడగుటచే, "**దివ్యాస్త్ర పుష్పితచతుర్భుజమ్**" అనుట

ఎట్లు పొసగును? అను శంక ఇచట కలుగవచ్చును. ఈ శంకను వేంకటాచార్యులను సంస్కృతవ్యాఖ్యాత పరిహరించుచు ఇట్లనెను. "మూడు భుజములలో మాత్రమే శ్రీరంగనాథుడు ఆయుధములను దాల్చియున్నను, అభయముద్రను గల భుజముతో ఆ యా సందర్భములలో శార్ జ్గ మను విల్లును ధరించు వీలున్నందున గాని, లేక, అభయముద్ర ఆశ్రితుల మనస్సులలోగల భయమును పోగొట్టునది కావున, ఆ ముద్రనుకూడ ఒక ఆయుధముగా భావింప నవకాశముండుటచేగాని, నాల్గు భుజములలో ఆయుధములున్నట్లు కవి వర్ణించుట సంగతమే అగును".

**"అభయముద్రైయై భయనివర్తకత్వత్తాలే అస్త్రమాక వనుసంధిత్తు, 'దివ్యాస్త్ర పుష్పితచతుర్భుజమ్' ఎన్గరుళిచ్చెయ్ దార్"** (అభయ ముద్రను, అది భయాన్ని పోగొడుతుంది కనుక, దానిని ఆయుధంగా భావించి, 'దివ్యాస్త్రపుష్పిత చతుర్భుజమ్' అని అన్నారు) అని వాధూల వీరరాఘవాచార్యస్వామి వ్యాఖ్యలో వివరింపబడినది.

భగవానుని దివ్యమంగళవిగ్రహమునకు శుభాశ్రయము అని ప్రసిద్ధమైన వ్యవహారము. మంగళకరమైనది. భక్తుల ధ్యానమునకు ఆశ్రయమైనది, కనుక, ఈ పేరు వచ్చినదని పెద్దలు చెబుతారు.

**"శుభాశ్రయ"** మనుటచే లోకములో గల మిగిలిన ఆశ్రయముల కంటె స్వామికి గల గొప్పదనమును తెలియుచున్నది. ఎల్లప్పుడును మంచినే కలుగచేయు ఆశ్రయమని భావము. **"శోభతే ఇతి, శోభతే అనేన ఇతి శుభమ్"** అను వివరణమును కల శుభశబ్దమునకు ప్రకాశించునది, ప్రకాశింపజేయునది –అని అర్థము. లోకములో, మనము ధ్యానించి ఆశపడు వస్తువులు మంచిని కలుగజేయునవిగా, మన స్వరూపమును ప్రకాశింపచేయునవిగా ఉండునని చెప్పలేము. ఎందులకనగా, అవి, మన స్వరూప జ్ఞానమును ఆవరించి, అజ్ఞానమునకు కారణమవుచున్నవి భగవంతుని దివ్యమంగళవిగ్రహము అటువంటిది కాకుండా, సౌందర్య లావణ్యాది దివ్యగుణములతో ప్రకాశించుచు,

మన స్వరూపమును, తన స్వరూపమును మనకు ప్రకాశింపచేయునదియై శుభాశ్రయము అవుతున్నది.

ముందు శ్లోకమున స్వామిని కల్పవృక్షముతో, ఇందు గొప్ప మంగళకరమైన ఆశ్రయముతో పోల్చుటవలన, **"మందస్మితేన సంభాషమాణమ్"** అని పల్కుటవలన, కవి, శ్రీరామాయణములోని **"నివాసవృక్షః సాధూనామ్"** (రా. కి. 15–19) (సాధువులకు నివాస వృక్షము) అను శ్లోకరత్నములోని **"నివాస వృక్షః"** అను పదముయొక్క భావమును ముందు శ్లోకములోను, **"ఆర్తానాం సంశ్రయ శ్చైవ"** (రా. కి, 15–19) (ఆర్తిని చెందినవారికి గొప్ప ఆశ్రయము) అను వచనభావమును ఈ శ్లోకమున అనుసంధించిరని చెప్పనగును. ఈ స్తోత్రములోనే, మరల కవి, 76వ శ్లోకమున **"ఆర్తాపాశ్రయ మర్థికల్పక"** మనుచు ఈ రెండర్థములను జోడించి అనుసంధించుటను గమనింపనగును.

ఇందు అలంకారము రూపకము. వృత్తము వసంతతిలక.

## దివ్యాయుధములతో, అభయ ముద్రతో కూడిన శ్రీరంగనాథుడు మన క్షేమాన్ని నిర్వహించాలి

**70. ఏతే శంఖగదాసుదర్శనభృతః క్షేమంకరా బాహవః**
**పాదద్వంద్వ మిదం శరణ్య మభయం భద్రం చ వో హే జనాః॥**
**ఇత్యూచుష్యభయంకరే కరతలే స్మేరేణ వక్త్రేణ తత్**
**వ్యాకుర్వ న్నివ నిర్వహే న్మమ ధురం శ్రీరంగసర్వంసహః ॥**

**ప్ర. అ. –** హే జనాః = ఓ జనులారా!, శంఖ = (పాంచజన్యమను) శంఖము, గదా = (కౌమోదకి అను) గద, సుదర్శనభృతః = సుదర్శనచక్రము అను ఆయుధములను ధరించు, బాహవః = బాహువులు, వః = మీకు, క్షేమంకరాః = క్షేమమును కల్గించునవి, ఇదం = ఈ, పదద్వంద్వం = పాదముల జంట, వః = మీకు, శరణ్యం = రక్షకము, అభయం = భయమును తీర్చునది, భద్రం చ =

మంచిని కల్గించునది కూడ, ఇతి = అని, అభయంకరే = అభయమును కల్గించు ముద్రతో కూడిన, కరతలే = చేయి, ఊచుషి (సతి) = పల్కినది. కాగా, తత్ = ఆ విషయమును, స్మేరేణ = చిఱునవ్వును కల, వక్త్రేణ = ముఖముతో, వ్యాకుర్వన్– ఇవ (స్థితః) = వ్యాఖ్యానించువానివలె ఉన్న, శ్రీరంగసర్వంసహః = శ్రీరంగనాథుడు, మమ = నా, ధురం = భారమును, నిర్వహేత్ = నిర్వహించును గాక!

**వరివస్య :–** దివ్యాయుధములతో, అభయముద్రతో కూడిన శ్రీరంగనాథుని ఉత్సవమూర్తియొక్క సన్నివేశమున భట్టరు ఇందు రమ్యమైన ఉత్ప్రేక్షతో స్తుతించుచున్నారు. గత శ్లోకమున భగవానుని "**సంభాషమాణ మివ**" అనుచు మాటలాడుచున్నట్లున్న సన్నివేశమును స్తుతించిన కవి, ఇందు ఆ భాషణమును స్పష్టపరచుచున్నారు. ఆ భాషణమును నోటితోనేకాక చేతితోకూడ చేయుట ఇచటి విశేషము. సమర్థుడైనవానికి ఏ సాధనమైనా, అది, కార్యమును సాధించుటకు చాలును కదా. ఇందులో కవి శ్రీరంగనాథుని దివ్యావయవముల ఐకమత్యమును వ్యక్తము చేసిన తీరు అద్భుతము.

శ్రీరంగనాథుని ఉత్సవమూర్తికి గల నాల్గు చేతులలో ఒక చేయి అభయముద్రను, మిగిలిన మూడు చేతులు పాంచజన్య, కౌమోదకీ, సుదర్శనములను దాల్చియున్నవి. దీనిలో, అభయముద్రను కల్గిన చేయి భక్తులనుద్దేశించి "ఓ జనులారా! శంఖచక్రగదలను దాల్చిన నా ఈ మూడు బాహువులును మీకు అందఱకు సకలవిధములైన క్షేమములను కల్గింపగలవు. అవి మీకు గొప్ప రక్షణను కల్పింపగలవు. ఈ పాదద్వంద్వము మీ భయములనన్నిటిని తీర్చి, అనిష్టనివృత్తిపూర్వకమైన ఇష్టప్రాప్తిని కల్గింపగలదు." అను సూచనను చేయుచున్నదా! అనునట్లున్నది. ఈ సూచనను చిఱునవ్వుతో శోభించు శ్రీరంగనాథుని ముఖబింబము 'ఔను, అది నిజమే' అని వ్యాఖ్యానించునట్లున్నది. ఇట్టి భంగిమను కల్గిన స్వామి నా రక్షణభారము నంతటిని భరించును గాక! – అని శ్లోకభావము.

శ్రీకృష్ణభగవానుడు గీతలో–

**"అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్"**

(భ. గీ. –9–22)

(అనన్యమైన మనస్సుతో నన్ను ఎవరు ఆరాధిస్తున్నారో, ఎల్లప్పుడూ నాతో సంబంధాన్ని కలిగిన ఆ భక్తుల యోగక్షేమాలను నేను నిర్వహిస్తాను) అని పల్కుటను ఇచట "**అభయం, భద్రం, నిర్వహేత్**" అను మూడు పదములు సూచించుచున్నవి. ముందు శ్లోకమున శ్రీరామాయణశ్లోకార్థము అనుసంధింపబడగా, ఇందు గీతాశ్లోకార్థము సూచింపబడుట విశేషము. "**కరతలే ఊచుషి**" అనుటచే. "**పశ్యత్యచక్షుః**" (భగవానుడు కళ్ళు లేకుండానే చూస్తున్నాడు). 3–19) అనునట్లు భగవానుని కరణాయత్తము కాని దివ్యవ్యాపారము తెలుపబడినది.

"**శ్రీరంగసర్వంసహః**" అను సమాసమునకు శ్రీరంగమున వేంచేసియున్న సమస్తనిర్వాహకుడని, శ్రీరంగమును సర్వంసహగా, అనగా, నివసించు క్షేత్రముగా కల్గినవాడని, ఈ రెండు విధములుగా అర్థములను చెప్పవచ్చును. రెండవ అర్థము బహువ్రీహిసమాసమువలన వచ్చును.

"**ఇత్యూచిషి**" అను పాఠాంతరము సరి అయినది కాదు.

ఇందు వృత్తము శార్దూలవిక్రీడితము.

**పారిజాతవృక్షమువంటి శ్రీరంగనాథుని ఏ విధముగా పూర్తిగా అనుభవించగలము?**

**71. అంగై రహంప్రథమికాచరితాత్మదానైః**
**ఆమోదమాననవయౌవనసావలేపైః ।**

**హై! పారిజాత మివ నూతనతాయమాన–**
**శాఖాశతం కథ మధీమహి రంగధుర్యమ్? ॥**

**ప్ర. అ. –** అహం ప్రథమికా = (అనుభవవిషయములగుటలో) "నేను ముందు నేను ముందు " అని, ఆచరిత = ఆచరింపబడిన (భగనదనుభవమును భక్తులకు అందునట్లు చేయబడిన), ఆత్మదానైః = తమయొక్క వితరణములను కల్గినవి (కావుననే), ఆమోదమాన = పరిమళించునట్టి (మిక్కిలి సంతోషించునట్టి) నవ= క్రొత్తదైన, యౌవన = యౌవనముచే, స అవలేపైః = గర్వముతో కూడినవి అగు, అంగైః = అవయవములచే, నూతనతాయమానం = నిత్యనూతనముగానగు, శాఖాశతం = పలు శాఖలను కల, పారిజాతమ్ ఇవ (స్థితం) = పారిజాత వృక్షమువలె నున్న, రంగధుర్యం = శ్రీరంగనాథుని, కథం = ఎట్లు అధీమహి = అనుభవింపగలము?, హై =ఆశ్చర్యము!

**వరివస్య :–** శ్రీరంగనాథుని అవయవసన్నివేశమును దర్శించిన కవి నిత్యనూతనమై అలరారు స్వామిని పూర్ణముగా అనుభవించుట సాధ్యము కాదను విషయమును ఇందు అశ్చర్యపూర్వకముగా వర్ణించుచున్నారు. ముందుశ్లోకమున భగవానుని కరతలములు అహంప్రథమికగా భాషించుట వర్ణింపబడినది. ఇందు భగవానుని అన్ని అంగములు ఆత్మదానమున అహమహమికను ప్రదర్శించుట తెలుపబడుచున్నది. 'నన్ను ముందు అనుభవింపదగును, నన్ను ముందు అనుభవింపదగును' అనుచు ముందుకు వచ్చు, నవయౌవనముతో కూడిన దివ్యాంగములతో శ్రీరంగనాథుడు, నిత్యనూతనముగా వెలుగొందు పలు శాఖలతో కూడిన పారిజాతవృక్షమువలె శోభిల్లుచున్నాడు. ఆ స్వామిని పరిపూర్ణముగా అనుభవించుట సాధ్యము కాదే! అయ్యో! అని శ్లోకభావము.

సంస్కృతమున తృతీయా విభక్తికి అభేదమును అర్థముగా చెప్పుదురు. "**ధాన్యేన ధనవాన్**" అను ప్రయోగము అందులకు ఉదాహరణము, అట్లే, ఇచట "**అంగైః**" అను తృతీయా విభక్తికి అభేదమును అర్థముగా గ్రహించినచో, "**అంగైః**

**శాఖాశతం పారిజాతమ్**" అనుటకు, "శ్రీరంగనాథుడను పారిజాతమునకు దివ్యాంగములు శాఖలు" అను అర్థము వచ్చును. దమయంతీస్వయంవరమును వర్ణించు వ్యాసమహర్షి–

**"తస్యా గాత్రేషు పతితా తేషాం దృష్టిః మహాత్మనామ్,**
**తత్ర తత్రైవ సక్తా భూత్ న చచాల చ పశ్యతామ్" (భార. వన. 57)**

(దమయంతిని చూచిన మహాత్ములగు ఆ రాజుల దృష్టి ఆమె అంగములందు ఎచట ఎచట ప్రసరించెనో, అచటనే నిలచెను తప్ప,, అచటనుండి కదలలేదు) అనుచు నుడివెను. ఒక మానవస్త్రీకి కల సౌందర్యమే మహాత్ములను సైతము అంతగా ఆకట్టుకొనగలిగినచో, సర్వేశ్వరుడగు శ్రీరంగనాథుని దివ్యావయవశోభ భక్తుల దృష్టిని, మనస్సును ఆకర్షించుటలో అచ్చెఱువు లేదు ఏమీ కదా! శ్రీరంగనాథుని సేవించువారి దృష్టి ఏ దివ్యాంగమున ప్రసరించునో, అచటనే నిలచి పోవును. కావున, దివ్యావయముల నన్నిటిని దర్శించి, అనుభవించు శక్తి కాని, అవకాశము కాని భక్తులకు ఉండదు. ఇందువలన స్వామిని పూర్ణముగ అనుభవించుట ఎట్లు? అను సందేహము వారికి కల్గుట తగును.

**"అంగై. ఆమోదమాన"** అనునపుడు **"య ఆత్మదా బలదాః"** (యజు. వే. కాఠకే. 7–5–36) (భగవానుడు తనను ప్రదానము చేయుచున్నాడో, ఆ భగవానుడే తనను అనుభవించుటకు ఆవశ్యకమైన శక్తిని కూడా అనుగ్రహించుచున్నాడు) అను శ్రుత్యర్థమును భగవానుని అంగములు వ్యాఖ్యానించుచున్నవను విశేషము ధ్వనించుచున్నదని రామానుజాచార్యవ్యాఖ్యలో కలదు.

★ **"కుసుమమివ లోభనీయం యౌవన మంగేషు సంనద్ధమ్"** (అభి. శా. 1–21) పువ్వువలె ఆకర్షణీయమైన యంవనము అంగములలో చక్కగా కూడుకొని ఉన్నది) అనుచు కాళిదాసు శకుంతలయౌవనమునుగూర్చి పల్కెను.నూతనకుసుమమునకు లోభనీయత్వము దాని అందమువలననే కాక,

సౌరభ్యమువలనకూడా. అట్లే, భగవానుని నూతన యౌవనము శోభవలననేకాక, అతిలోకసౌగంధ్యముచే లోభనీయమైనది– అనుటను కవి "ఆమోదమాననవయౌవన" అనుచు తెలియజేసిరి. నవయౌవనమునకు సావలేపత్వము ఏమనగా, భక్తులకు ఆత్మదానమున అహంప్రథమికాసంరంభమును కల్గియున్నదను భావమును కల్గియుండుటయే. శుద్ధసత్వమయమగు భగవానుని రూపమున ఇట్టి అవలేపము భక్తరక్షణ విషయకమగుటచే దోషము కాదు; గుణమే అగును.. "**వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః**" (రా, అయో. 2–41) (జనుల దుఃఖముల విషయమున శ్రీరాముడు చాలా ఎక్కువ దుఃఖాన్ని పొందుతాడు) అనుటను పూర్వాచార్యులు గుణపరముగానే వ్యాఖ్యానించిరికదా!

"**య ఆత్మదాః**" అని, "**స్మరతః పాదకమల మాత్మాన మపి యచ్ఛతి**" (తన పాదాలను ధ్యానించువానికి తనను కూడా భగవానుడు అనుగ్రహిస్తాడు) అని చెప్పబడినట్లు, భగవానుడు భక్తులకు ఆత్మదానము నిచ్చును. "**తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్**" (ముణ్డక. 3–2–3) (భగవానుడు ఎవనిని అనుగ్రహిస్తాడో, అతనికి తన దివ్యమంగళవిగ్రహదర్శనాన్ని కూడా అనుగ్రహిస్తాడు) అని అన్నదికదా, శ్రుతి. భగవానునకు కల ఇట్టి స్వభావమే భగవానుని అంగములకును ఉండుట సహజము. అంతియేకాక, విశేషమేమనగా, ఆత్మదానత్వరలో అవి భగవానుని మించినవి. భగవానుని అనుభవించుటలో భక్తుని అంగములు పలు విధములుగా అహమహమికను చూపునట్లే, భక్తులకు ఆత్మదానము అనుగ్రహించుటలోను భగవానుని అంగములును అట్టి భావనను ప్రదర్శించును. "జీవుడు ఆత్మసమర్పణము చేసినను, లేక, చేయకున్నను, మేము మాత్రము ఆశ్రితులకు ఆత్మదాన మొనర్తుము" అని భగవానుని అంగములు ఆశతో తొందరను చూపునట. అంతటి ఔదార్యమును త్వరను కలిగినవి, అవి.

భగవానుడు ప్రథమాచార్యుడు. **"స్వయ మాచరతే యస్మాత్ తస్మాత్ ఆచార్య ఇష్యతే"** (శాస్త్రార్థాలను స్వయముగా ఆచరిస్తాడు కనుక, ఆచార్యుడు అని చెప్పబడుతున్నాడు) అని కదా ఆచార్యలక్షణము, కావున, భగవానుని అంగములు ఆత్మదానమును ఆచరణమును ముందుగా తామే ఆచరించి చూపుచున్నవట. ఈ రస్యమైన వివరణము అంతయు శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో కలదు.

యౌవన ప్రాదుర్భావకాలమున నూతనకుసుమములేకాక, కొంగ్రొత్త కొమ్మలు, రెమ్మలును చెట్టునకు పుట్టును. అట్లే, భగవానుడను వృక్షమును భక్తులందరు అనుభవించుటకు వీలుగా దానికి వందలకొలది కొమ్మలు, రెమ్మలు కొత్తగా పుట్టినవట

**"తన్యమాన"** అను వేరు రూపమున కవికి వివక్షితమైన, దైర్ఘ్యము లేకపోవుటచే అట్టి దైర్ఘ్యమును కల్గిన **"తాయమాన"** అను వైకల్పికరూపమును కవి ఇచట ప్రయోగించిరో ఏమో! **"తన్యమానేత్యుక్తే వివక్షితదైర్ఘ్యానురోధో న లభ్యేత. అతః తాయమానేతి వైకల్పికదీర్ఘరూపాశ్రయణమ్"** అనియు ఆ గోపాలచార్య వ్యాఖ్యలో వివరింపబడినది.

ప్రణవరూపుడగు (ఎల్లప్పుడూ ప్రకృష్టమైన, నూతనమైన రూపమును కలిగినవాడగు, ప్రణవ ప్రతిపాద్యుడగు) శ్రీరంగనాథునకు శాఖోపశాఖలు నూతనముగా పుట్టుట సహజమే. (ప్రణవము నుండియేకదా, సమస్త శబ్దజాలము పుట్టినది) మఱియు ఇచట, ఆ స్వామి విషయమున అధ్యయనార్థకమగు **"అధీమహి"** అను క్రియాప్రయోగము మిక్కిలి తగినది.

**"నూతనతాయమాన"** అనుచోట **"నూతనతా + ఆయమాన"** అని సంస్కృతవ్యాఖ్యాత వివరించెను. ఇది పొసగునట్లు తోచదు. "తాయృ– సంతానే" అను ధాతువునుండి పుట్టిన **"తాయమాన"** అను పదమే ఇచట వివక్షితము. కావున "నూతనతాయమాన" అని వివరించుట యుక్తము. – అని శ్రీ ప్ర. భ. అణ్ణాస్వామి వివరించిరి.

నాల్గవ పాదమున **"హృది దధీమహి?"** అను పాఠభేదము కన్పట్టుచున్నది. "హృదయమున ధరింపగలమా?" అని దీని భావము. ఈ భావము కాకుస్వరమున ఏర్పడును. **"హై"**అను అవ్యయము విషాదసూచకము. అన్ని దివ్యావయముల సౌందర్యమును క్రమముగా సేవింప సాధ్యము కాకున్నదే! అను విషాదము ఈ అవ్యయముచే ద్యోతకమగుచున్నది. ఈ విషాదము కూడా గుణమే దోషము కాదు. అనగా ఇది భగవదనుభవమును పూర్తిగా పొందలేని ఆర్తి వలన కదా ఏర్పడినది. భౌతిక విషయాలలోని వాంఛ వలన ఏర్పడిన ఆర్తి అయిన, అది హేయమగును.

**"కథ మధీమహి"** అను పాఠమున **"అధీమహి"** అను రూపము నిష్పన్నమగుటకు అవకాశము లేదని కొందరు వ్యాఖ్యాతలు అభిప్రాయపడుటచే, పై పాఠాంతర మేర్పడినట్లు తోచును. **"ఇఙ్–– అధ్యయనే"** అను ధాతువుయొక్క విధిలిఙ్ రూపము **"అధీయీమహి"** అని కావలెను. కాని, **"ఆగమశాస్త్ర మనిత్యమ్"** అను పరిభాషవలన సీయుడాగమము రానపుడు **'అధీమహి'** అను రూపము సిద్ధించునని శిష్ట ప్రయోగసంగ్రహమున తెలుపబడినది. ఆగమశాస్త్రముయొక్క అనిత్యత్వముచే **"అధీమహి"** అను రూపము దుష్టము కాదని శ్రీరామానుజాచార్యవ్యాఖ్యలోకూడ వివరింపబడినది. అట్లే, మహావిద్వాన్ ప్ర. భ. అణ్ణాస్వామివారును **"అధీమహి"** అను రూపమును ఒక విధముగా సాధించుటకు అవకాశము కలదని అభిప్రాయపడిరి. కాని, పలువురు అనుసంధించునది, పలు ప్రతులలో కన్పించునది **"ఆధీమహే"** అను రూపమే కావున, **"శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యః"** అను ప్రార్థనాశ్లోకమున ఆ రూపమే గ్రహింపబడినది కనుక. ఇచట **"అధీమహి"** అను రూపమును నిష్పన్నమగు అవకాశముండుటచే, పలు ప్రతులలో ప్రస్తుతశ్లోకమున ఆ రూపమే కన్పట్టుచుండుటచే, అదియే ఇచట గ్రహింపబడినది.

**శ్రీరంగనాథుడు అలౌకిక శృంగార రసమూర్తి.**

72. **ఆలోకా హృదయాలవో రసవశా దీశాన మీషత్స్మితం**
**ప్రచ్ఛాయాని వచాంసి పద్మనిలయాచేతఃశరవ్యం వపుః ।**
**చక్షుష్మంతి గతాగతాని త ఇమే శ్రీరంగశృంగార! తే**
**భావా యౌవనగంధినః కి మపరం సించంతి చేతాంసి నః? ॥**

**ప్ర. అ. –** శ్రీరంగశృంగార = శ్రీరంగమున శృంగారరసము మూర్తీభవించినట్లున్న శ్రీరంగనాథస్వామీ!, తే = నీ, ఆలోకాః = కటాక్షములు, హృదయాలవః = (ఆశ్రితుల పట్ల) ప్రేమను కల్గినవి, ఈషత్ స్మితం = మందహాసము (చిఱు దరహాసము), రసవశాత్ = ప్రణయ రసము వలన, ఈశానం = అందరిని వశపరచు కొనునది, వచాంసి = పలుకులు, ప్రచ్ఛాయాని = (సంసార తాపమును) నీడనిచ్చునవి, వపుః = దివ్యమంగళవిగ్రహము, పద్మనిలయా = లక్ష్మీదేవియొక్క, చేతః = మనస్సును, శరవ్యం = లక్ష్యముగా కల్గినది, గత ఆగతాని = తిరువీథులలోని నీ రాకపోకలు, చక్షుష్మంతి = కన్నుల కింపైనవి, అపరం కిమ్ = వేరొకటి ఏమి?, తే ఇమే = ఆ ఈ (ఇట్టి), యౌవనగంధినః = యౌననమును సూచించునట్టి, భావాః = విషయములు, నః = (దాసులమైన) మాయొక్క, చేతాంసి = మనస్సులను, సించంతి = (తడపుచున్నవి) (చల్లబఱచుచున్నవి.)

**వరివస్య :–** శ్రీరంగనాథుని శృంగారరసమూర్తిగా రూపించుచు కని తదనుగుణముగా ఇందు కొన్ని అపూర్వములైన విభావానుభావములను ప్రతిపాదించుచున్నారు.

శ్రీరంగమున శృంగారము మూర్తీభవించినట్లున్న స్వామీ! నీ కటాక్షములు విశేషాభిప్రాయద్యోతకములు. నీ చిఱునవ్వు కఠినహృదయమును కూడ కఱగింపగల్గినది. భక్తులపట్ల గల నీకు కల ప్రీత్యతిశయముచే అర్చావతార సమాధిని దాటి నీవు పలుకు మాటలు సంసారమున తాపమును పొందు సంసారులకు చల్లని నీడ నిచ్చునని. నీ దివ్యమంగళ విగ్రహము లక్ష్మీదేవి

హృదయమును కొల్లగొట్టుచున్నది. ఉత్సవసమయములలో తిరువీథులలో నీ రాకపోకలు మా కన్నులకు పండువులు. ఇట్లు వరుసగా చెప్పనేల? యౌవనగర్వమును ప్రకటించు నీ ఈ స్వభావవిశేషములన్నియు మా హృదయములను కరగించుచున్నవిసుమా! – అని శ్లోకభావము.

ఇందు **"శ్రీరంగశృంగార!"** అను సంబోధనకు అనుగుణముగా, కటాక్షములు, మందస్మితము, పలుకులు – అను అనుభావములను, దివ్యమంగళ విగ్రహము, రాకపోకలు – అను విభావములను కవి ప్రస్తుతించెను. కావున, నాల్గవపాదములోని **"భావాః"** అను పదమునకు విభావ, అనుభావములను అర్థమును గ్రహింపవచ్చును. లేక, **"భావః సత్తాస్వభావాభిప్రాయచేష్టార్థజంతుషు"** అను నిఘంటువచనమునుబట్టి, సత్త, అభిప్రాయము, చేష్టలు– అను అర్థములను గ్రహింపవచ్చును. ఇచట సత్తను విభావముగాను, అభిప్రాయ, చేష్టలను అనుభావములుగాను చెప్పవచ్చును. ప్రస్తుతశ్లోకమున శ్రీరంగనాథుని దివ్యమంగళరూపము ఆలంబన విభావము, గతాగతములు ఉద్దీపనవిభావములు. కటాక్షములు, మందస్మితము, పలుకులు అనుభావములు. వ్యభిచారిభావమేమియు ఇచట స్పష్టముగా చెప్పబడకున్నను, **"తే ఇమే భావాః"** అనుటచే అవి ఆక్షిప్తములని చెప్పవచ్చును. కావున, ఇచట ఆలంకారికపద్ధతిలోని రససామగ్రి అంతయు ప్రతిపాదింపబడినదని తెలియవలెను.

**"రసవశాత్ ఈషత్ స్మితం ఈశానమ్"** అనునపుడు **"స్మితమాత్రేణ వయం రసవశేన దాస్య ముపగచ్ఛామః, 'గుణైః దాస్య ముపాగతః' (రా. కి. 4–11.) ఇతివత్. న అనేక గుణసముదాయాపేక్షా దాసీకరణాయ. స్మితపదేనైవ ఈషత్వలాభేఽపి, అధికేషత్వాయ ఈషత్ గ్రహణమ్. అత్యన్తాల్పస్మితేనాపి వయం జితాః"** (కేవలం చిరునవ్వు మాత్రంతో అందులో ఉండే రసప్రభావం చేత మేము నీకు **"గుణైః దాస్యముపాగతః"** – గుణాల కారణంగా దాస్యాన్ని పొందినవాడను– అని లక్ష్మణుడు పలికినట్లుగా దాసులము అయ్యాము. ఈ

విధంగా దాసులు కావడానికి "**గుణైః**" లక్ష్మణుడు చెప్పినట్లుగా అనేక గుణాల సముదాయాపేక్ష అక్కరలేదు. చిరునవ్వు ఒక్కటే చాలు. కొద్దిపాటి చిరునవ్వు చాలు – అని చెప్పడం కోసం ఈషత్ అనే పదం ప్రయోగించబడింది. చాలా అల్పమైన చిరునవ్వుతోనే మేము నీకు పరాజితులం అయ్యాము) అను శ్రీగోపాలాచార్యవ్యాఖ్యానములోని రమణీయమైన వివరణము ఇచట ఉట్టంకింపదగినది.

"**ప్రచ్ఛాయాని వచాంసి**"– మాటలాడు ఈ వాసుదేవతరువుయొక్క మాటలుకూడ చల్లని నీడవంటివి. "**పద్మనిలయాచేతసః శరవ్యం తద్వపుః**" (లక్ష్మీదేవిహృదయానికి లక్ష్యం శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహం) అని కాని, "**పద్మనిలయాయాః చేతో శరవ్యం భగవద్వపుషః**"(భగవంతుని దివ్యమంగళవిగ్రహానికి లక్ష్యం లక్ష్మీదేవి మనస్సు) అని కాని, "**పద్మనిలయా చేత:శరవ్యం వపుః**" అను ప్రయోగమును అన్వయింపవచ్చును. "**ఆలోకాః హృదయాలవః**" అని చూపులవరకు పోనక్కరలేదు, స్వామినడకలే ఆకర్షణీయములు. ఆనందజడులమై నిమీలితనయనులమగు మనలను స్వామి రాకపోకలే నడపించును. కావున, అని చక్షుష్మంతములు.

వేదశృంగము ప్రణవము. వేదశృంగమగు ప్రణవాకారవిమానమున నివసించు శ్రీరంగనాథుని శృంగారశబ్దముతో సంబోధించుట తగినది. "**శృంగమ్ ఋచ్ఛతి ఇతి శృంగారః, ఋ–గతౌ**"అను శృంగారపద వ్యుత్పత్తి ఇచట వివక్షితము. "**నః చేతాంసి**" అనుటకు– కులిశకఠోరములు, శుష్కశుష్కములును అగు మనయొక్క చిత్తములు– అని సందర్భమునుబట్టి భావము. సర్వనామ శబ్దములకు సందర్భానుగుణమైన అర్థములను వ్యక్తము చేయు శక్తి కలదు కదా. ఈ వివరణమంతయు శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో చూపబడినది. "**నిద్రాణస్య నిమీలితనయనస్యాప్యస్య గతాగతాని చక్షుష్మంతి**" (నిద్రించే స్వభావాన్ని కలిగినవాడు, నేత్రాలను మూసుకున్నవాడు అయినప్పటికీ ఈ స్వామి రాకపోకలు చక్షుష్మంతములు) అనియు ఆ వ్యాఖ్యలోని రసోక్తి. ఈ

వివరము ఉత్సవమూర్తి, మూలమూర్తుల అభేదభావనతో చేయబడినదని భావించనగును. మూలమూర్తి కదా యోగనిద్రలో ఉంటాడు.

స్వామి తిరువీథులలో వేంచేయునపుడు అనుసంధింప దగిన శ్లోకరత్నములలో ఇది అగ్రగణ్యము. కొన్ని ప్రతులలో ఈ శ్లోకము కానవచ్చుటలేదని సంస్కృతవ్యాఖ్యాత సూచించెను. వేదము భగవానుని "రసో వై సః "(తై. ఉ.) (ఆ పరమాత్మ రసస్వరూపి కదా!) అని అలౌకిక రసస్వరూపిగా అభివర్ణించెను.

**"శృంగం ప్రాధాన్యమ్ ఇయర్తి ఇతి శృంగారః"** అను వ్యుత్పత్తిని కల శృంగారశబ్దము ప్రాధాన్యము కల్గినదను అర్థమును సూచించును. **"శృంగార ఏవ మధురః పరప్రహ్లాదనో రసః"**(ధ్వన్యా. 2-9) (మిక్కిలి ఆనందమును కలిగించే శృంగార రసమే మధురమైనది) అని ఆలంకారికమూర్ధన్యుడగు ఆనందవర్ధనుడును నుడివెను. **"శృంగార ఏవ రసనాత్ రస మామనామః"** (శృంగారమే మిక్కిలి ఆస్వాద్యమైనందున అదియే రసమని మేము అంటున్నాము) (శృంగారప్రకాశ) అని భోజుడును శృంగార మొక్కటే రసమనెను. కావున శృంగారమే ప్రకృతిరసము. మిగిలినవన్నియు దాని వికారములని ఆయన అభిప్రాయము. అందువలన అమరులలో ప్రథముడు, సర్వజీవాత్మలకు ప్రకృతియు అగు భగవానుడు ఇచట కవిచే శృంగారరసరూపిగా వర్ణింపబడుట మిగుల రమణీయము. యుక్తమును. రసరాట్టు శృంగారము, కావున భట్టరు శృంగారరసమూర్తిగా సర్వలోక సామ్రాట్ అయిన స్వామిని, స్తుతించుట మిక్కిలి యుక్తము. ఇందు వృత్తము శార్దూలవిక్రీడితము. ఈ శ్లోకము శ్రీరామానుజాచార్య వ్యాఖ్యానమున కానవచ్చుటలేదు.

**కిరీటాది నూపురాంతముగా శ్రీరంగనాథుని సేవించి, స్తుతిస్తాము**

**73. ఆయత్కిరీట మళికోల్లసదూర్ధ్వపుండ్ర-**
**మాకర్ణలోచన మనంకుశకర్ణపాశమ్ ।**

**ఉత్ఫుల్లవక్షస ముదాయుధబాహుమర్థా –**
**స్నీవీం చ రంగపతి మబ్జపదం భజామః ॥**

**ప్ర. అ. –** ఆయత్కిరీటం = ఎత్తైన కిరీటమును కల్గినవాడు, అళిక ఉల్లసత్ = లలాటమున విలసిల్లు, ఊర్ధ్వపుండ్రం = ఊర్ధ్వపుండ్రమును దాల్చినవాడు, ఆకర్ణలోచనమ్ = చెవులవరకు విస్తరించిన విశాలములైన నేత్రములను కల్గినవాడు, అనంకుశకర్ణపాశమ్ = అడ్డు లేని (పాశమువంటి) గొప్ప కర్ణములను కల్గినవాడు, ఉత్ఫుల్లవక్షసం = విశాలమైన వక్షఃస్థలమును కలవాడు, ఉత్ ఆయుధబాహుం = గొప్ప ఆయుధములను (లేక) పైకెత్తబడిన ఆయుధములను, బాహువులను కల్గినవాడు, అర్థాత్ నీవీం = ప్రకాశించు వస్త్రబంధమును, అబ్జపదం చ = పద్మములవంటి పాదములను కలవాడు అగు, రంగపతిం = శ్రీరంగనాథుని, భజామః = సేవింతుము.

**వరివస్య :–** 65 వశ్లోకమున "**ప్రసన్నం శ్రీరంగరాజమిషపద్మసరః విగాహమానాః అభూమ**" అనుచు భోగవదనుభవమజ్జనమును ప్రస్తుతించిన కవి, ఇందు, అట్టి మజ్జనమును చేయుటలో సిద్ధహస్తులగు నమ్మాళ్వార్ల రీతిని అనుసరించుచున్నారు. అళ్వార్లు అనగా, భగవానుడను. సరస్సున మునుగువారని అర్థము. మునుగువారు వేరొక మునుగువారిని నడపించుట లోకవిలక్షణమైనది కదా! ఈశ్లోకము తిరువాయ్ మొళిలోని "**ఎజ్గనేయో!**" (5–5–1) అను దశకభావమును అనుసరించి రచింపబడినట్లుగా తోచును. "**వాన్ తిక్రుమ్ శోలై**" అను తనియన్ పాశురములో భట్టర్, తిరువాయ్ మొళి ప్రబంధము శ్రీరంగనాథునిగూర్చి అనుగ్రహింపబడినదని అనిరి. ఆ విధముగా భావించు భట్టర్ ఆ ప్రబంధములోని ప్రమేయమును శ్రీరంగనాథుని విషయముగా ఈ స్తోత్రములో అనుసంధించుటలో ఆశ్చర్యము లేదు కదా.

గత శ్లోకమున స్వామివిలాసవీక్షణాదులు వర్ణింపబడినవి. కిరీటము మొదలు పాదములవరకు గల శ్రీరంగనాథుని దివ్యమంగళరూపమును కవి ఈ శ్లోకమున స్తుతించుచున్నారు.

ఎత్తయిన దివ్యకిరీటమును, విశాలఫాలమున ప్రకాశించు ఊర్ధ్వపుండ్రమును, ఆకర్ణాంతము విస్తరించియున్న విశాలనేత్రములను, వానివలెనే విశృంఖలముగా వ్యాపించి, భాసించు గొప్ప కర్ణములను, అందమైన రత్నాల హారమును, ముత్యాల సరములను, దివ్యాభరణములను కల్గియుండుటచే అందమైన పూతోట పూచినట్లున్న విశాలమైన వక్షఃస్థలమును, **"అన్నే! ఆழியొడుమ్ పొన్నార్ శార్ జ్గముడైయ అడికళై ఇన్నార్ ఎన్టఱియేన్"** (పెరి. తి. 10-10-9) (అమ్మా! సుదర్శనమును, బంగారువలె ప్రకాశించు శార్ జ్గమును కల్గిన స్వామి ఇట్టివాడని ఎఱుగను) అనునట్లు, మనస్సును మోహింపచేయు దివ్యాయుధములను దాల్చిన బాహువులను, మిక్కిలి పొందికగానున్న వస్త్రబంధమును, ఎఱ్ఱ తామరలవలెనున్న చరణములను కల్గిన శ్రీరంగనాథుని భజింతుము – అని శ్లోక భావము.

**"ఆయత్కిరీటమ్"** అనునపుడు **"ఆయత్"** పదముచే భగవానుని శిరస్సును నేను అలంకరించితినికదా!" అను సంతోషముతో కిరీటము పైపైకి వృద్ధిచెందుచున్నది– అను రస్యమైన అర్థము ధ్వనించును. ఇతరుల తలలపై అలంకరింపబడిన కిరీటములకు భగవానుని పాదస్పర్శయే గాని, శిరస్సుయొక్క స్పర్శకలుగదు కదా!

కర్ణపాశము అనునపుడు పాశశబ్దము శ్రేష్ఠవాచకము. వేంకటాచార్య సంస్కృతవ్యాఖ్యానమున పాశము అనుటకు పాశము అను ఆయుధమును అర్థము చూపబడినది. కాని, **"పాశ స్తు మృగపశ్వాదిబంధనే, కర్ణాంతే శోభనార్థః స్యాత్, కలంతే నికరార్థకః, ఛత్త్రాద్యంతే చ నిందార్థః"** అను హైమనిఘంటువచనమునుబట్టి శ్రేష్ఠవాచకమని చెప్పుటయే యుక్తము. **"సైవోష్ఠముద్రా స చ కర్ణపాశః"** (ఉ. రా. 6-27) అనుచు భవభూతి ఉత్తరరామచరితమున ఈ అర్థమున ప్రయోగించెను కదా!

కన్నులు ఆకర్ణాంతములనుటచే కన్నులకు ఒక అవధి ఉన్నది. **"చక్షుషీ చంద్రసూర్యే"** అనునట్లు భగవానుని చంద్రసూర్యరూపములగు నేత్రములకు

దిగ్రూపమైన అవధియు కలదు. కాని, అట్టి అవధి లేకుండ కర్ణములు వ్యాపించియున్నవను అర్థము "**అనంకుశ**" అను పదముచే ఏర్పడుచున్నది. "**ఉత్ఫుల్లవక్షసమ్**" అనునపుడు "**ఉత్**" అను ఉపసర్గకు విశాలమైన, ఉన్నతమైన– అను అర్థములను గ్రహించి, ఉన్నతమైన, విశాలమైన వక్షస్సును కలవాడని అర్థము చెప్పవచ్చును. లేక, పద్మాలంకృతమైన వక్షస్సు వికసించినట్లు భాసించుచున్నదనియు చెప్పవచ్చును. "**ఉదాయుధబాహుమ్**" అనుటకు పైకెత్తి పట్టుకొనబడిన ఆయుధములను దాల్చిన బాహువులను కలవాడను అర్థమును వచ్చును, "**దివ్యానేకోద్యతాయుధమ్**" (భ. గీ. –11–10) అను గీతావచనమును, "**శార్ఙ్గ గదాద్యుదాయుధమ్**" (10–3–9) అను భాగవతపురాణశ్లోకమును "**ఎప్పోదుమ్ కైక*ళ్ళు*లా నేమియాన్**" ('పెరియ, తిరు. –87) (ఎల్లప్పుడూ చేతిలో పరిభ్రమించు సుదర్శన చక్రమును కలిగినవాడు) అను నమ్మాళ్వార్ల శ్రీసూక్తిని ఇచట స్మరింపదగును.

మనము చేయు ఊర్ధ్వపుండ్రధారణము అనుష్ఠానాంగము, శ్రీవైష్ణవ లాంఛనము, భగవదారాధనాంగమును, కాని, సర్వేశ్వరుడు ఊర్ధ్వపుండ్రమును దాల్చుట భక్తుల అభిమతమును మన్నించుటకు, అలంకారాంగముగా స్వీకరించుటకును– అని తెలియనగును. కూరేశులు –

**"ఉద్ధరత్యుపరి భక్తజనాన్ ఇత్యూర్ధ్వతాశ్రయణసూచనశక్తిమ్,**
**ఊర్ధ్వపుండ్రతిలకం బహుమానాత్ కిము బిభర్షి వరద! స్వలలాటే?"**

(26)

(వరదరాజస్వామీ! ఊర్ధ్వపుండ్రతిలకం భగవద్భక్తులకు ఊర్ధ్వగతిని పొందిస్తున్నది – అను విషయాన్ని తాను ఊర్ధ్వాకారంతో కూడుకొని ఉండడం ద్వారా సూచించుచున్నది. ఇటువంటి శక్తిని కలిగిన ఈ ఊర్ధ్వపుండ్రతిలకాన్ని నీవు "**నా భక్తులు అభిమానించినది కదా ఇది!**" అను ప్రీతి విశేషంతో ధరిస్తున్నావా! ఏమి!) అని వరదరాజస్తవమున ఊర్ధ్వ పుండ్రము స్వామి భక్తులను ఉద్ధరించుటను సూచించునని పల్కిరి.

"**అంచన్నీవీమ్**" అను పాఠాంతరమును కలదు. "**ప్రకాశించు నీవి**" – అని దీని అర్థము.

ఇందు వృత్తము వసంతతిలక,

## ఈ లోకంలోనూ, పరమపదంలోను శ్రీరంగనాథునే దర్శిస్తాము

**74. అబ్జన్యస్తపదాబ్జ మంచితకటీసంవాది కౌశేయకమ్**
**కించిత్తాండవగంధిసంహననకం నిర్వ్యాజమందస్మితమ్ ।**
**చూడాచుంబిముఖాంబుజం నిజభుజావిశ్రాంతదివ్యాయుధమ్**
**శ్రీరంగే శరదశ్శతం తత ఇతః పశ్యేమ లక్ష్మీసఖమ్ ॥**

**ప్ర. అ. –** అబ్జ = ఆసనపద్మమున, న్యస్త = ఉంచబడిన, పద అబ్జం = తామరలవంటి పాదములను కలవాడు, అంచిత = అందమైన, కటీ = నడుముతో, సంవాది = సామ్యమును కల్గిన (తగిన), కౌశేయకమ్ = పీతాంబరమును కలవాడు, కించిత్– కొద్దిపాటి, తాండవగంది = నాట్యభంగిమతో ప్రకాశించు, సంహననకం = దివ్యమంగళరూపమును కలవాడు, నిర్వ్యాజ = స్వభావ సిద్ధమైన, మందస్మితమ్ = చిఱునవ్వును కలవాడు. చూడాచుంబి = కిరీటమును స్పృశించు, ముఖ– అంబుజం = పద్మమువంటి ముఖమును కలవాడు, నిజ = తనయొక్క భుజా = బాహువులయందు, విశ్రాంత = విశ్రమించిన, దివ్య ఆయుధమ్ = గొప్ప ఆయుధములను కలవాడు అగు, లక్ష్మీసఖమ్ = శ్రీరంగనాథుని, శ్రీరంగే = శ్రీరంగమున, తతః ఇతః = అంతట, పశ్యేమ = దర్శింతుము గాక!

**వరివస్య :–** ఈ శ్లోకము కూడ పూర్వశ్లోకమువలెనే శ్రీరంగనాథుని దివ్యమంగళరూపమును వర్ణించుచున్నది. కాని, ఇందు పాదపీఠాది ముఖపర్యంతవర్ణనము చేయబడినది.

పాదారవిందములకు ఆధారముగానున్న పీఠము ఆసనపద్మం అనబడును. అట్టి ఆసనపద్మమున నిలిపిన పాదపద్మములను కలవాడు,

నడుమునకు తగిన పీతాంబరమును దాల్చినవాడు, భక్తజనమును చూచుటచే కల్గిన ఆనందమువలన కల్గిన సహజమైన చిఱునవ్వును కలవాడును, కిరీటమువరకు విస్తరించిన విశాలమైన ముఖారవిందమును (లలాటమును) కలవాడును, భగవద్భాగవత విరోధులను సమూలముగా నశింపచేయుటచే తన భుజములందు విశ్రమించిన సుదర్శనము మొదలగు దివ్యాయుధములను కలవాడు అగు శ్రీరంగనాథుని పలు వర్షములు శ్రీరంగమున అంతట నిత్యము సేవింతుము గాక! – అని భావము.

అబ్జము కాని పాదము పద్మమున నిలచుట తగదు. "**నైసర్గికీ సురభిణః కుసుమస్య సిద్ధా మూర్ధ్ని స్థితిః న చరణై రవతాడనాని**" (ఉ. రా. 1-14) (సుగందాన్ని కలిగిన పువ్వుకు తలపై ఉండడం అనే స్థితి సహజమైనది అంతే తప్ప, పాదాలతో ప్రహారాలు తగినవి కాదు) అని భవభూతి పల్కెనుకదా! భగవానుని పాదము అబ్జము, కావున, అట్టి అనౌచితి ఇచట లేదను భావము "**అబ్జన్యస్తపదాబ్జమ్**" అనుటచే ధ్వనించుచున్నది. పదాబ్జమున నిలచిన భంగిమ, కటిశోభలతోపాటు "**కించిత్తాండవ**" అను విశేషణముద్వారా శ్రీరంగనాథుడు అను నటునియొక్క నర్తనచాతుర్యానుగుణముగు రూపవిశిష్టతయు వ్యక్తమగుచున్నవి. లోకములోని నటులు చేయు స్మితము సవ్యాజము, కాని, ఈ రంగనటుని స్మితము అవ్యాజము. భగవానుని అవయవముల మధ్య పరస్పరప్రేను కలదు. ఒక అంగమును వేరొక అంగము చుంబించుచున్నది. ముఖపద్మము చూడాలంకారముగానున్నది. నిద్రపోవు సమయమునకూడ భగవానుడు దివ్యాయుధములను విడువక తన భుజములలోనే వానిని విశ్రమింపజేయును. ఏమి గుణమిది! ఇట్లు ఆయుధములు విశ్రమించుటకు తగిన ధైర్యము స్వామిభుజములకు కలదుకదా!

శ్లోకప్రారంభము పాదాబ్జముతో, ముగింపు ముఖాబ్జముతో. తామరలకు అనుకూలమైన శరత్ ఋతువును సూచించు శరత్ శబ్దముతో సంవత్సరమను అర్థమును చెప్పుట ఇచట మిగుల సందర్భోచితము.

**"తతః ఇతః పశ్యేమ"** అనుట భూమవిద్యను తలపింపజేయుచున్నది – అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్యానమున వివరింపబడనది. **"తతః ఇతః పశ్యేమ"** అనుటకు **"వృక్షే వృక్షే చ పశ్యామి చీరకృష్ణాజినాంబరమ్"** (రా. ఆర. -39-15) (నారబట్టలను, కృష్ణాజినమును ధరించిన శ్రీరాముని నేను ప్రతి చెట్టులోనూ దర్శిస్తున్నాను) అని మారీచుడు పల్కినట్లుగా శ్రీరంగనాథుని కోవెలలోనే కాక అంతట సేవింపవలెను – అని భావము. మారీచుడు భయమువలన దర్శింపగా, కవి ఇచట భక్తిచే దర్శింపగోరుచున్నారు. లేదా, **"నమః పురస్తాత్ అథ పృష్ఠత స్తే నమో ఽ స్తు తే సర్వత ఏవ సర్వ!"** (భ. గీ. -11-40) (చేతనా చేతనస్వరూపుడవైన నీకు ముందు నమస్కారము, వెనుక నమస్కారము, నీకు అంతటా, అని వైపులా నమస్కారము) అని అర్జునుడు విశ్వరూపమును ముందు–వెనుకలనుండి సేవించినట్లుగా, భగవానుని దివ్యమంగళ రూపమును ముందునుండి, వెనుకనుండియు దర్శింపవలెనని భావము. ఇట్టి భావము తరువాతి శ్లోకమునకూడ కలదు. సంప్రదాయములో స్వామి ముందు భాగములోని అందమునకు **"మిన్నழకు"** అని, వెనుక భాగములోని అందమునకు **"పిన్నழకు"** అని పేరు. లేక, పరమపదమునకూడ శ్రీరంగనాథుని సేవింపవలెనని కవి ఆశపడుచున్నారనియు చెప్పవచ్చును. **"ఎన్నముదినై క్కణ్డ కణ్గళ్ మற்றொన్నినై క్కాణావే"** (అమల. 10) (అమృతస్వరూపుడైన నా శ్రీరంగనాథుని చూచిన నా కన్నులు ఇక దేనిని చూడవు) అను తిరుప్పాణ్ సూక్తి ఇచట స్మరణీయము. **"అబ్జన్యస్తపదాబ్జమ్"** అనుటకు నమ్మాళ్వార్ల **"అడిచ్చోది నీ నిన్ఱ తామరైయాయ్ అలర్ న్దదువో?"** (తి. వా. 3-1-1) (నీ పాదముల కాంతి నీవు నిలచి ఉన్న పాదపద్మంగా వికసించినదా?) అను సూక్తి, **"అంచితతటీసంవాది కౌశేయకమ్"** అనుటకు ఆ పాశురములోనే కల **"పడిచ్చోది యాడైయొడుమ్ పల్కలనాయ్ నిన్ పైమ్బొన్ కడిచ్చోది కలన్దదువో?"** (3-1-1) (విశాలమైనది, అందమైనది అయినది నీ కటి కాంతి సహజమైన ప్రకాశం

కలిగిన పీతాంబరముగాను, అనేక విధాలయిన ఆభరణాలుగాను వ్యాపించి ప్రకాశిస్తున్నదా?) అను సూక్తియు నిదానములని తోచును.

చేయి – అను అర్థమునిచ్చు భుజశబ్దము స్త్రీలింగములోకూడ కలదు. **"నిహితభుజాలతయేకయో కంఠే"** (మాఘము 7-71.) వంటి ప్రయోగములు ఇందులకు ప్రమాణములు.

ఇందు వృత్తము శార్దూలవిక్రీడితము.

### శ్రీరంగనాథుడు అపర్యాప్తామృతము

**75. అగ్రే తార్ క్ష్యేణ పశ్చాదహిపతిశయనే నాత్మనా పార్శ్వయో శ్చ**
**శ్రీభూమిభ్యా మతృప్త్యా నయనచులకనైః సేవ్యమానామృతౌఘమ్ ।**
**వక్త్రేణావిఃస్మితేన స్ఫురదభయగదాశంఖచక్రైః భుజాగ్రైః**
**విశ్వస్మై తిష్ఠమానం శరణ మశరణా రంగరాజం భజామః ॥**

**ప్ర. అ. –** అగ్రే = ముందు భాగమున, తార్ క్ష్యేణ = గరుత్మంతునిచే, పశ్చాత్ = వెనుక భాగమున, అహిపతిశయనేన = – శేషశయనుడగు, ఆత్మనా = తనచే, చ = మరియు, పార్శ్వయోః = రెండు వైపుల, శ్రీభూమిభ్యాం = లక్ష్మీదేవి, భూదేవులచే, అతృప్త్యా = సంతృప్తి లేకుండుటచే, నయనచుళకనైః = నేత్రములు అను పుడిసిళ్లతో, సేవ్యమాన = సేవింపబడుచున్న, అమృత+ ఓఘమ్ = (సౌందర్యమను) అమృత ప్రవాహమును కలవాడు, అవిఃస్మితేన = చిఱునవ్వు తొణికిసలాడు, వక్త్రేణ = ముఖముతో, స్ఫురత్ = ప్రకాశించు, అభయ = అభయహస్తము, గదా = గద, శంఖ = శంఖము, చక్రైః = చక్రము అను వీనిని దాల్చిన, భుజ అగ్రైః = భుజాగ్రములతో (కరములతో), విశ్వస్మై = అందరకు, తిష్ఠమానం = (తన మనస్సును. తెలియజేయుచు, నిలచియున్నవాడగు, రంగరాజం = శ్రీరంగనాథుని, అశరణాః = వేరొక దిక్కులేనివారమై, భజామః = సేవింతుము.

**వరివస్య :–** కవి శ్రీరంగనాథుని ఈ శ్లోకమున అపర్యాప్తామృతముగా (ఆరావముదమ్) స్తుతించుట విశేషము. నమ్మాళ్వార్లు భగవానుని **“ఆరావముదే!”** (తి. వా. 5-8-1) అని ప్రస్తుతించుట ఈ రూపణమునకు నిదానమని చెప్పవచ్చును.

శ్రీరంగనాథుని ఉత్సవమూర్తికి ఎదురుగా నిలచియున్న గరుడుడు ఆ స్వామియొక్క పురోభాగసౌందర్యమును, శేషశాయిగానున్న మూలమూర్తి అగు తాను వెనుక భాగములోని సౌందర్యమును, ఇరు వైపుల నిలచియున్న శ్రీదేవి, భూదేవులు. పార్శ్వభాగమునందలి అందమును తమ కన్నులు అను పుడిసిళ్ళతో నిత్యము సేవించుచున్నను, వారికి తృప్తి కలుగుట లేదు. చిఱునవ్వు తొణికిసలాడు ముఖముతో, అభయముద్ర, గద, శంఖము, చక్రములతో కూడిన భుజాగ్రములతో, “లోకమున కంతటికిని నేనే శరణము” అను విషయమును తెలుపుచు వేంచేసియుండు శ్రీరంగనాథుని ఉత్సవమూర్తిని **“పుకలొన్టిల్లా వడియేన్”**(తి. వా. -6-10-10) (వేరు ఏ దిక్కు లేని దాసుడను అయిన నేను) అను విధముగా వేరు శరణము ఏ లేనివారమై భజింతుము – అని శ్లోకభావము.

ఉత్సవమూర్తి యొక్క వెనుక భాగములోని సౌందర్యమును మూలమూర్తి మిక్కిలి ఆశతో అనుభవించుచున్నారని పల్కుట **“మూర్తం బ్రహ్మ తతో ఽ పి తత్ప్రియతరమ్”** (4) (పరమాత్మ దివ్యమంగళ విగ్రహము, ఆత్మ స్వరూపము కంటే ఆ భగవంతునకు మిక్కిలి అభిమతము) అను చతుఃశ్లోకిలోని యామునార్యసూక్తిని జ్ఞప్తికి తెచ్చుచున్నది. భగవానుని దివ్యమంగళ విగ్రహసౌందర్యము ఇతరుల కెంత ప్రియకరమో, భగవానునకును అట్లే అని తాత్పర్యము. **“అగ్రే కించిత్ భుజగశయనః స్వాత్మనై వాత్మనః సన్”** (11) (అని భగవద్ధ్యానసోపానమున, ★ **“భుక్తం ప్రియాభి రనిమేషవిలోచనాభిః”** (రెప్ప పాటు లేని చూపులతో దివ్యదేవేరులచేత అనుభవింపబడినవానివి) (14) అని దేవనాయకపంచాశత్ లోని దేశికసూక్తులను ఇచట స్మరింపనగును. నాల్గు

దిక్కులలోను నలుగురు నిలచి, తమ కన్నులార అనుభవింపదగిన సౌందర్యామృతము స్వామికి కలదు.

1) పరమపదము నందలి అమృతము "**ఏతదేవామృతం దృష్ట్వా తృప్యంతి**" అనునట్లు తృప్తిని కల్గించును. అట్లు, చాలు అని అనిపించుట ఆ పదార్థముయొక్క తక్కువదనమే అగును కదా! కాని, ఈ అమృతమును మాత్రము ఎంత ఆస్వాదించినను తృప్తిని కల్గింపదు. "**అతృప్త్యా సేవ్యమానామృతౌఘమ్**" అని పల్కుటద్వారా భట్టరు ఈ విశేషమును సూచించిరి, తమిళభాషలో "**ఆరావముదే**" అని నమ్మాళ్వార్లు భగవానునిగూర్చి చేసిన సంబోధనయొక్క తాత్పర్య మిదియే. "**న తతర్ప సమాయాంతం పశ్యమానో నరాధిపః**" (ప్రభువు అగు దశరథుడు తనవద్దకు వచ్చు. శ్రీరాముని నడక సొబగును ఎన్నిసార్లు దర్శించినను తృప్తి పొందలేదు.) అని వాల్మీకిభగవానులు, "**వా, పోగు, వా**" (దగ్గరకు రా, వెళ్ళు, మళ్ళీ నా దగ్గరకు రా) (పెరుమా. తి. 9. 4) అని శ్రీకులశేఖరులును శ్రీరాముని గమనసౌందర్యములోని విశిష్టతను వర్ణించిరి కదా! "**అచింత్యదివ్యాద్భుత, అమృతోదధిమ్**" (45) అని యామునులుకూడ స్తోత్రరత్నమున సాయించిరి. అదే రీతిలో భట్టరు ఇచట శ్రీరంగనాథుని అపర్యాప్తామృతముగా అభివర్ణించిరి. "**సేవ్యమానామృతౌఘమ్**" అనునపుడు సౌందర్యమను అర్థము అమృతపదముచే ఆక్షిప్తము. "**నయనచులకనైః సేవ్యమానామృతౌఘమ్**" అనునప్పుడు, "**లోచనాభ్యాం పిబన్నివ**" (రా. యు. 1-9-6.) (రెండు కళ్ళతో తాగుతున్నట్లుగా) అను శ్రీరామాయణశ్లోకము అనుసంధేయము. "**చులకన**" అనుపదమునకు పుడిసిలి అనియేకాక, చిన్నపానపాత్ర అనియు చెప్పవచ్చును. స్వామియొక్క ఒక భుజాగ్రము అభయమును తెలుపగా, మిగిలిన మూడును దివ్యాయుధధారణముతో ఆ అభయమును సమర్థించుచున్నవి.

భూమవిద్యలో ఉపాసింపదగిన భగవానుడు దివ్యమంగళవిగ్రహుడు. దేవీవాహనశయనాదివిశిష్టుడు. అట్టి భగవానుని వర్ణన ఈ శ్లోకమున చేయబడినదని శ్రీగోపాలాచార్యవ్యాఖ్య.

"**అహిపతిశయనేన ఆత్మనా**" అనుటకు, ఉత్సవవిగ్రహమునకు "**మూలమూర్తి ఆత్మ**" అని అర్థము చెప్పవచ్చును. ఆగమశాస్త్ర ప్రకారము మూలమూర్తి నుండి ఉత్సవమూర్తికి కళావాహనముచేయుట గమనింపదగినది. "**విశ్వస్మై తిష్ఠమానమ్**" అనుటచే "**వివృణుతే తనూం స్వామ్**" (ముణ్డక 3-2-3) (భగవానుడు ఎవరిని అనుగ్రహిస్తాడో, అతనికి తన దివ్యమంగళ విగ్రహానుభవాన్ని అనుగ్రహిస్తాడు) అనునట్లు, భగవానుడు భక్తులకు తనను ప్రకాశింపజేసికొనుటకై నిలచియున్నాడను భావము ప్రతీతమగును. లేక, "**త్వం మేఽహం మే**" అను శ్లోకములోవలె, శ్రీరంగనాథుడు జీవునితో పడిన వివాదమునందు ప్రమాణమును చేయుటకై నిలచియున్నాడనియు ధ్వనించుచున్నది. కావున, "**ప్రకాశనస్థేయాఖ్యయోశ్చ**" అను సూత్రముచే వివక్షితమగు ప్రకాశింప చేయడం, స్థిరంగా ఉండడం – అను అర్థద్వయమును ఇచట అన్వయింపనగును. "**తిష్ఠమానమ్**" అను ఆత్మనేపది ప్రయోగమువలన, "మనలను రక్షించుటవలన కలుగు ఫలము భగవానునిదే" అను విశేషము స్ఫురించును. ఈ వివరణమంతయు శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో కన్పించుచున్నది.

శ్రీరంగమున కావేరీనదీమధ్యభాగమున వేంచేసి యున్న శ్రీరంగనాథుడు ముఖమున చిఱునవ్వుతో, నాల్గు చేతులతో ధరించిన అభయముద్ర, శంఖము, గద, చక్రములతో "భక్తులారా! మీరు భయపడకుడు, మీ రక్షణ కొఱకే కదా నేనిచట నిలచియున్నాను." అను విషయమును లోకమునకు తెలియజేయుచున్నట్లున్నాడని ఉత్ప్రేక్షాలంకార పూర్వకమగు భావమును శ్లోకములోని రెండవ భాగము తెలుపుచున్నది. ఇచట "**ఏతే శంఖగదా**" అను 70వ శ్లోకభావము అనుసంధేయము. "**వక్త్రేణావిఃస్మితేన**" అనుటచే, ఇష్ట ప్రాపకత్వము, "**గదాశంఖచక్రైః భుజాగ్రైః**" అనుటచే అనిష్టనివర్తకత్వము

సూచింపబడినది. కావున శ్రీరంగనాథునియందు శరణ్యత్వపూర్తి కలదని పరోక్షముగా తెలుపబడినది.

ఇందు భగవానుని అద్భుతముగా వర్ణించుటచే రూపకాలంకారమగును. కావున పూర్వార్థమున రూపకాలంకారము, ఉత్తరార్థమున ఆర్థికమైన ఉత్ప్రేక్ష కలదని చెప్పనగును. వృత్తము స్రగ్ధర.

"**అహిపతిశయనేన ఆత్మనా**" అనునపుడు శయనమగు ఆదిశేషునిచే, తనచే – అనియు అర్థము చెప్పవచ్చును.

### శ్రీరంగనాథుడే మనకు ఉపేయం

**76. ఆర్తాపాశ్రయ మర్థికల్పక మసహ్యాగస్కరక్ష్మాతలమ్**
**సద్యః సంశ్రితకామధేను మభియత్సర్వస్వ మస్మద్ధనమ్।**
**శ్రీరంగేశ్వర మాశ్రయేమ కమలాచక్షు ర్మహీజీవితమ్**
**శ్రీరంగే స సుఖాకరోతు సుచిరం దాస్యం చ ధత్తాం మయి ॥**

**ప్ర. అ. –** ఆర్త = బాధను పొందినవారికి, అపాశ్రయం = (గొప్ప) ఆశ్రయమైన వాడు (ఆలంబనము), అర్థికల్పకం = అర్థించు జనులకు కల్పవృక్షము వంటివాడు, అసహ్యా = సహింపరాని, ఆగస్కర = పాపము చేసినవారిపట్ల, క్ష్మాతలం = భూతలమువంటివాడు. (క్షమకలవాడు), సద్యః సంశ్రిత = అపుడే ఆశ్రయించినవారికి, కామధేనుం = కామధేనువు వంటివాడు, అభియత్ సర్వస్వం = ఆళ్వార్లవంటి ముముక్షువులకు సమస్తము అయినవాడు, అస్మత్ – ధనం = మా సంపద, కమలాచక్షుః = శ్రీదేవికి నేత్రమువంటినాడు, మహీజీవితం = భూదేవికి జీవితమగువాడు అగు, శ్రీరంగ ఈశ్వరం = శ్రీరంగనాథుని, ఆశ్రయేమ = ఆశ్రయింతుము గాక, సః = ఆ ప్రభువు, సుచిరం = చిరకాలము, శ్రీరంగే = శ్రీరంగమున, సుఖాకరోతు = (మమ్ములను) సుఖింపజేయుగాక! మయి = నా యందు, దాస్యం చ = దాస్యవృత్తిని (కైంకర్యవృత్తిని) కూడ, ధత్తామ్ = అనుగ్రహించును గాక!

**వరివస్య :–** ఈ స్తవమున భట్టరు 63వ శ్లోకము మొదలు, ఇంతకు ముందు శ్లోకమువరకు అనగా, 13 శ్లోకములలో శ్రీరంగనాథుని ఉత్సవమూర్తిని ఉపాయముగా స్తుతించిరి. ఇందు ఆ స్వామిని ఉపేయముగా **"అస్మద్ధనమ్"** అనుచు స్తుతించుచున్నారు. ఆ స్వామికి, **"ఒழிవిల్ కాలమెల్లామ్ ––– ఒழிవిలా వడిమై శెయ్యవేండుమ్"**(తి. వా. – 3–3–1) (కాలం అంతా విచ్ఛేదం లేకుండా దాస్యాన్ని చేయాలి) అను నమ్మాళ్వార్ల శ్రీసూక్తిని అనుసరించుచు, నిత్య కైంకర్యమును చేయుటయే పరమప్రాప్య మనుచున్నారు. ఈ శ్లోకముతో ఉత్సవమూర్తి స్తుతి పూర్తిఅగును.

విశ్వరక్షణకై నిలచి, నాల్గు భుజములతో చతుర్విధపురుషార్థములను ఇచ్చుటకై శ్రీరంగనాథుడు సిద్ధముగా నున్నాడని కవి ముందు శ్లోకమున తెలిపిరి. ఆ ఔదార్యము ఇందు పలు ఉదాహరణములతో విశదీకరింపబడుచున్నది – అనియు చెప్పవచ్చును.

ఆర్తులనగా, ఇంతకు ముందు తమకు గల సంపదను పోగొట్టుకొని, బాధపడువారు. వారు, తాము కోల్పోయిన సంపదను తిరిగి పొందవలెనను ఆశతో భగవానుని ఆశ్రయింతురు. అట్టి వారికి శ్రీరంగనాథుడు గొప్ప దిక్కు. అర్థి అనగా, ఇంతకు ముందు తనకు లేని సంపదను అర్థించువాడు. వాని కోరికలనన్నిటిని శ్రీరంగనాథుడు కల్పవృక్షమువలె సఫలము చేయును. ఆత్మానుభవము అను కైవల్యమును కోరువాడు జిజ్ఞాసువు. అతడు పరమపురుషార్థమగు భగవత్కైంకర్యమును అభిలషింపక, అత్యంతము అల్పమగు కైవల్యమును కోరుట భగవానుని దృష్టిలో సహింపరాని అపరాధమగును. అట్టి అపరాధమును సైతము మన్నించి, సహించు ఓర్పును శ్రీరంగనాథుడు కల్గియుండుటచే ఆ స్వామి భూదేవివంటివాడు. లేక, ఆర్తశబ్దముచేతనే జిజ్ఞాసువు అనబడు కేవలుడును చెప్పబడుననినచో, **"అసహ్యాగస్కృరక్ష్మాతలమ్"** అనుటకు సర్వాపరాధసహిష్ణువు – అని భావము. ముముక్షువులై, సద్యః ఆశ్రయించిన మహనీయుల పాపసంచయములను

పోగొట్టి, వారికి అపేక్షితములైన అనుభవములన్నిటిని ప్రసాదించు శ్రీరంగనాథుడు కామధేనువు వంటివాడు. స్వస్వరూప, పరస్వరూపాది అర్థపంచక జ్ఞానమును కలిగి, పరమపురుషార్థమగు భగవత్కైంకర్యమును అపేక్షించి, తనను ఆశ్రయించు ఆళ్వార్లవంటివారికి **"శేలేయ్ కణ్ణియరుమ్ పెరుమ్ శెల్వముమ్ నన్మక్కళుమ్, మేలా త్తాయ్ తన్దైయుమ్ అవరే"** (తి. వా. – 5–1–8) (అందమైన కన్నులను కల్గిన స్త్రీజనము, గొప్ప సంపద, సత్సంతానము, తండ్రి, తల్లి, అన్నియు ఆ భగవంతుడే) అనునట్లు, సర్వస్వమైనవాడు శ్రీరంగనాథుడు, ఆ ప్రభువు మన కులధనము. లక్ష్మీదేవికి కంటిచూపు, భూదేవికి జీవితము; ప్రాణమును. అట్టి స్వామిని ఆశ్రయింతుము. ఆ స్వామి నన్ను చిరకాలము తన కైంకర్యమునకై వినియోగించుకొని, నాకు ఆనందమును కల్గించుగాక – అని శ్లోకభావము.

కవి ఈ శ్లోకమును భగవద్గీతలోని–

**"చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున!,**
**ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ!"**

(భరతవంశంలో పుట్టినవారిలో గొప్పవాడవు అయిన అర్జునా! ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అనే నలుగురు అదృష్టవంతులు నన్ను భజిస్తున్నారు) (భ. గీ. –7–16) అను శ్లోకమును, శ్రీరామచంద్ర భగవానుని చతుర్విధ పురుషార్థప్రదాయకత్వమును తెలుపు, శ్రీరామాయణములోని,

**"నివాస వృక్షః సాధునా మాపన్నానాం పరాగతిః,**
**అర్తానాం సంశయశ్చైవ యశస శ్చైకభాజనమ్"**

అను శ్లోకమును దృష్టిలో నుంచుకొని రచించినట్లు కన్పించును. **"అసహ్యాగస్కరక్షామతలమ్"** అను విశేషణము సహస్రనామములోని **"సహిష్ణుః"** అను నామముయొక్క అర్థమును తలపింపజేయుచున్నది. పరాశరభట్టరు ఈ నామమునకు భాష్యమును అనుగ్రహించుచూ,

**"తేషాం (భక్తానాం) ఆభిముఖ్యాత్ ప్రాక్ ఊర్ధ్వం చ సంచితానాం బుద్ధ్యా అబుద్ధ్యా వా సకలకరణైః సర్వదా సర్వథా చ ప్రచీయమానానాం విధినిషేధశాసనాతిలంఘనాత్మనాం సాధారాణానామ్, అసాధారణానాం చ అనవధికానామ్ ఆపరాధానాం సహిష్ణుః"** (ఆ భక్తుల విషయమున గల ప్రేమవలన వారు, ఆశ్రయించుటకు ముందు, పిమ్మటను చేసినవి, బుద్ధిపూర్వకముగా గాని, లేక, అప్రయత్నముగా గాని, సకలకరణములతో ఎల్లప్పుడు అన్ని విధములుగా మూటగట్టుకొనునవి, తాను విధించిన ఆజ్ఞను మీరుట, వలదన్న పనిని చేయుట మొదలగు సాధారణములైన, అసాధారణములైన అంతు లేని అపరాధములను, సహించువాడు) అని పల్కిరి. ఈ అర్థమంతయు ప్రకృతమున నశ్రీరంగనాథుని విషయములో సమన్వయించుకొనవచ్చును.

ఇక్కడ వేరొక విషయము కూడా అవధార్యము. తిరువాయ్ మొళి ప్రబంధమంతయు శ్రీ రంగనాథపరమే అని భట్టర్ భావించిరను విషయము పూర్వోక్తమే. ఆ ప్రబంధములోని వేయి పాశురములు శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రములోని వేయి నామములలోని అర్థమును తెలుపుచున్నవి అను విషయమును ఆళ్వారులే స్వయంగా "**నామజ్గళాయిరత్తుళ్**" (నామాలు వేయింటిలో) (7–10–11) అనుచు తెలిపిరి. ఇందువల్ల భట్టర్ ఈ శ్రీరంగరాజస్తవములోని పలు శ్లోకములలో విష్ణు సహస్రనామస్తోత్రములోని పలు నామముల భావములను అనుసంధించిరి. ఈ విషయమును ఉత్తర శతకములోని శ్లోకములలో కూడా గమనించవచ్చును.

"**అభియత్సర్వస్వమ్**" అనునపుడు, "**అభియత్**" అను పదమునకు శరణాగతి నిష్ఠులగు ఆళ్వార్లవంటి ముముక్షువులని అర్థము. "**వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా**" (వాసుదేవుడే ధారక పోషక భోగ్యాలు అని భావించు మహాత్ముడు) అని గీతాచార్యుడు వారిని మహనీయులైన, దుర్లభులైన భక్తులుగా పల్కెను. "**భూమవిద్యోక్తప్రకారేణ అభిగతానామ్ అభితః సర్వతో వర్తతే**"

(భూమవిద్యలో చెప్పినట్లుగా తనను ఆశ్రయించినవారి సమక్షమున అంతటా ఉండును) అని ఇచట శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో వివరింపబడినది. "**అస్మద్ధన**" మనునపుడు, "**తత్ యథా హిరణ్యనిధిం నిహితమ్**" (ఛాందోగ్య 8-3-2) అను (భూమిలో దాచిపెట్టిన బంగారు నిధివలె) అను ఉపనిషద్వాక్యమును, "**నిధిరవ్యయః**" (ఏ నాటికి తరగని నిధి) అను భగవన్నామమును, "**వైత్త మానిది**" (తి. వా. -6-2-11) (పేర్చి పెట్టుకున్న గొప్ప నిధి) అను ఆళ్వార్ల సూక్తిని స్మరింపనగును. భగవంతునకు, నిధికి మధ్య గల సామ్యములు అన్ని ఇక్కడ స్మరణీయములు. ఇచట "**అస్మత్**" అను సర్వనామము భగవదాభిముఖ్యమును తప్ప వేరొక యోగ్యత కాని, జ్ఞానము కాని లేని మనకుకూడ సంపదవలె రక్షకుడును, భోగ్యమును- అను విశేషార్థమును సందర్భోచితముగా స్ఫురింపచేయును.

"**ఆర్తాపాశ్రయమ్, ఆర్థికల్పకమ్, అసహ్యాగస్కరక్షామతలం, సంశ్రితకామధేనుమ్**" వంటి విశేషణములకు "**కమలాచక్షుః**" అను విశేషణము నిదానము. లక్ష్మీదేవి సమస్త జగజ్జనని. కావున, అందరిని ఆదరించి, ఆశ్రయమిచ్చి, వారి దోషములను ఓర్చి, వారి వారి అభీష్టములను తీర్చుట తల్లిగా ఆమె. స్వభావము. శ్రీరంగనాథుడామెకు నేత్రమువంటివాడగుటచే ఆమె ఈ కర్తవ్యములనన్నిటిని స్వామిమూలముగా నిర్వర్తించుచున్నదను విశేషము ఇచట స్ఫురించుచున్నది. కమలా దేవి భగవానునకు నేత్రము అనగా, నేత్రమను పదమునకు గల "**నయతి ఇతి నేత్రమ్**" (ముందుకు నడిపించునది కనుక నేత్రము) అను వ్యుత్పత్తిని బట్టి, శ్రీరంగనాథుడు శ్రీరంగ నాయకి మాటను అనుసరించి భక్తరక్షణను చేస్తాడు- అనే అర్థము కూడా స్ఫురించును.

స్తోత్రరత్నములోని "**అర్థికల్పక**" మను విశేషణమును వేదాంతదేశికులు వ్యాఖ్యానించుచు ఈ క్రింది మూడు విధములైన వ్యుత్పత్తులను చూపిరి.

(1) "**అర్థినాం కల్పద్రుమవత్ సర్వాపేక్షితప్రద మితి యావత్**" (అడిగినవారికి కల్పవృక్షమువలె అన్ని అపేక్షితములను ఇచ్చువాడనుట),

(2) "**అర్థినః కల్పద్రుమభూతాః యస్య సః అర్థికల్పకః. తదాహ– 'ఉదారా సర్వ ఏవైతే' ఇతి**", (ఎవనికి యాచకులు కల్పవృక్షములవంటివారో, అతడు అర్థికల్పకము. అనగా, ఎన్నో విధములైన వరములను జనుల కివ్వవలెనను ఆశ భగవానున కుండును. కావున, ఆ యా వరములను కోరుటద్వారా అర్థిజనము భగవానుని వాంఛను సఫలము చేయుదురు. ఈ కారణముచే వారు భగవానుని దృష్టిలో కామధేనువుల వంటివారు. ఈ విషయమును భగవానుడే గీతలో స్వయముగా "**ఉదారాః సర్వ ఏవైతే**" అనుచు తెలియజేసెను.)

(3) "**స్వయ మర్థినః కల్పయతీత్యర్థః. క్షేత్రజ్ఞానాం తత్తత్ పురుషార్థాధికార దశాపి హి పరమపురుషకల్పితా**" (స్వయముగా యాచకులను కల్పించువాడు కావున, భగవానుడు అర్థికల్పకము. జీవులు ఆ యా పురుషార్థములను అనుభవించు దశను కూడ భగవానుడే కల్పించును కదా!).

పై మూడు వ్యుత్పత్తులు కాక, వేరొక వ్యుత్పత్తినికూడ అభిజ్ఞులు అగు పెద్దలు తెలిపిరి.

(4) "**అర్థినం కల్పవృక్షం కరోతి ఇతి అర్థికల్పకః**"(తనను అభ్యర్థించువానిని కూడ కల్పవృక్షముగా చేయువాడు, కావున, భగవానుడు అర్థికల్పకము.)

వేదాంతదేశికులును ఈ అర్థమున కనుగుణముగా యాదవాభ్యుదయ కావ్యములోని మొదటి సర్గలో "**అర్థినః ప్రథమే తస్య చరమాన్ పర్యపూరయన్**" అని అనుటను గనునింపవచ్చును. దీనివలన కల్పవృక్షముకన్న భగవానునకు కల అతిశయము స్పష్టమగుచున్నది.

"**సద్యః సంశ్రితకామధేనుమ్**" అనునపుడు, కొత్తగా ఆశ్రయించినవారికి కామధేనువువంటివాడను భావమును స్వీకరించినచో, "**వత్సలః**" అను సహస్రనామమునకు పరాశరభట్టరు అనుగ్రహించిన,

"**స హి చిరం పరిచీయమానేష్వపి శరణాగతేషు కస్యాపి హేతోః, సద్యః ప్రసూతేష్వివ వత్సేషు సహుంకారాః సపయఃసంస్నవస్తనవేదనాః**

**కింకర్తవ్యతాకులా ధేనవ ఇవ, సంభ్రామ్యతి ఇతి. రామాయణేఽపి ప్రసిద్ధమ్. 'విదితః స హి ధర్మజ్ఞః శరణాగతవత్సలః**" (రా. సుం. 21-20) "**ఇతి**" (ఆ భగవానుడు, చిరకాలం తనతో పరిచయం కలిగిన శరణాగతుల విషయంలో కూడా ఏదో ఒక కారణం వల్ల, అప్పుడే పుట్టిన లేగ దూడల విషయంలో ఉండే ప్రీతి చేత ఎవరిని దగ్గరకు రానివ్వకుండా హుంకారాలను చేసి, ఆ దూడలకు పాలను ఇవ్వలేక పోతే స్తనవేదనతో బాధపడుతున్నవై, ఏమి చేయాలో తెలియని రీతిలో ఆకులతను పొందే గోవులవలె, సంభ్రమమును పొందుతాడు. ఈ విషయం రామాయణంలో కూడా "**విదితః స హి ధర్మజ్ఞః శరణాగత వత్సలః**" అని మొదలైన సూక్తులలో ప్రసిద్ధమైనది) అను భాష్యము జ్ఞప్తికి వచ్చును. "**త్వయి కించిత్ సమాపన్నే కిం కార్యం సీతయా మమ?**" (రా. యు. 41-4) (సుగ్రీవా! నీకు ఏదైనా కొంచెం అపాయం సంభవిస్తే, ఇక నాకు సీతతో ఏమి పని?) అను శ్రీరామాయణ శ్లోకరత్నమును వ్యాఖ్యానించుచు "**అభినవవత్సవాత్సల్యేన పూర్వవత్స మనభిలషన్తీ వత్సలా గౌరివ, నిత్యానపాయినీ మపి సీతా మనాదృత్య, తదానీమాశ్రితే వానర మాత్రే త్వభినివేశం కుర్వతో రామస్య వాత్సల్యాతిశయ ఉచ్యతే**" (నూతనముగా పుట్టిన లేగ దూడ విషయంలో ఉండే వాత్సల్యం చేత, ఇంతకు ముందు పుట్టిన దూడను ఆదరించకుండా ఉండే రీతిలో వాత్సల్య గుణాన్ని కలిగిన ఆవువలె, ఒక్క క్షణం కూడా తనను విడిచిపెట్టని సీతాదేవిని కూడా అనాదరించి, అప్పుడే ఆశ్రయించిన ఒక వానరవీరుని విషయంలో అభినివేశాన్ని కలిగి ఉండే శ్రీరామచంద్రుని వాత్సల్యగుణంలోని అతిశయం చెప్పబడుతున్నది) అను శ్రీగోవిందరాజీయసూక్తి ఇచట స్మరణీయము. "**సద్యః**" అనుటకు అవిద్యానివృత్తిని పొందిన అని, "**కామధేనుమ్**" అనుటకు మోక్షరూప కామమును, అనగా, కోరికను అనుగ్రహించునని ఇచట ధ్వనించుననియు చెప్పవచ్చును.

భగవానుని కానుధేనువుగా రూపించుట దివ్యప్రబంధములలో స్పష్టముగా ఎచ్చటను కన్పించుటలేదు. కాని, "**తాయ్ నాడు కన్టేపోల్**" (ముదల్ తి. 30) తల్లి ఆవును అన్వేషించు దూడవలె) అను సూక్తి ఇచట స్మరింపనగును. అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అను పూర్వాచార్యులచే రచింపబడిన జ్ఞానసారములోని–

**ఆఱ్ఱ ముఱైక్కిల్ అడన్దవర్ పాల్ అమ్బుయకోన్,**
**కుఱ్ఱముణర్ న్దిగఴుమ్ కొళ్ గైయన్డో, ఎఱ్ఱేతన్**
**కన్టి నుడమ్బిల్ వఴువన్డో, కాదలిప్పదు**
**అన్దదనై యీన్టుగన్ద వా" (25)**

వాస్తవమును పలికినట్లయితే, లక్ష్మీవల్లభుడు తన దాసుల విషయంలో దోషాలను చూసి ఆ దోషాల కారణంగా వారిని విడిచి పెట్టే స్వభావాన్ని కలిగినవాడా! కానే కాదు. ఈ విషయాన్ని కొందరు తెలియకుండా ఉండడం ఎంత ఆశ్చర్యం! అప్పుడే తాను ప్రసవించిన లేగదూడ శరీరంలో ఉండే మలినాన్ని కదా, ప్రసవించిన సమయంలో, దానిని తాను ప్రసవించినందువల్ల కలిగిన ఆనందంతో ఆ దోషాన్ని ఆదదరంతో గుణంగా గ్రహిస్తుంది) అను పాశురమున, అట్లే పూర్వోక్తపాశురమునకు ప్రమాణమగు,

**"ప్రపన్నాన్ మాధవ స్సర్వాన్ దోషేణ పరిగృహ్యతే,**
**అద్యజాతం యథా వత్సం దోషేణ సహ వత్సలా"**

(అప్పుడే పుట్టిన లేగ దూడను, దానిలో ఉండే దోషంతో పాటుగా దగ్గరకు చేర్చుకునే తల్లి ఆవు వలె, మాధవుడు, తనను శరణాగతి చేసినవారిని, వారి దోషాలతో పాటుగా పరిగ్రహిస్తాడు) అను శ్లోకమున భగవానుడు ధేనువుగా రూపింపబడుటచే, భట్టరు ఆ భావములను గ్రహించిరని చెప్పవచ్చును. మఱియు, భగవచ్ఛాస్త్రములోని "**యథా తరుణవత్సా వత్సం, వత్సో వా మాతరం గచ్ఛంత మనువ్రజేత్ తథాప్రకార మితివత్**"(లేగదూడను కన్న తల్లి ఆవు ఆ లేగ దూడను అనుసరించినట్లు, లేక లేగ దూడ తన తల్లిని అనుసరించినట్లు, జీవుడు

భగవంతుని అనుసరించాలి) అను ప్రమాణవచనమును ఇచట అనుసంధేయము. దేశికులు దయాశతకమున "**విశ్వోపకారమితి నామ సదా దుహానామ్**" (91) అను శ్లోకమున శ్రీనివాసుని దయను కామధేనువుగా పరోక్షముగా వర్ణించుటను గమనింపవచ్చును.

"**వృక్షః**" అను విష్ణుసహస్రనామమును భట్టరు "**వృఞ్ – వరణే**" అను ధాతువునుండి పుట్టినదిగా వివరించుచు, "**తేషు ఛాయాతరువత్ ఆశ్రితానాం ఉపజీవ్యసర్వస్వః తత్కృత ఉపమర్దసహస్రసహః వృక్షతే ఇతి వృక్షః**" (ఛాయావృక్షమువలె భగవానుడు ఆశ్రితులకు ఉజ్జీవనసర్వస్వము, మరియు వారు చేయు అపరాధములను సైదువాడు, తానే వారిని వరించువాడు. కావున వృక్షమునబడుచున్నాడు) అని వ్యాఖ్యానించుటకు, ఆర్తాపాశ్రయమను ప్రస్తుత విశేషణమునకు గల సామ్య మనుసంధేయము. తైత్తిరీయోపనిషత్ కూడ భగవానుని "**వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకః**" (తై. ఉ. –11–20) (స్థిరమైన వృక్షమువలె, పరమపదములో అద్వితీయుడైన పరమాత్మ స్థబ్ధుడై ఉన్నాడు) అనుచు స్థిరవృక్షముగా స్తుతించుచున్నది.

ఈ శ్లోకము శ్రీరామానుజాచార్యకృత సంస్కృతవ్యాఖ్యానమున కన్పించుట లేదు.

"**కమలాచక్షుః**" – లక్ష్మీదేవిని నేత్రముగా కల్గినవాడనియు చెప్పవచ్చును. అనగా, భక్తులను భగవానుడు ఆమెద్వారా చూచును. కమల జగజ్జనని, తమ సంతానమందు అపరాధమును చూడదు. ఆమె భగవానుని నేత్రమగుటచే అతడును భక్తుల అపరాధములను గణింపడు – అని తాత్పర్యము. "**మహీజీవితమ్**" – భూదేవికి జీవితమైనవాడని, భూదేవిని జీవితముగా కల్గినవాడనియు దీని భావము.

"**శ్రీరంగేశ్వరమ్**" – "**శ్రీశ్వరం, రంగేశ్వరమ్**" అనగా, ఈశ్వరియగు లక్ష్మికి, ప్రణవరూపమగు శ్రీరంగవిమానమునకు నాథుడని భావము. శ్రీరంగవిమానము ప్రణవాకారమగుటచే ప్రణవమును సూచించును.

**"దాస్యం చ ధత్తాం మయి"**- శ్రీరంగనాథుడు తనను నాకు అనుగ్రహించినను, ఆ స్వామి కైంకర్యమే నా స్వరూపానుగుణము. కావున, ఆ కైంకర్యమే నాకు అనుగ్రహించునుగాక. మిగిలిన ఏ ఐశ్వర్యము నాకు వలదు. పరధర్మము భయావహము గదా! **"ఈశ్వరత్వేనైవ ఆత్మానం మమ దదాతు. మాస్తు మమైశ్వర్యం. ధర్మిణ మాత్మానం మే దదాతు. న స్వధర్మ మైశ్వర్యం, మద్ధర్మం దాస్య మేవ మహ్యం దదాతు. పరధర్మో భయావహః"** (. 3-35) (ఈశ్వరస్వరూప ప్రయుక్తంగానే శ్రీరంగనాథుడు తనను నాకు అనుగ్రహించుగాక. నాకు ఇంకొక ఐశ్వర్యం ఏమీ అక్కరలేదు. ధర్మి అయిన ఈశ్వర స్వరూపాన్ని నాకు అతడు అనుగ్రహించు గాక. అంతే తప్ప, తన ధర్మమైన ఐశ్వర్యం నాకు వద్దు. నా ధర్మమైన దాస్యమే నాకు ఇచ్చుగాక. పర ధర్మం భయాన్ని కలిగిస్తుంది కదా) అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్యానమున వివరింపబడినది.

ఇందు అలంకారము రూపకము-వృత్తము శార్దూల విక్రీడితము.

## శ్రీరంగనాథునకు తూగుటుయ్యేలవంటి ఆదిశేషుని నమస్కరిస్తాము

**77. స్వఫణవితానదీప్రమణిమాలిసుదామరుచి-**
**ప్రమదిమసుగంధిభోగసుఖశాయితరంగధనమ్ ।**
**మదభరమంథరోచ్ఛ్వసితనిశ్శ్వసితోత్తరళమ్**
**ఫణిపతిడోలికాతళిమ మాశ్వసిమః ప్రణతాః ॥**

**ప్ర. అ. –** స్వఫణ = తన పడగలనెడు, వితాన = మేలుకట్టులో, దీప్ర = ప్రకాశించు, మణిమాలిః = మణుల వరుసలను కల్గిన, సుదామ = చక్కని పూల మాలలయొక్క, రుచి = అందము, ప్రమదిమ = మెత్తనిదనము, సుగంధి = పరిమళములను కల్గిన, భోగ = తన శరీరమునందు, సుఖశాయిత = - సుఖముగా శయనింప జేసిన, రంగధనం = శ్రీరంగనాథుని కల్గినది, మదభర = భగవదనుభవముచే కల్గిన మదముచే మెల్లగా కదలునది, ఉచ్ఛ్వసితనిఃశ్వసిత =

ఉచ్ఛ్వాసనిశ్వాసములచే, ఉత్తరళమ్ = ఊగునట్టిది, ఫణిపతి = ఆదిశేషుడను, డోళికాతళిమం = తూగుటుయ్యాల మంచమును, ప్రణతాః = నమస్కరించువారమై, ఆశ్వసిమః = ఓదార్పునొందితిమి.

**వరివస్య :–** ఈ శ్లోకము మొదలుకొని శ్రీరంగనాథుని మూలమూర్తి స్తుతింపబడుచున్నాడు. ముందుగా, భట్టరు శ్రీరంగనాథునకు శయ్యగా నిత్యకైంకర్యమును చేయు ఆదిశేషునకు ప్రణమిల్లుచున్నారు. శ్రీరంగనాథునితో పాటు ఆదిశేషుడు స్తుతింపబడుచున్నాడని కొందఱి అభిప్రాయము. ఆదిశేషునివలె తామును భగవానునకు శయ్యగా కావలెనను ఆశను కవి పరోక్షముగా ఇందు తెలియజేసిరని చెప్పవచ్చును.

ఆదిశేషుని పడగలు మంచమునకు పైన తెల్లని వస్త్రములతో కట్టబడు మేలుకట్టువలె ఉన్నవి. ఆ పడగలపై మెఱయుచున్న రత్నముల వరుస అచట దీపము అమర్చినట్లున్నది. ఆదిశేషుని శరీరము చక్కని పూమాలవలె అందమైనది, మెత్తనిది, పరిమళమును కల్గినది. అట్టి ఆదిశేషుని శరీరమున శ్రీరంగనాథుడు సుఖముగా శయనించియున్నాడు. శ్రీరంగనాథునకు నిత్యము శయనమై, మోయుటచే కల్గిన అతిశయమైన గర్వముచే ఆదిశేషుడు మెల్లగా ఉచ్ఛ్వాసనిఃశ్వాసములను చేయుటవలన, అతని దేహము ఊయలవలె మెల్లగా ఊగుచున్నది. అట్లు తూగుటుయ్యాల మంచమువలెనున్న ఆదిశేషునకు నమస్కరించిన మేము, స్వామికి తగిన కైంకర్యమును చేయువారెవ్వరును లేరే! అను అతృప్తిని తీరినవారమై, ఓదార్పును పొందితిమి – అని శ్లోకభావము.

నమ్మాళ్వార్లు "**వాళుమ్ విల్లుమ్ కొణ్డు పిన్ శెల్వార్ మ*ఱ్ఱి*ల్లై**" (తి. వా. 8-3-3) రక్షించుటకై కత్తిని, విల్లును గొని అనుసరించువారు ఎవ్వరును మఱిలేరే!) అనుచు అసంతృప్తిని చెందిరి. అట్టి భావమును గల్గిన భట్టరు ఆదిశేషులను దర్శించిన పిమ్మట సమాధానపడిరని ఇచటి శ్లోకతాత్పర్యము.

**"శెన్ఱాల్ కుడైయామ్, ఇరున్దాల్ శిఙ్గాశనమామ్,**
**నిన్ఱాల్ మరవడియామ్, నీళ్ కడలుళ్ ఎన్ఱుమ్**

**పుణైయామ్, మణివిళక్కామ్, పూమ్ పట్టామ్, పుల్ కు**
**మణైయామ్ తిరుమాఱ్కు్‌రవు" (ముదల్. తి. –53)**

శ్రియఃపతి అయిన భగవానుడు ప్రయాణమై వెళ్ళినప్పుడు, ఆదిశేషుడు ఆ స్వామికి గొడుగు అవుతాడు. కూర్చున్నప్పుడు సింహాసనం అవుతాడు. నిలబడితే పాదుకలు అవుతాడు. సముద్రంలో పరుండేటప్పుడు ఎల్లప్పుడూ పడుకగా అవుతాడు. మణిదీపం అవుతాడు. పీతాంబరం అవుతాడు. తలదిండు అవుతాడు) అను సరోయోగి శ్రీసూక్తి,

**"నివాసశయ్యాసనపాదుకాంశుకోపధానవర్షాతపవారణాదిభి:,**
**శరీరభేదైః తవ శేషతాం గతైః యథోచితం శేష ఇతీరితే జనైః" (41)**

(భగవంతునకు ఆదిశేషుడు నివాసంగా, పడుకగా, ఆసనంగా, పాదుకలుగా పీతాంబరంగా, తలదిండుగా, ఎండనుండి, వాననుండి రక్షించే గొడుగు మొదలైన అనేక విధాలైన రూపాలను పొంది, నీకు తగిన విధంగా కైంకర్యాన్ని చేసే శేషత్వస్థితిని పొందడంచేత, అతడు జనులచేత "**శేషుడు**" అని చెప్పబడుతున్నాడు) అను స్తోత్రరత్నశ్లోకరత్నమును ఇచట అనుసంధేయములు.

ముందు శ్లోకమున భట్టరు "**దాస్యం చ ధత్తాం మయి**" అని నిత్యకైంకర్య ప్రార్థనను చేసెను. ఈ శ్లోకమున సర్వవిధ సర్వకాల సర్వావస్థలలోను భగవత్కైంకర్యమును నిర్వహించు ఆదిశేషునకు నమస్కరించుట ద్వారా, తానును అట్టి కైంకర్యమొనర్పవలెనను తమ ఆశను సూచించిరి – అని చెప్పనగును. "**సుదామరుచిమ్రదిమసుగంధి**" అనుటచే, శయనమునకు ఉండదగిన అయిదు గుణములలో ధావళ్యము, మెత్తనిదనము, సౌగంధ్యములు చెప్పబడినవి. మిగిలిన రెండు గుణములగు శైత్య, వైశాల్యములు పరోక్షముగా సూచింపబడినవని తెలియనగును. కావున ఇట్టి, పంచ గుణములను కలిగిన పంచశయనముపై శ్రీరంగనాథుడు. సుఖశాయిగా నుండుటను దర్శించిన పిదప, కవి మనస్సు ఊరటను చెందినది– అని తాత్పర్యము.

**"ఆశ్వసిమః"** అనగా, ఆదిశేషుని మందమందములగు ఉచ్ఛ్వాస నిఃశ్వాసములచే మేము ప్రాణములను పొందినవారమైతిమి – అను చమత్కారము ధ్వనించుచున్నది.

శ్లోకమున మొదటి రెండు పాదములు కలసి ఒకే సమాసము. ఇందు వృత్తము నర్కుటకము. **"యది భవతో నజౌ భజలగా గురు నర్కుటకమ్"** అని వృత్తరత్నాకరమున నర్కుటక లక్షణము చెప్పబడినది. దీనికే కులటకమని, నమత్కుటకమని, అవితథమనియు పేర్లు కలవు. యతి 7వ అక్షరము పిదప కొన్ని శ్లోకములలో కానవచ్చుచున్నను, సర్వత్ర ఆనియమము పాటింపబడునట్లు తోచదు.

## పరమపురుషుడైన అనంతశాయి శ్రీరంగనాథుని ఉపాసిస్తాము

**78. వటదళ దేవకీ జఠరవేదశిరఃకమలా–**
**స్తనశఠకోపవాగ్వపుషి రంగగృహే శయితమ్ ।**
**వరద ముదారదీర్ఘభుజలోచనసంహననమ్**
**పురుష ముపాసిషీయ పరమం ప్రణతార్తిహరమ్ ॥**

**ప్ర. అ. –** వటదళ = మఱ్ఱి ఆకు, దేవకీజఠర = దేవకీదేవిగర్భము, వేదశిరసి = వేదాంతము, కమలాస్తన = లక్ష్మీవక్షోజములు, శఠకోపవాక్ = నమ్మాళ్వార్ల శ్రీసూక్తి అగు తిరువాయ్ మొళి – అనువానియొక్క, వపుషి = శరీరమువంటి శరీరమును కల్గిన, రంగగృహే = శ్రీరంగవిమానమున, శయితమ్ = శయనించినవాడు, వరదం = వరముల నొసగువాడు, ఉదార = గొప్ప, దీర్ఘ = పొడవైన, భుజ = భుజములను, లోచన = కన్నులను కల, సంహననం = శరీరమును కలవాడు, ప్రణత = తనకు నమస్కరించినవారి, ఆర్తిహరం = ఆర్తిని పోగొట్టువాడును అగు, పరమం పురుషం = పరమపురుషుడగు శ్రీరంగనాథుని, ఉపాసిషీయ = ఉపాసింతును.

**వరివస్య :–** ఈ శ్లోకమునుండి అనంతశాయి అగు శ్రీరంగనాథుని మూలమూర్తి స్తోత్రము ప్రారంభమగుచున్నది.

ప్రళయార్ణవమున పుట్టిన మఱ్ఱి ఆకు, దేవకీదేవిగర్భము, వేదశిరస్సు (వేదాంతము), కమలాకుచములు, శఠకోపసూరిచే ప్రణీతమైన తిరువాయ్ మొళి దివ్యప్రబంధము – అనునవి భగవానునకు ఎంతటి ప్రీతికరములో, శ్రీరంగవిమానమును అంతటి ప్రీతిని కల్గించును. కావున, భగవానుడగు శ్రీరంగనాథు డందు శయనించియున్నాడు. అతడు ఆశ్రితులకు, వారు కోరిన అభీష్టముల నొసగువాడు. తన పొడవైన బాహువులతో, విశాలములైన కన్నులతో కూడిన దివ్యమంగళ విగ్రహమును కలవాడు. నమస్కరించువారి బాధలను పోగొట్టువాడు. పురుషోత్తముడగు అట్టి శ్రీరంగనాథుని శరణు వేడెదను– అని శ్లోకభావము.

ఈ శ్లోకమున కవి, శ్రీరంగనాథునకు ప్రీతికరములుగా వటదళము, దేవకీజఠరము మొదలగువానిని ఉట్టంకించుటకు **"మనత్తుళ్ళాన్ మాకడల్ నీరుళ్ళాన్ మలరాళ్ తవత్తుళ్ళాన్"** (మూన్డా. తి. –3) (మంచివారి మనసులలో ఉన్నాడు, గొప్ప సముద్రంనీటిలో ఉన్నాడు. లక్ష్మీదేవి వక్షఃస్థలంలో ఉన్నాడు) అని మొదలైన ఆళ్వార్ల శ్రీసూక్తులే నిదానమని చెప్పవచ్చును.

**"వటదళ"** అనుటకు – **"ఆలమామరత్తి నిలైమేల్"** (అమల–9) (మఱ్ఱి ఆకు పైన) అని మొదలైన సూక్తులు, **"దేవకీజఠర"** అనుటకు, **"దేవి! జాతోఽహం తవోదరాత్"** (వి. పు. 5–3) (దేవీ! నేను నీ కడుపున పుట్టాను), **"దేవకీపూర్వసంధ్యాయా మావిర్భూతం మహాత్మనా"** (వి. పు. 5–3–1) (దేవకి అనే తూర్పుసంధ్యలో మహాత్ముడైన శ్రీకృష్ణుడు ఆవిర్భవించాడు) అను మొదలైన మహర్షివచనములు, **"మక్కళ్ అఱువరై ఇఴన్దవళ్ తన్ వయిఱ్ఱిలే, శిక్కెన వన్దు పిఱన్దు నిన్డాయ్!"** (పెరి. తి. –5–3–2) (తన కుమారులను ఆరుగురిని పోగొట్టుకున్న దేవకీదేవి గర్భములో చక్కగా ప్రవేశించి, జన్మించావు) అను పెరియాళ్వార్ల శ్రీసూక్తియు అనుభావ్యములు.

**"వేదశిరః"** అనుటకు, **"శుడర్ మికు శురుదియుళ్ ఇవై యుణ్డ శురనే"** (ఈ చరాచరములను అన్నిటిని మింగిన ఈ పరమాత్మ ప్రకాశించే వేదాలలో ఉన్నాడు) (తి. వా. 1–1–1) మొదలయిన సూక్తులును, **"శఠకోపవాక్"** అనుటకు, ప్రసిద్ధములగు పలు ఐతిహ్యములును స్మరింపదగినవి. మఱియు, ఈ సందర్భమున **"అరుమామాయత్తు ఎనదుయిరే మనమే వాక్కే కరుమమే"** (తి. వా. –10–7–9) (వేంకటాచలము మొదలైన దివ్యదేశములతో సమానముగా నా శిరస్సును, దాటాడానికి వీలుకాని ప్రకృతితో కలసి ఉండే నా ఆత్మను, నా మనసును, నా వాక్కును, నా క్రియలను జగత్కారణభూతుడైన ఆ సర్వేశ్వరుడు భావించి నన్ను ఒక్క క్షణం కూడా విడువకుండా ఉన్నాడు) అను నమ్మాళ్వార్ల పాశురమును ఉట్టంకింపదగినది.

**'కమలాస్తనశఠకోపవాక్'** అను సమాసమున గల పదముల సమభివ్యాహారమువలన సర్వేశ్వరునకు లక్ష్మీదేవివక్షఃస్థల మెంతటి ప్రీతికరమో, తిరువాయ్ మొళి దివ్యప్రబంధమును అంతటి ప్రీతిని కల్గించునను అర్థవిశేషము వ్యక్తమగుచున్నది. **"శఠకోపవాక్ వపుషి"** అనునపుడు నమ్మాళ్వార్ల శ్రీసూక్తుల యందు, తిరుమేనియందు నిలచియున్నవాడను అర్థముకూడ చెప్పనగును. ఈ అర్థమునకు ప్రోద్బలకముగా తిరువాయ్ మొళిలోని **"ఇవైయు మవైయు మువైయుమ్"** (తి. వా. –1–9–1) అను దశకార్థము, **"తిరుమాలిరుఞ్జోలై మలైయే. ––తణ్ తిరువేఙ్గడమే ఎనదుడలే వాక్కే"** (తి. వా. –10–7–9) (వనగిరి అనబడే దివ్యదేశముతో, చల్లని వేంకటాచలముతో సమానముగా నా శరీరమును వాక్కును భగవానుడు భావించుచున్నాడు) అను శ్రీసూక్తియు స్మరింపదగినవి. ఈ అర్థము వటదళాదిశబ్దములతో వపుశ్శబ్దమును కూడ కలిపి ద్వంద్వసమాసము చేసినచో వచ్చును. అట్లు కాక, **"శఠకోప వాక్"** అనునంతవరకు ద్వంద్వముగా గ్రహించి, పిమ్మట వపుశ్శబ్దముతో బహువ్రీహిగా అన్వయించిన వటదళము శఠకోపసూరివచనముల శరీరమువంటి శరీరమును కల్గినవాడను భావము ఏర్పడును. నమ్మాళ్వారుల పాశురములలో భగవంతుని

దివ్యమంగళవిగ్రహ వర్ణన పలుచోట్ల కలదుకదా. ఇచట **"తల్పం కల్పాంతయూనః"** **"శేష శ్చిత్తం విమలమనసాం మౌలయ శ్చ శ్రుతీనాం, సంపద్యంతే విహరణవిథౌ యస్య శయ్యావిశేషాః"** (ఆదిశేషుడు, స్వచ్ఛమైన మనసును కలిగినవారి చిత్తములు, వేదాంతములు – అను ఇవి ఏ భగవానుని విహారప్రకారాలలో శయ్యావిశేషాలుగా భాసిస్తున్నాయో (శ్రీస్తుతి. 5) లను దేశికసూక్తులు స్మరణీయములు.

సంహనన శబ్దమునకు అవయవ సన్నివేశవిశేషమనియు చెప్పవచ్చును. **"రంగగృహే శయితమ్ వరదమ్ ఉదారదీర్ఘభుజలోచనసంహననమ్"** అను పదముల నమభివ్యాహారముచే – శ్రీరంగమున శయనించుట భక్తులకు వరముల నిచ్చుటకు అని, అట్లు వరముల నిచ్చుటకు అనుగుణముగా ఉదారములైన పొడవైన భుజములను కన్నులను కల్గియున్నాడనియు విశేషార్థము ధ్వనించును. **"వరదం, ప్రణతార్తిహరమ్"** అను విశేషణములు శ్రీరంగనాథునకు, వరదరాజస్వామికిని మధ్య గల అభేదమును సూచించును. మఱియు, ఇవి భట్టరుకు వరదరాజస్వామి. విషయమున గల అభినివేశమును పరోక్షముగా తెలుపుచున్నవి.

ఇందు వృత్తము పూర్వమువలెనే నర్కుటకము.

## ఆదిశేషునిపై యోగనిద్రలోనుండు శ్రీరంగనాథుడు మనలను అనుగ్రహించాలి

**79. ఉదధిపరమవ్యోమ్నోః విస్మృత్య పద్మవనాలయా–**
**వినిమయమయీం నిద్రాం శ్రీరంగనామని ధామని 1**
**ఫణిపరిబృఢస్ఫారప్రశ్వాసనిశ్శ్వసితక్రమ –**
**స్ఖలితనయనం తన్వ న్మన్వీత నః పరమః పుమాన్ ॥**

**ప్ర. అ. –** ఉదధి = పాలసముద్రము, పరమవ్యోమ్నోః = పరమపదములను, విస్మృత్య = మరచి, పద్మవనాలయా = లక్ష్మీదేవికి, వినిమయమయీం =

పరివృత్తిరూపమైన, నిద్రాం = యోగనిద్రను, శ్రీరంగనామని = శ్రీరంగమను పేరును కల, ధామని = కోవెలయందు, ఫణి పరిబృఢ = ఆదిశేషునియొక్క, స్ఫార = అధికమైన, ప్రశ్వాసనిశ్వ్వసిత = ఉచ్ఛ్వాసనిశ్వాసముల యొక్క, క్రమ = క్రమముచే (వరుసచే), స్థలిత = తొట్రుపాటు పడు, నయనం = నేత్రములను కల్గినవానినిగా, తన్వన్ = (తనను) చేసికొనునట్టి, పరమః పుమాన్ = పరమపురుషుడగు శ్రీరంగనాథుడు, నః = మనలను, మన్వీత = దయతో అనుగ్రహించును గాక!

**వరివస్య :–** ఈ శ్లోకమున కవి అర్చామూర్తియొక్క వైభవమును పరోక్షముగా శ్రీరంగనాథుని స్తుతించుటద్వారా వర్ణించుచున్నారు. పూర్వశ్లోకమున భగవానునకు అభిమతములగు పలు శయ్యలను వర్ణించినను, వానిలో ముఖ్యములగు పరమపదమున ఆదిశేషుని, క్షీరాబ్ధిని మఱచితిరిగదా! అనినచో, అందులకు కవి "నేను వానిని మఱువలేదు. భగవానుడే ఆ రెండిటిని మఱచి శ్రీరంగమున ఆదిశేషునిపై పవళించెను" – అని సమాధానమును ఇందు చమత్కారముగా పల్కుచున్నారనియు చెప్పవచ్చును.

భగవానుడు పాలసముద్రమును, పరమపదమును విడచి, వాని కంటెను ఎక్కువ భోగ్యతను కల్గిన ప్రదేశమిది – అని తలచి, శ్రీరంగక్షేత్రమున శయనించి యున్నాడు. "**ఉఱంగువాన్ పోల్**" (తి. వా. – 5-4-11) (నిద్రించువానివలె) అనునట్లు నిద్రపోవువానివలె కన్నులను మూసి, యోగనిద్రలో కొంతసేపు, లక్ష్మీదేవితో కొంతసమయమును లీలారసమును అనుభవించుచున్నాడు. ఆదిశేషుని ఉచ్ఛ్వాసనిశ్వాసముల కదలికలచే తొట్రుపడు తన కన్నులతో యోగనిద్రను అభినయించునట్టి పరమపురుషుడగు శ్రీరంగనాథుడు తన మనస్సున మనలనుగూర్చి "**శుభేన మనసా ధ్యాతమ్**" (వి. పు. –5-6-28) అనునట్లు తలచి, అనుగ్రహించును గాక! – అని శ్లోకతాత్పర్యము.

కవి పరమపదమును, క్షీరాబ్ధిని విడచి భగవానుడు వచ్చెననుట **"పనిక్కడలిల్ పళ్ళికోళై ప్పళ్గకవిట్టు"** (చల్లని క్షీరాబ్ధిలో ఉండే ఆదిశేష శయనాన్ని విడిచిపెట్టి) (పెరియ. తి. 5-4-9) అనియు, **"తనిక్కడలే! తనిచ్చుడరే! తనియులకే యెన్తెన్ఱు ఉనక్కిడమా యిరుక్క"** (అద్వితీయమైన పాలసముద్రం, అద్వితీయమైన ఆదిత్య మండలం, అద్వితీయమైన పరమపదం అని చెప్పబడే ప్రదేశాలు నీకు నివాసస్థానాలుగా ఉండగా) (5-4-9) అనియు, **"వడ తడముమ్ వైకున్దముమ్ మదిళ్ తువరాపదియుమ్"** (5-4-10) (ఉత్తర దిక్కులో ఉండే పాలసముద్రం, శ్రీవైకుంఠం, ప్రాకారాలను చుట్టూ కలిగిన శ్రీద్వారక) అనియు పెరియాళ్వార్లు అనుగ్రహించిన శ్రీసూక్తిని అనుసంధించుటయే. భగవానుడు క్షీరాబ్ధిని, వైకుంఠమును వీడి, తమ మనస్సును కోవెలగా చేసికొనెనని ఆళ్వార్లు పల్కగా, భట్టరు శ్రీరంగక్షేత్రమున శయనించెననిరి. **"పద్మవనాలయా వినిమయయమయీం నిద్రామ్"** అనుటకు – ఇతరవిషయములను మఱపింపచేయు స్వభావము లక్ష్మీదేవికి, నిద్రాదేవికి సమానమగుటయే హేతువు. కాని, భగవానుని నిద్ర లోకుల నిద్రవలె తమోగుణాత్మకము కాదు. జీవుల నుద్ధరించు ఉపాయమును గూర్చి స్వామి యోగనిద్రలో చింతించుచుండుటచే తనకు అన్నియు స్మరణలో ఉన్నను ఏమియు స్మరింపనివానివలె నటించును. **"స్ఖలితనయనమ్"** అనుటకు – ఆదిశేషుని ఉచ్ఛ్వాసనిశ్వాసములచే భగవానుడు కన్నులను మూయుచు, తెఱచుచున్నాడని భావము. కన్నులను తెఱచునపుడు **"కింకిణి వాయ్ చ్చెయ్ ద తామర ప్పూప్పోలే శెఙ్గణ్ శిఱుచ్చిఱుదే ఎమ్మేల్ విళ్గియావో!"** (తిరుప్పావై, - 22) (మువ్వలను పోలిన తామర పూలవలె ఉండే అందమైన ఎర్రని కన్నులను కొంచెం కొంచెం మాపై కటాక్షాలను ప్రసరింప చేయకూడదా కూడదా!) అను ఆణ్డాళ్ శ్రీసూక్తి స్మరింపనగును. **"నిద్రాం తన్వన్ పరమః పుమాన్ నః మన్వీత"** అనుటకు – నిద్రించునపుడు స్వామి కర్మకృతమైన ఏ విధమైన చింతను లేనివాడయ్యును, మనలను గూర్చి చింతించుచు, అనుగ్రహించు గాక! – అని

భావము. మనము మన కన్నులను తెఱచుకొనియున్నను, స్వామిని స్మరింపలేము. కాని, స్వామి తన కన్నులను మూసికొనియున్నను మనలను స్మరింపకుండ నిలువలేడు. ఇదియే జీవాత్మ – పరమాత్మల మధ్య గల తారతమ్యము – అని శ్రీ. ప్ర. భ. అణ్ణాస్వామియొక్క రస్యమైన వ్యాఖ్య.

ఇందు హరిణీ వృత్తము. **"రసయుగహయైః న్సౌ మ్రౌస్లౌ గో యదా హరిణీ తదా"** అని దీని లక్షణము. ఈ వృత్తమునకే 'ఋషభచరిత' మని వేరొక పేరును కలదు.

## పరమపురుషుడైన శ్రీరంగనాథుని నమస్కరిస్తాము

**80. జలధి మివ నిపీతం నీరదేనాద్రి మబ్ధౌ**
**నిహిత మివ శయానం కుంజరం వాஉ ద్రికుంజే!**
**కమలపదకరాక్షం మేచకం ధామ్ని నీలే**
**ఫణిన మధిశయానం పూరుషం వందిషీయ ॥**

**ప్ర. అ. –** నీలే = నల్లని, ధామ్ని = శ్రీరంగవిమానమునందు, ఫణినం = ఆదిశేషునిపై, అధిశయానం = పరుండియున్నవాడు. కమలపదకర అక్షం = కమలములవంటి పాదములను, చేతులను, కన్నులను కలవాడు, నీరదేన = మేఘముచే, నిపీతం = పూర్తిగా పానము చేయబడిన, జలధిమ్ ఇవ = సముద్రమువలె ఉన్నవాడు, అబ్ధౌ = సముద్రమున, నిహితం = నిలుపబడిన, అద్రిమ్ ఇవ = పర్వతమువలె, ఉన్నవాడు, అద్రికుంజే = పర్వతమునందలి పూపొదరింటిలో, శయానం = పరుండిన, కుంజరం వా = ఏనుగువలె ఉన్నవాడును అగు, పూరుషం = పరమపురుషుడగు శ్రీరంగనాథుని, వందిషీయ = నమస్కరింతుము గాక!

**వరివస్య :–** ఈ శ్లోకమున భట్టరు నల్లని శ్రీరంగవిమానమున పరుండియున్న శ్రీరంగనాథుని మూడు అపూర్వములైన ఉపమలతో

వర్ణించుచున్నారు. ఈ సందర్భమున **"అపి ఫణిపతిభావాత్"** అను 45వ శ్లోకభావము అనుసంధేయము.

మేఘముచే పూర్తిగా పానము చేయబడి, ఆ మేఘముయొక్క గర్భమున ఉన్న సముద్రమువలె, సముద్రములో నిలుపబడిన నల్లని కొండవలె, కొండమీది పూపొదలో పరుండియున్న ఏనుగువలె ఉన్నవాడు, నల్లని ఆకర్షణీయమైన శరీరవర్ణమును కలవాడు, ఆదిశేషునిపై శయనించియున్నవాడు, పరమపురుషుడగు శ్రీరంగనాథునకు నమస్కరింతుము– అని శ్లోక భావము.

ఈ శ్లోకమున, మొదటి ఉపమలో, మేఘ – విమానములకు, ఆ మేఘముచే పానముచేయబడిన సముద్రము– విమానమునందున్న శ్రీరంగనాథులకు ఉపమానోపమేయ భావము వర్ణింపబడినది. ఆ విధముగానే, రెండవ ఉపమలో – సముద్రము, విమానములకు, ఆ సముద్రమున నిలుపబడిన పర్వతము విమానమునందున్న శ్రీరంగనాథులకు, మూడవ ఉపమలో– కొండమీది పొద విమానములకు, ఆ పొదలో పరుండియున్న ఏనుగు - విమానమున శయనించియున్న శ్రీరంగనాథులకు ఉపమానోపమేయభావము వర్ణింపబడినది.

ఉపమేయమగు శ్రీరంగనాథునిగూర్చి కవి ప్రయోగించిన విశేషణములలో **"కమలపదకరాక్షమ్"**, **"ఫణిన మధిశయానమ్"** అను రెండు విశేషణములకు తగినట్లు ఉపమానములలోను విశేషములను ఊహింపనగును.

మొదటి ఉపమలో, సముద్రములో నుండు పగడములు మొదలగు ఎఱ్ఱని వస్తువులను కమలపదకరాక్షములుగను, ముత్యములు. మొదలగు తెల్లని వస్తువులను ఆదిశేషునిగను భావింపవచ్చును. అట్లే, రెండవశఉపమలో, కొండపైనుండు ఎఱ్ఱని గైరిక ధాతువులను సంభావింపనగును. మూడవ ఉపమకనుగుణముగా ఏనుగు శరీరముపైన సింధూరము మొదలగు ఎఱ్ఱని ద్రవ్యములతో చేయబడు అలంకారములను కమలపదాది విశేషణార్థముగను, ఆ

ఏనుగు సేదదీరు తెల్లని, చల్లని రత్నఫలకములను అదిశేషుని స్థానమునను ఊహింపనగును. ఈ సందర్భమున ఆధారములగు మేఘము మొదలగువానికంటె ఆధేయములగు సముద్రము మొదలగు వానియొక్క ఆధిక్యము ప్రసిద్ధమగుటచే, ఆధేయస్థానముననున్న శ్రీరంగనాథుని మహిమాతిశయము వ్యక్తమగుచున్నది. కావున వ్యతిరేకాలంకారధ్వని ఈ శ్లోకమున కలదు.

"**కమలపదకరాక్షమ్**" అనుచు భట్టరు శ్రీరంగనాథుని పాదములను, కరములను, నేత్రములను కమలములతో పోల్చుట కవి సమయానుగుణమే అయినను, "**కణ్ పాదమ్ కై కమలమ్**" (తి. వా. 2-5-3) (కనులు, పాదాలు, చేతులు తామర పూలు), "కణ్ణుమ్ శెన్దామరై, కైయుమ్ అవై, అడియుమ్ అవైయే" (నేత్రములు ఎర్రని అందమైన తామర పువ్వులు, చేతులు కూడా అవే, పాదములను అవే) (తిరువిరు. -43) వంటి ఆళ్వార్ల సూక్తులను, శ్రీవత్సాంకులు వరద రాజస్తవమున సాయించిన "**పాణిపాదవదనేక్షణశబ్దైః అంబుజాన్యపదిశన్**" (21) వంటి సూక్తులను ఇచట స్మరింపనగును.

నమ్మాళ్వార్లు తిరువిరుత్తమను దివ్యప్రబంధమున భగవానుని "**కడల్ కవర్ పుయలోడులామ్ కొణ్డల్ వణ్ణన్**" (17) (సముద్రమును పానము చేసిన నీటికణములతో తిరుగాడు మేఘముయొక్క వర్ణమును కలవాడు) అని స్తుతించిరి. భట్టరు "**జలధి మీన నిపీతం నీరదేన**" అనుచు ఈ భావమును కొలదిగా మార్చి, శ్రీరంగనాథుని సముద్రముతో ఉపమించిరి. ఆ సముద్రము కేవలము సముద్రము కాక, మేఘముచే నిశ్శేషముగా పానము చేయబడిన సముద్రమగుట ఇచటి విశేషము. భగవానుని వర్ణమునకు మేఘ, సముద్రముల వర్ణనములకును మిక్కిలి సామ్యము కలదు కదా!

ఇందు వృత్తము మాలిని.

**సముద్ర శిశువువంటి శ్రీరంగనాథుడు మనకు సుఖమును కలిగించాలి**

**81. శ్రీరంగేశయ ఇహ శర్మ నిర్మిమీతా--**
**మాతామ్రాధరపదపాణి విద్రుమో నః ॥**
**కావేరీలహరికరోపలాల్యమానో**
**గంభీరాద్భుత ఇవ తర్ణకోఽ ర్ణవస్య ॥**

**ప్ర. అ. –** ఆతామ్ర = అంతటు మిక్కిలి ఎఱ్ఱనివీ అగు, అధర = కింది పెదవి (అధరము), పద = పాదములు, పాణి = హస్తములు అను, విద్రుమః = పగడములను కల్గినవాడు, కావేరీ = కావేరీనదియొక్క, లహరి = కెరటములు అను, కర = చేతులతో, ఉపలాల్యమానః = లాలింపబడుచున్నవాడు, గంభీర = గంభీరమైన, అద్భుత = ఆశ్చర్యకరమైన, అర్ణవస్య = సముద్రముయొక్క, తర్ణక ఇవ = శిశువువలె ఉన్నవాడు అగు, శ్రీరంగేశయః = శ్రీరంగనాథుడు, నః = మనకు, ఇహ = ఇచట, శర్మ = సౌఖ్యమును, నిర్మిమీతామ్ = కలుగజేయును గాక!

**వరివస్య :–** ముందు శ్లోకమున కవి శ్రీరంగనాథుని సముద్రముతో ఉపమించెను. ఈ శ్లోకమున ఆ ఉపమానమునకు మరింత మెఱుగును దిద్దుచు, అపూర్వమైన ఉత్ప్రేక్షతో వర్ణించుచున్నారు. అపూర్వార్థసంభావనయే కదా ఉత్ప్రేక్ష.

శ్రీరంగనాథుడు సముద్రమునుండి పుట్టిన ఒక చిన్న సముద్రము. ఈ సముద్రమున గల పగడము లేమన, శ్రీరంగనాథుని ఎఱ్ఱని అధరము, కరములు, పాదములును. సద్యోజాతుడగు శిశువుయొక్క అధరములు, పాదములు, చేతులు ఎఱ్ఱగా ఉండుట సహజము. చిన్నబిడ్డను తల్లి లాలించునట్లు, శ్రీరంగనాథుడను సముద్రపోతమును కావేరీనది తన కెరటములు అను చేతులతో లాలించుచున్నది. ఇట్టి గంభీరమైన, ఆశ్చర్యకరమైన సముద్రపోతమువంటి శ్రీరంగనాథుడు మనకు సుఖమును కలిగించుగాక! – అని శ్లోకభావము.

సముద్రుడు నదులకు భర్త. కావున కావేరీనది అతని పత్ని అగును. శ్రీరంగనాథుడు సముద్రముయొక్క పోతము (బిడ్డ) కావున, కావేరీనదికిని బిడ్డ అగును. కావేరీనది శ్రీరంగనాథుడను సముద్రపోతమును కెరటములను చేతులతో లాలించుచున్నదను భావము "**కావేరీలహరికరోపలాల్యమాన**" అనుటచే ఏర్పడుచున్నది. "**తిరువరఙ్గ ప్పెరునకరుళ్ తెణ్ణీర్ పొన్ని తిరైక్కైయాల్ అడివరుడ ప్పళ్ళికొళ్ళుమ్**" (పెరుమా. తి. –1–1) (శ్రీరంగనగరమున తేటనైన నీటిని కల్గిన కావేరీనది కెరటములను చేతులతో పాదములను సేవింపగా పరుండి యుండు) అను శ్రీకులశేఖరసూరిసూక్తి ఈ సందర్భమున అనుసంధింపదగినది.

తర్ణక మనగా, అపుడే పుట్టిన బిడ్డ. "**సద్యో జాతస్తు తర్ణకః**" అని అమరనిఘంటువు. అట్టి చంటిబిడ్డ పరుండియుండుట సహజము. అట్లే, శ్రీరంగనాథుడను ఆర్ణవతర్ణకముకూడ ఆదిశేషునిపై పరుండియున్నాడని భావము "**శ్రీరంగేశయః**" అను పదమువలన కలుగుచున్నది. కావున "**శ్రీరంగేశ్వర**", అను పాఠాంతరమున స్వారస్యము లేదనియే చెప్పనగును.

ఈ శ్లోకమును అనుసరించి వేదాంతదేశికులు అభీతిస్తవమున భగవానుని, గూర్చి "**జలధిడింభడంభస్పృశః**"(2) అని పల్కిరి.

ఆళ్వార్లు పలుచోట్ల భగవానుని సముద్రముగా స్తుతించిరి. తిరుమఙ్గై మన్నన్ పెరియ తిరుమొళి ప్రబంధములో "**మామణియుమ్. తఙ్గుకిన్ఱ అలైకడల్ పోల్ ఇవరార్ కొల్!**" (గొప్ప మణులను––– కలిగి ఉన్న, కెరటములు కలిగిన సముద్రమువలె ఉండే వీరెవ్వరో కదా!) (2–8–5) అనుచు భగవానుని సముద్రముగా సాంగరూపకముతో వర్ణించుట ఈ సందర్భమున స్మరింపదగినది. "**లహరికరలాల్యమానా**" అనునపుడు లహరీశబ్దముపై హ్రస్వమును "**లక్ష్మిసంపన్నమ్**" అనుచోటవలె గ్రహింపవలెనని వాధూల వీరరాఘవాచార్యస్వామివ్యాఖ్యలో కలదు. కాని, '**లహరి**' అను హ్రస్వాంతరూపముకూడ కన్పించుచున్నది. శ్రీశంకరుల గంగాలహరిలో "**జనని**

**విజయంతాం లహరయః**" అను ప్రయోగము, ఈ స్తోత్రములోని "**ప్రచలితలహరివత్**" (86) అను ప్రయోగమును స్మరింపదగినవి.

ఇందు, అధరపదకరములను విద్రుమములతో, కెరటములను చేతులతో రూపించుటచే రూపకానుప్రాణితమైన ఉత్ప్రేక్షాలంకారము. శ్రీరంగనాథుడు సుఖమును కల్గింపవలెనని ప్రార్థించు ఈ శ్లోకము ప్రహర్షిణీవృత్తమున రచించుట కవియొక్క ఛందోవిషయకమైన ఉచితజ్ఞతను చాటుచున్నది. "**మ్నౌ జ్రౌ గస్త్రిదశయతిః ప్రహర్షిణీయమ్**" అనునది ఈ వృత్తలక్షణము. ఇట్లు కవి సందర్భోచితముగా ఛందస్సును ఉపయోగించుట ఈ స్తోత్రమున పలు శ్లోకములలో కనుపించుచున్నది.

## శ్రీరంగనాథుడు చల్లని కాలమేఘము.

**82. సించే దిమం చ జన మిందిరయా తటిత్వాన్**
**భూషామణిద్యుతిభి రింద్రధను ర్దధానః ।**
**శ్రీరంగధామని దయారసనిర్భరత్వాత్**
**అద్రౌ శయాళు రివ శీతలకాలమేఘః ॥**

**ప్ర. అ. –** ఇందిరయా = లక్ష్మీదేవిచే, తటిత్వాన్ = మెఱపు తీగను కల్గినది, భూషామణి = నగలలో పొదగబడిన మణుల, ద్యుతిభిః = కాంతులచే, ఇంద్రధనుః = ఇంద్రధనుస్సును, దధానః = ధరించునది, దయారస = దయ అను నీటితో, నిర్భరత్వాత్ = నిండియుండుటచే, శ్రీరంగధామని = శ్రీరంగము అను, అద్రౌ = పర్వతమునందు, శయాళుః = శయనించునట్టి, శీతల = చల్లని, కాలమేఘః = నల్లని మేఘము, ఇవ = వలె ఉన్న శ్రీరంగనాథుడు, ఇమం = ఈ, జనం చ = దాసుని కూడ (కరుణారసముతో), సించేత్ = అభిషేకించును గాక!

**వరివస్య :–** ముందు శ్లోకమున భట్టరు శ్రీరంగనాథుని సముద్రపోతముగా వర్ణించిరి. ఆ సముద్రపోతమును దర్శించుటచే కలుగు ఆనందము కన్నులకు మాత్రమే లభించును. అంతటితో తృప్తిని చెందువారు

కారుకదా, భట్టరు. ఆళ్వార్లవలె తమ ఇంద్రియములకు అన్నిటికిని పరిపూర్ణానుభవము కలుగవలెనని ఆశపడువారు కదా! కావున కవి ఈ శ్లోకమున శ్రీరంగనాథుని శీతలకాలమేఘముగా సావయవరూపకముతో వర్ణించుచున్నారు. కాలమేఘ మనుటవలన చక్షురింద్రియమునకే కాక, **"శీతల, సించేత్"** అను పదములచే త్వగింద్రియమునకును తృప్తి కల్గునని ఏర్పడుచున్నది. ఇది అంతయు ముక్తానుభవాపేక్షను సూచించుచున్నది.

లక్ష్మీదేవితో కలసియున్న సర్వేశ్వరుడు మెఱపు తీగతో కూడుకొనియున్న శీతలకాలమేఘమువలె ఉన్నాడు. ఆ స్వామి ధరించియున్న వివిధములైన ఆభరణములలోని మణుల కాంతులు పలు వర్ణములను కలిగియుండుటచే ఇంద్ర ధనుస్సువలె గోచరించుచున్నది. శ్రీరంగనాథుడు అను కాలమేఘము దయ అను రసమును (నీటిని) నిండుగా కల్గినదగుటచే, ఎచటికిని కదలలేక శ్రీరంగవిమానమను పర్వతమున శయనించియున్నది. ఇట్టి కాలమేఘము అపరాధినగు నన్నుకూడ అనుగ్రహించి, నా పైన కృపావర్షమును కురియు గాక!

వర్షకాలమునందలి మేఘము మెఱపుతీగతో, ఇంద్రధనుస్సుతో కూడి యుండుట సహజము, లక్ష్మీదేవి **"హిరణ్యవర్ణామ్"** (శ్రీసూక్తం) అని వేద పురుషుడు స్తుతించిన విధముగా, బంగారు రంగును కల్గినది. కావున ఆమె మెఱపుతీగతో పోల్చబడినది. నారాయణానువాకమున భగవానుని రూపము **"నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా పీతాభా స్యాత్ తనూపమా"** అని స్తుతింపబడినది. ఇచటి **"నీలతోయదమధ్యస్థా, విద్యుల్లేఖేవ భాస్వరా, పీతాభా"** అను విశేషణములు నీలతోయదము (మేఘము)ను మధ్యన గల్గిన, మేఘముయొక్క కాంతినంతటిని పూర్తిగా గ్రసించిన విద్యుల్లేఖవలె భాస్వరమైనది, భగవానుని రూపము– అను అర్థమును తెలియజేయుచున్నవని చెప్పనగును. భగవానుని రూపమునకు భాస్వరత్వ మేర్పడుటకు ఆభరణముల కాంతి కారణమయినను, లక్ష్మీదేవి కలయికవలన కూడ అట్లు

భాసించుచున్నదను భావమును తిరువాయ్ మొళిలోని **"శోదియాకి"**(3-3-5) అను పాశురమున **"శోదియాకి"** అను విశ్లేషణమునకు గల ఈడు వ్యాఖ్యానమును వివరించుచు అరుమ్బదకారులు **"పీతాభా – ఎన్గిఱదు, పిరాట్టి యోట్టై చ్చేర్తియాలే యాదల్"** (పీతాభా– పచ్చని కాంతిని కలిగినది – అనునది లక్ష్మీదేవి సంబంధంవల్ల కావచ్చు) అని పల్కిరి. నమ్మాళ్వార్లు తిరువిరుత్త ప్రబంధమున భగవానుని రూపమునుగూర్చి **"నీలముణ్ణ మిన్నన్న మేని"** (మేఘమును గ్రహించిన మెరపు అనదగిన మేని) (29) అని పల్కుట పై శ్రుత్యర్థమును అనువదించుటయే. ఇచట పెరియ పరకాలజీయర్ వ్యాఖ్యానమున **"నీలమేఘ ముళ్ కొణ్ణ మిన్నల్ పోన్టవళాల్ కుళిర్ న్ద తిరుమేని"** (నీల మేఘమును లోపల కలిగిన మెరుపువలె ప్రకాశించే లక్ష్మీదేవిచేత చల్లగా ఉండే తిరుమేని) అని వివరింపబడినది. ఈ దివ్యప్రబంధములోనే **"తిరుమాల్ తిరుమేనిషయొక్కుమ్"** (32) అను భాగమును వ్యాఖ్యానించు నమ్పిళ్లై **"పిరాట్టియోడే కూడినవన్ వడివుపోలేయాయ్ త్తు, మిన్గొడి తఴ్రువ విరుక్కిఱ ఇవత్తిన్ వడివుమ్"** (లక్ష్మీదేవితో కూడిన భగవంతుని తిరుమేనివలె, మెరపు తీగలతో కూడుకున్న ఈ మేఘముల రూపం కూడా ఉన్నది) అని పలికిరి. ఇట్లు పలు సందర్భములలో భగవానుడు, - లక్ష్మీదేవుల కలయికను మేఘ – విద్యుల్లతల కలయికతో పోల్చుటను గమనింపవచ్చును.

మఱియు, వర్షించు మేఘమే విద్యుల్లతతో కూడియుండును. కావున విద్యుల్లతతోడి కలయిక మేఘముయొక్క వర్షించు స్వభావమును తెలుపును. అట్లే, లక్ష్మీదేవిసంయోగమువలన భగవానుడు అందరిని అనుగ్రహించువాడగును.

శ్రీరంగనాథుని కాలమేఘముతో పోల్చుట దివ్యప్రబంధములలో పలుచోట్ల కన్పించును. **"అద్రౌ శయాళుః"** అనుటకు **"కున్టాడు కొఴ్రు ముకిల్ పోల్"** (పర్వతముపై సంచరించే నల్లని మేఘమువలె) (పెరియా. తి. -4-8-9) వంటి ఆళ్వార్ల పలు సూక్తులు స్మరింపదగినవి.

లోకములోని విద్యుల్లత దాహకత్వమును కలిగియుండగా, లక్ష్మి అను ఈ విద్యుల్లత కరుణామయి, మిక్కిలి శీతలస్వభావమును కల్గినది. మేఘసముడగు శ్రీరంగనాథుని కన్న ఆమె చల్లనిది. లక్ష్మీదేవికి కాంతి, సౌకుమార్యములను కలిగి ఉన్నందున ఆమెకు మెఱుపుతీగతో పోలిక కలదు.

భగవానునకు, మేఘమునకు మధ్య గల సామ్యము పలు విధములైనది. మేఘము పల్లము, – మెఱక అను భేదమును గణింపక, అంతట వర్షించునట్లే, శ్రీరంగనాథుడును భక్తులలో జాత్యాదితారతమ్యమును గమనింపక, అందరిని అనుగ్రహించును. "**నిషాదానాం నేతా**" (దయాశ, –65) ఇత్యాది సూక్తులిచట స్మరణీయములు.

మేఘము వర్షింపలేనపుడు తాను తెల్లబడును. అట్లే, భగవానుడు తాను భక్తులకు అనుగ్రహించుటకు వీలు కాని వేళ మిగుల చింతించును. వెలవెల పోవును. ఇట్లు ఇంకా ఎన్నో సామ్యములు భగవానునకు, మేఘమునకు మధ్య కలవు.

మెఱపుతో కూడిన మేఘముతో శ్రీరంగనాథుని పోల్చుటద్వారా కవి ఆశ్రయణమునకు లక్ష్మీసంబంధముయొక్క ఆవశ్యకతను సూచించెను. మఱియు, నిర్హేతుకముగా వర్షించు మేఘసామ్యమువలన భగవానుని కృపకు న్యాసాదులు అపేక్షితములు కావని తెలుపబడినట్లయినది. మేఘము తనకు ఇచ్చవచ్చిన చోట వర్షించునట్లే, భగవానుడు తనకు ఇష్టమైనవానిని అనుగ్రహించును. "**య మేవైష వృణుతే తేన లభ్యః**" (కఠ. –1–2–13) (భగవానుడు ఎవరిని వరించునో, అతనికే ఆ భగవానుడు లభించును) అని కదా శ్రుతివచనము. "**ఇమమ్**" అను సర్వనామపదము– "అనర్హుడు, అతినీచుడు" అను అర్థవిశేషమును సందర్భమును బట్టి తెలుపును. మేఘము నీచోచ్చభేదము అనునది ఏమియు లేక, అంతటా వర్షించును గదా! "**ఇందిరయా తటిత్వాన్**", "**భూషామణిభి రింద్రధనుః**" అనుచోట్ల కల తృతీయా విభక్తివలన అభేదము వ్యక్తమగుచున్నది.

"**దయారస**" అనునపుడు దయాగుణము నీటితో రూపించబడినది. కావున, ఇచట రూపకాలంకారము కలదు. "**అద్రౌ శయాళుః శీతలకాలమేఘః ఇవ**" అనుటచే ఉపమయు కలదు. కావున రూపకానుప్రాణితమైన ఉపమ ఇచటి అలంకారము. ఇందు వృత్తము వసంతతిలక.

## శ్రీరంగనాథుడను అమృత ప్రవాహమును పానము చేయుదము

**83. ఆమౌళిరత్నమకరాత్ పున రాచపద్భ్యామ్**
**ధామక్రమోన్నమదుదారమనోహరాంగమ్ ।**
**శ్రీరంగశేషశయనం నయనైః పిబామః**
**పశ్యన్మనః ప్రవణమోఘ మివామృతస్య ॥**

**ప్ర. అ. –** ఆమౌళిరత్నమకరాత్ = కిరీటమునందు గల రత్నమయమైన మకరముమొదలు, పునః = తిరిగి, అచపద్భ్యామ్ = పాదముల వరకు, ధామక్రమ = తేజస్సుయొక్క వరుసచే, ఉత్ నమత్ = ఉన్నతములై వర్థిల్లుచున్న, ఉదార = గొప్పవైన, మనోహర = మనస్సును ఆకర్షించు, అఙ్గం = అవయవములను కలవాడు, శ్రీరంగశేషశయనం = శ్రీరంగమున ఆదిశేషుని శయనముగా కలవాడు అగు శ్రీరంగనాథుని, పశ్యత్ = దర్శించువారి, మనః = మనస్సులలో, ప్రవణం = తానే వచ్చి ప్రవహించు, అమృతస్య = అమృతముయొక్క, ఓఘః ః = ప్రవాహమును, ఇవ = వలె, నయనైః = కన్నులతో, పిబామః = పానముచేయుచున్నాము (అనుభవించు చున్నాము).

**వరివస్య :–** ఈ శ్లోకమున కవి శ్రీరంగనాథుని ఒక అద్వితీయమైన అమృతప్రవాహముగా అభివర్ణించుచున్నారు. నమ్మాళ్వార్లుకూడా "**ఆరా వముదే!**" (తి. వా. 5-8-1) (అపర్యాప్తామృతమా!) అని, "**నలఙ్గడల్ అముదమెన్ గో**" (3-4-5) అనియు భగవానుని అమృతరసస్వరూపిగా స్తుతించిరికదా! పూర్వశ్లోకమున బాహ్యేంద్రియముల ఆప్యాయనము

తెలుపబడగా ఇందు అంతరింద్రియమగు మనస్సుయొక్క తృప్తి ప్రస్తావింపబడినది.

కిరీటముమొదలు పాదములవరకు గల భగవానుని వివిధ అంగములలో అపూర్వమైన కాంతి వ్యాపించియుండుటచే అవి అన్నియు మనోహరములై, ఉదారములై (భక్తుల తృష్ణను తీర్చునవై) కనుపించుచున్నని. కావున ఆ స్వామిరూపము భక్తుల నునస్సులలో ప్రవహించు అమృత ప్రవాహమువలె అనిర్వచనీయమైన ఆనందమును కలుగజేయుచున్నది. అట్టి అమృతప్రవాహమును మేము కన్నులతో మనసార పానము చేయుదుము అని శ్లోకభావము.

లోకములోని ప్రవాహము లన్నియు బయట ప్రవహింప కల్గినవే కాని, మనస్సులలో ప్రవహింపగల్గినవి కావు. కాని, భగవానుడను అమృత ప్రవాహము భక్తుల మనస్సులలో తానే వచ్చి, ప్రవహించును. కావున ఈ ప్రవాహము లోకవిలక్షణమైనది. "**నయనైః పిబామః**" అనుటకు "**అణియరఙ్గ నెన్నముదినై క్కణ్డకణ్గళ్ మతొన్నినైక్కాణావే**" (అమల. –10) అందమైన శ్రీరంగనాథుని నా అమృతమును కాంచిన కన్నులు వేరొక దానిని చూడవు) అను తిరుప్పాణాళ్వార్ల శ్రీసూక్తి స్మరణీయము.

"**ధామక్రమేణ**" అనుటకు "**సంస్థానక్రమేణ**" అను అర్థము కొన్ని పూర్వవ్యాఖ్యానములలో ఉన్నట్లు రామానుజాచార్యవ్యాఖ్యానమున కలదు. "**ధామ**" అను పదమును వ్యస్తముగా కూడ అన్వయింపవచ్చును. "**శ్రీరంగశేషశయనమ్**" అనునపుడు "**ప్రాసాదే ఖట్వాయాం శయీత**" అనునపుడువలె శ్రీరంగశేషపదముల సముచ్చయములచే ప్రణవరూపనుగు శ్రీరంగమున, శేషునిపై శయనించువాడను అర్థము ఏర్పడును. "**నయనైః పిబామః**" అనుటకు "**ఏతదేవా మృతం దృష్ట్వా తృప్యన్తి**" (ఈ అమృత స్వరూపుడయిన పరమాత్మను చూసి నిత్యసూరులు తృప్తిని పొందుతున్నారు) అను వైదికసూక్తి స్మరణీయము.

మొదటి పాదమున "**మకరాత్**" అనుటకు బదులు "**నికరాత్**" అను పాఠాంతరము కలదు. కిరీటములోని రత్నసమూహము మొదలు – అని ఆ పాఠమున కర్థము. కాని 92వ శ్లోకమున తిరిగి "**మాణిక్యమకరీలసచ్ఛృంగమ్**" అనుచు "**మకరీ**" శబ్దమును కవి ప్రయోగించుటనుబట్టి ఇచట "**మకరాత్**" అను పాఠమే తగినదని తోచును. కిరీటములో పొదగబడిన రత్నము ఆడు మొసలి ఆకారమున నున్నదని తాత్పర్యము. "**మకరాత్**" అనుటకు, తలపై ధరించు "**తురాయి**" అను ఆభరణమనియు కొందరు వ్యాఖ్యానించిరి – అని శ్రీమాన్ ప్ర. భ. అణ్ణాస్వామి వివరించిరి. "**నయనైః**" అను బహువచనస్వారస్యముచే భగవానుని లావణ్యమును దర్శించుటకు రెండు కన్నులు చాలవని, చతుర్ముఖునివలెనో, ఇంద్రునివలెనో, లేక, ఆదిశేషునివలెనో పలు నేత్రములను కల్గియుండవలెను. కావున, ఒడలంతయు కన్నులను చేసికొని ఆశ తీర దర్శింతుము – అను విశేషము స్ఫురించును. "**ప్రవణః క్రమనిమ్నోఽర్వ్యామ్**" అను అమరకోశవచనమును బట్టి ఇచట "**పశ్యన్మనఃప్రవణమ్**" అనుటకు చూచువారి మనస్సులలో స్వయముగా క్రమముగా ప్రవేశించువాడని భావము. సంస్కృతవ్యాఖ్యానమునను "**స్వయమేన పతంతమ్**" (స్వయముగానే కిందకు పడుతున్నవానిని) అని వ్యాఖ్యానింపబడినది.

**"నాసౌ పురుషకారేణ న చాప్యన్యేన హేతునా,**
**కేవలం స్వేచ్ఛయైవాహం ప్రేక్షే కంచిత్ కదాచన"**

(నేను పురుకారం కారణంగా కానీ, లేక, వేరొక కారణం చేతగాని ఎవరిని అనుగ్రహించను. కేవలం నా సంకల్పంతోనే నేను ఏదో ఒక సమయంలో ఎవరినో ఒకరిని కటాక్షిస్తాను),

**"నిర్హేతుకకటాక్షేణ మదీయేన మహామతే. ప్రాప్నువన్తి పరాం గతిమ్"** ఆ (గొప్ప బుద్ధిని కలవాడా! నిర్హేతుకమైన నా కటాక్షంతో ఉన్నతగతిని జీవులు పొందుతున్నారు) అని మొదలైన ప్రమాణములు ఇచట స్మరణీయములు.

**"ఆమౌళి"** అనునపుడు కల **"ఆఙ్"** అభివిధియందు, **"ఆచ పద్భ్యామ్"** అనునపుడు మర్యాదార్థకమున ప్రయోగింపబడినదని శ్రీఅణ్ణాస్వామి వ్యాఖ్యానించిరి. ఈ అన్వయము **"మోఘ మివాఽ మృతస్య"** అను సూక్తికి అనుగుణము. కానీ, వేంకటాచార్యవ్యాఖ్యానమున శ్లోకములోని **"ఆఙ్"** లు రెండును అభివిధియందే ప్రయోగింపబడినట్లు చూపబడినది. అనగా, పాదాగ్రములనుండి కిరీటాగ్రపర్యంతము, కిరీటాగ్రమునుండి పాదాగ్రమువరకు – అ నుభావమును ఈ అన్వయమున ఏర్పడుతున్నది. ఇట్టి అన్వయమున **"పునః"** అను పదప్రయోగమునకు సార్థక్యము ఒక విధముగా కలుగుచున్నది. మఱియు, భగవానుని విగ్రహము తేజోరూపము, తేజస్సు పైపైకి ప్రసరించు స్వభావమును కల్గినదగుటచే, **"ఆమౌళి"** అననపుడు **"అఙ్"** కు అభివిధిని చెప్పుట అర్థవంతము. శ్లోకములోని **"ఉన్నమత్"** అను పదప్రయోగమునకును ఈ అన్వయము సరిపడును. శ్లోకములోని ఉత్తరార్ధమున శ్రీరంగనాథుడు అద్భుత ప్రవాహముగా, చూచువారి మనస్సున ప్రవేశించువాడుగా వర్ణింపబడుటచే, **"ఆ చ పద్భ్యామ్"** అనునపుడు **"ఆఙ్"** కు చెప్పిన అభివిధి అర్థవంతము. ప్రవాహము ఎత్తునుండి పల్లమునకు ప్రవహించునుగదా! భగవానుడను అమృత ప్రవాహము భక్తుని మనస్సు అను పల్లపు ప్రదేశములోనికి స్వయముగానే ప్రవహించునని ఇచటి తాత్పర్యము.

శ్రీరామానుజాచార్యవ్యాఖ్యలో మొదటి **"అఙ్"** కు మర్యాదయు, రెండవ **"ఆఙ్"** కు అభివిధియు అర్థములుగా చూపబడినవి. ఈ అన్వయము **"ధామక్రమ"** అను పదప్రయోగస్వారస్యమునకు అనుగుణము.

శ్రీరంగనాథుని రూపము దర్శించు భక్తుల మనస్సులలో ప్రవహించు అమృతప్రవాహముతో పోల్చబడుటచే ఇచటి అలంకారము ఉత్ప్రేక్ష, వృత్తము వసంతతిలక.

**శ్రీరంగనాథుడు నందనవనము**

**84. అరవిందిత మంఘ్రిపాణివక్త్రైః**
**అపి తాపింఛిత మంచితాంగకాంత్యా ।**
**అధరేణ చ బంధుజీవితం శ్రీః**
**నియతం నందనయేత రంగచంద్రమ్ ॥**

**ప్ర. అ. –** అంఘ్రి = పాదములచే, పాణి = కరములచే, వక్త్రైః = ముఖముచే, అరవిందితం = తామర పూవులను కల్గినవాడుగా చేయబడినవాడు, అంచిత = అందమైన (గొప్పదైన), అంగకాంత్యా = శరీరకాంతిచే, తాపింఛితం అపి = తమాలపుష్పములను కల్గినవాడుగా చేయబడినవాడును, అధరేణ = అధరముచే, బంధుజీవితం = మంకెన పువ్వులను కల్గినవాడుగా చేయబడినవాడు, కావుననే, రంగచంద్రం = చంద్రునివంటి శ్రీరంగనాథుని, శ్రీః = లక్ష్మీదేవి, నియతం = తప్పక, నందనయేత = నందనవనముగా తలచి, ఆనందించును గాక!

**వరివస్య :–** దేవలోకములో అమృతముతోపాటు నందనవనమును ఉండును కదా! గత శ్లోకమున శ్రీరంగనాథుని అమృతప్రవాహముగా వర్ణించిన కవి, ఇందు శ్రీరంగనాథుని నందనవనముగా అద్భుతమైన ఉత్ప్రేక్షతో స్తుతించుచున్నారు. ఆనందమయుడగు భగవానుని నందనవనముగా కవి రూపించుట మిక్కిలి తగినదేకదా.

శ్రీరంగనాథుడను నందనవనమున ఆ స్వామి పాదములు, చేతులు, ముఖము అరవిందములు. స్వామి నల్లని దేహకాంతి తమాలపుష్పసముదాయము. అట్లే, ఎఱ్ఱని అధరము మంకెనపూల ప్రోవు నందనవనమున అరవిందములు, తమాలములు, మంకెనలు విరివిగా ఉండును. కావున శ్రీరంగనాథుడును నందనవనము వలె ఉన్నాడు. నందనవనమునకు లేని ప్రత్యేకత శ్రీరంగనాథునకు ఒకటి కలదు. అది ఏమన లక్ష్మీదేవికి విహారయోగ్యమగుటయే.

తిరువాయ్ మొళి, తిరువాశిరియ దివ్యప్రబంధములలో నమ్మాళ్వార్లు భగవానుని బాహువులను "**కట్పుకక్కావు**" (తిరువాశి. –1) అనుచు కల్పవృక్షముల తోపుగా వర్ణించిరి. శ్రీవత్సాంకులును సుందరబాహుస్తవమున "**సుందరభుజస్య బాహవః పారిజాతవిటపాయితర్థయః**" (52) సుందరబాహుస్వామి బాహువులు పారిజాత వృక్షము శాఖలవలె వృద్ధి చెందినవి) అనుచు స్వామిబాహువులను పారిజాతవృక్షశాఖలుగా ఉత్ప్రేక్షించిరి. భట్టరు స్వామిని ఇచట నందనవనముగా స్తుతించిరి. "**నియతమ్**" అను పదము క్రియావిశేషణముగానే కాక, ఉత్ప్రేక్షావ్యంజకముగా కూడ అన్వయింపవచ్చును. నైమిశారణ్యమను దివ్యదేశమున భగవానుని వనరూపిగా ఆరాధించుట ఇచట స్మరింపదగినది. వేదముకూడ భగవానుని "**బ్రహ్మ వనం బ్రహ్మ స వృక్ష ఆసీత్**" (యజు. ఆర. 2–7–17) అనుచు వనరూపిగ పొగడినది. "**నందనయేత**" అను లిజ్ రూపము కామచారకరణరూపమైన ఆమంత్రణార్థమున ప్రయోగింపబడినదని శ్రీరామానుజాచార్యవ్యాఖ్యలో కలదు. "**బంధుజీవితమ్**" అనుటకు, బంధూకపుష్పమనియే కాక, బంధువులకు అనగా ఆశ్రితులకు, ప్రియజనమునకు, జీవితసదృశమగు అధరము అను అర్థము ధ్వనించుచున్నది. ఈ సందర్భమున "**కర్ప్పూరమ్ నాఱుమో?**" (నాయ్ చ్చి. తి. 5) అను దశకములోని గోదాదేవి అనుభవము స్మరణీయము. "**అరవిందితమ్, తాపింఛితమ్, బంధుజీవితమ్**" అనునపుడు "**తదస్య సంజాతం తారకాదిభ్య ఇతచ్**" (5–2–36) అను సూత్రముచే "**ఇతచ్**" ప్రత్యయము వచ్చినది.

ఇందు వృత్తము అర్ధసమవృత్తవర్గమునకు చెందిన మాలభారిణి. "**విషమే ససజాగురావనోజే, సభరా యశ్చరు మాలభారిణీయమ్**" అని దీని లక్షణము.

**శ్రీరంగనాథుని పీతాంబరము, అంగరాగములు, మాలికలు అన్నీ చైతన్యవంతములే, పరస్పర శోభాధాయకములే**

**85. అన్యోన్యరంజకరుచో౽ నుపమానశోభాః**
**దివ్యస్రగంబరపరిష్కరణాంగరాగాః ।**
**సంస్పర్శతః పులకితా ఇవ చిన్మయత్వాత్**
**రంగేందుకాంతి మధికా ముపబృంహయంతి ॥**

**ప్ర. అ. –** అన్యోన్య = పరస్పరము, రంజకరుచః = శోభను కల్గించు కాంతిని కల్గినవి, అనుపమాన = సాటి లేని, శోభాః = కాంతిని కల్గినవి అగు, దివ్యస్రక్ = వనమాల, అంబర = పీతాంబరము, పరిష్కరణ = ఆభరణములు, అంగరాగాః = మైపూతలు అను ఇవి, చిత్+ మయత్వాత్ = చైతన్యరూపమును కల్గినవి అగుటచే, సంస్పర్శతః = శ్రీరంగనాథుని దివ్యదేహస్పర్శవలన, పులకితా = ఇవ గగుర్పాటును పొందినవి వలె, అధికాం = మిక్కుటమైన, రంగ+ఇందుకాంతిం = చంద్రునివంటి శ్రీరంగనాథుని శోభను, ఉపబృంహయంతి = వృద్ధిపఱచుచున్నవి.

**వరివస్య :–** శ్రీరంగనాథుని దివ్యదేహము సహజముగా అవధి లేని కాంతిని కల్గినది. అది చాలదన్నట్లు, ఆ దివ్యదేహమున కలంకరింపబడిన వనమాల, పీతాంబరము, దివ్యాభరణములు, అంగరాగములు – అను వీని వలన ఆ శోభ మిక్కుటముగా అభివృద్ధి చెందుచున్నది. అది ఎట్లనగా– వనమాల మొదలగునవి లోకములోని మాల, ఆభరణములు, పీతాంబరములవంటివి కావు, చిన్మయమూర్తులు, భగవానుని దివ్యమంగళ దేహముతో కల్గిన స్పర్శచే అవి పులకించుచున్నని, వనమాలశోభచే పీతాంబరశోభ, పీతాంబరశోభచే వనమాలశోభ – ఇట్లు ఒక్కొక్కదాని శోభ వేరొకదాని శోభచే ఇనుమడించుచున్నవి. ఇవి అన్నియు కలసి భగవానుని శోభను అభివృద్ధిచేయు చున్నవి – అని శ్లోకభావము.

ఈ శ్లోకమును

**"స్రగ్వస్త్రాభరణైః యుక్తం స్వానురూపై రనూపమైః,**
**చిన్మయైః స్వప్రకాశై శ్చాన్యోన్యరుచిరంజకైః"**

(తనకు తగినవి, సాటి లేనివి, చిన్మయములు కావున స్వయంప్రకాశములు, పరస్పరము కాంతిని ఇనుమడింపచేసికొనునవి అగు వనమాల, పీతాంబరము, ఆభరణములతో కూడినవానిని) అను పౌష్కరసంహితలోని ప్రమాణశ్లోకమును దృష్టిలో నుంచుకొని భట్టరు రచించినట్లు తోచును. ఈ ప్రమాణములోని పదములనే కవి ప్రస్తుతశ్లోకమున యథాతథముగా ప్రయోగించుట గమనింపదగినది. "అన్యోన్యరంజకరుచః" అనుటకు పరస్పరము రంజింపజేసికొనునవి, మఱియు ప్రకాశింపచేసికొనునవి – అనియు అర్థము చెప్పవచ్చును.

చిన్మయములగు వనమాల, పీతాంబరము, ఆభరణములు, అంగరాగములు, అనునవి వేరొక చోట ఉన్నచో, వానికి ఇట్టి దివ్యానుభూతి కలుగదు. భగవానుని. దివ్యదేహస్పర్శవలన మాత్రమే వాని కట్టి ఆనందము, తత్ఫలితముగా గగుర్పాటును కల్గును. ఆహ్లాదజనకుడగు శ్రీరంగనాథచంద్రుని స్పర్శచే వానికట్టి ఆహ్లాదాతిశయము కలుగుట తగినదేకదా!

విష్ణుపురాణమున అస్త్రభూషణాధ్యాయమున భగవానుని దివ్యాస్త్రములు, ఆభరణములు అన్నియు చిన్మయములని, అచేతనములు కావని తెలుపబడినది. మఱియు, భగవద్రామానుజులు గద్యత్రయమున దివ్యాభరణములను స్తుతించుచు "**నిరతిశయసుఖస్పర్శ**" "**నిత్యనిరవద్య**" అని నుడివిరి, అంతేకాక, పీతాంబరమును దివ్యాభరణములలో చేర్చి స్తుతించిరి. స్తోత్రరత్నములోని "**స్ఫురత్కిరీటాంగద**" (36) అను శ్లోకమును వ్యాఖ్యానించు వేదాంతదేశికులు "**స్ఫురత్– ఉజ్జ్వలమితి పదాభ్యా మాభరణాదేః, విగ్రహస్య చ అన్యోన్యయోగాదపి శోభమానత్వం స్థాప్యతే**" (స్ఫురత్, ఉజ్వలమ్ –అనే రెండు పదాల ద్వారా, ఆభరణములు మొదలగువానికి దివ్యమంగళవిగ్రహము ప్రకాశమును కలిగించుచున్నదని, దివ్యమంగళ విగ్రహమునకు ఆభరణములు

మొదలగునవి ప్రకాశమును కలిగించుచున్నవని తెలియజేయబడినది) అని పల్కిరి, శఠకోపసూరిప్రణీతమైన తిరువాయ్ మొళిలోని తృతీయశతక ప్రారంభమున "**ముడిచ్చోదియాయ్ ఉనదుషముకచ్చోది. మలర్ న్దదువో?**" (3-1-1) (స్వామీ! నీ ముఖ కాంతి కిరీట కాంతిగా వికసించినదా?) అను సంశయమును వెలిబుచ్చిరి. ఈ సంశయము ఉభయకోటికము, ఉత్కటకోటికమును. ఉత్కటకోటికము నిశ్చయానుకూలము, ఉత్ప్రేక్షామూలము, కావున, ఇచట, "**స్వామీ! నీకిరీట శోభగా నీ ముఖశోభ వికసించెనా? లేక, నీ ముఖశోభగా నీ కిరీటశోభ మారెనా?**" అను సంశయద్వయమిచట వివక్షితమని నమ్పిళ్ళై ఈడు వ్యాఖ్యానమున కలదు. ఈ రెండు సంశయములును ప్రస్తుతశ్లోక భావమును బలపఱచు చున్నవి కదా! పైన ఉదహరించిన "**స్రగ్వస్త్రాభరణైః**" అను ప్రమాణమున, గద్యత్రయ వచనమున, స్తోత్రరత్న శ్లోకమున అంగరాగప్రసక్తి లేకున్నను, భగవద్గీతలోని విశ్వరూపసందర్శన యోగమున "**దివ్యగంధానులేపనమ్**" (భగీ, -11) అని అంగరాగముల ప్రసక్తి ఉండుటనుబట్టి, భట్టరు ప్రస్తుతశ్లోకమున అంగరాగపదమును చేర్చిరని చెప్పవచ్చును. నిరవధికమైన పరబ్రహ్మకాంతినికూడ దివ్యస్రగాదులు వృద్ధిచేయుట ఆశ్చర్యకరము, ఇతిహాసపురాణములు భగవత్స్వరూపమును ఉపబృంహణము చేయునట్లే, దివ్యాభరణాదులు భగవానుని రూపమును ఉపబృంహణము చేయుచున్నవి అను వ్యంగ్యము ఇచటి ఉపబృంహిత శబ్దముచే ధ్వనించుచున్నది.

"**సంస్పర్శతః పులకితా ఇవ**" అనుటచే ఇచటి అలంకారము ఉత్ప్రేక్ష. వృత్తము వసంతతిలక.

## శ్రీరంగనాథుడను మరకతమణి కాంతులు నన్ను అభిషేకించాలి

**86. ద్రుతకనకజగిరిపరిమిళదుదధి-**

**ప్రచలితలహరివదహమహమికయా।**

**స్నపయతి జన మిమమపహరతి తమః**
**ఫణిశయమరతకమణికిరణగణః ॥**

**ప్ర. అ. –** ఫణిశయ = ఆదిశేషునిపై పరుండి యుండు శ్రీరంగనాథుడను, మరతకమణి – మరతకమణి (పచ్చ) యొక్క కిరణగణః = కాంతిసమూహము, ద్రుత = కరగి స్రవించిన, కనకజగిరి = మేరుపర్వతముతో, పరిమిళత్ = కలసియున్న, ఉదధి = సముద్రమునుండి, ప్రచలిత = పైకెగసిన, లహరివత్ = కెరటములవలె, అహమహమికయా = "నేను ముందు నేను ముందు " అనునట్లు, ఇమం జనం = ఈ దాసుని, స్నపయతి = స్నానము చేయించుచున్నది. తమః = (మనస్సులోని) చీకటిని, ఆపహరతి = పోగొట్టుచున్నది.

**వరివస్య :– "మరతకవణ్ణన్"** (5-1-10) అని పెరియాళ్వార్లు, **"మేని మలర్ న్దు మరతకమే కాట్టుమ్"** (మూన్ఱామ్. తి. -87) (తిరుమేని వికసించి మరకతమణినే తలపింప జేస్తుంది) అని పేయాళ్వార్లు భగవానుని రూపము మరతకమణిసదృశమని స్తుతించిరి. ఇట్లే, మరి కొందఱు ఆళ్వార్లును ఇట్టి వర్ణనను చేసిరి. కవి ఆ క్రమమును అనుసరించుచు, ఇందు శ్రీరంగనాథుని అపూర్వమైన ఉత్ప్రేక్షద్వారా మరతకమణిరూపిగా వర్ణించుచున్నారు.

శ్రీరంగనాథుడను మరతకమణినుండి ప్రసరించు కాంతిపుంజములు బంగారు రంగును కల మేరుపర్వతము కఱగి సముద్రములో కలసినపుడు ఆ సముద్రమునుండి పై కెగయు కెరటములవలె ఉన్నవి. ఆ కాంతికెరటములు అహమహమికతో దాసుడనగు నన్ను అభిషేకించుచు, నా మనస్సులోని అజ్ఞానాంధకారమును పోగొట్టి, జ్ఞానము ప్రకాశించునట్లు చేయుచున్నవి – అని శ్లోకభావము.

ఈ శ్లోకమున **"ఫణిశయమరతకమణి"** అనునపుడు **"శ్రీరంగనాథునియొక్క మరతకమణి"** అని అర్థము చెప్పు వీలున్నను, అది స్వరసము కాదు. శ్రీరంగనాథుడే మరతకమణి అను రూపకము చెప్పుటయే

సందర్భోచితమైనది. **"వళ్లలే! మదుశూదనా!, ఎన్ మరతకమలైయే!"**(తి. వా. 2-6-4) (మహోదారుడా! మధుసూదనా! మరతక పర్వతమువంటివాడా!) అని, **"విళంగొళియై మరతకత్తై"** (ప్రకాశించు జ్యోతిని, మరతకమణివంటివానిని) అను ఇట్టి వర్ణనలు దివ్యప్రబంధమున పలుచోట్ల కన్పించుకున్నవి.

సముద్రస్థానమున శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహవర్ణము, కలిగి ప్రవహించు మేరుపర్వతస్థానమున దివ్యాభరణములు, లహరిస్థానమున కిరణసమూహమును భావింపవలెను, బంగారు రంగు, నల్లని రంగు కలసియున్న ఆ కిరణములు మరతకమణికాంతులవలె కన్పించుచు. **"నేను ముందు నేను ముందు"** అనుచు దాసుడనగు నన్ను అభిషేకించుచున్నవను కవి పల్కుట రసోక్తి. అనగా, దివ్యమంగళ విగ్రహశోభలో దాసుడగు నేను నిమగ్నుడనైతినని భావము. ఈ స్నానమువలన శరీరమాలిన్యమే కాక, మనోమాలిన్యముకూడ పోయినది, అట్టిది ఇచటి విశిష్టత.

ఈ శ్లోకమున కలిగి ప్రవహించు మేరుపర్వతస్థానమున భావింపబడు దివ్యాభరణములు కంఠోక్తిగా చెప్పబడలేదు. కావున, దివ్యమంగళ విగ్రహమునందు ఈ రెండు కాంతులును ఇమిడియున్నవని కూడ చెప్పవచ్చును. కూరేశుల సుందరబాహుస్తవములోని –

**"కనకమరతకాంజనద్రవాణాం మథనసముత్థితసారమేలనోత్థమ్.**
**జయతి కిమపి రూపమ్"** (34) (వనాద్రివాసులను సంతోషపెట్టు అందమైన ఆజానుబాహులను కల సుందరబాహుస్వామియొక్క తేజోరూపం బంగారం, పచ్చ, కాటుక – అనే వీని ద్రవాలను చిలకడం చేత వచ్చిన సారమైన భాగాలను కలపడం వల్ల పుట్టినట్లుగా ఉన్నది. అది ఒక అద్వితీయమైన రూపం. అది గొప్పగా వెలుగొందుతున్నది) అను శ్లోకభావ మిచట అనుసంధేయము.

**"ఇమమ్"** అను సర్వనామశబ్దమునకు, **"భగవానునియందు అభిముఖ్యము లేకున్నను, కేవలము అద్వేషము మాత్రమును కల ఈ దాసుని"** – అను అర్థము చెప్పవచ్చును. సర్వనామశబ్దములకు వక్తృబుద్ధిస్థములైన

భావములను తెలుపు శక్తికలదు కదా! భగవానుని అంగరాగాదులే కాక, కాంతియు చిన్మయము అనుట దానియొక్క అహమహమికత్వస్పర్థవలన స్ఫురించుచున్నది.

ప్రస్తుతశ్లోకము **"మణిగణకిరణ"** మను అపూర్వవృత్తమున రచింపబడుట విశేషము. ఇందు శ్రీరంగనాథుడను మరతకమణియొక్క కాంతివర్తనమే కదా వస్తువు. ఈ వృత్తము. **"శశికళా"** అను వృత్తముయొక్క ప్రభేదము. **"ద్విహత హయలఘుల రథగితి శశికళా"** అనునది ఈ శశికళాలక్షణము. ఈ వృత్తమే **"వసుహయ యతిరితి మణిగణకిరణ"** అను లక్షణమును బట్టి 8, 7 అక్షరములతో యతిని కల్గియున్న మణిగణకిరణమను వృత్త ణగును, దీనికే మణిగణనికరమను పేరును కలదు.

పెరియతిరుమొళి ప్రబంధములోని **"వియముడై విడైయినమ్"** (8–7) అను దశకములోని పాశురములన్నియు లఘ్వక్షరప్రచురములు. ప్రస్తుతశ్లోకము ఆ పాశురముల శైలిని తలపించును. ఈ విధముగా భట్టర్ అళ్వార్ల పాశురములలోని భావములనే కాక, ఛందస్సును కూడా అనుసరించుట విశేషము.

## శ్రీరంగనాథుని సౌరభ్యము మన మనసులను సంతోషపెట్టుచున్నది

**87. భోగీంద్రనిశ్శ్వసితసౌరభవర్ధితం శ్రీ–**
**నిత్యానుషక్తపరమేశ్వరభావగంధి ।**
**సౌరభ్య మాప్లుతదిశావధి రంగనేతుః**
**ఆనందసంపది నిమజ్జయతే మనాంసి ॥**

**ప్ర. అ. –** భోగీంద్ర = ఆదిశేషునియొక్క, నిఃశ్వసిత = నిట్టూర్పులయొక్క, సౌరభ = పరిమళముచే, వర్ధితం = పెంపొందింపబడినది. శ్రీ = లక్ష్మీ దేవియొక్క, నిత్య అనుషక్త = నిత్యసంశ్లేషముచే ఏర్పడిన, పరమ+ఈశ్వరభావ = సర్వేశ్వరత్వముయొక్క, గంధి = సువాసనను కల్గినది, ఆప్లుతదిశ అవధి = దిక్కుల చివరి వరకును వ్యాపించినది అగు, రంగనేతుః = శ్రీరంగనాథునియొక్క,

సౌరభ్యం = పరిమళము, మనాంసి = భక్తుల మనస్సులను, ఆనందసంపది = ఆనందమను సంపదయందు, నిమజ్జయతే = ఓలలాడించుచున్నది.

**వరివస్య :–** ఈ శ్లోకమున కవి శ్రీరంగనాథుని సౌరభ్యగుణమును స్తుతించుచున్నారు. "యః సర్వగంధః సర్వరసః" (ఛాందో. –3–14–4) భగవానుడు అన్ని గంధములను కలవాడు, అన్ని రసములను కలవాడు) అనుచు వేదమును భగవానుని సౌ రభ్యగుణమును ప్రస్తుతించెను కదా! ఈ సౌరభ్య గుణము దివ్య మంగళ విగ్రహమునకు చెందిన సౌరభ్యగుణముతోనే కాక, ఐశ్వర్యరూపమైన స్వరూపసౌరభ్య గుణముతో కూడా కలసి ఉండుట విశేషము. అందువలన ఇది అలౌకికము, అసాధారణమును.

ఆదిశేషుని నిట్టూర్పుల సువాసనలతో పెంపొందింపబడిన లక్ష్మీదేవియొక్క నిత్యసంశ్లేషప్రయుక్తమగు సర్వేశ్వరత్వమను గంధవిశేషమును కల్గినదగు శ్రీరంగనాథుని సౌరభ్యగుణము, నలు దిక్కుల చివరివరకును వ్యాపించినదై, భక్తుల మనస్సులను ఆనందసంపదయందు మునుగునట్లు చేయుచున్నది – అని శోక భావము

ముందు శ్లోకమున, భట్టరు, శ్రీరంగనాథుని కాంతిసముద్రమున భక్తులు స్నానమాడుటను వర్ణించిరి. స్నానమును చేసిన పిదప శరీరమున అంగరాగము అలదుకొనవలెను కదా! శ్రీరంగనాథుని దివ్యగంధమే భక్తుల మనస్సులకు ఊఱటను కల్గించు చందనము. "పూశుమ్ శాన్దు ఎన్నెఞ్జమే" (తి. వా –4–3–2) (నీవు పూసికొను చందనము నా మనస్సే) అను ఆళ్వార్ల సూక్తి చొప్పున, భక్తుల మనస్సులు భగవానునకు చల్లని చందనము అయినట్లే, భగవానుని సర్వేశ్వరత్వభావమే భక్తుల మనస్సులను చల్లబఱచు చందనము.

సహజముగానే దివ్యగంధయుక్తమగు భగవానుని మేనికి ఆ గంధమును వృద్ధి చేయు విషయములను రెండిటిని కవి ఇచట వర్ణించిరి. భగవానునితో పరమసామ్యమును పొందిన ఆదిశేషుని నిట్టూర్పులు భగవానుని దివ్యగంధముతో కలియుటచే ఆ గంధము ద్విగుణీకృతమైనది. అంతేకాక,

"గంధద్వారామ్" (శ్రీసూక్తము) అని వేదముచే ప్రస్తుతింపబడు లక్ష్మీదేవి నిత్యము స్వామితో కూడియుండుటడే ఆ దివ్యగంధము మరింత వృద్ధి అయినది. "అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా"(రా. ఆ. -37-18) (జనకుని పుత్రిక సీత ఎవనికి భార్యయో, ఆ శ్రీరాముని తేజము అలవిడరానిది) అనునట్లు లక్ష్మీదేవి నిత్యసంబంధముచే భగవానుని సర్వాధికత్వము, సర్వేశ్వరత్వమును స్పష్టపడుచున్నవి. ఈ సర్వేశ్వరత్వము లేనిచో పరిమళము ప్రకాశింపదు. లక్ష్మీదేవి నిత్యసంబంధము లేనిదే సర్వేశ్వరత్వము శోభింపదు– అను ఈ రీతిలో లక్ష్మీదేవియొక్క నిత్యసంబంధము భగవానుని సౌగంధ్యమునకే మూలకారణమైనది.

**"అస్తు శ్రీస్తనకస్తూరీవాసనావాసితోరసే"**

(లక్ష్మీదేవి వక్షస్సులో అలంకరింపబడిన కస్తూరి సువాసన చేత పరిమళింప వక్షస్సును కలిగిన వరదరాజస్వామికి మంగళం) అని అభియుక్తులైన ఆచార్యవర్యులచే ప్రణీతమైన మంగళాశాసన మిచట స్మరణీయము.

పరబ్రహ్మ అంతటను వ్యాపించియుండును కావున, ఆ పరబ్రహ్మగుణమగు సౌగంధ్యముకూడ అంతట వ్యాపించి యుండుట సహజమే కదా! కావున "**ఆప్లుతదిశావధి**" అను వాక్యము మిగుల అర్థవంతము. భగవానుని సౌలభ్యగుణము జ్ఞానశక్త్యాదులవలెనే సర్వేశ్వరత్వసూచకము – అని ఈ శ్లోక తాత్పర్యము. పరమసామ్యాపత్తివలన ఆదిశేషుడును భగవానునివలె సర్వగంధమును కలిగి యుండును. భగవానుని సౌగంధ్యము ఆదిశేషుని పరిమళముతో కలియగా, "క్షీరం శర్కరయేవ" (చక్కెరతో పాలు కలిసినట్లు) అనునట్లు మిక్కిలి రమణీయమగును. శేషశేషుల మేళనము మిక్కిలి రస్యముకదా!

శ్రీరంగనాథస్వామియొక్క కాంతిసముద్రముతో భక్తులు నిమగ్నులగుటను ముందు శ్లోకమున వర్ణించిన కవి, ఇందు ఆనందసాగరమున మునుగుటను వర్ణించుట విశేషము. "**సౌరభేణ వర్ధితా శ్రీః యస్య**" అని

బహువ్రీహిగా అన్వయింపవచ్చునని రామానుజాచార్యవ్యాఖ్యలో కలదు. కాని, పూర్వము చూపిన అన్వయమే సరసము. ఎందుకనగా, గుణముల వలన గుణికి అతిశయము కలుగునను క్రమము పరమాత్మ విషయమున వ్యత్యస్తము కదా. **"వర్ధితశ్రీ నిత్యానుషక్త"** అను పాఠాంతరమును కలదు.

**"ఆప్లుతదిశావధి"** అనునపుడు పెరుమాళ్ తిరుమొళి ప్రబంధములోని **"విరై కుழுవు మలర్ పొழிల్ శూழ்"** (5-1) (సువాసనను నిండుగా కలిగిన పూలు పూచే ఉద్యానవనాలను చుట్టూ కలిగిన) అను పాశురములోని విత్తువక్కోడు దివ్యదేశవిశేషణమును వ్యాఖ్యానించుచు పెరియవాచ్చాన్ పిళ్ళై **"సర్వగంధః – ఎన్గిఱ ప్రాప్యవస్తు కిట్టిన విడమెన్ను తోత్తి యిరుక్కు మామ్"** సర్వగంధః – అని వేదము చేత కీర్తింపబడిన ప్రాప్యవస్తువు అయిన భగవానుడు వచ్చి చేరిన చోటు అని స్పష్టమవుతున్నది –అని కూడా చెప్పవచ్చు అని పల్కుట స్మరింపదగినది.

**"మనాంసి"** అను బహువచనస్వారస్యముచే ఒక మనస్సుకాక పలు మనస్సులను కలిగియుండవలెను– అని, అవి అన్నియు ఆనందమున ఓలలాడవలెను – అను భావమును ప్రతీతమగుచున్నవి.

**"ఆనందసంపది"** అనుటచే అలంకారము రూపకము. వృత్తము వసంతతిలక.

## శ్రీరంగనాథుని సౌకుమార్యము వాచామగోచరము

**88. రంగభర్తు రపి లోచనచర్చాం సాహసావలిషు లేఖయమానమ్।**
**పుష్పహాస ఇతి నామ దుహానం సౌకుమార్య మతివాఙ్మనసం నః॥**

**ప్ర. అ. –** లోచనచర్చాం = చూచువారి చూపుల లేపనము (ప్రసరణము), అపి = కూడా, సాహస ఆవళిషు = సాహసకార్యముల వరుసలో, లేఖయమానం = వ్రాయునట్లు చేయుచున్నది, పుష్పహాస ఇతి = పుష్పహాస అను. నామ = పేరును, దుహానం = కల్గించునది. (సార్థకము చేయునది) అగు, రంగభర్తుః =

శ్రీరంగనాథునియొక్క సౌకుమార్యం = సౌకుమార్యగుణము, నః = మనకు, అతివాఙ్మనసం = వాక్కుకు, మనస్సుకు అందనిది.

**వరివస్య :–** ముందు శ్లోకమున శ్రీరంగనాథుని సౌగంధ్యమును ప్రస్తావించిన భట్టరు ఇందు స్వామి సౌకుమార్యమును ప్రస్తుతించుచున్నారు. గద్యత్రయమున భగవద్రామానుజులును శరణాగతిగద్యలో సౌగంధ్యగుణమునకు పిమ్మట సౌకుమార్యమును స్తుతించుటను ఇచట గమనింపనగును. కావున భట్టరు ఇచట ఆ క్రమమును అనుసరించియుండవచ్చును.

పూర్వశ్లోకమున ఆనందసంపదలో తమ మనస్సు నిమగ్నమగుటను కవి వర్ణించెను. వేదము భగవానుని ఆనందగుణమునుగూర్చి "**యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ**"(తై. ఉ.) (ఏ భగవానుని ఆనంద గుణమును వర్ణింప లేక, ఆ స్వామినుండి వేదవాక్కులు మనసుతో పాటుగా వెనుకకు తిరుగుతున్నవో) అని పల్కెను. ఇట్టి అవాఙ్మానసగోచరత్వము ఆనందగుణమునకే కాక, భగవానుని అన్ని గుణములకు కలదుకదా. ప్రస్తుతశ్లోకమున సౌకుమార్యగుణముయొక్క వాఙ్మనసాతీత్వము వర్ణింపబడుచున్నది.

యామునులు స్తోత్రరత్నమున "**గిరః త్వదేకైకగుణావధీప్సయా సదా స్థితా నోద్యమతోఽతిశేరతే**" (19) (నీకు కల అనేక గుణాలలో, ఏదో ఒక్క ఆనంద గుణం పరమావధిని తెలుసుకోవాలని కోరిన వేదవాక్కులు, ఏనాటికీ తమ ప్రయత్నం నుండి విరమించకుండా, ఎల్లప్పుడూ తమ ప్రయత్నాన్ని ఈ నాటికీ కొనసాగిస్తున్నవి) అని పల్కుట ఇచట స్మరణీయము.

★ "**పుష్పహాసః ప్రజాగరః**" అని వ్యాసభగవానులు శ్రీవిష్ణుసహస్రనామమున పల్కుట ఈ శ్లోకమునకు మూలము.

భక్తుల చూపులు ప్రసరించినను తాళ లేని, అనగా, భక్తులు తమ చూపులతో చూచుటకూడ సాహసమే అనదగినదగు సౌకుమార్యము

శ్రీరంగనాథునిది. కావుననే. స్వామికి పుష్పహాస అను నామము మిక్కిలి తగియున్నది. అట్టి సౌకుమార్యము మన మాటకే కాక మనస్సుకు అందనిదే – అని శ్లోకభావము.

శ్రీరంగనాథుని సౌకుమార్యమును వర్ణించుచునే మన మనస్సుకు, మాటకు అందనిది – అని కవి పల్కుట ఒక చమత్కారము, స్వామి సౌకుమార్యము భక్తుల చూపును సైతము సహింపలేనిదనుటకు, భట్టరు రచించిన శ్రీగుణరత్నకోశ స్తోత్రములోని **"చేటీభృశాలోకితైః అంగమ్లానిః"** (42) అను శ్లోకము స్మరింపదగినది. కావున, లక్ష్మీదేవిసౌకుమార్యమునకు ఏ మాత్రము తీసిపోనిది స్వామిసౌకుమార్యము– అనునది ఇచట తాత్పర్యము.

శ్రీవేదాంతదేశికులు గద్యత్రయభాష్యమున సౌకుమార్యగుణమును "మహాబలమును కల్గినను, మృదుత్వమును కల్గియుండుట" అని వివరించుచు వాల్మీకిరామాయణములోని–

**"తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ"** (రా. అ. –19–14)

(రామలక్ష్మణులు యుక్తవయసులో ఉన్నవారు, రూపసంపదను కలిగినవారు, సుకుమారులు, గొప్ప బలాన్ని కలిగినవారు) అను శ్లోకమును ఉదాహరించిరి. అందువలన భగవంతుని సౌకుమార్యగుణము లోకవిలక్షణమైనది. శ్రీరామచంద్రుని సౌకుమార్యగుణము మునులను సైతము విస్మయపరచిన విధమును వాల్మీకి భగవానులు–

**"రూపసంహననం లక్ష్మీం సౌకుమార్యం సువేషతామ్.**
**దదృశుః విస్మితాకారాః రామస్య వనవాసినః" (రా. అ. –1–12)**

శ్రీరామచంద్రుని ఆకారంలోని అవయవ సన్నివేశాన్ని, అందులోని అందాన్ని, సౌకుమార్యాన్ని, చక్కని రూపాన్ని, వనంలో నివసించే మునులు అందరూ ఆశ్చర్యమే మూర్తిభవించినట్లుగా ఉన్నవారై దర్శించారు) అని వర్ణించిరి.

గద్యత్రయమున సౌకుమార్యమునకు సమానార్థకమగు మార్దవపదమును వేదాంతదేశికులు మానసికసౌకుమార్యముగా వివరించిరి. లేకున్న పునరుక్తియగును కదా!

భగవానుని అసాధారణమైన సౌకుమార్యమును ఆళ్వారులు పలువురు పలు విధములుగా స్తుతించిరి. తిరువాయ్ మొళిలోని "**వడివిణై యిల్లా మలర్ మకళ్ మఱ్ఱ నిలైమకళ్ పిడిక్కుమ్ మెల్లడియై**" (తి. వా. -9-2-10) (రూపములో సాటి లక్ష్మీదేవి, మరియు భూదేవి సంవాహనము చేసే మృదువైన శ్రీపాదములను) అను పాశురమును నమ్పిళ్ళై వ్యాఖ్యానించుచు "**అవర్ గళుమ్ తిరువడికళై ప్పిడిక్క ప్పుక్కాల్, పూత్తొడువారైప్పోలే "కన్నుకిఱదో!" ఎన్ను కూశి త్తొడవేణుమ్బడియాయ్ త్తు సౌకుమార్య మిరుప్పదు**" (ఆ దేవేరులును, స్వామిపాదములను సంవాహనము చేయ ప్రయత్నించిన, పూవును తాకువారివలె "**కందిపోవునో ఏమో!**"అని భయపడి తాకవలసినట్లు స్వామి సౌకుమార్యముండును) అని పల్కిరి. దేవేరుల కరస్పర్శకు కందిపోవుటయే కాదు, భక్తుల చూపునుకూడ స్వామిసౌకుమార్యము సహింపలేదనుట ఇచటి విశేషము, పుష్పవికాసము పూవు కన్న సుకుమారము. అట్టి పుష్పహాసమువంటి స్వామిసౌకుమార్యము కంటి చూపుకు కందుటలో ఆశ్చర్యములేదు కదా!

కవి ఇట్లు పల్కుటకు చక్షు రింద్రియము (కన్ను) తేజోమయమగుట కారణము. కంటిచూపునుండి వెలువడు అతిస్వల్పమైన తేజమును కూడ స్వామి తిరుమేని సహింపలేదని ఇచట భావము.

"**పుష్పహాస**" పదములోని "**హాస**" శబ్దమునకు పర్యంతావయవమను అర్థమును చెప్పవచ్చును. "**పుష్పహాసశబ్దమ్ వికాసాశ్రయత్వాత్తాలే పుష్పత్తినుడైయ పర్యన్తత్తిలుణ్డాన అవయవపరమాయ్, అతుక్కు పోలే సుకుమారమానపడి**" (పుష్పహాస శబ్దం వికాసానికి ఆశ్రయం అయినందువల్ల, పుష్పం చివరిలో ఉండే భాగాన్ని తెలుపుతున్నదై, దానివలే చాలా సుకుమారమైనది– అని అర్థం) అని తిరువాయ్ మొళికి వ్యాఖ్యానమగు ఈడు

(ముదల్ శ్రియఃపతిలోని) అరుమ్బదమున వివరింపబడినది. అచటనే, **"రంగభక్తు రపి లోచనచర్చామ్– - లోచనేన క్రియమాణామ్ పరీక్షాం, శ్రీరంగనాథసౌకుమార్యం విశ్వవిలక్షణమిత్యేవం రూపాం న సహతే, కిం తు, పరీక్షమాణాం స్వయం మ్లాయతే ఇతి భావః"** (శ్రీ రంగనాథుని లోచనచర్చను కూడా, నేత్రాలతో చేయబడే పరీక్షను, అంటే, శ్రీరంగనాథుని సౌకుమార్యం విశ్వవిలక్షణమైనది– అని ఈ విధంగా రూపంలో ఉండే పరీక్షను ఆ స్వామి సౌకుమార్యం సహించదు, కానీ, పరీక్ష చేసేవాని బుద్ధియే పరీక్షను చేయలేక మలినం అవుతుంది –అని భావం) అను వేరొక విశిష్టమైన అర్థము వివరింపబడినది. "**చర్చా**" అనుటకు "**పరీక్షా**", అను అర్థము ఈ అన్వయమున గ్రహింపబడినది. ఈ భావము తిరువాయ్ మొళిలోని "**శూ ழ் త్తమరర్ తుదిత్తాల్ ఉన్ తొల్ పుగழ் మాశూణాదో?**" (తి. వా. –3–1–7) (నిత్యసూరులో బృందాలుగా చేరి నిన్ను కీర్తిస్తే, నీ సహజమైన కల్యాణ గుణాల వైభవం మలినం అవుతుంది కదా!) అను పాశురభావమును తలపింపజేయుచున్నది. ఈ వివరణము రామానుజాచార్యవ్యాఖ్యలో కూడ చూపబడినది.

ఆ వ్యాఖ్యలోనే వేఱొక విధముగా ఈ శ్లోకము వివరింపబడినది. **"రంగభర్తుః లోచనవర్చా మపి సాహసావళిషు లేఖయమానం రంగభర్తుః సౌకుమార్యం నః అతివాఙ్మనసమ్"** అను అన్వయము అచట చూపబడినది. అనగా, శ్రీరంగనాథుడు సహజముగా సుకుమారుడు. అతని నేత్రము అతని కంటె సుకుమారము. అట్టి నేత్రములతో శ్రీరంగనాథుడు తన సౌకుమార్యమును వీక్షించినను, లేక, పరీక్షించిననుకూడ, అది సాహసమే అగును – అను అర్థము అచట తెలుపబడినది. ఈ అన్వయమున "**రంగభర్తుః**" అను పదమునకు దూరాన్వయము చేయవలసిన పనిలేదు.

**"రంగభర్తు రపి నటస్య కఠినజంఘ్వాదివ్యాపారైః అంగకాఠిన్యవతః స్వాభావికం సౌకుమార్యం! ఇత్యాశ్చర్యమ్. అపినా విరోధస్ఫోరణమ్. రంగభర్తా నటః సర్వదర్శనార్థమేవ నటతి, తద్దర్శనం సాహసం! ఇత్యాశ్చర్యమ్. నటస్య**

**గాత్రవిక్షేపేషు లోచనచర్యా న్యాయ్యా"** (శ్రీ రంగనాథుడు ఒక నటుడు కఠినములైన జంఘలు మొదలైనవాటి వ్యాపారములతో అంగ కాఠిన్యాన్ని కలిగిన రంగనాథుని సౌకుమార్యం స్వాభావికమైనదా! అని ఇక్కడ ఆశ్చర్యం. ఇక్కడ ప్రయోగింపబడిన అపిశబ్దం చేత ఆ విరోధం స్ఫురిస్తున్నది. రంగనాథుడు అను నటుడు అందరి దర్శనం కోసమే నటిస్తున్నాడు. దాని దర్శనం సాహసమా! అని ఆశ్చర్యం. నటుని గాత్రవిక్షేపాలలో లోచనచర్చ న్యాయమైనది) అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్య. సహజముగా నటుడు అంగకాఠిన్యమును కలవాడైయుండును. శ్రీరంగనాథుడను నటుడు ఇట్టి అతిలోకసౌకుమార్యమును కల్గియున్నాడే! అని ఆశ్చర్యము. రంగనాథుడను నటుడు అందరి దర్శనమునకై నటించుచున్నాడు. ఆయనను దర్శించుట సాహసమా! అని ఆశ్చర్యము. లోకమున నటుని గాత్రనవిక్షేపాదులను తిలకించుట న్యాయమేకదా! – అని పై వివరణముయొక్క తాత్పర్యము.

**"అతివాఙ్మనసమ్"** అనునపుడు, భగవానుని సౌరభ్యగుణములో వలె, సౌకుమార్యమునలోను మన మనస్సులు మునిగినను, అది మన ప్రయత్నమువలన కాదు, కావున ఆ గుణమును గూర్చి పల్కుటకుగాని, చింతించుటకుగాని, మనకు శక్తి లేదు – అను భావము ధ్వనించుచున్నది.

భట్టరు ఈ విధముగా శ్రీరంగనాథుని పుష్పహాససుకుమారునిగా స్తుతించుటద్వారా వేదార్థసంగ్రహమునందలి భగవద్రామానుజుల సూక్తిని అనుసరించిరనియు చెప్పనగును. శ్రీరామానుజులు భగవానుని దివ్యరూపవర్ణనను చేయుచు, **"అత్యద్భుతాచింత్యనిత్యయౌవనః, పుష్పహాససుకుమారః, పుణ్యగంధవాసితదిగంతరాలః"** (చాలా అద్భుతమైన, ఊహించడానికి సాధ్యం కాని, నిత్యమైన యౌవనాన్ని కలిగినవాడు, పుష్పహాస సుకుమారుడు, తన పుణ్యమైన సుగంధముచేత పరిమళింపజేయబడిన దిగంతరాళాలను కలవాడు) అని సాయించిరి. ఈ శ్లోకమున పుష్పహాససుకుమారత్వము వివరింపబడగా, **"భోగీంద్రనిఃశ్వసిత"** అను ముందు

శ్లోకమున "**ఆప్లుతదిశావధి**" అనుటవలన పుణ్యగంధవాసితదిగంతరాలత్వము, "**వపుః మందారస్య**" అను తరువాతి శ్లోకమున (90వ శ్లోకమున) అత్యద్భుతాచింత్య నిత్యయౌవనత్వమును వర్ణింపబడినవనుట స్పష్టము.

నమ్మాళ్వార్లు "**పుదుమలరాకత్తు**" (తి. వా. 9-2-9) అని స్వామిదివ్యదేహమును అభినవకుసుమసదృశముగా పొగడిరి. తిరుమంగైయాళ్వార్ పెరియతిరుమొళిలో "**అరుమ్బినై యలరై**" (7-1-10) (మొగ్గ వంటివానిని, పూవువంటి వానిని) అని సాయించిరి. ఇక్కడ "**అరుమ్బినై**" యనుటద్వారా కౌమారము, "**అలరై**" అనుటవలన యౌవనము – అను అవస్థలను రెండిటిని కల్గినవాడని ఈ సూక్తియొక్క భావము. ఇచట భగవానుడు పూవుతో, మొగ్గతో పోల్చబడెను. కావున, పూవుకుండు సౌకుమార్యము స్వామి తిరుమేనికిని ఉండుననుట సిద్ధమే కదా! ప్రాయశః ఈ సూక్తిని దృష్టిలో నుంచుకొనియే భగవద్రామానుజులు భగవానుని సౌకుమార్యమును పుష్పహాసముతో పోల్చిరని చెప్పనగును. ప్రస్తుత శ్లోకభావమును "**వడివిణై యిల్లా**" (9-2-10) అను తిరువాయ్ మొళి పాశురమును దృష్టిలో నుంచుకొని ప్రతివాది భయంకరం అణ్ణన్ అను ఆచార్యులు శ్రీవేంకటేశప్రపత్తిలో,

"**సప్రేమభీతి కమలాకరపల్లవాభ్యాం సంవాహనే ౭ పి సపది క్లమ మాదధానౌ, కాంతా వవాఙ్మనసగోచరసౌకుమార్యౌ**" (ప్రేమతో, భయంతో లక్ష్మీదేవి తన చిగుళ్లవంటి చేతులతో మెల్లిగా సంభాషణ చేసినను, వెంటనే శ్రమను పొందునవి, ఆకర్షణీయమైనవి, వాక్కుకు, మనసుకు గోచరము కాని సౌకుమార్య గుణాన్ని కలిగినవి అయిన శ్రీవేంకటేశ్వరుని పాదములు) అని పల్కుట గమనింపదగినది.

శ్రీపిళ్లైలోకాచార్యులవారు అను పూర్వాచార్యులు అనుగ్రహించిన పదునెనిమిది రహస్యగ్రంథములలో అర్చిరాది ఒకటి. ఇందు గల భగవానుని దివ్యమంగళ విగ్రహ వర్ణనము ఇంచు మించుగా భట్టరు ఈ స్తోత్రమున సాయించిన శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహవర్ణనను అనుకరించుచున్నది.

ప్రస్తుతశ్లోకార్థమును ఆ ఆచార్యులు "**నిత్యసూరికళ్ అడుత్తడుత్తు ప్పార్ క్కిఱ పార్వైయుఙ్ఙ్కూడ ప్పొఱాదెన్నుమ్బడియాన సౌకుమార్యత్తైయుమ్**" (నిత్యసూరులు మెల్లిమెల్లిగా దర్శించే చూపును కూడా సహించలేని రీతిలో ఉండే సౌకుమార్యాన్ని) అనుచు అనువదించిరి.

ఇందు వృత్తము స్వాగత. "స్వాగతేతి రసభాత్ గురుయుగ్మమ్" అని దీని లక్షణము.

## శ్రీరంగనాథుని లావణ్య వైభవము

**89. ఏకైకస్మిన్ పరమవయవేఽ నన్తసౌందర్యమగ్నం**
**సర్వం ద్రక్ష్యే కథ మితి ముథా మా మథా మంద!చక్షుః! ।**
**త్వాం సౌభ్రాత్రవ్యతికరకరం రంగరాజాంగకానాం**
**తల్లావణ్యం పరిణమయితా విశ్వపారీణవృత్తి ॥**

**ప్ర. అ. –** మందచక్షుః = లావణ్యము అనునది ఒకటి ఉన్నదని తెలియని ఓ మూఢమైన నేత్రమా!, ఏకైకస్మిన్ = ఒక్కొక్క, అవయవే = అవయవములోనే, పరం = మిక్కిలి, అనంత = అంతు లేని, సౌందర్యమున, మగ్నం = మునిగిన (నేను), సర్వం = అన్ని అవయవములలోని సౌందర్యమునంతటిని, కథం = ఎట్లు, ద్రక్ష్యే = దర్శింతును?, ఇతి = అని, ముథా = వ్యర్థముగా, మా మథాః = శంకింపకుము, రంగరాజ అంగకానాం = శ్రీరంగనాథుని అవయవములకు, సౌభ్రాత్రవ్యతికరకరం = సౌహార్దసంబంధమును కల్గించు, తత్ = ఆ, లావణ్యం = లావణ్యము, త్వాం = నిన్ను, విశ్వపారీణవృత్తి = అన్ని అవయవములను పూర్తిగా అనుభవించుదానినిగా, పరిణమయితా = నెఱవేర్చును (చేయును)

**వరివస్య :–** సౌందర్యము అనగా– ప్రత్యంగశోభ, లావణ్యము ఆనగా – ఆ అంగముల కలయిక వలన ఏర్పడు సముదాయ శోభ. కవి ఇచట చమత్కారముగా తన నేత్రమును సంబోధించుచు, ఈ రెండిటిని వర్ణించుచున్నారు.

ఓ నేత్రమా! "శ్రీరంగనాథుని ఒక్కొక్క అంగములోని అపార సౌందర్యమున మునిగిన నేను స్వామి దివ్యావయవము లన్నిటిలో గల సౌందర్యమును అనుభవించుట ఎట్లు?" అని నీవు శంకింపవద్దు. స్వామి అవయనముల మధ్య సౌభ్రాత్రమును కల్గించు లావణ్యమే నిన్ను ఒక అవయవము శోభకు పిమ్మట వేరొక అంగము యొక్క శోభను అనుభవించునట్లు చేయును. కావున, నీవు అన్ని అవయవముల శోభను అనుభవింపగలవు– అని శ్లోకభావము. భగవానుని స్వరూపగుణపరామర్శ సాహసమే అగును గాక, "న సంశయ మనారుహ్యా నరో భద్రాణి పశ్యతి" (సందేహమును అధిగమించకుండా మానవుడు ఎవడును మంచి పొందలేడు) అను సూక్తినిబట్టి,

**"ఆపీతాన్మౌళిపర్యంతం పశ్యతః పురుషోత్తమ్,**
**పాతకాన్యాశు నశ్యంతి కిం పున స్తూపపాతకమ్?"**

(పాదపీఠమునుండి ఆరంభించి, కిరీటము వరకు గల భగవంతుని రూపమును దర్శించువాని పాతకములు వేగముగా నశించును. ఇక, ఉపపాతకములు, అంటే, అంతకంటే తక్కువ శక్తిని కలిగిన పాపములు కూడా నశించును – అని చెప్పవలసినది ఉన్నదా?) అను స్మృతివచనమునుబట్టి, భగవానుని సేవింపకుండ ఉండలేము. కాని, అ స్వామి దివ్యావయవ సౌందర్యమును అంతటిని అనుభవింప ఎవరికైనను అసాధ్యమే.

స్వామి ప్రత్యవయవశోభ అసాధారణము, ఒక అవయవములోని శోభను దర్శించునపుడు వేరొక అంగమునందలి శోభను దర్శింపవలెనను భావమే కలుగదు. భక్తశిఖామణి అగు కంబుడు తాను రచించిన రామాయణ కావ్యమున శ్రీరాముని ప్రత్యంగ శోభను "**తోళ్ కణ్డార్ తోళే కణ్డార్, తాళ్ కణ్డార్ తాళే కణ్డార్**" (శ్రీరాముని బాహువులను చూచినవారు ఆ బాహువులనే చూచిరి, పాదములను దర్శించినవారు ఆ పాదములనే దర్శించిరి) అని శ్రీరాముని దివ్యాంగ సౌందర్యమును పొగడిరి. కావున, అన్ని అంగములలోని రామణీయకతను అనుభవించుట ఎట్లు? అను శంక భక్తులకు కల్గుట

సహజము, కాని, లావణ్యము అనునది ఆ అన్ని అవయవముల మధ్య సూత్రమువలె నిలచి, వాటి మధ్య పరస్పరసంబంధమును కల్గించును, కావున, ఒక అవయవశోభ పిమ్మట వేరొక అవయవశోభను దర్శించు అవకాశమును ఆ లావణ్యమే కల్గించును – అని శ్లోకతాత్పర్యము.

ఇచట సౌభ్రాత్రమను పదప్రయోగము మిక్కిలి రమణీయమైనది. "**శోభనయోః భ్రాత్రోః భావః సౌభ్రాత్రమ్**" అని ఆ రూపముయొక్క విగ్రహము, అనగా, ద్వేషము లేని సోదరులమధ్యగల సంబంధమే సౌభ్రాత్రము. లోకమున భ్రాతలు పరస్పరము ఎట్టి విరోధము లేక సత్సంబంధమును కల్గియున్నచో, ఇతరులకు వారందరితో సంబంధమును కల్గియుండుటకు సాధ్యపడును. అట్లే, భగవానుని దివ్యావయవములన్నియు "**నన్ను విడచి వేరొక చోటికి పోకుము**" అని భక్తులను నిర్బంధింపకుండునట్లుగా లావణ్యము వాటి మధ్య తగిన సంబంధము నేర్పరచును. కావున భక్తులు స్వామి సర్వాంగశోభను భక్తులకు దర్శింప వీలుపడును – అని తాత్పర్యము.

"**మన్దచక్షుః**" అనుటకు, భగద్విగ్రహసౌందర్యరసపానముచే మాంద్యమును పొందిన నేత్రమా! అనియూ చెప్పవచ్చును. "**మంద!**" "**చక్షుః!**" అని వ్యస్తముగాకూడ అన్వయింపవచ్చును. "**అనంతసౌందర్య**" మనునప్పుడు "**అనంతస్య సౌందర్యమ**"– అనగా, శ్రీరంగనాథునియొక్క సౌందర్యము అనియు అర్థము చెప్పవచ్చును. అనంతుని సౌందర్యము అనంతము కావున, దానిలో మునిగిన పైకి వచ్చుట కష్టము. ఈ విధముగా అనంతశబ్దప్రయోగము సార్థకము. "**ద్రక్ష్యే**" ఆను ఆత్మనే పదప్రయోగము కర్మవ్యతిహారమున చేయబడినది. "**అమన్దకర్తృకమాన సర్వదర్శనత్తై మన్దకర్తృకమాక వ్యపదేశిక్కైయాలే అన్యయోగక్రియాకరణరూప వ్యతిహారమ్ ఇఙ్గుణ్డెన్ఱు కణ్డుకొళ్వదు**" (మందబుద్ధి లేని వారు చేసే సర్వదర్శనాన్ని మందబుద్ధిని కలిగినవారిలో ఆరోపించడం వల్ల, ఇతరుల చేయదగిన క్రియను వేరొకరిలో ఆరోపించడం అనే వ్యతిహారం ఇక్కడ ఉన్నదని గ్రహించాలి) అని ఈ

ఆత్మనేపదిప్రయోగం వాధూల వీరరాఘవాచార్యస్వామివ్యాఖ్యలో వివరింపబడింది.

**"భూయిష్ఠం తేజ ఏవాద్భిః బహులాభిః మృదూకృతమ్,**
**చక్షురానందజననం లావణ్య మితి కథ్యతే"**

(గొప్పదియు, ఎక్కువ నీటితో మృదువుగా చేయబడినది, కన్నులకు ఆనందమును కల్గించునది అగు తేజస్సు లావణ్య మనబడును) అని అహిర్బుధ్న్యసంహిత (52వ అధ్యాయము) యందు లావణ్యగుణము నిర్వచింపబడినది.

ఇందు వృత్తము మందాక్రాంత. మెల్లిమెల్లిగా శ్రీరంగనాథుని ఒక్కొక్క అవయవము అనుభవమునుండి వేరొక అవయవము అనుభవములోనికి ప్రవేశించుటను తెలుగు ఈ శ్లోకము మందాక్రాంతా వృత్తమున రచింపబడుట విశేషము.

**శ్రీరంగనాథుని యౌవనం ఆ స్వామి అందాన్ని ఇనుముడింప చేయుచున్నది**

**90. వపు ర్మందారస్య ప్రథమకుసుమోల్లాససమయః**
**క్షమాలక్ష్మీభృంగీసకలకరణోన్మాదనమధు।**
**వికాసః సౌందర్యస్రజి రసికతాశీధుచుళకో**
**యువత్వం రంగేందోః సురభయతి నిత్యం సుభగతామ్ ॥**

**ప్ర. అ.** – వపుః = శ్రీరంగనాథుని శరీరమనెడి, మందారస్య = మందారవృక్షమునకు, ప్రథమకుసుమ – మొదటి పూవు, ఉల్లాససమయః = పుష్పించు సమయము (పరువము), క్షమా = భూదేవి, లక్ష్మీ = లక్ష్మీదేవి అను, భృంగీ = ఆడు తుమ్మెదలయొక్క, సకల = సమస్త కరణ = ఇంద్రియములకు, ఉత్ మాదన = మిక్కిలి మత్తును కల్గించు, మధు = మధువు, సౌందర్యస్రజి =

అందము అను పూమాలలోని, వికాసః = వికాసము, రసికతా = రాసిక్య మనెడి, శీధు = మధువునకు, చుళకః = పుడిసిలి అగు, రంగ ఇందోః = చంద్రునివంటి శ్రీరంగనాథునియొక్క, నిత్యం = నిత్యమైన, యువత్వం = యౌవనము, సుభగతాం = సౌభాగ్యమును, సురభయతి = పరిమళింపజేయుచున్నది.

**వరివస్య** :– ఈ శ్లోకమున భట్టరు శ్రీరంగనాథుని అలౌకికతారుణ్యశోభను రమణీయమైన రూపకముద్వారా వర్ణించుచున్నారు. "ప్రవిష్టు రస్తు తవస స్తవీయాన్" (వి. సూ.) అని వేదము పల్కినట్లు భగవానుడందఱికంటెను పెద్దకదా! అట్టి పురాణపురుషుని మేను కృశించియుండవలెను కదా! అట్లయిన ముందు శ్లోకమున భగవానుని సౌందర్యలావణ్యములను కవి వర్ణించుట ఎట్లు తగును? అను శంకకు కవి ఈ శ్లోకమున పరోక్షముగా సమాధానమును పల్కుచున్నారు. ఆ వేదపురుషుడే "**యః పూర్వ్యాయ వేధసే నవీయసే**" అనుచు భగవంతుని సనాతనునిగా, అట్లే, నవీనునిగా స్తుతించెను కదా!

శ్రీరంగనాథుని యౌవనము ఆ స్వామి దివ్యదేహమనెడి మందారము మొదలుగా పుష్పించు పరువమువంటిది. అనగా, మొట్టమొదటగా మందారవృక్షము పూచునపుడు ఎట్టి కమనీయశోభను కలిగియుండునో, యౌవన ప్రాదుర్భావస్థితిని నిత్యము కలిగిన శ్రీరంగనాథుని విగ్రహము అట్టి అనిర్వచనీయశోభను కల్గియున్నది. ప్రథమకుసుమోల్లాససమయము వసంతకాలమే కదా!

మొదటి పాదమున మందారపుష్పము ప్రస్తుతమయినది. మకరందము లేని పుష్పముండదు కదా! శ్రీరంగనాథుని యౌవనము పుష్పములోని మకరందమువంటిది. ఆ మధువును గ్రోలు ఆడు తుమ్మెదలు ఎవరనగా, లక్ష్మీదేవి, భూదేవులే. స్వామియౌవనమను మధువును పానము చేయుటచే వారి సమస్తాంగములకు తమకము కల్గును, అనగా, శ్రీరంగనాథుని తారుణ్యమును దర్శించిన దేవేరులిద్దరియొక్క అన్ని అవయవములందు మత్తు

కల్గును. "**మధు**" శబ్దము మధుమాసమును, అనగా, చైత్రమాసమును నిర్దేశించును– అని చెప్పనగును, ఆ మాసమున వృక్షము లన్నియు చక్కగా పుష్పించుటచే పూలయందలి. మధువును గ్రోలిన తుమ్మెదలు మత్తును పొందుట సహజము, మఱియు, శ్రీరంగనాథుని యౌవనము సౌందర్యమను పూమాల వికసించినట్లున్నది. రాసిక్యమను మధుప్రవాహము. అణగి, పుడిసిలిలో ఇమిడియున్నట్లున్నది. స్తుతిప్రారంభమున స్వామిని "**శ్రీరంగరాజభృంగః**" అని రూపించినందుల కనుగుణముగా ఇచట శ్రీదేవి, భూదేవులను ఆడు తుమ్మెదలుగా కవి పల్కిరి.

ఈ శ్లోకమున పుడిసిలి అను అర్థమిచ్చు "**చుళక**" సదమును ప్రయోగించుట మిక్కిలి విశిష్టమైనది. రాసిక్యము బహిరంగము కాకుండ, రహస్యముగా నిలుపబడినదను భావమీ పదము వలన ఏర్పడుచున్నది. మఱియు, ఈ పదము స్వల్పపరిమాణమును సూచించునది అగుటచే, లక్షణయా నిరంకుశసంభోగముయొక్క అనభిజ్ఞతను సూచించుటచే, శ్రీరంగనాథుని యౌవనము కౌమారమిశ్రిత మనియు ఏర్పడును. కావున "**యువా ఽ కుమారః**" (ఋగ్వే, -1-155-6) అని కీర్తింపబడు పరమరసికుడగు శ్రీరంగనాథుని రాసిక్యమునకు తగిన విధముగా భట్టరు ఇచట ఇట్లు ఉచితపదప్రయోగమును చేసిరని చెప్పనగును. "**ఇవ్విడత్తిల్– అవయవస్ఫూర్తి హేతుతయా పుష్పోత్పత్తి కాలమాకవుమ్, అవయవసౌందర్య స్ఫూర్తిహేతుతయా అన్ద పుష్పవికాసమాకవుమ్, పిరాట్టిమార్ క్కు అనుభావ్యత్తైయాలే అన్ద వికసితపుష్పవృద్ధియాన తేనాకవుమ్, రసజ్ఞానహేతుతయా అన్ద మధుపానపాత్ర మాకవుమ్ యౌవనత్తై నిరూపిక్కైయాలే ఒరు చమత్కార ముణ్డు.**" (ఈ సందర్భంలో, అవయవ స్ఫూర్తిహేతువు అయినందున పూలు పూచే కాలంగానూ, అవయవ సౌందర్యస్ఫూర్తికి హేతువు అయినందున ఆ పుష్పవికాసంగానూ, దివ్యదేవేరులకు అనుభావ్యము అయినందువల్ల ఆ వికసించిన పుష్పాలలో ఏర్పడే మకరందంగానూ, రసజ్ఞాన హేతువు

అయినందువల్ల ఆ తేనెను పానం చేసే మధుపానపాత్రగాను యౌవనాన్ని నిరూపించడం వల్ల, ఒక చమత్కారం ఉన్నది), "**ప్రథమకుసుమోల్లాస మెన్త్రైయాలుమ్, అల్పపరిణామార్థ చుళుకశబ్దత్తాలుమ్ యౌవన ప్రాదుర్భావమ్ సూచితమ్**" (మొట్టమొదటగా పూలు పూసిన సమయంలో ఉండే ఉల్లాసం– అనిఅనడం వల్ల, అల్ప పరిమాణాన్ని తెలిపే చుళుక శబ్ద ప్రయోగించేత ఇక్కడ శ్రీరంగనాథుని యౌవన దశ ప్రారంభదశలో ఉన్నదని సూచింపబడింది) అని వాధూల వీరరాఘువాచార్యస్వామివ్యాఖ్యలోని రస్యవివరణము,. ఇట్టి యౌవనము లేనిదే శ్రీరంగనాథుని సౌభాగ్యము పరిమళింపదు కదా! ఇట్లు శ్రీరంగనాథుని గొప్పతనమును లోకోత్తరయౌవనము ప్రకటించుచున్నది.

"**చుళుక**" పదము అమరకోశమున కన్పింపకున్నను, "**జ్ఞాత్వా విధాతుః చుళుకాత్ ప్రసూతిమ్**" వంటి మహాకవి ప్రయోగములలో "**చుళుక**" రూపము కన్పించుచున్నది.

"**వపు ర్మందారస్య ప్రథమకుసుమోల్లాస సమయః**" అనుటచే, శ్రీరంగనాథుని యౌవనము కౌమారావస్థామిళితమని తెలియుచున్నది. పాంచరాత్రమున ఈ విషయము,

**"బృహచ్ఛరీరో ఽ పి విమానదేహో యువా కుమారత్వ ముపేయివాన్ హరిః,**
**రేమే శ్రియా ఽ సౌ జగతాం జనన్యా సుజ్యోత్స్నయా చంద్ర ఇవామృతాంశుః"**

(ఈ భగవానుడు, చాలా గొప్పదైన శరీరాన్ని కలిగినవాడు, పరిచ్ఛేదించడానికి సాధ్యం కాని దేహాన్ని కలిగినవాడు అయినప్పటికీ, కౌమారదశ చివరిలో ఉన్నవాడై, యువకుడై, లోకాలకు తల్లి అయిన లక్ష్మీదేవితో పాటుగా, వెన్నెలతో కలిసి, అమృత కిరణుడైన చంద్రుని వలె, ఆనందించాడు) అను శ్లోకమున స్పష్టము చేయబడినది. తిరుమఙ్గై యాళ్వార్లును భగవానుని "**అరుమ్బినై యలరై**" (పెరి. –7–10–1) అని స్తుతించుటద్వారా ఈ విశేషమును తెలియజేసిరి. శ్రీయామునులును, భగవద్రామానుజులును ఈ

అవస్థను "**అచింత్య, అద్భుత**" అను రెండు విశేషణములద్వారా గూఢముగా సూచించిరి. వేదమును భగవానుని "**యువా ౨ కుమారః**" అని పొగడెను కదా! ఈ కవిచేతనే ప్రణీతమైన శ్రీగుణరత్నకోశమను పేరు కల్గిన లక్ష్మీస్తోత్రమున లక్ష్మీదేవియౌవనదశనుగూర్చి "**యువదశా మపి ముగ్ధదశామ్**" (35) (యౌవన దశలో ఉన్నప్పటికీ, మొగ్గ దశలో ఉన్నది) అని వర్ణింపబడుట ఇచట స్మరింపదగినది. ఇట్లు దివ్యదంపతుల యౌవనము అనురూపమైనది.

భగవానుని యౌవనముయొక్క నిత్యత్వమును గద్యత్రయభాష్యమున వేదాంతదేశికులు వివరించుచు "**యౌవన మిహ న కాలకృతావస్థా, కింతు తాదృశోవిగ్రహస్వభావః తథ్యౌవనస్య నిత్యత్వాత్. అన్యేషా మపి హి యౌవనే కౌమారానంతర భావిత్వ ముపలక్షణ మాత్రమేవ, యువతయైవ కేషాంచిత్ ఉత్పత్తిశ్రవణాత్**" (ఇక్కడ చెప్పబడిన యౌవనము అనేది, కాలం వల్ల ఏర్పడిన పరిణామ దశ కాదు. కానీ, ఆ విధమైన విగ్రహంయొక్క స్వభావము చెప్పబడినదని భావించాలి. ఎందుకంటే, భగవానుని యౌవనము నిత్యమైనది కనుక. ఇతరుల విషయంలో కూడా ఈ విధంగానే యౌవనం కౌమార దశ తరువాత ఏర్పడడం అనేది ఉపలక్షణం మాత్రమే, ఎందుకంటే, కొందరిలో యువకులుగానే పుట్టుక సంభవించినట్లు వినబడుతున్నందువల్ల) అని పల్కిరి, భగవానుని యౌవనము లోకములోని వ్యక్తుల యౌవనమువలె కాలకృత పరిణామమువలన కలిగిన అవస్థ కాదు. విగ్రహముయొక్క స్వభావమే. కావున, అది నిత్యము. అందుచే పూర్వము ఉట్టంకింపబడిన "**యః పూర్వ్యాయ వేధసే – నవీయసే**" అను శ్రుతి అర్థవంతము. యామునులును స్తోత్రరత్నమున "**నిత్యయౌవన స్వభావ**" అనుచు యౌవనముయొక్క నిత్యత్వమును, దాని సహజతను స్తుతించిరి.

"**చంద్రం గతా పద్మగుణాన్ న భుంక్తే, పద్మాశ్రితా చాంద్రమసీ మభిఖ్యామ్, ఉమాముఖం తు ప్రతిపద్య లోలా, ద్విసంశ్రయాం ప్రీతి మవాప లక్ష్మీః**" అనుచు కాళిదాసు లక్ష్మీదేవి చంద్రునియందు లేని

సౌరభ్యాదిగుణములను, పద్మములయందు లేని చంద్రుని శోభాతిశయమును పార్వతిముఖమును ఆశ్రయించుటద్వారా పొందెను– అని కుమారసంభవమున పల్కెను, కాని, ఈ రంగచంద్రునియందు సౌరభ్య, సౌభాగ్యములు రెండును నిత్యములు. మఱియు, చంద్రునియందు యౌవనము అనిత్యము, కానీ, ఈ రంగచంద్రుని యువత్వము నిత్యము, ఇట్లు ఈ శ్రీరంగనాథచంద్రుడు లోకములోని చంద్రుని కంటే విలక్షణడు – అను వ్యంగ్యము, శ్లోకములోని నాల్గవ పాదమున భాసించుచున్నది.

ఇందు వృత్తము శిఖరిణి.

## శ్రీరంగనాథుని కిరీటంలో పొదిగిన రత్న కాంతి వైభవం

**91. కిరీటచూడరత్నరాజిరాధిరాజ్యజల్పికా ।**
**ముఖేందుకాంతి రున్ముఖం తరంగితేవ రంగిణః ॥**

**ప్ర. అ.** – రంగిణః = శ్రీరంగనాథునియొక్క, ఆధిరాజ్యజల్పికా = సర్వేశ్వరత్వమును చాటునట్టి కిరీట = కిరీటము, చూడ = శిఖాపట్టము– అను వీనియందలి, రత్న = రత్నములయొక్క, రాజిః = వరుస, ఉన్ముఖం = పై దిశలో, తరంగితా = కెరటముల రూపమున ప్రసరించిన, ముఖ –+ఇందు = ముఖ చంద్రుని యొక్క, కాంతిః(కాంతి) = శోభ, ఇవ = వలె (ఉన్నది).

**వరివస్య :–** **"స్వఫణీవితానదీప్ర"** అను 77వ శ్లోకము మొదలు 90వ శ్లోకము వరకు శ్రీరంగనాథుని మూలమూర్తియొక్క శయ్య అగు ఆదిశేషుని, శ్రీరంగనాథుని సౌందర్యము, సౌగంధ్యము, సౌకుమార్యము, లావణ్యము, నిత్యయౌవనము, దివ్యాభరణముల శోభను వర్ణించిన భట్టరు, ఈ శ్లోకమునుండి శతకము చివరి వరకు, వరుసగా, కిరీటముమొదలు పాదముల వరకు గల స్వామి దివ్యరూపమును స్తుతించుచున్నారు. 80, 81, 82, 83, 84, 85వ శ్లోకములలో భట్టరు దివ్యమంగళ విగ్రహవర్ణనను చేసినను, అంతటితో తృప్తిచెందినవారు కాకపోవుటచే, మరల ఒక నిర్దిష్టక్రమములో ఈ శ్లోకమునుండి

దివ్యమంగళ విగ్రహవర్ణనను చేయుచున్నారు. పై శ్లోకములలో అట్టి క్రమము కనుపింపదు.

ఇక్కడ ఒక సందేహము కలుగవచ్చును. అలంకారశాస్త్రములో చెప్పబడిన కవి సమయమునుబట్టి, మానవుల రూపవర్ణనను తలనుండి కాలివరకు, దేవతల రూపమును పాదములనుండి తలవరకు ఆరోహణ, అవరోహణక్రమములలో చేయవలెను.

**“మానవా మౌళితో వర్ణ్యా దేవా శ్చరణతః పునః”**

(మానవుల వర్ణనను కిరీటము నుండి చేయవలెను. దేవతల వర్ణనను పాదముల నుండి చేయవలెను) అని అలంకారశేఖరకారుడీ విషయమును స్పష్టముగ పల్కెను. సామాన్యముగా కావ్యములలో కవులనుసరించు పద్ధతి ఇదియే. కాని, ఇచట భట్టరు కిరీటము మొదలు పాదాంగుళి పర్యంతము శ్రీరంగనాథుని దివ్యదేహవర్ణనను చేయుట ఎట్లు పొసగును? అను శంక పొడముటకు అవకాశము కలదు. ఈ శంకకు రెండు, మూడు విధములుగా పరిహారమును చెప్పుటకు వీలున్నది.

పైన ఉట్టంకించినట ప్రమాణము సామాన్యమైన విధిని తెలుపును. “**నిరంకుశాః ఖలు కవయః**” (కవులు నిరంకుశులుకదా) అను సూక్తిప్రకారము, మహాకవులు అన్ని వేళల నియమముల ననుసరింపవలయుననుట కెవ్వరికిని సాధ్యము కాదు. వారు నిరంకుశులు, శాస్త్రనియమములు మహాకవుల కావ్యములనుబట్టి చెప్పబడినవే. “**ప్రయోగశరణమ్ వ్యాకరణమ్**” (లోకములో కనిపించు వ్యవహారములోని ప్రయోగములనుబట్టి వ్యాకరణ శాస్త్రము ప్రవర్తించును) అను సూక్తి వ్యాకరణశాస్త్రమునకే కాక, అన్ని శాస్త్రములందును వర్తించును.

దీనికి ఉదాహరణము ఏమనగా, మహాకవి అగు శ్రీహర్షుడు నైషధకావ్యమున మొదటి సర్గలో నలుని వర్ణనను 20, 21, 22, 23, 24, 25వ శ్లోకములలో పాదాదికేశాంతముగా చేయుట ఇచట స్మరింపదగినది. కావున,

మహాకవి అగు పరాశరభట్టర్ విషయమున పూర్వము చెప్పబడిన నియమము ప్రవర్తింపదు. ఇది ఒక విధమైన సమాధానము.

మానవులను శిరస్సునుండి, దేవతలను పాదములనుండి వర్ణింపవలెననుట సామాన్యనియమమని పూర్వోక్తమే. భగవానుని వర్ణనలో కవులు సర్వత్ర ఈ నియమమును పాటించినట్లు తోచదు. పై రెండు పద్ధతులలోను కవులు భగవద్వర్ణనను చేసిరి. తిరుప్పాణాళ్వార్లు సాయించిన "**అమలనాదిషపిరాన్**" దివ్యప్రబంధమున శ్రీరంగనాథుని విగ్రహవర్ణన పాదాదికేశాంతము చేయబడినది. వేదాంతదేశికులు ఈ క్రమములోనే భగవద్ధ్యానసోపానమును రచించిరి. కాని, ఆళ్వార్లలో ముఖ్యులుగా పేరు గాంచిన నమ్మాళ్వార్లు తిరువాయ్ మొళిలో "**ముడియానే!**" అని కిరీటమును అనుభవించి, సిమ్మట "**మూవులకుమ్ తొழுదేత్తుమ్ శీరడియానే!**" (తి. వా. – 3–8–1) (ముల్లోకాలు నమస్కరించి కీర్తించే కళ్యాణ గుణాలను కలిగిన చరణాలను కలవాడా!) అనుచు శ్రీపాదముల సొబగును పొగడిరి.

భగవద్రామానుజులు వేదార్థసంగ్రహమున భగవానుని దివ్యమంగళ విగ్రహవర్ణనను "**యోఽ సా వాదిత్యమండలాంతర్వర్తీ తప్తకార్తస్వరగిరిప్రభః**" (ఈ ఆదిత్యమండలంలో ఉండే భగవానుడు కాచి వడబోసిన బంగారపు పర్వతము వర్ణమువంటి వర్ణమును కలవాడు) అనుచు ప్రారంభించి, నేత్రముల మొదలు పాదముల పర్యంతముగా చేసిరి. గద్యత్రయమున దివ్యాభరణవర్ణనను కిరీటము మొదలు నూపురాంతముగా చేసిరి. భట్టరుకు తండ్రియు, ఆచార్యులును అగు శ్రీవత్సాంకులు సుందరబాహుస్తవమున, వరదరాజస్తవమున భగవానుని కిరీటాదిపాదాంతము వర్ణించిరి. కావున వీరిని అనుసరించుచు కవి శ్రీరంగనాథుని, విగ్రహవర్ణనను ఇచట కిరీటాదిగా చేయుచున్నారని చెప్పనగును. వేదాంతదేశికులును ఈ క్రమములోనే దేవనాయకపంచాశత్ అను స్తోత్రమును రచించుటను కూడ గనునింపనగును. ఇది ఇంకొక సమాధానము.

చిన్నబిడ్డ తల్లిస్తన్యమునందే ముందుగా దృష్టిసారించునట్లు, భక్తుడు ముందుగా స్తుతింపదగినది స్వామి పాదములనే కదా! అని శంకింపవలదు. పై రెండు క్రమములు భగవానుని, మఱియు భక్తుని దృష్టిలో నుంచుకొని చూచినచో, సుసంగతములే అగును, కావుననే, ఆళ్వార్లు ఈ రెండు క్రమములను అనుసరించిరి, పరమ శేషియగు భగవానుని దృష్టిలో నుంచుకొనినపుడు, కిరీటాదిగా వర్ణించుట, జీవుని స్వరూపమును గమనించినపుడు, పాదాదిగా వర్ణించుట తగును కదా! **"శుడర్ చ్చోది మణినిఱమాయ్ ము*ఱ్ఱ* ఇమ్మూవులకుమ్ విరికిన్ఱ శుడర్ ముడిక్కే ఒ*ఱ్ఱ*మైక్కొణ్డదుళ్ళమ్"** (7-7-10) తేజస్సు వ్యాపించు రత్నాల వన్నెను కలిగినదై, ఈ మూడు లోకాలలో అంతట విస్తరించుచున్న తేజస్సును కల భగవంతుని కిరీటము వైపే నా హృదయము చేరిపోయినది) అని తిరువాయ్ మొళి ప్రబంధమున నమ్మాళ్వార్లు సాయించిన విధముగా, స్వామికిరీటమును దర్శింపగానే మనస్సు దాని వశమగుట యుక్తమే. మరియు, చేతనునకు తన శేషత్వమునకు ప్రతిసంబంధి అగు సర్వేశ్వరుని శేషిత్వమే మొదట తోచును. ఆ శేషిత్వమును జగద్విఖ్యాతము చేయునది కిరీటము. కావున, కిరీటముతో వర్ణనను ప్రారంభించుట సమంజసమే.

తిరువాయ్ మొళి మూడవ శతకములోని ప్రథమదశక ప్రారంభములో గల **"ముడిచ్చోదియాయ్"** అను మొదటి పాశురమునకు ఈడు వ్యాఖ్యానమున పైన వివరించిన సమాధానము తెలుపబడినది. ఆ సందర్భమున అరుమ్బదకారులును కిరీటాదిగా భగవానుని దివ్యమంగళ విగ్రహవర్ణనను చేయుటకు ప్రమాణముగా ప్రస్తుతశ్లోకమును ఉదాహరించుటకూడ ఇచట. గమనింపదగినది.

శ్రీరంగమున ఆరాధన శ్రీరంగనాథుని ఆజ్ఞానుసారము పాంచరాత్ర ఆగనుమునకు చెందిన పారమేశ్వరసంహితను అనుసరించి చేయబడుచున్నది. ఈ సంహితలో శ్రీరంగవిమానము శ్రీరంగక్షేత్రమున వెలసిన వృత్తాంతము

వర్ణింపబడినది. ఆ సందర్భమున గల శ్రీరంగనాథుని దివ్యావయవ దివ్యాభరణ వర్ణనకు, ప్రస్తుతస్తోత్రమున భట్టరుచేయు వర్ణనకు పలు విధముల పోలికలు కలవు. పారమేశ్వరసంహితలో భగవానుని వర్ణన కిరీటాది నూపురాంతముగా చేయబడుటచే, భట్టరు ఆ క్రమమును ఇచట అనుసరించిరని భావింప వీలున్నది. (పారమేశ్వరసంహితలోని శ్రీరంగనాథుని వర్ణనకు సంబంధించిన శ్లోకములు ఈ వ్యాఖ్యానము చివరలో ప్రత్యేకమైన అనుబంధముగా ఇవ్వబడినవి.)

ఋగ్వేదఖిలముగ చెప్పబడు జితంతాస్తోత్రములోని నాల్గవ భాగమున **"పుండరీకాయతేక్షణ. విలాసవిక్రమా క్రాంతత్రైలోక్యచరణాంబుజ"** అని ముఖాదిపాదాంతము భగవానుని వర్ణన చేయబడుటకూడ ఇచట గమనింపదగినది.

ఈ విధముగా, ప్రస్తుతము, కిరీటాది నూపురాంతముగా భట్టరు చేసిన శ్రీ రంగనాథుని వర్ణన క్రమమును అనేక విధములుగా సమర్థింప వీలున్నది.

శ్రీరంగనాథుని ఉభయవిభూతినాధత్వమును ప్రకటించు కిరీటము, కేశ పట్టములలో పొదగబడిన పలు విధములైన రత్నముల వరుసను చూడగా, చంద్రునివంటి ఆ స్వామిముఖకాంతి పైకి ప్రసరించినట్లున్నది – అని శ్లోకభావము.

శఠకోపసూరి (నమ్మాళ్వార్లు) తిరువాయ్ మొళిలో **"ముడిచ్చోది యాయ్ ఉనదు ముకచ్చోది మలర్ న్దదువో!"** (3-1-1) (నీ ముఖకాంతి కిరీటకాంతిగా వికసించినదా?) అను శంకను వెలిబుచ్చిరి. ఈ ఉత్ప్రేక్షను అనుసరించుచు భట్టరు ప్రస్తుతశ్లోకమును రచించిరనియు చెప్పనగును. పైపాశురము **"తిరుమాలిరుమ్ శోలై"** అను దివ్యదేశములోని సుందరబాహుస్వామినిగూర్చికాగా, ప్రస్తుతశ్లోకము శ్రీరంగనాథునిగూర్చి అగుటయే ఇక్కడ భేదము.

కిరీటమునకు క్రింద. అలంకరింపబడు ముఖపట్టమునకు 'చూడా' అని పేరు. ముఖమండలమునకు పైన చూడాకిరీటములు లేకున్నను, ముఖకాంతి పైకి

కెరటములుగా వ్యాపించుటచే, అది కిరీటములుగా, కేశపట్టముగా భాసించుచున్నదనుట ప్రస్తుతశ్లోకములోని ఉత్ప్రేక్షాతాత్పర్యము. "ఆధిరాజ్యజల్పికా" అనునపుడు కూరేశులు వరదరాజస్తవమున –

**"ఆధిరాజ్య మధికం భువనానామ్, ఈశతే పిశునయన్ కిల మౌలిః"** (అన్ని లోకముల సర్వేశ్వరత్వమును సూచించుచున్నది, నీ కిరీటము) (25) అని, సుందరబాహుస్తవమున, "**విశ్వాధిరాజ్యపరిబర్హకిరీటరాజమ్**" (సమస్త విశ్వముల ఆధిపత్యానికి చిహ్నమైన గొప్ప కిరీటము) (39) అని, వేదాంతదేశికులు దేవనాయకపంచాశత్ స్తోత్రమున "**దేవేశ్వరత్వ మిహ దర్శయితుం క్షమస్తే నాథ! త్వయా శిరసా విధృతః కిరీటః**" (16) (ప్రభూ! నీవు శిరస్సులో ధరించిన కిరీటము నీవు దేవతలకు ప్రభువు అను విషయమును సూచించుటలో సమర్థమైనది) అని పల్కుట ఇచట స్మరింపదగును

కాంతి తరంగరూపమున ప్రసరించునని ప్రస్తుతభౌతికశాస్త్రము వివరించుచున్నది. ఈ శాస్త్రవిషయము "**కాంతిః తరంగితా**" అనుటద్వారా సూచింపబడుట విశేషము.

ఉభయవిభూతినాథత్వమునకు పరమప్రమాణమైన కిరీటవర్ణన ప్రమాణికా వృత్తమున రచింపబడుటయు విశేషమే. "**ప్రమాణికా జరౌ లగౌ**" అని దీని లక్షణము. దీనికే '**ప్రమాణి**' అనియు పేరును కలదు. "**తరంగితేవ రంగిణః**" అనుచోట అనుప్రాసయు కలదు.

ప్రమాణికావృత్తములోని గణములు రెట్టింపు అయిన పంచచామరవృత్తము అగును. "**ప్రమాణికాపదద్వయం వదంతి పంచచామరమ్**" అని దాని లక్షణము. కావున ఈ శ్లోకములోని మొదటి రెండు పాదములను కలిసిన పంచచామరవృత్తమున ఒక పాదము అగును.

గోపాలాచార్య వ్యాఖ్యలో ఈ వృత్తము పంచచామరమని, ఈ శ్లోకమున మిగిలిన రెండు పాదములు లభ్యమగుటలేదని తెలుపబడినది. కవి ఈ శ్లోకమును పంచచామరవృత్తమున రచించుట భగవన్ముఖమును పంచచామరముతో (ఐదు

చామరములతో) వీచి కైంకర్యమును చేయుటకా! అనునట్లున్నదని ఆ వ్యాఖ్యలో తెలుపబడినది. కావున, ఈ వ్యాఖ్యను అనుసరించి ఈ శ్లోకము అసంపూర్ణము అనవలెను. ఇట్టి పాఠము ఎచ్చటనూ కనిపింపలేదు. మిగిలిన శ్లోకార్థమును లభింపలేదు. ఇట్టి అభిప్రాయమును వేరొక వ్యాఖ్యాతయు ప్రకటింపలేదు.

## శ్రీరంగనాథునికిరీటము శ్రీరంగనాయకి లీలాపర్వతము

**92. శిఖారత్నోద్దీప్రం దిశిదిశి చ మాణిక్యమకరీ–**
**లసచ్ఛృంగం రంగప్రభుమణికిరీటం మనుమహే ।**
**సముత్తుంగస్ఫీతం చిదచిదధిరాజశ్రియ ఇవ**
**ప్రియాక్రీడం చూడామణి మపి నితంబం తమభితః ॥**

**ప్ర. అ. –** దిశి దిశి చ = అన్ని దిక్కులలోను, శిఖారత్న = చూడామణిచే, ఉద్దీప్రం = మిక్కిలి ప్రకాశించునది, మాణిక్యమకరీ = ఆడు మొసలి రూపములోనున్న మాణిక్యముచే, లసత్ = ప్రకాశించుచున్న, శృంగం = శిఖరమును (అగ్రభాగమును) కల్గినది అగు, రంగప్రభుః = శ్రీరంగనాథునియొక్క, మణికిరీటం మణిమయకిరీటమును, చిత్ అచిత్ = చేతనాచేతనములకు, అధిరాజ = నియామకుడైన భగవానునియొక్క, శ్రియః = లక్ష్మీదేవికి సముత్తుంగ = మిక్కిలి ఎత్తైన, స్ఫీతం = విశాలమైన (గొప్పదైన) పెద్దదైన, ప్రియ ఆక్రీడంః = ప్రియమైన లీలాపర్వతముగా (ఆటవస్తువుగా), మనుమహే = తలతుము, చూడామణిమ్ అపి = ముఖపట్టమున గల రత్నమును కూడ, నితంబం = ఆ పర్వతముయొక్క నితంబ ప్రదేశముగా, (మనుమహే = తలంతుము).

**వరివస్య :–** ఈ శ్లోకమున భట్టరు శ్రీరంగనాథుని కిరీటమును రాజ్యలక్ష్మి విహరించు లీలాపర్వతముగా, చూడామణిని ఆ పర్వతముయొక్క నితంబప్రదేశముగా ఉత్ప్రేక్షించుచున్నారు. పూర్వశ్లోకమునకూడ కిరీటము వర్ణింపబడినను, కిరీటము పరత్వసూచకమగుటవలన, కవి

కృతజ్ఞతాపూర్వకముగా రెండవ మారు ఈ శ్లోకమున దానిని కీర్తించుచున్నారని గోపాలాచార్యవ్యాఖ్యానమున కలదు.

శ్రీరంగనాథుని రత్నకిరీటము ఆ స్వామియొక్క సర్వేశ్వరత్వమను రాజ్యలక్ష్మి విహరించుటకై నిర్మింపబడిన లీలాపర్వతమువలె ఉన్నది. ఉభయవిభూతినాథత్వమును సూచించు ఆ కిరీటములోని రత్నముల కాంతి అన్ని దిక్కులలోను ప్రసరించి, అంతటఁ ప్రకాశవంతము చేయుచున్నది. పర్వతము రత్నములకు నిలయమైనట్లే, ఆ కిరీటమును పలు రత్నములతో కూడి యున్నది. పర్వతశిఖరము మాణిక్యములచే దీప్తిమంతమగునట్లు. స్వామికిరీటమును ఆడుమొసలి ఆకారములో కూర్చబడిన మాణిక్యము(ల)చే ప్రకాశించుచున్నది. పర్వతము ఉన్నతమై, దృఢముగా, పెద్దదిగా ఉండునట్లే, కిరీటమును, గొప్ప ఔన్నత్యమును, బృహత్త్వమును కల్గియున్నది. పర్వతమునకు క్రింది భాగమున చుట్టును విశాలమైన నితంబప్రదేశముండును. అట్లే, ఈ కిరీటము క్రింది భాగమున చుట్టును అలంకరింపబడిన ముఖపట్టములోని మణుల కాంతి నితంబమువలె ఉన్నది. ఈ విధముగా శ్రీరంగనాథుని మణిమయమకుటము అన్ని విధముల పర్వతసదృశమై యుండుటదే. స్వామియొక్క రాజ్యలక్ష్మి లీలావిహారము చేయు పర్వతమువలె శోభిల్లుచున్నది – అని శ్లోకభావము.

"**మాణిక్యమకరీలసత్ శృంగమ్**" అనునపుడు 83వ శ్లోకమున గల "**ఆమౌళిరత్నమకరాత్**" అను ప్రయోగమును స్మరింపదగును. "**నితంబం తమభితః**" అను ప్రయోగమును "**నితంబంతమ్, అభితః**" అని విడదీసి, చుట్టును గల నితంబమువలె ఉన్నదను అర్థమును చెప్పుటకు అవకాశము కలదు. "**చిదచిదధిరాజశ్రియః**" అనుటకు "**పతిం విశ్వస్య**" (వి. సూ.) వంటి వైదికప్రమాణములు, "**నారణన్ ముౘ్ౘవేౘ్ౘలకక్కుమ్ నాదన్**" (తి. వా. –2–7–2) నారాయణుడు ఏడు లోకములకు అన్నిటికీ నాథుడు) అను ఆళ్వార్ల సూక్తులును, "**విశ్వస్య చాధిపతి రస్య పరాయణం చ**" (వై. స్త. 20) విశ్వమునకు

అధిపతి, దీనికి గతి కూడా) అని మొదలైన పూర్వాచార్యవచనములును స్మరింపదగినవి.

కిరీటమును పర్వతముగా, పర్వతశిఖరముగా వర్ణించుట కవిసమయము. వాల్మీకిభగవానులు శ్రీరామాయణమున **"కిరీటకూటోజ్జ్వలితమ్"** (యుద్ధ -114) అనుచు కిరీటమును పర్వతశిఖరముగా ఉత్ప్రేక్షించిరి. నమ్మాళ్వార్లు భగవానుని కిరీటమును **"పొన్ శుడఱ్కున్ఱన పూన్దణ్ ముడియర్ క్కు"** (తి. వా. 6-6-6) (బంగారపురంగుతో ప్రకాశించు పర్వతమువలెనున్న పూవులతోకూడిన చల్లని కిరీటమును కల్గినవానికి) అని స్తుతించిరి. శ్రీవత్సాంకులును వరదరాజస్తవమున **"మౌళిః చూళికామణి సహస్రమరీచేః భవత్యుదయాద్రిః"** (25) (లోకాలకు అన్నిటికీ అధిపతి అయి ఉండే నీ స్వభావాన్ని స్పష్టంగా తెలియజేసే నీ కిరీటం తన శిఖరంలో పొదగబడిన రత్నం అనే సూర్యునకు ఉదయ పర్వతంగా తోస్తున్నది) అని కిరీటమును ఉదయపర్వతముగా ఉత్ప్రేక్షించిరి.ఈ పద్ధతిలోనే ఇక్కడ భట్టరు ఈ శ్లోకమున శ్రీరంగనాథుని కిరీటమును పర్వతముగా స్తుతించిరి

**"దిశి దిశి మనుమహే"** అని అన్వయించిన ముందు వెనుకల అంతట దర్శించి, అనుభవింతును – అను విశేషార్థము ధ్వనించును. భగవానుని దివ్యమంగళరూపమునేగాక, ఆ స్వామి అలంకరించుకున్న ఆభరణములను కూడా సర్వతోదిక్కముగా దర్శింపవలెను భావమిచట వ్యక్తము అవుతున్నది. కిరీటమును పర్వతముగా వర్ణించు ఈ శ్లోకము శిఖరిణీవృత్తమున అమరియుండుట కవియొక్క ప్రతిభను చాటుచున్నది. **"రసై రుద్రై శ్ఛిన్నా యమన సభలాగః శిఖరిణీ"** అని లక్షణము, **"శృంగం రంగ"** అనుటచే ఇచట అనుప్రాసయు కలదు.

**మనోహరమైన శ్రీ రంగనాథుని ముఖ మండలము నా మనసులో విహరించాలి**

**93. విహరతు మయి రంగిణ శ్చూళికా-**
**భ్రమరకతిలకోర్ధ్వపుండ్రోజ్జ్వలమ్ ।**
**ముఖ మమృతతటాకచంద్రాంబుజ-**
**స్మయహరశుచిముగ్ధమందస్మితమ్॥**

**ప్ర. అ. –** చూళికా = కేశపాశము, భ్రమరక = నుదుటి యందలి ముంగురులు, తిలక = తిలక రూపముననున్న ఆభరణము, ఊర్ధ్వపుండ్ర = ఊర్ధ్వపుండ్రము –అను వీనిచే, ఉజ్జ్వలమ్ - మిక్కిలి ప్రకాశించునది, అమృతతటాక = అమృతమయమైన చెఱువు, చంద్ర = చంద్రుడు, అంబుజ = పద్మము, అను వీనియొక్క స్మయ = గర్వమును, హర = హరించునట్టిది, శుచిః = తెల్లనైనది, ముగ్ధ = అందమైనది అగు, మందస్మితం = చిరునవ్వును కల్గినదగు, రంగి = శ్రీరంగనాథుని, ముఖం = ముఖమండలము, మయి = నా (మనస్సు) లో, విహరతు = విహరించుగాక!

**వరివస్య :–** ఈ శ్లోకమున శ్రీరంగనాథుని ముఖశోభ ప్రస్తుతమగుతున్నది. శ్రీరంగనాథుని ముఖము చూళిక, భ్రమరకములు, తిలకము, ఊర్ధ్వపుండ్రము – అను వీనిచే ప్రకాశించుచున్నది. ఆ ముఖమునుండి వెలువడు మందహాసము అమృతతటాకముయొక్క, తామరపూవుయొక్క, చంద్రునియొక్క గర్వమును పోగొట్టుచున్నది. ఇట్టి స్వచ్ఛమైన, అందమైన చిఱునవ్వును కల్గిన శ్రీరంగనాథుని ముఖము నా హృదయమును వీడక, విహరింపవలెను– అని శ్లోకభావము.

**"చూలికా"** శబ్దమునకు సంస్కృతవ్యాఖ్యానమున కేశపాశబంధసన్నివేశవిశేషముగా (తలపై కొప్పుగా) అర్థము చెప్పబడినది. **"చూడికా"** అను పదమే. **"లడయో రభేదః"** అను న్యాయమును బట్టి, **"చూలికా"** అయినదని చెప్పనగును. **"చూడా"** శబ్దము కేశబంధమును బోధించును.

కావున, పైన చూపిన అర్థమును **"చూళికా"** పదము బోధించును. **"అమృతతటాక"** అను సమాసమున **"స్మయహర"** అను విశేషణమును మందస్మితమునకు అన్వయింపచేసినచో, పైన చూపిన భావము వచ్చును. అట్లుకాక, **"అమృతతటాకచంద్రాంబుజస్మయహరం చ, శుచి చ, ముగ్ధం చ, మందస్మితం చ తత్ తాదృక్ ముఖమ్"** అనుచు అమృతతటాకముయొక్క, చంద్రునియొక్క, పద్మముయొక్క గర్వమును హరించునది, శుచి అయినది, ముగ్ధమైనది, మందస్మితమును కల్గినది అగు ముఖము – అని ముఖమునకు విశేషణములుగా అన్వయించి, అర్థము. చెప్పవచ్చును. సంస్కృతవ్యాఖ్యాత ఈ అన్వయమును చూపెను. ముందు చూపిన రస్యమైన అన్వయమును శ్రీ. ప్ర. భ. అణ్ణాస్వామి తమ ద్రావిడవ్యాఖ్యానమున చూపిరి.

అమృతతటాకమునకు, చంద్రునకు, పద్మమునకు చిఱునవ్వు శక్తి లేదు. కావున శ్రీరంగనాథుని ముఖము వానికంటె అధికము. అందువలన స్వామిముఖము వాని గర్వమును అణచుచున్నదని తాత్పర్యము వేంకటాచార్యసంస్కృతవ్యాఖ్యానమున చూపిన అన్వయమువలన ఏర్పడుచున్నది.

పెరియాళ్వార్లు తమ ప్రబంధమున యశోదాదేవి భావనతో

**"శుఱ్ఱు మొళివట్టమ్ శూழ்న్దు శోది పరన్దెఙ్గుమ్,**
**ఎత్తనై శెయ్యిలుమ్ ఎన్మకన్ ముకమ్ నేరొవ్వాయ్"**

(పెరియా. -1-4-3)

(ఓ చంద్రుడా! చుట్టూ కాంతి వలయం చుట్టుకుని ఉండి, జ్యోతిస్సు అంతటా వ్యాపించి, ఇంకా ఎంత చేసినప్పటికీ, నీ ముఖము నా కుమారుని ముఖముతో సాటి రాదు) అనుచు భగవానుని ముఖమునకు చంద్రుడు సాటి రాదనిరి. నమ్మాళ్వార్లు "కట్టురైక్కిల్ తామరై నిన్ కణ్ పాదమ్ కై ఒవ్వా" (తి. నా. -3-1-2) (వివరించి పలికితే, తామర పువ్వు నీ కన్నులతో, పాదాలతో, చేతులతో సాటి రాదు) అనుచు భగవానుని కన్నులకు, పాదములకు, చేతులకు

తామరపూవు సరి కాదనిరి. ఇచట కన్నులచే ముఖముకూడ ఉపలక్షిత మనుటలో తప్పులేదు కదా!

శ్రీయామునులును స్తోత్రరత్నమున,

**"ముఖశ్రియా న్యక్కృత పూర్ణనిర్మలామృతాంశు బింబాంబు రుహోజ్జ్వలశ్రియమ్"**

(భగవంతుని ముఖం కాంతితో– నిండుగా ఉండేవాడు ఎటువంటి మచ్చను లేనివాడు అయిన చంద్రుని బింబముయొక్క కాంతి, పద్మముయొక్క కాంతి తిరస్కరింపబడుతున్నది) (32) అని పల్కిరి.

ఈ సందర్భమున, శ్రీవిష్ణుపురాణములోని–

**"సఖ్యః! పశ్యత కృష్ణస్య ముఖ మత్యరుణేక్షణమ్,**
**వికాసి శారదాం భోజ మవశ్యాయజలోక్షితమ్,**
**పరిభూయ స్థితమ్"**(5–20–54)

(చెలులారా! చాలా ఎర్రని కన్నులను కలిగినది, వికాసాన్ని కలిగినది, మంచు బిందువులతో కూడిన శరత్కాలంలో వికసించిన తామరపువ్వును అవమానించి నిలచి ఉన్నది అయిన శ్రీకృష్ణుని ముఖమును దర్శించండి) శ్లోకము స్మరింపనగును. భట్టరు ప్రస్తుతశ్లోకమున చంద్రుడు, తామరపూవులతో పాటు అమృతసరస్సును చేర్చి, ఈ పురాణ సూక్తిని ఉపబృంహణమును చేసిరి. పురాణసూక్తులు వేదసూక్తులకు ఉపబృంహణములు కాగా, ఆ పురాణ సూక్తులకు పూర్వాచార్య సూక్తులు ఉపబృంహణములుకదా.

ఈ శ్లోకములోని కవి వర్ణన కవియొక్క భావనాపటిమను చాటును. మఱియు, ముఖమును అమృతసరస్సుగా వర్ణించుట కవిసమయమే. "**మయి విహరతు**" అనుటకు, "**స్వామిముఖమునకు నా మనస్సున ఉండుట పరమభోగ్యముగుగాక!**" అని తాత్పర్యము.

ఈ శ్లోకమున హరిశబ్దనిర్వచనము కవిచమత్కారముగా నిర్వహించినట్లు తోచును. ఉపసర్గార్థము ధాతులీనమైయుండును కావున, "**మయి హరతి, అర్థాత్ విహరతి ఇతి హరిః**" అను వ్యుత్పత్తి,

**"చంద్రాంబుజస్మయం హరతి ఇతి హరిః"** అను వ్యుత్పత్తియు ఈ శ్లోకమున పరోక్షముగా తెలుపబడినది. **"రంగిణః ముఖం మయి విహరతు"** అను అన్వయముచే, శ్రీరంగనాథుడు శ్రీరంగమున విహరించుట మాని, నాయందు విహరించును గాక– అని ధ్వనించును. భగవంతుడు దివ్యదేశములలో నివసించుట భట్టర్ వంటి మహాభక్తుల హృదయంలో నివాసమును పొందుటకే కదా.

ఈ శ్లోకమున చిఱునవ్వుతో వెలుగొందు శ్రీరంగనాథుని ముఖము వర్ణింపబడినది. కదా! ఇట్టి శ్లోకమును కవి "ప్రముదితవదనా"అను వృత్తమున నిబంధించుటలో కవి ఛందోవిషయమైన సందర్భశుద్ధి ఎంత మహనీయమైనదో సుస్పష్టమగుచున్నది. **"ప్రముదితవదనా భవేత్ నౌ రూ"**అనునది ఆ వృత్తలక్షణము. ఈ వృత్తమునకే **"నయుగరయుగయుక్ప గౌరీమతా"** అను లక్షణమునుబట్టి గౌరి అను పేరు కలదని తెలియుచున్నది. కూరేశుల వరదరాజస్తవములోని నవమదశకము ఈ వృత్తముననే రచింపబడినది.

## శ్రీ రంగనాథుని ముఖము ఒక అపూర్వపుండరీకము

**94. ముఖపుండరీక ముపరి త్రికంటకం**
**తిలకా శ్చ కేసరసమాః సమౌక్తికాః ।**
**ఇహ రంగభర్తు రభియన్మధువ్రత–**
**ప్రకరశ్రయం భ్రమరకాణి బిభ్రతి ॥**

**ప్ర. అ. –** రంగ భర్తుః = శ్రీరంగనాథునియొక్క, త్రికంటకం = మూడు రేఖలతో కూడిన, ముఖపుండరీకమ్ ఉపరి = ముఖమను అరవిందమునకు పైన, సమౌక్తికాః = ముత్యములతో కూడిన, తిలకాః– చ = తిలకాభరణములును, కేసర సమాః = కింజల్కములతో సమానములు, ఇహ = ఈ ముఖములోని, భ్రమరకాణి = ముంగురులు, అభియత్ = (ముఖపుండరీకమునకు)

అభిముఖముగా వచ్చుచున్న, మధువ్రత = తుమ్మెదల, ప్రకర = సమూహముయొక్క, శ్రియః = శోభను, బిభ్రతి = ధరించుచున్నది.

**వరివస్య :–** ఇందు శ్రీరంగనాథుని ముఖమును అరవిందముతో పోల్చుచు భట్టరు వర్ణించుచున్నారు. పూర్వశ్లోకమున పుండరీకము జయింపబడుట ప్రస్తావింపబడినది. పుండరీకములలో తుమ్మెదలుండును కదా! శ్రీరంగనాథుని ముఖపుండరీకమున అట్లు తుమ్మెదలున్నవా? అనిన, కవి ఒకటి కాదు, పలు తుమ్మెదలున్నవి అనుచున్నారు. ఊర్ధ్వపుండ్రముతో శోభిల్లు ముఖమును పూర్వశ్లోకమున వర్ణించిన కవి ఇందు ఆ ఊర్ధ్వపుండ్రమును వర్ణించుచున్నారనియు చెప్పవచ్చును.

శ్రీరంగనాథుని ముఖము తామరపూవువలె ఉన్నది. తామరపూవులో కేసరములుండునట్లే, కిరీటమునకు క్రింది భాగమునుండి వేలాడు తిలకాభరణములు మిక్కిలి పొడుగైనవై, చివర ముత్యములను కల్గియుండుటచే, తామరపూవులోని కింజల్కములవలె భాసించుచున్నవి. "**శెజ్గమల ప్పూవిల్ తేనుణ్ణుమ్ వణ్డే పోల్ పజ్గికల్ పవళవాయ్ మొయ్ ప్ప**" (పెరియా. తి. –1–8–2) (ఎర్ర తామర పువ్వులో తేనెను ఆస్వాదించు తుమ్మెదల గుంపువలె, నల్లని ముంగురులు ఎర్రని పెదవిపై ముసరగా) అని పెరియాళ్వార్లు పల్కిన విధముగా, ముంగురులు తుమ్మెదలవలె కన్పించు చున్నవి. కావున స్వామి ముఖమను పుండరీకమున తుమ్మెదలకు లోటు లేదు – అని భావము.

భ్రమరకశబ్దము పెక్కుచోట్ల పుంలింగమున ప్రయోగింపబడినట్లు కన్పించినను, "**అస్త్రీ భ్రమరకం ప్రోక్తమ్**" అను నిఘంటువచనమును బట్టి, నపుంసకలింగమునకూడ ప్రయోగింపబడినట్లు తెలియుచున్నది. ముంగురులు లలాటపర్యంతముగా విస్తరించియుండుట ముఖమునకు శోభను కల్గించును. యామునులు స్తోత్రరత్నమున భగవానుని ముఖమును "**లలాటపర్యంతవిలంబితాలకమ్**" (35) (నుదుటి వరకు వేలాడు ముంగురులను కలిగినది, భగవంతుని వదనము) అని స్తుతించిరి.

పరమకారుణికులగు శ్రీవరవరమునులు ఇచట వ్యాఖ్యానించుచు, **"మున్నముకత్తణియార్ మొయ్ కుழల్ కళ్"** ఎన్ఱుమ్ (పెరియా. తి. -1-5-5), **"శెజ్గమలర్ శూழ் వణ్డినమ్బోల్ శురుణ్డిరుణ్డ కుழల్ తాழ్న్ద ముకత్తాన్"** (3-6-9) **"ఎన్ఱుమ్ శొల్లుకిఱ తిరునెఱ్ఱియిన్ ఎల్లైయిలే వర అలై ఎఱికిఱ తిరుక్కుழలైయుడైయ ఉన్నై. పిన్బు అంసలంబియాయ్, మున్బు లలాటపర్యంతమా యిరుక్కిఱపడి"** ("ముఖానికి అలంకారమైన, దట్టమైన ముంగురులు" – అని, "గుండ్రంగా దట్టంగా ఉండే ముంగురులు వేలాడే ముఖాన్ని కలిగినవాడు" అని చెప్పిన రీతిలో, నుదుటి వరకు జారిన, అటు ఇటు కదలాడే ముంగురులను కలిగిన నిన్ను –అని అర్థం. కేశపాశం వెనుక భుజాల వరకు వేలాడుతున్నదై, ముందు లలాటం చివరి వరకు ఉన్నదని తాత్పర్యం) అని పల్కుట గమనింపదగినది.

అణ్డాళ్ (గోదాదేవి) నాయ్చ్చియార్ తిరుమొழిలోని **"కలివణ్డెజ్గుమ్ కలన్దాఱ్పోల్ కమழ్ పూజ్గుழల్ కళ్ తడన్తోళ్ మేల్ మిళిర నిన్ఱు విళైయాడ"** (14-8) (తేనెను తాగడం వల్ల మత్తెక్కిన తుమ్మెదలు అన్ని దిక్కులలోను విస్తరించినట్లుగా, పరిమళించే కేశపాశం విస్తరించిన పెద్ద బాహువులపై వేలాడుతూ వెలుగుతూ ఉండేటట్లు) అను పాశురము ఇచట అనుసంధింపదగినది.

**"త్రికంటకమ్"** అనుటకు పుండరీకములోని మూడు కర్ణికలే మూడు కంటకములుగా భాసించుచున్నవను అర్థమును వేరొక సంస్కృతవ్యాఖ్యాత అగు రామానుజాచార్యులును సూచించిరి. పద్మములోని కర్ణికాత్రయమువలె శ్రీరంగనాథుని ముఖమున గల రేఖాత్రయము భాసించుచున్నదని దీని భావము.

ముఖముండలములోని ఊర్ధ్వపుండ్రరేఖలు పుండరీకములోని మూడు కంటకములుగా చెప్పబడినవనియు. భావింపవచ్చును. లలాటమున రేఖాత్రయమును కల్గి యుండుట మహాపురుష లక్షణముగా లక్షణశాస్త్రమున చెప్పబడినది. శ్రీశంకరులును,

**"ఉత్థం తత్పుండ్ర మూర్ధ్వం జనిమరణతమఃఖండనం మండనం చ"** (జన్మ మరణాలు అనే చీకటిని ఖండించేది, అలంకారంవంటిది అయిన ఆ ఊర్ధ్వపుండ్రాన్ని) అనుచు భగవానుని ఊర్ధ్వపుండ్రరామణీయకతను శ్రీవిష్ణుపాదాదికేశాంతస్తుతిలో స్తుతించిరి. "**అభియన్మధువ్రతప్రకర**" అనుటకు ఎల్లప్పుడు భగవానుని సేవించు పరమభక్తులనియు ధ్వనించును. ఆళ్వార్లవంటి భక్తాగ్రేసరులు తుమ్మెదలతో పోల్చబడుదురుకదా!

ఇందు వృత్తము మంజుభాషిణి "**నజసాజగా భవతి మంజుభాషిణీ**" అని లక్షణము. దీనికే సునందిని అను పేరు కూడ ఉన్నట్లు "**సజసాజగౌ యది తదా సునందినీ**" అను లక్షణమును బట్టి తెలియుచున్నది. ఈ విషయము వృత్తరత్నాకరవ్యాఖ్యానమున కన్పట్టుచున్నది. ఇందుశ అలంకారము సాంగోపమ.

**అమృతప్రవాహమువంటి శ్రీరంగనాథుని ఉర్ధ్వపుండ్ర తిలకము నా హృదయమును ప్రసన్నము చేయుచున్నది**

**95. హృదయం ప్రసాదయతి రంగపతేః**
**మధురోర్ధ్వపుండ్ర తిలకం లలితమ్ ।**
**అళికార్ధచంద్రదళ సంవలితా**
**మమృతస్రుతిం యదభిశంకయతే ॥**

**ప్ర. అ. –** యత్ = ఏ ఊర్ధ్వపుండ్రతిలకము, అళిక = ఫాలభాగము అను, అర్ధచంద్రదళం = అర్ధచంద్రమండలమునుండి (చంద్రఖండమునుండి), సంవలితం = ప్రవహించు, అమృతస్రుతం = అమృత ప్రవాహమును, అభిశంకయతే = శంకను కల్గించుచున్నదో, ఆ, రంగపతేః = శ్రీరంగనాథునియొక్క, లలితం = ఋజువైన, మధుర = మిక్కిలి భోగ్యమైన, ఊర్ధ్వపుండ్రతిలకం = ఊర్ధ్వపుండ్రరూపములోనున్న తిలకము, హృదయం = (నా) మనస్సును, ప్రసాదయతి = ప్రసన్నముచేయుచున్నది.

**వరివస్య :–** శ్రీరంగనాథుని ఫాలమున గల ఊర్ధ్వపుండ్రతిలకమును భట్టరు ఉత్ప్రేక్షాలంకారముతో ఇందు స్తుతించుచున్నారు. ముందు శ్లోకములో శ్రీరంగనాథుని ముఖపుండరీకము మధువును చిందించుననుటవలన, తుమ్మెదలను ఆకర్షించుననుటవలన, పుండరీకముయొక్క గర్వమును అణచిన విధము తెలుపబడినది. ఇందు, స్వామిముఖము అమృతస్యంది అనుచు చంద్రుని గర్వమణచిన విధమును కవి తెలుపుచున్నారు.

శ్రీరంగనాథుని ఫాలమున ప్రకాశించు దివ్యోర్ధ్వపుండ్రతిలకము అష్టమీచంద్రమండలమునుండి ప్రవహించు అమృతధారవలె గోచరించుచున్నది. చంద్రుడు. అమృతాంశుడు. కావున, చంద్రమండలమునుండి అమృతము స్రవించుట సహజము. అర్థచంద్రదళసదృశమగు భగవానుని ఫాలభాగమునుండి స్రవించు అమృతధారయా! అని శంకించు విధముగా ఈ తిలకము కన్పడుచున్నది. ఇట్టి, అమృతధారవంటి ఊర్ధ్వపుండ్రతిలకము నా హృదయమును ప్రసన్నము చేయుచున్నది– అని శ్లోకభావము.

అమృతప్రవాహత్రయముగా ఊర్వపుండ్రము భాసించుచున్నది. ఈ ప్రవాహములు మూడును అమృతరూపములగుటచే పైపైకి ప్రసరించుట తగినదేకదా! కావుననే ఇవి ఊర్ధ్వగములు, నిమ్నగములు కావు. కావున అమృతనాడులవంటివి, ఊర్ధ్వపుండ్రము ఆత్మయొక్క ఊర్ధ్వగమనమును సూచించునని పూర్వము ఉదాహరించిన శ్రీశంకరుల సూక్తి తెలుపుచున్నదికదా!

**"ప్రసాదయతి హృదయం ఊర్ధ్వగమనేన, అమృతత్వద్యోతనం అస్మాన్ ప్రత్యాయయతి. మాం సమ్యక్ ప్రసన్నం సంప్రసాదం కరోతి, తథా చ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణ అభినిష్పత్స్యే"** (ఛాందో. 8–12–2) (ఊర్ధ్వగమనంద్వారా హృదయాన్ని ప్రసన్నం చేస్తున్నది. అమృత స్వభావద్యోతనం మనకు నమ్మకం కలిగిస్తున్నది. నన్ను చక్కగా ప్రసన్నం చేస్తున్నది. సంప్రసాదాన్ని ఇస్తున్నది. అందువలన, పరమాత్మను సమీపించి తన స్వరూపంతో ముక్తుడు వ్యక్తం అయినట్లుగా, నేను కూడా ప్రసన్నమైన రూపంతో వ్యక్తం కాగలను) అని

ఇచట గోపాలాచార్యవ్యాఖ్యలోని వివరణము, కావున "ప్రసాదయతి"అనుటకు, మా మనస్సులకు నమ్మకము కల్గించుచున్నది– అని తాత్పర్యము చెప్పవచ్చును, ఇందులకు ఉపోద్బలకముగా కూరేశుల–

**"ఉద్ధరత్యుపరి భక్తజనా నితి ఊర్ధ్వతాశ్రయణసూచితశక్తిమ్,**
**ఊర్ధ్వపుండ్రతిలకం బహుమానాత్ కిము బిభర్షి వరద! స్వలలాటే"** (వర. – 26)

(ఓ వరదరాజస్వామీ! ఊర్ధ్వ పుండ్ర తిలకం భక్తజనులను ఉద్ధరిస్తున్నది– అనే విషయాన్ని ఊర్ధవమైన ఆకారంతో కూడుకొని ఉండడంద్వారా సూచిస్తున్నది ఇటువంటి శక్తిని కలిగిన ఈ పుండ్రతిలకాన్ని "లలాటంలో నా భక్తులు అభిమానించినది కదా, ఇది!" అనే ప్రీతి విశేషంతో ధరిస్తున్నవా ఏమి!) అను సూక్తిని స్మరింపనగును.

"**ప్రసాదయతి**" అనుటకు బదులు "**ప్రసాధయతి**" అను వేరొక పాఠమును కలదు. అపుడు, "నా హృదయమును అలంకరించుచున్నది" అని భావము. ఊర్ధ్వపుండ్రతిలకము. శ్రీరంగనాథుని ముఖమునకు మాత్రమే అలంకారము కాదు, నా హృదయమునకును అలంకారమని దీని తాత్పర్యము. ఇది కూడా యుక్తమైనదే.

ఈ సందర్భమున కూరేశులు వరదరాజస్తవమున

**"కర్ణికా తవ కరీశ! కిమేషా కర్ణభూషణ ముతాంసవిభూషా?**
**ఆహో! మానసస్య మమ వా పరికర్మ?"** (27)

(వరదరాజస్వామీ! ఈ నీ కర్ణభూషణం నీ చెవులకు అలంకారమా? లేక, నీభుజాలకు అలంకారమా?అదీ కాక, నీ భుజాలపై అటు ఇటు అందంగా కదలాడే కేశపాశానికి అలంకారమా? లేక, దాసుని మనసుకు అలంకారమా?చెప్పు) అని పల్కుట, వేదాంతదేశికులు దేవనాయకపంచాశత్ లో–

**"కాంతం ముఖం కనకకైతకకర్ణపూరం**
**స్వాంతం విభూషయతి దేవపతే! మదీయమ్"** (18)

(ఓ దేవనాయక స్వామీ! బంగారుతో చేయబడిన, సంపెంగ పువ్వు ఆకారంలో ఉండే కర్ణాభరణాలను కలిగినది, ఆకర్షణీయమైనది అయిన నీ ముఖం నా మనస్సుకు అలంకారం అవుతున్నది) అని పల్కుటయు స్మరింపదగినది.

రెండవ పాదమున **"కలితమ్"** అను పాఠాంతరము కలదు. అనగా, ధరింపబడినది –అని అర్థము.

స్వామిఫాలభాగమున గల ఊర్ధ్వపుండ్రము చంద్రమండలమునుండి స్రవించు. అమృతధారగా సంభావింపబడుటచే ఇచట ఉత్ప్రేక్షాలంకారము. వృత్తము **"ప్రమితాక్షరా సజససై రుదితా"** అని లక్షణము కల్గిన ప్రమితాక్షర.

## శ్రీరంగనాథుని కనుబొమలు విజయనృత్యము చేసే తుమ్మెదల బారు

**96. సరసీరుహే సమవనామ్య మదా–**
**దుపరి ప్రనృత్యదంపంక్తినిభే ।**
**స్ఫురతో భ్రువా వుపరి లోచనయో**
**స్సవిలాససలాస్యగతి రంగభృతః ॥**

**ప్ర. అ.** – సరసీరుహే = తామరపూవులను రెండిటిని, సమవనామ్య = అణగియుండునట్లు చేసి (వంచి), మదాత్ = (అందువలన కల్గిన) గర్వము వలన, ఉపరి = పైన, ప్రనృత్యత్ = గొప్ప నర్తనము చేయుచున్న, అళి = తుమ్మెదల, పంక్తినిభే = వరుసవలె నున్నవి అగు, రంగభర్తుః = శ్రీరంగనాథునియొక్క, భ్రువోః = కనుబొమలు, లోచనయోః ఉపరి = రెండు కన్నులకు పైన, సవిలాసలాస్యగతి = విలాసముతో కూడిన గతిసౌందర్యమును కల్గినవగునట్లు, స్ఫురతః = ప్రకాశించుచున్నవి. (కదలుచున్నవి)

**వరివస్య** :– ఇందు శ్రీరంగనాథుని భ్రూసౌందర్యము వర్ణింపబడుచున్నది. గత రెండు శ్లోకములలో ముఖపుండరీకములోని భ్రమరపంక్తినిగూర్చి, అమృతధారనుగూర్చి తెలుపబడినది.

శ్రీరంగమే ఒక రంగస్థలము. శ్రీరంగనాథుడు ఒక మహానటుడు. ఆ నటుని భ్రూవిక్షేపములు అత్యంతమనోహరములు, రంగనటుని కనుబొమలు ముఖపద్మమున మదముతో నర్తించు తుమ్మెదల గుంపుతో ఇందు ఉత్ప్రేక్షింపబడుచున్నవి. ఇట్లు ఈ స్తోత్రమున నటున కపేక్షితములైన సామగ్రి అంతయు పలు శ్లోకములలో వర్ణింపబడుటను గమనింపవచ్చును.

(ఎఱ్ఱని తామరపూవులను పోలు) శ్రీరంగనాథుని రెండు కన్నులకు పైన (నల్లని తుమ్మెదల వరుసలవలెనున్న) కనుబొమల రెండిటి కదలికలను చూడగా, కన్నులనెడి తామరపూలలో గల మకరందమును పరిపూర్ణముగా ఆస్వాదించి, అందువలన నిస్సారములగు వానిని అవలీలగా జయించిన మదమువలన విజయనృత్యము చేయుచున్న నల్లని తుమ్మెదల బారువలె ఉన్నది.

శ్రీరంగనాథుని కనుబొమలు మకరందమును గ్రోలి విలాసనర్తనము చేయు తుమ్మెదల వరుసనలె ఉన్నదనుటలో తాత్పర్యమేమనగా – శ్రీరంగనాథుడు భక్తులను చూచినపుడు కల్గిన ఆనందాతిశయముచే భ్రూవిక్షేపమును చేయుచున్నాడు. ఆ స్వామి కనుబొమల కదలికలు తుమ్మెదల గుంపులు తాము జయించిన తామరపూలపై విలాసనర్తనము చేయుచున్నట్లున్నది– అని.

పరమాచార్యులగు యామునులు, భగవద్రామానుజులును సర్వేశ్వరుని **"సవిభ్రమభ్రూలతమ్"** అని స్తుతించుటలోని ఉద్దేశ్యమిదియే.

**"భ్రువోః యుగం సునేత్రాహ్వసహస్రపత్రయోః**
**ఉపాంతగం వా మధుపావళీ యుగం విరాజతే"** (42)

(సుందరబాహు స్వామిని ఆశ్రయంగా కలిగిన కనుబొమల జంట చాలా అందమైన రెండు ధనుస్సుల అందంవంటి అందాన్ని కలిగి, చక్కని కన్నులు అనే తామర పువ్వుల జంట సమీపములో చేరిన తుమ్మెద వరుసల జంటవలె ప్రకాశించుచున్నది) అను కూరేశుల సుందరబాహుస్తవములోని సూక్తి ఇచట

స్మరణీయము, భట్టరు తమ తండ్రియగు కూరేశుల సూక్తికి ఈ శ్లోకమున మరింత సౌరభమును కల్గించిరని చెప్పనగును.

అనుద్ధతనృత్యమునకు లాస్యమని పేరు. శ్లోకములోని "**స్ఫురతః**" అను క్రియాపదము శ్లిష్టము. "కదలుచున్నవి, ప్రకాశించుచున్నవి" అని దీనికి అర్థములు. శ్రీరంగనాథుడొక సరస్సు అయినచో, కన్నులు ఆ సరస్సున పూచిన పూలు – అను ధ్వని '**సరసీరుహ**' శబ్దమువలన కల్గును. కాని, లౌకికమైన సరస్సులోని పద్మములను ఆ సరస్సునుండి కోసి, వేరు చేయవచ్చును. ఇచట అట్లు చేయుటకు వీలు గాదు – అనునదియే భేదము, శ్లోకమున "రంగపతి" అను పదము(నాట్యరంగమునకు అధిపతి) నటత్వద్యోతకము. కావున సాభిప్రాయకము.

ఈ శ్లోకములోని భావమును, తరువాతి శ్లోకములోని భావమును అనుసంధించుచు శ్రీపిళ్ళైలోకాచార్యులవారు "అర్చిరాది" అను రహస్యగ్రంథములో తృతీయప్రకరణమున "**అలర్ న్దు కుళిర్ న్దిరుక్కిఱ ఇరణ్డు తామరైప్పూక్కళై మదత్తాలే యముక్కి యాడుగిఱ యిరణ్డు వణ్డొ(ఴు)ఙ్గుపోలే యిరుక్కిఱ తన కైచ్చార్ ఙ్గ మదువే పోల(ఴ)కియ తిరుప్పురువఙ్గళైయుమ్**" (చక్కగా వికసించి, చల్లగా ఉండే రెండు తామర పూలను మదంతో అణచి, వాటిపై ఆడే తుమ్మెదల జంట వరుసవలె ఉండే, భగవంతుని చేతిలోని శార్ ఙ్గ ధనుస్సువలె ఉన్న అందమైన కనుబొమలను) అనుచు భగవానుని భ్రూసౌందర్యమును కొనియాడిరి.

ఇందు నేత్రములను సరసీరుహములతో పోల్చుటనచే ఉపమయు, కనుబొమల కదలికలను విజయనృత్యమును చేయు తుమ్మెదల వరుసతో పోల్చుటచే ఉత్ప్రేక్షయు కలదు. వృత్తము ప్రమితాక్షర. దీని లక్షణ మింతకు ముందే చెప్పబడినది.

**శ్రీరంగనాథుని కనుబొమలు శార్ జ్ఞమునకు ఆచార్యులు**

**97. స్మరశరనళినభ్రమా న్నేత్రయోః**
**పరిసరనమదిక్షు చాపచ్ఛవి 1**
**యుగ ముదయతి రంగరాజభ్రువోః**
**గురుకుల మివ శార్ జ్ఞ నృత్తశ్రియః ॥**

**ప్ర. అ. –** నేత్రయోః = రెండు నేత్రములయొక్క, స్మర = మన్మథునియొక్క, శర = బాణములగు, నళిన = పద్మములయొక్క, భ్రమాత్ = భ్రమచే, పరిసర = ఆ నేత్రములను సమీపమున, నమత్ = వంగుచున్న, ఇక్షు చాప = చెఱకువింటియొక్క ఛవిః = కాంతివంటి కాంతిని కల్గిన, రంగరాజ = శ్రీరంగనాథునియొక్క, భ్రువోః = కనుబొమలయొక్క, యుగం = జంట, శార్ జ్ఞ = – శ్రీశార్ జ్ఞముయొక్క, నృత్త = నర్తనముయొక్క, శ్రియః = శోభకు, గురుకులం = ఆచార్యకులము, ఇవ = వలె, ఉదయతి = ప్రభవించుచున్నది. (ప్రకాశించుచున్నవి).

**వరివస్య :–** ఈ శ్లోకమునందును శ్రీరంగనాథుని భ్రూవిక్షేపసౌందర్యమును వేరొక చక్కని ఉత్ప్రేక్షతో భట్టరు వర్ణించుచున్నారు. శ్రీరంగనాథుని నేత్రద్వయము తామరల జంటవలె ఉండుటచే, "ఇవి మన్మథుని బాణములగు తామరపూలు" అని తలచి, మన్మథుని చెఱకువిల్లు స్వయముగా వాని సమీపమునకు వచ్చి, వంగియున్నది– అనునట్లు స్వామి భ్రూయుగము శోభిల్లుచున్నది. భగవానుని హస్తమున నుండు శార్ జ్ఞమను విల్లు విలక్షణమైన నర్తనమునకు పేరు గాంచినది. అట్టి నర్తనమును శార్ఙ్గము ఈ కనుబొమల కదలికల నుండే నేర్చినట్లు ఉన్నది. కావున, స్వామికనుబొమలు శార్ఙ్గనృత్తమునకు గురుకులమైనట్లు తోచుచున్నది. – అని శ్లోకభావము.

స్వామియొక్క పుండరీకములవంటి, నిర్మలములగు పెద్ద కన్నులను, మన్మథుని బాణములగు పుండరీకములుగా భ్రమించుట వాని మధ్యగల

సౌసాదృశ్యమువలన యుక్తమే శ్లోకములోని **"రంగరాజ"** శబ్దముచే నర్తనచాతుర్యము ధ్వనించుచున్నది.

నమ్మాళ్వార్లు తిరువాయిమొళి లో **"మన్నియ శీర్ మదనన్ కరుప్పుచ్చిలైకొల్!, మదనన్ తన్నుయిర్ తాదై కణ్ణ పెరుమాన్ పురువమ్మైవైయే"** (7. 7. 4) (మన్మథుని తండ్రి అగు శ్రీకృష్ణుని కనుబొమల జంట ఆ మన్మథుని చెఱకు విల్లు కాదు కదా!) అనుచు భగవానుని భ్రూవిలాసమును స్తుతించిరి. భట్టరు ఈ ఉత్ప్రేక్షను అనుసరించి ప్రస్తుతశ్లోకమును రచించిరనుట స్పష్టము.

శ్లోకములోని రెండవ ఉత్ప్రేక్షకు గోదాదేవి రచించిన నాయ్చ్చియార్ తిరుమొళిలోని చివరి దశకమున గల "తన్ కైచ్చార్ ఙ్గ మదువే పోల్ పురువవట్టమ్" (14-6) (తన చేతిలోని శార్ ఙ్గమ్ అను ధనస్సువలె ఉండే గుండ్రని కనుబొమలు) అను సూక్తి నిదానమని చెప్పవచ్చును. ఈ పాశురమున కనుబొమలకు శార్ ఙ్గము ఉపమానముగా వర్ణింపబడగా, ప్రస్తుతశ్లోకమున, కవి, భగవానుని కనుబొమల ఆధిక్యమును చెప్పదలచి, భ్రూవిభ్రమమునుండే శార్ ఙ్గము నృత్తమభ్యసించెనని చమత్కరించెను. "కోలార్ న్ద నెడుమ్ శార్ ఙ్గమ్" (పెరుమా. తి. -1-8) (అందము నిండుగా ఉండే, దీర్ఘమైన శార్ ఙ్గమను విల్లు), 'కణైనాణిల్ ఓవా త్తొழిల్ శార్ ఙ్గమ్" (ఎల్లప్పుడూ ఆశ్రితులను రక్షణకోసం వింటి నారికి సంధింపబడి, కార్యాన్ని నిర్వహించే బాణాలను కలిగిన శార్ ఙ్గమనబడు ధనుస్సు) ('పెరియ తిరువ, -78) అని ఆళ్వార్లు అనునట్లుగా, శార్ఙ్గము నిరంతరము చలించుచు, భగవద్భాగవతవిరోధులపై బాణవర్షమును కురిపించును. ఆ కదలికలు తమకు మనోహరముగా ఉన్నందున, వాటిని కవి ఇచట నర్తనముగా పల్కెను.

వేదాంతదేశికులు **"దేవనాయకపంచాశత్"** స్తోత్రమున ప్రస్తుత శ్లోకములోని మొదటి ఉత్ప్రేక్షను అనుసంధించుచు,

**"నేతుం సరోజవసతిః నిజ మాధిరాజ్యం**
**నిత్యం నిశామయతి దేవపతే! భ్రువౌ తే,**

**ఏవం న చేదఖిలజంతు విమోహనార్హా**

**కిం మాతృకా భవతి కామశరాసనస్య?" (23)**

(దేవనాయక స్వామీ! నాభి కమలాన్ని నివాహంగా కలిగిన బ్రహ్మ తన ఆధిపత్యాన్ని నడపడం కోసం ఎల్లప్పుడూ నీ కనుబొమల వైపు చూస్తున్నాడు ఈ విధంగా కాకపోయినట్లయితే, జీవులను అందరిని మోహింప చేయడానికి తగిన మన్మథుని విల్లుకు ఏ వస్తువు మాతృకగా అవుతున్నది?) అని స్తుతించిరి. "**సాక్షాన్మన్మథమన్మథః**"(సాక్షాత్తు మన్మథునకు మన్మథుడు) అని స్తుతింపబడు భగవానుని కనుబొమల నిట్లు వర్ణించుట యుక్తమే కదా!

మూడవ పాదమున అర్థభేదము లేని "**రంగభర్తుః భ్రువోః**", "**రంగనాథభ్రువోః**" అను పాఠాంతరములు కలవు. "**రంగపతేః భ్రువోః**" అను వేరొక పాఠము ఉన్నను, అది ఛందస్సునకు అనుగుణము కాదు.

"**శార్ జ్గేణ యోధ్యమానాః శాత్రవో ఽ పి న ప్రథమం భగవతః నిరతిశయసుందర భ్రూశోభయా కామశరాసనేనైన వశీక్రియంత ఇతి ప్రసిద్ధమ్. ప్రథమం మదనబాణహతాః, అనంతరమేవ శార్ జ్గేణ హన్యంతే**" అని గోపాలాచార్యవ్యాఖ్యలోని రసోక్తి. అనగా, భగవానునితో పోరాడు శత్రువులు మొదట భగవానుని భ్రూక్షేపసౌందర్యమునకు జితులగుదురు. ఆ పిమ్మటనే శార్ జ్గము వారిని సంహరించును– అని భావము, కావున శార్ జ్గము కన్న స్వామికనుబొమల ఆధిక్యము స్పష్టము. "**ప్రముదితవదనా**" అను వృత్తమున కవి స్వామి ముఖములోని భ్రూసౌందర్యమును వర్ణించుటను ఇచట గమనింపదగును, "**ప్రముదితవదనా భవేత్ నా రతా**" అని దీని లక్షణము.

**శ్రీరంగనాథుని నేత్రవైభవము**

**98. కృపయా పరయా కరిష్యమాణే**

**సకలాంగం కిల సర్వతోఽక్షి నేత్రే ।**

**ప్రథమం శ్రవసీ సమాస్తృణీతే**
**ఇతి దైర్ఘ్యేణ విదంతి రంగనేతుః ॥**

**ప్ర. అ. –** పరయా = గొప్పదైన, కృపయా = దయచే, సకల అంగం = సమస్త అవయవములను, సర్వతః = అన్ని భాగములలోను, అక్షి = కన్నుగా, కరిష్యమాణే = చేయబోవునట్టి, రంగభర్తుః = శ్రీరంగనాథునియొక్క, నేత్రే = నేత్రద్వయము, ప్రథమం = ముందుగా, శ్రవసీ = కర్ణద్వయమును, సమాస్తృణీతే = వ్యాపించుచున్నవి. ఇతి = అని, దైర్ఘ్యేణ (ఆ నేత్రముల) వైశాల్యముచే, విదంతి = (అభియుక్తులు) తెలిసికొనుచున్నారు.

**వరివస్య :–** శ్రీరంగనాథుని నేత్రముల వైశాల్యములోని వైలక్షణ్యమును కవి ఈ శ్లోకమున అద్భుతమైన ఉత్ప్రేక్షతో స్తుతించుచున్నారు. నేత్రవర్ణన చేయబడిన మూడు శ్లోకములలో ఇది మొదటిది.

నేత్రమనగా నడుపునది –అని అర్థము. భగవానుని సన్నిధానమునకు భక్తులను చేర్చునది ఆ స్వామి నేత్ర సౌందర్యమే. ఆ నేత్రసౌందర్యమును మన మనసులకు సమీపమునకు చేర్చునవి, నేత్ర సౌందర్యం వర్ణించు ఈ మూడు శ్లోకములును.

మనస్సులోని కరుణను బయల్పఱచునవి కన్నులు. పరమదయాళువగు శ్రీరంగనాథుని కృప అధికమా? లేక, పరమపదనాథుని కృప అధికమా? లేక రామకృష్ణాద్యవతారములలో కృపమెండా? అని పర్యాలోచన చేసినచో, నిత్యులకు, ముక్తులకు మాత్రమే సుఖమును చూపునట్టి పరమపదనాథుని కృప కంటే, భూలోకమున అవతరించి కొంతకాలము అచట గడపి, విదురాదిమహాత్ములను అనుగ్రహించి, తిరిగి స్వస్థానమునకు చేరు రామకృష్ణాది అవతారముల కృప గొప్పది, కాని, దాని కంటే "**ఈ సంసారము సమూలముగా నశింపచేసినగాని ఈ కావేరీద్వీపమునుండి కదలను**" అని సంకల్పించి, "**సర్వసహిష్ణుః అర్చకపరాధీనాఖిలాత్మస్థితిః**" (శ్రీరం. ఉ. శ-74) (భక్తులు చేయు అన్ని అపచారములను సహించు స్వభావమును కలవాడు, తన

సకలస్థితులను అర్చకుల అధీనములో కలవాడు) అనునట్లు, భక్తులు తమ అజ్ఞానవశముచే,

**"ఉపచారాపదేశేన కృతా నహరహః మయాన్,**

**అపచారానిమాన్ సర్వాన్ క్షమస్వ పురుషోత్తమ!"**

(ఓ పురుషోత్తమా! ఉపచారములు అనే పేరుతో ప్రతిదినము నేను చేసే ఈ అపచారాలను అన్నిటినీ నీవు సహించాలి) అని నిత్యము ఆరాధన సమయములో సన్నిధానములో విన్నవించు రీతిలో, ఉపచారరూపముగా చేయు అపచారములనన్నిటిని సహించుచు, ఆ భక్తుల చేతిలో తన సకలస్థితిగతులను కల్గినవాడై, పరమసులభుడై, స్థావరప్రతిష్ఠగా నిలచియున్న శ్రీరంగనాథుని కృప మరింత గొప్పది. ఇట్లు అధమ, మధ్యమ, ఉత్తమములైన ఈ ముగ్గురకు కృపలో భేదమున్నట్లే, ఆ కృపను సూచించు కన్నులకును భేదముండవలెను. కదా! కానీ, వైకుంఠనాథునకు రెండు కన్నులే కలవు. అంతకంటె కృపాధికులైనను రామకృష్ణాదిఅవతారమూర్తులకు కన్నులు రెండే, సర్వాధికుడగు శ్రీరంగనాథునకును, కన్నులు రెండే. ఇట్లు కన్నుల సంఖ్యలో ఏ మాత్రమును భేదము లేకుండుట తగదు. శ్రీరంగనాథునకును రెండే కన్నులున్నచో, రామకృష్ణాదులకు ఒక కన్ను, పరము పదనాథునకు అందులో సగము మాత్రమే కదా ఉండవలెను! ముగ్గురకు ఇట్లు సమానముగా ఉండుట తగదు. శ్రీరంగనాథుని కృపకు తగినట్లు నేత్రములుండవలెనన్న, దేహమంతయు కన్నులు. వ్యాపించి యుండవలెను– అని స్వామి నేత్రద్వయము సంభావించినదై, **"శ్రీరంగనాథుని అన్ని అంగములను మనమే ఆక్రమింపవలెను"** అని నిశ్చయించుకొనెను. సమస్తలోకమును జయింపగోరు ప్రభువులు ముందుగా తమకు సమీపములోనున్న సామాన్యులను ఆక్రమించునట్లు, మొట్ట మొదటగా ఆ స్వామినేత్రద్వయము తనకు సమీపములోనున్న కర్ణద్వయమును ఆక్రమింపబోవుచున్నట్లు శ్రీరంగనాథుని నేత్రద్వయముయొక్క వైశాల్యము వలన తోచుచున్నది– అని శ్లోకభావము.

పూర్వము 72 వ శ్లోకమున "**చక్మ్షుష్మంతి గతాగతాని**" అనుచు పల్కిన కవి, ఇందు భగవానుని దివ్యదేహమంతయు కన్నులగుటనుగూర్చి ప్రస్తావించిరి. కాళిదాసు కుమారసంభవమున సప్తమ సర్గలో–

**"త మేకదృశ్యం నయనైః పిబంత్యో నార్యో న జగ్మః విషయాంతరాణి,**

**తథా హి శేషేంద్రియవృత్తి రాసాం సర్వాత్మనా చక్షు రివ ప్రవిష్టా"**

అనుచు పరమేశ్వరుని దర్శించిన పౌరాంగనల కన్నులు ఇంద్రియాంతరములలో ప్రవేశించెననెను. ఇచట భట్టరు శ్రీరంగనాథుని కన్నులు మిగిలిన అవయవములలో వ్యాపించి, దేహమును అంతటిని చక్షుర్మయము కావించెననిరి. "సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్" అన్ని ఇంద్రియములలోనూ నేత్రము ప్రధానము) అనునట్లు, అన్ని అంగములలో నేత్రము ముఖ్యము. ముఖ్యుడైన వానిని ఇతరులు అనుసరించుట లోకపరిపాటి. అట్లే, ఇచట మిగిలిన అంగము అన్నియు నేత్రములుగా మారెను, ఒడలంతయు కన్నులైనచో కటాక్షము సర్వత్ర ప్రసరించును. మఱియు "సర్వతోఽక్షిశిరోముఖమ్" (భ. గీ. –13) అను గీతాశాస్త్రమున వర్ణింపబడిన విశ్వరూపానుభవము కల్గును. "నీయతే అనేన ఇతి నేతా, నేత్రం చ" అను వ్యుత్పత్తిని కల్గిన 'నేతృ, నేత్ర' శబ్దముల ప్రయోగ మిచట కవియొక్క పదప్రయోగవైచిత్రిని తెలుపును, "నేతుః నేత్రయోః సర్వేతరాంగాణాం నేత్రీకరణమ్" (నేత అయిన శ్రీరంగనాథుని నేత్రములు ఆ స్వామి ఇతర అంగములను అన్నిటిని నేత్రములుగా చేయుచున్నది) అని రస్యముగా గోపాలాచార్యవ్యాఖ్యలో వివరింపబడినది

తిరుప్పాణాళ్వార్లు ప్రసాదించిన "**అమలనాదిపిరాన్**" అను దివ్యప్రబంధమున "**పుడై పరన్దు మిళిర్ న్దు––– నీణ్డ అప్పెరియవాయ కణ్గళ్**" (8) (పర్యంతముల వరకు వ్యాపించి మెరిసి–– దీర్ఘంగా ఉండే ఆ విశాలమైన నేత్రములు) అను సూక్తిని ఆధారముగా చేసికొని, భట్టరు ప్రస్తుతశ్లోకమును రచించినట్లు తోచును. కావుననే పై దివ్యప్రబంధపాశురమును వ్యాఖ్యానించుచు

**"అழకియమణవాళప్పెరుమాల్ నాయనార్"** అను పూర్వాచార్యులు ప్రస్తుతశ్లోకమును ఉట్టంకించి, వివరించిరి. ఆ వివరణము పరమభోగ్యమగుటచే ఆ పంక్తు లిచట యథాతథముగా ఉట్టంకింప బడుచున్నవి.

**"పెరియ పెరుమాళుడైయ తిరుక్కణ్ గళానవై తిరుచ్చెవి యళవుమ్ శెల్ల, నీణ్డిరుక్కిఱపడిక్కు ఒరు నినైవుణ్డు ఎన్గిఱార్, భట్టర్. అదావదు– పెరియ పెరుమాళుడైయ తిరుక్కణ్గళానవై మీనుక్కు తణ్ణీర్ వార్ ప్పారైప్పోలే నిత్యసూరికళుక్కు ముకమ్ కొడుత్తుక్కొణ్డిరుక్కిఱ శ్రీవైకుంఠనాథనుక్కుమ్ కణ్గళ్ ఇరణ్డాయ్, రామకృష్ణాద్యవతారఙ్గళ్ పణ్ణి, గుహాదికళ్, విదురాదికళ్ తొడక్కమానారై శిలర్ క్కు అల్పకాలమ్ ముకమ్ కొడుత్తు విషయీకరిత్తు వన్దార్ ప్పోలే వెఱుమ్ కైయోడే పోనవర్ కళుక్కుమ్ కణ్ ఇరణ్డాయ్, "సంసారమ్ కిழమ్ కొడుత్తాలల్లదు ఎழున్దిరేన్ "ఎన్ఱు కోయిలిలే అర్చారూపియాయ్ అవ్వవర్ నికర్షఙ్గళై ప్పారాదే, ముకమ్ కొడుత్తుక్కొణ్డు కిడక్కిఱ పెరియ పెరుమాళుక్కుమ్ కణ్గళ్ ఇరణ్డాయ్ ఇరుక్కవో! ఇవరుడైయ కృపైయై ప్పార్ త్తాల్ ఉడమ్బెల్లామ్ కణ్ణాగవేణ్డావో! ఎన్ఱు పార్ త్తు, "ఎల్లా మణ్డలఙ్గళుమ్ తఙ్గళుక్కే ఆకవేణుమ్" ఎన్ఱిరుక్కుమ్ రాజాక్కళ్ ముఱ్పడ త్తఙ్గళుక్కు ప్రత్యాసన్నరాన వన్నియరై అழియచ్చెయ్యుమాపోలే, "పెరియపెరుమాళుడైయ అవయవాన్తరఙ్గళడైయ నామే యాకవేణుమ్" ఎన్ఱు పార్శ్వస్థలఙ్గళా యిరుక్కిఱన తిరుచ్చెవికళాకైయాలే, అవత్తై వెన్ఱు, అవ్వళవుకే పోవదాక ముఱ్పట్టు, అవళుడనే అలై యెఱికిఱాప్పోలే యాయ్ త్తు, త్తిరుక్కణ్గళ్ శెవికళళవుమ్ నీణ్డిరుక్కిఱపడి"** (శ్రీరంగనాథుని తిరునేత్రాలు అనేవి ఆ స్వామి కర్ణాలవరకు వ్యాపించి ఉండే సన్నివేశాన్ని చూడగా, దానికి ఒక అభిప్రాయం ఉన్నది– అని తోస్తున్నది – అని భట్టర్ పలుకుతున్నారు. అది ఏమంటే, శ్రీరంగనాథుని నేత్రాలు, "నీటిలో ఉండే చేపకు నీటిని పోసినట్లుగా, ఎల్లప్పుడూ పరమపదనాథుని అనుభవాన్ని పొందే నిత్యసూరులకు నిత్యసేవను అనుగ్రహిస్తూ ఉండే వైకుంఠనాథునకు నేత్రాలు రెండై, రామకృష్ణాది అవతారాలను ఎత్తి,

గుహుడు మొదలైనవారికి, విదురుడు మొదలైనవారికి కొందరికి మాత్రమే అల్పకాలం దర్శనాన్ని అనుగ్రహించి, వారిని కృపజేసి, తిరిగి వచ్చినట్లుగా, ఎవరిని తన వెంట తీసుకొని రాకుండా, రిక్తహస్తాలతో వెనుదిరిగిపోయిన విభవాతారాలకు నేత్రాలు రెండై, "సంసారాన్ని సమూలంగా లేకుండా చేస్తే తప్ప ఇక్కడ నుండి లేచి వెళ్ళను" అని నిశ్చయం చేసుకుని, శ్రీరంగంలో అర్చారూపిగా నిలచి ఉండి, ఆ యా భక్తుల నైచ్యాలను గమనించకుండా, వారికి దర్శనాన్ని ఇస్తూ ఉండే శ్రీరంగనాథునకు కూడా కళ్ళు రెండై ఉండడమా? ఈ శ్రీరంగనాథుని కృపను చూస్తే, ఈ స్వామి శరీరం అంతా నేత్రాలుగా కావద్దా!"– అని భావించి, " అన్ని మండలాలు తమకే స్వాధీనం కావాలి" అని భావించే ప్రభువులు ముందుగా తమకు దగ్గరలో ఉండే సామంత రాజులను ముట్టడించి, వారిని ఆక్రమించినట్లుగా, శ్రీరంగనాథుని తిరుమేనిలో ఉండే మిగిలిన అవయవాలను అన్నిటిన మేమే ఆక్రమించాలి " భావించిన శ్రీరంగనాథుని తిరునేత్రాలు, వాటికి దగ్గరలో ఉండే అవయవాలు చెవులు కనుక, వాటిని జయించి, ఆక్రమించి, ఆ తరువాత వాటికి ఆవలి వైపు పోవాలని ప్రయత్నించి, వాటితో స్పర్ధిస్తున్నట్లుగా శ్రీరంగనాథుని నేత్రాలు చెవి వరకు వ్యాపించి ఉండే సన్నివేశం ఉన్నది).

పెరుమాళ్ తిరుమొళిలో **"తడఙ్గొళ్ తామరై క్కణ్ణళుమ్"** (7-5) అనుచోట, పెరియవాచ్చాన్పిళ్లై **"ఒరు తామరై ప్పూవే తటాకమెల్లామ్ విఙ్గుమ్పడి అలర్ న్దాప్పోలే తిరుమేని యెల్లామ్ పరప్పుమాఱుమ్బడి యలర్ న్ద తిరుక్కణ్ణళుమ్"** (ఒక తామర పువ్వే తటాకం అంతా వ్యాపించేటట్లుగా, తిరుమేని అంతా ఉండే వైశాల్యాన్ని అంతటినీ అక్రమించి వ్యాపించి వికసించిన తిరునేత్రాలు) అని వ్యాఖ్యానించుట ప్రస్తుత శ్లోకభావానుసరణమే కదా!

అర్చారూపియైన శ్రీరంగనాథుని కృపావిశేషము నిరుపమానమను తాత్పర్యము ఈ శ్లోకమువలన కల్గుచున్నది. ఇందు **"అక్షి"** అను పదమును **"సకలాంగమ్"** అను పదమునకు విధేయవిశేషణముగా అన్వయింపవలెను.

శ్రీరామానుజాచార్యవ్యాఖ్యలో **"పూర్వే తు నేత్రే కర్మణి, శ్రవసీ కర్తృభూతే సమాస్తృణీతే – రుంధః, ఇతి వదంతి"** అను యోజనాంతరము చూపబడినది. దీనినిబట్టి, ఒడలంతయు వ్యాపింపనెంచిన కన్నులను మొదటగా కర్ణములు అడ్డుకొనుచున్నవి – అను భావము కల్గును. బహుశః ఈ యోజన తర్వాతి శ్లోకములోని **"శ్రవోనాసారోధాత్"** అను శ్లోకార్థమును అనుసరించి చేయబడియుండునని తోచును. **"సమాస్తృణీతే ఇతి"** అనునపుడు ప్రకృతిభావముచే సంధి జరుగలేదు. **"సమాస్తృణాతే"**అను వేరొక పాఠమును కలదు.

అర్థసమవృత్తజాతికి చెందిన **"మాలభారిణీ"** వృత్తమున ఈ శ్లోకము రచింపబడినది. **"విషమే ససజా గురా వనోజే సభరా యశ్చ తు మాలభారిణీయమ్"** అని దీని లక్షణము.

## తామరపూలవంటి శ్రీరంగనాథుని నేత్రద్వయము నాపై దయను చూపించాలి

**99. శ్రవోనాసారోధాత్ తదవధికడోలాయితగతే**
**విశాలస్ఫీతాయద్రుచిరశిశిరాతామ్రధవళే।**
**మిథో బద్ధస్పర్థస్ఫురితశఫరద్వంద్వలలితే**
**క్రియాస్తాం శ్రీరంగప్రణయినయనాబ్జే మయి దయామ్ ॥**

**ప్ర. అ. –** శ్రవః = చెవులు, నాసా = ముక్కు – అను వీనియొక్క, రోధాత్ = అడ్డుచే, తత్ అవధిక = వాటివరకు, డోలాయిత = ఊగిసలాడు, గతే = కదలికలను కల్గినవి, విశాల = విశాలమైనది, స్ఫీతా = పెద్దది, ఆయత్ = దీర్ఘములైనవి, రుచిర = అందమైనది, శిశిర = చల్లనిది, ఆతామ్ర = కొంచెము ఎఱ్ఱనిది, ధవళే = తెల్లనివి, మిథః = పరస్పరము, బద్ధస్పర్థ = తగవును కల్గిన, స్ఫురిత = ఎగసిపడు (త్రుళ్ళిపడు), శఫరద్వంద్వ = శఫరములనెడి చేపల జంటవలె, లలితే = మనోహరములైనవి అగు, శ్రీరంగప్రణయి =

శ్రీరంగనాథునియొక్క, నయన అబ్జే = పద్మములవంటి నేత్రములు రెండును, మయి = నా యందు, దయాం = కరుణను, క్రియాస్తామ్ = చేయును గాక!

**వరివస్య :–** ఈ శ్లోకమునకూడ శ్రీరంగనాథుని నేత్రసౌందర్యము స్తుతింపబడుచున్నది. మునివాహన సూరి (తిరుప్పాణాళ్వార్లు) రచించిన అమలనాది పిరాన్ దివ్యప్రబంధములోని **"కరియ వాకి ప్పుడై పరన్దు మిళి ర్ న్దు శెవ్వరి యోడు నీణ్డ అప్పెరియవాయ కణ్గళ్"** (8) అను (నల్లనివై, పర్యంతముల వరకు వ్యాపించి, మెరిసి, ఎర్రని రేఖలతో, విశాలంగా ఉండే ఆ పెద్దవి అయిన నేత్రాలు) అను పాశురములోని భావమును మరల భట్టరు ఇందు రమణీయమైన రీతిలో అనుసంధించుట విశేషము.

శ్రీరంగనాథుని నేత్రములు, ఆ స్వామి ముఖములో ఒక పరిమితిలో వ్యాపించుటతో తృప్తి చెందక, అంతటను విస్తరింపవలయుననెడి ఆశ కల్గినవి. కాని, వాని ఆశ నెఱవేరుటకు ఒక వైపు కర్ణములు, మరియొక వైపు నాసిక అడ్డు తగులుచున్నవి. ఆ అవరోధములను రెండిటిని దాట లేని నేత్రములు ఉన్నచోటనే అటు ఇటు కదలుచు, సుడులు తిరుగుచున్నవి. స్వామి నేత్రములు విశాలములై, అందమైనవై, దయారసమును కల్గియుండుటచే, చల్లనివై యున్నవి. మఱియు, రాజలక్షణమైన కొద్దిపాటి ఎఱుపు రంగు రేఖలను కొనలలో కల్గి, మిగిలినచోట తెల్లనివై ప్రకాశించుచున్నవి. నాసికకు రెండు వైపుల విస్తరించి స్పర్ధించుచు, శఫరములు త్రుళ్లిపడుచున్నట్లున్నవి. ఇట్టి శ్రీరంగనాథుని తామరపూలవంటి నేత్రములు రెండును నాపై కరుణను ప్రసరింపచేయునుగాక –అని శ్లోకభావము.

ఈ శ్లోకములోని **"విశాలస్ఫీతాయద్రుచిరశిశిరాతామ్రధవళే"** అను విశేషణముద్వారా పైన ఉట్టంకించిన ఆళ్వార్ల పాశురార్థమును భట్టరు అనుసంధించిరని తెలియనగును. స్వామికన్నులలోని నల్లని వర్ణము ఇచట ప్రస్తావింపబడకుండుటకు, అది స్వతఃసిద్ధమగుటయే కారణము. చెవులను, నాసికను దాటివెళ్లవలెనను అభిప్రాయము కన్నులకు కలదను భావము **"డోలాయితగతే"** అను పదముచే స్ఫురించుచున్నది. **"ఆతామ్రధవళే"** అను

విశేషణము "శెవ్వరి యోడు" అను పాశురములోని పదమును అనుసరించి ప్రయోగింపబడినది.

భగవానుడు పుండరీకాక్షుడు. **"పుండరీకం సితాంభోజమ్"** అను నిఘంటువచనము ప్రకారము పుండరీకాక్షుడగు భగవానుని కన్నులు తెల్లని తామరలవలె ఉండునని చెప్పవలసియున్నది. కాని, పరమార్థవిదులగు ఆళ్వార్లు భగవానుని నేత్రములను ఎఱ్ఱ తామరలతో ఉపమించిరి. భగవానుని నేత్రములు తెల్లనివైనను ఆ నేత్రముల చివరలో ఎఱుపు రంగును కల్గియుండుటచే అట్లు పల్కిరి. అట్టి ఎఱ్ఱదనమునకు ఉభయవిభూతినాయకత్వము, శ్రియఃపతిత్వము, భక్తవాత్సల్యమును హేతువులని అభియుక్తులగు ఆచార్యులు వ్యాఖ్యానించిరి. **"శెవ్వరియోడు"** అను భాగమును వ్యాఖ్యానించుచు అళకియమణవాళ ప్పెరుమాళ్ నాయనార్ "శ్రియఃపతిత్వత్తాలుమ్, వాత్సల్యత్తాలుమ్ శివన్దిరుక్కై. ఐశ్వర్యత్తాలుమ్, వాత్సల్యత్తాలుమ్ శివన్దిరుక్కుమ్ ఎన్నవుమామ్" (భగవంతుని నేత్రాలు లక్ష్మికి నాథుడై ఉన్నందువల్ల, వాత్సల్య గుణంవల్ల ఎర్రగా ఉంటాయి. ఐశ్వర్యం వల్ల, వాత్సల్య గుణంవల్ల కూడా ఎర్రగా ఉంటాయి – అని చెప్పవచ్చు) అని పల్కిరి. శ్రీపిళ్లై లోకాచార్యులు అను ఆచార్యులు అర్చిరాదిలో **"చేతనర్ పక్కల్ వాత్సల్యాతిశయత్తాలుమ్, శెయ్యాళాన పిరాట్టియై యెప్పోదు మొక్క కటాక్షిక్కైయాలుమ్, ఉభయవిభూత్యైశ్వర్యత్తాలుమ్ శివన్ద"** (జీవుల విషయంలో ఎల్లప్పుడూ వాత్సల్యం కలిగి ఉండడం వల్ల, ఎర్రని వర్ణాన్ని కలిగిన లక్ష్మీదేవి ఎల్లప్పుడూ స్వామిని కటాక్షించడం వల్ల, విభయ విభూతులను ఐశ్వర్యాన్ని కలిగి ఉండడంవల్ల ఎర్రగా ఉండే) అని పల్కుటకూడ ఈ అర్థమును అనుసంధించుటయే. కావున, నేత్రము ఈషత్ రక్తవర్ణ స్పర్శను కల్గియుండుట పరత్వ, సౌలభ్య సూచకమని చెప్పనగును. **"ఆతామ్ర"** అనునపుడు **'ఆఙ్'** అను ఉపసర్గ ఈషదర్థమున ప్రయోగింపబడినది

ఈ సందర్భమున శ్రీగుణరత్నకోశములోని **"తత్స్వీకారకలావలేపవపుషా"**(40) అను శ్లోకభావము స్మరింపదగినది.

ప్రస్తుతశ్లోకములోని **"రుచిరశిశిరాతామ్రధవలే"** అను విశేషణము అబ్జములకుకూడ సార్థకమగుటయు గమనింపదగినది.

శఫరములకు స్ఫురణము సహజగుణము. శ్రీరంగనాథుని కన్నులకు మిథోబద్ధస్పర్థత ఆశ్రితులను కటాక్షించుటలో– అని భావము. అట్టి స్పర్థ ఎర్పడుటకు భగవానుని అనాదియైన నిర్హేతుకకృపయే కారణము.

ప్రణవము భగవత్స్వరూపప్రతిపాదకము, శ్రీరంగవిమానము ప్రణవాకారము కావున, శ్రీరంగనిమానమున భగవానుడు పరమపదమునపకంటె ఎక్కువ ప్రీతిని కల్గియుండుట తగినదే – అను భావము **"శ్రీరంగప్రణయి"** అనుటుచే ధ్వనించుచున్నది. ఆ ప్రీతివలన స్వామికన్నులు విశాలములును, స్ఫీతములును అయినవి.

శ్రీరామానుజాచార్యవ్యాఖ్యానమున **"యథా హి పార్శ్వస్థితాభ్యాం రోధాభ్యాం ప్రతిరుద్ధపార్శ్వప్రసరణా నిమ్నగా విశాలగంభీరాయతా, రుచిరా, శిశిరా, యత్కించిదుపాధినా తామ్రా, క్వచిద్ధవళా, మిథో బద్ధస్పర్ధస్ఫురితశఫరద్వంద్వలలితా, నిమ్నస్థలే ప్రవహతి, తద్వత్, నిమ్నే మయి దయాం ప్రవాహేతామ్ – ఇతి ధ్వన్యతే"** (ఇరు వైపులా ఉండే తీరప్రదేశముల చేత అడ్డగింపబడిన ప్రవహించే నది, విశాలమై, గంభీరమై, విస్తృతమై, చల్లనిదై ప్రవహించుచున్నదై, ఏదో ఒక కారణం చేత కొన్నిచోట్ల ఎర్రనిదై, కొన్నిచోట్ల తెల్లనిదై, ఒకదానితో ఇంకొకటి కలహిస్తూ ఉండే చేపల జంటను కలిగి ఉండడంచేత మనోహరమై, కింది ప్రదేశానికి ప్రవహించినట్లుగా, తక్కువవాడైన నాపై శ్రీరంగనాథుని నేత్రములు అనే నది ప్రవహించుగాక– అని ఇక్కడ ధ్వనిస్తున్నది) అను ఒక విశిష్టమైన ధ్వన్యర్థము చూపబడినది. ఈ వివరణము మొదటి మూడు పాదములలోని విశేషణములన్నియు నదీపరములుగాకూడా అన్వయించి చేయబడినది.

శ్రీరంగనాథుని నేత్రములను నదులతో కవి పోల్చుట తరువాతి శ్లోకములో స్పష్టముగా గమనింపవచ్చును, **'మయి'** అను సర్వనామ శబ్దము

ఆకించన్యమును బోధించును. నదీజలము పల్లమునకు ప్రవహించునట్లు, నదివంటి శ్రీరంగనాథుని నేత్రద్వయము మిక్కిలి తక్కువవాడనగు నాయందు ప్రవహించును గాక! అని ఇచట తాత్పర్యము.

నదిలోని నీరు సహజముగా స్వచ్ఛమైనది అయినను, గైరికధాతువుల సంయోగముచే ఎఱ్ఱగా మారునట్లే, స్వామి నేత్రములును క్వచిత్ కించిత్ రక్తిమను పూర్వోక్త హేతువుల వలన కల్గియున్నది.

శ్రీరంగనాథుని నేత్రముల కదలికలు పరస్పరము స్పర్థించు శఫరముల కదలికలతో ఉత్ప్రేక్షింపబడుటచే ఇచటి అలంకారము ఉత్ప్రేక్ష, సమాసోక్తియు కలదు. ఇందు వృత్తము శిఖరిణి. శిఖరి (శిఖరములను కలిగినది) అయినా పర్వతముల నుండి పుట్టి ప్రవహించు నదులతో శ్రీరంగనాథుని నేత్రములను రూపించుచు వర్ణించు ఈ శ్లోకమును శిఖరిణి వృత్తమున రచించుట విశేషము.

**అమృత ప్రవాహములవంటి శ్రీ రంగనాథుని నేత్రముల కటాక్షప్రవాహములు నాపై ప్రసరించాలి**

**100. కరుణామృతకూలముద్వహైషా**
**ప్రణమత్స్వాగతికీ ప్రసన్నశీతా ।**
**మయి రంగధనోపకర్ణికాక్ష్ణోః**
**సరితో ర్వీక్షణవీచిసంతతిః స్తాత్॥**

**ప్ర. అ. –** రంగధన = శ్రీరంగమున గొప్ప సంపదవంటి శ్రీరంగనాథుని,, కరుణా = కరుణ అను, అమృతకూల ముద్వహా = అమృతముతో నిండినది, ప్రణమత్ = ప్రణమిల్లువారిని గూర్చి, స్వాగతికీ = ఆదరముతో స్వాగతమును పల్కునది, ప్రసన్నశతా = స్వచ్ఛమైనది, చల్లనిది, ఉపకర్ణికా = చెవులవరకు వ్యాపించియున్నది, అగు, ఏషా = ఈ, అక్ష్ణోః = (నీ) కన్నులు అను, సరితోః = రెండు నదులయొక్క, వీక్షణవీచి = కటాక్షములనెడు ప్రవాహముల, సంతతిః =

వరుస, మయి = నాపై (దయనీయుడనగు నాపై), స్తాత్ = ఉండుగాక (ప్రసరించుగాక).

**వరివస్య :–** శ్రీరంగనాథుని కటాక్షవైలక్షణ్యమును కవి ఇందు చక్కని రూపకముద్వారా స్తుతించుచున్నారు. పూర్వశ్లోకమున శ్రీరంగనాథుని కన్నులను పద్మములుగా, శఫరములుగా రూపించిన కవి ఇందు ప్రవహించు కృపానదులుగా వర్ణించుచున్నారు. స్వయముగా నదిగా, పద్మములుగా, శఫరములుగా అగుట స్వామినేత్రముల విశిష్టత. స్వామిలోచనములు అను నదులు కూలంకషములు అయినట్లే (ఒడ్డును ఒఱసుకొని ప్రవహించునట్లే), ఈ శ్లోకమున భట్టరు అనుభవముకూడ కూలంకషమై భాసించుచున్నది.

శ్రీరంగనాథుని రెండు నేత్రములు కరుణ అను అమృతముతో నిండి పొంగిపొరలు రెండు నదులు. ఆ నేత్రములనుండి వెలువడు కటాక్షములు కెరటములు. ఆ కటాక్షవీచికలు చల్లనివి, స్వచ్ఛమైనవి, అమృతమయమైనవి. అవి, శ్రీరంగనాథుని ప్రణమిల్లువారిని గూర్చి "**రండు, రండు**" అను స్వాగతవచనములను పల్కుచున్నవి. అట్టి కటాక్షములు నాపై ప్రసరించును గాక! అని శ్లోకభావము.

తిరుక్కచ్చినమ్బి రచించిన దేవరాజాష్టకములో "**త్వదీక్షణసుధాసింధు వీచివిక్షేపశీకరైః**" (8) (నీ నేత్రములు అను అమృత సముద్రములలోనుండి పుట్టిన కెరటముల ప్రసరణములవల్ల పుట్టిన నీటి కణములతో నన్ను నీవు అభిషేకించాలి) అను శ్లోకమున, భగవానుని నేత్రములు అమృతముతో నిండిన నదులతో పోల్చబడినవి. అట్లే, కూరేశుల వరదరాజస్తవమున "**తవ దృక్ చలసింధోః**" (35) అనునపుడు సింధుశబ్దమునకు సముద్రమని అర్థము చెప్పబడినను, నది అను అర్థమును కూడ చెప్పు వీలు కలదు. "**సింధుః సముద్రే నద్యాం చ నదే దేశేభదానయోఃష**" అని విశ్వనిఘంటువు తెలుపుచున్నది. భట్టరు ఈ క్రమములోనే ఇచట శ్రీరంగనాథుని నేత్రములను నదులతో పోల్చిరి. 59వ శ్లోకమున కూడ "**శేషశయలోచనామృతనదీ**" (55) అనుచు కవి

స్వామినేత్రములను అమృతనదులతో పోల్చుట ఇచట గుర్తుకు తెచ్చుకొనదగినది. నదిని బోధించు శబ్దము లేకున్నను, ముందు శ్లోకములోని విశేషణములన్నియు నదికి సంబంధించియున్నవి అను విషయము నిరూపింపబడినది కదా! "**కరుణామృత**" అనునపుడు అమృతశబ్దము శ్లిష్టము. దానికి, నదీపరమున జలమని, నేత్రపరమున అమృతమని అర్థము.

"**స్వాగతం పృచ్ఛతి ఇతి స్వాగతికీ**", అనగా, స్వాగతవాక్యములను పల్కునది – అని అర్థము.

నదిలోని నీరు సూర్యకిరణముల వేడిమిచే తాత్కాలికముగా పైన కొంతభాగము మాత్రము వేడిమిని పొందినను, ఆ నీరు కొంత సేపటిలోనే చల్లారి, స్వభావసిద్ధమగు చల్లదనమును పొందును. అట్లే, భగవానుని, నేత్రములకును చల్లని గుణమే స్వాభావికము, కోపము ఆగంతుకము, స్వల్పకాలికమును. ఈ భావము "**శీత**" అను పదముచే ధ్వనించుచున్నది. "**ఆర్తస్వాగతికైః ఆలోకితైః**" (75) అను ఉత్తరశతకములోని సూక్తి ఇచట స్మరింపదగినది.

నదీపరమున "**ప్రణమత స్వాగతికీ**" అనుటకు, స్నానము చేయువారికి సుఖమును కల్గించునది – అని భావము. మునుగుట అనగా, వంగి స్నానము చేయుటయే కదా! కావున "**ప్రణమత్**" శబ్దము ఇచట మిక్కిలి అర్థవంతము, భగవానుని నేత్రముల పక్షమున, "**ప్రసన్నా**" అనగా, అనిష్టనివర్తక – అని, "**శీతా**" అనగా, ఇష్టప్రాపిక – అని అర్థము. జలమున దోషములు లేనపుడు ప్రసన్నముగా నుండును. అట్టి నీరు శరీరమునకు చల్లగా నుండును. అట్లే భగవానుని నేత్రవీక్షణ సంతతియు నిగ్రహరూప దోషము లేనిది కావున మనస్సునకు చల్లదనమును కల్గించును – అని తాత్పర్యము. లోకమున ధనమును కల్గినవారి చూపు "**మీలచ్చక్షుషి వేల్లితభ్రుణి ముహుః దత్తావమానాక్షరే**" (సంకల్ప. 6-69) అనునట్లు గర్వముతో కూడుకొనియుండును. కానీ, రంగధనుని చూపు మాత్రము ప్రసన్నము, చల్లనిది అగుట విశేషము. "**ఉపకర్ణికా**" అనుటకు "**సమీపే**

**కర్ణికా యస్యాః సా తథోక్తా**", అనగా, సమీపమున కర్ణాభరణమును కల్గినది – అను అర్థమును చెప్పవచ్చును. అనగా, కర్ణాభరణమువరకు వ్యాపించియున్నదని భావము. లేక, "**రంగధనోపకర్ణికాకోఽక్ష్ణః**" అని ఏకపదముగాకూడ గ్రహింపవచ్చును. అపుడు, ఉపకర్ణికాశబ్దము అక్షికి విశేషణమగును. "**రంగధన**" అను పదము వ్యస్తముగా, సంబోధనాంతముగా కాక, శ్రీరంగనాథునియొక్క– అని అర్థమిచ్చును. పై రెండు అన్వయములును శ్రీరామానుజాచార్య వ్యాఖ్యానమున చూపబడినవి.

కాశీనగరమున ప్రవహించు గంగానదిలో "**మణికర్ణిక**" అను రేవు కలదు. ఆ ఘట్టము మిక్కిలి ప్రసిద్ధమైనది. అట్లే, నదీసామ్యమును కల్గిన శ్రీరంగనాథుని నేత్రవీక్షణములకు "ఉపకర్ణికా" అను పేరు పెట్టవచ్చును– < అను సరసమైన భావము ఇచట '**ఉపకర్ణికా**' శబ్దముచే ధ్వనించుచున్నదని శ్రీ. ప్ర. భ. అణ్ణంగరాచార్యస్వామివారు సూచించిరి. అనగా, కర్ణమూలసమీపమున చరించుచున్నదని తాత్పర్యము. ఇట్టి వివరణమే శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో కూడ కనిపించుచున్నది.

"**ఊన మిల్ శెల్వమెన్గో!**" (తి. వా. –3–4–7)(ఏ తక్కువదనము లేని సంపద అని అందునా!), "**వైత్తమానిది**" (6–7–11) (చేర్చి పెట్టుకున్న గొప్ప నిధి) ఇత్యాదిగా ఆళ్వార్లు భగవానుని ధనముగా రూపణము చేసిరి. కావున, భట్టరు "**రంగధన**" అనుచు శ్రీరంగనాథుని ధనముగా రూపించిరి. "**ధినోతి ప్రీణయతి ఇతి ధనం–ధిని– ప్రీణనే**" (సంతోషింపచేయునది కావున, ధనము.) అను వ్యుత్పత్తిని కల ధనశబ్దప్రయోగము ఇచట అర్థవంతము, భక్తులను సంతోషింపజేయు శ్రీరంగనాథుని ధనముగా రూపించుట తగినది కదా. అట్లే, "**రంగం ధనం యస్య సః రంగధనః**" అను వివరణమువలన తనను సంతోషింపజేయు శ్రీరంగనగరమును ధనముగా కలవాడనియు ఇచట స్ఫురించును. ఈ వివరణము పురాణ ప్రసిద్ధమైన శ్రీరంగ క్షేత్రమాహాత్మ్యమును అనుసరించి చేయబడినది.

ఇందు వృత్తముమూలభారిణి. ఈ వృత్తము అర్ధసమవృత్తజాతికి చెందినది.

**శ్రీరంగనాథుని నాసిక కల్పలత, చిరునవ్వు దాని పువ్వు, చెక్కిళ్ళు దాని చిగుళ్లు**

**101. విలసతి నాసాకల్పక-**
**వల్లీ ముగ్ధేవ రంగనిలయస్య ।**
**స్మిత మపి తన్నవకుసుమం**
**చుబుకకపోలం పల్లవోల్లసితమ్ ॥**

**ప్ర. అ. –** రంగనిలయస్య = శ్రీరంగనాథునియొక్క, నాసా = నాసిక, ముగ్ధా = అందమైన, కల్పకవల్లీ = కల్పలత, ఇవ = వలె, విలసతి = ప్రకాశించుచున్నది, స్మితమపి = మందహాసముకూడ, తత్ = ఆ కల్పలతయొక్క నవ = క్రొత్తదైన, కుసుమం = పూవు, చుబుక = చుబుకము (గడ్డము), కపోల = చెక్కిళ్లు అను ఇవి, పల్లవ = చిగుళ్ల యొక్క, ఉల్లసితం = వికాసము వలె (భావమువలె), విలసతి = ప్రకాశించుచున్నవి.

**వరివస్య :–** ఈ శ్లోకమున శ్రీరంగనాథుని నాసిక, మందస్మితము, చుబుకము, కపోలములును వర్ణింపబడుచున్నవి. శ్రీరంగనాథుని నాసిక మనోహరమైన లేలేత కల్పలతవలె ఉన్నది. మందస్మితము ఆ లత పూచిన కొంగ్రొత్త పూవుగా, చుబుకము, చెక్కిళ్లు ఆ కల్పలతయొక్క చిగుళ్లుగా భాసించుచున్నని – అని శ్లోకభావము.

నమ్మాళ్వార్లు తిరువాయ్ మొళిలో **"ఈట్టియ వెణ్ణెయ్ ఉణ్డాన్ తిరుమూక్కు మాట్టుయర్ కఱ్పకత్తిన్ వల్లియో?"** (తి. వా. –7–7–2) (గొల్లవనితలు చేర్చి పెట్టిన వెన్నను ఆరగించిన స్వామినాసిక ఉన్నతమైన ప్రదేశంలో ఉండే కల్పవృక్షం తీగయా?) అని, **"కోలనీళ్ కొడిమూక్కుమ్!"**

(అందమైన, దీర్ఘమైన, లతవంటి నాసిక) (5-5-6) అని భగవానుని నాసికను కల్పలతగా, అందమైన లతగా వర్ణించిరి. భట్టరు ఈ భావనను అనుసరించి ఇందు శ్రీరంగనాథుని నాసికను కల్పలతతో పోల్చిరి. పైన ఉట్టంకింపబడిన మొదటి పాశురమును వ్యాఖ్యానించుచు అళకియమణవాళ చ్చీయర్ అను ఆచార్యులు **"అభిరూపమాయ్, నీణ్డ కల్పకక్కొడిపోలే యిరుక్కిఱ తిరుమూక్కుమ్, అతినుడైయ పూవెన్నలామ్బడియాయ్ తామరైపోలే యిరుక్కిఱ తిరుక్కణ్గళుమ్, అతిన్ కని ఎన్నుమ్బడి పఴుత్త తిరువధరముమ్"** (చాలా మనోహరమై, దీర్ఘంగా ఉండే కల్ప లతవలె ఉండే నాసిక, అది పూచిన పువ్వు అనేటట్లుగా ఉన్నదై, తామర పువ్వువలె ఉండే తిరునేత్రాలు, దాని పండు అనేటట్లుగా ఎఱ్రగా పండిన పండువలె ఉండే అధరం) అని పల్కుట ఇచట స్మరింపదగినది. **"కోలనీళ్ కొడి మూక్కుమ్"** అను పాశురమును వ్యాఖ్యానించుచు నమ్బిళ్ళై కూడ ఇట్టి భావమునే వివరించిరి.

కూరేశులు సుందరబాహుస్తవమున భగవానుని నాసికను **"విభాతి నాసా కల్పద్రుమాంకురనిభా"** (45) (? సుందరబాహుస్వామినాసిక కల్పవృక్షపు మొలకవలె ప్రకాశిస్తున్నది) అనుచు, కల్పవృక్షముయొక్క మొలకగా స్తుతించిరి. భట్టరు 68వ శ్లోకమున శ్రీరంగనాథుని కల్పవృక్షముగా వర్ణించిరి. ఇందు ఆ కల్పవృక్షమును ఆశ్రయించియున్న లతను, ఆ అత పూచిన పూవును, చిగిర్చిన చిగుళ్లను వర్ణించిరని చెప్పనగును. **"చుబుకకపోలమ్"** అను ద్వంద్వసమాసము, ప్రాణ్యంగములకు చెందినదగుటచే, సమాహారము చేయబడినది. **"పల్లవోల్లసితమ్"** అనుటకు బదులు **"పల్లవోల్లాసమ్"** అను పాఠాంతరమును కలదు. కాని, అర్థభేదము లేదు. ఛందస్సునకు ఒప్పును.

ఇందు అలంకారము ఉపమ, వృత్తము ఆర్య.

**శ్రీరంగనాథుని మకర కుండలములు మకర శ్రేష్ఠములు**

**102. నయనశఫరవిద్ధౌ కర్ణపాశావరుద్ధౌ**
**రుష ఇవ లుఠతోఽ ర్చిర్మంజరీ రుద్గిరంతౌ ।**
**పరిమిళదళకాళీశైవలా మంసవేలాం**
**అనుమణిమకరోత్థౌ రంగధుర్యామృతాబ్ధేః ॥**

**ప్ర. అ.** – రంగధుర్య = శ్రీరంగనాథుడను, అమృత+అబ్ధేః = అమృత సముద్రముయొక్క (ముఖమునకు), పరిమిళత్ = చుట్టును వేలాడు, అలక+ ఆళీ = ముంగురుల సమూహము అను, శైవలాం = నాచును కల్గినది, అంసవేలామ్ అను = భుజాగ్రములను తీరము సమీపమున్న, నయన = కన్నులు అను, శఫర = శఫరముచే (బేడిసచేపలచే), విద్ధౌ = తాడనము చేయబడినదవి, కర్ణపాశ = గొప్ప కర్ణములచే, అవరుద్ధౌ = అడ్డగింపబడినవి అగుటచే, రుషః = కోపమువలన, అర్చిస్+మంజరీ = తేజోరాశులను పూల గుత్తులను, ఉద్గిరంతౌ ఇవ = వెడలగ్రక్కుచున్నవివలె ఉన్నవగు, మణిమకర+ఉత్థౌ = గొప్ప రత్నకుండలములను మకరశ్రేష్ఠములు (సొఱచేపలు), లుఠతః = పొఱలుతున్నవి (మెఱయుచున్నవి).

**వరివస్య :–** భుజాగ్రములవరకు తళతళమని మెఱయు శ్రీరంగనాథుని కర్ణాభరణములను కవి మనోహరమైన రూపకాలంకారముతో అభివర్ణించుచున్నారు. కర్ణాభరణములు సొరచేపల ఆకారములో నుండును. కావున, వానికి మకరకుండలములు అని పేరు. ఇవి అనర్ఘములైన రత్నములతో చేయబడినవి, కావున, వాని కాంతి గొప్పది. కర్ణములు దీర్ఘములైనవగుటచే కర్ణాభరణములును భుజములను తాకుచున్నట్లుండును. ఆకారములోని సాదృశ్యమును బట్టి కవి కర్ణకుండలములను సొఱచేపలుగా రూపించుచు స్తుతించుచున్నారు.

ముందు శ్లోకమున శ్రీరంగనాథుని నాసికను కల్పలతగా కవి వర్ణించిరి. కల్పలత క్షీరాబ్ధిలో పుట్టినది. భగవానుడే ఈ సమస్తజగత్తునకు కారణమును,

కార్యమును "**న తస్య ప్రాకృతా మూర్తిః**" (వరాహపు. 75-44) (ఆ భగవానుని రూపము ప్రాకృతమైనది కాదు) అనునట్లు శ్రీరంగనాథుని నాసికాకల్పలత అమృతస్వరూపమైనదగుటచే, అమృతసముద్రమునుండి పుట్టినది కావలెను. కావున, ఇందు, భగవానుడు అమృతసముద్రముగా రూపింపబడుచున్నాడు.

శ్రీరంగము ఒక నాటకరంగము. శ్రీరంగనాథుడు ఒక గొప్ప నటుడు. అతడు వేర్వేరు విచిత్రములైన వేషములను దాల్చి, ఆశ్రితులు అను ప్రేక్షకులను రంజింపజేయును. ఆ పద్ధతిలో ఇచట స్వామి అమృతసముద్రరూపమున దర్శనమిచ్చుచున్నాడు. "**నద్యః సముద్రాశ్చ స ఏవ**" (నదులు, సముద్రములు ఆ భగవానుడే) అనునట్లు, అన్నియు భగవత్స్వరూపములేకదా! కావున, భగవానుని దివ్యదేహము అమృతాబ్ధిగా, నయనములు శఫరములుగా, కర్ణములు ఆ చేపలను పట్టుటకొఱకగు పాశములుగా, భుజసంధులు తీరములుగా, ముంగురులు నాచుగా, కుండలములు మకరములుగా ఇచట రూపింపబడుచున్నవి.

చేపలు సముద్రతీరమున పొఱలును. అవి అట్లు పొఱలునపుడు తళతళలాడును. స్వామి కర్ణాభరణములు అను సొఱచేపలును భుజాగ్రములను సముద్రతీరమున పొఱలు చున్నవి. స్వామి అద్భుతసముద్రమైనపుడు, ఉన్నతములైన భుజాగ్రములను సముద్రతీరముగా చెప్పుట యుక్తమే కదా! సముద్రతీరమున నల్లని రంగులో నాచు ఉండును కదా! ఇచట కూడ భుజాగ్రములవరకు వేలాడు కురులు నాచువలె కనుపించుచున్నవి. "**ఉదగ్రపీనాంస విలంబికుండలాలకావళీ**"(చాలా గొప్పవి బలిష్ఠమైనవి అయిన అంసభాగముల వరకు వేలాడు కుండలముల చేత, ముంగురుల సమూహము చేత అందమైన కంఠాన్ని కలిగినవాడు) (34) అని యామునులు, "**పూఙ్కుళ్ల్ కళ్ తడన్తోళ్ మేల్ మిళిర నిన్ఱు**" (నాయ్ చ్చి. తి. -14-8) (పూలచే అలంకరింపబడిన కేశపాశం విశాలమైన బాహువులపై ప్రకాశిస్తూ ఉండగా) అని గోదాదేవి భుజాగ్రముల వరకు వ్రేలాడు స్వామి కురులను వర్ణించిరి కదా!

లోకమున తీవ్రమైన కోపమును కల్గినవారు తమ కోపాగ్నిని వెడల గ్రక్కుట సహజము, శ్రీరంగనాథుని కర్ణభూషణములు తళతళమని మెఱయుట ఎట్లున్నదనగా, సొఱచేపలు రోషముచే తేజోమంజరులను వెడల గ్రక్కుచున్నట్లున్నది.

ఈ కర్ణాభరణములు సొఱచేపలకు తీవ్రమైన కోపము కల్గుటకు కవి ఇచట రెండు కారణములను తెలుపుచున్నారు. శ్రీరంగనాథుని నేత్రములు బేడిసచేపలవలె ఉన్నవి. అవి మత్స్యాకారములోనున్న కర్ణాభరణములను తాడనము చేసినవి. ఇది ఒక కారణము. అంతియేకాక, కర్ణాభరణములను మత్స్యములు కర్ణములను పాశముచే అడ్డగింపబడినవి. ఇది వేరొక కారణము. ఈ రెండు కారణములచే స్వామికర్ణాభరణములను చేపలకు మిగుల రోషము కల్గినది. ఒక చేప, వేరొక చేపను కొట్టుట, ఒక దానిని వేరొకటి మింగుట చేపజాతికి సహజము. కావున, ఇచట కవి కర్ణభూషణములను మత్స్యములను నేత్రములను చేపలు తాడనము చేసెనని వర్ణించుట ఉచితముకదా. కాని, పారిపోవుటకు వీలు లేకుండ, ఆ కర్ణాభరణములు అను చేపలను కర్ణములను పాశములు బంధించినవి. ఇట్లు కవి వర్ణించుటలోని తాత్పర్యమేమనగా, శ్రీరంగనాథుని మకరకుండలములు ఆకర్ణాంతములైన నేత్రముల సౌందర్యమునకు అభివర్ధకములై, కర్ణములలో అమరి తళతళలాడుచున్నవి —అని.

తిరుమఙ్గై యాళ్వార్లు "**తాழ்న్దిలఙ్గు మకరమ్ శేర్ కుழైయుమ్**" (క్రిందకి వేలాడుతూ ప్రకాశిస్తూ ఉండే, మకరములవంటి కర్ణాభరణములు) (25) అని తిరునెడున్దాణ్డకమ్ దివ్యప్రబంధములో, "**మణిమకరకుణ్డలఙ్గళ్ విల్ వీశ**" (మణులను పొదిగిన మకర కుండలములు కాంతులను వెదజల్లగా) (1) అని పెరియ తిరుమడల్ లోను మకరకుండల శోభను కొనియాడిరి. ఇచట "**భూషామయీ మకరికావివిధాన్ విహారాన్**" (దేవ. పం. 22) (అలంకారముల రూపంలోని, మకరికల ప్రకారాలలో ఉండే విలాసాలను) అను దేశికసూక్తి

స్మరణీయము. '**ఉద్**' శబ్దము శ్రేష్ఠవాచకము. "**కర్ణపాశావరుద్ధా**" అనునపుడు, పాశశబ్దము శ్రేష్ఠ వాచకమనుటను 73వ శ్లోక వ్యాఖ్యానమున వివరింపబడినది.

తిరువిరుత్తము ప్రబంధములోని "**పులక్కుణ్డలప్పుణ్ణరీకత్త పోర్ క్కెణ్డై, వల్లియెన్ఱాల్ విలక్కుణ్లాకిస్టు వేల్ విఴ్రుక్కిన్ఱన**" (57) (అందమైన కుండలాలను కలిగిన, తామర పువ్వువంటి, నాయిక ముఖంలో ఉండేవి, తమలో ఒకదానితో ఇంకొకటి ఎదిరించి పోరాడే రెండు బేడిస చేపలవంటివి అయిన కన్నులు, నాసిక అనే ఒక తీగతో అడ్డగింపబడి, ఒకదానిపై ఇంకొకటి కోపగించుకొని, వేలాయుధంతోగుచ్చినట్లుగా బాధిస్తూ చూస్తున్నాయి) అను పాశురములోని భావమునకు, ప్రస్తుతశ్లోక భావమునకు కల సాదృశ్యము మిగుల రమణీయము, గమనింపదగినదియు.

శ్లోకములోని కర్మప్రవచనీయసంజ్ఞను పొందిన 'అను' అను అవ్యయమును లక్షణార్థము, ఇత్థంభూతాఖ్యానమున, తృతీయార్థమున అన్వయింపవచ్చునని శ్రీరామానుజాచార్యవ్యాఖ్యానమున తెలుపబడినది.
ఇందు అలంకారము సాంగమైన రూపకము. వృత్తము మాలిని.

## అందమైన సరస్సువంటి శ్రీరంగనాథుని ముఖము నాకు ముఖంగా ఉండాలి

**103. అధరమధురాంభోజం తత్కర్ణపాశమృణాలికా–**
**వలయ మభి మా మాస్తాం రంగేందువక్త్రసర శ్చిరమ్ ।**
**నయనశఫరం నాసాశైవాలవల్లరీ కర్ణికా–**
**మకర మలకశ్రేణిపర్యంతనీలవనావలి ॥**

**ప్ర. అ. –** అధర = క్రింది పెదవి అనెడి, మధుర = భోగ్యమైన, అంభోజం తామరపూవును కల్గినది, కర్ణపాశ = కర్ణపాశములు (చెవి తమ్మలు) అనెడి, మృణాళికావలయం = తామరకాడల సమూహమును కల్గినది, నయన = నేత్రములనెడి, శఫరం = చేపలను కల్గినది, నాసా = ముక్కు అనెడి, శైవాల =

నాచుయొక్క, వల్లరీ = తీగలను కల్గినది, కర్ణికా = కర్ణభూషణములను, మకరం - సొఱచేపలను కల్గినది, అలకశ్రేణీ = ముంగురుల వరుసలనెడి, పర్యంత = తీరప్రదేశమున గల, నీల = నల్లని, వన ఆవలి = వనసమూహమును కల్గినదగు, తత్ = ఆ (విలక్షణమైన), రంగ ఇందు = శ్రీరంగనాథునియొక్క, వక్ర = ముఖమనెడి, సదః = సరస్సు, చిరం = చిరకాలము, మామ్ అభి = నాకు అభిముఖముగా, ఆస్తాం = ఉండుగాక!

**వరివస్య :-** ఇందు, భట్టరు, శ్రీరంగనాథుని ముఖమును సరస్సుతో రూపణమును సాంగముగా చేయుచు స్తుతించుచున్నారు.

శ్రీరంగనాథుని ముఖము గాంభీర్యము, మాధుర్యము, చల్లనిదనము, తేటదనములనెడి గుణములలో సామ్యమును కల్గియుండుటచే, సరస్సువలె ఉన్నది. ఆ ముఖమున గల తేనెలూరు అధరములు మధురములైన పద్మములు. పాశములవంటి కర్ణములు ఆ పద్మముల కాడలవలె ఉన్నవి. నేత్రద్వయము బేడిసచేపలవలెనున్నది. సన్నని పొడుగైన నాసిక నాచుతీగలవలె నున్నది. మకరకుండలములు సొఱ చేపలవలె నున్నవి. ముంగురులు ఆ సరస్సునకు సమీపమున గల నల్లని వనములవలె ఉన్నవి. అట్టి సరస్సువంటి స్వామి ముఖము ఎల్లప్పుడును నా కనుల ముందు నిలువవలెను- అని శ్లోకభావము.

శ్రీరంగనాథుని ముఖమును సరస్సుతో పోల్చుటకు అనుగుణముగా సాధారణముగా సరస్సులోనుండు పలు విధములైన భాగములను కవి చమత్కారముగా ఇందు రూపించిరి. అధరము పద్మములనుటకు- అది తేనెను స్రవించుట కారణము. "**మధు రాతి ఇతి మధురా, ర- ప్రస్రవణే**" అను వ్యుత్పత్తి ఇచట మధురశబ్దమునకు వివక్షితము. ఆళ్వార్లును భగవానుని అధరమును "**ఏడి తజ్గు తామరైపోల్ శెవ్వాయ్**"(దట్టమైన రేకులను కలిగిన తామర పువ్వువలె ఎర్రని అధరము) (పెరియ. తిరు. -7-5-6) "**శెజ్గమలమ్ పురైవాయా**" (ఎర్రని పద్మమువంటి ఆధరము) (10-4-2) "**శెజ్గనివాయ్ శెజ్గమలమ్**" (ఎర్రని పండువంటి ఆధరమ్ ఎర్రని పద్మము) (తి. వా. -2-5-1) అనుచు ఎఱ్ఱని

పద్మముతో, కమలముతో పోల్చిరి. గోదాదేవి నాయ చ్చియార్ తిరుమొళిలో **"కర్ ప్పూరమ్ నాఱుమో? కమలప్పూ నాఱుమో?"** (7. 1) (భగవానుని అధరము కర్పూరము వలె పరిమళించునా? తామర పువ్వువలె పరిమళించునా?) అనుచు సర్వేశ్వరుని అధరమునకు కమలపూల పరిమళమున్నదని పల్కుటయు ఇట్టిదే. కర్ణములు పాశముల ఆకారములో నుండుటచే అవి తామరకాడలతో రూపింపబడినవి. కర్ణములు పాశములనుటకు **"నిన్తవా నిల్లా నెఞ్జు పిణిప్పుణ్ణుమ్ పడుకణ్ణిక్కు యిఱు చ్చురళ్ పోల్ శురుణ్డురుణ్డు, నీణ్డు"** (ఎమ్బార్ జీయర్ ఉడైయవర్ తిరుమఞ్జన క్కట్టియమ్) (అతిచంచలమైన మనస్సును సైతం బంధించే బలమైన దారపు సుడులవలె గుండ్రంగా ఉన్నదై, దీర్ఘమైనదై) అను ఆర్యోక్తి ప్రమాణము.

నేత్రములు మత్స్యములుగా రూపింపబడుట కవిసమయానుగుణమే కాక, ఆళ్వార్ల సూక్తిని తలపింపజేయును. **"పెరియన కెణ్డైక్కులమ్"** (తిరువి – 11), (చాలా పెద్ద మత్స్యవిశేషద్వయం), **"అమ్ శేలుమ్"** (14) (అందమైన చేపలు) అని నమ్మాళ్వార్లు నేత్రసౌందర్యమును గూర్చి తామే పల్కిరి.

భగవానుని నాసిక నల్లనిదై, సన్ననిదై, దీర్ఘమై యుండును. కావున నాచుతీగల సమూహముతో రూపణము చేయబడినది.

కర్ణాభరణములు సొఱచేప ఆకారమున నుండుటచే అని సొఱచేపలుగా రూపింపబడినవి. ముఖము చుట్టును గల నల్లని ముంగురులు తటాకము చుట్టును ఉండు వనములతో పోల్చబడినవి. **"శురుణ్డిరుణ్డ కుழల్ తాழ ్దముకత్తాన్"** (3-6-9) (గుండ్రంగా ఉండే ముంగురులు వేలాడే ముఖమును కలవాడు) అనుచు పెరియాళ్వార్లు భగవానుని ముఖమును చుట్టును ముంగురులు కలవని పల్కిరి కదా! ఇక, 'తత్' అని ముఖమును పరోక్షముగా నిర్దేశించుట శ్రీరంగనాథుని ముఖశోభను ప్రస్తుతించుటయేకాక, కవియొక్క అస్థానే భయశంకను కూడ తెలియజేయును. ఎదురుగా నున్న ముఖమును పరోక్షనిర్దేశము చేయుట ఎట్లు తగును? అను శంక ఇచట

కలుగవచ్చును. కాని, ముఖసౌందర్యమును సేవించిన కవి ఆ శోభకు తన దృష్టి దోషము తగులునేమో? అను శంకతో ముఖమును ప్రక్కకు తిప్పుకొని, పరోక్షముగా నిర్దేశించెనని చెప్పనగును. లోకమున తల్లి కూడ తన దృష్టిదోషము తన బిడ్డకే తగులునేమో! అని శంకించుట అనుభవసిద్ధమే కదా! ఈ సందర్భమున **"అప్పెరియవాయ కణ్గళ్"** (అమల, -7) అను తిరుప్పాణాళ్వార్లసూక్తి, **"అప్పాఇచ్చశన్నియముమ్ పల్లాణ్డే"** (1) అను పెరియాళ్వార్ల సూక్తియు స్మరణీయములు.

**"అభి"** అను అవ్యయము కర్మప్రవచనీయసంజ్ఞను పొంది, అభిముఖముగా – అను అర్థము నిచ్చును.

ఇందు వృత్తము హరిణి.

## శ్రీరంగనాథుని కంఠసౌందర్యం నన్ను రంజింపజేయాలి

**104. రమయతు స మాం కంఠశ్రీ రంగనేతు రుదంచిత–**
**క్రముకతరుణ గ్రీవాకంబుప్రలంబమలిమ్లుచః ।**
**ప్రణయవిలగల్లక్ష్మీవిశ్వంభరాకరకందలీ –**
**కనకవలయ క్రీడా సంక్రాంతరేఖ ఇవోల్లసన్ ॥**

**ప్ర. అ. –** శ్రీరంగనేతుః = శ్రీరంగనాథునియొక్క ఉదంచిత = దృఢమైన (గొప్పవైన), క్రముక = పోకచెట్టుయొక్క, తరుణగ్రీవ = లేలేత తల, కంబు = శంఖము అను వీనియొక్క, ప్రలంబ = అతిశయమును (అందమును) మలిమ్లుచః = అపహరించినది, ప్రణయ = అనురాగముతో, విలగత్ = ఆలింగనమును చేయునట్టి, లక్ష్మీ = లక్ష్మీదేవి, విశ్వంభరా = భూదేవి అను వీరి యొక్క, కరకందళీ = అరటిబోదెలవంటి చేతులలోని, కనకవలయ = బంగారు గాజులయొక్క, క్రీడా = విలాసముచే, సంక్రాంత = కల్గింపబడిన, రేఖ ఇవ = రేఖలను కల్గినదివలె, ఉల్లసన్ = ప్రకాశించునట్టి, సః = ఆ (విలక్షణమైన), కంఠః = కంఠము, మాం = నన్ను, రమయతు = ఆనందింపజేయును గాక!

**వరివస్య :–** ముందు రెండు శ్లోకములలో శ్రీరంగనాథుని అమృతసముద్రముగా, సుధాతటాకముగా అనుభవించిన భట్టరు, సముద్రమున కనుపించు శంఖమును సరస్సునకు సమీపమున కనుపించు పోకచెట్టును శ్రీరంగనాథుని కంఠముతో పోల్చుటద్వారా వర్ణించుచున్నారు.

కంఠమున మూడు రేఖలను కల్గియుండుట మహాపురుషలక్షణము. "రేఖత్రయాలంకృతా గ్రీవా కంబుగ్రీవేతి కథ్యతే" (మూడు రేఖల చేత అలంకరింపబడిన కంఠము కంబుకంఠము అని చెప్పబడుచున్నది) అను సాముద్రికశాస్త్రవచనమునుబట్టి అట్టి కంఠమునకు కంబుగ్రీవమని పేరు. శ్రీరంగనాథుడు సర్వలక్షణసంసన్నుడు. కావున, ఆయన కంబుగ్రీవుడు. యామునులును స్తోత్రరత్నమున '**కంబుకంధరమ్**" (34) అని కూరేశులు "**కంబుకంధరధరమ్**" (సుందర. స్త, –50) అని భగవానుని స్తుతించిరి కదా! ఇట్లు శ్రీరంగనాథుని కంఠమున మూడు రేఖలుండుటకు భట్టరు ఈ శ్లోకమున చక్కని ఉత్ప్రేక్ష ద్వారా ఒక కారణమును సంభావించుచున్నారు.

శ్రీరంగనాథుని కంఠము బాగుగా ఎదిగిన పోకచెట్టుయొక్క లేతతల వలె, దక్షిణావర్తశంఖమువలె ప్రకాశించుచున్నది. లక్ష్మీదేవి, భూదేవులు స్వామి కంఠమును, అరటి బోదెలవంటి తమ కరములతో ఆలింగనము చేసికొనునపుడు, ఆ చేతులకుండు. బంగారు గాజుల ఒరపిడిచే వాని గుర్తులు కంఠమున ఏర్పడినవి. ఆ గుర్తులే శ్రీరంగనాథుని కంఠమున మూడు రేఖలుగా భాసించుచున్నవి. అట్టి మనోహరమైన కంఠము నా మనస్సును రంజిల్లచేయునుగాక! అని శ్లోకభావము.

ఈ శ్లోకభావమును అనుసంధించుచు వేదాంతదేశికులు దేవనాయకపంచాశత్ స్తోత్రమున,

**"పద్మాలయావలయదత్తసుజాతరేఖే,**
**త్వత్కాన్తిమేచకితశంఖనిభే. కంఠే"** (28)

(లక్ష్మీదేవి ఆలింగనము చేసుకున్నప్పుడు, ఆమె చేతులకు కల వలయముల రాపిడి చేత ఏర్పడిన చక్కని రేఖలను కలిగినది, నీ కాంతి కారణంగా పరభాగ శోభను కలిగిన శంఖమువంటిది అయిన కంఠములో) అని భగవానుని కంఠమును పొగడిరి. **"రతివలయసనాథే చాప మాసజ్య కంఠే"** అను కుమారసంభవశ్లోకము,

**"అశిథిలపరిరంభై రాహితా మిందిరాయాః,**

**కనకవలయముద్రాం కంఠదేశే దధానః"**

(బిగువుగా లక్ష్మీదేవి కౌగలిగించుకున్నప్పుడు, ఆమె చేతులకు గల వలయముల ముద్రలను భగవానుడు తన కంఠమునందు ధరించి ఉన్నాడు) అను అప్పయ్యదీక్షితుల వరదరాజస్తవశ్లోకమును ఇచట స్మరణీయములు.

**"సః"** అను సర్వనామ శబ్దము కంఠముయొక్క సొబగును చెప్పును. ముందు శ్లోకములోవలె, ఇచటకూడ కవి స్వామి కంఠశోభకు తన దృష్టిదోషము సోకరాదను తలపుతో ఇట్టి పరోక్ష నిర్దేశమును చేసెనని చెప్పనగును.

స్త్రీలలో ఉత్తమస్త్రీలగు శ్రీదేవి, భూదేవులు ఇరువురును భగవానుని కంఠసౌందర్యమును చూచి, ఆకర్షితలై, తమకు తామే గాఢముగా ఆలింగనము చేసికొనిరను తాత్పర్యము వలన కూడ భగవానుని కంఠసౌందర్య వైలక్షణ్యము ఇచట పరోక్షముగా తెలుపబడినది. శ్రీదేవి, భూదేవులను ఆకర్షించినట్లే, స్వామి కంఠసౌందర్యము నన్ను కూడ ఆకర్షించి, నా మనస్సు కానందమును కలుగచేయును గాక! అని కవి తాత్పర్యము.

దేవేరులను స్వామికంఠసౌందర్యము ఆకర్షించును అనుటకు కూరేశుల వరదరాజస్తవములోని "పద్మాయాః ప్రణయరసాత్" (41) అను శ్లోకము ఇచట అనుసంధేయము. ఒక విధముగా ప్రస్తుతశ్లోకమునకు ఈ శ్లోకము మూలమని చెప్పవచ్చును.

ఇందు అలంకారము ఉత్ప్రేక్ష, వృత్తము హరిణి.

**శ్రీరంగనాథుని భుజములు నాకు అభయాన్ని కలిగించాలి**

**105. అధిష్ఠానస్తంభౌ భువనపృథుయంత్రస్య కమలా**
**కరేణో రాలానే అరికరిఘటోన్మాథముసలౌ ।**
**ఫణీంద్రస్ఫీత స్రక్ వ్యతికరితసందిగ్ధవిభవౌ**
**భుజౌ మే భూయాస్తా మభయ మభి రంగప్రణయినః ॥**

**ప్ర. అ. –** భువన = లోకమును, పృథు = పెద్ద, యంత్రస్య = యంత్రముయొక్క, అధిష్ఠానస్తంభౌ = ఆధారస్తంభములుగా నున్నవి, కమలాకరేణోః = లక్ష్మీదేవి అను అడుఏనుగుయొక్క అలానే = కట్టు స్తంభములుగా నున్నవి, అరి = శత్రువులు అను, కరి = ఏనుగులయొక్క, ఘటా = సమూహములను, ఉత్+మాథ = నశింపచేయుటలో, ముసలౌ = రోకళ్లవంటివి, ఫణి + ఇంద్ర = ఆదిశేషునియొక్క శరీరము, స్ఫీత = పెద్దదైన, స్రక్ = పూమాల అను వీనియొక్క, వ్యతికరిత = సంబంధమును కల్గినట్లు (రూపమును కల్గినట్లు), సందిగ్ధ = సందేహింపబడిన, విభవ = గొప్పతనమును కల్గినవి అగు, రంగప్రణయినః = శ్రీరంగనాథునియొక్క, భుజౌ = భుజములు, మే = నాకు, అభయమ్ అభి భూయాస్తామ్ = అభయము నొసగును గాక!

**వరివస్య :–** ఈ శ్లోకమునుండి, భట్టరు, ఆరు శ్లోకములలో శ్రీరంగనాథుని బాహువుల రామణీయకమును స్తుతించుచున్నారు. సర్వాభయప్రదములు, సర్వభయప్రమథనదక్షములును శ్రీరంగనాథుని భుజములు– అని వర్ణించుచున్నారు.

శ్రీరంగనాథుని బాహువుల నాశ్రయించి మనము ఉజ్జీవించెదము గాక! అని ఈ శ్లోకసారాంతము.

ఆ బాహువు లెట్టివి ? అనగా, సమస్తజగత్తు అను యంత్రమునకు ఆధారములైన రెండు స్తంభములు. **"పరివర్తిని సంసారే"** (భర్తృహరిసుభాషితము) అనునట్లు ఈ జగత్తు పరిభ్రమణాత్మకమైనది. కావున సంసారము అట్టి స్వభావమును కల యంత్రముతో రూపింపబడినది.

**"భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని"** (భ. గీ, -18-21) (యంత్రములో కూర్చినవానివలె, సమస్త ప్రాణులను పరిభ్రమింప జేయుచు) అను గీతాచార్యుని వచనమువలన జగత్తు యంత్రసమానమను అర్థము ఏర్పడుచున్నది కదా! మఱియు, భగవానుని మాయచే పరిభ్రమించు ఈ జగత్తును భ్రమణాత్మకముగు యంత్రముతో రూపించుట యుక్తము. అట్టి భువనయంత్రమునకు ఆధారభూతములైన స్తంభములుగా శ్రీరంగనాథుని బాహువులు ప్రకాశించుచున్నవి. **"పృథుయంత్రస్య"** అనునపుడు **"పృథువు"** అను రాజునకు సంబంధించినదగు **'పృథివి'** అను యంత్రము యొక్క అను అర్థమును చెప్పనగును. భూమికి పృథ్వి అను పేరు కూడా కలదు.

ఇంకను స్వామిబాహువులు ఎట్లున్నవి? అనగా, లక్ష్మీదేవి అను ఆడు ఏనుగును బంధించు కట్టుస్తంభమువలె ఉన్నవి. శ్రీరంగనాథుడు గజసమానుడైనచో, శ్రీరంగనాయకి ఆడు ఏనుగుగా రూపిపించుట భావ్యమే కదా! **'ఇరణ్డామ్ తిరువన్దాది'** అను దివ్యప్రబంధములోని **"పెరుకు మద వేழ్మ్"** (75) అను పాశురమున పూదత్తాళ్వార్లు, **"కరైశెయ్ మాక్కడల్ కిడన్దవన్"** (1-2-5) అను పాశురములో (పెరియతిరుమొళి) తిరుమఙ్గై యాళ్వార్లు భగవానుని, లక్ష్మీదేవిని గజదంపతులుగా పరోక్షముగా వర్ణించినట్లు అచటి వ్యాఖ్యానమున కన్పడుతున్నది. **"ఆలానం గజబంధనే"** అని నిఘంటువచనము. ఏనుగును బంధించు స్తంభమునకు అలానమని పేరు. నిజమునకు లక్ష్మీదేని అను కరిణిని, స్వామిబాహువుల సౌందర్యము మిక్కిలి ఆకర్షించుటచే, ఆ బాహువులను వదలి ఆ కరిణి ఎన్నటికి ఎచటికిని పోజాలదు. కావున, స్వామిబాహువులు విలక్షణమైన ఆలానములని చెప్పనగును. ఈ సందర్భమున శ్రీ. ప్ర. భ. అణ్ణంగరాచార్య స్వామి వ్యాఖ్యానములోని **"తిరుక్కైయాకిఱ తామరైయై విట్టు ప్పిరియాళిఱే తామరైయాళ్!"** (భగవానుని శ్రీహస్తం అనే తామరను విడిచిపెట్టి, లక్ష్మీదేవి విశ్లేషించదుకదా!) అను రసోక్తి స్మరణీయము.

అనగా, లక్ష్మీదేవి పద్మాలయ. కావున, శ్రీరంగనాథుని కరమనెడి పద్మమును వీడి యుండదు కదా! – అని ఇచట హార్దభావము.

వేదాంతదేశికులు ఈ శ్లోకభావమును అనుసరించుచు, భగవద్ధ్యానసోపానమున "**చింతాహస్తిన్యనుభవతి మే చిత్ర మాలానయంత్రమ్**" (7) అనుచు, స్వామిబాహువులను తమ చింత అను హస్తినిని (ఆడు ఏనుగును) బంధించు ఆలానయంత్రముగా వర్ణించిరి.

లక్ష్మీదేవికి "**చంచల**" అను పేరు కలదు. ఇచట ఆమె కరేణువుగా పోల్చబడెను. కరేణువు కమలములు గల సరస్సులో క్రీడింప ఆశపడును. కావున, లక్ష్మి అను కరేణువు భగవానుని పక్షమును వదలి సరస్సును చేరగోరినచో, అపుడామెను కదలకుండ స్వామి ఆలానములవంటి బాహువులు బంధించును– అని శ్రీగోపాలాచార్య వ్యాఖ్యలో తెలుపబడినది.

మఱియు, ఇంకనూ, శ్రీరంగనాథుని బాహువులు ఎట్లున్నవి? అనగా, శత్రువులు అను ఏనుగుల సమూహమును నాశనము చేయునట్టి ముసలమువలె (రోకళ్లవలె) స్వామి బాహువులున్నవి. ఏనుగును సంహరించు ఆయుధములలో రోకలి ఒకటి. శత్రువులను నీచమైన ఉపమానముతో కాక, అధికగుణమును కల్గిన ఏనుగుతో పోల్చుట ఆ శత్రువుయొక్క బలపరాక్రమముల ఆధిక్యతను తెలియజేయును కదా! ఇచట అట్లు వర్ణించుట తగునా? అనినచో శత్రువును గొప్ప బలపరాక్రమములను కల్గినవానినిగా చెప్పి, అట్టి శత్రువును సైతము అవలీలగా సంహరింప కల్గినవాడని నాయకుని వర్ణించుటద్వారా నాయకుని గొప్పతనమును తెలుపుట ఒక విశిష్టమైన ఆలంకారికసంప్రదాయము.

"**దేవానాం దానవానాం చ సామాన్య మధిదైవతమ్**" (జితంతే-2) (దేవతలకు, దానవులకును సమానమైన ప్రభువు) అని స్తుతింపబడు భగవానునకు శత్రువులున్నారని పల్కుట ఎట్లు పొసగును? అనినచో, భక్తుల శత్రువులనే భగవానుడు తనకు శత్రువులుగా పరిగణించును.

**"ద్విషదన్నం న భోక్తవ్యమ్ ద్విషంతం నైవ భోజయేత్,**

**పాండవాన్ ద్విషసే రాజన్! మమ ప్రాణా హి. పాండవాః?"**

(భార. ఉ. 90-33)

(శత్రువు ఇంట అన్నము భుజింపరాదు, శత్రువునకు భోజనము పెట్టరాదు. ఓ రాజా! నీవు పాండవులను ద్వేషించుచున్నావు. పాండవులు నా ప్రాణములు సుమా! కావున నీవు నాకు శత్రుసమానుడవు) అని భారతమున రాయబారఘట్టమున దుర్యోధనునితో శ్రీకృష్ణుడు పల్కిన పల్కులు ఇచట స్మరణీయములు. కావున ఇచట "**అరి**" అనగా భాగవత విరోధులని భావము. హిరణ్యకశిపుడు, రావణుడు, కంసుడు మొదలగువారు అట్టినవారు.

"**భార్యా రూపవతీ శత్రుః**" అని లోకోక్తి, రూపవతి అగు భార్యవలన శత్రువులు ఏర్పడుదురని అసూక్తి భావము. లక్ష్మీదేవి కరేణువుగా వర్ణింపబడుటచే ఆమెసౌందర్యముయొక్క వైశిష్ట్యము తెలుపబడినది. కరేణువు ఒక మగ ఏనుగును ఆశ్రయించినచో మిగిలిన మగ ఏనుగులు సహింపలేవు, గుంపులుగా చేరి ఆ మగ ఏనుగునుష ఎదిరించును. అట్లే, లక్ష్మీదేవి భగనానుని వరించుట దుష్టులకు కంటకమగును. ఈ విషయము రామకృష్ణాద్యవతారములలో సువిదితము, అట్టి దుష్టులను ఏనుగుల సమూహమును మర్దించుటలో స్వామిబాహువులు రోకళ్లవంటివి – అనియు ఇచట వివరింపవచ్చును – అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్యానమున కనుపించుచున్నది.

శ్రీరంగనాథుడు ఆదిశేషునిపై పరుండి యుండుటచే, తులసీమాలలను, వివిధ పుష్పమాలికలను ధరించి యుండుటచే, ఇవి ఆ స్వామిబాహువులు, ఇది ఆదిశేషుని శరీరము, ఇవి పూమాలలు– అని వేర్వేరుగా విడదీసి చూచుటకు సాధ్యము కాక, సందేహపడునట్లుగా స్వామి బాహువులున్నవి. శ్రీరంగనాథుని బాహువులు నీలవర్ణములో నుండును, ఆదిశేషుడు, పూమాలలు తెల్లగా నుండును కావున ఇచట సందేహమునకు అవకాశమేమి? అనగా– స్వామి బాహువులు "**చందనాగరువిలేపభూషితాః**" (సుందర,. –51) (చందనము,

అగరు అనే లేపనములతో అలంకరింపబడినవి) అని కూరేశులు స్తుతించినట్లు, చందన చర్చితములగుటచే అట్టి సందేహమునకు అవకాశము కలదని చెప్పవచ్చును.

మఱియు ఇట్టి వర్ణసామ్యమే కాక, ఆకారసామ్యమును స్వామిబాహువులకు ఆదిశేషుని శరీరముతో కలదు. వాల్మీకిభగవానులు "**ఆయతాశ్చ సువృత్తాశ్చ**" (దీర్ఘమైనవి చక్కని వర్తులాకారమును కలిగినవి). - 3-17), "**బాహుం భుజగభోగాభమ్**" (సర్పము శరీరమువంటి బాహువును) (రా. యు. -21-1) అనుచు ఈ సామ్యమును తెలిపిరి కదా! ఇక్కడ, "**సువృత్తాశ్చ**" అనుటకు గోవిందరాజీయవ్యాఖ్యానమున "**భుజగ భోగవత్ వృత్తాః**" అని యుండుట ఇచట స్మరింపనగును. ప్రబోధచంద్రోదయకారుడును భగవానుని బాహువులను "**స్రగ్భోగిభోగోపమమ్**" అని వర్ణించుటను చూడవచ్చును. ఇట్టి శ్రీరంగనాథుని బాహువులు నాకు అభయమును. ప్రసాదించుగాక! అని భావము. "**అఞ్జేల్! ఎన్ఱు కైకవియాయ్!**" ("భయపడకు" అని నీ అభయ హస్తమును చూపించు) అని ఆళ్వార్లు ప్రార్థించినట్లే, భట్టరును స్వామికరములవలన అభయమును కోరుచున్నారు. వాల్మీకి భగవానులును "**బాహుచ్ఛాయా మవష్టబ్ధో యస్య లోకో మహాత్మనః**" (రా. సం. -34-30) (మహాత్ముడయిన శ్రీరాముని బాహువుల నీడను ఆశ్రయించిన లోకం భయాన్ని పొందడం లేదు) అనుచు సర్వేశ్వరుని బాహువులు సమస్తలోకమునకు అభయము నొసగునని పల్కిరి కదా!

ఈ శ్లోకమున "**సుకుమారౌ మహాబలౌ**" (రా. ఆ. -17-24) అను శ్రీరామాయణశ్లోకములోని అర్థము అనుసంధింపబడినదని చెప్పవచ్చును. శ్లోకములోని పూర్వార్థము బాహువుల మహాబలమును, ఉత్తరార్ధము సౌకుమార్యమును వర్ణించుచున్నదనుట స్పష్టము.

"**మహాబలత్వే ఽపి పుష్పహాస ఇతి నామ దుహానం మార్దవమ్**" (గొప్ప బలాన్ని కలిగి ఉన్నప్పటికీ, "పుష్పహాసః" అనే నామాన్ని సార్థకం చేసే మార్దవం

సౌకుమార్యం) అని నిర్వచింపబడిన సౌకుమార్యమును స్వామిబాహువులు కల్గియున్నవి.

రెండవ పాదమున "**కరేణోరాలానౌ**" అను పుంలింగ రూపంలోని పాఠాంతరము కలదు. కాని, అలాన శబ్దము నిఘంటువులలో నపుంసకలింగముననే కన్పించుచుండుటచే "**కరేణోరాలానే**" అను పాఠమే సరి అయినది. "**అలానే అరికరి**" అనునపుడు సంధి జరుగక పోవుటకు ప్రకృతిభావము కారణము.

"**అలానా వరికర**" అను వేంకటాచార్యవ్యాఖ్యలోని పాఠము సాధువు కాదు.

ఘటాశబ్దము వలననే 'ఏనుగుల సమూహమని అర్థము వచ్చునపుడు, '**కరిఘట**' అనుచోట కరిశబ్దము అధికపదమే కదా! అనినచో, "**వంశకరీర, కరికలభ, ముక్తాహార**" వంటి ప్రయోగమువలె "**కరిఘటా**"అను ప్రయోగమును దుష్టము కాదని తెలియనగును. ఈ శ్లోకమున "**అధిష్ఠానస్తంభౌ**" అనుటవలన స్వామి బాహువుల బలము, "**అరికరఘటోన్మాథముసలౌ**" అనుటచే తేజస్సు, "**ఫణీంద్ర స్ఫీత స్రక్**" అనుటద్వారా సౌకుమార్య, సౌగంధ్యములు – అను కల్యాణగుణములు సూచింపబడినవి. "**స్ఫీతస్రక్**" అనుటకు, వనమాల అనియు అర్థము చెప్పవచ్చును.

తలగడగా చేసికొన్న భుజము ఆదిశేషుని దేహముగాను, ప్రసారితభుజము వనమాలగాను సందేహమున కాస్పదములైనవని చెప్పవచ్చునని కొందఱు వ్యాఖ్యాతలు సూచించినట్లు శ్రీరామానుజాచార్యవ్యాఖ్యానమున కలదు. శ్లోకము పూర్వార్ధమున రూపకము, ఉత్తరార్ధమున సందేహాలంకారము, వృత్తము శిఖరిణి.

**సముద్రంతో స్పర్థించు వేరొక సముద్రమువంటి శేషశయనుడైన శ్రీరంగనాథుని ఉపాసిస్తున్నాను**

**106. ప్రతిజలధితో వేలాశయ్యాం విభీషణకౌతుకాత్**
**పునరివ పురస్కర్తుం శ్రీరంగిణః ఫణిపుంగవే ।**
**సముపదధతః కంచిత్ కంచిత్ ప్రసారయతో భుజ**
**ద్వయ మపి సదా దానశ్రద్ధాళు దీర్ఘ ముపాస్మహే ॥**

**ప్ర. అ. –** ప్రతిజలధితః = సముద్రమున కెదురుగా, వేలా = సముద్రతీరమనెడి, శయ్యాం = పడుకను, విభీషణకౌతుకాత్ = విభీషణునియొక్క కుతూహలము కారణమువలన, పునః = తిరిగి, పురస్కర్తుమ్ ఇవ = ఆదరించి అంగీకరించుటకు వలె, ఫణిపుంగవే = ఆదిశేషునిపై, కంచిత్ = ఒక (భుజమును) కరమును, సముపదధతః = ఉపధానముగా (దిండుగా) చేసికొన్నవాడును, కంచిత్ = వేరొక (భుజమును) కరమును, ప్రసారయతః = చాచుకొని యున్నవాడును అగు, శ్రీరంగిణః = శ్రీరంగనాథునియొక్క, దీర్ఘం = పొడుగైనది, సదా = ఎల్లప్పుడు, దాన = దానమును చేయుటలో, శ్రద్ధాళు = ఆదరమును కల్గినది అగు, భుజద్వయం = రెండు భుజములను, అపి = కూడ, ఉపాస్మహే = ఉపాసింతుము.

**వరివస్య :–** శ్రీరంగనాథుడు ఆదిశేషునిపై పరుండియున్న సన్నివేశమును వర్ణించుటద్వారా ఇందు భట్టరు ఆ స్వామి బాహుద్వయమును పొగడుచున్నారు.

శ్రీరామావతారమున భగవానుడు సముద్రముపై వారధిని నిర్మించుటకై ప్రయత్నించునపుడు, విభీషణుడు– సముద్రుని శరణు వేడి, అతని సహకారమును ప్రార్థించుట తగినది, "**సముద్రం రాఘవో రాజా శరణం గంతు మర్హతి**" (రా. యు. –19–30) (ప్రభువైన రాఘవుడూ సముద్రుని శరణు వేడుట తగినది) అని పల్కెను. అపుడు, శ్రీరాముడును విభీషణుని మాటను మన్నించి, సముద్ర తీరమున తూర్పు దిక్కున కభిముఖుడై పరుండి,

ప్రాయోపవేశము చేసెను. ఈ సందర్భము ప్రస్తుతశ్లోకమున కవిచే ప్రస్తుతింపబడుచున్నది.

ఆదిశేషునిపై పరుండిన శ్రీరంగనాథుడు ఒక భుజమును తలక్రింద పెట్టుకొని, మరియొక భుజమును చాచుకొని యుండుటను చూడగా, పూర్వము శ్రీరాముడు సముద్రతీరమున పరుండిన సన్నివేశమును తిరిగి తనకు దర్శింపచేయవలెనని, విభీషణుడు భగవానుని కోరగా, పరమభక్తుడగు అతని కోరికను తీర్చుటకై స్వామి ఇట్లు శ్రీరంగమున "**బాహుం భుజగభోగాభం ఉపధాయ**" (రా. యు. -21-1) (పాము శరీరము వలె గుండ్రని తన ఒక బాహువును తల దిండుగా చేసికొని) అని, "**ఉపధాయ మహద్భుజమ్**" (రా. యు. -21-8) (గొప్ప భుజమును తలదిండుగా చేసుకొని) అని వాల్మీకిమహర్షి పల్కిన విధముగా, ఒక భుజమును తల క్రింద పెట్టుకొని, వేరొక భుజమును చాచుకొని, దక్షిణదిక్కును చూచుచు పరుండెనా? అని తోచుచున్నది. భక్తులకు వరములను దానము చేయుటలో "**అర్థితార్థపరిదానదీక్షితమ్**" (వర. స్త. -2) (అడిగినవారికి, వారు అడిగిన ఫలములను పరిపూర్ణముగా ఇచ్చుట – అనే దీక్షను పట్టినది) అని పేరు వడసినదగు శ్రీరంగనాథుని భుజద్వయమును నేను శరణువేడెదను– అని శ్లోకభావము.

విభీషణుని అనుగ్రహించుట కొఱకు శ్రీరంగమున భగవానుడు దక్షిణదిక్కుగా పవళించి యున్నాడనుచు, "**మన్నుడైయ విబీడణఱ్కా మదిళిలంగై త్తిశైనోక్కి మలర్ కణ్ వైత్త ఎన్నుడైయ తిరువరఙ్గఱ్కు**" (4-9-2) (మారని సంపదను కలిగిన విభీషణుని కోసం కోటలను కలిగిన లంకానగరం వైపు తామరపూలవంటి కన్నులను ప్రసరింపజేసిన నా శ్రీరంగనాథునకు) అని పెరియాళ్వార్లు, "**శెల్వవిబీడణఱ్కు వేఱాక నల్లానై**" (6-8-5) (రామభక్తి అనే సంపదను కలిగిన విభీషణుని విషయంలో ప్రేమను కలిగినవాడు) అని తిరుమఙ్గై యాళ్వార్లును పల్కిరి. భట్టరు ఈ భావమును ప్రస్తుతశ్లోకమున అనుసంధించిరి. శ్రీరంగమున భగవానునకు. అభిముఖముగా సముద్రము లేకున్నను, పతీపత్నుల

అభేదముచే ఇచట కావేరి సముద్రస్థానమున భావింపబడినది. "**సదాదానశ్రద్ధాళుః**" అనుటకు, "**గోసహస్రప్రదాతారమ్**" (రా. యు. 21-2) (వేలాది గోవులను అనుగ్రహించేవాడు) అను వాల్మీకిసూక్తిని, "**అలమ్ పురిన్ద నెడున్దడక్కై**" ("**ఇక చాలు**" అనేటట్లుగా కోరినవారికి వారు కోరిన కోరికలను అనుగ్రహించే దీర్ఘమైన కరములను కలవాడు) అని మొదలైన ఆళ్వార్ల సూక్తులను స్మరింపనగును.

ప్రస్తుతశ్లోకభావమును అనుసరించుచు వేదాంతదేశికులు భగవద్ధ్యానసోపానమున,

**"ఏకం లీలోపహిత మితరం బాహు మాజానులంబం**
**ప్రాప్తా రంగేశయికతు రఖిల ప్రార్థనాపారిజాతమ్" (7)**

(ప్రార్థించినవారి అందరి కోరికను తీర్చడంలో పారిజాతవృక్షంవంటిది, లీలగా తనకు తలదిండుగా చేసుకోబడినది అయిన శ్రీరంగనాథుని ఒక బాహువు, మోకాలి వరకు చాచిఉంచిన వేరొక బాహువు) అని శ్రీరంగనాథుని భుజద్వంద్వమును స్తుతించిరి.

"**విభీషణకౌతుకాత్**" అనునపుడు విభీషణుని విషయమున స్వామికి గల ఆదరముచే, అనగా, విభీషణుని దర్శనముకొఱకై – అను అర్థము చెప్పుటచే, రామావతార సందర్భమున సముద్రతీరమున సీతాదర్శన కౌతుకమువలన పరుండిన శ్రీరాముడే, ప్రస్తుతము విభీషణుని దర్శనార్థము శ్రీరంగమున రంగనాథుడుగా శేషశయనమున పరుండియున్నాడను భావము వ్యంగ్యరూపమున భాసించుచున్నది.

శ్రీరామానుజాచార్య వ్యాఖ్యానమున "**అత్ర శేషశయానః శ్రీరంగనాథః పూర్వం సముద్రతీరే సీతాదర్శనార్థం శయితః, పున రపి విభీషణదర్శనార్థం శయానో రఘునాయక ఇవ ప్రతిభాతి ఇతి కవే రభిప్రాయః**" అని వివరింపబడినది. అనగా, శేషశయనమున శ్రీరంగనాథుడు శ్రీరంగమున శయనించియుండుట పూర్వము సముద్రతీరమున సీతను దర్శించుటకై

శయనించిన శ్రీరాముడే, తిరిగి విభీషణుని దర్శించుటకుగా పరుండియున్నట్లున్నది – అని భావము. శ్రీరాముడు సముద్రతీరమున శయనించుట సీతాదర్శనకౌతుకమువలన – అని, శ్రీరంగమున శయనించుట విభీషణదర్శనకౌతుకమువలన – అని తాత్పర్యము.

"**ప్రతిజలధితః**" అను పదమును "**జలధితః ప్రతి**" అనునపుడు ఇంకొక విధముగా అన్వయింపవచ్చును. శ్రీరామాయణములో శ్రీరాముడు సముద్రమును శరణాగతిని చేయు సందర్భమున గల "**అంజలిం ప్రాఙ్ముఖః కృత్వా ప్రతిశిశ్యే మహోదధేః**" (రా. యు. –21–2) (ఉత్తర దిశగా అంజలిని చేసినవాడై, సముద్రమునకు ఎదురుగా శయనించెను) అను శ్లోకములోని "**మహోదధేః ప్రతిశిశ్యే**" అను యోజనను పూర్వాచార్యులు చేయుటచే, ఇచట కూడ అట్టి యోజనను చేయవచ్చునని రామానుజాచార్య వ్యాఖ్యానమున సూచింపబడినది.

శ్రీరాముడు సముద్రమున కెదురుగా పరుండి యుండుట ఒక సముద్రముతో వేరొక సముద్రము స్పర్ధించుచున్నట్లున్నదని పైన చూపబడిన శ్రీరామాయణశ్లోకమును వ్యాఖ్యానించుచు నమ్పిళ్లై అను ఆచార్యులు ఈడువ్యాఖ్యానమున సూచించిరి. తిరువాయ్ మొళిలోని "**నిన్ఱ వాఱుమ్ ఇరున్ద వాఱుమ్ కిడన్ద వాఱుమ్**" (5–10–6) అను పాశురములో "**కిడన్దవాఱుమ్**" అను చోట ఈడువ్యాఖ్యానములోని "**కడఱ్కరైయిలే కిడన్ద కిడైయుమ్ 'ప్రతి శిశ్యే' ఎన్గిఱదిఱే– ఒరు కడలోడే యొరు కడల్ స్పర్ధిత్తు క్కిడన్దాప్పోలే యిరుక్కైయాలే. కరుణై ఎన్నుమ్ కడల్ కరుఙ్కడలై నోక్కి క్కిడన్దదే ఎన్ఱానిఱే**" (సముద్రతీరములో శయనించి ఉండే సన్నివేశం '**ప్రతిశిశ్యే**' అని చెప్పబడింది కదా – ఒక సముద్రంతో ఇంకొక సముద్రం స్పర్ధిస్తూ పరుండి ఉన్నట్లుగా ఉన్నందున. కంబమహాకవి కూడా '**కరుణ అనే సముద్రం ఒక నల్లని సముద్రాన్ని ఉద్దేశించి పరుండి ఉన్నది కదా**' అని అన్నాడు కదా!) అను వాక్యములు స్మరణీయములు. ఈ సరసమైనభావము "**ప్రతి**" అను ఉపసర్గ బలము వలన ద్యోతకమగును, ఇట్టి

భావమే ప్రస్తుతమున "**జలధితః ప్రతి**" అను యోజనవలన ఏర్పడునని చెప్పవచ్చును. పై వాల్మీకిశ్లోకమున "**ప్రతిశిశ్యే**" అను పదమును "**ప్రతి శిశ్యే = అభిముఖ్యేన శయితవాన్**" అని మహేశ్వరతీర్థులు వ్యాఖ్యానింపగా, గోవిందరాజీయమున "**ప్రతిశిశ్యే – ప్రతీత్యనేన తదానీం సాగరాభిముఖ మపర స్సాగర ఇవ స్థితః ఇత్యవగమ్యతే**" (ప్రతి అనే పదం వల్ల అప్పుడు సముద్రానికి అభిముఖంగా ఇంకొక సముద్రం ఉన్నట్లుగా ఉన్నది – అని తెలియబడుతున్నది) అని వ్యాఖ్యానింపబడుట గమనార్హము. "**ఒక నల్లని సముద్రమున కభిముఖముగా వేరొక కరుణ సముద్రము పరుండి యున్నదే**" (కరుణై ఎన్నుఙ్కడల్ కరఙ్కడలై నొక్కి క్కిడన్దదే) అని కంబమహాకవియు రామాయణమున పల్కుట స్మరింపనగును. ఈ యోజనలో "**జలధితః**" అనునపుడు "**ప్రతియోగే పంచమ్యాః తసిః**" (5-4-44) అను సూత్రమునుబట్టి పంచమ్యర్థమున వచ్చిన "తసిల్" సాదృశ్యార్థకమని, ఆ సాదృశ్యము "**ప్రతి**" అను అవ్యయమువలన ద్యోతకమగునని, అందుచే "**సముద్రమున కభిముఖముగా వేరొక సముద్రము**" అను అర్థము వచ్చునని చెప్పనగును. "**ప్రతి**" అను అవ్యయము సాదృశ్యద్యోతకము అనుట "**ప్రతినిధి ప్రతిపాదనయోః**" (1-4-92) అను సూత్రమువలన తెలియుచున్నది. లేదా, తృతీయార్థమున "తసిల్" వచ్చినదనియు చెప్పవచ్చును.

ఈ శ్లోకమున రెండవ పాదమున "**పురస్కర్తుమ్**" అనుటకు బదులు "**పురస్కర్తుః**" అను వేరొక పాఠము కలదు. అపుడు ఆ పదము తుమున్నంతము కాక, "**శ్రీరంగిణః**" అను విశేష్యమునకు విశేషణమగును. "**విభీషణుని కుతూహలమును మన్నించునట్టి**" అని దీని భావము. ఈ సందర్భమున,

**"రామో రమే! తవ కృతే రఘువీరజాయే!**
**భోగీంద్రభోగసుభగా ముపధాయ బాహుమ్,**
**ఆజానుబాహు రశయిష్ట తటే పయోధేః**
**ప్రస్పర్థయా ప్రతి పయోధి రివ ప్రసుప్తః"**

(శ్రీరామచంద్రుని ధర్మపత్ని అయిన ఓ సీతాదేవీ! ఆజానుబావువైన శ్రీరాముడు సర్పశరీరంవలె మనోహరమైన తన బాహువును తలదిండుగా చేసుకుని, సముద్రతీరంలో ఆ సముద్రంతో పోటీపడుతున్నట్టుగా శయనించాడు) అను ఈడు అరుమ్పదము (2–8–7)లో ప్రస్తావింపబడిన శ్లోకము ఉదాహార్యము. శ్రీరంగనాథుని ఆదిశేషునిపై పరుండుట విభీషణుని దర్శన కౌతుకమును గౌరవించుటకకొఱకా! అన్నట్లున్నదను సంభావన ఈ శ్లోకమున వర్ణింపబడుటచే ఉత్ప్రేక్షాలంకారము, వృత్తము హరిణి,

**కల్పవృక్షశాఖలను జయించు శ్రీరంగనాథుని బాహువులను ఆశ్రయిస్తున్నాము**

**107. కుసుమభరాలసౌ స్ఫటికవేదిశయౌ విటపౌ**
**అమరతరోః పరం పరిహసత్ పృథురంగభుజః ।**
**బహుమణిముద్రికాకనకకంకణదోర్వలయైః**
**కిసలయి దోర్ద్వయం ఫణిని నిర్భరసుప్త మిమః ॥**

**ప్ర. అ. –** బహు = అనేకములైన, మణిముద్రికా = రత్నపుటుంగరములు, కనక = బంగారుతో చేయబడిన, కంకణ = ముంజేతి ఆభరణములు, దోః = బాహువులయొక్క, వలయైః = భుజకీర్తులు – అను వీనిచే, కిసలయి = చిగురించినది, ఫణిని = ఆదిశేషునిపై, నిర్భరసుప్తం = నిర్విచారముగా నిద్రించినది (కావుననే), కుసుమభర = పూలతో నిండినవి అగుటచే, అలసౌ = కొంచెము వంగినవి, స్ఫటికవేది = స్ఫటికమయమైన తిన్నెపై, శయౌ = పరుండియున్నవి అగు, అమరతరోః = కల్పవృక్షముయొక్క, విటపౌ = శాఖలను రెండిటిని, పరం పరిహసత్ = మిక్కిలి పరిహాసము చేయునట్టి, పృథు = బలిష్ఠమైన, రంగభుజః = శ్రీరంగనాథుని యొక్క, దోః ద్వయం = బాహువుల జంటను, ఇమః = ఆశ్రయింతుము.

**వరివస్య :–** ఇంతకు ముందు భట్టరు శ్రీరంగనాథుని “అర్థికల్పకమ్” (76) అనుచు కల్పవృక్షముగా స్తుతించిరి. ఇందు, ఆ కల్పవృక్షముకూడ స్వామికి సాటిరాదనుచు స్తుతించుచున్నారు. నమ్మాళ్వార్లును “ఎన్నై యాక్కి క్కొణ్డు ఎనక్కే తన్నై త్తన్ద కఱ్పగమ్” (తి. నా. –2–7–10) (నన్ను స్వాధీనము చేసికొని, నాకే తనను దానము చేసిన కల్పకము) అనుచు సర్వేశ్వరునకు కల్పవృక్షమునకు మధ్య గల సామ్యముతో పాటు, సర్వేశ్వరుని వైశిష్ట్యమును తెలిపిరి కదా! గత శ్లోకమున “భుజద్వయమపి సదా దానశ్రద్ధాళు “ అనుచు భుజములను రెండింటిని దానమును కల్గినవిగా వర్ణించిన కవి, అట్టి స్వభావమును కల్గిన కల్పవృక్షము – అను ఉపమానముతో వానిని వర్ణించుచున్నారనియు చెప్పనగును.

శ్రీరంగమున వేంచేసియున్న శ్రీరంగనాథుడు అసాధారణమైన కల్పవృక్షమువంటివాడు. ఆ స్వామిబాహువులు కల్పవృక్షముయొక్క శాఖలను కూడ పరిహసించునవి. “**కఱ్పకక్కావు నఱ్పల తోళఱ్కు**” (కల్పవృక్షము తోటవంటి గొప్పవైన పలు బాహువులు కలవానికి) (తి. వా. –6–6–6) అని, “**కఱ్పకక్కావు పఱ్పల వన్న**” (తిరువాశి. –1) అని ఆళ్వార్లు, “**పారిజాతవిటపాయితర్థయః**” (పారిజాత వృక్షశాఖలవలె వృద్ధి జెందిన) (సుందర. 2. 52) అనుచు కూరేశులును భగవానుని భుజములను కల్పవృక్షశాఖలుగా ఉపమించిరి. మఱియు, కూరేశులు వరదరాజస్తవమున “**పారిజాతవిటపాన్**” (28) అను శ్లోకమున స్వామిబాహువులు, అందు అలంకరింపబడిన ఆభరణముల చేరికను పారిజాత వృక్షశాఖలు పుష్పించినట్లున్నదని సంభావించిరి. ఇచట, భట్టరు అట్లు ఉపమించుటతోపాటు, ఆ భుజములు కల్పశాఖలను సైతము పరిహసించుచున్నవనుటచే వ్యతిరేకాలంకార క్రమములో ఉపమేయాధిక్యమును తెలుపుచున్నారు.

పుష్పభారమువలన వంగినవి, స్ఫటికమయవేదికలపై వాలియున్నవగు కల్పవృక్షశాఖలను సైతము మిక్కిలి పరిహసించునవి, బలిష్ఠములైనవి, ఆదిశేషునిపై నిర్భయముగా నిద్రించుననవి, అనేకములైన మణిముద్రికలను, కనకమణికంకణములను, వలయములను దాల్చుటచే చిగిర్చినట్లున్నవగు శ్రీరంగనాథుని బాహువులను రెండిటిని ఆశ్రయించుచున్నాము – అని శ్లోకభావము.

కల్పవృక్షశాఖలు చిగుళ్ల పూల బరువుచే వంగియుండును, ఇచట, శ్లోకమున గల కుసుమశబ్దము చిగుళ్లకును ఉపలక్షణము. శ్రీరంగనాథుని బాహువులును అనేకవిధములైన మణులతో నిర్మింపబడిన అంగుళీయకములు, బంగారు కంకణములు, భుజకీర్తులను కల్గియుండుటచే, గొప్పగా ప్రకాశించుచు చిగిర్చి, పుష్పించినట్లున్నవి. ఇచట శ్లోకములోని "**బహు**" అను పదమును మణులకే కాక, మణిముద్రికలకు, కనకకంకణములకు, దోర్వలయములకును విశేషణముగా అన్వయింపవచ్చును. అపుడు, వివిధములైన సన్నివేశములతో, విచిత్రములైన దివ్యాభరణములనేకములను శ్రీరంగనాథుని బాహువులు దాల్చియున్నవను అర్థము వచ్చును.

వాల్మీకిభగవానులును శ్రీరామాయణమున "**సర్వభూషణభూషార్హాః**" (అన్ని భూషణములకు తగి ఉన్నవి) (రా. కి. –3–15) అనుచు శ్రీరాముని బాహువులు సకలవిధభూషణములకును అర్హములనిరి కదా! కూరేశులు వరదరాజస్తమున,

**"పారిజాతవిటపా నభితో యా పుష్పసంపదుదియాత్ కరినాథ!,**
**తాం విడంబయతి తావకబాహుషు కటకాంగదలక్ష్మీః"** (28)

(వరదరాజస్వామీ! నీ భుజాలలో వ్యాపించి ఉండే వలయాలు, బాహుపుదులు అనే ఈ అలంకారాల శోభను చూస్తే, కల్పవృక్షాల శాఖలను చుట్టి ఒక పుష్ప సంపద ఉంటే, దానిని అనుకరిస్తున్నట్లుగా ఉన్నది) అనుచు వర్ణించుట ఇచట స్మరణీయము.

కల్పవృక్షము దేవలోకమున ఉండును. అచట స్ఫటికమయవేదికలకు కొదువలేదు. కావున, కల్పవృక్షముయొక్క కొమ్మలు పూల భారముచే స్వర్గములోని స్ఫటికవేదికలపై వాలి యుండును. అట్లే, శ్రీరంగనాథుని బాహువులు తెల్లగా ప్రకాశించు ఆదిశేషునిపై విశ్రాంతి చెందియున్నవి. కావున, అవి కల్పవృక్షశాఖలవలె ఉన్నవి. శ్రీరంగనాథుని బాహువులు నిర్విచారముగా విశ్రాంతములై యుండుటకు విష్వక్సేనులు, శ్రీసుదర్శనము మొదలగువారు సమస్తజగద్రక్షణాభారమును నిర్వహించుచు, జాగరూకులై యుండుటయే కారణము.

భరింపరాని పూలభారముచే కల్పవృక్షశాఖలు వంగి యుండగా, ఏ కార్యభారము లేకపోవుటచే స్వామి బాహువులు విశ్రాంతములై యున్నవి. కావుననే, శ్రీరంగనాథుని బాహువులు కల్పవృక్షముయొక్క కొమ్మలను పరిహసించుచున్నవి – అని తాత్పర్యము. ఇట్టి భావము "**కుసుమభరాలసా**" అని దృష్టాంతములో, "**నిర్భరసుప్తం**" అని దార్ష్టాంతికములో పల్కుటవలన ఏర్పడుచున్నది. ఇట్టి ప్రయోగములు భట్టరు అసాధారణపదప్రయోగ నైపుణ్యమును సూచించుచున్నవి కదా.

తిరువాయ్‌మొళిలోని "**శన్మమ్ పలపలశెయ్ దు**" (3-10-1) అను పాశురమునకు ఈడువ్యాఖ్యానమున "**ఒరు కల్పకత్తరు పణైత్తు క్కణుత్తోఱుమ్ అరుమ్బినాప్పోలే యాయ్ త్తు, వడివుమ్ దివ్యాయుధఙ్గళుమ్ శేర్ న్ద శేర్ త్తి యిరుప్పదు**" (ఒక కల్పవృక్షము శిఖలు శాఖలుగా వృద్ధిచెంది, ప్రతి కణుపులోనూ మొగ్గ తొడిగినట్లుగా అయినది, భగవంతుని దివ్యమైన విగ్రహం, అందులో ఉండే దివ్యాయుధాలు – అనే వీటి చేరిక) అను వాక్యమునకును ప్రస్తుతశ్లోకభావమునకును మధ్య గల భావసామ్యము గమనింపదగినది.

"**రంగభుజః**" – శ్రీరంగమును పాలించువానియొక్క – అని అర్థము. "**భుజ–-పాలన–అభ్యవహారయోః**" అనునది ఇచటి ధాతువు. లేక,

శ్రీరంగనివాసరసికుడు – అనియు భావము. భుజవర్ణనమున భుజః అను పదప్రయోగము శైలికి శోభాధాయకము.

**"ఇణ్ – గతౌ"** అను ధాతువుయొక్క వర్తమానకాలిక (లట్) ఉత్తమపురుష, బహువచనరూపము **"ఇమః"** అని అగును. **"గత్యర్థాః బుద్ధ్యర్థాః"** అను న్యాయమునుబట్టి, **"ఇమః"** అనుటకు శరణు వేడుచున్నాము – అని ఇచట భావము. **"నాహారయతి సంత్రాంసం బాహూ రామస్య సంశ్రితా"**(రా. అయో. - 60-20) (శ్రీరాముని బాహువులను ఆశ్రయించిన సీతాదేవి ఏమాత్రం భయాన్ని పొందడం లేదు) అని వాల్మీకి పల్కిన విధముగా, భగవానుని బాహుచ్ఛాయను ఆశ్రయించిన వారికి ఎట్టి భయమును కలుగదు కదా!

ఇచట శ్రీరంగనాథుని బాహువులు కల్పకశాఖలను పరిహసించుచున్నట్లున్నవి– అని అనుటచే ఉత్ప్రేక్షాలంకారము కలదని చెప్పనగును. ఈ ఉత్ప్రేక్షద్వారా ఉపమేయమునకు ఉపమానము కంటె ఆధిక్యము వ్యక్తమగుటచే ఉత్ప్రేక్షలంకారముచే వ్యతిరేకాలంకారధ్వని కలదనియు చెప్పవచ్చును. ఛందస్సు కోకిలకమను వృత్తము. **"యది భవతో నజౌ భజలగా గురు నర్కుటకమ్"** అను నర్కుటకవృత్తమే **"మునిగుహకార్ణవైః కృతయతి రీతి వద కోకిలకమ్"** అను లక్షణముచే కోకిలకమను వృత్తమగును.

## శ్రీరంగనాథుని రెండు బాహువులు సర్వోత్కర్షతో ప్రకాశిస్తున్నవి

**108. మద్రక్షావ్రతకౌతుకే సుకటకే విక్రాంతికర్ణేజపే**
**శార్ఙ్యాకిణకర్కశిమ్ని సుమనః స్రఙ్మోహనే మార్దవే ।**
**దోర్ద్వంద్వం బహుశః ప్రలోభ్య కమలాలీలోపధానం భవత్**
**తచ్చిత్రాలకముద్రితం విజయతే శ్రీరంగసంసంగినః ॥**

**ప్ర. అ. –** మత్ = నన్ను, రక్షా = రక్షించుట – అను, వ్రత = వ్రతమునందు కట్టిన, కౌతుకే = కంకణసూత్రములుగా నున్న, సుకటకే = చక్కని వలయములందు, విక్రాంతి = పరాక్రమమును, కర్ణేజపే = సూచించునట్టి, శార్

జ్ఞ = శార్ జ్ఞమను ధనుస్సుయొక్క, జ్యాకిణ = అల్లెత్రాడు తాకిడిచే ఏర్పడిన కాయల (గుర్తుల), కర్కశిమ్ని = కాఠిన్యమునందును, సుమనః స్రక్ = పూమాలయా! ఇది అని, మోహనే = భ్రమించునట్టి, మార్దవే = మృదుత్వమునందును, బహుశః = అనేకవిధములుగా, ప్రలోభ్య = ఆశ కల్గునట్లు చేసి, కమలా = లక్ష్మీదేవికి, లీల+ఉపధానం = విలాసార్థమైన దిండుగా, భవత్ = అగునట్టిది, తత్ = ఆ లక్ష్మీదేవియొక్క, చిత్ర+ఆశ్చర్యకరమైన (మనోహరమైన), అలక = ముంగురులచే, ముద్రితం = చిహ్నితమైనది అగు, శ్రీరంగసంసంగినః = శ్రీరంగనాథునియొక్క, దోః ద్వంద్వం = బాహుయుగము, విజయతే = సర్వోత్కర్షతో ప్రకాశించుచున్నది.

**వరివస్య :–** ఈ శ్లోకముకూడ శ్రీరంగనాథుని బాహుయుగమును వర్ణించునదియే. ఇందు కవి ముఖ్యముగా వలయబంధము, జ్యాకిణములతో కూడిన స్వామిబాహువుల శోభను చక్కని ఉత్ప్రేక్షతో వర్ణించుట విశేషము.
శ్రీరంగనాథుని బాహువులు రెండును సర్వోత్కర్షతో ప్రకాశించుచున్నవి. "నన్ను రక్షించుట" అను వ్రతమునందు ధరించిన రక్షాసూత్రము (కంకణము) వలె ఉన్న వలయముచే, పరాక్రమసూచకమగు జ్యాకిణకఠినత్వముచే, పూమాలయా? అను మోహమును కలుగజేయు మార్దవముచే, లక్ష్మీదేవిని ప్రలోభపరచి, ఆమెకు తలగడయై, ఆమెయొక్క చిత్రమైన ముంగురుల ముద్రలను కల్గినదై యుండుటచే స్వామిబాహుయుగ్మము సర్వోత్కర్షను కల్గియున్నది" – అని శ్లోకభావము.

ఈ శ్లోకమున, శ్రీరంగనాథుని బాహుయుగము లక్ష్మీదేవిని ప్రలోభ పెట్టుటకు కవి మూడు హేతువుల సుత్ప్రేక్షించుచున్నారు. శ్రీరంగనాథుడు ముంజేతికి ధరించిన కంకణముయొక్క బంధమును చూడగా, "**అకించనుడనగు నన్ను రక్షించుట**" అను వ్రతమున కట్టుకొనిన రక్షాసూత్రబంధమువలె ఉన్నది. "**అభయం సర్వభూతేభ్యః దదామ్యేతత్ వ్రతం మమ**" (రా. యు. 18-32) (నన్ను శరణాగతి చేసినవానికి సమస్త

ప్రాణులనుండి అభయాన్ని కలిగిస్తాను, ఇది నా వ్రతం) అని శ్రీరామచంద్రుడు జగద్రక్షణను తన వ్రతముగా పేర్కొనెనుకదా.

**"సుప్రీతః"** అను విష్ణుసహస్రనామములోని నామమును వ్యాఖ్యానించుచు, భట్టరు, **"యథాకథంచిత్ ప్రవిష్టానాం సర్వదా పరిపాలనదృఢవ్రతః సుప్రీతః"** (ఏదో విధముగా తనలో ప్రవేశించినవారిని, అనగా, శరణాగతి చేసినవారిని ఎల్లప్పుడూ పరిపాలించడం అనే దృఢమైన వ్రతాన్ని కలిగినవాడు, కనుక, సుప్రీతుడు) అని పల్కుట ఇచట స్మరణీయము, కావున, శ్రీరంగనాథుని కరకంకణము జగద్రక్షణ దీక్షలో దాల్చిన రక్షాసూత్రమువలె ఉన్నదనుట ఎంతయో సమంజసమేకాక, పరమరమణీయమును.

లక్ష్మీదేవి జగన్మాత, కావున, తమ సంతానమును రక్షించుటలో నాథునకెంత శ్రద్ధయో కదా! అని మిగుల సంతోషించును. స్వామి బాహువుల పట్ల ఆకర్షితురాలగును. ఈ వర్ణనను భట్టరు చేయుటలో కూడ ఒక ప్రత్యేకత కలదు. ఎందులకనగా – పరాశరభట్టరు శ్రీరంగనాయకీనాయకుల ముద్దుబిడ్డ కదా! **'శ్రీరంగరాజకమలాపదలాలితత్వమ్"** (17) అని ఈ స్తోత్రములో ముందుగా పల్కిన సూక్తిని ఇచట స్మరింపనగును.

శ్రీరంగనాథుని బాహువులందు శార్ ఙ్గముయొక్క అల్లెత్రాడు దెబ్బలచే ఏర్పడిన గుర్తులు (కాయలు) ఆ స్వామియొక్క పరాక్రమ వైశిష్ట్యమును ప్రకటించుచున్నవి. జ్యాకిణములను కవులు వీర్యచిహ్నములుగా వర్ణింతురు. **"కర్ణేజపః సూచకః స్యాత్ పిశునః"** అను నిఘంటువచనమును బట్టి, **"కర్ణేజపః "** అను పదము కొండెములను చెప్పువాడను అర్థము నిచ్చు పదమైనను, ఇచట ఎల్లప్పుడును సూచించువాడని అర్థము నిచ్చును. ఇట్టి జ్యాకిణములను చూచుటవలన కూడ లక్ష్మీదేవి స్వామిబాహువుల పట్ల ఆకర్షింపబడినది. పరాక్రమచిహ్నములను కల్గిన ఆ బాహువులను ఆలింగనము చేసికొన్నప్పుడు ఆమెకు కల్గు ఆనందము అపరిమితము. ఆమె వీరపత్ని కదా!

**"తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహమ్,**

**బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే** (రా. ఆ. –30–39) (శత్రువులను సంహరించినవాడు, అందువల్ల మహర్షులకు ఆనందాన్ని కలిగించినవాడు అయిన భర్త శ్రీరామచంద్రుని చూసిన సీతాదేవి సంతోషించినది, అతనిని ఆలింగనం చేసికొన్నది) అని వాల్మీకిమహర్షియు పల్కెను కదా! లేనిచో "**స్త్రియం పురుషవిగ్రహమ్**" (రా. అయో. – 30–3) పురుషరూపములో నున్న వేరొక స్త్రీని అలింగనము చేసికొన్నట్లే అగును.

"**తఴుమ్బిరున్ద శార్ జ్గ నాణ్ తోయ్ న్ద వా మజ్గె**" (శార్ జ్గమనే ధనుస్సు అల్లెతాడు దెబ్బల వల్ల ఏర్పడిన గుర్తులు అందమైన బాహువులలో ఉన్నవి) (23) అని పొయ్ కై ఆళ్వార్లు, "**జ్యాకిణకర్కశైః శుభైః**" (అల్లెతాడు వలన ఏర్పడిన కాయలతో కఠినముగా ఉన్నవి, మంగళకరమైనవి) (33) అని యామునులు, "**జ్యాకిణాంకపరికర్మధర్మిణః**" (సుందర. స్త–52) (అల్లెతాడు దెబ్బలవల్ల ఏర్పడిన కాయల గుర్తులను అలంకారములుగా కలిగినవి, భగవంతుని బాహువులు) అని కూరేశులును భగవానుని బాహువులకు జ్యాకిణములు శోభను కల్గించుననిరి కదా! ఇట్టి కిణములు రెండు. బాహువులకును ఉన్నట్లు పల్కుటచే స్వామి సవ్యసాచి – అని చెప్పినట్లయిది. "**చకాసతం జ్యాకిణ కర్కశైః**" (33) అను స్తోత్రరత్నశ్లోకమును పెరియ వాచ్చాన్ పిళ్ళై అను ఆచార్యులు "**నాణి త్తఴుమ్బు ఎల్లావత్తిఱ్కుమ్ ఉణ్డాకైయాలే సవ్యసాచి ఎన్నై**" (అల్లెతాడు వల్ల ఏర్పడిన గుర్తులు అన్ని బాహువులలోనూ ఉన్నందువల్ల స్వామి సవ్యసాచి– అని భావము) అని వ్యాఖ్యానించుట ఇచట ఉట్టంకింపదగినది.

రామకృష్ణాది అవతారములలో మాత్రమే ఇట్టి జ్యాకిణములను దర్శింప వీలగునే కాని, అర్చామూర్తులలో వానిని దర్శింపవీలు లేదు కదా! అను శంక ఇచట కలుగవచ్చును. "**అవతారదశాయాం విరోధినిరాకరణార్థవ్యాపారత్వవ్యంజకైః జ్యాకిణై రంకితత్వం పరవిగ్రహభుజేష్వపి తదభేదానుసంధానేన నిర్దిశతి**" (అవతార దశలో శత్రువులను వధించడంకోసం భగవానుడు చేసే లీలలను సూచించే అల్లెతాడు దెబ్బల వల్ల ఏర్పడిన గుర్తులతో

భగవంతుని దివ్యమంగళ విగ్రహం అంకితం చేయబడి ఉండడం అనే క్రమాన్ని పరమపదంలో ఉండే పరమాత్మ దివ్యమంగళ విగ్రహంలోని భుజాలలో కూడా అనుసంధించటానికి కారణం – పరరూపానికి, విభవ రూపానికి మధ్య ఉండే అభేదమే) అనుచు "**చకాసంతం**" అను స్తోత్రరత్నశ్లోకవ్యాఖ్యానమున వేదాంత దేశికులు పల్కిరి. ఆ విధముగానే ఇచట భట్టరు అవతార సన్నివేశవిశేషమును అర్చామూర్తి యందును అనుసంధించుచున్నారని చెప్పనగును.

ఇట్లు అవతార, అర్చామూర్తులను అభేదములుగా స్తుతించుట ఆళ్వార్లకు పరిపాటియే. ఆది, దివ్యప్రబంధములలో పలు సందర్భములలో కన్పించుచున్నది. పెరియాళ్వార్లు "**నిచ్చలుమ్ తీమైకళ్ శెయ్ వాయ్**" ఎల్లప్పుడూ చిలిపి పనులను చేసేవాడా!) అని శ్రీకృష్ణావతారచేష్టితములను అనుభవించి, వెంటనే, "**నీళ్ తిరువేజ్గడత్తెన్దాయ్!**" (2-7-3) (ఎత్తయిన వేంకటాద్రిలో ఉండే స్వామీ!) అనుచు వేంకటాద్రిపై వేంచేసియున్న అర్చామూర్తిని స్తుతించిరి.

శ్రీరంగనాథుని బాహువులను దర్శించినదో, "**ఇవి బాహువులు కావు, పూమాలలే**" అని భ్రమపడునట్లు అత్యంతము మార్దవగుణమును కల్గియుండును. "**అతికోమలా తను రియమ్**" (42) (ఈ తనువు చాలా కోమలమైనది) అని భట్టరు శ్రీగుణరత్నకోశమున లక్ష్మీదేవి తనువు అతికోమలమని వర్ణించిరి. అట్టి అతిసుకుమారమైన తనువును కల లక్ష్మీదేవికి "**పుష్పమాలికలా ఇవి!**" అను భ్రమను స్వామిబాహువులు కల్గించుచున్నవనుటచే, ఆ బాహువుల మార్దవము ఎంత గొప్పదో చెప్పినట్లయినది. ఇట్టి మార్దవగుణము కూడ లక్ష్మీదేవిని ఆకర్షించుచున్నది.

88 శ్లోకమున శ్రీరంగనాథుని సౌకుమార్యమున "**పుష్పహాస ఇతి నామ దుహానం సౌకుమార్య మతివాఙ్మనసం నః**" అనుచు భట్టరు వర్ణించిరి. మనస్సుకు, మాటకు అందనిది అగు తన సౌకుమార్యమును చూపి, స్వామి లక్ష్మీదేవిని ప్రలోభ పెట్టుచున్నాడని ఇచట భావము.

ఈ సందర్భమున **"పూవియల్ నాళ్ తడన్తోళన్"** (1-9-8) (పూవువలె సుకుమారమైన, విశాలమైన బాహువులను కలవాడు) అను తిరువాయ్ మొళిలోని సూక్తిని, అచటి నమ్బిళ్ళై వ్యాఖ్యానమున (ఈడు) గల "పూవాలల్లదు శెల్లాదపడి సుకుమారమాయ్, కల్పతరు పణైత్తాప్పోలే నాలాయ్, శు*ఱ్ఱు*డైత్తాయిరుక్కిఱ తిరుత్తోళ్ కళై యుడైయవన్. పూవియల్–– పూవాలే యలంకృతమాన – ఎన్నుదల్, పూవై యొ*ழి*య చ్చెల్లాద సౌకుమార్యత్తై యుడైయవన్ – ఎన్నుదల్" (పువ్వులచే అలంకరింప బడకపోతే సహించలేని విధంగా ఉండే రీతిలో సుకుమారమై, ఒక కల్పవృక్షం పలు శాఖలుగా వృద్ధి చెందినట్లుగా, నాలుగు సంఖ్యలో ఉన్నవై, వర్తులంగా ఉండే నాలుగు బాహువులను కలిగినవాడు. "పూవియల్"– పువ్వుల చేత అలంకరింపబడిన– అని చెప్పవచ్చు, లేక, పూలచే అలంకరింపబడక పోతే సహించలేని సౌకుమార్యాన్ని కలిగినవాడని చెప్పవచ్చు అనికూడా చెప్పవచ్చు) అను వాక్యములను స్మరింపనగును.

**"స్ఫీతస్రక్ వ్యతికరిత సందిగ్ధవిభవౌ"** అని 105 శ్లోకమునను స్వామి బాహువులు పూమాలలనెడి భ్రాంతిని కల్గించుచున్నవని భట్టరు పల్కిరి, అందువలన ఇక్కడ పునరుక్తి కదా అని అంటే, అచటి భ్రాంతికి కారణము రూపసామ్యము – అని, ఇచట భ్రాంతికి కారణము మార్దవరూప స్వభావసామ్యము – అని చెప్పవచ్చును. కావున, పునరుక్తి లేదు.

యామునులు స్తోత్రరత్నమున **"జ్యాకిణకర్కశైః"** (33) అనిన పిమ్మట, **"శుభైః"** అనుచు భగవానుని భుజముల మార్దవగుణమును స్తుతించిరి. అట్లే, ఇచట భట్టరును జ్యాకిణకర్కశత్వమును పల్కిన పిమ్మట, మార్దవగుణమును స్తుతించిరని చెప్పనగును. వేదాంతదేశికులు **"శుభైః"** అను స్తోత్రరత్నశ్లోకములోని విశేషణపదమును వ్యాఖ్యానించుచు, **"ఔదార్యవీర్య సౌందర్యాదిశాలిభిః"** (ఔదార్యం, వీర్యం, సౌందర్యం మొదలైన గుణాలతో ప్రకాశించుచున్నవి) అని పల్కిరి. ఇచట, **"ఆది"** శబ్దమువలన సౌకుమార్యము (మార్దవము.)కూడ

గ్రాహ్యములే, పూర్వము ఉదాహరించిన పొయ్ కై యాళ్వార్ పాశురములోని **"అమ్ కై"** (23) (అందమైన హస్తము) అను పదమును వివరించుచు, **"పెరియ వాచ్చాన్ పిళ్ళై పిరాట్టియుమ్ కూడ క్కూశి స్పర్శిక్కవేణ్డుమ్ అఘకియ కై"** (చాలా సుకుమారి అయిన లక్ష్మీదేవి కూడా జంకుతూ తాకవలసిన రీతిలో ఉండే అందమైన చేయి) అని పల్కుటయు ఇచట అనుసంధేయము. ఈ వివరణములో భగవానుని బాహువులలోని సౌ కుమార్యగుణమే కదా వివక్షితము.

పైన వివరించిన మూడు కారణములవలన, అనగా, జగద్రక్షణను సూచించు వలయబంధమును, వీరత్వచిహ్నములగు జ్యాకిణములను, పూమాలను తలపింపచేయు మార్దవమును చూచిన లక్ష్మీదేవి శ్రీరంగనాథుని బాహువులను తన తలదిండుగా చేసికొనెను. ఇట్లు స్వామి బాహువులను దిండుగా చేసికొని, లక్ష్మీదేవి నిదురించునపుడు, శ్రీరంగనాథుని బాహువులు చాలా సుకుమారములు కనుక, ఆమె ముంగురుల ముద్రలు స్వామిబాహువులపై ముద్రితములయ్యెను. ఈ ముద్రలు స్వామికి సర్వోత్కర్షను కల్గించుటచే మిక్కిలి వెలుగొందుచున్నాడు.

ఇచట, స్తోత్రరత్నములోని **"ప్రియావతంసోత్పల కర్ణభూషణశ్లథాలకాబంధ విమర్దశంసిభిః"** (ప్రియురాండ్రు అయిన లక్ష్మీదేవి భూదేవి మొదలైన. దివ్యదేవేరులు ధరించిన తామర పూల రూపంలో ఉందే కర్ణాభరణాల ఒత్తిడిని, సంశ్లేష సమయంలో చెదరిన కేశపాశబంధమువలన కలిగిన ఒత్తిడిని సూచింపజేయునవి) (33) అను శ్లోకార్థము అనుసంధేయము.

ఈ స్తోత్రప్రారంభమున భట్టరు **"శ్రీస్తనకస్తూరీమకరీముద్రితోరసః"** అనుచు లక్ష్మీదేవిస్తనములలోని కస్తూరిచే ముద్రితమైన వక్షఃస్థలమును కల్గియుండుట పరత్వచిహ్నమని పల్కిరి. ఇచట, స్వామిబాహుయుగము ఆ లక్ష్మీదేవి అలకల ముద్రలను కల్గియుండుటవలనకూడ శ్రీరంగనాథుని సర్వాతిశాయిత్వము ప్రతిపాదింపబడుచున్నదనుచు, అట్టి బాహు

యుగ్మమునకు **"విజయతే"** అనుటద్వారా మంగళాశాసనమును చేయుచున్నారు. లక్ష్మీసంబంధము వలన భగవానునకు సర్వోత్కర్ష కల్గునని వేదమును "**శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే**" (దేవశబ్దవాచుడైన భగవానుడు ఆ దేవత్వమును శ్రద్ధా అని పిలువబడే లక్ష్మీసంబంధము వలన పొందుతున్నాడు) (తైత్తి. బ్రా. –12–3–1) అని పల్కెను కదా! శ్రియఃపతిత్వము భగవానుని పరత్వసూచకములగు అసాధారణచిహ్నములలో మొదటిది. కావుననే, మన పూర్వాచార్యులందరును తమ తమ గ్రంథములలో భగవానునకు సంబంధించిన విశేషణములను పల్కుటలో ప్రథమస్థానమును శ్రియఃపతిత్వమునకే ఒసగిరి.

స్వామిబాహువులు లక్ష్మీదేవికి విహారస్థానము అనుటను **"తిరువిళైయాడు తిణ్ తోళ్"** (శ్రీదేవి క్రీడించు బలిష్ఠములైన బాహువులు) (9–3) అను నాయ్చ్చియార్ తిరుమొళి పాశురముకూడ తెలుపుచున్నది. "**ఉపధాయ భుజం తస్య లోకనాథస్య సత్కృతమ్**" (లోకనాథుడైన శ్రీరాముని భుజమును తలదిండుగా చేసుకుని) (రా. సుం. 21–16) అను శ్రీరామాయణశ్లోకముకూడ ఈ అంశమును నిరూపించుచున్నది. భవభూతిప్రణీతమైన ఉత్తరరామచరితనాటకములోని–

**"ఆవివాహసమయాత్ గృహే వనే దధతు యౌవనే పునః,**
**స్వాపహేతు రనుప్రాశితోఽ న్యయా రామబాహు రుపధాన మేష తే"**

(ఉ. రా. 1–37)

(వేరొకరి ఎవరిచేత ఆశ్రయింపబడని ఈ శ్రీరాముని బాహువు, వివాహ సమయమునుండి యౌవనంలో ఇంటిలో, అరణ్యములో, నీకు తలదిండు) అను శ్లోకరత్నమిచట ఉదాహరణీయము కదా!

ఈ శ్లోకమున వరుసగా శ్రీరంగనాథునియొక్క వాత్సల్య, కారుణ్యాదులు, శౌర్య, పరాక్రమాదులు, సౌకుమార్యసౌందర్యాదులైన గుణములు ప్రస్తుతములైనవి – అని చెప్పవచ్చును.

'కమలాం లీలోపధానం భవత్' అను వేరొక పాఠము మూడవ పాదము చివర కనుపించుచున్నది. అప్పుడు "**కమలాం ప్రలోభ్య, తచ్చిత్రాలకముద్రితం లీలోపధానం భవత్**" అని అన్వయము, "**చిత్రాలక**" అనునపుడు, చిత్రశబ్దము ఆశ్చర్యకరమను అర్థముతో పాటు, నానావర్ణములు కలసిన వన్నెను తెలుపును. అపుడు, నానావర్ణ మిశ్రితమైన, ఆశ్చర్యకరమైన ముంగురులు – అను అర్థము వచ్చును. "**తోకైమామయిలార్ కళ్**" (తి. వా. 6-2-2) (నెమలిపింఛమువంటి ఆకర్షణీయమైన కేశపాశమును కలిగినవారు) అను ఆళ్వార్లసూక్తిచొప్పున, శ్రీదేవి ముంగురులు నెమలి పింఛముయొక్క వర్ణమువలె, నానావర్ణ మిశ్రితమైన, ఆశ్చర్యకరమైన వన్నెను కల్గియుండునని ఇచట చెప్పబడినది.

కేశములకు బర్హమునకు పోలిక కవిసమయమే. "**తమః శైవాలపాథోదబర్హ భ్రమరచామరైః, యమునావీచినీలాబ్జాభ్రైః సమః కచః**" (కేశములను – చీకటితో, నాచుతో, నీటితో, నెమలి పింఛముతో, తుమ్మెదలతో, చామరములతో, యమునానది కెరటములతో, నల్లని మేఘములతో సమానముగా వర్ణించవలెను) అను అలంకారశేఖరములోని శ్లోకము ఇందులకు ప్రమాణము. "**చిత్రాలకముద్రితమ్**" అనుటచే, కనకవలయముద్రలవలన, జ్యాఘాతాంకములవలన కలుగని వైచిత్రి లక్ష్మీదేవియొక్క అలకల ముద్రలచే స్వామిబాహువులకు ఏర్పడెను – అను రస్యభావము ధ్వనించుచున్నది.

"**సుమనః స్రజ్మోహనే మార్దవే**" అను పదములు స్వామిబాహువులకు ఉపధానమున కుండవలసిన గుణములు కలవని తెలుపుచున్నవి. మార్దవము కంఠోక్తిగా చెప్పబడినది. "**సుమనః స్రక్**" అనుట వలన శైత్యము, సౌగంధ్యమును సూచింపబడినది. కావున, స్వామిబాహువులు ఉత్తమమైన ఉపధానములు.

"**ప్రతి జలధితో వేలాశయ్యాయామ్**" అను 106వ శ్లోకమున కవి, సముద్రతీరమున శయనించిన శ్రీరామునకు, శ్రీరంగమున శయనించిన శ్రీరంగనాథునకు సామ్యమును ప్రతిపాదించిరి కదా! శ్రీరామాయణమున

సముద్ర శరణాగతి ఘట్టములో శ్రీరాముడు సముద్రతీరమున, ఆ సముద్రమునకు ఎదురుగా, శయనించిన సందర్భములో వాల్మీకి పలికిన –

**"బాహుం భుజగభోగాభ ముపధాయారినిషూదనః,**
**జాతరూపమయై శ్చైవ భూషణైః భూషితం పురా,**
**వరకాంచనకేయూరముక్తా ప్రవరభూషణైః,**
**చందనాగరుభి శ్చైవ పురస్తా దధివాసితమ్,**
**––చందనై రుపశోభితమ్,**
**శయనే చోత్తమాంగేన సీతాయా శ్శోభితం పురా,**
**సంయుగే యుగసంకాంశం శత్రూణాం శోకవర్ధనమ్,**
**సుహృదానందనం దీర్ఘం సాగరాంతఃవ్యపాశ్రయమ్,**
**అస్యతా చ పున స్సవ్యం జ్యాఘాతవిగతత్వచమ్,**
**దక్షిణో దక్షిణం బాహుం మహాపరిఘసన్నిభమ్,**
**గోసహస్రప్రదాతార ముపధాయ మహద్భుజమ్"**

(రా. యు. 21న సర్గ)

అను శ్లోకములలోని భావమునకు, ఈ స్తోత్రములోని 105వ శ్లోకము మొదలు 108వ శ్లోకము వరకు భట్టరు చేయు శ్రీరంగనాథబాహువర్ణనమునకు గల సామ్యము మిక్కిలి స్పష్టము.

ఈ విధముగా పలు సందర్భములలో శ్రీరంగరాజస్తవములోని శ్లోకములు శ్రీరామాయణశ్లోకార్థములను వివరించుచున్నవి– అను అంశమును సహృదయ పాఠకులు స్పష్టముగా గమనించవచ్చును.

ఈ శ్లోకమున అలంకారము ఉత్ప్రేక్ష, వృత్తము శార్దూలవిక్రీడితము. ఈ శ్లోకములోని **"కౌతుకే సుకటకే"** వంటి సతిసప్తమీ ప్రయోగములు నిమిత్తరూపమున పర్యవసించుచున్నవి.

**శ్రీరంగనాథుడు తలదిండుగా తన శిరస్సు కింద పెట్టుకున్న కరపద్మాన్ని ఆశ్రయిస్తున్నాను**

**109. భవార్తానాం వక్త్రామృతసరసి మార్గం దిశదివ**
**స్వయం వక్త్రేణేదం వరద మితి సందర్శిత మివ ।**
**కరాంభోజం పంకేరుహవనరుషా పాటల మివ**
**శ్రయామి శ్రీరంగేశయితు రుపధానీకృత మహమ్ ॥**

**ప్ర. అ. –** భవ = సంసారమునందు, ఆర్తానాం = తాపమును పొందినవారికి, వక్త్ర = తన ముఖము అను, అమృతసరసి = అమృత తటాకమునకు (నందలి), మార్గం = మార్గమును, దిశత్ ఇవ = ఉపదేశించునది వలె, ఇదం = ఈ చేయి, వరదం = వరముల నిచ్చునది, ఇతి = అని, వక్త్రేణ = నోటితో, స్వయం = తానే, సందర్శితమ్ ఇవ = చూపింపబడినదివలె, పంకేరుహ = పద్మముల, వన = సమూహముపై గల, రుషా = కోపముచే, పాటలమ్ ఇవ = ఎఱ్ఱగా ఉన్నది వలె శోభిల్లునట్టి, ఉపధానీకృతం = తలదిండుగా చేయబడిన, శ్రీరంగేశయితుః = శ్రీరంగనాథునియొక్క, కర+అంభోజం = పద్మమువంటి చేతిని, అహం = నేను, శ్రయామి = ఆశ్రయించుచున్నాను.

**వరివస్య :–** భట్టరు ఈ శ్లోకమున శ్రీరంగనాథుడు తలదిండుగా తన తలక్రింద పెట్టుకొనియున్న భుజమును స్తుతించుచున్నారు. చేతిని తలదిండుగా మడచి పెట్టుకొనునపుడు స్వామి ముఖము ఆ చేయిని తాకుచుండుటచే, ఆ సన్నివేశవిశేషమును భట్టరు హృదయంగమములైన పలు ఉత్ప్రేక్షలతో స్తుతించుచున్నారు.

శ్రీరంగనాథుని ముఖము **"సంసారమరుకాంతారే దుర్వ్యాధివ్యాఘ్రభీషణే. సంతప్తమ్"** (దేవరాజాష్టకము) (చెడ్డ వ్యాధులు అనే పులులచేత భయంకరమైనది అయిన సంసారమను ఎడారిలో ఉండే అరణ్యంలో–– చాలా తాపాన్ని పొందినవాడను) అనునట్లు, సంసారమను అరణ్యమున నిరంతరము తిరుగుచు, మిక్కిలి ఆర్తిని పొందిన సంసారులకు వారి

తాపమును తీర్చు అమృతతటాకమువంటిది. లోకమున దాహమును పొందినవారు ఆ దాహమును తీర్చుకొనుటకై చల్లని, తీయని నీరు కల్గిన సరస్సుకొఱకు అన్వేషింతురు. అట్టి సరస్సు ఏ చోట ఉన్నదో తెలియక కొట్టుమిట్టాడు బాటసారులకు "**ఈ దిక్కున మీ తాపమును తీర్చగల్గిన కొలను కలదు**" అని తమ చేతివేలుతో సరస్సు కల దిశను చూపుచు ధర్మబుద్ధి కల్గినవారు సహాయపడుదురు. అట్లే, సంసారమున మిక్కిలి ఆర్తిని పొంది, అలమటించు చేతనులను ఉద్దేశించి, "మీ ఆర్తిని తీర్చు అమృతసరస్సు ఇదియే" అనుచు స్వామి తన ముఖమును చూపుచున్నట్లు తలదిండుగా చేసికొనబడిన చేయి అమరియున్నది.

సంసారతాపము మానసికము, కావున ఆ తాపము (తీరుట) అమృతసరస్సువలననే సాధ్యమగును. శ్రీరంగనాథుని ముఖమండలము అట్టి అమృతతటాకము.

స్వామిముఖమును స్పృశించునట్టి, ఉపధానముగా చేసికొనబడిన చేతినిగూర్చి ఉత్ప్రేక్షించిన పిదప, ఆ చేతిని తాకుచు స్వామిముఖము ఉండు సన్నివేశమును గూర్చి వేరొక ఉత్ప్రేక్షతో కవి వర్ణించుచున్నారు. స్వామి ముఖము తలదిండుగా చేసికొనబడిన కుడిచేతిని "**ఈ హస్తము సమస్తవరములను ప్రసాదించును**" అని సంసారులకు చూపుచున్నట్లున్నది.

లోకమున నాట్యము చేయువారు హావభావములను, ముఖవికారములతో, చేతివ్రేళ్లతో ప్రదర్శింతురు. అట్లే, ఇచట శ్రీరంగనాథుడను నటుడు తన హస్తము, ముఖములద్వారా తన మనస్సులో గల భావమును భక్తులకు తెలియజేయుచున్నట్లున్నది. భట్టరు శ్రీరంగనాథుని ఉత్సవమూర్తిని స్తుతించునపుడు "**కించిత్తాండవగంధిసంహననకమ్**" (74) అనుచు కొద్దిపాటి నృత్యభంగిమను కల్గినట్లు పల్కిరి. మూలమూర్తి యందును అట్టి సన్నివేశము కలదను అంశమును పరోక్షముగా ఇట్లు ఇచట కవి తెలిపిరని చెప్పనగును. ఈ విధముగా పల్కుట పరమరసికులగు భట్టరుకే తగును.

దక్షిణహస్తము వరదాయకము అను విషయము స్వామిముఖము మౌనముగా తెలుపుచుండుట **"గురో స్తు మౌనం వ్యాఖ్యానమ్"** (గురువు మౌనమే వ్యాఖ్యానము) అనునట్లున్నది.

ఇక, మూడవ ఉత్ప్రేక్ష మరింత రమణీయమైనది. ఇందు స్వామిహస్తము ఎఱ్ఱగానుండుటకు హేతువు ఉత్ప్రేక్షింపబడుచున్నది. సహజముగానే స్వామిహస్తము ఎఱ్ఱ తామరపూవువంటిది. అయినను, అందులకొక హేతువును కవి పల్కుచున్నారు. లోకమున కోపమున్న చోట ఎఱ్ఱదనముండుట అనుభవసిద్ధమే. కోపము అనునది తమోగుణాత్మకము కనుక, తమోగుణవర్ణము ఎర్రదనము కనుక, కోపమును ఎర్రగా వర్ణించుట కవిసమయముకూడా. స్వామిహస్తమునకు తామరలతో గల వైరము కారణమువలన ఆ హస్తము ఎఱుపెక్కినట్లున్నది.

అది సరే, శ్రీరంగనాథుని హస్తమునకు తామరపుష్పములతో గల వైరమేమి? అనగా, **"కట్టురైక్కిల్ తామరై నిన్ కణ్ పాదమ్ కై యొవ్వా"** (తి. వా. -3-1-2) (వివరించి పలికితే, తామర పువ్వు నీ కన్నులకు, పాదములకు, చేతులకు సాటి రాదు) అనుచు నమ్మాళ్వార్లు స్వామికన్నులతో, పాదములతో, కరములతో తామర తులతూగదనిరి. "**నా వలన పరాజయమును పొందిన ఈ తామరలు తిరిగి తమ తలలను నీటిపై బయటకు పెట్టుచున్నవే! ఇంకను వీని గర్వము పూర్తిగా అణగలేదా?**" అను కోపమువలన స్వామిహస్తము ఎఱ్ఱబడినదని చెప్పవచ్చును – అని శ్రీ. ప్ర. భ. అణ్ణాస్వామి వ్యాఖ్యానమున తెలుపబడినది. లేక, తామరపూవులను జయింపవలెనను భావముచే కల్గిన వైరమువలన హస్తము ఎఱ్ఱగా నున్నదనియుచెప్పవచ్చును.

"**స్వయం వక్త్రామృతసరసి మార్గం దిశ దివ**" (స్వయముగానే తన ముఖమను అమృత సరస్సులో ప్రవేశించుటకు తగిన మార్గమును చూపుతున్నట్లుగా) అని అన్వయించుటవలన, "**వివృణుతే తనూగ్ మ్ స్వామ్**" (పరమాత్మ ఎవరిని అనుగ్రహించునో, అతనికే తన

దివ్యమంగళవిగ్రహానుభవమును అనుగ్రహించును) అనునట్లు, తన తనువును తానే భగవానుడు అనుగ్రహించుచున్నాడు – అను అర్థము ధ్వనించును. ఈ విధముగా ఈ స్తోత్రములో పలు సందర్భములలో పలు వేదాంతార్థములు ధ్వనించుట రసికులైన పాఠకులు గమనించగలరు.

ఈ శ్లోకమున అలంకారము హేతూత్ప్రేక్ష. వృత్తము శార్దూలము. **"వక్త్రామృతసరసి"** అనునపుడు సప్తమీవిభక్తిని విషయసప్తమిగా గాని, ఔపశ్లేషికసప్యమిగాగాని అన్వయింపవచ్చును.

## శ్రీరంగనాథుని రెండు భుజములు పరత్వ సౌలభ్య సూచకములు

**110. కిరీటం శ్రీరంగేశయితు రుపధానీకృతభుజో**
**విధీశాధీశత్వాత్ ఘటత ఇతి సంస్పృశ్య వదతి।**
**నిహీనానాం ముఖ్యం శరణ మితి బాహు స్తదితరః**
**స్ఫుటం బ్రూతే పాదాంబుజయుగళ మాజానునిహితః ॥**

**ప్ర. అ. –** శ్రీరంగేశయితుః = శ్రీరంగనాథునియొక్క, ఉపధానీకృతభుజః = తలదిండుగా చేసికొనబడిన భుజము, కిరీటం = కిరీటమును, సంస్పృశ్య = తాకి, విధి = బ్రహ్మకు, ఈశ = రుద్రునకు, అధీశత్వాత్ = నియామకుడగుట వలన, ఘటతే = (స్వామికి ఈ కిరీటము) తగును, ఇతి = అని, వదతి = పలుకుచున్నది, ఆజాను = మోకాలి వరకు, నిహితః = చాచిన, తత్+ఇతరః = ఆ (కుడి) భుజము కంటె వేరు, బాహుః = భుజము, పాద +అంబుజయుగళం = తామరలవంటి పాదముల జంటను, సంస్పృశ్య = తాకి, నిహీనానాం అధములకు (బ్రహ్మాదులకు), ముఖ్యం = ముఖ్యమగు, శరణం = (శరణము) రక్షకము, ఇతి = అని, స్ఫుటం = స్పష్టముగా, బ్రూతే = పల్కుచున్నది.

**వరివస్య :–** గడచిన అయిదు శ్లోకములతో శ్రీరంగనాథుని బాహుసౌందర్యమును స్తుతించిన భట్టరు, ఇందు సింహావలోకన్యాయమున ఆ

వర్ణనను ముగించుచు, స్వామియొక్క రెండు బాహువులను రెండు ఉత్ప్రేక్షలతో ప్రస్తుతించుచున్నారు.

తలదిండుగా చేసికొనబడిన చేయి కిరీటమును స్పృశించుటను, రెండవ బాహువు మోకాలిపర్యంతము చాచబడి, పాదములను చూపుచున్నట్లుండుటను కవి రెండు ఉత్ప్రేక్షలతో సమర్థించుట ఇందలి ప్రధానాంశము.

"**అంగై రంత ర్నిహితవచనైః సూచితః సమ్యగర్థః**" (చెప్పదలచిన మాటలను లోపల చక్కగా నిలుపుకున్న అంగములచేత ఆ మాటల అభిప్రాయం చక్కగా సూచింపబడింది) అనునట్లు, మౌనవ్రతమును పాటించు నటీనటులు తమ అంగవిన్యాసములతో మనస్సులోని భావమును సూచింతురు. శ్రీరంగనాథుడు నటాగ్రణి, కావున, శ్రీరంగనాథుని బాహువులు రెండును మౌనముగానున్నను, తమ విన్యాసవిశేషముచే తాము తెలియజేయదలచిన అర్థమును స్ఫుటముగా ప్రకటించుచున్నవట, స్వామికి తలదిండుగా మారిన చేయి కిరీటమును స్పృశించుటచే "**బ్రహ్మకు, రుద్రునకును ప్రభువగుటచే శ్రీరంగనాథునకు మాత్రమే ఈ కిరీటము తగును**." అని ఆ చేయి తెలియజేయుచున్నట్లున్నది. అట్లే, మోకాలివరకు చాచుకొనియున్న వేరొక బాహువు ఆ స్వామి పాదములను చూపుచున్నట్లుండుటచే, "ఈ పాదములే మీకు రక్షకములు" అని అధములైన, వారినిగూర్చి (బ్రహ్మరుద్రాదులను గూర్చి) పలుకుచున్నట్లున్నది– అని శ్లోకభావము.

"**విధీశాధీశత్వాత్**" అనునపుడు "**త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్**" (శ్వేత. - 6-7) (ఈశ్వరులకందరికి గొప్ప ఈశ్వరుడైన అతనిని) అని మొదలైన శ్రుతివాక్యములు,

**"క ఇతి బ్రహ్మణో నామ ఈశో ఽహం సర్వదేహినామ్,**
**ఆవాం తవాంగే సంభూతౌ తస్మాత్ కేశవనామవాన్"**

(హరి, విష్ణుపర్వ. -131-48)

(క అనే పదంచేత బ్రహ్మ చెప్పబడుతున్నాడు. నా పేరు ఈశ్వరుడు. మేమిద్దరము నీ నుండి పుట్టుట వలన నీవు కేశవుడవు అయినావు) అను మొదలైన పురాణవచనములు,

**"నాన్ముగనై నారాయణన్ పడైత్తాన్,**
**నాన్ముగనుమ్ తాన్ముకమాయ్ శఙ్కరనై త్తాన్ పడైత్తాన్"**

(నాన్ము. తి. –1)

(చతుర్ముఖుని నారాయణుడు సృష్టించాడు, ఆ చతుర్ముకుడు శంకరుని సృష్టించాడు) అని మొదలైన ఆళ్వార్ల సూక్తులు, "**కస్యోదరే హరవిరించిముఖప్రపంచః**" (ఎవని ఉదరంలో బ్రహ్మ, రుద్రుడు మొదలైన ప్రపంచం అంతా ప్రళయ కాలములో ఇమిడి ఉన్నదో), "**వేదాపహారగురుపాతకదైత్యపీడాది.... కోఽన్యః ప్రజాపశుపతీ పరిపాతి**?" వేదాలను మధుకైటభులు అపహరించడం, తనకు తండ్రి అయిన బ్రహ్మ శిరస్సును ఖండించడం, అసురుల వల్ల ఆపదలు రావడం – మొదలైన ఆపదలు బ్రహ్మ, రుద్ర, ఇంద్రులకు కలిగినప్పుడు, వారిని రక్షించినవాడు నారాయణుని కంటే వేరొకడు ఎవడు?) (స్తోత్రరత్నం) అని మొదలైన ఆచార్యవచనములును స్మరింపనగును. ఇచట విధి, ఈశశబ్దములు ఇంద్రుని సూచించినవి.

కుడిభుజము– బ్రహ్మరుద్రాదులకును స్వామి నాయకుడనుటచే సర్వస్మాత్ పరత్వమును, ఎడమ భుజము – నీచులకు సైతము స్వామి పాదములే శరణమని పల్కుటచే సౌలభ్యమును ప్రకటించుచున్నవని చెప్పవచ్చును. పరత్వసౌలభ్యములు రెండును భగవానునకు ముఖ్య లక్షణములు కదా! వీటిని శాస్త్రములు భగవంతునకు ఉభయలింగములుగా పలికినది. ఆళ్వార్లును పలు సందర్భములలో ఈ రెండిటిని కలిపి అనుభవించిరి, "**మణియై వానవర్కణ్ణనై**" (తి. వా. –1–10–11) (మణివంటివానిని, నిత్యసూరినిర్వాహకుని) అని మొదలయిన ప్రయోగములు అందులకు తార్కాణములు. ఇచట "**మణియై**" అనుటచే సౌలభ్యము, "**వానవర్ క్కణ్ణనై**"

అనుటచే పరత్వము సూచింపబడినది. భట్టరును ఈ శ్లోకమున అట్టి క్రమమును అనుసరించిరని చెప్పనగును.

శ్లోకములోని **"స్ఫుటమ్"** అనుపదము క్రియావిశేషణముగా గాని, ఉత్ప్రేక్షా సూచకముగా గాని అన్వయింపవచ్చును. **"నిహీనానామ్"** అనుటకు —అకించనులు అగు ప్రపన్నులకు— అనియు అర్థము.
శిఖరిణీ వృత్తమున స్వామికిరీటమునుగూర్చి ప్రస్తుతించుట ఈ స్తోత్రములోని ఛందఃపరమైన మరియొక విశేషాంశము.

## శ్రీరంగనాథుని వక్షస్సు శ్రీరంకనాయకి క్రీడాగృహం

**111. మలయజశశిలిప్తం మాలతీదామతల్పమ్**
**సుమణిసరవితానం కౌస్తుభస్వస్తిదీపమ్ ।**
**దనుజవృషవిషాణోల్లేఖచిత్రం చ లక్ష్మీ –**
**లలితగృహ ముపాసే రంగసర్వంసహోరః ॥.**

**ప్ర. అ. –** మలయజ = చందనము, శశి = పచ్చకర్పూరములచే, లిప్తం = లేపనము చేయబడినది, మాలతీదామ = మొల్లపూవులను, తల్పం = పడుకగా కల్గినది, సుమణి = గొప్ప మణుల యొక్క సర = హారములను, వితానం = మేలుకట్టుగా కల్గినది, కౌస్తుభః = కౌస్తుభమణి అను, స్వస్తిదీపం = మంగళదీపమును కల్గినది, దనుజ = అసురులనెడి, వృష = ఎద్దులయొక్క విషాణ = కొమ్ములచే ఏర్పడిన, ఉత లేఖచిత్రం = (దెబ్బల గుర్తులు అను) రేఖలతో, చిత్రం = చిత్తరువులను కల్గినది ఆగు, రంగసర్వంసహ = శ్రీరంగనాథునియొక్క, ఉరః = వక్షః స్థలము, లక్ష్మీ = లక్ష్మీదేవియొక్క, లలిత = విలాసార్థమైన, గృహం = (గృహముగా) మందిరముగా, ఉపాసే = ఉపాసింతును. (అనుసంధింతును)

**వరివస్య :– "తిరువిడమే మార్వమ్"** (తి. వా. 2-5-2) (లక్ష్మీనివాసమే వక్షఃస్థలము) అని నమ్మాళ్వార్లు పల్కిన విధముగా, లక్ష్మీదేవి

భగవానుని వక్షఃస్థలమును నిత్యవాసముగా కల్గియున్నది. కావున అట్టి వక్షఃస్థలమును లక్ష్మీవిలాస గృహముగా రూపించుచు కవి స్తుతించుచున్నారు. ముందు శ్లోకమున శ్రీరంగనాథుని చరణములు నిహీనులకు శరణమని పల్కిరి. ఇందు "**నారీణాముత్తమా వధూః**" (రా. బా–1–27) (స్త్రీలలో ఉత్తమైన వధువు) అని శ్లాఘింపబడు లక్ష్మీదేవికి వక్షఃస్థలము శరణమని తెలుపబడుచున్నది. "**శరణం గృహరక్షిత్రోః**" అను నిఘంటువచనమును బట్టి, శరణమనగా, నివసించు చోటు – అను అర్థమును వచ్చును కదా! కూరేశులు వైకుంఠస్తవమున "**మందిర మిందిరాయాః**" (57) అని, అప్పయ్యదీక్షితులు వరదరాజస్తవమున "**అంతఃపురం జలధిరాజకుమారికాయాః**" అనియు వర్ణించుట ఇచట స్మరింపదగినవి. పూర్వశ్లోకమున రక్షకరూపశరణశబ్దార్థము వర్ణింపబడగా, ఇందు గృహరూపశరణశబ్దార్థము నిరూపింపబడినది. బాహుద్వయవర్ణనకు పిదప వాని మధ్యప్రదేశమగు వక్షఃస్థలముయొక్క వర్ణన చేయబడుచున్నదనియు చెప్పవచ్చును.

చందనకర్పూరములచే అలకబడినది, మొల్లపూల పడుకను కల్గినది, మాణిక్యసరముల చాందినిని కల్గినది, కౌస్తుభమణి అను మంగళదీపమును కల్గినది, రాక్షసులనెడి ఆబోతులతో పోరాడిన సందర్భములో ఏర్పడిన వాటి కొమ్ముల గుర్తులు అను చిత్తరువును కల్గినది అగు శ్రీరంగనాథుని వక్షఃస్థలమును లక్ష్మీదేవి లీలాగృహముగా భావింతును – అని శ్లోకభావము

కేళీగృహమునందు అంతట చందనము, పచ్చకర్పూరమువంటి సుగంధద్రవ్యములు పూయబడును. అట్లే, శ్రీరంగనాథుని వక్షఃస్థలమును చందనాదులచే సువాసితము. దీనికి తోడు, "**శ్రీస్తనకస్తూరీమకరీముద్రితోరసః**" (లక్ష్మీదేవి వక్షస్సులో ఆడు మొసలి రూపంలో అలదబడిన కస్తూరిచేత ముద్రింపబడిన వక్షస్సును కలవాడు) అనునట్లు, లక్ష్మీదేవివక్షఃస్థలమున అలదబడిన కస్తూరిచేకూడ ముద్రితమగును.

విలాసమందిరము మొల్లలు మొదలగు సువాసనను కల్గిన పూలతో నిండిన శయనముతో అలంకరింపబడి యుండునట్లే, స్వామివక్షఃస్థలముకూడ పలు విధములైన పూమాలెలతో అలంకరింపబడియుండును. "**ఆరామమ్ శూழ்న్ద అరఙ్గనకర్**" (ఉద్యానవనాలను చుట్టూ కలిగిన శ్రీరంగ నగరం) అని ప్రసిద్ధి చెందిన శ్రీరంగమున ఉద్యానవనములు నిండియుండుటచే పూమాలెలకు కొదువలేదు. "**అలంకారప్రియో విష్ణుః**" (విష్ణువు అలంకారప్రియుడు) అని పేరు వడసినవాడగుటచే స్వామికి పూలను అలంకరించుకొనుటలో ప్రీతి మెండు.

"**పూవుమ్ పూశనైయుమ్ తకుమే దేవన్ ఎమ్బెరుమానక్కల్లాల్**" (పూలు, అంగరాగాలు దేవుడైన శ్రీమన్నారాయణునకు తప్ప, వేరొకనికి తగునా?) (తి. వా. –2–2–4) అని నమ్మాళ్వార్లు పల్కినట్లు, అట్టి పూల అలంకరణము ఒక్క స్వామికి మాత్రమే తగును కదా! పుష్పకైంకర్యమును నిర్వహించుటకు విప్రనారాయణులవంటి భక్తశిఖామణులకు శ్రీరంగమున కొఱత లేనేలేదు కదా!

విలాసమందిరమున అమూల్యములైన రత్నసరములతో కూర్చబడిన చాందిని కట్టబడియుండును. "**కోల మామణియారముమ్, ముత్తుత్తానముమ్**" (గొప్పదైన అందంగా ఉండే మణుల హారం, ముత్యాల సరం) (అమల, 9) అని తిరుప్పాణాళ్వార్లు పల్కిన రీతిలో, శ్రీరంగనాథుని వక్షఃస్థలమున అనేక ఆభరణములు, రత్నహారములు, ముత్యాల సరములు ప్రకాశించుచుండును. కావున, ఇచట కూడ మణివితానము కలదు.

"**తూమణి మాడత్తు శుற்றుమ్ విళక్కెరియ**" (తిరుప్పావై. –9) (ఎటువంటి దోషం లేని మణులతో కట్టబడిన మేడలో చుట్టూ దీపాలు ప్రకాశిస్తూ ఉండగా) "**కుత్తు విళక్కెరియ**" (18) (గుత్తి దీపాలు వెలుగుతూ ఉండగా) అని, "**మన్ను మణివిళక్కై యొట్టి**" (స్థిరంగా ప్రకాశించే మణిదీపాన్ని నిలిపి) అని పల్కిన రీతిలో, విలాసగృహమున మంగళదీపములు

వెలుగుచుండును. అట్లే, శ్రీరంగనాథుని వక్షఃస్థలమున, అలంకరింపబడిన కౌస్తుభమణి మంగళదీపమువలె ప్రకాశించుచున్నది.

శ్రీవిష్ణుపురాణములోని అస్త్రభూషణాధ్యాయమున కౌస్తుభమణి స్వయంప్రకాశకములగు ఆత్మలకు ప్రతీకగా చెప్పబడినది. ఇట్టి కౌస్తుభమణిని దీపముగా భట్టరు రూపించుట మిగుల తగినది. ఆత్మ స్వయంప్రకాశకము కదా. కౌస్తుభమణిచే స్వామి వక్షస్సునకు కల్గిన శోభను పెరియాళ్వార్లు "**కురుమామణిప్పూణ్ కులావి త్తికళ్ళుమ్ తిరుమార్బు**" (1-2-10) (చాలా గొప్పదైన కౌస్తుభమణితో ఉజ్జ్వలంగా ప్రకాశించే వక్షఃస్థలం) అనుచు స్తుతించిరి. కేళీమందిరమున అనేక విధములైన చిత్తరువులు అమర్చబడి యుండును. అట్లే, శ్రీరంగనాథుని వక్షఃస్థలమునకూడ చిత్తరువులు అనేకములు కలవు. ఎట్లనగా, భగవానుడు వృషభములవంటి అసురులతో పోరాడునప్పుడు, కొమ్ములవలె వంకర తిరిగి, పెద్దవైయున్న వారి నఖముల ప్రహారములచే స్వామివక్షస్సున చిత్రమైన రీతిలో రేఖలవంటి గుర్తులు ఏర్పడినవి. అవి ఆలేఖ్యచిత్రములవలె భాసిల్లుచున్నవి. ఇచట, "**ధనుజవృషవిషాణ**" అనునపుడు అసురులను వృషభములతో పోల్చుటచే, వారి ఆయుధములను కొమ్ములుగా చెప్పబడినవనియు వివరింపవచ్చును.

ఇట్టి భావమును అనుసరించుచు వేదాంతదేశికులు, "దేవనాయకపంచాశత్" స్తోత్రమున

**"దుర్దాన్తదైత్యవిశిఖక్షతపత్రభంగం.**
**వీరస్య తే విబుధనాయక! బాహుమధ్యమ్"** (32)

(ఓ దేవనాయక స్వామీ! వీరుడవైన నీ వక్షఃస్థలం, అణచడానికి సాధ్యం కాని రాక్షసులు నీతో యుద్ధం చేసినప్పుడు వారు ప్రయోగించిన బాణముల వలన ఏర్పడిన గాయములను పత్రభంగములుగా కలిగినది) అనుచు స్తుతించిరి.

వీరపత్నులు కేళీమందిరములలో తమ భర్తల వీర్యపరాక్రమములకు గుర్తుగా వారు సంహరించిన మృగముల కొమ్ములను అమర్చుకొని,

ముటియుదురు. అవి విలాసమందిరమునకు శోభను చేకూర్చును. అట్లే, పలు చిత్తరువులను అమర్చుకొందురు. ఇట్టి భావము ఇచట "**దనుజవృషవిషాణైః ఉల్లేఖై శ్చ చిత్రమ్**" అను విగ్రహముద్వారా ఏర్పడును. శ్రీరంగనాథుని వక్షఃస్థలము పక్షమున – "**దనుజా ఏవ వృషాః తేషాం విషాణైః (నఖరూపైః), అథవా, (ఆయుధైః) జనితాః యే ఉల్లేఖాః తైః చిత్రమ్**" (అసురులే మదించిన ఆబోతులు, వారి గోళ్ళే ఆ ఆబోతుల కొమ్ములు అని అర్థం. లేక, ఇక్కడ వారి ఆయుధాలను కొమ్ములుగా చెప్పారని భావించవచ్చు. వాటి వల్ల రాయబడిన చిత్రములవంటి గుర్తులతో ఆశ్చర్యకరమైనది) అను విగ్రహము ఇచట వివక్షితము. అనగా, అసురులే వృషభములు,. ఆ అసురుల నఖములు, లేదా, ఆయుధములు వృషభముల కొమ్ములు. అట్టి నఖములనెడి, ఆయుధములనెడి కొమ్ములయొక్క ప్రహారములచే ఏర్పడిన గుర్తులే చిత్తరువులు. వానిచే వక్షఃస్థలము ఆశ్చర్యకరముగా, (లో) శోభాకరముగానున్నది"– అని తాత్పర్యము. లేక, అసురావేశమును పొందిన వృషభములయొక్క కొమ్ములవలన ఏర్పడిన గుర్తులే ఆలేఖ్యములుగా భాసించుచున్నవనియు చెప్పవచ్చును.

ఈ సందర్భమున కృష్ణావతారమున భగవానుడు నీళాదేవిని వివాహమాడుటకై అసురావేశమును కల్గిన ఏడు ఎద్దులను చంపిన వృత్తాంతము స్మరణీయము. "పిన్నైక్కాయ్ ఏఱుడన్ ఏழ் శెற్றదువుమ్" (తి. వా. –2–5–7) (నీలాదేవి కోసం ఏడు ఎద్దులను ఎదుర్కొని, వాటిని అణచడం) అను పలు ఆళ్వార్ల సూక్తులీ వృత్తాంతమును స్తుతించుచున్నవి.

కృష్ణుని చంపవలెనని తలచిన కంసుడు "**అరిష్టుడు**" అను అసురుని అందులకై వియోగించెను. ఆ అసురుడు వృషభముగా మాఱి, గోకులములోని పశువులను చంపుచు, భయమును కల్గించి, కృష్ణుని ఉదరమున కొమ్ములతో పొడిచి, చంపబోయెను. అపుడు శ్రీకృష్ణభగవానుడు ఎద్దు రూపమును దాల్చిన ఆ అసురుని కొమ్ములను విఱిచి, సంహరించెను. ఈ కథయు ఇచట స్మరింపదగినది. వేంకటాచార్యప్రణీతమైన సంస్కృతవ్యాఖ్యానమున ఈ కథ

సూచింపబడినది. కావున, "దనుజవృషవిషాణోల్లేఖచిత్రమ్" అను విశేషణము విభవదృష్టిలో కవి ప్రయోగించిరని చెప్పనగును. విభవ – అర్చామూర్తుల మధ్య ఇట్టి అభేదముతో వర్ణించుట ఆళ్వార్ల ఆచార్యుల సూక్తులలో కన్పించుచున్నదను విశేషము ఇంతకు ముందే వివరింపబడినది. తిరుప్పాణాళ్వార్లు "**అమలనాది పిరాన్**" ప్రబంధమున "**కోవలనాయ్ వెణ్ణె యుణ్డ వాయన్.... అణి యరఙ్గన్**" (10) (గోపాలుడై వెన్నను ఆరగించిన నోటిని కలవాడు ఎవరంటే, అందమైన శ్రీరంగంలో ఉండే శ్రీరంగనాథుడు) అని శ్రీరంగనాథుని కృష్ణావతారసమాధితో స్తుతించిరి కదా! ఇట్టి శ్రీరంగనాథుని వక్షఃస్థలమును లక్ష్మీనవిలాసమందిరముగా భాసించి, ఉపాసింతును – అని ఈ శ్లోక తాత్పర్యము,

విశ్వరంగస్థలనటనాధురీణుడగు స్వామి ప్రదర్శించు అద్భుత ప్రదర్శనములలో విచిత్రమైన లక్ష్మీదేవియొక్క శయనగృహము ఇట్లు ప్రదర్శింపబడినది – అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో కలదు.

యామునులు స్తోత్రరత్నమున '**స్ఫురత్కిరీటాంగద**' (36) అను శ్లోకమునకు పిదప "**చకర్థ యస్యా భవనం భుజాంతరమ్**" (37) అను శ్లోకమును సాయించుటను గూర్చి వేదాంతదేశికులు "**ఈదృశకిరీటాదిభిః సర్వేశ్వరత్వేన వ్యంజితస్య భగవతః సామ్రాజ్యం సలక్ష్మీకస్యేతి**" (ఇటువంటి కిరీటం మొదలైనవాటిచేత "**ఇతడు సర్వేశ్వరుడు**" అని సూచింపబడిన భగవంతుని సర్వలోక సామ్రాజ్యం అనేది లక్ష్మీసహితుడైన పరమాత్మకే – అని తెలుపబడినది) అని వ్యాఖ్యానించిరి. అట్లే, భట్టరును ముందు శ్లోకమున శ్రీరంగనాథుని కిరీటము ఆ స్వామియొక్క సర్వేశ్వరత్వమును వెల్లడి చేయుచున్నదని పల్కి, తరువాత ఈ శ్లోకమున అట్టి సర్వేశ్వరత్వము లక్ష్మీసహితునకే ఒప్పునను విశేషార్థమును గూఢముగా సూచించిరని చెప్పనగును.

లలితమను పదము స్త్రీల విలాసమును తెలుపును. "స్త్రీణాం విలాసబిబ్బోకవిభ్రమా లలితమ్" అని అమరము. అమరసుధలో " లలిత మీప్సితే, లలి(డి)తే

హావభేదే స్యాత్"అని ఉన్నందున, లలితశబ్దమునకు ఈప్సితమను అర్థమును గ్రహింపవచ్చును. అపుడు "**లలితగృహమ్**" అనుటకు, "**ఇష్టమైన గృహము**" అను అర్థము వచ్చును. ఈ అర్థము "**లల- – ఈప్సాయామ్**" అను ధాతువునుండి పుట్టిన లలితశబ్దమువలన ఏర్పడును. అట్లే, లలితశబ్దమునకు గల అందమైన, సుకుమారమైన, సంతోషింపచేయు – అను మొదలుగా గల ఛాయార్థములనుకూడ ఇచట గ్రహింప వీలున్నది.

ఇచట అలంకారము సాంగరూపకము. వృత్తము మాలిని. మణిమాలికా ప్రచురమగు స్వామి వక్షఃస్థలము ఈ మాలినీ వృత్తమున వర్ణింపబడుట విశేషము.

## శ్రీరంగనాథుని వక్షస్సు మందర పర్వతముచే చిలుకబడు పాల సముద్రము

**112. హారస్ఫారితఫేన మంశులహరీమాలర్ధిముక్తాఫల-**
**శ్రేణీశీకరదుర్దినం తత ఇతో వ్యాకీర్ణరత్నోత్కరమ్ ।**
**ఆవిః కౌస్తుభలక్ష్మి రంగవసతేః నిస్సీమభూమాద్భుతం**
**వక్షోమందరమధ్యమానజలధిశ్లాఘం విలోకేమహి ॥**

**ప్ర. అ. –** హార = ముత్యాల హారములు అను, స్ఫారిత = విస్తరింపబడిన, ఫేనం = నురుగును కల్గినది, అంశు = కాంతులు అను, లహరీ = కెరటముల, మాలా = వరుసలయొక్క, ఋద్ధి = సమృద్ధిని కల్గినది, ముక్తాఫల = ముత్యములయొక్క, శ్రేణీ = పరంపరలు అను, శీకర = నీటి బిందువులచే, దుర్దినం = దుర్దినమును కల్గినది (నిబిడమైనది), తత ఇతః = అటు ఇటు (అంతటా), వ్యాకీర్ణ = విస్తరించిన, రత్న = రత్నములయొక్క, ఉత్కరమ్ = సమూహములను కల్గినది, ఆవిః కౌస్తుభ = ఆవిర్భవించిన కౌస్తుభమణిని, లక్ష్మీః = లక్ష్మీదేవిని కల్గినది, నిఃసీమభూమ = అవధి లేని గొప్పతనముచే, అద్భుతం = ఆశ్చర్యకరమైనది, కావుననే, రంగవసతేః = శ్రీరంగనాథునియొక్క, వక్షః =

వక్షస్థలమును, మందర = మందర పర్వతముచే, మథ్యమాన = చిలుకబడుచున్న, జలధి = సముద్రముయొక్క, శ్లాఘం = కీర్తివంటి కీర్తిని కల్గినదానినిగా, విలోకేమహి = సేవింతుము గాక!

**వరివస్య :-** శ్రీరంగనాథుని వక్షఃస్థలమును భట్టరు ఇందు మందరపర్వతముచే మథింపబడు క్షీరాబ్ధిగా సావయవరూపకాలంకారముద్వారా స్తుతించుట విశేషము. కూరేశుల వరదరాజస్తవమున "మథ్యమానచలఫేనిలసింధు" (29) అను శ్లోకమును అనుసరించుచు, కవి ప్రస్తుతశ్లోకమును రచించినట్లు కన్పట్టుచున్నది. ముందు శ్లోకమున భగవానుని వక్షస్సును లక్ష్మీదేవి మెట్టినిల్లుగా వర్ణించిన భట్టరు, ఇందు పుట్టినిల్లు అగు క్షీరాబ్దిగా, అదియు మందరపర్వతముచే మథింపబడు క్షీరాబ్ధిగా వర్ణించుచున్నారు.

భగవానుని దివ్యావయములన్నిటిలోను వక్షఃస్థలమునకు గొప్ప ప్రత్యేకత కలదని ఆళ్వార్లు, ఆచార్యులు అందఱు తలంచిరి. ఇందులకు కారణమేమనగా, మిగిలిన అంగములకు లేని ప్రాధాన్యము స్వామి వక్షఃస్థలమున కొక్కదానికే కలదు. "**వేదాంతాః తత్త్వచింతా మురభిదురసి యత్పాదచిహ్నై స్తరంతి**" (శ్రీగుణ, 4) (వేదాంతములు "**ఎవరు పరతత్వం?**" అనే విమర్శను భగవంతుని వక్షసులో ఉండే లక్ష్మీదేవి పాదముద్రలను చూసి, నిర్ణయిస్తున్నవో) అనునట్లు, వేదాంతములు భగవానుని వక్షఃస్థలములోని లక్ష్మీదేవియొక్క పాదలాక్షారసాంకములను చూచి "**ఇతడే పరతత్త్వ**" మని నిశ్చయించెను కదా! అంతియేకాక, సాక్షాత్తు లక్ష్మీదేవి తనకు తానుగా ఆశపడి చేరిన చోటు భగవానుని వక్షఃస్థలమేకదా.

**"పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలం హరేః"**

(దేవతలు అందరూ చూచుచుండగా లక్ష్మీదేవి భగవంతుని వక్షః స్థలమును చేరినది) (1-9-105) అను విష్ణుపురాణవచన మిందులకు నిదర్శనము. తాను నిత్యవాసము చేయు ఆ వక్షఃస్థలమును చూచి లక్ష్మీదేవి

**"అకలకిల్లేన్ అకలకిల్లేన్"** (తి. వా. -6-10-10) (వదలనేఱను, వదలనేఱను) అని తలచునని ఆళ్వార్లు పల్కిరి. ఇట్లు ఆమె తలచుటకు విశ్లేషమునకు అవకాశము ఏర్పడుట వలనకాదు. వక్షఃస్థలము యొక్క భోగ్యతయే ఆమె కిట్టి తలంపు కల్గుటకు హేతువు అని ఈ సందర్భమున నమ్పిళ్లై అను ఆచార్యులు వివరించిరి. కావున భగవానుని అంగములన్నిటిలోను వక్షఃస్థలము మిక్కిలి విశిష్టమైనది.

హారములు అను విస్తరించిన నురుగును కల్గినది, కాంతులు అనబడు తరంగములను, ముత్యములను చిన్నచిన్న నీటి బిందువులను కల్గినది, అటు ఇటు చల్లబడిన వివిధ రత్నసమూహములను కల్గినది, ఆవిర్భవించిన కౌస్తుభమణి, లక్ష్మీదేవులను కల్గినది, అపారమైన గొప్పదనమును కల్గినది, ఆశ్చర్యకరమైనది, కావుననే, మందరపర్వతముచే చిలుకబడు సముద్రమువలె ప్రకాశించు శ్రీరంగనాథుని వక్షఃస్థలమును సేవించెదము— అని శ్లోకభావము.

సముద్రము చిలుకబడినపుడు, సముద్రమునందు అంతట నురుగు నిండి యుండును. స్వామివక్షఃస్థలమున గల తెల్లని ముత్యాల హారములు నురుగువలె ఉన్నవి. సముద్రమున కెరటములు ఎల్లప్పుడు ఒకదానివెంట వేరొకటి పుట్టును. శ్రీరంగనాథుని వక్షఃస్థలమునను కాంతికెరటములు నిత్యము పుట్టుచున్నవి. సముద్రమున ఉవ్వెత్తున లేచిన కెరటములచే సన్నని నీటి బిందువులు వ్యాపించియుండును. అట్లే, స్వామి వక్షమున గల చిన్న చిన్న ముత్యములు అట్టి శీకరములవలె ఉన్నవి. ఇవి అనేకములగుటచే అంతట దట్టముగా వ్యాపించియున్నవి. సముద్రము రత్నాకరము, కావున, లోపల ఉండు వివిధములైన మణుల కాంతులు సముద్రమున నలు ప్రక్కల వ్యాపించును. శ్రీరంగనాథుని వక్షఃస్థలమున గల ఆభరణములలో పలు రత్నములు పొదగబడియున్నవి. వాని కాంతులు వక్షః ప్రదేశమునందు అంతట ప్రసరించుచున్నవి.

పాలసముద్రమును మథించినపుడు, అందుండి కౌస్తుభమణి, లక్ష్మీదేవియు జనించినవి. స్వామి వక్షమున ఈ రెండును ప్రకాశించుచున్నవి. "**కురుమామణిప్పూణ్ కులావి త్తికమ్రుమ్ తిరుమార్బు**" (పెరియా. తి. -1-2-10) (గొప్ప మణి అయిన కౌస్తుభం అనే రత్నాల హారం గొప్పగా అటు ఇటు కదలాడే భగవంతుని వక్షస్సు) అని, "**అకలల్లేన్ ఇఱైయు మెన్రు. అలర్మేల్ మజ్గై యుఱై మార్బు**" (తి. వా. -6-10-10) ("**ఒక్క క్షణం కూడా వదలలేను**" అని అంటూ పద్మావతీ దేవి నిత్యవాసం చేసే వక్షఃస్థలం) అని ఆళ్వార్లు కౌస్తుభమణి, లక్ష్మీదేవియు స్వామివక్షఃస్థలమున ప్రకాశించుచున్నవని పల్కిరి.

సముద్రము లోతునకు, వైశాల్యమునకు పేరు పొందినది. శ్రీరంగనాథుని వక్షఃస్థలముయొక్క మహిమ అవాఙ్మానసగోచరమైనది. ఈ విధముగా, ఇంకను పలు విధములుగా, స్వామివక్షఃస్థలము మందరపర్వతముచే మథింపబడు సముద్రమువలె ఉన్నది. అట్టి వక్షమును నిత్యము సేవింతుము – అని భావము. "**అశ్వత్థం సింధురాజం చ నిత్యం సేవేత**" (అశ్వత్థ వృక్షమును, సముద్రమును నిత్యము సేవించవలెను) అని ఆర్యోక్తి కదా!

"**మేఘచ్ఛన్నేఽ. హ్ని దుర్దినమ్**" (ఆకాశము మేఘములచే ఆవరింపబడిన దినమునకు దుర్దినము అని పేరు) అను అమరకోశనిఘంటువు ప్రకారము, సూర్యుడు మేఘములచే కప్పబడిన దినమునకు దుర్దినమని పేరు. కాని, ఇట్టి అర్థము ప్రస్తుతమున పొసగదు. కావున, ఇచట, నిబిడమైనది, వ్యాపింపబడినది – అను ఛాయార్థమును గ్రహింపనగును. "**నిస్సీమభూమ, అద్భుతమ్**" అను పదములను వేర్వేరు విశేషణములుగా గాని, ఒకే విశేషణముగా గాని అన్వయింపవచ్చును. అంతు లేని గొప్పతనమును కల్గినది, కావుననే, ఆశ్చర్యకరమైనదని భావము. "**వ్యాకీర్ణముక్తోత్కరమ్**" అను పాఠాంతరమును కలదు. ఈ పాఠానుసారము, రెండు విశేషణములలో ముత్యముల ప్రస్తావన ఉన్నను, ఆభరణములలోని సన్నివేశ విశేషమునుబట్టి వేర్వేరుగా గ్రహింపనగును. కావున, పునరుక్తి శంక లేదు.

శ్రీరంగనాథుని వక్షఃస్థలము క్షీరాబ్ధితో సమానమైనదని పల్కుటద్వారా, లక్ష్మీదేవి పుట్టినిల్లు, మెట్టినిల్లు – రెండును ఒకదానికి వేరొకటి తీసిపోనివి – అను రసోక్తిని గూఢముగా కవి పల్కెనని చెప్పనగును.

**"కులేన కాంత్యా వయసా నవేన గుణైశ్చ తైస్తై ర్వినయప్రధానైః,**
**త్వ మాత్మన స్తుల్య మముం వృణీష్వ,రత్నం సమాగచ్ఛతు కాంచనేన"**

(5వ సర్గ)

(కులంతోను, కాంతితోను యౌవనంతోను, వినయాన్ని ప్రధానంగా కలిగిన ఆశయా గుణాలతోనూ కూడా, నీకు సమానుడైన ఇతనిని నీవు వరించు. రత్నము బంగారంతో కలియుగాక!) అను రఘువంశమున ఇందుమతీస్వయంవరసందర్భములోని కాళిదాసు సూక్తిని ఇచట స్మరింపనగును.

ఇందు అలంకారము సావయవరూపకము. వృత్తము శార్దూలవిక్రీడితము.

**శ్రీరంగనాథుని వక్షస్సులోని పంచాయుధాభరణం మన మనసును దోచుకుంటున్నది**

**113. వక్షఃస్థల్యాం తులసికమలా కౌస్తుభై ర్వైజయంతీ**
**సర్వేశత్వం కథయతి తరాం రంగధామ్నః, తదాస్తామ్ ।**
**కూర్మవ్యాఘ్రీనఖపరిమిళత్పంచహేతీ యశోదా-**
**నద్ధా మౌగ్ధ్యాభరణ మధికం నః సమాధిం ధినోతి ॥**

**ప్ర. అ. –** రంగధామ్నః = శ్రీరంగనాథునియొక్క, వక్షఃస్థల్యాం = వక్షఃస్థలమునందు, తులసి = తులసిమాలిక, కమలా = లక్ష్మీదేవి, కౌస్తుభైః = కౌస్తుభమణి – అను వీనితో పాటు, వైజయంతీ = వైజయంతి అను వనమాల, సర్వ ఈశత్వం = అందరికి ప్రభువై యుండుటను, కథయతి తరామ్ = బాగుగా

తెలియజేయుచున్నది. తత్ ఆస్తామ్ = ఆ విషయము ఉండుగాక!, మౌగ్ధ్య+ ఆభరణం = బాల్యావస్థకు తగిన ఆభరణముగా, యశోదా = యశోదాదేవిచే, నద్ధా = అలంకరింపబడినది, కూర్మ = తాబేలుతో, వ్యాఘ్రీనఖ = ఆడపులియొక్క గోరుతో, పరిమిళత్ = కూడియున్నది అగు, పంచహేతీ = పంచాయుధహారము, నః = మాయొక్క సమాధిం = చిత్తవృత్తిని, అధికం ధినోతి = మిక్కిలి రంజిల్లజేయుచున్నది.

**వరివస్య :–** శ్రీరంగనాథుని ఉరమున ప్రకాశించు పరత్వసూచకములైన లక్ష్మీదేవి, తులసిమాల, కౌస్తుభము, వైజయంతీమాలతో పాటు, కృష్ణావతారమునకు సంబంధించిన సౌలభ్యసూచకమగు వేరొక ఆభరణవిశేషమును ఇందు భట్టరు వర్ణించుచున్నారు. ఈ స్తోత్రమున కవి ప్రధానముగా శ్రీరంగనాథుని వర్ణించుచున్నను, అచట అచట అవతారసమాధితో వర్ణనము చేయుట కనుపించుచున్నదను అంశము యఈ వరివస్యా వ్యాఖ్యానములో ఇంతకు ముందే వివరింపబడినది. ఆ విధముగా వర్ణింపబడిన అవతారములలో శ్రీకృష్ణావతారము ప్రధానమైనది. ఇట్టి తాదాత్మ్యభావన కల్గుటకు కృష్ణావతారము మిగిలిన అవతారముల కంటె అతిసన్నిహితమగుటయే కారణమని పూర్వాచార్యుల అభిప్రాయము. పెరియాళ్వార్ తిరుమొళిలోని **"మాయవనై"** (4-10-10) అను పాశురమును వ్యాఖ్యానించుచు, పెరియవాచ్చాన్ పిళ్లై, **"మట్రైయోర్ కళేత్తుమ్ ఆయర్కళే*ఱ్ఱి*నై"** అనుచోట,

**"పెరియ పెరుమాళై కృష్ణావతారమాకవిటే నమ్ పూర్వాచార్యర్ కళ్ అనుసన్ధిప్పదు. 'కొణ్డల్ వణ్ణనై క్కోవలనాయ్ వెణ్ణెయ్ యుణ్డ వాయన్ ఎన్నుళ్లమ్ కవర్ న్దానై' ఎన్నారిటే తిరుప్పాణాళ్వార్. తిరుప్పవళత్తై మోన్దు పార్ త్తాల్, ఇప్పోదుమ్ వెణ్ణెయ్ మణక్కుమాయ్*ఱ్ఱు* 'కూర్మవ్యాఘ్రీ నఖపరిమిళత్ పంచహేతీ యశోదానద్ధా మౌగ్ధ్యాభరణ మధికం నః సమాధిం ధినోతి' ఎన్ను యశోదైప్పిరాట్టి ప్పిళ్ళైప్పణియాక చ్చాత్తిన తిరువాభరణమ్ ఇప్పోదుమ్ పెరియ పెరుమాళ్ పక్కలిలే కాణుమ్ తిరుక్కఴుత్తిలే కిడక్కిఱదు – ఎన్ను కణ్డు**

**అనుభవిత్తారిఱే భట్టర్. ఆకైయాలే. ఇవ్విడత్తిల్ 'మట్రైయోర్ కళ్ ' ఎన్గిఱతు తిరుప్పాణాళ్వార్, భట్టర్ పోల్వారానవర్ కళై"** (శ్రీరంగనాథుని మూలమూర్తిని కృష్ణావతార స్వరూపంగా కదా మన పూర్వాచార్యులు అనుసంధిస్తారు. "కొణ్డల్ వణ్ణనై క్కోవలనాయ్ వెణ్ణెయ్ యుణ్డ వాయన్ ఎన్నుళ్లమ్ కవర్ న్దానై"– సముద్రవర్ణుడు, గోపాలుడై వెన్నను ఆరగించిన నోటిని కలవాడైన శ్రీరంగనాథుడు నా మనసును అపహరించాడు– అని అన్నారు కదా తిరుప్పణాళ్వార్లు. ఆ స్వామి అధరాన్ని ఆఘ్రాణించి చూస్తే, ఇప్పుడు కూడా అది వెన్నపరిమళం వీస్తుంది. '**కూర్మవ్యాఘ్రీ నఖపరిమిళత్ పంచహేతీ యశోదానద్ధా మౌగ్ధ్యాభరణ మధికం నః సమాధిం ధినోతి**' – యశోదా దేవి కృష్ణుని బాల్యదశకు తగినట్లుగా అతనికి ఆభరణంగా అలంకరించిన ఆభరణం ఇపుడు కూడా శ్రీరంగనాథునిలో కంఠంలో సాక్షాత్కరిస్తున్నది– అని దర్శించి, భట్టర్ అనుభవించారు కదా. అందుచేత, ఇక్కడ, "**మట్రైయోర్ గళ్**" ల్ అని పలికినది ఎవరిని ఉద్దేశించి అంటే, తిరుప్పాణాళ్వార్లు, భట్టర్ మొదలైనవారిని ఉద్దేశించి) అని పలుకుట ప్రస్తుతమున అనుసంధేయము.

ఈ వ్యాఖ్యాన పంక్తులనుబట్టి భగవద్రామానుజుల అవతారమునుగూర్చి నమాళ్వార్లు ముందుగా సూచించినట్లే, భట్టరు అవతారమునుగూర్చి పెరియాళ్వార్లు "**మట్రైయోర్ కళ్**" అనుచు సూచించిరని ధ్వనించుచున్నది. త్రికాలజ్ఞులు కదా ఆళ్వారుడలు.

కూరేశుల సుందరబాహుస్తవమున–

**"యశోదాంగుల్యగ్రోన్నమిత చుబుకాఘ్రాణముదితౌ**
**కపోలౌ అద్యాపి హ్యనుపరతతద్ధర్షగమకౌ"** (47)

(యశోదాదేవి శ్రీకృష్ణావతార సమయములో తన చేతి వేళ్ళ చివరి భాగాలతో శ్రీకృష్ణుని చుబుకాన్ని మెల్లిగా పైకి ఎత్తి, ప్రీతిగా దానిని ముద్దాడినప్పుడు ఏర్పడిన సంతోషం ఈనాటికీ సుందర బాహుస్వామి స్వామి చుబుకంలో వెల్లివిరుస్తున్నది) అను శ్లోకమున, వరదరాజస్తములోని–

**"పరివర్తితరాసమండలాభిః వరదాఘ్రాతమభీష్టగోపికాభిః,**
**అనువర్తితదాతన ప్రహర్షాత్ ఇవ పుల్లం హి కపోలయో ర్యుగం తే"** (39)

(వరదరాజస్వామీ! రాసగోష్ఠిని అలంకరించేవారైన, నీకు చాలా ఇష్టమైనవారైన గోపికలు ఈ రెండు కపోలాలను ముద్దాడినప్పుడు, ఆ కపోలాలు రెండిటిలో ఏర్పడిన సంతోషం, ఈనాడుకూడా నీ కపోలద్వయంలో వికసించినట్లుగా ఉన్నది) అను శ్లోకమున కృష్ణావతారసమాధితో అర్చామూర్తులను స్తుతించుటను గమనింపవచ్చును.

ఇట్టి క్రమములోనే భట్టరు ఈ శ్లోకమున ఈ మౌగ్ధ్యాభరణమును స్తుతించిరి.

స్వామి ఉరమున గల తులసీమాల, లక్ష్మీదేవి, కౌస్తుభమణి, వనమాల – అను ఇవి శ్రీరంగనాథుని సర్వేశ్వరత్వమును ప్రకటించుచున్నవి అను విషయము అట్లుండనిండు. ఆ వక్షఃస్థలమున బంగారుతో చేయబడినది. తాబేలు, ఆడుపులిగోళ్లతో కూడినది, కృష్ణావతారమున బాల్యావస్థకు తగినట్లు యశోద అలంకరించినదియు అగు పంచాయుధహారము మా మనస్సులకు నిరతిశయమైన ఆనందమును కల్గించుచున్నది. – అని తాత్పర్యము.

పెరియాళ్వార్లు **"అక్కువడమ్ ఉడుత్తు అమైత్తాలి పూణ్డ అనన్తశయన్, తక్క మామణివణ్ణన్ వాశుదేవన్"** (1-7-2) (శంఖ మణిహారాన్ని నడుములో ధరించినవాడై, కూర్మం ఆకారంలో ఉండే ఆభరణాన్ని ధరించినవాడై ఆదిశేషుని శయనంగా కలిగినవాడై, తగిన నీలరత్నంవంటి వర్ణాన్ని కలిగినవాడైన వసుదేవపుత్రుడు) అను పాశురమున కూర్మాకారముననున్న ఆభరణమును బాలకృష్ణుడు ధరించినట్లు వర్ణించిరి. వేదాంతదేశికులు ఆళ్వార్లను, భట్టర్ ను అనుసరిస్తూ, యాదవాభ్యుదయ కావ్యమున–

**"గ్రహాదిదోషా నపహంతుకామాః గోప్తు స్సతాం గోపతయ స్సమేతాః,**
**సువర్ణసూత్రగ్రథితాభిరామాం పంచాయుధీ మాభరణం బబంధుః"**

(గ్రహాదులవల్ల కలిగిన దోషాలను పోగొట్టాలని తలచినవారై, గోపాలురు అందరూ కలిసి, బంగారు దారంలో గుచ్చినది, మనోహరమైనది అయిన పంచాయుధాభరణాన్ని మహాత్ములకు రక్షకుడైన శ్రీకృష్ణునకు అలంకరించారు) (4-9) అనుచు పంచాయుధాభరణమును గోపాలురు శ్రీకృష్ణునకు గ్రహనివారణార్థము అలంకరించిరని పల్కిరి.

ఇచట, "యశోదానద్ధా మౌగ్ధ్యాభరణ" మనుటకు వేరు విధములుగా కూడ అర్థమును చెప్పవచ్చును.

శ్రీకృష్ణుని సాధారణుడైన బాలునిగా తలచిన యశోద, ఒక ముగ్ధ. అనగా, పుత్రవాత్సల్యమను మోహముతో కూడినది. అట్టి మౌగ్ధ్యము కారణముచే ఆమె బాలకృష్ణుని రక్షకొఱకు పంచాయుధాభరణమును అలంకరించెను– అని వివరింపవచ్చును. అప్పుడు "**యశోదయా మౌగ్ధ్యేన కృతం ఆభరణమ్**" అని అన్వయము. "**యశోదయా నద్ధా ఆమౌగ్ధ్యాభరణమ్ – ఈషత్ మౌగ్ధ్యాభరణమ్**" అనియు వివరింపవచ్చునని రామానుజాచార్యవ్యాఖ్యానమున సూచింపబడినది. శ్రీరంగనాథునియొక్క పరత్వము, దానిని సూచించు తులసీవనమాలాదుల కంటే, ఆ స్వామి సౌలభ్యమును సూచించు అవతారము, తదుచితాభరణములే భక్తులమగు మా మనస్సులకు ఎక్కువ సంతోషమును కలుగజేయుచున్నవి – అని విశిష్టమైన తాత్పర్యము. "**నః**" అను సర్వనామమునకు – "**అర్వాచీనులమైన మాయొక్క**" అను అర్థము రామానుజాచార్యవ్యాఖ్యానమున చూపబడినది. అనగా, వేదములు, ప్రాచీనులగు ఋషులు భగవానుని పరత్వమున ఆకర్షితులైనను, అర్వాచీనులగు ఆళ్వార్లు, ఆచార్యులు భగవానుని భక్తపరతంత్రత యందే మిక్కిలి ఆసక్తులు – అని భావము.

"**నః సమాధిం ధినోతి**" అనుటవలన మంగళాశాసనము చేయుటయే పరమ కర్తవ్యముగా భావించు మా మనస్సులకు యశోద అలంకరించిన పంచాయుధహారమువలన స్వామికి రక్షణ కల్గునను భావన ఏర్పడినందున మా

భయ శంక తీరి, ధైర్యము కల్గినది. అందువలన పరమానందము కల్గినదను అందమైన అర్థము ధ్వనించుచున్నది. పెరియాళ్వార్లు

**"పల్లాణ్డు పల్లాణు పల్లాయిరత్తాణ్డు పలకోడి నూఱాయిరమ్ మల్లాణ్డ తిణ్డోల్ మణివణ్ణా!"** (తిరుప్పల్లాడ్డు. –1) (చాణూరుడు, ముష్టికుడు మల్లులను మర్దించిన దృఢమైన బాహువులను కల స్వామీ! నీకు మంగళం, పలువేల సంవత్సరాలు మంగళం, పలు వేల సంవత్సరాలు మంగళం, పలువేల సంవత్సరాలు మంగళం) అని భగవానుని బాహువులకు మంగళము పాడి, పిదప, "**వడివాయ్ నిన్ వలమార్బినిల్ వాழ்కిన్ఱ మఙ్గైయుమ్ పల్లాణ్డు**" (అందరి అందం మూర్తిభవించినట్లుగా నీ కుడి వైపు వక్షస్సులో పనిత్యవాసం చేస్తున్న లక్ష్మీదేవికి మంగళం), "**వల త్తురైయుమ్ శుడరాழியుమ్ పల్లాణ్డు, పడైపోర్ ప్పుక్కు ముழఙ్గుమ్ అప్పాఞ్చశన్నియముమ్ పల్లాణ్డే.**" (నీ కుడి వైపున శ్రీహస్తాన్ని నివాసంగా చేసుకుని ఉండి, ప్రకాశించే సుదర్శనానికి మంగళం. శత్రుసైన్యంలోకి ప్రవేశించి ధ్వనించే ఆ పాంచజన్యానికి మంగళం) అనుచు వక్షఃస్థలమునకు, అందు నిత్యనివాసిని యగు లక్ష్మీదేవికి, నిత్యసూరులకు మంగళము పాడిరి.

అట్లే, భట్టరు 108వ శ్లోకమున శ్రీరంగనాథుని బాహుయుగ్మమునకు "విజయతే" అని మంగళమును చేసి, పిదప ఈ శ్లోకమున స్వామి వక్షఃస్థలమునకు, అందు గల లక్ష్మీదేవి మొదలగు నిత్యసూరులతో పాటు మౌగ్ధ్యాభరణమునకును మంగళాశాసనమును (పరోక్షముగా) చేసిరి.

తులసీమాల, కౌస్తుభమణి, లక్ష్మీదేవి, వనమాల – అనునవి సర్వేశ్వరత్వ సూచకములు. తిరువాయ్ మొళిలోని "తన్మ్మడివొన్లిల్లాద తణ్ తుழாయ్ మాలైయనై" (2–5–8) అను పాశురమును వ్యాఖ్యానించు నమ్బిళ్లై,

**"ఎల్లై కాణవొణ్ణాద వస్తువుక్కు లక్షణమ్పోలే తిరుత్తుழாయ్ మాలై"** (అవధిని దర్శించటానికి సాధ్యం కాని పరతత్వానికి తులసీ మాల లక్షణంవలె ఉన్నది) అని పల్కుట గమనింపదగినది. లక్ష్మీపతిత్వము పరతత్త్వసూచకమనుట

ఇంతకు ముందే నిరూపింపబడినది. ఈ సందర్భమున "**హ్రీ శ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ**" (తై. ఆ. -3. -13-2) (భూదేవి, లక్ష్మీదేవి నీకు పత్నులు) అని మొదలైన శ్రుతులు, "**పొల్లాద దేవరై త్తేవరల్లారై త్తిరువిల్లా త్తేవరై త్తేఱేల్ మిన్ తేవు**" (నాన్ము. తి. -53) (యోగ్యత లేని దైవాలను, పరదైవం కాని, లక్ష్మీసంబంధం లేని దైవాలను పరదైవంగా అన్వేషించకండి) అని మొదలైన ఆళ్వార్ల పాశురములు, "**వేదాంతా స్తత్త్వచింతా మురభిదురసి యత్పాదచిహ్నై స్తరంతి**" (శ్రీగుణ. -4) (వేదాంతములు పరతత్వ నిర్ణయానికి సంబంధించిన పర్యాలోచనను, భగవంతుని వక్షఃస్థలంలో ఉండే ఏ లక్ష్మీదేవి పాదాల ముద్రలను చూచి నిశ్చయం చేసుకుంటున్నాయో) అని మొదలైన ఆచార్యుల వచనములను ఇచట స్మరింపదగినవి.

★ "**కుం భూమిం స్తోభతే ఇతి కుస్తుభః విష్ణుః, తస్యేదమితి కౌస్తుభమ్**" అనగా, భూమిని భరించువాడు విష్ణువు, ఆయనకు సంబంధించినది కావున, కౌస్తుభము – అను వ్యుత్పత్తివలన కౌస్తుభమణి భగవానుని పరత్వసూచకము అని తెలియుచున్నది. "**కురుమామణి ప్పూణ్ కులావి త్తికழ**" (పెరియా. తి. -1-2-10) (గొప్పదైన కౌస్తభమణిహారం వక్షస్సులో అటు ఇటు ఊగుతూ ప్రకాశించగా) అని, "**కౌత్తువముడైయ గోవిన్దనోడు**" (4-5-8) (కౌస్తుభమణిని ఆభరణంగా కలిగిన గోవిందునితో) అని పెరియాళ్వార్లు "**మామణియుమ్. తఙ్గకిన్ఱ. ఇవరార్ కొల్!**" (పెరి. తి. -2-8-5) (గొప్పదైన కౌస్తభమణిని ధరించిన వీరెవరో కదా?) అని తిరుమఙ్గై యాళ్వార్లు భగవానుని వక్షమున కౌస్తుభమణి గొప్పగా ప్రకాశించులటను గూర్చి పల్కిరి.

భగవానుడు ధరించు వనమాలకు "**వైజయంతి**" అని పేరు. ఈ వనమాల పరత్వసూచకము, "**వాట్టమిల్ వనమాలైమార్బన్**" (పెరుమా. తి. -2-1) (ఏనాడు వాడిపోని వనమాలను వక్షస్సులో అలంకరించుకున్నవాడు) అని కులశేఖరులు, "**వనమాలై మినుఙ్గ నిన్ఱు విళైయాడ**" (నాయ్ చ్చి. తి. -14-2) (వనమాలిక మెరుపువలె ప్రకాశిస్తూ ఉండేటట్లు క్రీడించగా) అని గోదాదేవియు

వనమాలతో కూడిన స్వామి సొబగును అనుభవించిరి. భట్టరు సహస్రనామభాష్యమున 'వనమాలీ' అను నామమును వివరించుచు, **"స్వసృజ్యభూతసూక్ష్మసార సౌరభ్యాభిమానిన్యా వైజయంత్యా నిత్యయోగీ"** (తనచే సృష్టింపబడు భూతసూక్ష్మముల సారమునకు, సౌరభానికి అభిమానదేవత అయిన వైజయంతితో నిత్యయోగం కలవాడు) అని పల్కిరి. అనగా, తాను సృజించు భూతసూక్ష్మసారమునకు, సువాసనకు అభిమానిని అగు వైజయంతిని నిత్యము కలవాడు – అని భావము. విష్ణుపురాణములోని అస్త్రభూషణాధ్యాయమున గల.

**"పంచరూపా తు యా మాలా వైజయంతీ గదాభృతః,**
**సా భూతహేతుసంఘాతో భూతమాలా చ వై ద్విజ!"**

(బ్రాహ్మణా! ఐదు విధాలైన రూపాలను కలిగిన, గదను ధరించే భగవానుడు అలంకరించుకొనే వైజయంతి అను మాలిక– పంచభూతకారణసంఘాతమైన భూతమాలిక) శ్లోకమును బట్టియు పై విషయము స్పష్టపడుచున్నది.

★ **"ఆపాదపద్మం యా మాలా వనమాలేతి సా మతా"** (కిరీటము మొదలుకొని, పాదాలపర్యంతం అలంకరింపబడిన మాలికకు వనమాల అని పేరు)శఅను కళింగవచనమును బట్టి పాదపద్మముల వరకు గల మాలకు వనమాల అని పేరు. ఇట్టి మాలను ఇప్పుడు శ్రీవేంకటాచలంలో శ్రీవేంకటేశ్వరునకు అలంకరింపబడడాన్ని దర్శించవచ్చు. ఈ వనమాల అయిదు విధములైన పూలతో నిర్మింపబడినదను అంశము గోపాలసహస్రనామస్తోత్ర వ్యాఖ్యానములోని ఈ క్రింది శ్లోకమువలన ఏర్పడుచున్నది.

**"తులసీకుందమందారకరవీరసరోరుహైః,**
**పంచభీ రచితా మాలా వనమాలేతి కీర్తితా"**

(తులసి, కుంద, మందార, కరవీర పద్మాలు అనే ఐదు విధాలయిన పూలతో కూర్చబడిన మాలిక వనమాల అని కీర్తింపబడుతుంది).

మణులతో, బంగారముతో కూర్చబడిన మాలకును, వనమాల అను పేరు కలదని పై సహస్రనామవ్యాఖ్యానముననే ఉట్టంకింపబడిన ఈ క్రింది శ్లోకము తెలుపుచున్నది.

**"మణినా కాంచనే నాపి వజ్రవైడూర్యమౌక్తికైః।**
**రచితా పంచభిర్మాలా వైజయంతీతి కీర్తితా"**

కాని, ఈ రెండు నిర్వచనములలో, మొదటి నిర్వచనమే ఇచట సుసంగతముగా తోచును. ఏల అన, యామునులు స్తోత్రరత్నమున **"లసత్తులస్యా వనమాలయోజ్జ్వలమ్"** (36) (ప్రకాశించే తులసితో కూడినది అయిన వనమాలికతో ఉజ్జ్వలంగా ప్రకాశించేవానిని) అని పల్కిరి కదా!

అంతేకాక ఈ యామునుల సూక్తివలన వేరొక విషయము కూడా స్పష్టపడుతున్నది. అది ఏమనగా, ఐదు విధములైన పూలతో పాటు తులసిని అందు అవశ్యము కూర్చవలెను – అని, అప్పుడే ఆ వనమాలిక ప్రకాశించును –అని. తులసి లేనిదే భగవంతునకు ప్రీతి కలుగదుకదా. వనమాలిక ప్రకాశించవలెనన్న, అది భగవంతుని ప్రీతికరము కావలెను కదా. అందువలన తులసిని కూర్చుట అవశ్య కర్తవ్యము.

కౌస్తుభమణి, జీవులకు ప్రతీక అగుటచే భగవానుని జీవేశ్వరత్వమును తెలుపును. అట్లే, వనమాల, పంచభూతాభిమాని తత్త్వమగుటచే ప్రకృతీశ్వరత్వమును సూచించును. పురుషసూక్తమున భగవానుడు శ్రియఃపతిగా నిర్దేశింపబడెను.

**"కౌస్తుభైః వైజయంతీ"** అను తృతీయా విభక్తిచే తులసి, లక్ష్మీదేవి, కౌస్తుభముల కంటే వైజయంతియే ప్రధానము – అను అర్థముకూడ ఇచట భాసించును.

ప్రస్తుతశ్లోకభావమును కొంత అనుసంధించుచు, వేదాంత దేశికులు భగవద్ధ్యాన సోపానమున–

**"శ్రీవత్సేన ప్రథితవిభవం శ్రీపదన్యాసధన్యం,**
**మధ్యం బాహ్వోః మణివరరుచా రంజితం రంగధామ్నః,**
**సాంద్రచ్ఛాయం తరుణతులసీచిత్రయా వైజయంత్యా**
**సంతాపం మే శమయతి ధియః చంద్రికోదారహారమ్"**

(శ్రీవత్సమను పుట్టుమచ్చ చేత ప్రసిద్ధి పొందింపబడిన వైభవాన్ని కలిగినది, లక్ష్మీదేవి పాదన్యాసాలచేత ధన్యమైనది, కౌస్తుభం అనే గొప్ప మణియొక్క కాంతిచేత రంజింప జేయబడినది, నవనవలాడే తులసి కూర్చడంవల్ల ఆశ్చర్యకరంగా ఉన్నది అయిన వైజయంతి మాలచేత సాంద్రమైన ఛాయను కలిగినది, వెన్నెల వలె చల్లగా ఉండే గొప్పవైన ముత్యాల హారాలను కలిగినది అయిన శ్రీరంగనాధుని వక్షఃస్థలం నా సంతాపాన్ని పోగొడుతున్నది) (6) అను శ్లోకమును రచించిరి. ప్రస్తుతశ్లోకమువలె ఈ శ్లోకమును మందాక్రాంతావృత్తమున రచింపబడుటకూడ ఇచట గమనింపదగినది.

"**ధినోతి**" అను రూపము "**ధిని–– ప్రీణనే**" అను ధాతువునుండి పుట్టినది. "**తులసి**" అను హ్రస్వాంతరూపమును ఆకృతిగణములోనికి చేర్చునగునని వాధూల వీరరాఘవాచార్యస్వామివ్యాఖ్యలో సూచింపబడినది.

**శ్రీరంగనాథుని నాభి వేరొక బ్రహ్మాండమండలిని సృష్టించునది వలె ఉన్నది**

**114. కియాన్ భరో మమ జగదండమండలీ–**
**త్యతృప్తితః క్రశిత మివోదరం విభోః ।**
**రిరక్షిషోచితజగతీపరంపరాం**
**పరా మివ ప్రథయతి నాభిపంకజమ్ ॥**

**ప్ర. అ. –** విభోః = శ్రీరంగనాథునియొక్క, ఉదరం = ఉదరము, జగత్ = అండ బ్రహ్మాండములయొక్క, మండలీ = సమూహము, మమ = నాకు, కియాన్ =

ఎంత, భరః = భారము, ఇతి = అని, అతృప్తితః = అతృప్తివలన, క్రశితమ్ ఇవ = కృశించినదివలె ఉన్నది. నాభీపంకజం = నాభికమలము, పరాం = వేరొక బ్రహ్మాండమండలిని, రిరక్షిషా = రక్షింపవలెనను కోరికకు, ఉచిత = సరిపడు, జగత్ = లోకములయొక్క, పరంపరాం = వరుసను, ప్రథయతి ఇవ = బయల్పఱచుచున్నదివలె ఉన్నది.

**వరివస్య :–** ఈ శ్లోకమున, పూర్వార్ధమున, శ్రీరంగనాథుని నడుము సన్నగా ఉండుటకు గల కారణమును, ఉత్తరార్ధమున, నాభికమలము విస్తరించి యుండుటకు, నవనవోన్మేషముగా నుండుటకు గల కారణమును కవి ఉత్ప్రేక్షించుటద్వారా అద్భుతముగా స్తుతించుచున్నారు.

నాకు ఈ జగములు ఎంతమాత్రము సరి అయిన భారము కాదను అతృప్తితో శ్రీరంగనాథుని ఉదరము మిక్కిలి కృశించినది. స్వామికి గల ఈ అసంతృప్తిని తీర్చుటకై నాభీపంకజము ఇంకను అనేక లోకముల పరంపరను సృష్టించుచున్నదా! అనునట్లు మిక్కిలి విస్తృతమై అపుడే వికసించిననట్లు శోభిల్లుచున్నది – అని భావము.

నడుము సన్నగా ఉండుట ఉత్తమపురుష లక్షణము. యామునులు స్తోత్రరత్నమున భగవానుని "**తనుమధ్యమ్**" (32) (సన్నని నడుము కలవానిని) అని పొగడిరి. ఆళ్వారులును "**శిఱ్ఱిడైయుమ్ వడివుమ్**" (తి. వా. –5–5–8) సన్నని నడుమును కలిగిన తిరుమేని) అని, "**తుడిశేరిడైయుమ్**" (8–5–3) (సన్నదనాన్ని కలిగిన నడుము) అని భగవానుని సన్నని నడుమును పొగడిరి. ఇట్లు భగవానుడైన రంగనాథుని నడుము సన్నగా ఉండుటకు గల కారణము శ్లోకము మొదటి సగములో కవిచే అందముగా ఉత్ప్రేక్షింపబడుచున్నది.

"**అణ్డరణ్డ బహిరణ్డత్తు ఇరు మానిలు మెఱ్ఱ మాల్వరై ముఱ్ఱుం ముణ్డ**" (అమల–6) (బ్రహ్మాండములలోనుండు చేతనులను, బ్రహ్మాండమును, ఆ అండమునకు బయట ఉన్న అండములను, సాటి లేని మహాపృథివిని, ఆ భూమికి ఆధారభూతములైన ఏడు కులపర్వతములను, ఇంకా మిగిలిన అన్నిటిని

అరగించిన) అని తిరుప్పాణాళ్వార్లు స్తుతించిన విధముగా, ప్రళయకాలమున భగవానుడు బ్రహ్మాండములను తన కడుపులో ఉంచుకొన్నను, స్వామియొక్క నడుము సన్నగా ఉండుటకు కారణమేమన, లోకమున ఆహారమును భుజించినవానికి మనస్సులో ఏదైన అతృప్తి ఉన్నవో భుజించిన అన్నము ఒంటికి పట్టదు. అతని ఒడలు కృశించును. ఈ విషయము అందరికిని లోకమున అనుభవములోనున్నదే. అట్లే, శ్రీరంగనాథుని ఉదరమున సమస్తబ్రహ్మాండములు ఉన్నను "**ముఱ్ఱిలఙ్గు కారార్ తిణ్ కడలేழுమ్ మలైయేழ் ఇవ్వులకేழு ముణ్డుమ్ ఆరా వెన్రిరున్దానై**" (పెరియ తిరు 5–6––2) (ముత్యాల ప్రకాశాన్ని కలిగినవై, నీలవర్ణాన్ని సాంద్రంగా కలిగినవి అయిన ఏడు సముద్రాలను, ఏడు కులపర్వతాలను, ఈ ఏడు లోకాలను అరగించినప్పటికీ, "ఇంకా చాలదు" అని ఉన్నవానిని) అని, "ఉలకు ఉణ్డ ఆరావయిற்றானై" (తి. వా. –10–8–2) (లోకాలను ఆరగించినప్పటికీ ఇంకా నిండని కడుపున కలిగినవానిని) అని ఆళ్వార్లు పల్కిన విధముగా, ఆ బ్రహ్మాండము లేమియు స్వామి ఉదరమున ఒక మూలకు కూడ సరిపోకషపోవుటచే, భగవానునకు "ఇంత పెద్ద పొట్ట కల్గిన నాకు ఈ బ్రహ్మాండములొక ఆహారమా! ఎన్నో లోకములను రక్షింపవలెనను కోరికను కల్గిన నా ఆశకు సరిపడునట్లుగా లోకములు లేవు కదా!" అను అసంతృప్తి కల్గున. అందుచే శ్రీరంగనాథుని మధ్యభాగము మిక్కిలి కృశించియున్నది.

శ్రీవత్సాంకులు వరదరాజస్తవమున భగవానుని నడుముయొక్క కార్శ్యమును స్తుతించుచు,

**"అణ్డానాం త్వదుర మామనంతి సంతః**
**స్థానం, తద్వరద! కథం న కార్శ్య మస్య?" (49) –**

(సమస్త బ్రహ్మాండములకు నీ నడుము స్థానమని పెద్దలు పల్కుదురే. మరి, నీ నడుము సన్నగా ఉండుటకు కారణమేమి స్వామీ?) అని ప్రశ్నించిరి. ఆ శ్లోకముననే ఉత్తరార్ధమున–

**"మాహాత్మ్యం స్వత ఇహ యేషు నూన మేషామ్**
**బుద్ధి స్స్యాత్ మహిమకరీ న హీతరేషామ్"**

(లోకమున సహజముగా గొప్పవారికి సంపద మరింత గొప్పతనమును కల్గించునే కాని, క్షుద్రులకువలన గొప్పతన మేమాత్రము కలుగదు కదా! అట్లే, స్వామినడుము సన్నగా ఉండుట దాని సహజగుణము, కావున ఎన్ని లోకములను తనలో ఇముడ్చుకొన్నను ఆ నడుమునకు వృద్ధి కలుగక పోవుట సహజమే. కదా!)– అని చమత్కారపూర్వకముగా సమాధానము నొసగిరి.

భట్టరు ప్రస్తుతశ్లోకమున అట్టి ప్రశ్నను లేవనెత్తినను, సమాధానమును వేరు విధముగా పల్కుట ఇచటి విశేషము "**జగదండమండలీ**" అనుట ప్రళయకాలమున భగవానుని ఉదరమున లీనమగు అఖిలాండములను సూచించును.

ఇచట "**విభోః**" అను పదము సాభిప్రాయకము. కావున, ఇందు ఇచట పరికరాలంకార స్పర్శకలదని చెప్పవచ్చును.

ఉత్తరార్ధమున శ్రీరంగనాథుని నాభీకమల సౌందర్యము ప్రస్తుతమైనది. ఇందు భట్టరు చూసిన భావనాపటిను అనితరసాధారణము.

ప్రథమార్ధమున భగవానునకు కల కొఱత తెలుపబడినది కదా! ఆ కొఱతను తీర్చుటకై స్వామి నాభీకమలము ప్రయత్నించుచున్నదట. అది ఎట్లనగా, "తాను ఆరగించిన భువనములు చాలలేదని. స్వామికి అసంతృప్తిగా ఉన్నదా? అయ్యో!" అని తలచిన నాభీకమలము స్వామికి పరిపూర్ణమైన తృప్తిని కల్గింపవలెనని తలచినదై, వేరొక బ్రహ్మాండమండలిని సృష్టించుచున్నదా! అనునట్లున్నది. ఈ భావము ఆ నాభీకమలముయొక్క విస్తృతి, వికాసములను చూచువారికి కల్గుచున్నదని తాత్పర్యము.

శ్రీరంగరాజస్తవము ఉత్తర శతకములోని "**నాభీపద్మ శ్చ మానక్షమ మిన భువనగ్రామ మన్యం సిసృక్షుః తస్థౌ**" (67) (త్రివిక్రమావతారాన్ని ఎత్తిన శ్రీరంగనాథుని నాభీపద్మము కూడా కొలువడానికి సమర్థమైన వేరొక లోకాల

సముదాయమును సృష్టించగోరినదివలె ఉన్నది) అను శ్లోక మిచట అనుసంధేయము. గోదాదేవియు **"ఆయన్ ముదలా త్తన్ద నళిర్ మామలరున్ది"** (నాయ్ చ్చి. తి. -14-9) (బ్రహ్మ మొదలైన ప్రజాపతులను సృష్టించిన, చల్లని, పెద్ద తామర పువ్వును కల తిరునాభి) అనుచు భగవానుని నాభీపద్మముయొక్క విస్తృతిని, నిత్యవికాసమును ("మామలర్" అనుటద్వారా) అనుసంధించిరికదా! బాగుగా వికసించిన పద్మము రజోభూయిష్ఠముగా నుండును. జగత్సృష్టికి రజస్సు కదా మూలము.

**"రిరరక్షితుం ఇచ్ఛా –రిరక్షా"** – రక్షింపవలెనను కోరికకు **"రిరక్షా"** అని పేరు. శ్రీరంగనాథుని నడుముయొక్క కార్శ్యము, నాభీపద్మముయొక్క విస్తృతి, వికాసములు ఆ స్వామియొక్క జగద్రక్షణలోని అభినివేశాతిశయమును ప్రకటించుచున్నవనునది ఈ శ్లోకమునందలి ధ్వని.

**"విశ్వం విగీర్య విబుధేశ్వర! జాతకార్శ్యమ్"** (దేవ. పం. 35) (ఓ దేవనాయక స్వామీ! లోకాన్ని అంతటినీ గ్రహించినప్పటికీ, సన్నదనాన్ని కలిగిన నీ నడుము) అను దేవనాయక పంచాశత్ స్తోత్రములో దేశికుల సూక్తి ఈ శ్లోకమునకు అనుకరణమే.

ఈ శ్లోకము **'రుచిరా'** వృత్తమున కూర్చబడినది. **"చతుర్గ్రహై రిహ చతురా జభౌ స్జగాః"** అని దీని లక్షణము. నాలుగు, తొమ్మిది అక్షరములకు యతి. దీనికే 'ప్రభావతి' అను పేరును కలదు.

## శ్రీరంగనాథుని వలి త్రయము, కిణము, ఉదరబంధములను దర్శించెదము

115. **త్రివిధచిదచిత బృందం తుండావలంబి వలిత్రయం**
**విగణయ దివైశ్వర్యం వ్యాఖ్యాతి రంగమహేశితుః**
**ప్రణతవశతాం బ్రూతే దామోదరత్వకరః కిణః**
**తదుభయగుణాకృష్టం పట్టం కిలోదరబంధనమ్ ॥**

**ప్ర. అ. –** రంగమహా ఈశితుః = శ్రీరంగనాథునియొక్క, తుంద = ఉదరమును, అవలంబి = అవలంబించియున్న, వలిత్రయం = త్రివళి (మూడు రేఖలు), త్రివిధ = మూడు విధములైన, చిత్– అచిత్ = చేతనాచేతనములయొక్క, బృందం సమూహమును, విగణయత్ = లెక్కించుచున్నది, ఇవ = వలె, ఐశ్వర్యం = (స్వామియొక్క సకలచేతనాచేతనముల నియామకత్వమును) ఐశ్వర్యమును, వ్యాఖ్యాతి = వ్యాఖ్యానించుచున్నది, దామ ఉదరత్వకరః = దామోదరుడను పేరును కల్గించు, కిణః = కణుపు (శరీరమున కాయవలె గట్టిపడిన భాగము), ప్రణత = భక్తులకు, వశతాం = అధీమగుటను, బ్రూతే = పల్కుచున్నది, ఉదర బంధనం = ఉదరబంధమను ఆభరణము, తత్ ఉభయ = ఆ రెండు గుణములను(పరత్వ, సౌలభ్యగుణములను), ఆకృష్టం = కలిపి కట్టిన, పట్టం = పట్టము, కిల = కదా!

**వరివస్య :–** శ్రీరంగనాథుని ఉదరమున గల వళిత్రయము, నడుమున గల దామోదరత్వ సూచకమగు కిణము, ఉదరబంధమను ఆభరణము – అను మూడింటిని కవి ఇందు చక్కని ఉత్ప్రేక్షలతో వర్ణించుచున్నారు. ఈ శ్లోకము ఉభయ లింగములుగా వేదాంతములలో చెప్పబడు భగవానుని పరత్వసౌలభ్యములను గుణములను రెండిటిని వర్ణించుచున్నది.

సౌందర్యలావణ్యాదిగుణనిలయుడగు శ్రీరంగనాథుని యందు మహాపురుష లక్షణనుగు త్రివళియు కలదు. త్రివళి అనగా, ఉదరభాగములోని మూడు మడుపులు. ఇవి ఉదరమును విభాగించి మూడు భాగములు చేయుచున్నట్లుండును. భట్టరు ఈ సన్నివేశమును చక్కని ఉత్ప్రేక్షతో వర్ణించుచున్నారు.

స్వామి ఉదరమున గల త్రివళి మూడు విధములైన చేతనాచేతనములు అను స్వామియొక్క ఐశ్వర్యమును వ్యాఖ్యానించుచున్నట్లున్నది. ఇచట శ్రీరంగనాథుని ఐశ్వర్యమనగా, అతడు చేతనాచేతనములకు నియామకుడగుటయే. చేతనములు నిత్యులు, ముక్తులు, బద్ధులు –అని మూడు

విధములుగానుందురు. అట్లే, అచేతనము– మిశ్రసత్త్వము, శుద్ధసత్త్వము, సత్త్వశూన్యము– అని మూడు విధములు, అనగా, ప్రకృతి, కాలము, శుద్ధసత్త్వమును, ఇట్టి త్రివిధ చేతనాచేతనములను శ్రీరంగనాథుని ఐశ్వర్యమును త్రివళి సూచించుచున్నట్లున్నదని శ్లోకభావము.

ఈ భావమును అనుసరించుచు వేదాంతదేశికులు '**దేవనాయకపంచాశత్**' లో "**మధ్యం వళిత్రయవిభావ్యజగద్విభాగమ్**"(35) (నీ నడుము, మూడు మడుపులచేత ఊహింపదగిన మూడు జగత్తుల విభాగాన్ని కలిగినదివలె ఉన్నది) అని పల్కిరి.

పిమ్మట శ్రీరంగనాథుని నడుమున గల కిణమును వేరొక ఉత్ప్రేక్షతో కవి వర్ణించుచున్నారు. శ్రీరంగనాథుని సర్వైశ్వర్యమును ప్రకటించు త్రివళి యుండు ఉదరభాగమున ఆశ్రితపారతంత్ర్యమును తెలుపు వేరొక చిహ్నముకూడ కలదు. శ్రీకృష్ణుడు చిఱుప్రాయమున చేసిన పలు విధములైన చిలిపి చేష్టలకు కోపించిన యశోద అతనిని నడుమును తాడుతో కట్టి, ఒక రోలుకు బంధించెను. అపుడు కృష్ణుడు ఆ కట్టునుండి విడివడుటకు ప్రయత్నించుచు అటు ఇటు కదలునపుడు అతని నడుమున తాడు కట్టిన చోట గుర్తుపడి, ఆ భాగము గట్టిపడి, కాయగా మారెను. దీనికే కిణమని పేరు. ఈ కిణము స్వామి దామోదరుడను విషయమును ప్రకటించుచున్నది. దామోదరుడనగా, ఉదరమున త్రాడును కలవాడని అర్థము.

భట్టరు సహస్రనామభాష్యమున దామోదరనామమునకు మూడు విధములైన వ్యుత్పత్తులను చూపిరి. వానిలో మూడవ వ్యుత్పత్తిని "**తతః స దామోదరతాం ప్రయయౌ దామబంధనాత్**– (2. 5. –5–6–20) **ఇతి వా – ఏవం లక్ష్మ్యా అపి స్పృహణీయచాతుర్యో. సన్ యశోదాదామని గలితజలః సంశ్రితవాత్సల్యాత్ బభూవ ఇత్యర్థః**" అని చూపిరి. అనగా, లక్ష్మీదేవిని కూడ మెప్పింపగల్గు చాతుర్యమును కల్గినవాడైనను, భగవానుడు యశోదాదేనిచే తాడుతో కట్టుబడి, ఆమె పట్లగల ప్రేమాతిశయముచే ఆనందబాష్పములను

విడచెను– అని భావము. ఈ వృత్తాంతము విష్ణుపురాణము, భాగవతము మొదలగు పురాణములలో వర్ణింపబడినది.

**"దామ్నా చైవోదరే బధ్వా ప్రత్యబధ్నా దులూఖలే,**
**కృష్ణ మక్లిష్టకర్మాణ మాహ చేద మమర్షితా,**
**యది శక్నోషి గచ్ఛ త్వ మతిచంచలచేష్టిత!"** (5–6–14, 15)

(యశోద, అల్లరి పనులను చేసే శ్రీకృష్ణుని చూసి, సహించలేక అతనిని దారంతో నడుముకు కట్టి రోలుకు బంధించింది. అతనితో "ఓయీ! చాలా అల్లరి పనులను చేసేవాడా! నీకు సాధ్యమైతే ఇక్కడ నుండి వెళ్ళు, చూస్తాను" అని అన్నదికూడా) అని విష్ణుపురాణమున ఈ కథ వర్ణింపబడినది.

ఆళ్వార్లు అందరును ఈ వృత్తాంతమున మిక్కిలి ఆకర్షితులై, పలుచోట్ల దీనిని గానము చేసిరి. ముదలాళ్వార్లలో మొదటివారగు పొయ్ కై ఆళ్వార్లు ముదల్ తిరువన్దాదిలో "**అటియు ములకెల్లామ్ ––వెరి కమ(్రుమ్ కామ్బేయ్ మెన్ తోళి కడైవెణ్ణెయ్ యుణ్డానై త్తామ్బే కొణ్ణార్ త్త త(్రుమ్బు**" (22) (లేత వెదుళ్ళవంటి మృదువైన భుజాలను కలిగిన యశోదా దేవి చిలికి తీసిన వెన్న ను ఆరగించిన నిన్ను ఆమె ఒక చిన్న దారంతో కట్టడం వల్ల నీ నడుముకు ఏర్పడిన కాయలనుగూర్చి నాకు ఒక్కనికే కాదు, లోకంలో ఉండేవారందరికీ తెలుసు) అనుచు శ్రీకృష్ణుని యశోద దారముతో కట్టినపుడు ఏర్పడిన కిణమునుగూర్చి లోకమంతా ఎరుగునని పల్కిరి. ఇచట "**త(్రుమ్బు అటియు ములకెల్లామ్**" (కిణాలనుగూర్చి లోకానికి అంతటికి తెలుసు) అనుటకు కిణము ఆశ్రిత పారతంత్ర్యసూచకమని లోకమంతటికిని తెలియునని ఆచార్యులు వ్యాఖ్యానించుట గమనింపదగినది. కావున, స్వామి నడుమున గల దామోదరత్వప్రయుక్తమైన కిణము ఆశ్రిత పారతంత్ర్యమునకు విశదవ్యాఖ్యానము.

భగవానుని ద్వాదశనామములలో మొదటిది అగు కేశవనామము పారమ్యమును బోధింపగా, చివరిదగు దామోదరనామము సౌలభ్యమును

తెలియజేయుచున్నది. దామోదరత్వము ఆశ్రితపారతంత్ర్యమును విశదీకరించునను విషయమును మధురకవి యాళ్వార్లు "**కణ్ణినుణ్ శిఱుత్తాంబ్బు**" అను ప్రబంధములోని మొదటి పాశురమున అనితరసాధారణముగా వర్ణించిరి. ఈ సందర్భమున ఆచార్యులు చేసిన వ్యాఖ్యానము కూడ మిక్కిలి హృదయంగనమము. కావున, దాని భావమిచుట కొందిగా ప్రస్తావింపబడుచున్నది.

శ్రీకృష్ణుని నవనీతచౌర్యమువంటి పలు చిలిపి చేష్టలకు విసిగి వేసారిన యశోదాదేవి అతనిని మాటిమాటికి దారముతో బంధించుచుండెను. తల్లి ఇట్లు తనను బంధించుటచే కృష్ణుడు, ఇంటిలోని దారములన్నిటిని చిన్న చిన్న ముక్కలుగా చేసి, ఇక ఆమె తనను బంధింపలేదని తలచి, మరల అల్లరి పనులను చేయుచుండెను. యశోద బాలకృష్ణుని ఒక చేతితో పట్టుకొని, దారము కొఱకు వెదుకగా చిన్న చిన్నముక్కలే కనుపించెను. ఆ ముక్కలన్నిటిని ఆమె ఒకటిగా ముడివేసి, దారముగా చేసి, ఆ దారముతో కృష్ణుని కట్ట ప్రయత్నించెను. కాని, ఆ దారము మిక్కిలి చిన్నది. కృష్ణుని కట్టుటకు చాలనిది. అయినను, శ్రీకృష్ణభగవానుడు తన ఆశ్రితపారతంత్ర్యము, సౌలభ్యము మొదలగు గుణములను ఆవిష్కరించుటకు ఇదియే తగిన సమయమని భావించెను కాబోలు! తనను యశోదాదేవి కట్టునట్లు తనను చేసికొనెను. ఇట్టి రస్యార్థము మధురకవుల పాశురములోని "**కట్టుణ్ణ ప్పణ్ణియ**" అనుట వలన ఏర్పడచున్నది. కూరేశులు,

**"త్వామన్య గోపగృహగవ్యముషం యశోదా**
**గుర్వీ త్వదీయ మవమాన మమృష్యమాణా,**
**ప్రేమ్ణాథ దామపరిణామజుషా బబంధ,**
**తాదృఙ్న తే చరిత మార్యజనాః సహంతే"**

(నీవు రేపల్లెలో గొల్ల గృహాలలో ఉండే పాలు వెన్న పెరుగు మొదలైన వానిని దొంగిలించినప్పుడు వారు నిన్ను నిందించి అవమానించారు అప్పుడు నీకు

కలిగిన ఆ అవమానాన్ని చూచి సహించలేని నీ తల్లి యశోద నిన్ను కట్టినది దారముతో కాదు. తన ప్రేమనే దారముగా మార్చి బంధించెను. స్వామీ! నీ విట్లు అబల అయిన యశోదచే బంధింపబడు వృత్తాంతమును వినిన మహర్షులు ఆళ్వారులవంటి ఆర్యజనులు తాళలేరు కదా! అనగా, నీ ఆశ్రిత పారతంత్ర్యగుణమును తెలుపు ఈ వృత్తాంతము నమ్మాళ్వార్లవంటి ఆర్యజనుల మనస్సులను ద్రవీకరింపచేయుచున్నది. కదా)' అనుచు అతిమానుషస్తవమున (40) పల్కిరి.

శ్లోకములోని నాల్గవ పాదము శ్రీరంగనాథుని ఉదరబంధమను అభరణమును వర్ణించుచున్నది. ఉదరబంధము వడ్డాణమువంటి ఆభరణము. లోకమున విజయమును సూచించుటకై పట్టమును కట్టుదురు. శ్రీరంగనాథుని నడుమునకు అలంకరింపబడిన ఉదరబంధము పట్టాకారమున ఉండుటచే భట్టరు ఇక్కడ దానిని విజయపట్టముగా ఉత్ప్రేక్షించుచున్నారు. శ్లోకమున ఇంతకు ముందు స్తుతింపబడిన శ్రీరంగనాథుని ఐశ్వర్యము, ఆశ్రితపారతంత్ర్యము – అను గుణములను రెండిటిని కలిపి కట్టిన విజయసూచకమైన పట్టము కదా ఈ ఉదరబంధము! పరత్వసౌలభ్యములను పరస్పర విరుద్ధములైన గుణములు ఉదరబంధమునందు ప్రకాశించుటచే స్వామినడుము అసదృశము – అను విశేషమును ఈ ఆభరణము వ్యక్తీకరించుచున్నది – అని తాత్పర్యము.

శ్లోకములోని "తదుభయగుణాకృష్ణమ్" అను ప్రయోగము విశిష్టమైనది. సంస్కృతమున గుణశబ్దమునకు దారమని, గుణమని రెండు అర్థములు కలవు. ఈ రెండు అర్థములు ఇచట వివక్షితములే. ఒక వస్తువును కట్టవలెనన్న దారము కావలెను. ఒకటికి రెండు దారములున్నచో కట్టుట మిక్కిలి సులభమగును, మరింత బిగించి కట్టుటకు వీలగును. అట్లే, పరత్వ, సౌలభ్యములను రెండు గుణములతో, దారములతో, స్వామినడుమునకు ఉదరబంధము మిక్కిలి బిగువుగా కట్టబడినదను చమత్కారము ఇచట

గుణశబ్దముచే ఏర్పడిన దారమను అర్థముచే ద్యోతకమగుచున్నది. "**గుణై రాకృష్య బద్ధ్వస్తే గుణాః, గుణాః గుణానుబంధిత్వాత్ తస్య సప్రసవాః**" (రఘు. – 1వసర్గ), "**గుణై రాకృష్య బద్ధం గుణపట్ట మివ**" (గుణాలతో, అంటే, దారాలతో బాగా బిగించి, గుణములు, అంటే, సౌలభ్యము మొదలైన గుణములు భగవంతునిలో బంధింపబడుతున్నాయి. భగవంతుని గుణములన్ని ఒకదానితో ఇంకొకటి సంబంధించినవి అయినందున, ఒకే తల్లికి పుట్టిన సోదరులవలె, శపరస్పరము ఎటువంటి విరోధము లేకుండా ప్రకాశించినవి.) అను రసోక్తి గోపాలాచార్యవ్యాఖ్యలో కలదు.

శ్లోకములోని "**వళిత్రయమ్ ఐశ్వర్యం వ్యాఖ్యాతి**", "**కింతు దామోదరత్వకిణః ప్రణతవశతాం బ్రూతే**" అనునపుడు "**వ్యాఖ్యాతి, బ్రూతే**" అను క్రియాపదముల యోగమువలన స్వామి ఐశ్వర్యమును వళిత్రయము వ్యాఖ్యానించినను, దామోదరత్వకిణము సైతము స్వామి ఆశ్రితపారతంత్ర్యమును అట్లు వ్యాఖ్యానింపలేదు. కేవలము కొంతవరకు మాత్రమే తెలుపగలదు. కావున, భగవానుని పరత్వమును వర్ణించుట. సాధ్యమైనా కావచ్చునేమో కాని, సౌలభ్యగుణమును పూర్ణముగా తెలుపుటకు ఎవరికి సాధ్యము కాదు – – అను విశేషార్థము ఇచట ధ్వనించుచున్నది.

"**అమలనాది పిరాన్**" అను దివ్యప్రబంధమునకు అழகియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ అను ఆచార్యవర్యులు రచించిన వ్యాఖ్యానమున ఈ శ్లోకమున ఉట్టంకింపబడినది. అందు "**తదుభయగుణావిష్టమ్**" అను పాఠము కన్పించుచున్నది. "**ఆవిష్టమ్ ఆకృష్టమ్**" అను రెండు పదములు సమానార్థకములు కావున, ఈ పాఠమువలన కూడ పూర్వము చూసిన అర్థమే వచ్చును.

వేంకటాచార్యసంస్కృతవ్యాఖ్యానమున "**ఆకృష్టమ్**" అనుటకు "**లిఖితమ్**" అను అర్థము చూపబడినది. ఈ అర్థమును బట్టి ఉదరబంధము శ్రీరంగనాథుని పరత్వసౌలభ్యగుణములకు కల్గిన విజయమునకు గుర్తుగా

వ్రాయబడిన విజయశాసనమను తాత్పర్యము ఏర్పడును. కృష్టశబ్దము **"కృష——విలేఖనే"** అను భ్వాది ధాతువునుండి పుట్టినట్లు చెప్పుటకు వీలున్నందున, ఈ భానము స్ఫురించుచున్నది. **"రంగమహేశితుః"**అను పదములోని మహేశితృశబ్దము, **"ప్రణతవశతా"** అనునపుడు **"వశతా"** శబ్దము **"సర్వస్య వశీ, సర్వస్యేశానః"** (అందరికీ వశుడు, అందరినీ నియమించేవాడు) (6-4-22) అను శ్రుతివాక్యమును తలపింపచేయుచున్నవి ఈ రెండును పరమాత్మయొక్క సర్వేశ్వరత్వ, ప్రణతసౌలభ్యములను గుణములను తెలియజేయుచున్నవి.

ఆశ్రితుల మనస్సులను హరించు పరత్వసౌలభ్యములను వర్ణించు ఈ శ్లోకము హరిణీవృత్తమున రచింపబడినది.

## శ్రీరంగనాథుని నాభీపద్మము ఆ స్వామి పరత్వమును నిరూపించుచున్నది

**116. త్రయో దేవా స్తుల్యా స్త్రితయ మిద మద్వైత మధికం**
**త్రికా దస్మా త్తత్త్వం పర మితి వితర్కాన్ విఘటయన్ ।**
**విభోః నాభీపద్మో విధిశివనిదానం భగవతః**
**తదన్యద్భ్రూభంగీపరవ దితి సిద్ధాంతయతి నః ॥**

**ప్ర. అ. –** త్రయః – దేవాః = బ్రహ్మ, విష్ణువు, శివుడు – అను ముగ్గురు దేవతలు, తుల్యాః = సమప్రాధాన్యమును కలవారు, (అని), ఇదం = ఈ, త్రితయం త్రిమూర్తులు, అద్వైతం = ఒక్కటే (అని), అస్మాత్ = ఈ, త్రికాత్ = త్రిమూర్తుల కంటె, అధికం = గొప్పదైన, తత్త్వం = తత్వము (మాత్రమే), పరం = గొప్పది, ఇతి అను, వితర్కాన్ = విప్రతిపత్తులను, (ఊహలను), విఘటయన్ = పోగొట్టుచు, విభోః = శ్రీరంగనాథునియొక్క, నాభీపద్మం = నాభీకమలము, భగవతః = భగవానుని యొక్క, విధిశివ = బ్రహ్మకు, రుద్రునకు, నిదానం = మూలకారణము అగుటను, తత్ = ఆ భగవానుని కంటె, అన్యత్ = వేరయిన

చరాచర ప్రపంచమంతయు, భ్రూభంగీ = (ఆ భగవానుని) కనుబొమల కదలికలకు, పరవత్ = పరతంత్రము, ఇతి = అని, నః = మనకు, సిద్ధాంతయతి = సిద్ధాంతీకరించుచున్నది.

**వరివస్య :–** శ్రీరంగనాథుని నాభీపద్మము ఆ స్వామియొక్క పరత్వమును, బ్రహ్మరుద్రాదుల న్యూనతను తెలియజేయుచున్నదనుటను కవి ఈ శ్లోకముద్వారా తెలియజేయుచున్నారు. ఈ శ్లోకమున కవి నమ్మాళ్వార్ల పెరియ తిరువన్దాది ప్రబంధములోని –

**"ముదలామ్ తిరువురువుమ్ మూన్ఱెన్బర్, ఒన్ఱే**
**ముదలాకుమ్ మూన్ఱుక్కు మెన్బర్, ముదల్వా!**
**నికరిలకు కారురువా,!నిన్నకత్తదన్ఱే**
**పుకరిలకు తామరైయిన్ పూ"** (72)

(సృష్టికి మూలకారణం అయిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు – అనే విధంగా జగత్ కారణ తత్వాల రూపం మూడు – అని కొందరు అంటారు. ఒకే తత్వం ఈ ఈ ముగ్గురికి మూలమని కొందరు అంటారు. ఓ జగత్కారణభూతుడవైన స్వామీ! సాటి లేని, ప్రకాశించే నల్లని మేఘంవంటి రూపాన్ని కలవాడా! గొప్పగా ప్రకాశించే నాభీపద్మం నీ తిరుమేనిలోలోనే కదా ఉన్నది!) అను పాశురభావమును అనుసంధించుట గమనింపదగినది.

బ్రహ్మ, విష్ణువు, శివుడను ముగ్గురు దేవతలు ఎట్టి తారతమ్యమును లేక సమానమైన గొప్పతనమును కల్గినవారు – అనునది కొంతమంది చేయు వాదము. దీనికే త్రిమూర్తుల సామ్యవాదమని పేరు. ఈ వాదము ప్రస్తుతశ్లోకమున మొదటగా ప్రస్తావింపబడినది. బ్రహ్మ, విష్ణు, రుద్రులుగా మూడు వేర్వేరు రూపములలో కన్పించుచున్నను, పరబ్రహ్మము ఒక్కటే, కాని వేర్వేరు కాదు – అని కొందరి వాదము. దీనికి త్రిమూర్తుల ఐక్యవాదమని పేరు ఈ వాదమును కవి సామ్యవాదమునకు పిమ్మట పల్కిరి. వస్తువులలో గల పరస్పరభేదములను అంగీకరించుచునే అవి హెచ్చు తగ్గులు లేనివని,

సమానములని ఒప్పుకొనుటకు సామ్యవాదమని పేరు. వస్తువుల మధ్య భేదమును కూడ అంగీకరింపక, అన్నిటిని ఒక్కటిగానే గ్రహించుటకు ఐక్యవాదమని పేరు. ఈ వాదములలో మొదటిది – రెండు వస్తువులలోనుండు ధర్మములలో ఐక్యమును ఒప్పుకొనగా, రెండవది ధర్మైక్యమును అంగీకరించుచున్నది. అంటే, ఆ రెండిటి మధ్య ఐక్యమును అంగీకరించుచున్నది. ఈ రెండు వాదములే కాక, మూడవ వాదమును కలదు. అది ఏమనగా, బ్రహ్మ, విష్ణు, రుద్రులకంటె పరతత్త్వము వేరొకటి కలదని, త్రిమూర్తులుకూడా ఆ తత్త్వమునకు విధేయులని - అనునది. దీనిని భట్టరు మూడవ వాదముగా పేర్కొనిరి.

బ్రహ్మ, విష్ణు, రుద్రులు – అను దేవతలు ముగ్గురును సమానులు – అని, ఆ ముగ్గురు ఒక్కరే –అని, ఆ ముగ్గురి కంటె పరతత్త్వము వేరొకటి కలదు– అని లోకములో గల పలు వితర్కములను శ్రీరంగనాథుని నాభీపద్మము పటాపంచలు చేయుచున్నది. ఆ స్వామియే బ్రహ్మ, రుద్రులకు నిదానమని, ఆ స్వామికంటె వేరయిన సమస్తము ఆ ప్రభువుయొక్క కనుబొమల కదలికలకు లోబడియున్నదను సిద్ధాంతమును మనకు తెలియజేయుచున్నది – అని శ్లోకభావము.

నాభీకమలము ఈ సిద్ధాంతమునెట్లు ప్రకటించుచున్నదనినచో, చతుర్ముఖుడు. భగవానుని నాభినుండి పుట్టుటవలన, శివుడు ఆ చతుర్ముఖునివలన ఉద్భవించుటవలన, బ్రహ్మరుద్రుల కంటె వేరొకరి విషయమున పరత్వశంకకు అవకాశము లేనందున, పైన పేర్కొనిన మూడు వాదములు నిరస్తములై, శ్రీరంగనాథుడే పరతత్త్వమని సిద్ధాంతీకరింపబడినది. **"యన్నాభిపద్మా దభవత్ ప్రజాపతిః"** (ఎవరి నాభీపద్మంనుండి ప్రజాపతి పుట్టాడో) అని మహోపనిషత్తున. నాభీపద్మమునుండి బ్రహ్మ పుట్టెనని చెప్పబడినది. **"మేవి త్తొ ఱ్రుమ్ పిరమన్ శివన్ ఇన్దిరనాదిక్కెల్లామ్ నావిక్కమల ముదల్ కిழజ్జే"** (భక్తితో నీకు నమస్కరించే బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు

మొదలైనవారికి అందరికీ మూలమైన నాభీకమలం అనే మూలకంధం నీలోనే కదా ఉన్నది) (తి. వా. 10-10-3) అని నమ్మాళ్వార్లును ఈ విషయమును స్పష్టపఱచిరి. రుద్రునకు, ఇంద్రునకు నాభీకమలము సాక్షాత్తు జన్మస్థానము కాకున్నను, ఆ నాభికమలమునుండి పుట్టిన బ్రహ్మ రుద్రుని, ఇంద్రుని సృజించుటచే, పరంపరాకారణమయినది కదా! **"బ్రహ్మణః పుత్రాయ జ్యేష్ఠాయ శ్రేష్ఠాయ"** (బ్రహ్మయొక్క గొప్ప పుత్రుడు, గొప్పవాడు అయిన శివునకు) అని వేదపురుషుడు, **"నాన్ముకనై నారాయణన్ పడైత్తాన్, నాన్ముకనుమ్ తాన్ముకమాయ్ శఙ్కరనై త్తాన్ పడైత్తాన్"** (నాన్ముకన్ తిరు-1) (చతుర్ముఖుని నారాయణుడు సృష్టించాడు. ఆ చతుర్ముఖుడు కూడా తన ద్వారా శంకరుని సృష్టించాడు) అని తిరుమళిశై ఆళ్వార్లును ఈ విషయమును తెలిపిరి. ఈ శ్లోకములోని విధిశివపదములు ఇంద్రపదమునకును ఉపలక్షకములని చెప్పనగును.

**"బ్రహ్మవిష్ణురుద్రేంద్రాః సర్వే సంప్రసూయంతే"** (బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు ఇంద్రుడు మొదలైనవారు అందరూ జన్మిస్తున్నారు) అని అధర్వశిఖోపనిషత్తున విష్ణువునకును బ్రహ్మరుద్రేంద్రులకువలె ఉత్పత్తి చెప్పబడినదే? – అనినచో, – ఇది అవతార విషయమని పెద్దల అభిప్రాయము, భట్టరును ఉత్తరశతకమునందు **"మధ్యేవిరించిగిరిశం ప్రథమావతారః"** (51) (బ్రహ్మరుద్రుల మధ్యన విష్ణ రూపమున నీవు అవతరించిన రూపం నీ మొట్టమొదటి అవతారం) అను శ్లోకమున ఈ రహస్యమును తెలిపిరి. కావున సృష్టికర్త యగు శ్రీరంగనాథునకు సృష్టికర్మిభూతులగు బ్రహ్మరుద్రేంద్రాదులు అందరు పరతంత్రులని భావము.

పరతత్వనిర్ణయమును చేయు మహర్షులు, ఆళ్వార్లు మిగిలినవారు అందరు అట్లుండనిండు, వారు పక్షపాతముతో పల్కియుండ వచ్చును. వాదమున మధ్యస్థుల మాట కదా ప్రమాణము. నాభీపద్మము మధ్యస్థము (అనగా, భగవానుని దివ్యదేహమునకు మధ్యలో నున్నది) కావున అది చేయు

నిర్ణయమే ప్రధానప్రమాణము. మఱియు, నాభీకమలము ప్రత్యక్షప్రమాణమునకు విషయము. ప్రమాణములన్నిటిలోను ప్రత్యక్షప్రమాణము ప్రబలము, కావున నాభీకమలము భగవానుని పరతత్త్వనిర్ణయములో తిరుగు లేని ఋజువు – అను రమణీయమైన భావ మిదట ధ్వనించుచున్నది – అని శ్రీ. ప్ర. భ. అణ్ణాస్వామి హృద్యముగా వివరించిరి.

శబ్దము నాభినుండి పుట్టును. నాభి సిద్ధాంతము చేయుచున్నదనుటచే ఆప్తవాక్యరూపమైన శబ్దప్రమాణమునకు మూలమనుటద్వారా తెలియజేయుచున్నదనియు ఇచట ధ్వనించును.

పైన ఉదాహరించిన పెరియ తిరువన్దాది పాశురమున త్రిమూర్తుల సామ్యవాదము, పరబ్రహ్మము త్రిమూర్తుల కంటె వేరయినదను మూడవ వాదమును ప్రస్తుతింపబడెనే కాని, రెండవదగు ఐక్యవాదమును గూర్చిన మాట లేదు. కాని, ఆ వాదముకూడ ఆళ్వార్ల మనస్సులో ఉండి యుండునని తలచిన భట్టరు, దానిని కూడ ఇచట పల్కిరని భావింపనగును. శ్లోకములోని విభు, భగవచ్ఛబ్దములు సాభిప్రాయకములు. "**నః**" అను సర్వనానుశబ్దము "అనభిజ్ఞులమైన మనకు కూడ" అను విశేషార్థమును ధ్వనింపజేయుచున్నది. బ్రహ్మరుద్రులకు భగవానుని భ్రూభంగీపరత్వము తప్ప, పరత్వము లేదనుట ఉక్తి చమత్కృతి. ఈ శతకము చివరలో "**కిరీటం రంగేందోః**" అను శ్లోకమున చేసిన ప్రతిజ్ఞకు ఇందు కవి తగిన ఉపపత్తిని చూపిరని చెప్పవచ్చును.

త్రిమూర్తుల కంటె వేరయిన పరతత్త్వమొకటి కలదను మూడవ వితర్కము యాదవ ప్రకాశమతమని శ్రీరామానుజాచార్యవ్యాఖ్యానమున చెప్పబడినది. ముమ్మూర్తుల కంటె ప్రకృష్టమైన ఈశ్వరాఖ్యతత్వము కలదని, ఆ తత్వముయొక్క అంశలే త్రిమూర్తులని, కావున, త్రిమూర్తులు పరతత్వముగు ఈశ్వరుని కంటె భిన్నులు, అభిన్నులును – అని యాదవ ప్రకాశులనెడి వేదాంతి చెప్పిన మతము. కావున, యాదవప్రకాశమతమునకు భేదాభేదవాదమని పేరు.

త్రిమూర్తుల సామ్యవాదము దివ్యప్రబంధములో పలు చోట్ల ప్రస్తావింపబడుట గమనింపదగినది.

**"ఆత్మైక్యం దైవతైక్యం త్రికసమధిగతాతుల్యతైక్యం త్రయాణామ్, అన్యత్రైశ్వర్య మిత్యాద్యనిపుణఫణితీ రాద్రియంతే న సన్తః"** (6–71)

(ఆత్మల ఐక్యము, బ్రహ్మ విష్ణు రుద్రులనే మూడు దైవాల ఐక్యము, ఈ ముగ్గురి సామ్యం, ఈ ముగ్గురి కంటే వేరొక పరతత్వం ఉన్నదని అనడం – ఈ విధంగా ఉండే నైపుణ్యం లేని వాదాల ప్రకారాలను సత్పురుషులు ఆదరించరు) అను సంకల్పసూర్యోదయములోని దేశకసూక్తి ఈ శ్లోకమునకు అనుకరణము.

**"వా పుంసి పద్మమ్"** అను నిఘంటువచనమువలన తామరపూవు అను అర్థమునిచ్చు పద్మశబ్దమునకు పుంలింగమునకూడ ప్రయోగము కలదు.

ఇందు వృత్తము శిఖరిణి,

## శ్రీరంగనాథుని నాభి, నాభీపద్మం –రెండును సుడులే

**117. గర్భే కృత్వా గోప్తు మనంతం జగదంతో**
**మజ్జద్భ్రమ్యా వాంఛతి సామ్యం నను నాభిః ।**
**ఉత్క్షిప్యైతత్ ప్రేక్షితు ముద్యద్భ్రమిభూయం**
**నాభీపద్మో రంహతి రంగాయతనాబ్ధేః ॥**

**ప్ర. అ. –** రంగ ఆయతన అబ్ధేః = సముద్రమువంటి శ్రీరంగనాథునియొక్క, నాభిః = బొడ్డు, అనంతం = అంతు లేని, జగత్ = లోకమును, గర్భే కృత్వా కడుపున ఉంచుకొని, గోప్తుం = రక్షించుటకు, అంతః = లోపల, మజ్జత్ భ్రమ్యా = మునుగుచున్న సుడితో, సామ్యం = ఒప్పుదలను, వాంఛతి నను = కోరుచున్నది కదా!, నాభీపద్మం = నాభీపద్మము, ఏతత్ = ఈ లోకమును, ఉత్క్షిప్య = పైకి లేవనెత్తి, ప్రేక్షితుం = చూచుటకై, ఉద్యత్ = పైకి వృద్ధి చెందుచున్న, భ్రమిభూయం = సుడిగా నుండుటను, రంహతి = అయినది (పొందినది) కాబోలు.

**వరివస్య :-** ఇందు భట్టరు శ్రీరంగనాథుని నాభిని, నాభీకమలమును కలిపి అనుభవించుచున్నారు. నాభిని సుడితో పోల్చుట కవి సంప్రదాయము. "**నాభీ రసాతలావర్త హ్రదకూపనదాది**" (నాభిని పాతాళం, సుడి, సరస్సు, కూపం, నదం మొదలైనవాటితో పోల్చాలి) అని అలంకారశేఖరకారుడు పల్కెను. నాభియు, నాభీపద్మమును వర్తులాకారముగ నుండును. కావున, వానిని కవి సుడితో ఉత్ప్రేక్షించుచున్నారు. మొదటి రెండు పాదములలో నాభియు, తదుపరి రెండు పాదములలో నాభీకమలమును ఉత్ప్రేక్షింపబడుచున్నవి.

ప్రళయకాలమున బ్రహ్మాండములన్నియు ప్రళయ జలములలో కొట్టుకొని పోకుండ భగవానుడు వానిని తన ఉదరమున అణచియుంచి, రక్షించి, ప్రళయము ముగిసిన పిమ్మట తిరిగి ఆ లోకములన్నిటిని బయలు పరచును. ఈ వృత్తాంతమును తిరుమజ్గై యాళ్వార్లు పెరియ తిరుమొళి ప్రబంధంలో "మైన్నిన్ఱ కరుఙ్కడల్ వాయ్" (11-6) అను దశకమునందు విస్తరముగా వర్ణించిరి. నమ్మాళ్వార్లును "**యావరుమ్ యావైయుమ్ ఎల్లా ప్పొరుళుమ్ కవర్విన్ఱి తన్నుళ్ ఒడుఙ్గ నిన్ఱ**" (చేతనా చేతనములను అన్నిటిని, వాటిలో ఏది తప్పిపోకుండా, తనలో పొందికగా ఉండేటట్లు నిలచిన) (తి. వా. -2-2-6) అని మొదలగు పాశురములలో ఈ విషయమును స్తుతించిరి.

నదులలో, సముద్రములలో నుండు సుడులు రెండు విధములుగా నిండును. అందులో ఒకటి, నీటికి పైన కనిపించు సుడి. రెండవది, నీటి లోపల అంతర్భవించి ఉండు సుడి.

శ్రీరంగనాథుడొక అమృతసాగరము. ఆ సాగరములో జగమంతయు అణగియున్నది. శ్రీరంగనాథుని నాభి ఆ అమృతసాగరములోని అంతర్ముఖమైన సుడివలె ఉన్నది. అంతర్ముఖమైన సుడి వస్తువులను లోనికి అణచును. అట్లే, స్వామి నాభి. జగమును బయటపడకుండ ఉదరములోపలే ఉండునట్లు చేయుచున్నది. సముద్రమున పెద్ద పెద్ద వస్తువులున్న చోట సుడి ఏర్పడును. ఆ విధముగానే స్వామి నాభి అంతర్ముఖమైన ఆవర్తమువలె ఉన్నదని శ్లోకభావము.

సముద్రమున వేరొక సుడి కూడ ఉండును. ఆ సుడి బహిర్ముఖమైయుండును. ఇట్టి సుడి సముద్రములోని వస్తువులను బయటకు వచ్చునట్లు చేయును. శ్రీరంగనాథుని నాభీకమలము బహిర్ముఖమైన సుడివలె ఉన్నది. భగవానుడు చిరకాలము తన ఉదరమున దాచి ఉంచిన లోకములను అవి ఎట్లున్నవో చూడగోరినవాడై వానిని నాభీపద్మమను బహిర్ముఖమైన సుడిద్వారా బయలుపరచుచున్నట్లున్నాడని రెండవ ఉత్ప్రేక్షయొక్క తాత్పర్యము. నాభిని, నాభీపద్మమును ఆవర్తముతో పోల్చుటకు అనుగుణముగా శ్రీరంగనాథుని భట్టరు సముద్రముగా రూపించిరి.

భూధాతువునకు భావార్థమున '**క్యప్**' ప్రత్యయము చేర్చగా '**భూయమ్**' అను రూపమేర్పడును. "**భ్రమిభూయమ్**" –షఅనగా, సుడియై యుండుట – అని అర్థము. '**బ్రహ్మభూయమ్**' వంటి రూపము లిట్టివే.

"**గర్భే కృత్వా గోప్తుమ్**" అనుటచే, తల్లి తన బిడ్డను గర్భమున ధరించి రక్షించునట్లుగా, భగవానుడు లోకమును తన ఉదరమున దాచి రక్షించునను భానము ధ్వనించుటచే, భగవానుని వాత్సల్యగుణము తెలుపబడినది. మఱియు "**గోప్తుః**" (రక్షకునియొక్క) అనుటచే ప్రళయముకూడ కృపాకార్యమని తెలియుచున్నది. వేదాంతదేశికులు భగవద్ధ్యానసోపానమున,

**"గంభీరత్వాత్ క్వచన సమయే గూఢనిక్షిప్తవిశ్వా.**
**రమ్యావర్తద్యుతిసహచరీ రంగనాథస్య నాభిః" (5)**

(చాలా లోతైనది అయినందువల్ల ఎక్కడో ఒకచోట ప్రళయ సమయములో గుప్తంగా దాచుకున్న అన్ని లోకాలను కలిగినది, అందమైన సుడిశోభతో సమానమైనది – శ్రీరంగనాథుని నాభి) అను శ్లోకమున ప్రస్తుతశ్లోకభావమును అనుసంధించిరి.

హేతూత్ప్రేక్షతో స్వామి నాభిని వర్ణించు ఈ శ్లోకము ముద్రాలంకార పద్ధతిలో (ఉత్)ప్రేక్షాశబ్దఘటితమై యుండుట గమనింపదగినది. వృత్తము

మత్తమయూరము. "వేదైరంధ్రైః మ్తౌ యసగా మత్తమయూరమ్" అని దీని లక్షణము.

భట్టరు అనుగ్రహించిన, శ్రీరంగములో శ్రీరంగనాథుని తిరుమంజన సమయములో అనుసంధింపబడు ఈ క్రింది ముక్తకశ్లోకమున శ్రీరంగనాథుడు సముద్రముతో రూపింపబడుటను గమనింపవచ్చును.

**"మరకతమణిరమ్యం రమ్యమాణిక్యముక్తా–**
**ఫలవిలసితగాత్రం ప్రస్ఫురద్గంధవాహమ్,**
**విహితవివిధజంతుం ప్రోల్లసన్మీనలీలం**
**సుగమజలనిధిం త్వాం మన్మహే రంగనాథ!"**

(మరకతమణివంటి అందమైన దివ్యరూపాన్ని కలిగినవాడవు, అందంగా ఉండే మాణిక్యాలు, ముత్యాలు మొదలైనవాటితో చేయబడిన భూషణాలను ధరించిన శరీరాన్ని కలవాడవు, స్పష్టంగా వీచే పరిమళాన్ని కలవాడవు, అనేక విధాలయిన ప్రాణుల సృష్టిని చేసినవాడవు, ప్రకాస్తున్న చేపలవంటి నేత్రాల లీలలను కలవాడవు అయిన ఓ శ్రీరంగనాథా!, నిన్ను – మరకతమణులతో అందమైనది అందమైన మాణిక్యాలతో, ముత్యాలతో ప్రకాశించే రూపాన్ని కలిగినది, గొప్పగా వీస్తున్న వాయువును కలిగినది, అనేక విధాలయిన జల జంతువులకు పుట్టినిల్లు, ప్రకాశించే చేపల లీలావిలాసాలను కలిగినది అయిన సముద్రమని భావిస్తున్నాము).

## శ్రీరంగనాథుని ఊరువులకు ఉపమానమే లేదు

**118. మద మివ మధుకైటభస్య రంభా –**
**– కరభకరీంద్రకరాభిరూప్యదర్పమ్।**
**స్ఫుట మివ పరిభూయ గర్వగుర్వోః**
**కి ముపమిమీమహి రంగకుంజరోర్వోః?॥**

**ప్ర. అ. –** మధుకైటభస్య = మధుకైటభులయొక్క మదమ్ ఇవ = మదమును (అణచిన విధము) వలె, రంభా = అరటిబోదెలు, కరభ = కరభప్రదేశము, కరి ఇంద్ర కర = గొప్ప ఏనుగు తొండము – అను వీనియొక్క దర్పం = గర్వమును, పరిభూయ = అవమానించి, గర్వగుర్వోః = (అందువలన) కల్గిన గర్వముచే గొప్పవి, అగు, రంగకుంజర= కుంజరమువంటి శ్రీరంగనాథునియొక్క, ఉర్వోః = తొడలకు, కిమ్ ఇవ = ఏ వస్తువును, స్ఫుటం = స్పష్టముగా, ఉపమమీమహి = ఉపమానముగా పల్కుదుము? ( దేనిని ఉపమానముగా పలుకలేమని భావము)

**వరివస్య :–** ప్రస్తుతశ్లోకమున భట్టరు శ్రీరంగనాథుని ఊరుయుగమును వర్ణించుచున్నారు. ఆ ఊరువులకు సమానము వేరొకటి లేదను భావము ధ్వనించుటనే, ఇచట అనన్వయాలంకారధ్వని కలదని చెప్పవచ్చును.

శ్రీరంగనాథుని ఊరువులు మధుకైటభులను రాక్షసుల మదమును అణచినవి. లోకములోని అరటిబోదెలు, కరభప్రదేశము, మదపుటేనుగు తొండము – అను వీనియొక్క రూపములోని అతిశయమును మించిన సౌందర్యమును కల్గినవగుటచే అసదృశములై, గొప్ప గర్వమును పొందినవి. అట్టి స్వామి ఊరువులకు ఏ వస్తువును ఉపమానముగా పల్కుదునము? పలుకలేముకదా! – అని శ్లోకభావము.

అరటిబోదెలు, ఏనుగుతొండము, కరభము – అనునవి ఊరువులకు ఉపమానములుగా చెప్పుట కవిసమయము **"ఊరు స్తు కరిహస్తేన కదల్యా కరభేణ చ"** (మరీచి:-13) (ఊరువులను – ఏనుగు తొండముతో, అరటి బోదెతో, కరభముతో పోల్చవలెను) అని అలంకారశేఖరమున చెప్పబడినది. ప్రారంభమున లావుగా ఉండి, క్రమముగా సన్నగా ఉండుటకు, బలమునకు, చల్లగా నుండుటకు అరటిస్తంభములను, కరిహస్తమును, మణికట్టునుండి చిటికెన వేలువరకు గల చేతియొక్క బహిః ప్రదేశము (కరభము) ఊరువులకు

ఉపమానములుగా చెప్పబడుచున్నవి. కానీ, ఇవి అన్నియు శోభలో స్వామి ఊరుయుగము ముందు దిగదిడుపే.

సృష్టి ప్రారంభమున పుట్టినవారు, మహాబలిష్ఠులైన మధుకైటభులు అను ఇద్దరు అసురులు బ్రహ్మవద్ద గల వేదములను దొంగిలించి, సముద్రమున దాగిరి. వేదములను కోల్పోయిన బ్రహ్మ దిక్కు తెలియనివాడై, సృష్టికార్యమును నిర్వహింపలేకపోయెను. లోకమునందు చీకటి అలముకొనెను. అపుడు భగవానుడు బ్రహ్మను అనుగ్రహింపగోరి, సముద్రమున జొచ్చి, ఆ మధుకైటభులను తన తొడలతో మర్దించి, వారిని సంహరించెను. వేదములను బ్రహ్మకు తిరిగి ప్రసాదించెను.

భగవానుడు ఊరువులతో మధుకైటభుల మదమును అణచిన ఈ వృత్తాంతము శ్రీరంగనాథపరముగా ప్రస్తుతశ్లోకమున అనుసంధింపబడినది.

(ప్రసంగాత్, ఒక విషయము ఇక్కడ గమనించవలసి ఉన్నది. భగవానుని పలు అవతార వృత్తాంతములను ఆ స్వామి అర్చారూపాలలో అనుసంధించిన ప్రకారములు ఆళ్వారుల సూక్తులలో పలు చోట్ల కనిపిస్తాయి. ఆ విధంగానే, ఒక అవతార దశలో భగవానుడు చేసిన లీలలను, వేరొక అవతారాన్ని అనుభవించేటప్పుడు కూడా, ఆ అవతారపరంగా అన్వయించి అనుభవించే ప్రకారాలూ కనిపిస్తాయి. ఇవి అన్ని ఏ విధంగా సమన్వయించుకోవాలి? అనే ప్రశ్న కూడా రావచ్చు. ఒక అవతారంలో ఉండే భగవానుడు, వేరొక అవతారంలో ఉండే భగవానుడు –ఈ ఇద్దరూ ఒకరే. ఆ విధంగానే, అర్చారూపంలో ఉండే భగవానుడే పూర్వం పలు అవతారాలను ఎత్తాడు. అందువల్ల సర్వత్రా ధర్మి ఒకడే కనుక, ఈ ధర్మ్యైక్యాన్ని పురస్కరించుకొని, ఈ విధంగా ఆళ్వారులు పలుకడంలో విప్రతిపత్తి ఏమీ లేదు – అని మన పూర్వాచార్యులు తమ తమ వ్యాఖ్యానాలలో తెలియజేశారు.)

మధుకైటభుల వృత్తాంతమును పేయాళ్వార్లు **“మధుకైటవరుమ్ వయిఱురుకి మాణ్డార్”** (66) (మధుకైటభులు కూడా ఉదరములో ద్రవించి

నశించారు) అనియు, తిరుమళిశై ప్పిరాన్ "**ఇకఱ్ణన్దాయ్ ఇరువరైయుమ్ వీయ**" (నాన్ము. తి–24) (మధు కైటభులు అనే ఆ ఇద్దరినీ నీవు, వారు నశించేటట్లుగా నిరసించావు) అని, తిరుమఙ్గై యాళ్వార్లు "**మదుకైటవర్ కళ్. అవర్ తాన్——ఒఱ్ణిత్త పెరుమాన్**" (పెరి. తి–10–6–3) (మధు కైటభులను నిరసించిన స్వామి) అని అనుసంధించిరి. "**తిరుమెయ్యమ్**" అను దివ్యదేశములో గల అర్చామూర్తి మధుకైటభులను సంహరించు సన్నివేశముతో వేంచేసి యుండుట ఇచట స్మరింపదగినది.

శ్రీరంగనాథుని ఊరువులు తమ అభిరూప్యముచే అరటిబోదెలను, ఏనుగుకరమును, కరభమును జయించినవి.

**"నాగేంద్రహస్తాః త్వచి కర్కశత్వాత్, ఏకాంతశైత్యాత్ కదలీవిశేషాః, – జాతాః తదూర్వో రుపమానబాహ్యాః"**

(గొప్ప ఏనుగు తొండము, దాని చర్మంలోని కాఠిన్యం వల్ల, గొప్ప అరటి బోదెలు కేవలం చల్లదనం అనే గుణాన్ని మాత్రం కలిగి ఉండడం వల్ల, ఆ పార్వతీ దేవి ఉరువులకు అవి ఉపమానం కాలేకపోయాయి) అను కుమారసంభవ ప్రథమసర్గలోని శ్లోకమున కాళిదాసు పార్వతియొక్క ఊరువులకు కరికరములు, కదళీస్తంభములు సరి తూగనని పల్కెనుకదా! కావున, భగవానుని ఊరువులకు అవి సాటి రావనుట కింపునర్న్యాయసిద్ధము. ఇట్టి ఉపమానదరిద్రమైన స్వామిబాహుయుగమును వర్ణించుట ఎట్లు? అని కవి తమ తడబాటును ప్రదర్శించుట ఒక విధమైన రసోక్తియే యగును.

ఈ శ్లోకమునకు కూరేశుల సుందరబాహుస్తవములోని –

**"పిష్టదుష్టమధుకైటభకీటౌ హస్తిహస్తయుగళాభసువృత్తౌ,**
**రాజతః క్రమకృశౌ చ సదూరూ సుందరస్య వనభూధరభర్తుః"**

(59)

(దుష్టులైన మధుకైటభులు అనే కీటకాలను పిండి చేసినవి, ఏనుగు తొండముల జంటతో పోలినవి, అందంగా గుండ్రంగా ఉన్నవి, పైనుంచి కిందకు

క్రమముగా సన్నగా కనబడేవి అయిన సుందర బాహుస్వామి చక్కని రెండు ఊరువులు ప్రకాశిస్తున్నవి) అను శ్లోకమునకు గల భావసాదృశ్యము గమనింపదగినది. అట్లే,

**"రంభస్తంభాః కరివరకరాః కారభాః సారభాజో**

**వేషాశ్లేషా అపి. –సామ్యం సమ్యఙ్న దధుః"**

(వరదరాజస్వామీ! బలిష్ఠంగా ఉండే అరటి బోదెలు, గొప్ప ఏనుగు తొండం, కరభం అనే చేతిలోని భాగం, మరకతమణులతో చేయబడిన స్తంభాలు – అనే ఇవి అన్నీ నీ ఊరువుల ఆకారం వంటి ఆకారంతో సంబంధాన్ని కలిగినవి అయినా, నీ తొడలతో అన్ని విధాలయిన సామ్యాన్ని అవి సరిగా పొందలేదు) (56) అను వరదరాజస్తవశ్లోకముకూడ ఇచట అనుసంధేయము.

**"సర్వో ద్వంద్వో విభాషయైకవత్ భవతి"** అను పరిభాషను బట్టి **"మధుకైటభస్య"** అను ఏకవచనప్రయోగము చేయబడినది.

కుంజరశబ్దమునకు **"కుంజే ఋచ్ఛతి (ఋ – –గతౌ) విహరతి ఇతి కుంజరః"** (పూపొదరింటిలో విహరించునది) అను వ్యుత్పత్తిని చెప్పుటకు వీలగుటచే, **"రంగకుంజర"** అనునపుడు, శ్రీరంగమందిరము అను పూపొదరింటిలో శయనించు గజశ్రేష్ఠమువంటివాడు, శ్రీరంగనాథుడు – అను భావము ఏర్పడుచున్నది. మఱియు, ఇచట, **"శయానం కుంజరం వాఽద్రికుంజే"** అని భట్టరు 80వ శ్లోకము పల్కిన సూక్తియు స్మరణీయము. **"పొదలయందు క్రీడించునది"** అను అర్థమిచ్చు **"స్తంబేరమః"** అను పేరుకూడ ఏనుగుకు కలదు. అంతేకాక, **"కుడైపాలానాయ్"** (10) అను తిరునెడున్దాణ్డక ప్రబంధసూక్తియు, అచట వ్యాఖ్యానించు పెరియ వాచ్చాన్ పిళ్ళై **"కీழ் శొన్న అనైకళైప్పోలే నిఱ్కైయన్రిక్కే, మేల్ దిక్కిలే ఒరు మదహస్తి శాయ్ న్దాప్పోలే యాయ్ఱ్ఱు|– – కోయిలిలే వన్దు పెరియ పెరుమాళ్ కణ్ వళర్ న్దరుళుకిఱపడి"** (ఇంతకు ముందు ప్రస్తావించిన ఏనుగులవలె ఉండడం కాకుండా, పడమటి దిక్కులో ఒక మదగజం పరుండి ఉన్నట్లుగా, శ్రీరంగానికి వచ్చి శ్రీరంగనాథుడు శయనించి ఉండే

సన్నివేశం ఉన్నది) అని పల్కుటయు ఇచట స్మరణీయములు, కావున శ్రీరంగమందిరమునకు పూపొదరింటితో సామ్యము ధ్వనించుచున్నది. ప్రాయశః ఇట్టి భావమును మనస్సులో ఉంచుకొని వేంకటాచార్యకృత సంస్కృతవ్యాఖ్య **"రంగకుంజరోర్వోః"** అనుటకు **"శ్రీరంగమందిరరూపమంజులకుంజశయాళోః శ్రీరంగరాజవ్యాజమదగజస్య ఊర్వోః"** (శ్రీరంగ మందిర రూపంలోని అందమైన పూపొదరింటిలో శయనించే, శ్రీరంగనాథుడనే పేరు కల మదగజంయొక్క ఊరువులకు) అని వ్యాఖ్యానించినదని తోచుచున్నది.

ఈ సందర్భమున తొణ్డరడిప్పొడి యాళ్వార్ల తిరుమాలై ప్రబంధములోని **"వణ్డినమ్ మురలుమ్ శోలై"** (14) అను పాశురమున **"అణ్డర్ కోన్ అమరుమ్ శోలై అణి తిరువరజ్గమ్"** (బ్రహ్మాండాధిపతి వచ్చి చేరిన ఉద్యానవనం – అందమైన శ్రీరంగ దివ్యక్షేత్రం) అందమైన అని పలుకుటను స్మరింపనగును. శ్రీరామాయణములో, విష్ణుపురాణాదులలో పలుచోట్ల భగవానుడు. గజశ్రేష్ఠముగా రూపింపబడెను. అట్లే, ఆళ్వార్లు పలువురు భగవానుని గొప్ప ఏనుగుతో పోల్చి, స్తుతించిరి.

**"స్యా దుత్తరపదే వ్యాఘ్రపుంగవర్షభకుంజరాః,**
**సింహశార్దూలనాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః"**

అను అమరకోశవచనమునుబట్టి "రంగకుంజర" అనుటకు శ్రీరంగమున గల పరమపురుషుడను అర్థమును చెప్పవచ్చును. "న తత్సమశ్చాభ్యధిక శ్చ దృశ్యతే" (శ్వేత. 6-8) (ఆ భగవంతునితో సమానమైనవాడు, అధికుడు ఎవడూ కనబడడం లేదు) అని వర్ణింపబడిన శ్రీరంగనాథుని సామ్యమును అన్వేషించువారు అందరును పరిభవమును పొందుచున్నారు. ఆ స్వామి ఊరువులతో సామ్యమును వెదకుట మనకు పరిభవకారణమే అగును. మఱియు, స్వామి ఊరువులు మదమును కలిగినవి. కావున సామ్యవర్ణనమును అని సహింపవు. అందుకే, ఆ ప్రయత్నమునుండి విరమించుటయే యుక్తము – అను అర్థచమత్కృతి ఈ శ్లోకమున వ్యంగ్యము.

ఇందు వృత్తము పుష్పితాగ్ర అను సమవృత్తజాతి భేదము.

## శ్రీరంగనాథుని పీతాంబరం మేరుపర్వత సానువు

**119. కటీకాంతిసంవాది చాతుర్యనీవీ–**
**లసద్రత్నకాంచీకలాపానులేపమ్ ।**
**మహాభ్రం లిహన్మేరుమాణిక్యసానూ–**
**రివా భాతి పీతాంబరం రంగబంధోః ॥**

**ప్ర. అ. –** రంగబంధోః = శ్రీరంగనాథునియొక్క, కటీ = నడుముయొక్క, కాంతి = కాంతితో(శోభతో), సంవాది = పొందికను కల్గిన, చాతుర్య = వైదగ్ధ్యమును కల్గిన, నీవీ = నీవీబంధమున, లసత్ = ప్రకాశించు, రత్న = రత్నములతో కూడిన, కాంచీకలాప = మేఖలాభరణముయొక్క, అనులేపం = చుట్టును ఉండుటను (అనులేపనమును) కల్గినది అగు, పీత– అంబరం = పచ్చని పట్టువస్త్రము, మహా అభ్రం = గొప్ప మేఘమును, లిహత్ = అస్వాదించుచున్న (మధ్యను కల్గిన), మేరు = మేరుపర్వతముయొక్క మాణిక్యసానూః = మాణిక్యములతో నిండిన సానువు, ఇవ = వలె, ఆభాతి – ప్రకాశించుచున్నది.

**వరివస్య :–** శ్రీరంగనాథుని నడుము, పీతాంబరముల కలయికయొక్క సొబగును గొప్ప ఒక ఉపమద్వారా భట్టరు స్తుతించుట ఈ శ్లోకమునందలి ప్రత్యేకత. ఈ శ్లోకమున తిరువాయ్ మొళి ప్రబంధములోని "ముడిచ్చోదియాయ్" అను పాశురమునందలి. "**పడిచ్చోదియాడై యొడుమ్ పల్ కలనాయ్ నిన్ పైమ్బొన్ కడిచ్చోది కలన్దదువో? తిరుమాలే! కట్టురైయే**" (3–1–1) (స్వామీ! రమ్యమైన నీ నడుముయొక్క కాంతి స్వభావసిద్ధమైన తేజస్సును కల పీతాంబరముతో కూడ అనేకవిధములైన ఆభరణములై వ్యాపించినదా ఏమి? వివరింపుము) అను సూక్తియొక్క ఛాయ కలదు – అనుట సుస్పష్టము.

శ్రీరంగనాథుని నడుమున శోభిల్లు పీతాంబరము గొప్ప కాలమేఘమును మధ్యలో కల్గిన మేరుపర్వతసానువువలె ప్రకాశించుచున్నది. ఇచట కాలమేఘము

శ్రీరంగనాథుడు, ఆ స్వామి నడుము చుట్టును కల పీతాంబరము. ఆ నల్లని మేఘమును మధ్యన గల మేరుపర్వతసానువు. నీవి, అనగా, వస్త్రబంధము (ముడి). స్వామి వస్త్రబంధము నడుముకాంతితో తులతూగు శోభను కల్గినది. వీనియందు వెలుగొందు రత్నమయమేఖలాభరణముచే (మొలనూలుచే) పీతాంబరము చుట్టబడియున్నది.

నీవీబంధము నడుముశోభతో తులతూగుట అనగా ఏమి? అనినవో, నీవీబంధము అనునది నిజమునకు లేకున్నను, స్వామి నడుముయొక్క కాంతి నీవీబంధమువలె శోభిల్లుచున్నదని భావము.

ఈ శ్లోకమున స్వామి కాలమేఘముగా, పీతాంబరము మేరుగిరిరత్నసానువుగా, చెప్పబడినది. **"తిరువాశిరియమ్"** అను దివ్యప్రబంధమున **"శెక్కర్ మాముకిల్ ఉడుత్తు"**(1) (అందమైన, ఎర్రని, గొప్ప మేఘం అనే వస్త్రాన్ని ధరించి) అను పాశురమున భగవానుడు మరతకపర్వతముగా, పీతాంబరము ఎఱ్ఱని మేఘముగా ఉపమింపబడుట ఇచట గమనింపదగినది.

వరదరాజస్తవములోని **"అంజనక్షితిభృతః"** (30) అను శ్లోకమునకు, ప్రస్తుతశ్లోకమునకు కల భావసాదృశ్యము గమనింపదగినది. "నీవీలసత్' అనునపుడు, **"నీవ్యాం లసత్"** – అనగా, **"నీవియందు ప్రకాశించు"** – అని గాని, **"నీవ్యా అసత్"** – **"నీవిచే ప్రకాశించు"** అని కాని చెప్పవచ్చును. **"రంగబంధుః"** అనుటకు, **"రంగే బంధుః"** – శ్రీరంగమున వేంచేసి యున్న సర్వవిధబంధువు –అని భావము.

ఇచట సామాన్యముగా ప్రయోగింపబడిన బంధుపదము–

**"పితా చ రక్షకః శేషీ భర్తా జ్ఞేయో రమాపతిః,**
**స్వామ్యాధారో మమాత్మా చ భోక్తా చాద్యమనూదితః"**

(లక్ష్మీనాథుడైన భగవానుడు నాకు తండ్రి, రక్షకుడు, శేషి, భర్త, తెలియదగినవాడు, స్వామి, ఆధారం, ఆత్మ, భోక్త అని అష్టాక్షరీ మంత్రంలో

చెప్పబడినది) అను శ్లోకమున చెప్పబడిన నవవిధ సంబంధములను కల్గినవాడను అర్థమునిచ్చును. అందువలన ఇక్కడ ఈ పదము ద్వారా అష్టాక్షరీమంత్రార్థము అనుసంధింపబడినది.

"**ప్రీతిం బధ్నాతి ఇతి బంధుః**"– (ప్రీతిని కలిగియుండువాడు బంధువు) అని బంధుశబ్ద వ్యుత్పత్తి. శ్రీరంగనాథునకు మిక్కిలి ప్రీతిని కల్గించు శ్రీరంగనగరము ఆ స్వామికి బంధువు, కావున, "**రంగం బంధుః యస్య సః**" అను వివరణమును ఇచట వివక్షితమే. ఊకారాంతమైన '**సానూ**' శబ్దము నిఘంటువులలో కనుపించుటలేదు.

ఇందు వృత్తము భుజంగప్రయాతము. "**భుజంగప్రయాతం భవేత్ యై శ్చతుర్భిః**" అనునది దీని లక్షణము.

ఈ శ్లోకము శ్రీరామానుజాచార్యకృతసంస్కృతవ్యాఖ్యానమున కన్పించుట లేదు.

## శ్రీరంగనాథుని పీతాంబరము – సముద్రపరివేషము, సంధ్యామేఘము, మెరపుతీగల సమూహము

120. **భర్మస్థలాంశుపరివేష ఇవాంబురాశేః**
**సంధ్యాంబువాహనికురుంబ మివాంబరస్య ।**
**శంపాకదంబక మివాంబుముచో మనో నః**
**పీతాంబరం పిబతి రంగధురంధరస్య ॥**

**ప్ర. అ. –** రంగధురంధరస్య = శ్రీరంగనాథునియొక్క, పీతాంబరమ్ = పీతాంబరము (పచ్చని పట్టు వస్త్రము), అంబురాశేః = సముద్రముయొక్క, భర్మస్థల = సువర్ణమయమైన ప్రదేశముయొక్క, అంశు = కాంతియొక్క, పరివేష = పరిధి, ఇవ = వలె, అంబరస్య = ఆకాశముయొక్క, సంధ్యా = సంధ్యాకాలమునందలి, అంబువాహ = మేఘముయొక్క, నికురుంబం = – మండలము (సమూహము), ఇవ వలె, అంబుముచః = మేఘముయొక్క, శంపా

= మెఱపు తీగలయొక్క, కదంబకం సమూహము, ఇవ = వలె ఉన్నదియై, నః = మనయొక్క, మనః = మనస్సును, పిబతి = పానము చేయుచున్నది.

**వరివస్య :–** ఈ శ్లోకమునందును భట్టరు శ్రీరంగనాథుని పీతాంబరమును మూడు ఉత్ప్రేక్షలతో వర్ణించుచున్నారు.

సముద్రములు ఏడు. ఈ భూమి చుట్టనూ గల ఏడు సముద్రములకు ఆవలి వైపున సువర్ణమయమైన భూమి కలదని ప్రాచీనభౌగోళికశాస్త్రమున చెప్పబడియున్నది.

**"స్వాదూదకస్య పరితో దృశ్యతే లోకసంస్థితిః,**
**ద్విగుణా కాంచనీ భూమిః సర్వజంతువివర్జితా"** (2–4–93)

(స్వాదూదక సముద్రం తరువాత లోకస్థితి కనబడుతున్నది. అది, అంతవరకు ఉండేదాన్ని కంటే రెట్టింపు పరిమాణాన్ని కలిగినది. అది బంగారు మయమైనది. అక్కడ ఏ విధమైన ప్రాణిజాతము ఉండదు) అని శ్రీవిష్ణుపురాణమున, **"సప్తద్వీపం స సింధుం చ ద్విగుణగుణితయా స్వర్ణభూమ్యా పరీతమ్"** అని దేశకుల భూగోళ నిర్ణయమున గల. ప్రమాణములు ఇచట స్మరణీయములు.

నల్లని శ్రీరంగనాథుని నడుము చుట్టును అలంకరింపబడిన పీతాంబరము సముద్రమును పరివేష్ఠించియున్న సువర్ణమయ ప్రదేశముయొక్క కాంతిపరివేషమువలె ఉన్నది. సముద్రము నీలవర్ణమగుటచే, పీతాంబరము బంగారపు రంగును కల్గినదగుటచే, ఈ ఉత్ప్రేక్ష సముచితమైనది.

ఈ ఉత్ప్రేక్షను ఇంకొక విధముగా కూడ వివరింపవచ్చును. సముద్రములో రత్నములతో పాటు బంగారముకూడ కలదు. ఆ బంగారముయొక్క కాంతి సముద్రముచుట్టును పరివేషము చుట్టినట్లుండును. స్వామినడుమునకు చుట్టును అలంకరింపబడిన పీతాంబరము ఆ పరివేషమువలె శోభిల్లుతున్నది.

సంధ్యాసమయమున ఆకాశమున ఎఱ్ఱని కాంతి అలముకొనును. ఆపుడు ఆకాశములోని మేఘములు సంధ్యారాగరంజితములగును, స్వామి ధరించిన పీతాంబరము సంధ్యాసమయమునందలి ఎఱ్ఱని మేఘముల సమూహమువలె ఉన్నది. మేఘములు నల్లగా, మెఱపుతీగ (బంగారురంగులో) ఎఱ్ఱగా ఉండును. కావున, శ్రీరంగనాథుని పీతాంబరము మెరుపు తీగల సమూహముతో కలసియున్న మేఘమువలె ప్రకాశించుచున్నవి. ఇట్టి పీతాంబరము మన మనస్సులను పానము చేయుచున్నది – అని శ్లోకభావము.

ఇచట పీతాంబరశబ్దమునకు అనుగుణముగా "**పిబతి**" అను క్రియ ప్రయోగింపబడినది. "**పీత**"అను శబ్దమునకు పానము చేయబడినదను అర్థము కలదు. ఆకాశమునే పానముచేసిన స్వామి పీతాంబరమునకు మన మనస్సులు ఒక లెక్కయా!

రంగధురంధరుడగు మహానటుడు బహువిచిత్రవేషధారణను చేయుచున్నాడు. స్వర్ణకాంతితో పరివృతమగు సముద్రమువలె, సంధ్యాకాల నీలమేఘబృందమువలె, విద్యుల్లేఖాపరివృతమగు కృష్ణమేఘమువలె వేషములను దాల్చి, ఆశ్రితులు అను ప్రేక్షకులను రంజింపజేయుచున్నాడు – అని ఈ శ్లోకమున ధ్వనించుచున్నదని గోపాలాచార్యవ్యాఖ్యానమున తెలుపబడినది.

మొదటి పాదమున "**పరివేషమ్ ఇవ**" అను పాఠాంతరము కలదు. ఈ పాఠమునుబట్టి శ్లోకములోని దృష్టాంతములను ద్వితీయా విభక్త్యంతములుగా అన్వయింపవలెను. మఱియు, "**మనః**" అను పదమును కర్తగా అన్వయింపవలెను. అపుడు, సముద్రముయొక్క సువర్ణపరివేషమువలె, కాలమేఘమునందలి మెఱపు తీగలవలె, సంధ్యాసమయమున ఆకాశమునందలి. ఎఱ్ఱని మేఘములవలె ఉన్న పీతాంబరమును మన మనస్సులు పానము చేయుచున్నని – అని భావము.

ఈ అన్వయమున పీతాంబరపదము మిగుల అన్వర్థకము. "మనస్సును పానము చేయుట" అనునపుడు, "**లోచనాభ్యాం పిబన్నివ**", (రా. యు. 19-6) (రెండు కళ్ళతో తాగుతున్నవానివలె) అను శ్రీరామాయణసూక్తి స్మరణీయము.

పీతాంబరము వస్త్రవిశేషమే కానీ, ఆభరణము కాదుకదా. ఇక్కడ దీనిని ఆభరణముగా భట్టర్ పలుకుటలో ఏమి ఉద్దేశ్యము? అనినచో, ఆఴ్కియమణవాళ ప్పెరుమాళ్ నానాయనార్ అను ఆచార్యులు "**అమలనాది పిరాన్**" దివ్యప్రబంధములోని శ్రీరంగనాథుని పీతాంబరమును వర్ణించు "**అన్దిపోల్ నిఱత్తాడైయుమ్**"(3) (సంధ్యవంటి వర్ణమును కల్గిన పీతాంబరమును) అను చోట వ్యాఖ్యానించుచు, శ్రీరంగనాథుని పీతాంబరము సంధ్యాసమయమున నల్లని మేఘమును కల్గిన ఎఱ్ఱని ఆకాశమువలె ఉన్నదనుట ఇచట స్మరింపదగినది. పెరియాఴ్వార్ తిరుమొఴిప్రబంధములోని "**పొన్నియల్ కిణ్ కిణి**" (1-8-1) అను పాశురమున "**మిన్నియల్ మేకమ్**" అనుచు పలు విధములైన ఆభరణముల శోభతో కూడిన శ్రీకృష్ణుని స్తుతించిరి. భగవద్రామానుజులు శరణాగతిగద్యలో "**పీతాంబరకాంచీగుణనూపురాద్య పరిమితదివ్యభూషణ**" అనుచు పీతాంబరమును అభరణకోటిలోనికి చేర్చిరి. కావున, పీతాంబరమును ఆభరణకోటిలో ఒకటిగా ఆచార్యులు భావించిరనుట స్పష్టము. ఈ గద్యసూక్తిని వేదాంతదేశికుల ఆచార్యులు వ్యాఖ్యానించుచు, "**పీతాంబరస్య భూషణత్వోక్తిః శోభాతిశయహేతుత్వ–అనర్ఘత్వాద్యభిప్రాయా**" (పీతాంబరమును భూషణముగా పలుకుట – అది భగవంతునకు గొప్ప శోభను కలుగ జేస్తున్నది అని, లెక్క కట్టడానికి సాధ్యం కాని విలువను కలిగినది అనే ఉద్దేశ్యంతో)– అని సమర్థించుచు, అందులకు ప్రమాణముగా భారతము ఉద్యోగపర్వములోని.

**"అతసీపుష్పసంకాశః పీతావాసా జనార్దనః।**
**వ్యభ్రాజత సభామధ్యే హేమ్నీవోపచితో మణిః" (భార. ఉ. 94-65)**

(అగిసె పూల కాంతి వంటి కాంతిని కలిగినవాడు, పీతాంబరాన్ని ధరించినవాడు అయిన శ్రీకృష్ణుడు సభ మధ్యలో బంగారం మధ్యలో పొదిగిన నీలమణివలె ప్రకాశించాడు) అను శ్లోకమును ఉట్టంకించిరి. ఈ శ్లోకమున పీతాంబరమును దాల్చిన శ్రీకృష్ణుని బంగారమున పొదిగిన నీలమణితో పోల్చుటచే, పీతాంబరముకూడ బంగారమువలె ఆభరణమని ఏర్పడుచున్నదికదా!

పాంచరాత్రశాస్త్రము కూడా "**స్రగ్వస్త్రాభరణై ర్యుక్తం స్వానురూపై రనూపమైః, —అన్యోన్య రుచి రంజకై**" అని భగవానుని వస్త్రములు కూడా చిన్మయములని, ఆభరణములు వంటివేనని తెలిపినది.

నమ్మాళ్వారులును తిరువాశిరియ దివ్యప్రబంధమున "**శెక్కర్ మాముకిల్ ఉడుత్తు**" (1) (ఎర్రని, అందమైన మేఘం అనే పీతాంబరాన్ని ధరించి) అని పీతాంబరమును ఎఱ్ఱని మేఘముగా ఉత్ప్రేక్షించుట ఇచట స్మరణీయము. కావున, భట్టరు ఇచట పీతాంబరమును ఆభరణకోటిలో చేర్చిరని చెప్పనగును. ఇందు వృత్తము వసంతతిలక.

## శ్రీరంగనాథుని మోకాళ్లు రెండు కాంతి ఆవర్తములు

**121. వైభూషణ్యాం కాంతి రాంగీ నిమగ్నా**
**విష్వగ్ద్రీచీ క్వాపి సోన్మాదవృత్తిః |**
**జానే జానుద్వంద్వవార్తావివర్తౌ**
**జాతః శ్రీమద్రంగతుంగాలయస్య ॥**

**ప్ర. అ.** – శ్రీమత్ రంగతుంగ ఆలయస్య = శ్రీరంగమను గొప్ప ఆలయమును కల్గిన శ్రీరంగనాథునియొక్క, వైభూషణ్యాం = ఆభరణములకు చెందిన కాంతిలో, నిమగ్నా = మునిగిన, ఆంగీ = అవయవముల, కాంతిః = శోభ, విశ్వగ్ద్రీచీ = అంతట వ్యాపించినదై, క్వ అపి = ఒకచోట, స ఉత్ మాదవృత్తిః = ఉన్మాదవ్యాపారముతో కూడినదై (క్షోభమును పొందినదై), జానుద్వంద్వ =

రెండు మోకాళ్లు అను, వార్తా = శబ్దముయొక్క (తో), వివర్తః = పరిణామముగా (సుడులుగా), జాతః = అయినది అని, జానే = తలంతును.

**వరివస్య :–** ఇందు శ్రీరంగనాథుని మోకాళ్లను రెండిటిని కవి ఉత్ప్రేక్షించుచున్నారు. శ్రీరంగనాథుని మోకాళ్లు రెండును గుండ్రనివై, సుడులవలె ఉండుట శుభలక్షణము. కావున, వానిని రెండు ఆవర్తములవలె కవి ఉత్ప్రేక్షించుట ఇందలి విశేషము.

కూరేశులు వైకుంఠస్తవమున–

**"అంగీ నిసర్గనియతా త్వయి హంత! కాంతిః**
**నిత్యం తవాల మియ మేవ, తథాపి చాన్యా,**
**వైభూషణీ భవతి కాంతి రలంతరా సా"** (73)

(స్వామీ! నీ శరీరకాంతి సహజమైనది. ఇదే ఎల్లప్పుడూ నీ అనుభవానికి చాలు. అది ఎంత ఆనందాన్ని కలిగిస్తుంది! అయినా, ఇంకొక ప్రసిద్ధమైన నీ ఆభరణాలకు సంబంధించిన కాంతి మిక్కిలి పర్యాప్తంగా ఉన్నది) అనుచు భగవానునియందు అవయవ సౌందర్యము అను కాంతిప్రవాహము, పలు విధములైన ఆభరణముల కాంతిప్రవాహము – అను రెండు గొప్ప కాంతి ప్రవాహములు ప్రవహించుచున్నట్లు పల్కిరి. భట్టరు ఈ శ్లోకమున అట్టి ప్రవాహముల కలయికవలన ఏర్పడు ఆవర్తములనుగూర్చి పల్కుచున్నారు. రెండు ప్రవాహములు కలసినప్పుడు సుడులు ఏర్పడునుకదా!

శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహమున రెండు విధములైన కాంతి ప్రవాహములు కలవు. శ్రీపాదములు మొదలు శిరస్సు వరకు గల దివ్యావయవములలో ప్రవహించు సౌందర్యప్రవాహ మొకటి. కిరీటమకుటాది సకలాభరణములయొక్క కాంతిప్రవాహము వేరొకటి. వీనిలో, దివ్యాభరణముల కాంతిప్రవాహములో అవయవకాంతిప్రవాహము మునిగి, బయటకు ప్రవహింపలేకపోయినది. తత్ఫలముగా లోలోపల ప్రవహించుచున్న అవయవశోభాప్రవాహములో రెండు ఆవర్తములు ఏర్పడెను. పరిమితమైన చోట

అపరిమితమైన ప్రవాహములు కలసినపుడు కల్గు క్షోభచే సుడులు ఏర్పడును. అట్లే, భగవానుని దివ్యదేహమున ఏర్పడిన సుడులే రెండు మోకాళ్లరూపమును పొందినవి – అని తలంతును – అని శ్లోకభావము.

నిజమునకు జానుద్వంద్వము లేదు, అవయనకాంతి ప్రవాహము భ్రమించుచు, ఒకచోట అడ్డగింపబడుటచే ఏర్పడిన సుడులే జానుద్వంద్వమయినవి కాబోలు! అనునది ఇచటి అద్భుతమైన సంభావన. శ్లోకములోని "**జానే**" అను క్రియ ఉత్ప్రేక్షాసూచకము, లేక, "**జానే**" అనుటకు ఇది ఊహ కాదు, నిజమే – అను అర్థమును చెప్పవచ్చును.

ఇందు వృత్తము శాలిని. ఆభరణముల కాంతి ఆవర్తములుగా మోకాళ్ళను రెండిటిని కీర్తించు ఈ శ్లోకము "కీర్తించు స్వభావమును కలిగినది" అను అర్థమును ఇచ్చు శాలినీ వృత్తమున కోర్పబడుట విశేషము

## శ్రీరంగనాథుని పిక్కలు – శ్రీదేవి , భూదేవుల లీలా పద్మముల నాళములు

**122. శ్రీరంగేశయజంఘే శ్రీ భూమ్యామర్శహర్షకంటకితే |**
**తత్కేళినళినమాంసల– నాళద్వయలలిత మాచరతః ॥**

**ప్ర. అ. –** శ్రీ = లక్ష్మీదేవియొక్క భూమీ = భూదేవియొక్క, ఆమర్శ = పాదసంవాహనమువలన ఏర్పడిన, హర్ష = ఆనందమువలన, కంటకితే = గగుర్పాటును కల్గిన, శ్రీరంగేశయ = శ్రీరంగనాథునియొక్క, జంఘే = పిక్కలు, తత్ = ఆ లక్ష్మీదేవియొక్క భూదేవియొక్క, కేళి = విలాసముకొఱకైన, నళిన = = తామరపూలయొక్క మాంసల = బలిసిన, నాళద్వయ = రెండు కాడలయొక్క, లలితం = విలాసమును, ఆచరతః = అచరించుచున్నవి.

**వరివస్య :–** శ్రీరంగనాథుని పిక్కలు (జంఘలు) ఇందు వర్ణింపబడుచున్నవి. శ్రీరంగనాథ భగవానుని శ్రీపాదములను "**వడివిణై యిల్లా మలర్ మకళ్ మ*ఱ్ఱైయ* నిలైమకళ్ పిడిక్కుమ్ మెల్లడియై**" (తి. వా. –9–2–10) (సాటి లేని రూపాన్ని

కలిగిన లక్ష్మీదేవి, భూదేవి మెల్లిగా సంవాహనం చేసే మృదువైన పాదాలను) అని నమ్మాళ్వార్లు స్తుతించిన విధముగా, శ్రీదేవి, భూదేవు లిరువురు భగవానుని పాదములను "అకందిపోవునో! ఏమో!" అని సంకోచించుచు, మెల్లగ సంవాహనము చేయుదురు. అపుడు వారి కరస్పర్శచే స్వామి జంఘులకు గగుర్పాటు కల్గును. ఇట్లు రోమాంచితమైన జంఘులు, శ్రీదేవి, భూదేవుల విలాసమునకు ఉపయోగపడు. పాదములను పద్మములయొక్క బలిష్ఠములైన నాళముల (కాడల) వలె ఉన్నవి. పిక్కలపై ఏర్పడిన రోమాంచము తామరకాడల కుండు నూగువలె ఉన్నది – అని శ్లోకభావము.

కూరేశులు సుందరబాహుస్తవమున,

**"అధోముఖన్యస్తపదారవిందయోః,**
**ఉదంచితోదాత్తసునాళసన్నిభే, విలంఘ్య జంఘే" (61)**

(వనాద్రికి ప్రభువైన సుందరబాహుస్వామియొక్క అధోముఖంగా నిలుపబడిన పాదారవిందాల పిక్కలు – గుండ్రని, విశాలమైన, చక్కని తామరతూడులతో సమానంగా ప్రకాశిస్తున్నాయి. అటువంటి ఆ రెండు పిక్కలను దాటి నా మనస్సు ఎక్కడికి పోవడం లేదు) అనుచు భగవానుని పిక్కలను తలక్రిందుగా నున్న పాదములు అను పద్మములయొక్క కాడలతో పోల్చుటనుబట్టి ఈ శ్లోకమున భట్టరు పై ఉత్ప్రేక్షను పల్కిరని చెప్పనగును.

**"వృత్తానుపూర్వే చ న చాతిదీర్ఘే"** (1 వ సర్గ) (గుండ్రంగా ఉన్నవి, మిక్కిలి పొడుగుగా లేనివి) అను కుమారసంభవశ్లోకము ఇచట స్మరణీయము.

మాంసలమనగా, వృత్తాకారమున, విస్తృతమైయున్నదని భావము, లక్ష్మీదేవికి కేళీనళినము నిత్యము, భూదేవికి కాదాచిత్కము కావున, ఇచట లక్ష్మీదేవికి నళినము ప్రధానముగా పేర్కొనబడినది – అని శ్రీరామానుజాచార్యవ్యాఖ్యలో కలదు. ఇందు వృత్తము ఆర్య.

**శ్రీ రంగనాథుని చరణములు ఎఱ్ఱని పద్మములు**

123. **వందారుబృందారకమౌళిమాలా–**
**యుంజానచేతఃకమలాకరేభ్యః ॥**
**సంక్రాంతరాగా వివ పాదపద్మౌ**
**శ్రీరంగభర్తుః మనవై నవై చ ॥.**

**ప్ర. అ.** – వందారు = నమస్కరించు, బృందారక = దేవతలయొక్క, మౌళిమాలా = కిరీటముల వరుసలు, యుంజానచేతః = యోగుల మనస్సులు, కమలాకరేభ్యః = లక్ష్మీదేవి కరములు –- అను వీనినుండి, సంక్రాంత = సంక్రమించిన (సోకిన), రాగా = ఎఱ్ఱని రంగును కలిగినవి, ఇవ = వలె ఉన్న, శ్రీరంగభర్తుః = శ్రీరంగనాథునియొక్క పాదపద్మౌ = పద్మములవంటి పాదములను, మనవై = ధ్యానింతును, నవై = స్తుతింతును కూడ.

**వరివస్య :–** పాదములు ఎఱ్ఱగా ఉండుట సహజము. శ్రీరంగనాథుని పాదములు ఎఱ్ఱగా ఉండుటకు ఇందు భట్టరు ఒక మనోహరమైన హేతువులను ఉత్ప్రేక్షించుచు, స్తుతించుచున్నారు.

తనకు శిరోవందనమును చేయు దేవతల కిరీటములలో పొడగబడిన రత్నములకాంతి సంక్రమించుటచే శ్రీరంగనాథుని పాదములు ఎఱ్ఱగా మారినవి – అనుట మొదటి హేతువు. ఇచట రాగశబ్దమునకు– ఎఱ్ఱని రంగు – అని అర్థము.

నమ్మాళ్వార్లు మొదలగు మహాయోగుల హృదయపుండరీకములలో భగవానుడు స్థిరనివాస ముండును. "**జంగమశ్రీవిమానాని హృదయాణి మనీషిణామ్**" (మహాత్ముల హృదయాలు భగవానుడు వేంచేసి ఉండే గొప్ప జంగమ విమానాలు) అను సూక్తి ప్రసిద్ధమేకదా! భగవానుడు దివ్యదేశములలో వెలసియుండుటలోని ఆంతర్యము భక్తుల హృదయనివాసమును పొందుటకొఱకేనని అభియుక్తులగు ఆచార్యులు వచించిరి. "**అఙ్గుత్తై వాసమ్ సాధనమ్, ఇఙ్గుత్తై వాసమ్ సాధ్యమ్**" (171) (భగవానుడు దేవాలయములలో

భగవానుడు నివసించడం అనేది ఉపాయం, భక్తుల హృదయాలలో నివసించడం సాధ్యం) అను శ్రీవచనభూషణసూక్తి, అచటి శ్రీమణవాళమహామునుల వ్యాఖ్యయు ఇచట స్మరణీయములు. కూరేశులును వరదరాజస్తవమున–

**"భక్తానాం యద్వపుషి దహరం పుండరీకమ్"** (59)

అను శ్లోకమున భగవానుని ఉద్దేశించి, "స్వామీ! నీ పాదములకు మిక్కిలి సుఖమును కల్గించునది భక్తుల హృదయపుండరీకమా? లేక, ఆసనపద్మమా? లేక, వేదమా? లేక, శఠారి యోగిశిరమా? లేక, హస్తిగిరియా? తెలుపుము" అని పలుకుచు చమత్కరించిరి. కావున, భక్తుల హృదయపుండరీకములలోని రాగమువలన, అనగా, భక్తివలన భగవానుని పాదములు ఎఱ్ఱగా మారినవి. ఇది రెండవ హేతువు. ఇచట రాగశబ్దమునకు అనురాగము (భక్తి) అని అర్థము.

లక్ష్మీదేవి భగవానుని పాదములను ఒత్తుచుండును. ఆమె చేతులు ఎఱ్ఱగా ఉండుటచే, ఆ చేతుల ఎఱ్ఱదనము స్వామిపాదములకు సోకి, అవి ఎఱ్ఱగా అయినవి. లేక, లక్ష్మి కమల, స్వామిపాదములు పద్మములవంటివి. సజాతీయములగు పద్మముల విషయమున లక్ష్మికి అనురాగము ఉండుట సహజము. కావున స్వామిపాదపద్మములు రాగరంజితములు. ఇది మూడవ హేతువు.

ఈ శ్లోకమున యోగుల హృదయములోని రాగము స్వామిపాదములందు సంక్రమించెనని భట్టరు పల్కుటకు కూరేశుల అతిమానుషస్తవమున గల –

**"శ్రీమత్పరాంకుశమునీంద్రమనోనివాసాత్**
**తజ్జానురాగరసమజ్జన మంజసా౽ ప్య,**
**అద్యాప్యనారత తదుత్థితరాగయోగం,**
**శ్రీరంగరాజచరణాంబుజ మున్నయామః"** (3)

(భగవత్కైంకర్యలక్ష్మిని కల శ్రీశఠకోపుల మనస్సులో ఎల్లప్పుడూ నివసించడంవలన, ఆ మనసులో పుట్టిన భగవంతుని విషయంలోని అనురాగమను రసములో స్నానమును వేగంగా పొంది, ఏనాటికీ విచ్ఛేదము లేని ఆ అనురాగము వలన ఏర్పడిన ఎఱ్ఱదనముతో సంబంధం కలిగిన శ్రీరంగనాథుని పాదపద్మముల జంటను శిరసా వహిస్తున్నాను) అను శ్లోకము మూలము.

**"కమలాకరేభ్యః సంక్రాంతరాగౌ"** అను ఈ భావమును వేదాంతదేశికులు **"మలర్మకళ్ కైవరుడ మలర్ పోదిల్చివన్దన"** (లక్ష్మీదేవి సంవాహనం చేయగా తామర పువ్వులవంటి శ్రీరంగనాథుని పాదాలు ఎఱ్ఱబడినవి) (దేశిక ప్రబంధమ్) అనుచు అనువదించిరి. ఇట్టి రాగరంజితములైన పాదపద్మములను ధ్యానింతును, స్తుతింతును – అని శ్లోకభావము.

"**యోగిమనోయుక్తత్వేన, లక్ష్మీకరతలలాలిత్వేన చ మనవై, న పాదాంభోజమాత్రమననం, సర్వవిశిష్టత్వేన మననమ్**" (యోగుల మనస్సులలో నిలచినవిగా, లక్ష్మీదేవి తన కరాలతో సంవాహనం చేసినవిగా శ్రీరంగనాథుని శ్రీచరణాలను భావిస్తాను. కేవలం పాదాంభోజమాత్ర మననం కాదు. వాటిలో ఉండే అన్ని విధాలైన వైలక్షణ్యాలతో మననం చేస్తాను) అను రసోక్తి శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో కలదు.

"**శ్రీరంగభర్తుః పాదపద్మౌ మనవై**" అనుటచే ద్వయమంత్రములోని పూర్వార్థమైన శరణాగతియు, "**నువై చ**"అనుటవలన ఉత్తరఖండార్థమైన కైంకర్యప్రార్థనయు తెలుపబడినవి. స్తుతించుట అనునది మంగళాశాసనమును చేయుటకు పర్యాయము, భగవానునకు మంగళాశాసనము చేయుట ప్రపన్నుని ప్రథమకర్తవ్యముకదా! "విపన్యవో జాగృవాంసః సమింధతే" (సుబాల, 8) (ఎల్లప్పుడూ భగవానుని స్తుతించడం అనేది స్వభావంగా కలిగిన నిత్యసూరులు జాగరూకులై ప్రకాశిస్తున్నారు) అని వేదమును భగవన్మంగళాశాసనము ప్రపన్నుని స్వరూపమును శోభిల్లజేయునని పల్కెను. ("విపన్యవ" అను శబ్దము "పన– – స్తుతౌ" అను ధాతువునుండి పుట్టినది.)

**"పాదపద్మౌ"** అనుటనే సౌందర్యలావణ్యాదులు, 'శ్రీరంగభర్తుః "అనుటచే స్వామిత్వ, జ్ఞాన, బలైశ్వర్యాది గుణములు, సూచింపబడినవి. కావున, ఇచట శ్రీరంగనాథుని శరణ్యత్వపూర్తి తెలుపబడినది.

**"యుజిర్– యోగే"** అనునది ఉభయపది ధాతువు. ఆత్మనేపదిరూపమున శానచ్ ప్రత్యయము చేరగా **"యుంజానః"** అను రూపము దానినుండి నిష్పన్నమగును. అనగా, **'యోగి'** అని భావము. "వందారు రభివందకే " అను నిఘంటువచనము వలన వందారుశబ్దమునకు ఇక్కడ భగవానుని స్తుతిని చేయు స్వభావము కలవాడని భావము. ఇట్టి స్వభావము నిత్యసూరులకే చెల్లును, కావున, ఈ పదమునకు నిత్యసూరులను అర్థమును చెప్పుట మిక్కిలి తగును. **"బద్ధాంజలిపుటా హృష్టా నమ ఇత్యేవవాదినః"** (భార. శాంతి. 344–45) (భగవానుని విషయంలో అంజలి బద్ధులై, అందువల్ల మనసులో ఆనందాన్ని పొందేవారై, **"నమః నమః"** అని నమఃశబ్దాన్ని పలికేవారై, శ్వేత ద్వీపవాసులు ఉన్నారు) అని కదా ప్రమాణము. ఈ ప్రమాణము శ్వేతద్వీపవాసులైన సనక సనందనాదులకు సంబంధించినది. అయినను, దీనిని నిత్యసూరివిషయముగా అన్వయించుకోవడంలో 'ఏమి విప్రతిపత్తి లేదు.

**"ణు–– స్తుతౌ"** అను ధాతువు పరస్మైపది. భట్టరు **"నవై చ"** అని ఆత్మనేపదిలో ప్రయోగించుటకు – ఆ పదమునకు ముందు ప్రయోగించిన **"మనవై"** అను క్రియాపదమునకు అనుప్రాసానుగుణమగునను అభిప్రాయముతోనా! అని కొందరు అభిప్రాయపడిరి. "నవై" అను ఆత్మనేపదప్రయోగము **"నవై–ఎన్గిఱ విడత్తిల్– ఆత్మనేపదమ్ కర్మవ్యతిహారత్తిల్, "విపన్యవః" ఎన్ఱు నిత్యసూరియోగ్యస్తుతియై తా మాశాసిత్త పడియాలే, కర్మవ్యతిహారత్తిల్ కుఱై ఇల్లై ఎన్ఱు కండుకొళ్వదు"** – ("నవై" అన్న ఉన్నప్పుడు ఆత్మనేపది ప్రయోగము కర్మవ్యతిహారమున చేయబడినదని, **"విపన్యవః"** అను నిత్యసూరియోగ్యమగు స్తుతిని కవి తాను ఆశించుటవలన కర్మవ్యతిహారమునకు ఇచట లోపము లేదని భావించవలెను )–అని శ్రీవాధూల

వీరరాఘవారాఘవాచార్య స్వామి వ్యాఖ్యానమున వివరింపబడినది. అంటే, నిత్యసూరులకు తగిన నిత్యమంగళాశాసనాన్ని తాము చేయాలని ఆశపడినందున, ఆత్మన్యర్థకముగా ఆత్మనేపది ప్రయోగము చేయబడినది, అందువల్ల ఈ ప్రయోగం సమర్థింపదగినది – అని భావము. రామానుజాచార్యవ్యాఖ్యలో ఈ ప్రయోగమును తిజంత ప్రతిరూపకమైన అవ్యయముగా గ్రహించదగినదని తెలుపబడినది. శిష్టప్రయోగసంగ్రహమను గ్రంథము ఈ రూపమును సమర్థించుచు, "**చాంద్రమతేనాత్ర పరస్మైపదోపపత్తిః, 'చాంద్రాదయ స్తు మన్యంతే సర్వస్మా దుభయం పదమ్' ఇతి న్యాయసుధోక్తేః.**" అని అధోజ్ఞాపికలో తెలుపబడినది. అందువల్ల, చాంద్రవ్యాకరణానుసారంగా ఈ ధాతువునకు ఆత్మనే పదిలో ప్రయోగాలు కూడా ఉన్నందున, ఆ సంప్రదాయం ప్రకారం, ఈ ప్రయోగం సాధువే అని భావము. ఇచటకూడ అట్లు సమర్థింప వీలున్నదని తోచును.

"**యుంజానచేతఃకమలాకరేభ్యః**" అనునపుడు. కమలాకరములవంటి, అనగా, సరస్సులవంటి యోగుల మనస్సులు – అనియు అర్థమును చెప్పవచ్చును. ఆళ్వార్ల మనస్సులు సరస్సులవంటివి అనుటకు "**ప్రసన్నశీతాశయమగ్ననాథాః**" అను ఈ స్తోత్రములోని భట్టరుసూక్తి స్మరణీయము.

"**తద్విప్రాసో విపన్యనో జాగృవాంసః సమిన్ధతే, విష్ణోః యత్ పరమం పదమ్**" అను శ్రుతివాక్యము భగవానుని పాదపద్మపరముగా యోజింతుము – అని శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో తెలుపబడినది. పై శ్రుతివాక్యము భగవానుని పాదముల విషయమున అన్వయింపవచ్చునని భట్టరు అభిప్రాయము అనుటకు తరువాతి శ్లోకము "**తద్విష్ణోః పరమం పదమ్**" అనుచు శ్రుతివాక్యఘటితమగుట ప్రమాణము.

ఇందు వృత్తము ఉపజాతికి చెందిన ఇంద్రవజ్ర. ఈ శ్లోకమున ఉత్ప్రేక్షానుప్రాణితమైన తద్గుణాలంకారము వ్యంగ్యము.

**శ్రీరంగనాథుని పాదము మనకు శ్రేయస్సును కలిగించాలి**

**124. యద్బృందావనపండితం దధిరవైః యత్తాండవం శిక్షితం**
**యల్లక్ష్మీకరసౌఖ్యసాక్షి జలజప్రస్పర్ధమానర్ధి యత్ ।**
**యద్భక్తేష్వ జలస్థలజ్ఞ మపి యద్దూత్య ప్రసంగోత్సుకం**
**తద్విష్ణోః పరమం పదం వహతు నః శ్రీరంగిణో మంగళమ్ ॥**

**ప్ర. అ. –** శ్రీరంగిణః = శ్రీరంగనాథుడను, విష్ణోః = విష్ణువుయొక్క, యత్ = ఏ పాదము, బృందావనపండితం = బృందావనమున సంచరించుటలో సమర్థమైనదో, యత్ = ఏ పాదముయొక్క, తాండవం = నర్తనవిశేషము, దధిరవైః = (రేపల్లెలో గొల్ల వనితలు) పెరుగును చిలుకునప్పుడు వచ్చు శబ్దముచే, శిక్షితం = శిక్షింపబడినదో, యత్ = ఏ పాదము, లక్ష్మి = లక్ష్మీదేవియొక్క, కర = చేతులయొక్క (చేతులవలన కల్గిన), సౌఖ్య = సౌఖ్యమునకు, సాక్షి = సాక్షి అయినచో, యత్ = ఏ పాదము, జలజ = తామరపూవుతో, ప్రస్పర్ధమాన = కలహించునట్టి, ఋద్ధి = సౌందర్యముయొక్క అతిశయమును కల్గినదో, అపి = మఱియు, యత్ = ఏ పాదము, భక్తేషు = భక్తుల విషయమున, అజలస్థలజ్ఞం = ఎత్తు పల్లములను (హెచ్చు తగ్గులను) ఎఱుగదో, యత్ = ఏ పాదము, దూత్యప్రసంగ = దౌత్యమును కొనిపోవు సందర్భమునందు, ఉత్సుకం = ఆసక్తిని కల్గినదో, తత్ = ఆ, పరమం = గొప్పదైన, పదం = పాదము, నః = మన, మంగళం = క్షేమమును, వహతు = నిర్వహించును గాక!

**వరివస్య :–** శ్రీరంగనాథుని పాదద్వంద్వమును శ్లోకద్వంద్వముతో స్తుతింపనెంచిన భట్టరు. ఇందు మొదటగా, పాదముల మాహాత్మ్యమును ఆఱు గొప్ప విశేషణములతో ప్రతిపాదించుచున్నారు. పూర్వశ్లోకమున "నవై" అనుచు స్తుతింపవలయునని కోరికను వెలిబుచ్చిన కవి, ఇందు శ్రీరంగనాథుని పాదములను స్తుతించుచున్నారు. పూర్వోదాహృత శ్రుతివాక్యమున "విపస్యవః" అనుటకు 'వి' అను ఉపసర్గబలముచే వివిధములగు, విచిత్రములగు స్తుతులను

చేయువారను అర్థముచెప్పు వీలున్నందున, ఇవట కవిచే అట్టి వివిధమైన, విచిత్రమైన స్తుతి చేయబడుచున్నది.

బృందావనసంచారమున సమర్థమైనది, రేపల్లెలో గొల్లవనితలు పెరుగును చిలుకునపుడు వచ్చు చప్పుళ్లచే నేర్పబడిన తాండవవిశేషమును కల్గినది, లక్ష్మీదేవిచేతికి కల్గు సుఖమునకు సాక్షియైనది, తామరపూవుతో స్పర్ధించునట్టి సౌందర్యాతిశయమును కల్గినది, భక్తుల విషయమున తారతమ్యములను గమనింపనిది, దూత్యమును వహించుటలో ఆసక్తిని కల్గినది అగు శ్రీరంగనాథుని మహనీయమైన శ్రీపాదము మన యోగక్షేమములను నిర్వహించునుగాక! – అని శ్లోకభావము.

శ్రీరంగనాథుని పాదము బృందావనపండితము. భగవానుడు సర్వజ్ఞుడు. కావున, ఆ స్వామిపాదముకూడ పాండిత్యమును పొందినది కాబోలు. ఆ పాదము. బృందావనసంచారమున పాండిత్యమును సంపాదించినది. పండితశబ్దమునకు "**పండా బుద్ధిః అస్య జాతా ఇతి పండితః**" అని, "**పండతే సంచరతి ఇతి పండితః**" అని రెండు వ్యుత్పత్తులు కలవు. ఈ రెండిటిని బట్టి – బృందావనమున గల బుద్ధిమంతుడని, బృందావనమున సంచరించువాడని అర్థములు వచ్చును.

ఒకనిని పండితుడని చెప్పిన, వెంటనే, ఆ వ్యక్తి ఎచట విద్యను నేర్చెనను ప్రశ్న ఉదయించును. అందులకు రెండవ విశేషణము సమాధానమును తెలుపుచున్నది. గొల్లపడుచులు పెరుగు చిలుకునపుడు వచ్చు శబ్దములచే శ్రీరంగనాథుని పాదము తాండవ శిక్షను పొందినది. శ్రీకృష్ణావతారమున భగవానుడు గోకులమున గొల్ల వనితలు పెరుగును చిలుకునపుడు వచ్చు శబ్దముల కనుగుణముగా నాట్యమాడెనట. ఆ శబ్దములు అనేకవిధములుగా నుండుటచే శ్రీకృష్ణుడును తాండవమున వివిధమైన, విశిష్టమైన శిక్షణను పొందెను.

వేదాంతదేశికుల గోపాలవింశతిలోని

**“దధ్నా నిబంధముఖరేణ నిబద్ధతాళం, నాథస్య నందభవనే నవనీతనాట్యమ్”** (4) (నందగోపాలుని ఇంటిలో శ్రీకృష్ణుడు ఆడిన నవనీత నాట్యం, గొల్లవనితలు పెరుగును చిలుకునప్పుడు పుట్టిన చప్పుళ్ళతో చక్కగా కుదిరిన తాళములను కలిగినది) అను శ్లోకరత్న మిచట అనుసంధేయము. “దధిరవైః” అను బహువచనప్రయోగస్వారస్యముచే భగవానుని పాదములు బహుశ్రుతములని ఏర్పడినది. “బహుశ్రుతుడు, పండితుడు” అను పదములు పర్యాయములుకదా! భగవానుని పాదముల తాండవపాండిత్యమునకు దధిమంథనరవమే ఆచార్యుడు. “తండు” అను మహర్షిచే ప్రోక్తమగుటచే నాట్యమునకు తాండవమని పేరు వచ్చినది. పాదములను నేలపై తాడనము చేయుచు నర్తింపబడును, కావున, తాండవమని పేరు వచ్చెననియు చెప్పవచ్చును.

ఉదాహరింపబడిన గోపాలవింశతి శ్లోకములోని **“నవనీతనాట్యమ్”** అనునప్పుడు, **“నవం నీతం చైతత్ నాట్యమ్”** అను వివరణమును వివక్షించినచో, గొల్లెతలు పెరుగును చిల్కునప్పుడు వచ్చిన శబ్దములు అనేక విధములుగా ఉండును కనుక, ఆ శబ్దములకు అనుగుణముగా అపుడు కృష్ణుడు చేసిన తాండవములు కూడా, నాట్యశాస్త్రములో అంతవరకు ఎక్కడా లేని, చెప్పబడని తాండవ విశేషములను కలిగివి అయ్యెను, అందువల్ల అది నవనీతనాట్యమయ్యెను – అను అర్థస్వారస్యము స్ఫురించును.

బృందావనమున సంచరించుటచే, గోపికలు పెరుగును చిలుకునపుడు వచ్చు. శబ్దములకు అనుగుణముగ తాండవ మాడుటచే భగవానుని పాదములు అలసటను పొందినవి. ఆ అలసటను పోగొట్టుటకై లక్ష్మీదేవి తన సుకుమారమైన చేతులతో ఆ పాదములకు సంవాహనము చేయును. ఈ విషయము మూడవ విశేషణమువలన వ్యక్తమగుచున్నది. లక్ష్మీదేవి అట్లు పాదసంవాహనమును చేయునపుడు, ఆమెచేతుల స్పర్శచే భగవానుడు గొప్ప ఆనందమును పొందును. అట్టి ఆనందమునకు అవి సాక్షులు. (లేదా) లక్ష్మీదేవి పాదసేవను చేయునపుడు ఆమె చేతులకు గొప్ప ఆనందమును స్వామి పాదములు

కల్గించినవి. అట్టి ఆనందమునకు స్వామిపాదములు సాక్షీభూతములు – అనియు చెప్పవచ్చును.

సహజమైన కాంతి, చల్లదనము, పరిమళము, సౌకుమార్యము, నిత్యరమణీయత మొదలగు విశిష్టగుణములచే స్వామిపాదములు తామరపూవును జయించినవి. "**కట్టురెక్కిల్ తామరై నిన్ కణ్ పాదమ్ కై ఒవ్వా**" (తి. వా–3–1–1) (వివరించి పలికినట్లయితే, తామర పువ్వు నీ కన్నులకు, పాదాలకు, చేతులకు సాటి రాదు) అని నమ్మాళ్వార్లు పల్కిరి. "**ప్రస్పర్ధమాన**" అనునపుడు, "**ప్ర**" అను ఉపసర్గబలము తామరపూవునకు స్వామిపాదమునకు జరిగిన స్పర్థలో స్వామిపాదము అవలీలగా జయించెనను భావమును ధ్వనింపజేయుచున్నది.

ఋద్ధిశబ్దము పాదముల సౌకుమార్యశోభాసౌగంధ్యాది మహిమను తెలుపును. "**త్వత్పాదద్వితయస్య దాస్య మపి న ప్రాప్నోతి పంకేరుహమ్**" (నాయకి పాదాల జంటకు సేవను చేయడానికి కూడా తామర పువ్వు యోగ్యత కలిగినది కాదు) అని బిల్హణకవి ఒక లౌకిక స్త్రీ విషయమున పల్కెను, అనగా, ఇక, అలౌకికమైన, దివ్యమైన భగవానుని పాదములనుగూర్చి చెప్పవలసినది ఏమున్నది!. "అయ్యో! ఈ పాదముయొక్క కాఠిన్యము ఏమనవచ్చును? తామరపూవులో పుట్టిన లక్ష్మీదేవి సంవాహనము చేయుచుండగా, సౌఖ్యమును పొందు. స్వామిపాదము తామరపూవుతో స్పర్ధించుటయా? ఇది ఏమి?" అను విశేషార్థమును ఇచట వ్యంగ్యరూపమున ఏర్పడుచున్నది

భక్తులపట్ల "**ఇతడు ఉన్నతుడు, ఇతడు అధముడు**" అను ఏ భేదమును స్వామిపాదము గణింపక, అందరిని నిర్హేతుకముగా దయచేసి, శరణమగుచున్నది. భక్తిని కల్గియుండువాడు ఎట్టివాడైనను, అతని జన్మవృత్తాంతము లేమియు భగవత్కృపకు కారణములు కాని, నిరోధకములు కాని కావు. "**నిషాదానాం నేతా కపికులపతిః కాపి శబరీ కుచేలః కుబ్జా సా వ్రజయువతయోః మాల్యకృదితి, అమీషాం నిమ్నత్వం. ––ప్రసభ మనుకంపే!**

**సమయసి**"(65) (ఓ వేంకటేశ్వరుని దయాదేవీ! నిషాదులకు ప్రభువు అయిన గుహుడు, వానరకులపతి అయిన సుగ్రీవుడు, ఎక్కడో చాలా తక్కువ కులంలో పుట్టిన శబరి, కుచేలుడు, కుబ్జ, రేపల్లెలోని వనితలు – అనే వీరి తక్కువదనంన, వేంకటేశ్వరుని గొప్పదనానం – ఈ రెండిటిని వేగంగా నీ ప్రవాహాల ద్వారా సమం చేసి, వారిని అందరిని స్వామి కరుణకు పాత్రంగా చేస్తున్నావు) అను దయాశతకములోని శ్లోకమును, "**వేడన్, వేడువిచ్చి, పక్షి, కురఙ్గు, చరాచరమ్, ఇడైచ్చి, ఇడైయర్, తయిర్, గూని, మాలాకారర్, పిణవిరున్దు వేణ్ణడిశిలిట్టవర్ అవన్మకన్, అవన్ తమ్బి, ఆనై, అరవమ్, మట్రైయాళన్, పెత్తమైన్దన్ ఆకిఱ పదినెట్టునాడన్ పెరుజ్యాట్టమ్ నడన్దు మాప్తనై వழி త్తుణై యాక్కి**" (చూర్ణిక–228) (గుహుడు, శబరి, జటాయువు, సుగ్రీవుడు, అయోధ్యా నగరంలోని చరాచరాలు, చింతయంతి, దధిభాండుడు, పెరుగు బాన, కుబ్జ, మాలాకారుడు, ఘంటాకర్ణుడు, ప్రహ్లాదుడు, విభీషణుడు, గజేంద్రుడు, కాళీయుడు, సుముఖుడు, గోవిందస్వామి, మార్కండేయుడు– అను ఈ 18మందిని అర్చిరాది మార్గం ద్వారా తీసుకుని పోయే ఆప్తుని మార్గంలో సహాయంగా చేసుకొని) అను ఆచార్యహృదయసూక్తిని ఇచట స్మరింపదగును.

జలజము జలముననే రూఢమై యుండవలెను. కాని, స్వామిపాదము అను జలజము జలమున, స్థలమునను రూఢమూలము – అను అందమైన ధ్వని "**అజలస్థలజ్ఞమ్**" అను పదముచే భాసించును. స్వామిపాదము జలజమును ఓడించుటలో ఇది ఒక హేతువు.

భగవానుని శ్రీపాదము దూత్యప్రసంగమున ఆసక్తిని కల్గినది. అనగా, స్వామిపాదము ఉచ్చనీచగణనను చేయకుండుట వ్యక్తుల విషయముననే కాక, వ్యాపారములయందుకూడ – అని భావము. ఈ సందర్భమున ఈ క్రింది ఐతిహ్యము ఉట్టంకింపదగినది.

భట్టరుకు శ్రీరామావతారమున అభినివేశము మెండు. "**శిఱియాత్తాన్**", అను ఆచార్యులు భట్టరు పల్కు రసోక్తులను వినగోరి, ఒకనాడు వారి వద్దకు

వచ్చి, "స్వామీ! చక్రవర్తికుమారుడగు శ్రీరామునకు ఎన్నో విధములైన అతిశయములున్నను, "ఆశ్రితులకొఱకు దూతగా పోయెను" అను అధిక్యము లేదుకదా! అట్టి గొప్పతనము ఒక్క శ్రీకృష్ణునికే కలదు కదా!" అని పల్కిరి. వెంటనే భట్టరు, "అయ్యా! గుణసాగరుడగు శ్రీరామునకు ఆశ్రితార్థమై దూతగా పోవుట కూడ సమ్మతమే, కాని, ఇక్ష్వాకువంశమున ప్రభవించిన చక్రవర్తి అగుటచే ఆ స్వామిని దూతగా పొమ్మనువారు లేరైరి కదా! అదియే ఇందులకు కారణము. ఆ అవతారమున హనుమానుడు అంకకు, లంకనుండి కిష్కింధకు దూతగా పోయి, వచ్చుటవలన అతడు పొందిన గౌరమును చూచిన పిమ్మట శ్రీరాముడు "నేను కూడ ఇట్లు ఆశ్రితులకొఱకు దూతగా పోలేకపోయితినే!" అను కొఱతను మనస్సున పొందెను. ఆ కొఱతను తీర్చుకొనుటకై కాబోలు!, పిమ్మట క్షత్రియకులములోని తక్కువ కులమున (యాదవకులమున) శ్రీకృష్ణునిగా అవతరించి, పాండవులకు దూతగా పోయెను. తాను క్షత్రియుడని తెలిసినచో, తనను దూతగా పొమ్మనరేమో! అను ఉద్దేశ్యముతోనే నందకులమున పెరిగెను. తన వివరములు తెలియకుండునట్లు రేపల్లెలో పెరిగెను కాబోలు! అభిషిక్తక్షత్రియవంశమున జన్మించినచో, దూతగా పొమ్మని సాహసించువారు ఎవ్వరు ఉండరని భావించెనేమో కదా!" అని చమత్కారపూర్వకముగా సమాధానమును పల్కిరి.

ఈ ఐతిహ్యము దివ్యప్రబంధవ్యాఖ్యానములలో, వార్తామాలైవంటి సంప్రదాయ చరిత్ర గ్రంథములలో కానవచ్చుచున్నది. తిరుమఙ్గై మన్నన్ "**తూదు వానరరత్తిన్ వాయిల్ మొழிన్దు, అరక్కన్ మన్నూర్ తన్నై వాళియినాల్ మాళ మునిన్దవనే, పిన్నోర్ తూదు ఆదిమన్నర్ క్కాగి పెరునిలత్తార్ ఇన్నార్ తూదనెన నిన్దాన్**" (పెరియ. తి. -2-2-3) (త్రేతాయుగంలో సీతాదేవిని విశ్లేషించినందువల్ల కలిగిన ఆర్తిచేత సముద్రంలో ప్రవేశించి మరణించే దశలో శ్రీరాముడు ఒక వానరం ద్వారా సందేశాన్ని చెప్పి పంపించాడు. రావణునకు చెందినది, దేవతల వద్ద నుండి పొందిన వరబలం వల్ల ఎవరికీ ముట్టడించటానికి

సాధ్యం కాని లంకను ఒక బాణంతో నశించేటట్లు కోపించాడు. ఇతడే శ్రీకృష్ణుడుగా అవతరించి, క్షత్రియలైన పాండవులకు దూతయై, విశాలమైన లోకంలో ఉండేవారు అందరు "ఇతడు పాండవదూత" అని పలుమార్లు అని పలికిన తరువాత మనసులో స్థైర్యాన్ని పొందాడు) అను పాశురమును అనుసరించి భట్టరు ఇచట "**దూత్యప్రసంగోత్సుకమ్**" అను విశేషణమును జోడించిరి.

పై పాశురమున "**ఇన్నార్ తూడనెనప్పట్టాన్**" (వీరి దూత – అని అనబడెను.) అనికాక, "**ఇన్నార్ తూదనెన నిన్టాన్**" ("వీరి దూత" అని అనగా, మనసులో తృప్తి చెందెను) అనుటచే "**పాండవదూత**" అను పేరును పొందిన పిమ్మటనే భగవానునకు మనస్సున కొఱత తీరి, ఊరట కల్గెను – అను ధ్వన్యర్థము వచ్చును. ఇట్టి అర్థమే "**ఉత్సుకమ్**" అను పదముద్వారా ప్రస్తుతమున తెలుపబడినది. దేశికులు "**కాలే దూత్యద్రుతతరగతిమ్**" (3) అని భగవద్ధ్యానసోపానమున పల్కుటకూడ ఇచట స్మరణీయము.

"**దూత్యప్రసంగోత్సుకమ్**" అను ప్రయోగములోని రామణీయకత వర్ణనాతీతము, భగవానుడు తన పాదమును చూచి, "ఓ పాదమా? దేవతల తలపై నిలువదలచితివా! లేక, భక్తులకొఱకై దూతగా పోవుటకు ఇష్టపడుదువా?" అని ప్రశ్నించినచో, పాదము, దూతగా పోవుటయే అలభ్యలాభముగా తలచి, దానియందే ఆసక్తిని చూపునట. ఆ సమయము తనకెప్పుడు లభించునో! అని అది ఎదురుచూచుచుందునట. ఇట్టి రస్యమైన భావము శ్రీ. ప్ర. భ. అణ్ణంగరాచార్యస్వామి వ్యాఖ్యానమున చూపబడినది. ఈ భావముకూడ ఉత్సుకశబ్దమువలననే ధ్వనించును. "**దూత్యప్రసంగప్రియమ్**", (అత ఏవ) విష్ణోః పదం పరమమ్" అను అన్వయమువలన దూత్యము చేయుటవలన విష్ణుపాదము ఉత్తమమైనది – అను విశిష్టమైన భావము ప్రతీతమగును. ఇట్లు ఉచ్చనీచములలో సర్వత్ర వ్యాప్తము కానిచో విష్ణుపాదము కాదుకదా! విష్ణుశబ్దము వ్యాపనశీలత్వమును తెలుపును కదా! "**విష్ణోః శ్రీరంగిణః**" అని కాని,

**"శ్రీరంగిణః విష్ణోః"** అని కాని అన్వయింపవచ్చును. మొదటి అన్వయమున, విష్ణువు కంటె వేరు కాని శ్రీరంగనాథునియొక్క – అని, రెండవ అన్వయమున, శ్రీరంగనాథుని రూపములోనున్న విష్ణువుయొక్క – అని అర్థము.

ఇట్టి విశిష్టమైన శ్రీరంగనాథునియొక్క పాదము **"యోగక్షేమం వహామ్యహమ్"** అను మాటను మా విషయమున సార్థకము చేయునుగాక! అనునది సారాంశము. శ్రీకృష్ణచరమశ్లోకములోని **"వహ"** ధాతువునే భట్టరు ఈ శ్లోకమున ప్రయోగించుటను గమనింపవచ్చును. ఉపసర్గార్థము ధాతువునందు లీనమైయుండునను సంస్కృభాషా సంప్రదాయమునుబట్టి **"వహతు – నిర్వహతు, ప్రవహతు"** అనగా, మంగళమును నిర్వహించుగాక, అని, బహుముఖములుగా శుభమును విస్తరింపచేయునుగాక (అనగా, నిత్యకైంకర్యరూపనుగు శ్రేయస్సును విస్తరింపచేయునుగాక) అను విశేషార్థములు స్ఫురించును.

★ **"యత్ బృందావన పండితం, యత్ తాండవం శిక్షితం, యద్ద్యూత ప్రసంగోత్సుకమ్"** అను విశేషణములు మూడును కృష్ణావతారసమాధితో కవి పల్కిరని చెప్పనగును. మూడవ పాదమున **"దూత్యప్రసంగప్రియమ్"** అను పాఠాంతరమున్నది. అర్థమున మార్పులేదు.

**"శ్రీరంగిణః పదం నః మంగళం వహతు"** అనెడి పైన చూసిన అన్వయము కాక, **"శ్రీరంగిణు పదం నః శ్రీరంగిణ శ్చ మంగళం వహతు"** అను అనుక్తసముచ్చయమును గ్రహించి, "మనయొక్క, శ్రీరంగనాథునియొక్క క్షేమమును ఆ స్వామిపాదము నిర్వహించును. గాక" అను అర్థమును కూడ చెప్పవచ్చును.

ఈ సందర్భమున తిరువాయ్ మొళిలోని మొదటి పాశురమున **"తుయరఱు శుడరడి"** అనుచోట ఈడు వ్యాఖ్యానమున **"తుయరఱుమ్ శుడరడి – ఎన్ఱు ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్యుమ్బడి. 'వ్యసనేషు మనుష్యాణాం' భృశం భవతి దుఃఖితః – ఎన్గాల్, దుఃఖనివృత్తియు మవనదా యిరుక్కుమిఱే, ఇవన్**

**తుయరఱు త్తాన్ త్తుయర్ తీర్ న్దానా యిరుక్కై**" ("దుఃఖమును తీర్చు ప్రకాశించే శ్రీపాదము "అని భగవద్రామానుజులు అనుగ్రహించే రీతి. "ప్రజల వ్యసనాలలో శ్రీరాముడు చాలా దుఃఖించినవాడు అవుతున్నాడు" అని అంటే, దుఃఖనివృత్తి కూడా భగవానునిదే అయి ఉంటుంది కదా. జీవుని దుఃఖం తీరగా, భగవంతుడు కూడా తన దుఃఖం తీరినవాడై ఉంటాడు) అనుచు భగనద్రామానుజులు సూచించిన ఒక విశిష్టమైన యోజన చూపబడుట స్మరింపనగును. ఆ రామానుజుల అభిమానమునకు పాత్రులై, వారి విషయమున విశిష్టమైన భక్తిప్రపత్తులను కల్గిన భట్టరు మనస్సున ఇట్టి యోజన కలదని పల్కుటలో ఎట్టి విప్రతిపత్తి ఉండదు కదా!

భగవానుని పాదుకలనుగూర్చి వశిష్ఠుడు "**ఏతే హి సర్వలోకస్య యోగక్షేమం విధాస్యతః**" (రా. ఆయో. 112-21) (ఈ శ్రీరాముని పాదుకలు రెండు సమస్త లోకానికి యోగాన్ని క్షేమాన్ని కలుగజేస్తాయి) అని పల్కుట పాదములకు, పాదుకలకు మధ్య అభేదభావనతోనని చెప్పనగును.

"**న**" అనుసర్వనామశబ్దము "**పుకలొన్టిల్లా అడియేన్**" (తి--6-10-10) (ఏ ఆశ్రయము లేని దాసుడు) అనెడి అనన్యశరణత్వము మొదలగు స్వస్వరూపపూర్తి కల్గిన మనయొక్క – అను అర్థమును ధ్వనింపచేయును. "**విష్ణోః శ్రీరంగిణః**" అను రెండు పదములు శ్రీరంగనాథుని పరత్వమును, సౌలభ్యమును సూచించును. "**పదమ్**" అను ఏకవచననిర్దేశము "**నిన్ పాదమే**". (తి. వా. -5-7-10) అని, "**తుయరఱు శుడరడి**" (1-1-1) అని, "**ఉన్నడిక్కీழ்**" (6-10-10) అని ఆళ్వార్లు ఏకవచనములో పలుకుటను బట్టి –అని చెప్పనగును.

ఇందు వృత్తము శార్దూలము. "**జలజప్రస్పర్ధమానర్ధి**" అనుటవలన ఉపమానముకంటె ఉపమేయాధిక్యము ధ్వనించుటచే ఇందు వ్యతిరేకాలంకారధ్వని కలదు.

**అందమైన శ్రీరంగనాథుని పాదపద్మాన్ని నమస్కరిద్దాము**

**125. శింజానశ్రుతి శింజినీమణిరవైః వజ్రారవిందధ్వజ –**
**చ్ఛత్రీకల్పక. శంఖచక్రముకురైః తై స్తై శ్చ రేఖామయైః।**
**ఐశ్వర్యేణ జయం త్రివిక్రమముఖం ఘుష్యద్భి రామ్రేడితమ్**
**శ్రీరంగేశయ పాదపంకజయుగం వందామహే సుందరమ్ ॥**

**ప్ర. అ. –** ఐశ్వరేణ = సర్వేశ్వరత్వముతో, త్రివిక్రమముఖం = మూడు పాదములతో లోకములను విక్రమించుట మొదలగు, జయం = విజయమును, ఆమ్రేడితం = పలుమార్లు, ఘుష్యద్భిః = = ఘోషించుచున్నవగు, శింజాన = ధ్వనించుచున్న, శ్రుతి = వేదములు అనెడి, శింజినీ = నూపురములందున్న, మణిరవైః = మణుల ధ్వనులచే, రేఖామయైః = రేఖల రూపములోనున్న, తైః = తైః = ఆ యా, వజ్ర = వజ్రము, అరవింద = పద్మము, ధ్వజ = పతాకము (ధ్వజము), ఛత్రీ = గొడుగు, కల్పక = కల్పవృక్షము, శంఖ = శంఖము, చక్ర = చక్రము, ముకురః = దర్పణము – అను వీనిచే, సుందరం = అందమైన, శ్రీరంగేశయ = శ్రీరంగనాథునియొక్క, పాదపంకజయుగం = పద్మములవంటి పాదముల జంటను, వందామహే = నమస్కరించుచున్నాము.

**వరివస్య :–** “**వజ్రధ్వజాంకుశసుధాకలశ**” (4) ఇత్యాదిగా కూరేశులు అతిమానుషస్తవమున స్తుతించిన రీతిలో, భట్టరు ఈ శ్లోకమున శ్రీరంగనాథుని పాదపద్మములను స్తుతించుచు, నమస్కరింతు మనుచున్నారు. ముందు శ్లోకమున “**మనవై**” అని మననము, “**నవై** “ అని స్తవమును చేయబడినవి. ఇందు “**వందామహే**” అనుచు కాయికవ్యాపారము తెలుపబడినది. ఏతావతా, త్రికరణాత్మకమైన ఆశ్రయణము తెలుపబడినది. “**నః మంగళం వహతు**” అనుచు పూర్వశ్లోకమున మంగళము ప్రార్థింపబడినది. అట్టి మంగళమును అనుగ్రహింపవలెనన్న స్వామిపాదము మంగళమును కల్గినదై ఉండవలెనుకదా! కావున భట్టరు ఈ శ్లోకమున శ్రీరంగనాథుని పాదము

సర్వవిధమంగళచిహ్నములను కల్గియున్నదని. పల్కుటద్వారా పైవిషయమును నిరూపించిరి.

శ్రీరంగనాథుని పాదములకు నూపురములు అలంకరింపబడియున్నవి. ఆ నూపురములలోని మణులు మనోహరముగా ధ్వనించుచున్నవి. మధురమంజులమైన ఆ ధ్వని భగవానుని ఐశ్వర్యమును, త్రివిక్రమణము మొదలగు విజయపరంపరలను స్తుతించు వేదరవమువలె ఉన్నది. "**త్రీణి పదా విచక్రమే**" (భగవానుడు మూడు పాదాలతో విక్రమించాడు), "**యః పార్థివాని విణమే రజాంసి**" (వి. సూ.) అను మొదలగు శ్రుతులు స్వామియొక్క త్రివిక్రమక్రమణమును స్తుతించుచున్నవి. ఆ స్తుతులే పాదములకు భూషణములు అయినవి – అను భావము "**త్రివిక్రమ్. రవైః**" అనుటచే ఏర్పడుచున్నది. స్వామిపాదములలో రేఖలరూపమున వజ్రము, పద్మము, ధ్వజము, ఛత్రము, కల్పవృక్షము, శంఖము, చక్రము, దర్పణములవంటి శుభవిహ్నములు కలవు. ఇట్టి మనోహరమైన శ్రీరంగనాథుని పాదారవిందయుగమును నమస్కరించుచున్నాము – అని శ్లోక భావము.

వేదములు శ్రీరంగనాథుని పాదమునకు అలంకరింపబడిన నూపురములైనవి. కావున, ఆ నూపురములలో పొదగబడియున్న మణుల ధ్వని "**త్రిపాదస్యామృతం దివి**" (పు. సూ.) (మూడు పాదములు కలిగిన, అమృతశబ్దవాచ్యమైన నిత్య విభూతి పరమపదములో ఉన్నది) అని, "**త్రీణి పదా విచక్రమే**" (విసూ,) అని వేదములు భగవానుని తివిక్రమావతారము మొదలగు విజయములను స్తుతించునట్లున్నది. ఉత్తరశతకములోని "**రంగేంద్ర! వృత్తే తవ జయముఖరో డిండిమ స్త్రత వేదః**" (67) (త్రివిక్రమ రూపివి అయిన ఓ శ్రీరంగనాథ స్వామీ! నీవు లోకాలను కొలిచినపుడు, వేదం నీ విజయాన్ని కీర్తించే డిండిమమనే వాద్యం అయినది) అను శ్లోకమునకూడ వేదము భగవానుని తివిక్రమరూపమును స్తుతించెనని కవి పల్కెను. "**శింజినీ గుణః**" అను అమరకోశప్రమాణమును బట్టి "**శింజినీ**" అను శబ్దము అల్లెత్రాడును

బోధించును. కాని, పలు నిఘంటువులలో '**శింజినీ**' శబ్దము నూపురవాచిగా చూపబడుటచే, కవి ప్రస్తుతము నూపురార్థమున శింజనీపదమును ప్రయోగించెనని చెప్పనగును. శింజితమనగా, నూపురములు చేయు ధ్వని, '**శింజినీ, శింజాన**' శబ్దములు రెండును "**శిజ – అవ్యక్తే శబ్దే**" అను ధాతువునుండి పుట్టినవే.

భగవానుడు స్థిరముగా పరుండియున్నపుడు, నూపురములు ఎట్లు ధ్వనించును? – అనినచో, భగవానుని నూపురములలోని మణులుకూడ చేతనములగుటదే శబ్దించుటలో ఆశ్చర్యము ఏమియు లేదు. కావుననే, వేంకటాచార్యసంస్కృతవ్యాఖ్యానమున రత్నమమటకు జీవరత్నమని వ్యాఖ్యానింపబడినది. నిత్యులు, ముక్తులు భగవత్సేవకొఱకై స్థానరజంగమరూపములను అన్నిటిని పరిగ్రహింతురని "**అహృతసహజదాస్యాః**" (33) అను శ్లోకమున ఇంతకు ముందే ఈ స్తుతిలో నుడువబడినది. కదా!
"**వజ్రారవిందధ్వజ**" అనునపుడు, "**ఒరు కాలిల్ శజ్గు ఒరు కాలిల్ శక్కర ముళ్లడి పాటిత్తమైన్ద ఇరు కాలుమ్**" (1-7-6) (ఒక పాదంలో శంఖం, ఒక పాదంలో చక్రం, లోపలి పాదాలలో రేఖలుగా చిత్రీకరింపబడి ఉండే రెండు శ్రీచరణాలతో) అని పెరియాళ్వార్లు, "**శంఖరథాంగకల్పక ధ్వజారవిందాంకుశ వజ్రలాంఛనమ్**" (31) (భగవానుని శ్రీచరణం శంఖం, చక్రం, కల్పవృక్షం, ధ్వజం, పద్మం, అంకుశం, వజ్రం అనే వీటి గుర్తులను కలిగినది) అని యామునులును పల్కుటను స్మరింపనగును.

**"భృంగారాసన వాజికుంజరరథ శ్రీవత్సచాపేషుభిః**
**మాలాకుండల చామరాంకుశయవైః శైలధ్వజైః తోమరైః,**
**మత్స్యస్వస్తికవేదికావ్యజనకైః శంఖాతపత్రాంబుజై:**
**పాదే పాణితలే నరా నృపతితాం యాంతి స్త్రియో రాజ్ఞితామ్"**

అను నారదీయపురాణశ్లోకమున శంఖాదిచిహ్నితత్వము రాజాధిరాజత్వమును సూచించునని చెప్పబడినది.

**"సుందరం శ్రీరంగేశయపాదపంకజయుగం వందామహే"** అనునపుడు **"స్వామిపాదముల త్రివిక్రమవిజయాదులు అట్లుండనిండు, వాని సౌందర్యమొక్కటియే మమ్ములను వశపరచుకొనుటకు చాలును"** అను ధ్వని సుందరశబ్దముచే ప్రతీత మగుచున్నది.

**"దృజ్ – ఆదరే"** అను ధాతువునుండి పుట్టిన **"సుందర"** శబ్దమునకు ఆదరింపబడునది – అను అర్థము చెప్పవచ్చును. **"ఉన్దీ– –క్లేదనే"** అను ధాతువునుండి ఉత్పన్న మయినదని చెప్పినచో, "మిక్కిలి మనస్సును ద్రవీకరింపచేయునది, అనగా, ఆకర్షించునది" అను భావము వచ్చును. ఈ రూపము శకంధ్వాదిగణములో చేరినది. మన మనస్సులను మిక్కిలి ఆకర్షించునది, కావుననే, మనచే ఆదరింపబడునది అగు శ్రీరంగనాథుని పాదారవిందములకు నమస్కరించుచున్నాము – అను భావము సుందరశబ్దమునకు గల పై రెండు వ్యుత్పత్తులను బట్టి చెప్పవచ్చును. **"పుష్యద్భి రామ్రేడితమ్"** అను పాఠాంతరము రామానుజాచార్యవ్యాఖ్యలో కలదు.

ఈ శ్లోకమున శ్రీరంగనాథుని పాదములయొక్క సంపద వర్ణింపబడుటడే ఉదాత్తాలంకారము కలదని చెప్పవచ్చును.

## శ్రీరంగనాథుని గోళ్ళ కాంతులలో అవగాహిద్దాము

**126. పునాని భువనా న్యహం బహుముఖీతి సర్వాంగులీ –**
**ఝులజ్ఝలితజాహ్నవీ లహరిబృందసందేహదాః ।**
**దివా నిశి చ రంగిణః చరణచారుకల్పద్రుమ–**
**ప్రవాళనవమంజరీ నఖరుచీ ర్విగాహేమహి ॥**

**ప్ర. అ.** – అహం = నేను, బహుముఖీ (సత్) = పెక్కు ప్రవాహములను కల్గినదానవై, భువనాని = లోకములను, పునాని = పావనము చేయుదును, ఇతి

= అని, సర్వ అంగులీః = కాలివ్రేళ్లు అన్నిటినుండి, ఝులత్ ఝులత్ = ఝులమని శబ్దముతో ప్రవహించు, జాహ్నవీ = గంగానది, లహరి = కెరటములయొక్క, బృంద = వరుసలా ఇవి! అను, సందేహదాః = సందేహమును కల్గించునవి అగు, రంగిణః = శ్రీరంగనాథునియొక్క, చరణ = పాదములు అను, చారు = అందమైన, కల్పద్రుమ = కల్పవృక్షముయొక్క, ప్రవాళ = (వేళ్లు అనెడి) చిగుళ్లయొక్క, నవ = కొత్త, మంజరీః = పూల గుత్తులవలె ఉన్న, నఖరుచీః = గోళ్ల కాంతులయందు, దివా నిశి చ = రాత్రింబగళ్లును, విగాహేమహి = అవగాహింతుము.

**వరివస్య :-** ఇందు శ్రీరంగనాథుని పాదములను, నఖకాంతులను భట్టరు ఉత్ప్రేక్షించుచున్నారు.

కవి ఇంతవరకును శ్రీరంగనాథస్తుతి అను గొప్ప జ్ఞానయజ్ఞమును చేసిరి. యజ్ఞము నిర్విఘ్నముగా పరిసమాప్తి అయిన పిదప అవబృథస్నానమును చేయుట శాస్త్రవిహితము కదా! అట్లు తాము అవబృథమును చేసిన పద్ధతిని భట్టరు ఇందు తెలుపుచున్నారు. లేక, శ్రీరంగనాథుని కిరీటమునుండి పాదములవరకు అనుభవించుటలో తమకు కల్గిన శ్రమ తీరుటకు భట్టరు స్వామి పాదనఖకాంతులు అను ప్రవాహమున తాము స్నానము చేసిన విధమును తెలుపుచున్నారు. "**తయరదన్ పెఱ్ఱ మరకతమణి త్తడమ్**" (దశరథుడు పొందిన మరకతమణిసరస్సు) అనునట్లు శ్రీరంగనాథుడు. ఒక పెద్ద, చల్లని తటాకము కదా! కావున, అట్టి తటాకము ఎదురుగా ఉండగా, వేఱొక తటాకమునకై వెదుకవలసిన పని లేదు. అందువలన కవి స్వామిపాదములనుండి ప్రవహించు ఒక విలక్షణమైన ప్రవాహమున స్నానము చేయుదుముగాక! అనుచున్నారు.

శ్రీరంగనాథుని పాదముల వ్రేళ్ళ గోళ్లు తెల్లగా ప్రకాశించుచున్నవి. ఒక్కొక్క వేలిగోరునుండి వెలువడు కాంతిప్రవాహమును చూడగా, పూర్వము భగవానుడు త్రివిక్రమావతారమును దాల్చినపుడు, ఆ స్వామి కాలినుండి

ప్రవహించిన గంగానది "నేను ఇంకను బహుముఖముగా ప్రవహించి, లోకముల నన్నిటిని పావనము చేయుదును" అని తలచి, అన్ని కాలివేళ్లనుండి జలజలమని ప్రవహించుచున్నదా! అనునట్లున్నది. గంగానది "త్రిపథగా", అనగా, మూడు మార్గములలో ప్రవహించునది మాత్రమే, కాని, స్వామిపాదనఖ కాంతిప్రవాహము పది వ్రేళ్లు అను పది మార్గములలో ప్రవహించుచున్నది.

శ్రీరంగనాథుడు కల్పవృక్షమువంటివాడు. ఆ స్వామి పాదములు కల్పవృక్షముయొక్క చిగుళ్లవంటివి. పాదముల నఖములు చిగుళ్లనుండి పుట్టిన లేలేత పూగుత్తులవలె భాసించుచున్నవి. ఇట్లు ప్రకాశించు శ్రీరంగనాథుని పాదనఖకాంతి – అను ప్రవాహమున మునిగి స్నానమాడెదము, అనగా, దర్శించి, తరింతుము – అని భావము.

తివిక్రమావతారమున గంగానది భగవానుని ఏ పాదమునుండి పుట్టెనను విషయము స్పష్టముగా తెలియుటలేదు. సంస్కృతవ్యాఖ్యానమున ఎడమ పాదము బొటనవేలునుండి పుట్టెనని చెప్పబడినది. ఇందులకు ప్రమాణము అచట చూపబడలేదు. రామానుజాచార్యవ్యాఖ్యలో కూడ **"భగవద్వామపాదాంగుష్ఠప్రసూతా విష్ణుపదీతి ప్రసిద్ధా"** (భగవంతుని ఎడమ పాదములోని బొటనవేలు నుండి గంగా నది పుట్టినది అని ప్రసిద్ధి) అని కలదు. అధములను ఉద్ధరించుటలో దృష్టిని కల్గిన భగవానుని అవతారములఅన్నిటియందు సౌలభ్య, వాత్సల్య, సౌశీల్యాదిగుణములు మిక్కిలి ప్రకాశించుచున్నవి. కావున, అవతారదశలో భగవానునకు ఎక్కువ ఆదరము భూలోకము పైనే ఉండుననుట. సమంజసము. తన అదరాతశయమును ప్రకటించుటకై భగవానుడు తన కుడి పాదమును భూమిపై నిలిపి, ఎడమ పాదమును ఆకాశమున వ్యాపింపజేసెను – అని చెప్పవచ్చును. సింహాచలములోని శ్రీవరాహనృసింహస్వామి దేవాలయవిమానములోని భిత్తిపై గల త్రివిక్రమమూర్తియు ఇట్లే కలదు. కావున గంగానది స్వామి ఎడమ

పాదముయొక్క అంగుష్ఠమునుండి ఉద్భవించెననుట సహేతుకముగా తోచును.

స్వామిపాదములను కల్పవృక్షములుగా, వ్రేళ్లను చిగుళ్లుగ, గోళ్లను ఆ కల్పవృక్షములు పూచిన పూలుగా కూడ చెప్పవచ్చును. గంగానదీప్రవాహమున మునుగుట కంటె, స్వామిపాదములకు నమస్కరించి, ఆ స్వామి నఖకాంతులను ప్రవాహమున తీర్థమాడి, పునీతులగుట మేలు – అను విశేషార్థమిచట ధ్వనించుచున్నది.

**"తీర్థానా మవగాహనాని చ గజస్నానం వినా యత్పద–**
**ద్వంద్వాంభోరుహసంస్మృతిః"** (35)

(పుణ్యతీర్థములలో స్నానమును భగవంతుని పాదారవిందస్మరణ లేకుండా చేసినట్లయితే, అది కేవలం ఏనుగు స్నానం చేసినట్లు వ్యర్థమే) అని కులశేఖరులు ముకుందమాలలో,

**"యమో వైవస్వతో రాజా హృది తే హ్యేష వై స్థితః,**
**తేన చేదవివాద స్తే మా గంగాం మా కురూన్ గమః"**

(మను. –8–92)

(అందరినీ నియమించువాడు సూర్యమండలాంతర్వర్తి, ప్రభువు అయిన భగవానుడు నీ హృదయంలోనే ఉన్నట్లయితే, ఆ స్వామితో నీకు వివాదం లేనట్లయితే, నీవు గంగానది దగ్గరకు వెళ్ళవలసిన పని లేదు,. కురుక్షేత్రాది దివ్యక్షేత్రాలను దర్శించవలసిన అక్కరలేదు) అని భారతమున వ్యాసభగవానులును పల్కిరి కదా.

ఇందు వృత్తము పృథ్వి, "**జసా జసయలా వసుగ్రహయతిశ్చ పృథ్వీ గురు**" అని దీని లక్షణము. శ్రీరంగనాథుని పాదములలోని నఖముల కాంతి బహువిధములుగా ప్రవహించు గంగానదిగా ఉత్ప్రేక్షింపబడుటచే ఇచట అలంకారము ఉత్ప్రేక్ష.

**శ్రీరంగనాథుని పదకిసలయములను నమస్కరిస్తున్నాను**

**127. శ్రీరంగేందోః పదకిసలయే నీలమంజీరమైత్ర్యా**
**వందే వృంతప్రణయిమధుపవ్రాత రాజీవజైత్రే ।**
**నిత్యాభ్యర్చానత విధిముఖస్తోమసంశయ్యమానైః**
**హేమాంభోజైః నిబిడనికటే రామసీతోపనీతైః ॥**

**ప్ర. అ. –** నీల = ఇంద్రనీలరత్నములతో చేయబడిన, మంజీర = నూపురముల, మైత్ర్యా = కలయికచే, వృంతప్రణయి = తొడిమయందు కూడియున్న, మధుప = తుమ్మెదల, వ్రాత = సమూహమును కల్గిన, రాజీవ = తామర పూవును, జైత్రే = జయించినవి, నిత్య అభ్యర్చా = ఎల్లప్పుడు ఆరాధనలో, నత = నమస్కరించిన, విధి = బ్రహ్మయొక్క, ముఖస్తోమ = ముఖముల సమూహముగా, సంశయ్యమానైః = సందేహింపబడు, రామసీతా = శ్రీరామునికే, సీతాదేవిచే, ఉపనీతైః = సమర్పింపబడిన, హేమ అంభోజైః = బంగారు పద్మములచే, నిబిడనికటే = మిక్కిలి దగ్గరగా ఉన్నవి అగు, శ్రీరంగ ఇందోః = చంద్రునివంటి శ్రీరంగనాథునియొక్క, పదకిసలయే = చిగుళ్లవంటి పాదములను రెండింటిని, వందే = నమస్కరింతును.

**వరివస్య :–** భట్టరు ఇంతవరకును ద్వయములోని పూర్వార్ధమునకు వివరణరూపముగా పూర్వశతకమును రచించిరి. గురుంపరావందనముతో ప్రారంభించి, "**శ్రీస్తనాభరణం తేజ**" (8) అను శ్లోకమున సంగ్రహముగా భగవదాశ్రయణమొనర్చిన భట్టరు, తరువాతి శ్లోకమునుండి క్రమముగా ద్వయమంత్రములోని పూర్వఖండార్థమును వివరించిరి. చివరిగా, ఈ శ్లోకమున, మరల క్లుప్తముగా పూర్వఖండార్థమును ప్రతిపాదించుచు. ఈ శతకమును పరిసమాప్తిని చేయుచున్నారు.

"**శ్రీరంగేండోః పదకిసలయే వందే**" అనుటద్వారా "**శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే,**" అను ద్వయములోని పూర్వఖండార్థము. అనుసంధింపబడినదని చెప్పవచ్చును. భగవానుని

దివ్యదేహవర్ణన పాదవర్ణనముతో ఉపసంహారము చేయుట చేతన స్వరూపమునకు తగినది కదా!

శ్రీరంగనాథుని పాదపల్లవములయందు అలంకరింపబడిన నూపురములు ఇంద్రనీలమణులతో చేయబడినవి. అవి, తామరలవలె శోభిల్లు స్వామిపాదములు నల్లని మణులను కల్గిన నూపురములతో అలంకరింపబడుటను దర్శింపగా, తామరపూల కాడల చుట్టును నల్లని తుమ్మెదలు చేరినట్లు తోచుచున్నవి. అంతియేకాక, అట్లు తుమ్మెదలతో కూడిన పద్మముల శోభను స్వామి పాదముల నూపురముల చేరికవలన కల్గిన శోభ మించియున్నది. (ఈ భావము ఇచట జైత్రశబ్దప్రయోగమువలన ఏర్పడుచున్నది.) **"జైత్ర స్తు జేతా"** అని అమరము. స్వామిపాదములకు నూపురములు సహాయము. (ఈ భావము **"నీలమంజీరమైత్ర్యా"** అనుటచే తెలియుచున్నది.) పద్మములకు తుమ్మెదలు సహాయము. వీరిద్దరిమధ్య జరిగిన స్పర్ధలో స్వామిపాదములే జయించెననునది ఇచటి స్వారస్యము.

శ్రీరాముడు, సీతాదేవియు శ్రీరంగనాథుని ఆరాధించిరని శ్రీరామాయణములోని **"సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్"** (రా. అయో. 6-1) (విశాలమైన నేత్రాలను కలిగిన సీతాదేవితో పాటు శ్రీరాముడు నారాయణుడైన శ్రీరంగనాథుని ఆరాధించాడు) అను శ్లోకమువలన తెలియుచున్నది. ఉత్తరశతకములోని **"స్వయ మథ విభో స్వేన శ్రీరంగధామని మైథిలీరమణవపుషా స్వార్హాణి ఆరాధనాన్యసి లంభితః"** (77) (తరువాత కూడా శ్రీరామమూర్తివి అయిన నీవే, నీచే శ్రీరంగవిమానంలో నీకు తగిన ఆరాధనను స్వయంగానే పొందింపబడ్డావు) అను శ్లోకమునందు భట్టరు ఈ విషయమును తెలిసిరి. ఆ దివ్యదంపతులు శ్రీరంగనాథుని అర్చించునపుడు సమర్పించిన బంగారుపద్మములు రంగనాథస్వామి స్వామిపాదముల చెంత ఉన్నవి. ఆ పద్మములను దర్శింపగా, నిత్యము శ్రీరంగనాథుని అర్చించు బ్రహ్మదేవుని ముఖములవలె తోచుచున్నవి.

కులశేఖరులు పెరుమాళ్ తిరుమొళిలో

**"ఎమ్మాణ్బిన్ అయన్ నాన్గు నావినాలుమ్**
**ఎడుత్తేత్తి ఈరిరణ్డు ముకముమ్ కొణ్డు,**
**ఎమ్మాడు మెళ్ళల్ కణ్ గళ్ ఎట్టినోడుమ్**
**తొ(ళుదు యినిది ఇఱైఞ్జి నిన్ద, శెమ్బొ**
**నమ్మాన్తన్ మలఱ్కమలక్కొప్పూళ్ తోన్ఱ**
**అణియరఙ్గత్తరవణైయిల్ పళ్ళికొళ్లుమ్"** (1-3)

(అన్ని విధాలలోని గొప్పతనాలను కలిగిన బ్రహ్మ తన నాలుగు ముఖాలతో తన ఆర్తికి తగినట్లుగా నీకు నమస్కరించి, నాలుగు వేదాలను అధ్యయనం చేయడం కోసమే ఉండే తన నాలుగు ముఖాలతో, ఎనిమిది అందమైన కన్నులతో నిన్ను దర్శించి, అంజలిని చేసి, స్తోత్రాన్ని చేసి, సాష్టాంగంగా నమస్కరించే రీతిలో నిలచి ఉండే) అను పాశురములో బ్రహ్మ స్వామిని నిత్యము ఆరాధించునని పలికిరి కదా! భట్టరును ఉత్తరశతకములోని "**కల్పానేవ బహూన్ కమండలుగలత్ గంగాప్లుతో ౨ పూజయత్, బ్రహ్మ త్వామ్**" (76) (పలు కల్పాల కాలం బ్రహ్మ తన కమండలంనుండి జాలువారే గంగాజలంతో నిన్ను పూజించాడు) అని స్తుతించిరి.

త్రేతాయుగమున అత్రిమునిపత్ని అనసూయదేవి సీతాదేనికి ఇచ్చిన దివ్యాంగరాగములు, మాలికలు మాసిపోక, చిరకాలము నిలచినట్లే, శ్రీరాముడు, సీతాదేవియు శ్రీరంగనాథుని పాదముల చెంత సమర్పించిన హేమపద్మములు ఇప్పటికినీ చెక్కుచెదరక నిలచియున్నవి – అని కవి అభిప్రాయము. బ్రహ్మాండములు అనేకములు అగుటచే, వానిని సృష్టించు బ్రహ్మలును అనేకులు, కావున, వారి ముఖములును అనేకములు – అని "**విధిముఖస్తోమ**" అనునపుడు చెప్పవచ్చును. "**శ్రీరంగేందోః**" అనుచు కవి శ్రీరంగనాథుని చంద్రునితో పోల్చుటచే, స్వామి కారుణ్యమను అమృతమును కలవాడని, తనను ఆశ్రయించినవారి తాపమును హరింపజేయువాడని తెలియుచున్నది. మఱియు,

"**శెజ్గణ్ తిరుముకత్తు చ్చెల్వత్తిరుమాలాల్**" (తిరుప్పావై, 30) (ఎర్రని నేత్రాలను కలిగిన, అందమైన ముఖమండలాన్ని కలిగిన లక్ష్మీదేవిచేత) అనునపుడువలె, ఆశ్రయణకాలమున స్వామిముఖమున కల్గిన ప్రసన్నతను ఇందుశబ్దము తెలుపుచున్నదనియు చెప్పవచ్చును. శ్రీరంగశబ్దముచే సంసారమను కడలిలో మునిగి, ఏ దిక్కు లేనివారై, "**ఆవారార్ తుణై ఎన్ఱు**" (తి. నా. -5-1-9) (నాకు రక్షకులు ఎవరు కాగలరు?) అని అలమటించు దీనులందరు ఆశ్రయించుటకు వీలుగా శ్రీరంగమున స్వామి వేంచేసియున్న స్థితి, అందువలన నిర్హేతుకమైన, నిరవధికమైన కృప వ్యక్తమగుచున్నవి. కావున, శ్రీరంగేందు శబ్దము – ఆశ్రయించుటలో సౌకర్యమును కల్గించు జ్ఞానశక్త్యాదిగుణములను, ఆశ్రయించినవారి కార్యములను నెరనేర్చు కృపాపరిణామరూపములగు సౌశీల్య, సౌలభ్య, వాత్సల్యాదిగుణములను నిర్దేశించుచున్నదని చెప్పవచ్చును. "**పదకిసలయే**" అనునపుడు, కిసలయశబ్దముచే పాదముల భోగ్యత, తద్ద్వారా ఉపేయత తెలుపబడినవి. అంతేకాక, అకించనులగు జీవులకు అభీష్టసిద్ధిని కల్గించు ఉపాయమును అదియే అనియు పదశబ్దస్వారస్యముచే ధ్వనించుచున్నది. "**వది– అభివాదస్తుత్యోః**", అను ధాతువునుండి పుట్టిన "**వందే**" అను క్రియకు ఇచట "**అభివాదము, స్తుతి**" – అను రెండర్థములు వివక్షితములే. "**సమే తు పాదగ్రహణ మభివాదన ముచ్యతే**" అను అమరకోశవచనమును బట్టి, గోత్రనామములను తెలుపుచు, పాదములకు నమస్కరించుటకు అభివాదనమని పేరు. కావున, "**వందే**" అను క్రియచే "**శిన్దైయాలుమ్ శొల్లాలుమ్ శెయ్ కైయినాలుమ్**" (తి. వా. -6-5-11) (మనసుతో, వాక్కుతో, క్రియలతో) అను త్రికరణాత్మకమైన సమాశ్రయణము తెలుపబడినది.

భట్టరు రచించినట్లు చెప్పబడు ముక్తకములలో ఒకటి అగు ఈ క్రింది శ్లోకమున శ్రీరంగనాథుడు చంద్రుడుగా రూపింపబడుట గమనింపదగినది.

**“అనిశం కుముదం వికాసయంతం
సతతం పూర్ణ మహర్నిశం చ దృశ్యమ్,
అనుపప్లవ మద్య రంగరాజం
మనుతే చంద్రమసం జనో ను మాన్యమ్”**

(ఎల్లప్పుడూ కలువలకు ఆనందం కలుగజేసేవాడై, ఎల్లప్పుడూ పూర్ణుడై, రాత్రి, పగలు దర్శించదగినవాడై, ఇటువంటి ఆపద లేనివాడై ఉండే శ్రీరంగనాథుని మాన్యుడైన చంద్రునిగా జనులు భావిస్తున్నారు).

“**సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్**” (రా. అయో. 6–1) (విశాలమైన కన్నులను కలిగిన సీతాదేవితో కలిసి శ్రీరాముడు శ్రీరంగనాథుని ఆరాధించాడు) అని భగవదారాధనలో శ్రీరామునకు సీతాదేవి సహాయకురాలే తప్ప, ఆరాధనలో ఆమెకు సాక్షాత్ అన్వయము లేదు కదా! కావున కవి విశాలమైన కన్నులను కలిగిన సీతాదేవితో కలిసి శ్రీరాముడు శ్రీరంగనాధుని ఆరాధించాడు – అని అంటూ, “**రామసీతోపనీతైః**” అనుట ఎట్లు తగును? అనినచో, “**సహ పత్న్యా**” అని మాత్రమే కాక, “**తం చేయ మసితేక్షణా**” (రా. సుం. 16–5) అను సందర్భములోవలె, ఇచట ఉత్ఫుల్లనయనార్థకమగు ‘**విశాలాక్షీ**’ అను పదముయొక్క ప్రయోగమునే సీతాదేవికి ఆరాధనలో అన్వయము కలదని వాల్మీకిమహర్షి గూఢముగా సూచించెనని పూర్వాచార్యుల అభిప్రాయము. దంపతులకు సహాధికారము కలదు. కావున “**పత్యు ర్నో యజ్ఞసంయోగే**” (6–1–33) లను సూత్రార్థము చొప్పున, దంపతుల కలయిక భగవదారాధనారూపయజ్ఞమున ఆవశ్యకము. కావున, సహశబ్దము ఇచట ప్రయోగింపబడినదే కాని, అప్రాధాన్యమును సూచించుట కొఱకు కాదు. కావున, పై శంకకు అవకాశము లేదు.

“**నారాయణ ముపాగమత్**” అనునట్లు, ఇచటను కవి ఉపనీతశబ్ద ప్రయోగమును చేసిరని తోచును. “**నారాయణ ముపాగమత్**” అను శ్రీరామాయణశ్లోకములోని నారాయణశబ్ద మిచట శ్రీరంగేందుశబ్దముచే

సూచింపబడినది. శ్రీరామాయణశ్లోకములోని నారాయణశబ్దము శ్రీరంగనాథుని సూచించునని ఆచార్యులు అభిప్రాయపడిరి కదా!

పూర్వశతకమున శ్లోకముల సంఖ్య 127. అనగా, నూటికి పైన గల సంఖ్య నక్షత్రసంఖ్య. ఈ స్తోత్రమున కవి పలు చోట్ల శ్రీరంగనాథుని చంద్రునిగా రూపించిరి. చివరిగా "**శ్రీరంగేందోః**" అని కవి పలుకుట ఇందులకొక ఉదాహరణము.

చంద్రుడు తారకాధీరుడు. పూర్ణ సంఖ్య అగు శతకము చంద్రుని, 27 సంఖ్య నక్షత్రములను నిర్దేశించును. కావున, కవి ఈ స్తవములోని శ్లోకముల సంఖ్యను నక్షత్రసంఖ్యతో కూడిన శతక సంఖ్యగా నిర్ణయించిరని చెప్పవచ్చును. ఒక గ్రంథమున శతకము కంటే కొన్ని శ్లోకములలో ఎక్కువగా నున్నను, లేక, తక్కువగా ఉన్నను, ఆ గ్రంథమునకు శతకమను పేరును పెట్టుట కవుల పరిపాటి. అందుచేత ఈ స్తోత్రమునకు పూర్వ శతకము అనే పేరు సార్ధకము.
మంజీరములతో అలంకరింపబడిన పాదములను తుమ్మెదలతో కూడిన పద్మములతో, పాదసమీపములోని హేమపద్మములను చతుర్ముఖుని ముఖములతో ఉత్ప్రేక్షించుటచే ఇచట ఉత్ప్రేక్షాలంకారము. వృత్తము మందాక్రాంత.

**శ్రీశేషసింహ గురువర్య శతాబ్దపూర్తేః**
**దివ్యోత్సవస్మృతితయా నరసింహనామా।**
**శ్రీరంగరాజ వినుతేః వివృతిం తదీయ –**
**పౌత్ర శ్చకార తనుగ్రహ సార్థజన్మా॥**
**భారద్వాజ నృసింహేన శ్రీరంగేశపదార్పితా।**
**రంగరాజస్తవవ్యాఖ్యా ప్రకల్పేత సతాం ముదే ॥**
**అర్థా యే కలితా మయా మితధియా ఽ స్యాం వ్యాకృతౌ కేచన**
**శ్రీభట్టార్యగురూత్తమేన రచితశ్రీరంగరాజస్తుతేః,**

**నీరక్షీరనయేన తేషు సుధియో దృష్టిం నిధాయోత్తమాః**
**స్వీకుర్వంతు గుణాన్ తథైవ కృపయా దోషాన్ క్షమంతాం మమ.**

★★★★★★

శ్రీరంగరాజస్తవ పూర్వశతక వ్యాఖ్యానం "**వరివస్య**" సంపూర్ణం.
శ్రీపరాశర భట్టర్ శ్రీపాదములే శరణము.
ఆழ్వార్ ఎంబెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్



## అనుబంధము – II

# శ్లోక అకారాది సూచిక

